శ్రీరస్తు.

# విజ్ఞప్తి

## కంబకవి చరిత్రాదికము.



కంబకవి రాజనరేంద్రుని మునిమనుమఁడగు మూఁడవ కులోత్తుంగుని యాస్థానమున నుండినవాఁడు. (ఈ కులోత్తుంగుఁడు విక్రమచోళునికొడుకు విక్రమచోళుఁడు రాజనరేంద్రుని కొడుకగు రెండవ కులోత్తుంగుని కుమారుఁడు.) కులోత్తుంగుఁడు కంబకవి పాండిత్యమును కవితాచాతుర్యమునువిని యతనిం దనయాస్థానమునకుఁ బిలిపించి కవిచక్రవర్తి బిరుద మొసంగి గౌరవించి విద్యాధికారిగా నుంచుకొనియెను. వీరిది క్రీ॥ పంన్రెండవ శతాబ్ది నపరభాగము. మొదటి కులోత్తుంగుని కాలమున — అనఁగా ౧౧ శతాబ్ది తుదిని ౧౦ శతాబ్ది మొదటను ఉండెనని కొందఱందురు. రాజునుగూర్చి కవి గ్రంథములందెచ్చటను ఒకవాక్యమైన కానరాకుండుట మిక్కిలి చిత్రము.

కంబకవి తిరువళుందూరున పూజారి (ఉవచ్చ) పనిచేయుచుండిన అనంతుఁడను పుణ్యపురుషునకు జనించెను. వీరిది వేలాళ (కృషికజీవి) కులము. కాళిదాసాది మహాకవుల చరిత్రముల వలెనే కంబకవి చరిత్రమును విస్పష్టముగాఁ దెలియరాదు. పిన్ననాఁడే తలిదండ్రులు గతించుటచే తిరువెణ్ణెయ్‌నల్లూర నుండిన శడైయప్పర్ (జటప్ప) అను నతఁడితనింబెంచి పెద్దఁజేసి విద్యాబుద్ధులునేర్పి గొప్పపండితునిగా కవిగా నొనరించెను కావునఁ దనపోషకుని నామము చిరస్థాయియగునట్లు లితఁడు తనరామాయణ మహాకావ్యము నందచ్చటచ్చటఁ జొప్పించెను. ఇతనికుమారుఁడగు అంబికాపతియు మహాకవి.

కంబకవి వాల్మీకి ననుసరించి తనరామాయణమును వ్రాసెను. అది కథానుసరణము మాత్రమేకాని భాషాంతరీకరణము కాదు. వర్ణనలు సంభాషణములు కతపోకడలు సొంతములు. ఇతఁ డుపమలలోను వర్ణనా పద్ధతియందును కాళిదాసుని, శైలిని భక్తిని పోతనను తలఁపించును. సంస్కృతాంధ్రములందు వాడుకలోలేని యత్యద్భుతోపమలు ప్రాపంచిక నిత్యవ్యవహారమున కానవచ్చునవి యిందు లెక్కకు మీఱి కలవు. ద్వితృచతుర్ప్రాసము లితనికి మిక్కిలి యిష్టములు. దశరథుని మిథిలాప్రయాణమును మూఁడువందల వృత్తములతోఁబెంచి నాయికా నాయకుల విహారలీలలు పుష్పాపచయము జలక్రీడ మధుపానము మున్నగు విషయముల కవకాశము గల్పించికొని వర్ణించెను. దీనింబట్టియే కాఁబోలు! కంబరామాయణమున నెడతెగని వర్ణనములతో దీర్ఘాతి దీర్ఘమైన దను లోకవ్యవహారము సిద్ధించి యుండనోపు.

ఇం దెక్కువ భాగమితఁడు తిరువెణ్ణెయ్‌నల్లూరను కొంతభాగము తిరువత్రి యూరను వ్రాసెను. కంబకవివ్రాసిన దాఱు కాండములే. ఉత్తరకాండమును సాలె కులమునఁ బుట్టిన వాణిదాసుఁడను కవి రచించెను. కంబకవి రామాయణమును పూర్తి గావించిన పిదప శ్రీరంగమునకేగి ఓంకారవిమానమున యోగనిద్రవహించు శ్రీరంగ నాథస్వామిని దర్శించి నమ్మాళ్వారులపై నొకగ్రంథమువ్రాసి యటఁగల మహాపండిత సభలోఁ దన రామాయణమును వినిపించి సభవారి మెప్పువడసెను. అందలి పండిత సభకు రంగమనిపేరు. దానింబట్టియే లోకమున 'రంగమున కెక్కెనా?' అను సామెత దూషియైనది. సరస్వతి అంతాది (ముక్తపదగ్రస్తము) ఏరెళుపదు (కృషిపై డెబ్బది) అనుగ్రంథములు కూడ నితనివే యందురు.

ఇతని కవిత్వము సరసము లలితపదాలంకార యుక్తము అర్థగంభీరము పండిత పామరరంజకము భక్తిప్రబోధకము నైనది. శైలి గంగాప్రవాహము ననుకరిం చును. రసస్ఫోరకముగా వర్ణించుటలో నితఁ డద్వితీయుఁడు. అందులకుం దగిన ఘట్ట ములు కొన్నింటి నితఁడు కథ పోకడకు ననువుగా క్రమవిరుద్ధము వినుగులేకుండు తీరునఁ గల్పించుకొని యున్నాఁడు. చూడుఁడు. రామలక్ష్మణులు కౌశికుని వెంబడించిపోవుచుఁ గాంచినట్లు మిథిలాపురము వర్ణింపఁబడినది. అరణ్యాగమనశ్రమము సీతకుఁ దోఁపకుండు నట్లుగా వృక్షపక్షిమృగ నదీనదములు మనోహరముగా రామునిచే వర్ణింపఁబడినవి. హనుమంతుని సీతాన్వేషణ నెపమునను రాముఁడు లక్ష్మణునకుం జూపు నెపమునను లంక వర్ణింపఁబడినది. ఇట్టివే అటనట గొన్నికొన్ని కలవు.

## ముఖ్యములగు మార్పులు.

శ్రీరాముఁడు మిథిలా రాజవీథిలో తమ్మునితో మునితో నేగుచు మేడ మీఁద నుండిన సీతంగాంచుట, సీతయు రాముంగాంచుట, అందుపై వారి యనంగ దశావర్ణనము, దశరథుని దుఃఖావస్థయందు తనకౌర్ధ్వదైహికములు భరతుఁడు చేయ రాదనుటచేఁ బదపడి వసిష్ఠుఁడు శత్రుఘ్నునిచేఁ జేయించుట, సీతారామలక్ష్మణు లగస్త్యా శ్రమమునుండి పంచవటికేగుచు మార్గమధ్యమున జటాయువుంగాంచి సంభాషించుట, రావణుఁడు సీతను పర్ణశాలతోఁడ భూమిని పెల్లగించుకొని పోవుట, సుగ్రీవుఁడు తారను తల్లిగా భావించి గౌరవించుట, విభీషణుఁడు రావణునకు హిరణ్యాకశిపు వధముఁ దెలు పుట, యుద్ధరంగమున విభీషణ కుంభకర్ణుల సంభాషణము, రావణుఁడు రామ లక్ష్మణ శిరోధనువులు గల్పించి చూపి సీతను బెదరించి లోఁగొన యత్నించుటకు మాఱుగా మాయజనకుని గల్పించి వానిచే భూజాతకు దుర్నీతులుచెప్పించుట లోనగునవి. ఈ కవి

## తెనిఁగింపు.

సంస్కృతకావ్యముల నాంధ్రీకరించుట సులభకార్యము. అందలి పదములు సమాసములు అట్లట్లే తుదిప్రత్యయములు చేర్చి యుపయోగించుకొనవచ్చును. అయిన మునుండి యట్లుచేయుటకు వీలులేదు. తెనుఁగు సంస్కృతానుసారిణియైనది. అయిన మట్లుగాక స్వతంత్రించియే యున్నది. రెండును ఒక మాతృకగల ద్రవిడభాషలేయైనను నిత్యవ్యవహారమందుగల పెక్కుపదము లర్థరూప భేదములులేక యున్నను ప్రకృతి ప్రత్యయ సంబంధమం దఱవమున స్వాతంత్ర్యమున్నది. మఱియు భాషాభివృద్ధి కవకాశ మెక్కువగానున్నది. పదముల నిచ్చవచ్చినట్లనుకూలముగా సృష్టించుకొనవచ్చును. తెనుఁగున నట్టి పద్ధతులు విరివిగాలేవు. అఱవమందలి విశేషణ పద్ధతి యింతగాఁ గానవచ్చును. ఆపద్ధతి నా సహజశైలినిగూడఁ జాలచోట్ల మార్చివైచినది.

'కంబకవియే పండితుఁడు; కంబకవి యింటి కట్టుకంబముగూడ కవిత్వము చెప్పును; అను నా నుడులకుఁ గారకుఁడైన యిమ్మహాకవి కవిత్వమందలి గొప్పతనమును కొంతవఱకైన నాంధ్రులు గ్రహింపఁగలిగినచో నాపరిశ్రమము సఫలము కాఁగలదు. గ్రంథము గొప్పదిగావునఁ దెలిసియుఁ దెలియకయు దోసఁగులు దొరలియుండవచ్చు. అట్టివి తెలిసి తెలిపినవారికి వినయపూర్వక వందనము లర్పింతును.

## ఒక క్రొత్త మార్పు.

ద్రుతము స్వత్వరూపము వహించినపుడు దానిపై వచ్చు పరుషము సరళము కారాదు. ఏలయన స్వత్వమజంతము. దానికి ద్రుతకార్యముంచుట యెట్లు పొసఁగును? కావున నట్టిచోటులను సముచ్చయమగు నువర్ణము మీఁదను సరళాదేశము మానితి.

## సహాయులు.

తెనిఁగించునపు డారణ్యకాండమున ఉభయభాషాప్రవీణ శ్రీ అయ్యాదొరాచార్యకవిగారును కిష్కింధాకాండమున విద్వాన్ శ్రీ మునిరత్నపిళ్లగారును నాకెక్కుడుగఁ దోడ్పడిరి. శ్రీ. జి. వెంకటస్వామి నాయఁడుగారును విద్వాన్ శ్రీ సాంబశివపిళ్లగారును శుద్ధప్రతి వ్రాసియిచ్చిరి. మిత్రుల ప్రేరణముచే 'దక్షిణ' యనుపేర కృతికర్తృ (నా) జన్మాదికమును శ్రీ నాగసరసింహులు నాయునింవారు వ్రాసిరి. మైసూరు యూనివర్సిటీ ప్రోఫెసరుగానున్న డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు నాయందుగల యధిక వాత్సల్యముచే దీనికి అమూల్యమగు పీఠిక వ్రాయుచున్నారు. అది రెండవసంపుటముతోఁ జేర్చి పాఠకులకు సమర్పింతును. ఇట్లు నాకన్నివిధముల ప్రోత్సాహ మొసంగిన వీరిమేలు నా జీవితాంతమువఱకు మఱవఁజాలను.

## ము ద్ర ణ ము.

ముద్రణకార్యము పెక్కు చిక్కులకు లోనై ఆఱేండ్లు కడచినవి. కాగితములు దొరకక కొంతకాలము, మితిమీఱిన వెలలై కొంతకాలము, అనుకూలసూచనలు తోఁచినపుడార్థిక దుస్థితి. ఇట్లుకాలము కడచిపోవుచుంట గాంచి నాబాల్య మిత్రులు భాషాప్రియులునగు శ్రీ బొమ్మయపల్లి అప్పాసామిపిళ్లగారు నాకంటె నధిక శ్రద్ధగైకొని శ్రమకోర్చి తిరిగి తమ పలుకుబడిని పూర్తిగా నుపయోగించి రాజపోషకులను పోషకులను ప్రోత్సాహకులను చందాదారులను చేర్చి ధనము ప్రోవుచేసి ముద్రణ వ్యయమునకొసఁగి ముద్రితగ్రంథమును కన్నులఁగాంచ దీక్షగొని ప్రథమ సంపుటము పూర్తిగావించి యొక మహాయజ్ఞము నెఱవేర్చిన ట్లానందమందినారు. అట్టి సుహృద్రత్నమగు శ్రీఅప్పాసామిపిళ్లగారికిని వారికితోడుపాటుగా కార్యక్లేశమునహించి ముద్రిత గ్రంథమును కనులఁజూడఁగోరిన భారతపౌరాణికులు శ్రీ తిరువేంగడ పిళ్లగారికిని ఆనందాశ్రమస్థాపకులగు శ్రీ శాంతానంద స్వాములవారికిని గాండ్లపల్లి రామకృష్ణారెడ్డిగారికిని ఎత్తేపల్లి గ్రామస్థులు శ్రీపుల్లూరి నారాయణసామిరెడ్డిగారికిని కాణిపాకుపట్నం శ్రీ లోకనాథపిళ్ల B. A. గారికిని తక్కినమిత్రులకును రాజపోషకులకు, పోషకులకు, పోత్సాహకులకు నేతత్కథానాయకుఁడు నిష్టదైవమునగు శ్రీ కోదండరామచంద్రుం డితోధికాయు రారోగ్య భోగభాగ్యము లొసంగుఁగాక.

ముద్రణభారము నాకొలఁదికి మీఱినదని యెఱిఁగి తమ యౌదార్యము ప్రేమతోఁజూపి ధనసాహాయ్యము చేసిన గణ్యులు.

### మ హా రా జ పో ష కు లు.

| | |
|---|---|
| శ్రీ శ్రీ ముద్దుబంగారి శేషాచలపతిరాజులుంగారు, జమీాందారు, బంగారిపాళెం. ... | 216—0—0 |
| శ్రీ శ్రీ రాజా సుగుటూరు ఇమ్మడి వీరబసవ చిక్కరాయ యశోవంత బహద్దరు జమీాందారువారు, పుంగనూరు ... | 250—0—0 |

### 116 రూ. ఒసఁగిన రాజపోషకులు.

శ్రీ T. మునిస్వామినాయఁడుగారు, మోటకాంపల్లి, కొత్తకోట.
,, N. చెంగల్ రెడ్డిగారు, మండీ, పాకాల.
,, P. వెంకటరెడ్డిగారు, తుంబకుప్పం.
,, G. వెంగమనాయఁడుగారు, నలవెంగనపల్లి.
,, మద్దూరి వెంకటరామయ్యగారు, పురోహితులు, పుల్లూరు.
,, రామసామిరెడ్డిగారు, కొత్తకోట.

శ్రీ N. P. వెంకటకృష్ణయ్యనాయఁడుగారు, చిత్తూరు.
,, N. P. చెంగల్రాయనాయఁడుగారు, డిస్ట్రిక్టుబోర్డుప్రెసిడెంటు, చిత్తూరు.
,, మణియం శ్రీనివాసులు నాయఁడుగారు, నలగాంపల్లి.
,, మునిస్వామిరెడ్డిగారు, మొట్టుకూరు.
,, K. గోవిందరెడ్డిగారు, కల్లూరుపల్లి.
,, మణియం గోవిందరెడ్డిగారు, నల్లంగాడు.
,, V. శేషాచలమునాయఁడుగారు, కొండ్రాజుకాల్వ.
,, మణియం చెంగల్ రెడ్డిగారు, గుండ్లకట్టమంచి.

ఏఁబది రూపికలొసఁగిన పోషకులు.

శ్రీ B. L. నరసింహులు నాయఁడుగారు, బొమ్మయపల్లి.
,, Y, మొగిలిరెడ్డిగారు, దండువారిపల్లి.
,, మునిమాదిరెడ్డిగారు, నల్లంగాడు.
,, B. గోవిందరెడ్డిగారు, బుడితిరెడ్డిపల్లి.
,, B. వరదారెడ్డిగారు, మత్త్యం.
,, B. C. మునిసామిరెడ్డిగారు, మత్త్యం.
,, K. వెంకటమునిసామినాయఁడుగారు, మండీ, చిత్తూరు.
,, P. చిన్నమరెడ్డిగారు, పెరియంబాడి.
,, P. రామకృష్ణారెడ్డిగారు, గాండ్లపల్లి.
,, P. మునిరెడ్డిగారు, కాళేపల్లి.
,, T. మునిరత్నంరెడ్డిగారు, తుంబలవారిపల్లి.
,, T. చిన్నికృష్ణారెడ్డిగారు, తుంబలవారిపల్లి.
,, M. గురుమూర్తిరెడ్డిగారు, ఎట్టేపల్లి.
,, P. రామారెడ్డిగారు, ఎట్టేపల్లి.
,, P. వెంకటరెడ్డిగారు, ఎట్టేపల్లి.
,, P. రాఘవరెడ్డిగారు, ఎట్టేపల్లి.
శ్రీ ఆనందాశ్రమ భక్తులు, ఎట్టేపల్లి.
,, V. సుబ్బానాయఁడుగారు, కొండ్రాజుకాల్వ.
,, చ. సుబ్బానాయఁడుగారు, కొండ్రాజుకాల్వ.
,, P. నారాయణరెడ్డిగారు, పల్లెచెఱువు.
,, P. శంకరరెడ్డిగారు, పల్లెచెఱువు.

## ఇరువదియైదు రూపికల మున్నుగ నొసఁగిన ప్రోత్సాహకులు.

శ్రీ J. మునసామిరెడ్డిగారు, కల్లూరుపల్లి.
,, K. సుబ్బారెడ్డిగారు కల్లూరుపల్లి.
,, P సుబ్బారెడ్డిగారు, మహాసముద్రం.
,, మణియం. కుప్పిరెడ్డిగారు, మహాసముద్రం.
,, B. పాపానాయఁడుగారు, బొమ్మయపల్లి.
,, B. కస్తూరినాయుఁడుగారు, బొమ్మయపల్లి.
,, M. K. రామిరెడ్డిగారు, తుంబకుప్పం.
,, K. బాలకృష్ణపిళ్లగారు, గాజులపల్లి.
,, V. నాగమనాయఁడుగారు, కొండ్రాజుకాల్వ.
,, V. చిన్న బోడయ్యానాయుఁడుగారు, కొండ్రాజుకాల్వ.
,, V. సీనయ్యానాయఁడుగారు, కొండ్రాజుకాల్వ.
,, K. నల్లయ్యానాయుఁడుగారు, కొండ్రాజుకాల్వ.
,, మణియం. గోవిందరెడ్డిగారు, అరగొండ.
,, B. మునిరత్నంరెడ్డిగారు, ఎగువమత్యం.
,, కొ. వెంకటపెరుమాళ్లురెడ్డిగారు, ఎగువమత్యం
,, K. దొరసామిరెడ్డిగారు, ఎగువమత్యం.
,, భాస్కరరెడ్డిగారు, ఎగువమత్యం.
,, K. దొరసామిరెడ్డిగారు, ఎగువమత్యం.
,, వ. లింగమనాయఁడుగారు, ముట్టుకూరు.
,, B. చెంగల్‌రెడ్డిగారు, మత్యం
,, M. సుబ్బారెడ్డిగారు, మత్యం.
,, B. చిన్నవరదారెడ్డిగారు, మత్యం.
,, A. రామచంద్రారెడ్డిగారు, మత్యం
,, K. మురుగేశముదలిగారు, మురుకంబట్టు.
,, మునిరెడ్డిగారు, వావిల్‌తోట.
,, V. బాలకృష్ణారెడ్డిగారు, V. M. వావిల్‌తోట.
,, P. శ్రీరాములురెడ్డిగారు, వావిల్‌తోట.
,, T. రామకృష్ణారెడ్డిగారు, తలుపులపల్లి.
,, T. రామచంద్రారెడ్డిగారు, తలుపులపల్లి.
,, P. రామలింగారెడ్డిగారు, కాళేపల్లి.
,, K. S. అణ్ణామలైపిళ్లగారు, గాండ్లపల్లి.

శ్రీ P. విశ్వనాథరెడ్డిగారు, ఎత్తేపల్లి.
,, మారం. చిన్నమునసామిరెడ్డిగారు, పుల్లూరు.
,, ముప్పూరి మునసామిగారు, పుల్లూరు.
,, సుబ్బరాజుగారు, డ్రిల్ మాష్టరు, అరగొండ.
,, K. సత్యనారాయణమూర్తిగారు, B.A., B.Ed., హెడ్మాష్టరు, B. H. School, Puttur.
,, S. రాజగోపాలనాయఁడుగారు, పాకాల.
,, M. లక్ష్మయ్యనాయఁడుగారు, పాకాల.
,, N. రంగయ్యనాయఁడుగారు, పాకాల.
,, R. కృష్ణయ్యనాయఁడుగారు, పాకాల.
,, M. రంగయ్యనాయఁడుగారు, పాకాల
,, కరణం మునిరత్నపిళ్లగారు, మొగిలివెంకటగిరి.
,, అరుణామల్లై రెడ్డిగారు, చెర్లోపల్లి.
,, మణియం మునిరెడ్డిగారు, తొడతర.
,, మణియం వెంకట్రామారెడ్డిగారు, మల్లకుంట.
,, K. మునసామిరెడ్డిగారు, కట్టకిందపల్లి.
,, రంగారెడ్డిగారు, కట్టకిందపల్లి.
,, కరణం సుబ్రహ్మణ్యపిళ్లగారు, పట్రపల్లి.
,, కరణం నాగరత్నపిళ్లగారు, పట్రపల్లి.
,, కరణం నాగరత్నపిళ్లగారు, పుత్తూరు.
,, పెద్దబ్బనాయఁడుగారు, మోదుగులపల్లి.
,, మణియం రామలింగారెడ్డిగారు, పాటూరు.
,, డాక్టరు రామస్వామిరెడ్డిగారు, చిత్తూరు.

మఱియు వాగ్దానముచేసినవారు కొందఱు గలరు. వారిపేరులు రెండవసంపుటమున ప్రకటింతును. వీరికెల్లరకును కృతజ్ఞతాపూర్వక వందనములతో నీప్రథమ సంపుటము సమర్పించుచు త్వరలోనే తక్కిన రెండవసంపుటమును అందఁజేయుదు నని విన్నవించుచున్నాఁడను.

ఇట్లు,
సుజన విధేయుఁడు,
శ్రీ రా ము లు రె డ్డి.

# క్రింది సవరణలను మున్నుగ గ్రంథమందు గావించుకొని మఱి చదువఁ జదువరులు ప్రార్థితులు.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. | పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|---|---|---|
| ౧౭ | ౨౯ | పచించు | వసించు | ౧౯౪ | ౩ | తమకు | దండి |
| ౨౪ | ౨౩ | గ్రవాద్య | గ్రవ్యాద | ౨౧౬ | ౧ | ౨ | ౭ |
| ౨౫ | ౧౫ | రాజ్యాబు | రాజ్యంబు | ౨౪౨ | ౧౬ | ణవి | ణీవి |
| ౨౭ | ౨౨ | పజ్జలంబు | పజ్జలజాబు | ౨౪౫ | ౨ | నొసగఁ | నొసఁగ |
| ౩౦ | ౧ | పోన | పోవ | ౨౯౪ | ౨౫ | మంజిలి | మంజలి |
| ౩౮ | ౧౫ | ౨౬ | ౭౬ | ౩౦౨ | ౧౩ | నీరుగ | నీఱుగ |
| ౪౦ | ౩౦ | సత్పురుష! | సత్పురుష | ౩౦౩ | ౬ | రండనును | రండనుచు |
| ౪౯ | ౧౪ | డయ్యోన్ | డయ్యో | ౩౦౭ | ౯ | బందువన్ | బందునన్ |
| ౬౩ | ౮ | యహ్వాల | యహాల్య | ౩౧౬ | ౧౪ | కుఁడు నే | కుండు నే |
| ౬౬ | ౩ | వస్త్రముల్ | వస్త్రములున్ | ౩౨౬ | ౨౨ | పృష్ట | దార్ఢ్య |
| ౬౮ | ౨౮ | సిత | సీత | ౩౨౭ | ౫ | దోర్మ్మల | దోర్బల |
| ౬౯ | ౨౧ | క్రొంవిరి | క్రొవ్విరి | ౩౩౦ | ౨౭ | హొమ | హేమ |
| ౭౯ | ౨౩ | మొగమ్మను | మొగమ్ములు | ౩౩౭ | ౨ | వాతెఁడు | నాతఁడు |
| ౮౭ | ౫ | బొంటె | బొంద | ౩౩౮ | ౧౨ | మదంబుస | మదంబున |
| ౯౩ | ౧౯ | ఝుర | ఝుర | ౩౪౫ | ౫ | యెని | యేని |
| ౯౪ | ౬ | రొుద | రొద | ౩౪౬ | ౩ | డండము | దండము |
| ౯౬ | ౨౭ | సిర్ఘర | నిర్ఝర | ,, | ౧౯ | ప్రతివ్రతా | పతివ్రతా |
| ౧౧౨ | ౧౨ | నిర్ఘరిణి | నిర్ఝరిణి | ౩౫౪ | ౨౭ | రమ్మ | రమ్మ |
| ౧౧౩ | ౨౮ | గడలిఁ | గడ్డలిం | ౩౫౭ | ౧౮ | కోఱలు | కోఱల |
| ౧౧౭ | ౧౬ | నొాడె | నొండె | ౩౬౪ | ౨ | లక్షణు | లక్ష్మణు |
| ౧౧౯ | ౧౪ | బైనవైచి | బైనవైచి | ౩౮౯ | ౨౮ | దెల్పుఁడు | దెల్పుఁడు |
| ,, | ౨౨ | త్రోవలలో | త్రోవల | ౪౦౦ | ౯ | నవధామతిని | నవధానమతిని |
| ౧౨౭ | ౨ | రామునందు | యశమునందు | ౪౧౯ | ౧౧ | (బట్టుచుఁ బట్టు వీడుచున్ | దాఁటుచు ముష్టిపోటులం |
| ౧౩౦ | ౪ | సజ్జ | సబ్జ | ౪౩౨ | ౩౦ | కౌగి | కేగి |
| ,, | ౨౨ | పూర్తిగ | పూర్తిగా | ౪౩౪ | ౮ | నరజూఁప | ధరఁజూప |
| ౧౩౬ | ౨౭ | నరుణు | అరుణు | ౪౩౯ | ౩౦ | వసుథ | వసుధ |
| ౧౪౨ | ౧౩ | ఇరువులు | ఇరువురు | ౪౫౧ | ౮ | జ్జాకురి | జ్జాంకురి |
| ౧౪౯ | ౨౯ | జానితో | జానితో | ౪౭౮ | ౧౩ | వెన్మ | వెన్న |
| ౧౫౭ | ౨౫ | మణులతొ | మణులతో | ౪౮౧ | ౨౬ | నిర్ఘరంబు | నిర్ఝరంబు |
| ౧౫౯ | ౨౭ | మేలల్సుపు | మేల్సలుపు | ౪౮౨ | ౩౦ | మేతు | మేరు |
| ౧౬౨ | ౨౭ | గోరెద | గోరెద | | | | |



పూతలపట్టు
శ్రీరాములురెడ్డి.



క. అప్పాసామిపిళ్ల,
బొమ్మయపల్లి.

శ్రీ

# దక్షిణ.

౧

ఉ॥ శ్రీచు దనంత కోటి గుణ ♦ సేవితుఁ డర్యమ వంశ సింధు పూ
ర్ణామృత ధాముఁ డుజ్జ్వల శ ♦ రాసన ధారుఁడు ప్రావృ డంబుద
శ్యాముఁడు జానకీ రమణుఁ ♦ డౌ రఘురామ నృపుండు మద్గురు
స్వామి కభీష్ట సంపద లొ ♦ సంగి కృపామతిఁ బ్రోచుఁ గావుతన్.

౨

తే॥ ప్రకృతి కల్యాణ మంటప ♦ ప్రాక్క వాట, మందు పవడాలు పండు పు ♦ ణ్యంపువేళఁ
జిలిసిచిలుకలుగానము ♦ ల్సేయునాదు, తెలుఁగువనమునఁగ్రొంగ్రొత్త ♦ వెలుఁగులేమొ?

౩

చం॥ మలయ సమీర డింభములు ♦ మాటికి మాటికి రాలు మంచు చు
క్కల సుర పొన్న పూ లరుణ ♦ కాంతుల సానలు దీరి నెత్తిపై
జలజల రాలుచుండ నటఁ ♦ జంద్ర శిలోపరిభాగ నిష్ఠయై
కలుముల కన్నె చందమునఁ ♦ గన్పడు నాయమ యెవ్వరో కదా!

౪

ఉ॥ నీలమణి ప్రభల్ విరియు ♦ నిర్మల నేత్ర సరోజముల్ జరీ
మేలు ముసుంగు నీడల ని ♦ మీలనముం బొనరించి భావ సౌ
ధాలఁ జరించు నో సుచరి ♦ తా! ఎవరమ్మ! సమస్త విశ్వముల్
బాలన సల్పు శీవి కను ♦ పట్టు భవ న్ముఖ మండలంబునన్.

౫

తే॥ ఓ యపూర్వ వర్చస్వినీ! ♦ ఒక్క మాట, చెప్పు మెవరవో నిన్ను చూ ♦ చినదిమొదలు
నీదు చరణాలకడఁ జిన్ని ♦ నిసుఁగు పోల్కి, నాటలాడఁగ భ్రమ పుట్టె ♦ నాత్మలోన

౬

తే. ఓసి! అమృత శకుంతమా! - ఒక్క క్షణము, నీమనోహరగానమ్ము ♦ నిలుపు మింక
జాలు జాలుగఁ బుండరీ ♦ కాలు విరియ, నాణి ముత్యాలు పండించు ♦ నమ్మ యిపుడు

౭

తే॥ ఏమిటే తల్లి! ఎచ్చటి ♦ దీ యపూర్వ, కాంతి వికసిల్లె విద్యుత్ప్ర ♦ కాశమట్లు
తెలుఁగుఁదల్లివా! ధన్యోస్మి! ♦ తెలియనైతి, సైఁపుమపచారములునమ ♦ స్కారశతము

౮

తే॥ అస్మ దాంధ్ర భాషా ప్రపం ♦ చాధినేత్రి, మంచు టిరు లిన కరముల ♦ మాయు వేళ
నాడఁబోవు తీర్థం బెదు ♦ రయిన యట్లు, కానఁబడితివి కన్నుల ♦ కలవు దీఱ

౯

ఉ॥ భావ పథాంబర స్థలికిఁ ♦ బందిరు లొడ్డిన సన్న జాజి పూఁ
దీవెల నీడలం దరుగు ♦ దెంచి భవ త్సముఖమ్ముఁ జేరితిఁ
బోవుద మస్మదీయ గురు ♦ మూర్తి గృహంబున కింక రమ్ము నీ
కా విమలాత్ముఁ డీయఁగలఁ ♦ డచ్చపుఁ గప్రపు మంగళారతుల్

౧౦

చ॥ తెలియదె నీకు నాదు గురు ♦ దేవుఁ డనంగ నలంతివాఁడె లాం
గలమున నుర్విఁ జీల్చి కన ♦ కంపుఁ గరుళ్లను పెల్లగించు కాఁ
పుల యెకిమీఁడు కాఁడె పలు ♦ పుల్ నతలెత్తి సుమింప విశ్వ మం
గళముగఁ బాడు సత్కవి పి ♦ క ప్రవరుండు త్రిలింగ భారతీ!

౧౧

ఉ॥ మామిడి పూల చెల్వలకు ♦ మౌక్తిక సంతతు లిచ్చు కౌముదీ
కామిని పాదమాన మృష ♦ గాదిది పూతలపట్టు రెడ్డి శ్రీ
రాములనంగ నొక్క కవి ♦ రాజు సుమా! విరియించె నెన్నియో
కోమల నవ్య కావ్య సుమ ♦ గుచ్ఛములన్ భవ దంఘ్రి పూజకై.

౧౨

తే॥ అతఁడు కమ్మని కైతల ♦ నల్లుకొనుచు, నభ్ర సంచర దమృత వి ♦ హంగమట్లు
పరమ పావన కవితా ప్ర ♦ పంచమందు, స్వేచ్ఛగా విహరించు వి ♦ శృంఖలుండు.

౧౩

తే॥ పతిత సంఘము నుద్ధరిం ♦ పఁగ నతండు, మహిమ శతక మిప్పటికిలి ♦ మందలింపు
వ్రాసి సంస్కర్త యని పేరు ♦ వడసె నంత, నార్యు లభినవ వేమన ♦ యని పిలిచిరి.

౧౪

తే॥ లాక్షణిక లోకమునకుఁ బ ♦ రీక్ష పెట్టె, వెఱ్ఱి మొఱ్ఱి వ్రాఁతల వెలి ♦ వేసి యతఁడు
తెనుఁగునకు రూపు రేకలు ♦ దిద్ది తీర్చి, ఆంధ్ర పాణిని యను బిరు ♦ దందినాఁడు.

౧౫

తే॥ కవిత కోకనాఁడు కల్యాణ ♦ భవన మయిన, చంద్రగిరిలో నిటీవల ♦ జరిగినట్టి
పండితుల సభలోన "సా ♦ ద్వాత్కవికుల, తిలక" మను బిరు దీతండు ♦ తీసినాఁడు.

౧౬

మ॥ కవియై పండితుఁడై విమర్శకుఁడునై ♦ గాంధర్వ విద్యా రహ
స్య విదుండై మఱి గొప్ప లాక్షణికుఁడై ♦ సంస్కర్తయై మైథిలీ

ధవ భక్తుండయి తెల్గునాఁటఁ గల పె • ద్దల్ తన్ను సన్నించి గౌ
రవ భావంబునఁ జూడఁ గర్షక కవీం • ద్ర బ్రహ్మ రాజించెడిన్.

౧౭

తే॥ కవులు పండితు లెందఱో • గలరు కాని, తెలుఁగు మిన్నున వెలుఁగు రి • క్కలకు నడుమఁ
బాల్కడలిబిడ్డ పూతల • పట్టు రెడ్డి, అతని చరితము శ్రవణీయ • మద్భుతంబు.

౧౮

తే॥ శిష్య వత్సలుఁ డాతఁ డా • శిస్సు లిడఁగ, నతని శిష్యు లనేకు ల • హర్నిశములు
తెలుఁగుఁ దోఁటలో వలపుల • చిలుకలట్లు, పాడుచున్నారు ప్రమోదములు • పల్లవింప.

౧౯

తే॥ కమలినీస్వామి కరుణ న • క్షత్ర సమితి, నీల వియ దంగణంబునఁ • బూల తోఁట
నాటునట్లుఁ దచ్ఛిష్య • కోటి యతని,కీర్తి కౌముదులను వెలిఁ • గించుచుండు.

౨౦

తే॥ వారి నడుమను చిన్నారి • తార నేను, ద్రోణుఁ డర్జునునట్లు మ • ద్గురుఁడు నన్ను
ప్రేమ దై వాఱఁ జూచి దీ • వించుచుండు, నాగనరసింహు లనియండ్రు • నన్ను జనులు.

౨౧

తే॥ నాదు గురుదేవుఁ డిచటికి • నన్ను పంపెఁ, బోవుదము రమ్ము తద్గేహ • మునకు, దారి
నడుమ నాతని చరితము • నుడువువాఁడ, నాలకింపు మధ్వశ్రమ • మడఁగునమ్మ.

౨౨

తే॥ చిలిపి చిలిపివి వన్నెల • చిన్నెలవియుఁ, జిత్రమయినవి క్రొత్తవి • చెడనివియును
కావ్య భూషణముల ననే • కముల నీకుఁ, గాన్కలిడె నిడుచున్నాఁడు • కదలిరమ్మ.

౨౩

తే॥ కోహినూరును దలదన్ను • క్రొత్త క్రొత్త, మణులు పొదిఁగిన సౌవర్ణ • మకుట మొండు
కంబరామాయణంబనఁ గ్రాలు దానిఁ, గడఁక నిర్మించియున్నాఁడు • కాంతు రమ్మ

౨౪

ఉ॥ కంబములే కవిత్వమును • గానము సేయఁ బొనర్చినట్టి శ్రీ
కంబుని కబ్బమున్ దెలుఁగు • గా నొనరించుట నోటిమాటలే!
అంబరవీథిఁ దారకలు • నర్యముఁడున్ శశి వెల్గు దాఁక ని
త్యంబయి తెల్గు నాఁటి చరి • తంబున నాతని కీర్తి వెల్గదే!

౨౫

తే॥ లలితములుఁ గోమలములునౌ • తలఁపుటలలఁ, బూలపడవెక్కి రావమ్మ! • పోవుదమిఁకఁ
దెడ్లు వేయుచు మద్గురు • దేవు చరిత, క్రమగతిఁ బాడుచుఁ గలంబుఁ • గడపువాఁడ

౨౬

ఉ॥ చూత వనంబులున్ శుకన • సూక్తులు శ్యామల సస్యముల్ సరో
జాత లసత్తటాకములు • శాద్వల సీమలు మింటిఁ జూచు న్యా...

బోతుల అంకెలున్ గలిగి ♦ ముచ్చటఁ గొల్పుచునుండు నెంతయున్
బూతలపట్టనంగ నొక ♦ ప్రోలల చిత్తురు మండలంబునన్.

౨౭

సీ॥ హాలముచే వసుమతీ ♦ తలము ప్రయ్యలు సల్పి, పేదల కన్నంబు ♦ పెట్టువారు
గలముచేఁ గమ్మని ♦ కావ్యముల్ రచియించి, కవితకుఁ గంకణా ♦ లట్టువారు
కత్తిచేఁ బగవారి ♦ కంఠమ్ములను ద్రుంచి, మాతృదేశము కీర్తి ♦ మనుచువారు
కలిమిచేఁ బెద్దమ్మ ♦ కథఁ గట్టువడఁ జేసి, శిబి కర్ణులను దీలు ♦ సేయువారు

తే॥ రెడ్డి బిరుదాంకితులు గదు ♦ దొడ్డవారు, సదమల చరిత్రు లసములు♦సదయమతులు
మేటి కాఁపులు నగు పాకనాటివారు, ప్రథమ గణ్యులు పూతల ♦ పట్టునందు.

౨౮

తే॥ చదల రిక్కలఁ గైరవ ♦ స్వామివోలెఁ, బాకనాఁటి ఱేఁడులలోనఁ ♦ బ్రణుతి కెక్కె
శ్రీనివాస పదాంబుజ ♦ ధ్యాన రతుఁడు, పూత చరితుఁడు శ్రీ పెద్ద ♦ బుచ్చిరెడ్డి.

౨౯

తే॥ అతని సహధర్మచారిణి ♦ యనుపమాంగి, భర్తృ సేవానురక్తయగు ♦ పరమ సాధ్వి
దీన జన హిత చింతనా ♦ ధీన హృదయ, అమలిన గుణాలవాల ల ♦ క్ష్మమ్మ యనఁగ

౩౦

తే॥ ఆయమకు నాతఁ డాతని ♦ కాయమయును, దగుదురని పిన్న పెద్దలు ♦ పొగడుచుండఁ
బరిమళ ప్రసవంబుల ♦ పగిది వారు, హాయిగాఁ గాఁపురమ్మును ♦ చేయుచుండ్రి.

౩౧

తే॥ కూటికిం గుడ్డ కింతయుఁ ♦ గొదువలేదు, కాని వారిని బిడ్డలు ♦ లేని కొఱఁత
యొకటి మాత్రము వేధించు ♦ చుండె నకట, నోచరాని నోముల నెల్ల ♦ నోచినారు.

౩౨

తే॥ అతఁడు పెదబుచ్చిరెడ్డి మ ♦ హాతపస్వి, పుడమి తల్లిని పూజించు ♦ పుణ్యమూర్తి
సంతు లేదని దుఃఖిత ♦ స్వాంతుఁ డయ్యె, సుతులు లేనట్టి వారికి ♦గతులు గలవె?

౩౩

చ॥ కలిగిరి మీఁద మేటి కన ♦ కంపుఁ గిరీటము నుంచినట్లు దే
వళము నొకండు గట్టి కడు ♦ భక్తిని వేంకట శైల నాయకున్
నిలిపి తదాలయంబుననె ♦ నిష్ఠమెయిన్ దప మాచరించె న
య్యలఘుఁడు రెడ్డి వంశ కల ♦ శాంబుధి చంద్రుఁడు సంతుకోసమై

౩౪

తే॥ బుచ్చిరెడ్డిసల్పిన తపం - బునకు మెచ్చి, మంగళప్రదుఁ డలమేలు - మంగభర్త
దయ నొసంగిన యట్టి పొం - దమ్ము లనఁగ, నతనికి జనించి రంతట - సుత లిరువురు,

౩౫

తే॥ కొమరితలు పుట్టిరే కాని కొడుకు కొఱఁతయు, కలుగఁగా రాదె యనుచు వ్యాకులత నొంది
రామచంద్రున కంత స్వ ♦ గ్రామమునను, యతఁడు గట్టించె నొక్క దే ♦ వాలయంబు

౩౬

శా॥ ఆ దేవాలయమందు బుచ్చినృపుఁ డా - హా! రామదాసట్లు సీ
తాదేవీప్రభు పాద పంకజ యుగ ♦ ధ్యానామృతాస్వాదనో
న్మాదుండై మఱచెన్ ప్రపంచమును రా ♦ మస్వామి ఱాబొమ్మ కా
పాదిల్లెన్ నవ జీవన ప్రభలు త ♦ ద్భక్తి ప్రభావంబునన్.

౩౭

మ॥ కడలిం బుట్టిన వెన్నెలాఁ డిరులలోఁ ♦ గాల్దప్పి చేనున్న పా
ల్కడవన్ బ్రద్దలు గొట్ట వెల్వడు సుధా ♦ కాంతుల్ వడిన్ గల్వలన్
విడుగన్ జేసిన యట్లు రామ భజనా ♦ వేశమ్ము తేనెల్ స్రవిం
చెడు కావ్య ప్రసవాల నిక్కవిరియిం ♦ చెన్ బుచ్చిరాట్ హృల్లతన్.

౩౮

మ॥ శరదిందూదయ నిర్మల స్మితముతో ♦ సర్వంసహా మంగళం
కర దృక్షీలమణి ప్రకాశములతో ♦ గ్రైవేయ హారాళితో
ధరణీనందనతో రఘూత్తముఁ డెడం ♦ దన్ నిల్చి కేల్సాఁచఁ ద
త్పరుఁడై కావ్యము లిచ్చె రెండుపదు లా ♦ తం డెంత ధన్యాత్ముఁడో!

౩౯

తే॥ తమన యొడ్డునఁ దృణ కుటీ ♦ రమున మున్ను, రామకథలు పాడిన కవి ♦ రాజు లీల
రామ మందిర ప్రాంగణ ♦ సీమ నితఁడు, గాన మొనరించెఁ దన హరి ♦ కథల నెల్ల

౪౦

తే॥ అనుదినం బాతఁడు వచించు ♦ హరికథలను, వినుటకై వచ్చుచుండిన ♦ వేలకొలఁది
జనులు భాగవత శ్రేష్ఠుఁ ♦ డనుచు నతనిఁ, బిలుచుచుండిరి గౌరవ ♦ విలసనముగ.

౪౧

తే॥ గాజు బలుబుల విద్యుత్ప్ర ♦ కాశమట్లు, వలపు రసగుండ్లలో దీప ♦ కళిక లీల
జానపదుల నిర్మల మాన ♦ సముల జ్ఞాన, కళలు విరియించె బుచ్చయ్య ♦ కలితకీర్తి

౪౨

ఉ॥ అన్యములన్ స్మరించక య - హర్నిశ మిట్టులు పెద్దబుచ్చిరా
జన్యుఁడు జానకీ హృదయ - సారస బాల వికర్తనున్ జగ
న్మాన్యుని రావణాద్యసుర - మర్దను మానసమందు నిల్పి సౌ
జన్యముతో భజించె దివ - సంబులు కొన్ని గతింప నయ్యెడన్.

౪౩

ఉ॥ ఓ విమలామృతాక్షర మ ♦ హోజ్జ్వల మూర్తి! త్రిలిఙ్గ లోక మా
తా! వినవమ్మ! ఇట్లు నిర ♦ తమ్మును తన్ను భజించు భక్తునిన్
బ్రోవఁగ నెంచెనో రఘువ ♦ రుం డన బుచ్చయ ధర్మపత్ని సం
భావిత పుణ్యశీల శ్రిత ♦ వత్సల యంతటఁ దాల్చె గర్భమున్.

౪౪

తే॥ పాదుశాహికి సొమ్మును ♦ పాఱవైచి, దాసు చెఱ విడిపించిన ♦ ధర్మమూర్తి
బుచ్చిరెడ్డి కాంక్షలు దీర్చి - ప్రోవలేఁడె? నిర్మలముగ లక్ష్మమ్మకు ♦ నెలలు నిండె.

౪౫

మ॥ పరఁగన్ వేయియు నూఱు లెన్మిదియుఁ దొం ♦ బై రెంట నేప్రేలుకన్
సరియౌ నందన చైత్ర శుద్ధ నవమిన్ ♦ సర్వంసహా పుత్త్రి వా.
సరమం దద్దమరేయిఁ బుష్యమిని ప్రాం ♦ చ చ్చాప లగ్నంబునం
దు రఘూత్తంసు దయన్ జనించెను సుపు ♦ త్త్రిం డంత లక్ష్మమ్మకున్.

౪౬

తే॥ పెన్నిధిని హస్తగతుగఁ జూచు ♦ పేదలీల, బుచ్చిరెడ్డి మహానంద ♦ మున మునింగి
సహజగుణమగు తన కృత ♦ జ్ఞత రహింపఁ, బరవశుండయ్యె రఘురామ ♦ భజనవలన.

౪౭

ఉ॥ రాము వరప్రసాదమున ♦ రాముఁడు పుట్టిన పుణ్యవేళ నా
రాముని దేవళాలఁ గపు ♦ రంపుఁ బ్రభల్ వికసించునప్డు డా
రాముని భక్తుఁ డుల్లమున ♦ రంజిలఁ బుట్టిన కారణాన శ్రీ
రాములురెడ్డి యంచు నను ♦ రాగపుఁ బేరిడె నంత బిడ్డకున్.

౪౮

క॥ తదనంతర మిరువురు సుతు, లుదయించిరి వారి వెనుక ♦ నొక సుత కలిగెన్
ముదితాశ్రుకణము లొల్కఁగఁ, బెదబుచ్చయ రామచంద్ర ♦ విభుని నుతింపన్.

౪౯

ఆ॥ వారలందు దొలి కు ♦ మారుండు మన్మథా, బ్దమున శ్రావణమున ♦ బహుళమందు
అష్టమిని జనింప ♦ నతనిఁ గృష్ణారెడ్డి, యనిరి తల్లిదండ్రు ♦ లతి ముదమున.

౫౦

సీ॥ బాలకృష్ణుం డాంధ్ర ♦ భాషలోనసె కాదు, సంస్కృతాంగ్లంబులఁ ♦ జదువులయ్యె
అరయ నుద్యోగమే ♦ పురుష లక్షణ మను, నార్యోక్తిఁ బాటించి ♦ యన్నయట్లు
తానును చిత్పుర ♦ స్థానికోన్నత పాఠ, శాలాంధ్రపండిత ♦ స్థాన మందె
విద్వాంసుఁడయ్యును ♦ విద్వాన్ పరీక్షలో, నుత్తీర్ణుఁ డయ్యె ను ♦ ద్యోగమునకు
తే॥ అతఁడు కవితా ప్రపంచ వి ♦ హాయసమున, రంగురంగుల భావ తు ♦ రంగమెక్కి
చివురు మోడాల మేడల ♦ చెఱఁగులందు, కదము ద్రొక్కించు నేరుపు ♦ గలుగుదిట్ట.

౫౧

తే॥ అతని తమ్ముఁడు మునిరత్న ♦ మకలుషితుఁడు, కల్ల కపటము లెఱుఁగని ♦ కర్మయోగి
పుడమి తల్లికి ముద్దుల ♦ పుత్త్రుఁ డగుచు, నాత్మ కర్పూర మంటించి ♦ హారతెత్తు.

౫౨

తే॥ పుణ్యపురుషుఁడు శ్రీపెద ♦ బుచ్చిరెడ్డి, కడుపుచల్లఁగ బిడ్డలఁ ♦ గాంచియటుల
వారిఁ జదివింపవలయు నే ♦ ర్పాటు చేసె, విద్యయే కద యుత్తమ ♦ విత్తమరయ.

౫౩

ఉ॥ వారలలోన జ్యేష్ఠుఁ డన ♦ వద్య చరిత్రుఁడు నీతిమార్గ సం
చారుఁడు శేషయార్య గురు ♦ సన్నిధి నొచ్చెములేని శిష్యుఁడై
నేరిచెఁ దేనె తెల్గు రవ ♦ ణింపుల నింపుగఁ బుట్టినంతనే
సౌరభ సంపదల్ నెరయఁ ♦ జల్లవె కొన్ని రకాల కోరకాల్.

౫౪

తే॥ ఆతఁ డెద్దనపూడి వం ♦ శామృతాబ్ధి, హాల్లకపతి శేషాచార్యుఁ ♦ డలఁతివాఁడె
పరమ వేదాంతవేత్త స ♦ త్పండితుండు, శిష్యుని దనంత వానిగఁ ♦ జేయఁ గలిగె.

౫౫

తే॥ పూవువలన నెత్తావి నె ♦ త్తావివలనఁ, బూవునుం గౌరవంబును ♦ పొందునటుల
శిష్యువలన దేశికుఁడు దే ♦ శికునివలన, శిష్యుఁడును కీర్తిచేఁ బ్రకా ♦ శించినారు.

౫౬

తే॥ ఎన్న వయసునఁ బిన్నలఁ ♦ బిన్నవాఁడు, విజ్ఞతం జూడఁ బెద్దలఁ ♦ బెద్దవాఁడు
తండ్రి హరికథలెల్ల శు ♦ ద్ధ ప్రతులుగ, వ్రాయునంత రాములమదిఁ ♦ బాయువవియు

౫౭

క॥ మంగళకరుఁ డగు రాముని, సంగీతముచే నుతింపఁ ♦ జను నని కొడుకున్
చెంగయయను గురునికడన్, సంగీతము నభ్యసింప ♦ జనకుఁడు పనిచెన్.

౫౮

తే॥ గానకళమీఁద ననురక్తుఁ ♦ డైన బుచ్చి, రాట్సుతుండును నాల్గు వ ♦ ర్షముల కాల
మభ్యసించిన సంగీత మట్లు నిలువ, గురుఁడు చెంగయ్య చేరెను ♦ పరమపదము.

౫౯

తే॥ పట్టుఁగొమ్మ తప్పిన తీవె ♦ పగిది నుండు, కొడుకుఁ గని బుచ్చిరెడ్డి వ్యా ♦ కులతనొంది
విమల గాంధర్వ విజ్ఞాన ♦ విదుఁడగు మఱి, యొక్క గురువు నన్వేషించు ♦ చుండునంత

౬౦

క॥ శ్రీరఘురాముఁడు పిలిచిన, కారణమున బుచ్చిరెడ్డి ♦ కైవల్యంబున్
జేరెను భగవంతుఁడె తా, నైరమ్మనఁ బోక తప్పు ♦ నా యెవ్వరికేన్?

౬౧

తే॥ పితృ వియోగ దుఃఖము పీల్చి ♦ పిప్పిఁ జేసె, మేటి సంసార భారము ♦ మీఁద వ్రాలె
సరవి సంగీత విద్యకు ♦ స్వస్తి గలిగెఁ, గ్లిశిత మయ్యెను రాముల ♦ లేఁత యెడఁద.

౬౨

మ॥ పదునేడేఁడులు పూర్తిగాక మునుపే ♦ ప్రాప్తించునే యిట్టి యా
పద లాహా! యిది దైవచిత్ర మయినన్ ♦ బంగార మంగారిణిం
బదునా ర్వన్నెలతోడ వెల్వడు క్రియన్ ♦ బాలుండు శ్రీరాము లా
పదలన్ గ్రుంగియు రామ మంత్రి మహిమన్ ♦ భాసిల్లెఁ దేజస్వియై.

౬౩

తే॥ ప్రకృతి శక్తుల కెదురొడ్డ ♦ ప్రాయముండె, మఱియుఁ బితృదత్త నూరాంపు ♦ మంత్రముండె
కొంచెమో నంచెమో భూమి ♦ కూడ నుండె, గళవళము పడ నేటికి ♦ కాఁపుబిడ్డ.

౬౪

మ॥ సురలోకేంద్ర హరిన్మగాగ్ర తటినిన్ ♦ శోణాబ్జముల్ విచ్చు బం
గరు వేళన్ వడి నెల్ల మున్నుచనఁ బ ♦ గ్గాల్ సీరమున్ దోత్రమున్
బరమానందమునన్ ధరించి వెనుకన్ ♦ బర్యాత్తి ధాత్రీ శుభం
కరమా కర్షక సార్వభౌమ పదవిన్ ♦ గైసేసె నెంతేనియున్.

౬౫

మ॥ లతికా ముగ్ధ సువాసినీ మణులు మొ ♦ ల్కన్నవ్వులన్ మంగళా
రతు లీయన్ దరుశాఖలన్ బులుఁగుఁ బే ♦ రంటాండ్రు మేల్కొల్పు ల
ప్రతిమానంబుగఁ బాడఁగాఁ బ్రకృతి నా ♦ రాధించెఁ దత్పావనా
మృతమూర్తిన్ హృదయాన నిల్పుకొని నె ♦ మ్మిన్ గర్షకోత్తంసుఁడై.

౬౬

ఉ॥ వెన్నెల వెల్గులన్ నగవు ♦ విచ్చిన గడ్డి సుమాల నీడలన్
గన్నులు మూసి ఝిల్లికలు ♦ కంఠము లెత్తి మనోహర శ్రుతుల్
పన్నఁగ నెడ్ల నీడ్చుకొని ♦ బాన సుభిల్లుప ముక్కువేసి రా
మన్న పదాలతోఁ గపిలె ♦ నాతఁడు తోలె నిశీథ వేళలన్.

౬౭

తే॥ ఎండ కెండి గాలికి సహి ♦ యించినాఁడు, వానలకుఁ దడిసి చలికి ♦ వణఁకినాఁడు
మఱియు రాత్రుల నిద్దుర ♦ మఱచినాఁడు, కర్షకునకు విరామంబు ♦ కలదె చూడ?

౬౮

సీ॥ ముంగారు ముత్యాల ♦ మురువు చినుకులు గాలెఁ, బుడమి పచ్చిక చేల ♦ నును ధరించెఁ
బసుపు పూసికొనిన ♦ పగిది చేలలు పూచెఁ, జింతమ్న బంగారు ♦ చివురు లెత్తె

వాఁగుల విరి తలఁ ♦ బ్రాలు కొన్గలు వోసె, మట్టికాయలఁ గుంకు ♦ మము రహించె
శుకము లేడాకుల ♦ జొన్నపై దండెత్తె, జీంద్రపుల్గులు గొంతు ♦ చించుకొనియెఁ
తే॥ చంద్రికల నాటలాడిరి ♦ జానపదులు, మొలక వోసిరి కుంపట్లు ♦ ముద్దరాండ్రు
మాధవమున ద్వితీయార్ధ ♦ మధ్యమందు, పూజ్యమయి వచ్చె మొలకల ♦ పున్నమంత

౧౯

క॥ ఆ మొలకల పున్నము నెల, రాము లొకానొక దినంబు ♦ రాముని మదిలో
నేమఱక స్మరించుచుఁ దన, భూమికడకు బను లొనర్పఁ ♦ బోయిన వేళన్.

౨౦

తే॥ కలకలారవములు సల్పు ♦ ఖగ కులంబు, జొన్నచేల గువ్వలఁ దోలు ♦ కన్నియలును
లేఁత యెద నెట్టి యూహల ♦ కూఁత లిడిరొ, గనిమపైఁ గూరుచుండె నా ♦ కాఁపుబిడ్డ

౨౧

తే॥ అపరదిక్కాంత యలఁదిన ♦ యట్టి పసుపు, డాలుచే సితమేఘ ఖం ♦ డాలు విమల
కాంచన సుమాల విరిసె వృ ♦ క్షముల నీడ, లంతకంతకు దీర్ఘంబు ♦ లగుచునుండె.

౨౨

తే॥ అంబరంకషమగు నశో ♦ కంబుమీఁదఁ, గూరుచుండి బాడిద బెళ ♦ గువ్వ యొకటి
రుచిర కంఠ విపంచి తం ♦ త్రుల బిగించి, యపుడు 'శ్రీకృష్ణ! శ్రీకృష్ణ!' ♦ యనుచుఁ బాడె

౨౩

తే॥ అటకు దూరాన నెచటనో ♦ హాలికుఁ డొకడు, కసవుమోపెత్తుకొని యింటి ♦ దెసకుమరలి
పోవుచుండెను దేహము ♦ పులకరింపఁ 'బదవె భద్రాద్రి' కనుపాట ♦ పాడుకొనుచు

౨౪

తే॥ గాలి కల్లాడు కానుఁగు ♦ పూలగొమ్మ, పైని వ్రాలి పూసల బెళ ♦ వాయి యొకటి
కొసరి ముత్యాల సెట్టిని ♦ కొట్టు లడిగె, నెచట విత్తుటకో యేమొ ♦ యెఱుఁగరాదు

౨౫

సీ॥ బంగారు పిచ్చిక ♦ మంగళాచరణాన, బులుబులు తారలు ♦ పొదలి మ్రోసె
కొండకోడి సిపాయి ♦ కూజితంబులలోన, వీణానినాదంబు ♦ ప్రిదిలి చిందె
పికిలిపిట్ట నెలంత ♦ పిక్కిలిక్కులలోనఁ. గంచు పిల్లనగ్రోవి ♦ కదలి పలికె
కొంజు కన్నియ మిన్న ♦ క్రమ కంఠములోనఁ, గిన్నెర రవములు ♦ మిన్ను ముట్టె
తే॥ పసుల పోలయ్య రివ్వునఁ ♦ బయికి లేచి, పల్లటీల్గొట్టె యొక యీల ♦ వైచి నాఁడు
తరణి యస్తాద్రి కేగు నా ♦ తరుణమందు, రాగ రంజిత మహ్యాఁగ ♦ ర్షకుని మనసు.

౨౬

తే॥ చివురు టాకుల మెసవిన ♦ చెలువయొకతె, ప్రకృతి పులకింప నొక చిన్ని ♦ పాటపాడె
పరిమళము లూరు బంగారు ♦ విరులవేళఁ, గర్షక కుమారు నెద నెవో ♦ కళలు విరిసె

౨౭

తే॥ శ్యామలములగు నమృత స ♦ స్యముల నడుమ, వికసితములగు గోరంట ♦ విరులనడుమ

౭౮

తే॥ క్రౌంచ మిథునము దుర్గతిఁ♦గాంచి నాఁడు, పుట్టఁబుట్టువు హృదయానఁ♦బుట్టెఁగవిత
కరము ప్రకృతి సౌందర్యమ్ము ♦ గాంచి నేఁడు, కర్షకు సుమనః క్షేత్రానఁ♦గలిగెఁగవిత

౭౯

తే॥ రారా! రామన్న! యనుట నా♦రంభమయ్యె, రామ! రఘురామ! యనుటతో♦ రక్తిఁగట్టె
చిలుక విరిఁబోణి యొక కొంత♦చేయొసంగ, రామ! రాఘవ! రఘువీర♦రామ! యనియె.

౮౦

సీ॥ గోరువంక దొరసాని ♦ గోనబు పల్కులనుండి, సీసంపు గుంఫనల్ ♦ చెంగలింప
నెమ్మి వేలుపు చాన ♦ నీటు పాటలనుండి, యాటవెలఁది సొంపు ♦ లతిశయింప
తేనె దొంగల జేని ♦ కూని రాగమునుండి, యుత్పలంబుల మధు ♦ వుత్స్రవింప
మలయానిల కుమారు ♦ మందగతులనుండి, మత్తేభ గమనంబు ♦ మల్లడింప
తే॥ మంజరులు నవ్వ వలపుల ♦ సంజవేళఁ, జంపకంబుల నెత్తావి ♦ చౌకళింప
భావ సుమ హారమును కవి ♦ తా వధూటి, బాల హాలికు మెడలోనఁ ♦ గీలుకొల్పె.

౮౧

తే॥ ప్రవిమలంబగు రామమం♦త్రము జపించి, హాలికుఁడు పోతన కవీంద్రుఁ♦డయ్యె నాఁడు
హాలికుఁడు రాములుఁ గవీంద్రుఁ♦డయ్యె నేఁడు, హాయి రే! రామమంత్రము♦ మహిమ యెంతొ!

౮౨

ఉ॥ ఓ మధురాంధ్ర వాఙ్మయ మ ♦ హోజ్జ్వల సుందర దివ్య రూపిణీ!
ఏమని పల్కుదున్ రఘుకు ♦ లేంద్రుదయన్ గవితా లతాంగి శ్రీ
రాములు రెడ్డి నట్టులను ♦ రాగమునన్ వరియింప నాతఁడెం
తో ముదమంది మైమఱపు ♦ తోఁ గయితన్ వినుతించె రాఘవున్.

౮౩

శా॥ ఆడెన్ గజ్జెలు గట్టి తైయనుచు నా ♦ హ్లాదంబు నిండారఁగన్
బాడెన్ దంబుర గోట మీటుచు శ్రుతు ♦ ల్పాటించి శ్రావ్యంబుగన్
వేఁడెన్ గండశిల ల్ద్రవించునటులన్ ♦ వెన్నున్ బ్రభున్ రాఘవున్
వీఁడే బాల కవీంద్ర చంద్రుఁడనఁ గ ♦ ల్పించెన్ బ్రబంధంబులన్.

౮౪

తే॥ అమ్మ ముచ్చటపడి కోరి ♦ నందువలన, బుచ్చిరెడ్డి గతించిన ♦ మూఁడు వర్ష
ములకె పెండ్లియైయుండె రా♦ములకుఁ గాన, వ్యయము రాబడికన్న హె♦చ్చగుచు వచ్చె

౮౫

తే॥ అతని యర్ధాంగి నారాయ ♦ ణమ్మ సాధ్వి, సంప్రదాయ కుటుంబ సం♦జాత మఱియు
నత్తకుపచారములు సేయు♦నమల శీల, మఱఁదులను చాల మన్నించు♦ మధురవాణి

౮౬

తే॥ రాము లాయమతో నను ♦ రాగ మొదవఁ, జల్లఁగాఁ గాపురంబును ♦ సల్పుచుండ
దినము లొకకొన్ని యిటుల గ♦తించె నంత, గ్రహగతులు మాఱి రోజులు♦ గడ్డులయ్యె

౮౭

తే॥ కవిత వరియించినట్టి ల ♦ గ్నం బదేమొ, కష్టములమీఁదఁ గష్టాలు ♦ గలుగసాగె
ద్వంద్వముల కిక్కయైన ప్ర ♦ పంచమందు, వెన్నెలలె యెల్ల కాలము ♦ వెలుఁగఁగలవె?

౮౮

తే॥ చెల్లెలికిఁ బెండ్లి యొక్కటి ♦ చేయవలసెఁ, దమ్ములకును వివాహము ♦ ల్దప్పవయ్యె
నడిమి రకపుఁ గుటుంబాలు ♦ నడపువారి,సిలుఁగు లవి శత్రులకునైన ♦ వలదువలదు.

౮౯

తే॥ తాను కవిచంద్రుఁ డయ్యెనే ♦ కాని యాంధ్ర, భారతికి భార్గవికి పొత్తు ♦ పడఁగలేదు
పంటవలఁతి సౌభాగ్యమ్ము ♦ కుంటువడియెఁ, బెద్దతల్లి కవీంద్రుని ♦ ముద్దులాడె.

౯౦

తే॥ ఆంధ్రకవుల చరిత్రమ్ము ♦ నందుఁ గంచు, కాగడా వేసి వెదకినఁ ♦ గానఁబడఁడు
కఠిన దౌర్భాగ్య పతితుఁడు ♦ కాని సుకవి, కవితకును లచ్చి కెందుకీ ♦ కానితనము?

౯౧

సీ॥ తిక్కన్న మెడఁబట్టి ♦ తిండికై మనుమసి, ద్ధి హజారమందు మం - త్రిగ నొనర్చె
శ్రీనాథు నింటిలోఁ ♦ జేరి యిల్లాలుగా, నల్లగుం డెత్తుకొ ♦ నంగఁ జేసె
సూరన్న దాపునఁ ♦ జొచ్చి నంద్యాల కృ, ష్ణునకు విద్దియ నమ్మ ♦ కొనఁగఁజేసెఁ
కవిరాజ రాజశే ♦ ఖరుఁడైన వేంకట, కవి రఘునాథు చెం ♦ గటికిఁ దార్చె.
తే॥ చతురు లగువారికే యిట్టి ♦ గతులు గూర్చు, పెద్దతల్లి రాముల నెట్లు విడువఁగలదు?
గుడులనే మ్రింగుదానికి ♦ గోపురములు, లక్ష్యమే యెంచిచూడ ని ♦ లాతలమున?

౯౨

తే॥ పేదఱిక మెంత యోర్పు నే ♦ ర్పినదొ కాని, కలఁతఁ జెందఁడు సుంత యు ♦ నులికిపడఁడు
మహితమగు రామమంత్రము ♦ మఱవఁబోఁడు, మఱియుఁ గవితాకళా సేవ ♦ మానఁబోఁడు

౯౩

తే॥ పదియుఁ దొమ్మిది వందల ♦ పైఁ బదియును, తొమ్మిదగు క్రైస్తవశకవ ♦ ర్షమ్మునందు
పరఁగఁ బాశాల మధ్యమ ♦ పాఠశాల, నాంధ్ర పండితుఁడుగఁ జేరె ♦ నాతఁ డంత.

౯౪

ఉ॥ మేలును గోరి చెప్పు తన ♦ మిత్రులతో బదు లాడలేక నాఁ
గేలిని మూలవైచి యరి ♦ గెన్ బొరుగూరికిఁగాని యక్కటా!
కాలము చాలిరానపుడు ♦ గాజుల బేరము భోజనానికే
చాల దటన్న సామెత ని ♦ జంబయి తోఁచెఁ గవీంద్ర మౌళికిన్.

౯౫

ఉ॥ ఏనుఁగు నెక్కలేదు ధర ♦ ణీశులు మ్రొక్కఁగ నిక్కలేదు స
న్మానము లందలేదు గరి ♦ మన్ సభలన్ గనకాభిషేకముల్
గానఁడు కాని యేమిటికిఁ ♦ గాఁ గవితా లలితాంగి యాతనిన్
బూని వరించెనో నిముస ♦ మున్ బెడఁబాయ దదెట్టి సాధ్వియో!

౯౬

ఉ॥ ప్రేమమువీఱఁగా హృదయ ♦ పీఠమునం దిలువేల్పు శ్రీరఘు
స్వామి పదంబులన్ నిలిపి ♦ సల్పఁదొడంగెఁ ద్రిలిఙ్గ వాఙ్మయా
రామములోని మ్రోఁడు లవు ♦ రా! ననలెత్తి సుమించునట్లు శ్రీ
రాములురెడ్డి కోకిల తె ♦ లుంగునఁ గ్రమ కవిత్వ గానమున్

౯౭

క॥ జనకస్మృతి యనుకావ్యం, బును మఱి విజయాపజయము ♦ బుచ్ఛయ కర్పిం
చెను తదనంతరము రచిం, చిన కబ్బంబుల నొసంగె ♦ శ్రీరామునకున్

౯౮

తే॥ తేనెలొలుకు పల్కులచే సు ♦ ధీమణి యను,నవలయును కీరవాణి య♦ నంగఁ బద్య
కావ్యము నొకండు మఱి వన ♦ కన్య నాఁగ,నాటకంబును రచియించి ♦ నాఁడతండు

౯౯

తే॥ కష్టపడి వ్రాసెనే కాని ♦ కావ్యములను, లేమిచేత నచ్చొత్తించ ♦ లేకపోయె
స్నేహితుల బల్మి లక్షణ ♦శిక్షణమను, వ్యాకరణము మాత్ర మ్మచ్చు♦పడియె నెట్లొ

౧౦౦

తే॥ వనధి గంభీర గర్భస్థ ♦ వజ్ర మలల, వలనఁ దీరంబునకు నెట్టఁ ♦ బడినయట్లు
గ్రామమున మాటువడియున్న♦కవియశస్సు, పండితులనాల్కకొనలెక్కి♦ప్రాఁక సాగె

౧౦౧

తే॥ పల్లెపాకాలలోనుండి ♦ పట్టణంబు, చిత్పురమునకు మాఱుపు ♦ చేయఁబడియెఁ
దావి కలిగిన విరజాజి ♦ పూవుగాన, కవి యశోజ్యోత్స్న దిక్కులఁ ♦ గడలుకొనియె.

౧౦౨

తే॥ బాలవిజ్ఞాన మభివృద్ధి ♦ పఱచునట్టి, వి యగు సుజ్ఞానబోధిని ♦ విజయ వాచ
కములు బాల వినోదిని ♦ గడఁక వ్రాసి, యచ్చువేయించె ననుభవ ♦ మచ్చుపడఁగ

౧౦౩

తే॥ అరయ సౌభ్రాత్ర రాఘవం♦బభయ రాఘ, వంబు మఱియు విక్రమ రాఘ♦వంబనంగ
రామకథ వచనంబున ♦ వ్రాసి యవలఁ, బ్రౌఢ శైలి విశ్వామిత్ర ♦ వ్రాసినాఁడు.

౧౦౪

తే॥ నూత్న పద జాలములతో వి♦నూతనముగఁ, గల్పవృక్షముఁబోలు ని♦ఘంటువొండు
సంఘటించుట సార్థక ♦ జన్మఁ డయ్యె, నరయ శబ్దార్థ కల్పకం ♦ బనఁబడు నది.

౧౦౫

మంజరి॥ భారత కథ నైదు ♦ భాగంబులుగను, పాండవంబు లనంగ ♦ వచన కావ్యములు
శ్రీకృష్ణుఁ డనుపేరఁ ♦ జెన్నారు గద్య, కావ్యంబును రచించెఁ ♦ గమనీయగతుల
రమణఁ బ్రశ్నోత్తర ♦ రత్నావళియును, గుణమణి శతకంబుఁ ♦ గూర్మి విద్యార్థి
శతకంబు మహిమ పం ♦ చాశతి మంద, లింపు నిప్పటి కలి ♦ నింపుగా వ్రాసె
సరవి సాహిత్య ప్ర♦చారిణీ గ్రంథ, మాలలో నవి కుసు♦మంబులై విరిసె.

౧౦౬

తే॥ నలలితముగఁ బురాణ గా ♦ థలు రచించె, నఖవలకు వేదముంబోలు♦కుఱళుఁ దెనుఁగు
బాసలోఁ రచించెఁ ద్రి ♦ వర్గ మనఁగ, ద్విపద కావ్యమ్ముగాఁ దేట ♦ తెనుఁగు సుధల

౧౦౭

తే॥ కవికుల గురుండు మాన్యుండు ♦ కాళిదాసు, వ్రాసినట్టి కుమారసం♦భవముఁబదియు
నేడు సర్గలు తెనిఁగించె ♦ నిందు గొంత, భాగ మల తెన్గుతల్లిలోఁ ♦ బ్రకటితంబు

౧౦౮

తే॥ తగఁ జతుష్పది యభిధాన ♦ దర్పణమును, ప్రీతిమై సూక్తిసుధయును ♦ నీతి గుచ్ఛ
మును సుభాషిత భండార ♦ మును కలిగిరి, వేంకటేశ మాహాత్మ్యము ♦ వేడ్క వ్రాసె

౧౦౯

తే॥ కాఱు కూఁతల కైతలు ♦ గట్టువడఁగ, భావ కవితా ప్రదీప్తులు ♦ పరిఢవిల్ల
త్వత్పదంచిత శుభచరి ♦ త్రమును వ్రాసెఁ, దెనుఁగు సందేశ మనుపేరఁ ♦ దెనుఁగుతల్లి!

౧౧౦

తే॥ క్షేత్రముల దున్ని పండించు ♦ సేద్యగుణుఁడు, రాము లీనాఁడు సత్కవి ♦ రాజు తల్లి!
కవులఁ బోషించు తేఁడులు ♦ గలిగిరేని, పగులవే కంచుఢక్కలు ♦ బ్రద్దలుగను.

౧౧౧

తే॥ అతని కావ్యగుచ్ఛములెల్ల ♦ నచ్చువేయఁ, బ్రేమఁ జేయూఁతయొసఁగిన♦శ్రీయుతుండు
కొత్తకోట రామస్వామి ♦ కోలఁదివాఁడె? బంధువుం డౌట మన కవి ♦ భాగ్యముకద!

౧౧౨

తే॥ తిట్టినం దిర్గి తానును ♦ తిట్టఁబోఁడు, కొట్టినం దిర్గి తానును ♦ గొట్టఁబోఁడు
నిర్మలాత్ముఁడు తానెకని ♦ నిందుకుఁడ, రెడ్లలోన నపూర్వుఁడీ ♦ రెడ్డిచూడ.

౧౧౩

చ॥ అతని కుమారుఁడుర్ జనకు ♦ నంతటి వాఁడనిపించుకొన్న ధీ
యుతుఁడు నిగర్వి శాంతుఁడు బు ♦ ధోత్తముఁ డంచిత సత్యవాది శ్రీ
పతి పద భక్తుఁ డర్థిజన ♦ బంధుఁడు వేంకట రామరెడ్డి సం
తతముఁ గవీంద్రుఁ దండ్రిగతిఁ ♦ దానును ప్రేముడిఁ జూచు నెంతయుర్

౧౧౪

క॥ ఆ తండ్రి కొడుకు లిరువురు, నాతతముగఁ దన్ను ప్రేమ ♦ నవలోకింపర్
బూతలపట్టు కవీంద్రుఁడు, చేతో మోదమున వ్రాయఁ ♦ జెలఁగుచునుండుర్

౧౧౫

మంజరి॥ కూర్మి నెచ్చెలి యగు ♦ నార్మగ పిళ్ల,యొకనాఁడు నాకడ ♦ కొగి నేగుదెంచి
మన గురుదేవుండు ♦ మాన్యశీలుండు, నిను దోడితెమ్మని ♦ నను పంపినాఁడు
కదలి రమ్మని పిల్వఁ ♦ గానిమ్మటంచు, నిరువురు మాయన ♦ యింటి కేగితిమి

మాగురుదేవుండు ♦ మము సాదరమునఁ, గూర్చుండఁ డని పల్కి ♦ కుశలంబులడిగి
కంబ కవీంద్రుని ♦ కావ్యంబుఁ జూపి, యీ పవిత్ర చరిత్ర ♦ నెవ్వారు గాని
తెలుఁగు సేయరు కాన ♦ దీనిని మనము, తెలిఁగింపఁ దలపోసి ♦ పిలిచితి మిమ్ము
మీ శక్త్యలకొలంది ♦ మీరు నీకార్య, మందు పాల్గొనుఁ డంచుఁ ♦ బొందుగాఁబల్కె

౧౧౬

తే॥ అప్పటికిఁ దల లూఁచితి♦ మంతె కాని, పిదప నామాటయే తల ♦ పెట్టలేదు
తుదకు మద్గురువర్యుఁడే♦ మొదలు పెట్టి, కంబరామాయణముఁ బూర్తి ♦గా రచించె

౧౧౭

క॥ భారత భాగవతముల ప్ర, కారము పలు విధములైన ♦ కైతలతో నిం
డారక కంబుని కబ్బము, శ్రీరామ కవీంద్రుఁ డొకని ♦ చే విలసిల్లెన్

౧౧౮

మ॥ కవులుం బండితులున్ విమర్శకులుఁ బె ♦ క్కండ్రుండ నీ యాంధ్ర కా
వ్య విశాలావని నన్ను బోలు నొక య ♦ ల్పజ్ఞుండు శ్రీరామ రా
ట్కవితా సంపదలన్ సమీక్ష సలుపం♦ గాఁ బూనుటల్ క్షీర సిం
ధువుఁ గవ్వంబునఁ జిల్కఁ బోల్కి యగుఁగా ♦ దో! దివ్య తేజస్విని!

౧౧౯

తే॥ కావ్య పుత్త్రికలే కాక ♦ కలిగి రతని, యాత్మసతికి సుధీమణి ♦ యాదిగాఁగఁ
గ్రమతఁ గోమలవల్లి స♦రస్వతియును, రుక్మిణియు నాఁగఁ గూఁతు లా♦రూఢమతులు.

౧౨౦

క॥ మనమును గమ్యస్థానం, బును చేరితి మక్షి పర్వ ♦ మును గాంచుము రా
మునిభజనఁ బునీతంబై, తనరెడు మద్గురు గృహంబుఁ ♦ దల్లీ! యింకన్.

౧౨౧

క॥ లోనికి దయచేయుము స, న్మానములన్ గొను మతండు ♦ నమిత హృదయుఁడై
నానావిధ కృతి భూషల, చే నిను గైసేసి రుచిర ♦ సేవ ల్సేయున్

౧౨౨

మ॥ వర నారాయణ పాద పంకరుహ సే వా ♦ లబ్ధమై త్వత్కృపా
భర దృగ్దోహదమై శుభంకరమునై ♦ వర్ధిల్లి యస్మ త్కవి
త్వ రసాలం బొనఁగెన్ ఫలం బొకఁడు శ ♦ శ్వత్కీర్తి దీపింప నో
గురుదేవా! కొనుమయ్య! దక్షిణగ నా ♦ కున్ జాలు మీ దీవెనల్.

శ్రీ కృష్ణా!

---

రంగమనాయని నాగనరసింహులు,

తుంబకప్పము.

శ్రీరామ.

# కంబరామాయణము

## పీఠిక.

శా॥ శ్రీ కల్యాణ గుణాకరుండు రఘు వం ♦ శీయుండు సీతారమా
లోక ప్రాభవహృష్టచిత్తుఁడు కృపా ♦ లోలుండు ధర్మక్రియా
లోకాదర్శ విశిష్టమూర్తి గుణపా ♦ లుం డిష్టదైవంబు ది
వ్యాకారుండిడు నిత్యభక్తియు నభీ♦ష్టార్థంబు లెల్లప్పుడున్. ౧

మ॥ జగతీక్షేమము కోసమై విపుల క ♦ ష్టవ్రాతముల్ సైఁచి లో
కగణేయంబుగ సాధ్వియిన్నయను వి ♦ ఖ్యాతిం బురాణించి భ
ర్తృ గుణశ్రేణికి వన్నెగూర్చిన ధరి ♦ త్రీ పుత్త్రి శ్రీరామ హృ
త్సగుణాఢ్యయ త్రిలోక మాత యిడుఁగా ♦ తన్ మాకు నిష్టార్థముల్ ౨

తే॥ ధరణి జాతా హృదానంద ♦ దాత దైత్య, వంశ నూతన శమనుండు ♦ భక్తవరుఁడు
సాంద్ర సుశ్లోక యుతుఁడు జి♦ తేంద్రియుండు, పావని యొసంగుఁ గావుతఁ♦బట్టుదలను

తే॥ భిక్షుకుండయ్యు సర్వదా ♦ భీష్టదాత, ప్రేత భూవాసి యయ్యుఁ బ ♦ విత్రమూర్తి
భూతమిత్రుఁడయ్యును భయ♦త్రాతయైన, శివుఁ డొసంగుత మాకుస♦చ్ఛివములెపుడు

తే॥ శూలి హాలాహలము గ్రోల - జాలి నొంది, సర్వదోషంబులన్ మాన్చి ♦ శంకరత్వ
మొనర నిల్పు నపర్ణాష - ధిని సతంబు, ధ్యాన మొనరింతు నారోగ్య - దానమునకు

చ॥ జగముల సృష్టితో భవము - సార్థము గాదని సద్గుణాళిఁ బొం
దుగఁగలిగించి వాని నెడ - ద్రోచి చరించు జనంబుఁగాంచి యి
మ్మగు మదియిచ్చి దానికి మ - హోంచిత విజ్ఞత తోడుసేయు న
త్యగణిత చిత్రయంత్రవిదుఁ - డబ్జభవుండు ప్రసన్నుఁడయ్యెడున్. ౩

చ॥ జగమునఁ బ్రాణి కోట్లు పలు - చందములై యలరార వానికిన్
మొగముల నొక్కటొక్కటికిఁ - బోలికలందు విభేదపద్ధతుల్
తగవుగఁ జూచితేయను వి - ధాతకు నాదవిభేద లీల ప
ల్వగలయియుంటఁ జూడుమను - భారతి యిచ్చుత మాకు వాగ్విధుల్. ౪

ఉ॥ నిక్కిన వేడ్కఁ దొండమున - నీరధి తోయముఁ బీల్చి చిమ్మినన్
మక్కువతోడఁ జిమ్మఁగ న - మర్త్యులు భీతినిఁగాంచి యయ్యరో!
యెక్కడినీర మేడజగ - మేడ చరాచర కోటి? నిల్పవే
గ్రక్కున నన్న సంతసిలు - గంధ గజాస్యుఁడొసంగు భద్రముల్. ౫

తే॥ అరిది విలుకాని యుజ్జ్వల - శరము వోలెఁ, బరహృదయ లగ్నమై తల-దిరుగఁజేయు
కావ్య రణ విహారులను స-త్కవులఁ దలఁతు, రసముచిప్పిలుత్రోవ పెం-పెసఁగుకొఱకు.

తే॥ అప్రగల్భులు చరణ వి, న్యాసమందు, కానఁగా జన నీరాగ - కారకులును
విప్రలాపులు బాలక - విధము గొన్న, కవుల వాక్కుల మోదంబు - దవుల కున్నె? ౧౦

మ॥ అని చిత్తంబున నెప్పుడుం దలఁచు నే - నామోదముంజెంది పా
వన చారిత్రుఁడు రాముఁడిచ్చు తెలివిన్ - బాగోగులంగాంచి యా
తనువున్ దేవుఁ డొసంగి నందులకు ని - త్యంబైన లోకార్చనం
బొనరింపందగు త్రోవయేదియనుచున్ - యోచించి నిర్ణీతినై.

చ॥ హరికథ లెవ్వరెందదుగ - నప్పుడ ప్రీతిగఁ జేయుచుంటిఁ బా
మర జన రంజకంబుగ సు - మారొక యిర్వది వత్సరంబు లా
సరణియు మానవాళికి శ్మ - శాన విరాగిత చందమాటచే
మఱియొక త్రోవఁబోవ మది - మార్చితి బాలురకై శ్రమించితిన్

ఉ॥ బాలక పాళికిం దగిన - భావములం బహుపుస్తకంబులం
బోలఁగ వ్రాసితిం దెలివి - పుట్టఁగ నక్షరరాజి నుండి ని
ర్వోలగ మంచిపాఁడితి వ - రించెడు దాఁక నవీన పద్ధతుల్
గ్రాలఁగ వాచకంబులు పు - రాణకథల్ తగు శబ్ద శాస్త్రముల్ ౧౩

ఉ॥ పట్టుగ శబ్దకోశమును - వ్రాసితి నొక్కటిఁ గొన్నియేండ్లు నా
కట్టెయెడన్ జనించి విశ - యంబొకఁ డచ్చు పడంగ నేదియుం
బట్టొక యింతలేదను నె - పంబున నాఁపితిఁ జిన్నకోశమున్
నెట్టన వ్రాసి యచ్చిడఁగ - నేర్చితి నెట్టులొ వెల్వరించితిన్. ౧౪

చ॥ అరుదగు శబ్దజాలముల ♦ నారసి కూర్చిన గొప్పకోశ మ
ట్లఱుగొఱలేని పద్ధతుల ♦ నందిన దయ్యది యట్టులుండియున్
గరగరికై పవిత్రమగు ♦ కావ్యములన్ రచియించి తత్ఫలం
బరయమ యంచనుత్సుకుఁడ ♦ నైతిని మానితిఁ గొంతకాలమున్. ౧౫

చ॥ అయినను వ్రాయుచేయియు ను ♦ దారునిచేయియు నూరకుండవన్
వయినము క్రొత్తకాదు పని ♦ పద్ధతి చర్విత చర్వణంబుగా
ని యనువు దోఁప నెయ్యది గ ♦ ణించి రచింపఁగ నొసటంచు ని
శ్చయ మొనరింపఁగాక కడ ♦ చన్నవి కొన్ని దినంబు లిట్టులే. ౧౬

చ॥ అఱవమునందు కొన్ని మహి ♦ మాయుత కావ్యము లున్నవంచు నే
నఱుగొఱ లేక వింటి నపు ♦ డప్పుడు ద్రావిడ పద్యజాలముల్

తెలుఁగువడంగఁ గంటిఁ బరి ♦ తృప్తివహించి తదర్థపుష్టికై
తెలుఁగువ తోడ నించుక త ♦ దీయ సరస్వతి సేవ సేసితిన్. ౧౭

ఉ॥ ద్రావిడ భాషయందుగల ♦ ధర్మనిధానము వేదతుల్యమున్
ధీవర వాక్యులన్ సతము ♦ తేజిలు నానుడి గాఁగ నాఁటఁజుత్
శ్రీవరు సత్కృపన్ దెనుఁగు ♦ సేసితి సీతికిఁ బావలంబునై
పావన మాట బానికిఁ ద్రి ♦ వర్గము నా సభిధానముంచితిన్. ౧౮

ఉ॥ కంబని యింటి కంబమును ♦ క్రమకవిత్వము చెప్పనేర్చునన్
పంబిన నానుడిం బరఁగు ♦ ప్రాక్తన సత్కవి చక్రవర్తి యా
కంబని రామ సత్కథను ♦ గాంచి మనంబున నెక్కుడుత్సుక
త్వంబు వహించితిం దెనుఁగు ♦ బాసను తచ్చరితన్ రచింపఁగన్. ౧౯

చ॥ చిటిపొటి పద్దియంబుల ర ♦ చించుచు నుంటినిఁగాని యొక్కటన్
బటుతర కావ్యమొక్కటియు ♦ బంధురరీతి రచింపనైతి నా
కెటులు లభించు రామ ధర ♦ యీశ్వరు సత్కథ వ్రాయ శక్తియుం
చటమట నొంపుచుంటి మది ♦ యంతగ ధైర్యము నూనకుండుటన్. ౨౦

తెనుఁగునఁ బోతరాజకవి ♦ ధీరున కెంతటి దొడ్డకీర్తి గ
ల్గినదొ తలంప నట్టి గురు ♦ కీర్తియొసంగును ద్రావిడంబునన్
ఘన కవిచక్రవర్తి యనుఁగు ♦ కంబున కట్టి మహానుభావు వ్రేఁ
కనయగు భావ విస్ఫురిత ♦ కావ్యము తెన్గొనరింప శక్యమే? ౨౧

చ॥ వననిధి కేఁకమెత్తుక్రియ ♦ వర్తిలు నిప్పని పూనుకొంట యొ
ప్పని తగవంచు మీఁద నగు ♦ బాటగునంచును జంకె యూరకుం
టను విని యొక్క లేఖను స్ను ♦ టంబుగ వ్రాసెను రెడ్డివంశ పా
వనుఁడు మహోన్నతాశయుఁడు ♦ వారక వ్రాయఁగఁ బ్రోత్సహించుచున్.

ఉ॥ దవ్వులనున్న షట్పదము ♦ తామరసంబు రసం బెఱింగెడిన్
దవ్వులనున్న భాస్కరుఁడు ♦ తన్మృవికాసముగూర్చు నట్లు దా
దవ్వులనున్న యొక్క సదు ♦ దారుఁడు వ్రాయుము రెండుభాషలం
దెవ్వఁడు నేర్పుగల్గు నతఁ ♦ డిమ్మెయిఁ దనంచు లిఖించె లేఖికన్. ౨౩

ఉ॥ కోరకయున్న జీవనముఁ ♦ గూరిమి మీఱఁగ జీవకోటికిన్
వారిదమిచ్చునట్లు గుణ ♦ వంతులు కోరక యెల్లవారికిన్
గోరికలం గ్రహించి యొసఁ ♦ గూర్చుట నైజము నన్ను గూర్చి యా
ధీరవరుండెఱింగి పరి ♦ తృప్తిమెయిన్ లిఖియించె లేఖికన్. ౨౪

చ॥ అతని మహోన్నతాశయము ♦ లారసిపల్కఁగ నాతరంబె? మా
యత బెజవాడ వంశ కల ♦ శాంబుధి సోముని రామచంద్ర సం
స్తుత మహనీయనామమును ♦ సూరుతెఱుంగనివారులేరు సం
తత గుణదానశూరుల యు ♦ దాత్తయశంబు ముడింగి యుండునే? ౨౫

సీ॥ మావంశ తిలకుండు ♦ మహితకీర్తివిశాలుఁ, డతులితభోగంబు ♦ లంది నతఁడు
ఆంగ్లాంధ్రభాషల ♦ నారితేఱిన దిట్ట, సద్వృత్త నీతి వి ♦ శారదుండు
జన సౌఖ్యమే తన♦సౌఖ్యంబుగాఁ జూచు, కరుణాయుతుఁడు శాంత♦క్రమగుణుఁడు
రసికుఁ డుదారుండు ♦ రాజకీయంబుల, సమహితత్వంబున ♦ సాగుమేటి

ఆ॥ పండితాళి కుటిది ♦ పట్టుగొమ్మ ప్రథిత, కవుల పాలి పెరటి ♦ కల్పశాఖి
బుచ్చిరెడ్డి పాళె ♦ మునసుంఫు బెజవాడ, రామచంద్రరెడ్డి♦రాజనుతుఁడు. ౨౬

తే॥ జాబుఁ జూచిన యంతన ♦ సంతసించి, సట్టుదలఁ జిత్రభాను సం ♦ వత్సరంబు
చైత్రశుద్ధనవమి బృహ♦స్పతిదినమునఁ, గంబరామాయణముఁ వ్రాయఁ♦గడఁగినాఁడ.

తే॥ రామచంద్రక్షితీంద్రుని ♦ రమ్యచరిత, రామచంద్రక్షితీంద్రుప్రే ♦ రణమెయగుట
రామచంద్ర లసత్కృపా ♦ రబ్ధకవిత, యీవు శ్రీరామకవి వీఁక ♦ నేదికొఱఁత?

క॥ అని హితులు ప్రోత్సహింపఁగ, ననుమానము మాని వీడ ♦ కల్లనవ్రాయన్
మొనసితిఁ దిరుపతి కొోకపరి, చనుదెంచెం బనిగ రామ ♦ చంద్రవిభుండున్. ౨౯

ఉ॥ అత్తఱి నేను నేగి ప్రియ ♦ మారఁగఁ దన్ముఖ దర్శనంబు నా
చిత్తమునిూఱి రంజిలఁగఁ ♦ జేసితిఁ జూపితిఁ గావ్యమున్ మహా
సత్తముఁ డాతఁ డోపికను ♦ శాంతముతోఁ బఠియించి తృప్తిలో
నొత్తిన ప్రేమతో మిగుల ♦ బ్రోత్సహనం బొనరించెఁ బూర్తిగాన్. 30

తే॥ కుతుక మొప్పారనతని పీ ♦ డ్కొంటఁబూర్తి, చేసితి స్వభాను సమమార్గ ♦ శీర్షశుద్ధ
పంచమిని దీనిఁదృప్తి న ♦ ర్పించినాఁడ, నింటివేలుపు శ్రీ జాన ♦ కీశ్వరునకె. 31

క॥ నీరామచరిత గావున, నీరామకు నీకు వేడ్క ♦ నెలకొనియెడు నా
శ్రీరామ చరిత్రంబును, శ్రీరామా! ప్రేమమిూఱఁ ♦ జేకొనుమయ్యా! 32

ఓమ్. తత్. సత్.

శ్రీ

# విషయసూచిక.

## బాలకాండము.

# అయోధ్యాకాండము.

# అరణ్యకాండము.

## కిష్కింధాకాండము.

శ్రీ రా మ.

# కంబరామాయణము.

## బాలకాండము

శ్రీరామాయణకావ్యసిద్ధి విధయే సంభావయేయం ముదా
వల్మీకోద్భవ కంబముఖ్య కవి వాక్సూనార్చితాంఘ్రిద్వయమ్
మానుష్యాతిగ వీరకార్యఘటనా సంజ్ఞాపిత శ్రీపతిమ్
రామం శ్యామల కోమలాంగ సుభగం సీతామనోవల్లభమ్.

### అవతారిక.

మ॥ అరుదై యూహల కందరాని క్రియలో ♦ కాక్షల్ విసృష్టించి యో
గిరముంగూర్చి తుదిన్ హరించుట మహా ♦ క్రీడా వినోదంబుగాఁ
బరఁగు న్నైజముగాఁగ నెవ్వనికి నా ♦ బ్రహ్మాండ భాండోదరుం
బరమేశుం గరుణామయున్ మదిసదా ♦ ప్రార్థింతు నిష్ఠారినై. ౧

ఉ॥ జ్ఞానులు నైతిమెవ్వని వి ♦ శాల మహామహిమంబు సుంతయుం
గానఁగలేర యట్టి కరు ♦ ణామయు సద్గుణరాశి వర్ణనల్
పూనియొనర్ప నాతరమె? ♦ పూతచరిత్రుని సర్వమంగళా
నూన గుణాబ్ధిలో మునిఁగి ♦ యోలలొనర్తము రండు భక్తులై. ౩

మ॥ హరి ఓమ్మంచుఁబొలిందుదెం బలుకుచున్ ♦ సాంగంబుగా వేదముల్
సరవిన్ నేర్చిన పెద్దలుం, బ్రథిత భా ♦ స్వద్భోగ భాగ్యంబులన్
ధరణిం గ్రక్కున కూడుగాఁ దలఁచు వి ♦ ద్వాంసుల్, సదా నిత్యమో
క్షరమాదాయక దివ్యపాదములఁ ద ♦ క్కం జూడ రక్ష్యంబులన్. ౪

ఉ॥ బేల గుణంబుగల్గు నొక ♦ పిల్లి ప్రయత్నముతోడ వేడ్కమైఁ
బాల సముద్రముం దఱిసి ♦ పట్టుగ నిండలి పాలు మొత్తముం
గ్రోలెదఁగాక యంచుఁబని ♦ గొన్న విధంబున రామచంద్ర లీ
లా లలిత ప్రభావ విపు ♦ లంబగు దీనిని వ్రాయఁబూనితిన్. ౫

ఉ॥ శాపముచేతఁబోలెఁ దరు ♦ సప్తకముం దొలఁ జేసినట్టి యా
పాపదూరు సత్కథను ♦ సార మనోహరలీల వ్రాసి మున్

దాపసి తద్వచోఽమృతముఁ ♦ ద్రావిన యీ మనవారి కిప్డు నా
చాపల బుద్ధిచే నదియ ♦ చప్పిడి మాటలఁ జెప్పఁబూనితిన్. ౬

తే॥ అపయశం బందఁగా లోకు ♦ లపహసింపఁ, గడఁక దీని వ్రాయఁ గతంబు ♦ గలదె వేఱు
తపసి వాల్మీకి వాఙ్మహ ♦ త్త్వమున పేర్మి, యందఱుఁ గంగ నగుసను ♦ నాసగాక.

తే॥ బహుచతుర గతుల్ వాల్మీకి ♦ పద్యతతులు, వినిన చెవుల నొప్పించు నా ♦ వెగటుకైత
వీణనాదంబు విని చాల ♦ వేష్టఁజెందు *నశునపక్షి నపస్వర ♦ మలఁచినట్లు. ౮

తే. ‡త్రివిధ భాషావిశేషముల్ ♦ తెలియు విబుధ, వరుల కొకమాట చెప్పెద ♦ వసుధయందు
భక్తులును మూర్ఖులును పిచ్చి ♦ వాండ్రు పలుకు, పలుకులెల్ల విమర్శింప ♦ భావ్యమగునె?

తే॥ గదులుగా నాటపట్టులు ♦ గాఁగఁ గీచు, పదుచు గీఁటలఁగని కోప ♦ పడునె శిల్పి?
శాస్త్రవిజ్ఞాన మావంత ♦ జాడలేని, నాకవితఁగని విబుధులు ♦ నవ్వువారె? ౧౦

తే॥ సంస్కృతమ్మున నీరామ ♦ చరితఁదొలుత, వ్రాసినట్టి ¶మువ్వురయందు ♦ ప్రణుతిగన్న
చతుర వాక్యుఁడౌ వాల్మీకి ♦ సరణిఁబూని- వ్రాయఁబోడఁగితి దీనిని ♦ ద్రవిడభాష. ౧౧

తే॥ దశవిధావతారముల ను ♦ త్తమ పదంబు, నయచరిత్రంబు నుత్తమ ♦ నాయకు కథ
నతనిదయచేత నుత్సాహ ♦ యుతుఁడనగుచు, వ్రాయఁదొడఁగితిఁ †బూతల ♦ పట్టునందు

సీ॥ భూరిరాక్షససేన ♦ బూదిగాఁ గావించి, విజయమాలను దాల్చి ♦ వెలయునట్టి
కోదండమను విల్లు ♦ గొనబుగాఁ గరమున, విలసిల్లు శ్రీరాము ♦ విక్రమములు
వినుతించు వారికి ♦ విరివిగా వలసిన, కోరికలెల్లఁ జే ♦ కూరుచుండు
విజ్ఞాన కీర్తులు ♦ విస్తరిల్లుచు నుండు, భుక్తియు భక్తియు ♦ ముక్తి దొరకు.

తే॥ నతని యర్ధాంగి యొకచ ♦ న్న్యాసపన్న, నిఖిల జగదేకమాత ప ♦ ద్మప్రపూత
సీత కరుణాకటాక్ష వి ♦ శేషదృష్టి, వారిపైఁ బ్రసరించు న ♦ నారతమ్ము. ౧౩

౧ నదీపటలము. (౨౦)

చ॥ అతికలుష స్వభావ చప ♦ లాంతముల్తైచను నింద్రియాళియన్
శితవిశిఖంబులున్, మణివి ♦ శేష విఘర్షణ నాదమేదురాం
చిత కుచకుట్మలేక్షణ వి ♦ చిత్రశరాళియు ధర్మమార్గసం
గతిని చరించు కోసలము ♦ నన్ సరయూనదిఁగూర్చి పల్కెదన్. ౧౪

* అపస్వరము విన్నవెంటనె వెలవెలపోయి ప్రాణముల విడుచునది అశునపక్షి.

‡ ఇయల్ (సాహిత్యము), ఇశై (సంగీతము), నాటకము.

¶ వాల్మీకి, వసిష్ఠుఁడు, బోధాయనుఁడు అని అభివ్యాఖ్య.

† జటప్ప వసించు తిరువెణ్ణెయ్ నెల్లూరున కంబకవి వ్రాయమొదలిడెను.

చ॥ పరఁగ విభూతిధారియగు ♦ భర్గునిదేహముఁబోలి మేఘమం
బరమున నేగి యంతటను ♦ మానుగఁ దోయముఁ ద్రావి చందనా
కరకుచయైన లక్ష్మినెనయ ♦ గాటపుఁ బ్రేమను మచ్చయుఁ బలెన్
మురువుగఁ బొల్చు విష్ణువను ♦ పోల్క చరించును మత్పరోపరిన్. ౧౫

చ॥ కలఁచి తపింపఁజేసెఁ దన ♦ గాడిలిమామను సూర్యుఁడింకనే
జలకము లార్చి వానలను ♦ శాంతి వహింపఁ దొనర్తునంచునా
జలధి తెలంచియత్నమున ♦ సాంద్రతరంబుగ నావహించె నీ
లలితనమొప్పి యవ్వలను ♦ లన్ జలదంబులు గప్పు నిచ్చలున్. ౧౬

ఉ॥ వారనిపేర్మి స్వర్ణమయ ♦ భాసురకాంతి హిమాద్రియొప్పఁగా
నీరసమూని త్రవ్వుటకు ♦ నెత్తిన గొప్పవు గడ్డపారలన్
తీరుగఁ, జాపలార్థహతిఁ ♦ దృప్తిని బాపపుసేయు గొప్పవో
దారుని పోల్కి మేఘములు ♦ ధారలవీడుచునుండు నచ్చటన్. ౧౭

ఉ॥ మానసమునొందె ధర్మమును ♦ మన్ననచేయుచు నీతిమార్గముం
బూనిన రాజులింగివలెఁ, ♦ బొల్పుగ జ్ఞానసుధానుసారులై
మానుగ వేదపాఠ చదువు ♦ మాన్యుల కిచ్చిన యాగివోలెఁ బెం
పూనుచునుండు వెల్లువల ♦ యోధ్యకుఁ జేరిన దేశమంతటన్. ౧౮

క॥ తల నడుమను కాళ్ళు దడవుచు, నిలుకడ లేకించుకంత ♦ నిలుచుచు భూభృ
త్కుల సంపదఁగొల్లగొనుచు, చెలచెలువలఁబోలి నడచు ♦ వెల్లున లచటన్. ౧౯

తే॥ కనక మగురువ్వ నెమిలి యీఁ ♦ కెలనుమణులు,గందపుంజెక్కలునుగంధ♦ గజరదాళిఁ
గొంచుఁబోవుడి వెల్లువ♦ లెంచిచూడ, వర్తకులఁబోలె నడచు న♦ వ్వసుధయందు ౨౦

తే॥ పూలగుత్తులు పుష్పిడుల్ ♦ పుష్పరసము, కరుల మదజలమును పాట ♦ కంబుఁగలిసి
వడిగఁబారెడు గొప్పప్ర♦వాహతతి, యింద్ర ధనువులఁబోలి యొ ♦ ప్పెసఁగుచుండు

చ॥ తరువులఁగూల్చుచున్ గిరులఁ ♦ దార్కొని చీల్చుచు నాకుఁగొమ్మలన్
బరువడిగాఁగ వాఁకకొని ♦ పర్వులువారుచు వెల్లువల్ గనన్
గరములు వాఱు సంభ్రమును ♦ గట్టలు రాసంగిన నాఁటి మేటి వా
నరుల కడింది వెల్లువల ♦ నాఁడపుఁబద్ధతి తోఁచు, నయ్యెడన్. ౨౨

తే॥ ఈఁగలును తేట్లు ముసరఁగా ♦ నెల మీఱఁజి, పొంగి నురుగులతో లోన ♦ ముణికిపాటి
పడుచు లేచుచుఁ దీయని ♦ వాదితోడ, పొరలు వెల్లువల్ త్రాగుఁబో ♦ తులనుపోలు

తే॥ తీఁగపడగలతో మద ♦ నాగచయము, తోడఁ బలుకాల్నడలతోడఁ ♦ దొలఁకు దోనల
తోడఁ బళ్లతెంచు వెల్లువల్ ♦ ముడుకు తోడఁ, గడలితోడ డీకొనవచ్చు ♦ కలశిదోఁచు

## సరయూ మహిమము.

మ॥ ఇనవంశోద్భవులైన రాజతతిచే ♦ నెల్లప్పుడున్ మేటిపా
లనమం దెచ్చిరి ధర్మపద్ధతుల లీ ♦ లంబూని వర్తిల్లి సం
బిన యావాహిని తల్లిపాలవలె నొ ♦ ప్పెన్ సర్వదా సర్వథా
ననజాతానన సృష్టియందమరు జీ ♦ వశ్రేణి కన్నింటికిన్. ౨౫

తే॥ కుంకుమము గంధవొడి కోష్ఠు ♦ గోఁగువేఁగి, పొన్న చందన మేలకుల్ ♦ పునుఁగు వట్టి
వేరు చెంద్ర మగురు కురు ♦ వేరు తేన, గలుగుటం జేసి నది యొప్పు ♦ గాలివీచు. ౨౬

చ॥ నిలుకడలేఁగి వర్షమున ♦ నెవ్వడి బోయతలెల్లఁ గేలఁ గ
ద్పులనెద బాఁదుకొంచుఁ బరు ♦ వృల్గొనసాఁగుచు విండ్ల నమ్ములన్
బిలబిలమూఁగి వారుకొను ♦ వెంటల నారయ నెల్వలొప్పె మేల్
గెలుపును గొన్నయుబ్బునఁ ద ♦ లిర్చెడి భూవిభు వెల్వలోయనన్ ౨౭

ఉ॥ పాలుపెరుంగునేయి కడ ♦ వల్లల యుట్లను వారిమ్రింగి ప్రే
గోలల వల్వలం జవిరి ♦ కొంచును మద్దులఁగూల్చుచేగు నా
లీలలఁగన్నఁగాళియ బ ♦ లిష్ఠఫణావళి నాడినట్టి గో
పాలుని లీలలంబలెనె ♦ భాసిలుఁ దత్సరయూ ప్రవాహముల్. ౨౮

చ॥ కలకలమంచుఁ గాఁపులు క ♦ కావికలై పరువెత్తుచుండ ము
న్వలన జలంబు నించి తల ♦ వాకిళులం బడఁద్రోచి పైరులం
గలఁచుచుఁ దుమ్మెదల్ తొలుచు ♦ గంట్ల మణీతతిరాలుచుండఁ గ్రే
వల నెసరేఁగుచుం గరమ ♦ పాఱు గజంబులఁబోలి వెల్లువల్. ౨౯

తే॥ పల్లమును మిట్టగా మిట్ట ♦ పల్లమునుగ, నమము వాఁగుగా వాఁగును ♦ సమముగాఁగ
సకలమును తారుమాఱుగా ♦ నలుపుచుండు, వెల్లువలు కర్మఫలముల ♦ వీఁకఁదోఁచు

ఉ॥ కాల్వలయందు వెల్లువల ♦ గర్జనిసం బరువెత్తు కాఁపులా
కాల్వలఁజూడఁగా నెసఁగుఁ ♦ గంబుకణంబులు పొన్నముత్తెముల్
వెల్వడ వీచికావితతి ♦ వీఁగఁగ నొక్కటి పెక్కుతాచుఁబా
యల్వడి పాఱు వంశము మ ♦ హాద్భుతవృద్ధి వహించు పోలికన్ ౩౧

మ॥ హిమవంతంబునఁ బుట్టి వెల్వడి సము ♦ ద్రేశానుత్రోఁ బ్రేమ సం
గమముంజేయు ప్రవాహమెన్నఁగ మహా ♦ గణ్యంబులై నట్టి వే
దములుం దెల్పఁగలేని బ్రహ్మమనఁ దొ ♦ ల్తన్ మూలమం దొక్కటై
భ్రమచే బెక్కుమతంబు లందిన బుధ ♦ ప్రామాణ్యముం బోలెడిన్ ౩౨

మ॥ మకరందంబులు చిందు సద్వనములం ♦ బద్మాకరశ్రేణిఁ జం
పక సౌగంధిక పుష్పవాటికల ర ♦ మ్యంబైన గుంజాలతా
దిక వేలాయుత పూగ పుంజములఁబొం ♦ దెన్ వెల్లువల్ జీవుఁ డై
హిక కర్మాచరణంబునం దనువులె ♦ న్నేఁ జెందు చందంబునన్. ౩౩

## ౨ దేశపటలము. (౬౧)

మ॥ సరసోక్తుల్ పరివారుచుండ విబుధుల్ ♦ సమ్మోదముం బొంద మున్
వర మాధుర్య కవిత్వరీతిఁ దెలిపెన్ ♦ వాల్మీకి యెద్దాని స
ప్పుర మోదారముఁ గోసలంబు నిపుడే ♦ వర్ణింప మేకొంటిఁ బ్రే
మ రసంబున్ మధువాని మూఁగ కడఁకన్ ♦ మాటాడు చందంబునన్. ౩౪

సీ॥ పొలముల గనిమలం ♦ బొలుపారు ముత్యాలు, కాలువలందు శం ♦ ఖములరాశి
కాలువ దరుల బం ♦ గారు గడ్డలు నెను, ములు పొర్లు పల్లులఁ ♦ గలువ వనులు
చదునైన చోట్లఁ బుం ♦ జములైన పగడముల్, వరిమళ్ల లో హంస ♦ వరచయంబు
బీటినేలలఁ దేనె ♦ పెరల సమూహముల్, తోఁటల యందెల్లఁ ♦ దేఁటి గములు

తే॥ ఇంపు సొంపార నారీతి ♦ నెసఁగుచుండ, సంపదల పెంపు నీకనిట్టి ♦ సరణి దంచు
వర్ణనముసేయ నరుదని ♦ వాసికెక్కె, భాసురంబగు నమ్మహా ♦ కోసలంబు. ౩౫

సీ॥ పల్లంపునేలల ♦ యెల్లలలో నేటి, వెల్లువల్ గాఁ ♦ చు ♦ వెనురవంబు
కాపులు చెఱకుల ♦ గానుఁగ లాడంగ, నగు కిఱ్ఱు రొద లెడ్ల ♦ యదలుపులును
ఆగానుఁగలనుండి ♦ యధికంబుగా వెలు, వడి కడవలఁబడు ♦ పాలరవము
నీటి దరులఁ జేరి ♦ నెఱయుచుఁ దిరుగాడు, సంకు పుర్వుల కీఁచు ♦ సందడియును

తే॥ నీటుగాఁ గోడె లటనటఁ ♦ బోటులాడు, ధ్వనులు అంకెల బెడిదంపు ♦ నినదములును
జలములం దెనుములు పడు ♦ నులివుఁ గలిసి, వింత ఘోషంబు నెగడు న ♦ వ్వీటియందు

సీ॥ నందనంబును పోలు ♦ సుందర వనముల, నమఘలు పురివిచ్చి ♦ నాట్యమాడ
జలము సమృద్ధిగా ♦ వెలయు కొలంకుల, వెలిదమ్మి దివ్వెలు ♦ వెలుఁగుచుండ
నీల ఘనాఘన ♦ నికరంబు నిరుపమ, శ్రావ్యమృదంగ ని ♦ స్వనముసేయ
విరివిగా నెడయక ♦ తెరలుచు నుండెడి, కెరటాలు రంగుల ♦ తెరలు దింప

తే॥ మకర వీణా నినాదంబు ♦ మాడ్కిఁ దేఁటు, లింబుగా నచ్చటచట గా ♦ నంబుసేయ
మెచ్చి నల్లకల్వలు కను ♦ ల్విచ్చి చూడఁ, దనిసి నిండు కొల్వుండుఁ గే ♦ దారవిభుఁడు

సీ॥ ఇందిందిరంబులు ♦ నింపు పెంపొందించు, నిందిరయును తమ్మ ♦ లందు నిలుచు
శైలయాంధ్రదచూపులు ♦ విరివింటితూపులు, కమన యువతుల వ ♦ క్త్రముల నిలుచు

వారాశి దొరకు ప్ర ♦ వాళపత్రికములు, మొగుళ్లయందును ♦ మొనసినిలుచు
సత్యవాక్యంబును ♦ శాస్త్రధర్మములును, జనముల నాల్కల ♦ కోసల నిలుచు

తే॥ శాత్రవులయందు ప్రియులందు ♦ సంచరించుఁ, గోపమనియెడియొకదొడ్డ ♦ కొడిమెగుణము.
ఔర! ఎవరికే వర్ణింప ♦ నలవి యగునె? కోసలంబందు చెలువంది ♦ కొఱలుతీరు

చ॥ జలముల శంఖముల్, తరుల ♦ చాయల బత్త్రిలు, మూలలందు తేఁ
టులు, జలజమ్ములకా సిరి, కు ♦ డుంగములం గమఠమ్ముఁ, లిండ్ల వా
ములఁ దెలిపిట్టలుక, దరుల ♦ ముత్తియముల్, వనులక మయూరముల్
పొలుపుగ గుంపుగుంపులయి ♦ పొల్చును కోసల భూమి నెల్లెడక. ౩౯

సీ॥ మడకలు దున్నఁగా ♦ నెడనెడలేచు బం, గారుపెళ్లలును శం ♦ ఖములు విడుచు
ముత్యాలరాసులు ♦ మునుమిడి చదునైన, పొలముల రత్నరా ♦ సులును వడ్ల
నిండఁగాఁ బచ్చనై ♦ నెఱయు వెన్నులు మీలు, మానుగా రొదసేయు ♦ మధుపవితతి
మృదుల పత్త్రిములతో ♦ మెఱయుచెఱకుతోఁట, లల్లి తామరలును ♦ నల్లగలువ

తే॥ తెల్లపిలసిల్లి యొచ్చట ♦ నేని చూడఁ, గాఁపు పడుచుల మొగముల ♦ కాంతితోడఁ
గలిసి కనులకుఁ బండువు ♦ గలుగఁజేయు, సర్వజననుతమైన కో ♦ సలమునందు ౪౦

సీ॥ వినఁగ వీనుల కింపు ♦ నెనయించు కుఱుచ వీ, ణియల వాయించు వై ♦ణికులు, తేట
కలుద్రావి మెట్టుల ♦ కడనొక్కయింపుగా, వాయించుపాటలు ♦ ప్రతిదినంబు
వెండినాఁ దెల్లనై ♦ వెలయు సౌధముల లే, యెండలుగాయు ప ♦ సిండి చప్ర
మంచములందు ర ♦ మాకుమారుని సంగ, రంబునఁ జెనఁగి వి ♦ శ్రాంతి గొన్న

తే॥ నీలనయనముల్ మెఱుఁగారు ♦ నెమలిచాయ, కుందరదనముల్ పొలుచున ♦ క్కొమరు నెలఁత
లింపుగాఁగొన్న నిద్దుర ♦ యెడయ లేపు, చుండును ప్రభాత మారుత ♦ మొలయు వేళ

సీ॥ చెఱకుగానుఁగ నోటఁ ♦ జెదరి బయల్పడు, తేనియవంటి తీ ♦ పైన రసము
టెంకాయ పాళలఁ ♦ బొఁకంబుగాఁగాఱి, వెల్లువలై బయ ♦ ల్వెడలు రసము
ఉన్నతవనముల ♦ నొప్పారుతరువుల, ఫలములు వ్రయ్యఁగాఁ ♦ గాఱురసము
మానుగాఁబొడవగు ♦ తేనెపెరలనుండి, మదిచవి గొనఁ గాఱు ♦ మధురసంబు

తే. యువతులునుయువకులుకాంక్ష ♦ లూరఁ ద్రాల్చు, పూలసరములనుండియు ♦ బొలుచురసము
మేరమీఱి వెల్లువలయి ♦ వారిరాశిఁ, జొరఁగఁ ద్రావియందలి మీలు ♦ చొక్కుచుండు.

సీ॥ కలుద్రావుచోఁగాఱి ♦ కానంగనగు చొంగ, పొక్కులు వెలయుకాఁ ♦ పులు కడంక
సంగీతముంబోలి ♦ చవులూరఁజేయు ప, ల్కులువల్కు తమ వెలం ♦ దుల విశాల
నయన వదన చర ♦ ణ కరాది కంబుల, కుపమలై జగమున ♦ నున్నతిగొని
యొప్పారు తమ్ములు ♦ నుత్పలాదికములు, దక్కఁదక్కినకల్ప ♦ తసరకుంట్ల

తే॥ యెఱిఁగి తీసిపై వఁగవారి ♦ యెడఁదయొప్ప, కట్టులిట్టు లూరక తిరు ♦ గాడుచుంద్రు
యువకులొకయప్పు యువతుల♦యొప్పుప్రేమఁ, బడసి రేనియుమఱిత్రో యు♦విడువఁగలరె?

చ॥ కడలియుఁ గ్రొత్తనీట జల ♦ కంబులుసేయు పడంతు లొప్పుగా
జడలధరించు పూ లగురు ♦ చందనగంధమె వీచుచున్న న
క్కడి వలకాంద్రు వాలు కడ ♦ కన్నులఁజూడఁగ రేఁపు తేనె ప
ల్కడరు మెఱుంగుఁబోండ్ల పొలు ♦ పారెడి తీరుల నెన్న శక్యమే? ౭౪

ఉ॥ ఆమనిఁ గామినుల్ జలక ♦ మాడిన నీటి మహత్త్వమెన్నఁగా
నేమగుఁ? దోఁటలుల్ బాలము ♦ లెచ్చటఁజూచిన జిడ్డువాఱి యా
చామ లలందినట్టి మృదు ♦ చందన పంకము పేరినట్టి త
ద్భూమిని తేంట్లు గుంపులయి ♦ మూఁగును తేనియ నానునాసమై. ౭౫

చ॥ పొలముల వాలుగంటులను ♦ పోలి చరించెడి రాజహంసలి
మ్ముల జలజంపుఁబానుపులఁ ♦ బొల్పుగ నుంచిన పోతకమ్ము, లం
దులఁ జరియించు బల్లియలు ♦ దూడల నెడ్డఁదలంచి చేఁపఁ జా
ళులు గొను పాలఁద్రావి నెల ♦ లుఱ్ఱ మఱిపై చుచుఁ గప్పగంతులన్. ౭౬

చ॥ పికవితతుల్ వినోదముగఁ ♦ బెండిలిసేయఁగఁ, గన్నుద్రిప్పుపొం
దిక గలస్త్రీల నర్తనపు ♦ తీరులకంటె మయూరసంఘముల్
రకముగఁగొమ్మలం దలర ♦ రాజ మరాళము లబ్జశయ్యఁ గూ
రికిపడ, మేలుకొల్పులు ద్వి ♦ రేఫతతుల్ దగఁబాడుచుండెడున్. ౭౭

సీ॥ కులధర్మముల కను ♦ గలమగు పడుచుల, వెదకి పెండిలి నెఱ ♦ నేర్చువారు
శ్రద్ధతో స్వచ్ఛాయ ♦ గిదలు కెరఁశివచ్చు, పాటల సుఖములు ♦ పడయువారు
దేవామృతము కంటెఁ ♦ దీయనౌ సద్ధర్మ, విషయసంబు లడుగుచు ♦ వినెడువారు
అతిథుల మోముల ♦ నరసి యన్నంబిడి, యత్యధికానంద ♦ మందు వారు

తే॥ కినుకయూరక మదిగొని ♦ కనులకంటెఁ, దామ్రమగు జుట్టఁజూపి యు♦త్సాహమునను
వీరగుణాగుప్తి నును తేని ♦ పిడుకోళ్ళఁ, బోరరేఁచుచు గెలిపిమోఁ ♦ బొదలు వారు.

చ॥ పరువపుమన్నలొండొకటి ♦ భగ్గునఁగోపము గొన్నపిడ్డులన్
వెరవునఁ దాఁకుచున్ బగయుఁ ♦ బెచ్చు పెరుంగఁగ నెల్లచోటులన్
విరిసిన మబ్బు రెండగుచు ♦ వింతగఁ బోరినయట్లు పోరు పో
రరసి ద్విరేఫముల్ నెగసి♦ యార్వ, ముదుల్ పిడ నార్చువారలున్. ౭౮

చ॥ మొలచుచు నున్న తామరల ♦ మొల్కలు నల్లఁ బసిండి ముత్తెముల్
కొలఁగఁగద్రోచి రత్నవిత ♦ తుల్ సొదరఁ బెలిసంతుషపుద్యులున

బలవరమొందఁగాఁ గమఠ ♦ వర్గము మోదమ్మునొందఁగఁ జాళ్లఁజేఁ
పలు కడుఁద్రుళ్ల దున్నలను ♦ వార కపల్తురు కాఁపు లచ్చటన్. ౫౦

ఉ॥ పాడియొటింగి యోసవిడి ♦ పద్ధతికోపమునూని కోరఁగాఁ
గూడిన వానిఁబొంది జప ♦ కోటికి మేలొనరించి కీర్తి వ
ర్వ్యాడెడు తేఁడు కావ బరు ♦ వంతయు నీఁగుచు నూర్చుభూమినా
నోడలు వస్తువుల్ విడిచి ♦ యొందు విరామము నుప్పళంబులన్. ౫౧

ఉ॥ కోసినయోడె లాకసముఁ ♦ గూడఁగ వాములనేసి పెద్దవా
ర్చేసిన బోధతో నుతిచి ♦ చేరిచి కళ్లపు బిచ్చగాండ్రకున్
వేసియుఁ దక్కువానిఁ దమ ♦ విందుల తోడ భుజింప బండ్లకుం
బోసి ధరిత్రిక్రుంగఁ గొని ♦ పోదురు కాఁపులు ధాన్య మిండ్లకున్. ౫౨

ఉ॥ తీఁగలఁగాచు కాయలును ♦ తీయని వాసనగ్రమ్ము తోఁటలన్
గాఁగల పండ్లు కందములు ♦ కాయల ధాన్యము మళ్లనుండియున్
రాఁగల ధాన్యముల్ నిలువ ♦ రంబుగఁ బూవుల నిల్చి తుమ్మెదల్
తేఁగల తేనెపోల్కిఁదగఁ బెత్తురు ♦ మెత్తఁగఁ గాఁపు లిండ్లకున్ ౫౩

సీ॥ ఎచ్చోటఁగాంచిన ♦ నింపుసొంపారంగ, విప్రులు తమయిండ్ల ♦ విందులుగను
బంధువులును గాఁగ ♦ వచ్చినవారితో *ముత్తెఱంగుల పండ్లు ♦ ముందు గొనుచు
బలువగలైనట్టి ♦ పప్పులతోవాని, నింపి నెల్లువ వోవు ♦ నేతితోడ
గడ్డపెరుంగుతోఁ ♦ గండచక్కెరతోడ, నడుమ నడంగు న ♦ న్నంబుతోడ

తే॥ మృదులప్రియవాక్యములతోడ ♦ ముదముతోడఁ,దనివిదీఱనిదేవాప్ప ♦ తంబుఁబోలె
భోజనము చేయుచప్పుడు ♦ పూర్ణ మగుచు, నెప్పు డొప్పారు నప్పురి ♦ చొప్పు గొప్ప.

తే॥ కాఁపు చెలువల వదన పం ♦ కజములందు, నెలయు కాటుకకన్నుల ♦ లలితరీతి
నొప్పు నాఁడుఁదేంట్లనిభ్రమ ♦ గప్ప వలచి,కడఁక మాగాణిఁ దిరుగాడు ♦గండుఁదేంట్లు.

తే॥ కెరలు చూపుల మారుని ♦ గెలిచినట్టి, పంట పడఁతుల గబ్బిగు ♦ బ్బలు కడింది
మగలఁగినిసి లోఁగొను;నట్టినుళ్ల ప్రక్కఁ, బొళకలుద్రావి మదియించు ♦ వాలువిూలు

తే॥ నేలవ్రాలిన మేఘంపు ♦ నికరమనఁగఁ, జల్లసీటను దిరుగాడు ♦ నల్లయెనుము
లెదలఁగ్రేపులఁదలఁపఁగాఁ ♦ బొదుఁగుచేపి, పాలుగాఱ గోముగ వరి ♦ పైరు పెరుఁగు.

ఆ॥ నిండుబానసములు ♦ నినదింప వార్చిన, కడుగుసేటిచాళ్లు ♦ క్రముక వనము
లందు చొచ్చియచట ♦ నమరంగ నాటిన, యెఱ్ఱవడ్లపైరు ♦ నెలమిఁ బెంచు. ౫౮

ఆ॥ తామ్రచూడములు ప ♦ దంబులఁ జిదిగిత్రో, యంగనైన కుప్ప ♦ లందు మెఱయు

* ఖాంటి, పనస, మామిడి.

మణుల జీనువాలు ♦ మిఱుగుఱుంబుర్వులు, చెంచి గూండ్లలోన ♦ నించుచుండు. ౫౯

ఉ॥ చేతుల సంకుగాజులును ♦ చేరెడఁ గవ్వములాడు సవ్వడుల్
చేతముఁ జల్లఁజేయఁగను ♦ చెన్నగు కౌనులు వీఁగియాడఁగా
వ్రేతలు పెర్గు చిల్కుదురు ♦ వేసలు లూడఁగ మైచెమర్పఁగన్
బ్రీతమనస్కులైన తమ ♦ పిల్లలు నిద్దుర వీడి లేవఁగన్. ౬౦

చ॥ చిలుకల పిల్లలుం బలుకుఁ ♦ జెన్నుగఁ బండిన కొజ్జచేలలోఁ
బులుఁగుల పిల్లలుం బలుకు ♦ భూజ నికుంజములన్ మనోజ్ఞతన్
గొలఁకుల తేఁటులుం బలుకు ♦ గుమ్మని వాసన వీచు తమ్ములన్
గలకల సువ్విపాట లెస ♦ కంబుగ దాతలయిండ్ల నిండెడున్. ౬౧

క॥ కోసిన వక్కలనేరిచి, త్రోసిసయని దొంగ చూపు ♦ తూఱని పడుచుల్
చేసిన యిండ్లకు మంటలఁ, బోసిన తఱిఁ జిందినవియు ♦ ముత్తెములె చుమీ! ౬౨

తే॥ కొదమ గొఱ్ఱెలు గాంచిన ♦ బెదరులేని, గుంద్ర మెలికల కొమ్ములఁ ♦ గొఱలుతగరు
లుఱుము కరణిని పిడుగుల ♦ సరణిఁదాఁకు, ధ్వనులకంజి గిరుల నీర ♦ దములు మొఱయు

ఉ॥ పిల్లలఁగన్న యేనుఁగుల ♦ వీడి మదావళ రాజిఁ బట్టఁగాఁ
బల్లులు ద్రవ్వినట్టి వన ♦ భాగములన్ మలక్రిందినేలలం
దుల్లసిలంగ నున్న జను ♦ లొక్కటఁజేయు మహానినాదముల్
మెల్లఁ గొలంకులం దిరుగు ♦ మేటి మరాళములం గలంచెడున్. ౬౩

చ॥ గెనసులు త్రవ్వుచో నడుమఁ ♦ గేలికిఁదొలు మణుల్ విదుర్పఁగా
మునుకొని వ్రేలు మావులను ♦ ముట్టుడు నందలి తేనె తుంపురుల్
చినుకును బిందురూపమునఁ ♦ జెన్నరు పుష్పొడి పైఁడిపోల్కిఁబై
నెనసిన పొన్నమంజరుల ♦ నింపుగఁ గూరుకు నంచగుంపుపై ౬౪

ఉ॥ కాఁపుచెలుల్ కరంబుల ర ♦ కంబుగఁగూర్చి వినోద లీలలన్
జూపుచుఁ బాడు పాటలు వి ♦ శుద్ధిగ* రెండువిధాల వేణువుల్
చాఁపుఁచుఁబట్టు గొల్లమొగ ♦ సాలలఁ గట్టిన యాలదూడలన్
జోఁపుచు లాలిపాటలలిఁ ♦ జొప్పుగ నిద్దురపుచ్చు హాయిగాన్ ౬౬

తే॥ కొండక్రింది నేలల నుండు ♦ కోమలులు వి, నోద రీతిని పాడు వి ♦ నూత్న గాన
మలరఁ జిఱు ధాన్యములు పండు ♦ నట్టి పొలము, గాచు నక్కఱలేకుండఁ ♦ గా ధ్వనించు

ఉ॥ గాలికి వంశముల్ గదలి ♦ గాఁడఁగఁ గొండలనుండి పెన్ ఫణుల్
వ్రేలిన రీతిఁ గ్రొమ్మధువు ♦ వెల్లువ ధారలు పాఱి చెందొవల్

* కణుపులతోఁ జేయఁబడినవి, వెదురుతోఁ జేయఁబడినవి.

గ్రాలు కొలంకుల న్నెఱసి ♦ కాలువ తూములఁ జొచ్చి బైట రాఁ
గ్రోలి మొగమ్ము ముద్చుకొని ♦ గ్రుక్కను శంఖపుఁబుర్వు లయ్యెడన్

తే॥ నిడుద నల్లని కనులక్రొ ♦ న్నెల నొసళ్ళ, కలుకులకు విద్యయుఁజెడని ♦ కలిమిఁగలుగ.
నొచ్చి వచ్చువారల కోర్కు ♦ లిచ్చుటయును, అతిథిపూజయుఁబనిగాక ♦ యన్యమేది?

తే॥ వంచనములేని సత్రముల్ ♦ వఱలుచోట్లఁ, గ్రొన్నెలంబోలు కొడవండ్లఁ ♦ గోసి కుప్ప
గూర్చుకూరగాయలు పప్పు ♦ కుప్పలు వెలి, ముత్తెముల వాటి బియ్యపు-మూటలమరు

తే॥ కలము లొనఁగుఁగాఁపులకుఁగాఁ, వలయుధనము, భూమిదేవి యొసంగును ♦ పూర్తిపంట
గనులొసంగును మేటిరూ ♦ మణులసమితి, కులమొసంగును మేలైన గొప్పనడత. ౨౧

తే॥ దొసఁగులేమి సకాలమ్ము-త్యుప్పులులేవు, మదిని మదిమదియుంటఁ జే ♦ రదు చిరాకు
పూని చేయు ధర్మేతర ♦ ములును లేమిఁ, గడకు దుర్గతి యన్న శం ♦ కయును లేదు

తే॥ క్రమముదప్పివెల్లువలె య ♦ క్కడఁజరించుఁ, గుంకుమాంకభుజంబులే ♦ గుఱుతుదప్పఁ
జెలుల నడుములె యట సన్న ♦ గిలుచునుండు, వాసనలు గలయవి కేశ ♦ పాశతతులె.

క॥ అగురుపొగ బానసంబుల, పొగయుఁ జెఱకు పాలు కాఁగు ♦ పొగయును వేల్మిం
బొగతోఁగలియుచుఁదత్పురి, మొగుళులవలె నెల్లయెడల ♦ ముసరుచునుండున్. ౨౮

తే॥ కలికిమైచాయఁబోలి కే ♦ కులు చరించు, కలికి స్తనహారరుచిఁబోలెఁ ♦ గాయునెండ
కలికి నెఱికేణి వోలె మే ♦ ఘములు క్రమ్ము, కలికి చూపులవలె వాలు ♦ గలును వెలయు

మ॥ కలఁగంబాఱి జలంబు పొంగ నులియం ♦ గం గొను లీఁదాడు కాఁ
పుల పూఁబోఁడుల యెట్టనొ పెదవులం ♦ బోలెన్ విరాజిల్లు చెం
గలువల్ విచ్చును మళ్ళలో; మడవలం గంజాతులంబోలి హం
సలు మెల్లన్నడ తెంచు; వారిమొగమా ♦ సన్ విచ్చు నీరేజముల్ ౨౬

శా॥ కేరున్నారుల యోరచూపు వ్రతులన్ ♦ గ్రేడించి యాడించుచున్
గేరున్ వారినడల్ కరేణువుల చ ♦ క్కంగాంచి యొంతేనియున్
గేరున్ నీరజకుట్మలంబుల పసం ♦ గేల్పాచి వక్షోజముల్
కేరుం బూర్ణ శశాంకు నొప్పిదపు భం ♦ గిన్ వారి ముగ్ధాస్యముల్ ౨౭

ఆ॥ చెదరియున్నమణులు ♦ బెదరించునినుకాంతిఁ, గొబ్బెరలను గెలుచుఁ ♦ గొమల చనులు
వారి వలువలెల్లఁ ♦ బాలనురువు గెల్చు, వాద్యములు మొగుళ్ల ♦ ధ్వనుల నోర్చు.

తే॥ జలదములుపెద్దతోఁటల ♦ చాయఁబోలుఁ, బొన్నమల యటఁగనవువా ♦ ములనుబోలు
జలధు లచ్చటిపెనుకొలఁ ♦ కులనుపోలు, స్వర్గపురి పలునిధుల కో ♦ సలముఁబోలు. ౨౯

ఉ॥ రాసుల వడ్లు లేనియెడ ♦ రాజిలు నచ్చపుటాణి ముత్తెపు
ప్రాసులు లేనిచో నుడక ♦ రాశిని కూర్చిన తెల్లయుప్పుపై

న్రాసులు, లేనిచో నదులు • రాయుచుఁద్రోయుచుఁజేర్చుపెన్నిధుల్
ల్వాసిగ నవ్వి లేనియెడ - భాసిలు మూ కికసైకతంబులున్ ౧౦

ఉ॥ చందనపున్ వనంబులొకొ? ↄ సంపెఁగతోఁటలో? చెప్పనౌనొకో?
కందుక కేళిసల్పు కుల ↄ కన్యలు కానఁగవచ్చు నిక్కవల్
సుందర నందనంబులొకొ? ↄ చొక్కపుఁగుందవనంబులొక్కొ?యా
స్కందునిపోలు వారలెల ↄ సంబున విద్దెల నేర్చు తానముల్ ౧౧

ఉ॥ చక్కెరఁబోలెఁదీయనయి - జానగుబాలల తొక్కుపల్కులం
జొక్కిపికాళినేర్చు బలు - సూటిగ; వారలనర్తనంబు లిం
పెక్కనెమిళ్ళునేర్చు; నల - యింతుల సొంపు రదాళిఁబోలు మేల్
చొక్కపు ముత్తియాలు విడు - చుక్ రహిఁబర్వపు టూడుశంఖముల్. ౧౨

తే॥ కల్లుగీతురమ్మెడివారి - పిల్లవాండ్రు, సేద్యమొనరింత్రు కాఁపుల - చిన్నవాండ్రు
వైణికుల పిల్లలును వీణఁ- బాడుచుండ్రు, వాదకుల సుతుల్ భద్ర ర- వంబు నింత్రు

తే॥ మలయుహారముల్ సొనగా-మధువునొసఁగు,వలయుమణికనకంబులఁ-గలము లొసఁగుఁ
బొలయుమలయానిలంబె తుం-బురుల నొసఁగుఁ,గలయఁ జివ్వు లచ్చటి-గాథలొసఁగు

చ॥ వనములయందు వేడుకగ - వారిజనేత్రలు లోలవేణులున్
ఘనకుచ బంధముల్ నడుచఁ - గాఁ దమి వారల పోల్కిగాంచి యిం
పెనయఁ గలాపిపాళి తమ - యింతులెకా! యని కోడెకాండ్రనె
మ్మనములఁబోలె గంధసుమ - మండనయుక్తల వెంబడించెడిన్. ౧౪

తే॥ ఎఱుఁగరా దీవిమహిమ పే-దఱికమిలేమి,నరయరాదు శౌర్యమహిమ - యరులులేమిఁ
గనఁగరాదు సత్యమహిమ - కల్లలేమి, వెడఁగులేదు పెద్దలయొద్ద - వినమిలేమి. ౧౫

తే॥ కొఱ్ఱ లుద్దులు పెసలు నూ-గులును జొన్న, ులవలును తవిదలు చామ-లున్న బండ్లు
బురదనేలల నుప్పును - మోయు బండ్లు, త్వరితగతినేగ నొంటొంటి - నొరయుచుండు

తే॥ సద్గతులనొంద సత్కర్మ- జరుపకుండు, నరులు వొందు పల్గతుల జన్మ-ములమాడ్కి-
బెల్లమును తేనెచక్కెర - పెరుఁగు కల్లు, వినిమయంబుగ జరుగు న-వ్వీటియందు.౧౭

తే॥ వేణువులుపాటలు ధ్వనించు - వీథులందు, నదులు నదులును డీకొన్న - పదురుదోఁప
యజ్ఞముల కుత్సవములకు- నరుగుజనము, గుంపుగుంపులై యొండొంటి-గూడుచుండు

తే॥ ఊఁదునట్టి శంఖాదుల-యులివు మఱియుఁ,దట్టి వాయించు చర్మవా-ద్యములధ్వనులు
కట్టలంగొట్టు భేర్యాది-కముల రవము, నట్టల నదల్చు కాఁపు సం- దడుల నడఁగు. ౧౦

తే॥ రతుగల బొమ్మలంజొల్లు - రమణఁగొఱు, పిల్లలకు నన్నముఁగుడుపు - తల్లు లమర
ముద్దుచు కెంగేలు వెన్నెలన్ - ముడిఁగినట్టి, యెఱ్ఱదామరలంబోలి - మొసకమొనఁగు.

తే॥ కుదిరెనందంబు తమమంచి - గుణము వలన, అమలమగునీతినిలిచె స-త్యంబు వలన
వెలసె ధర్మంబు మగువల - ప్రేమవలనఁ, దనరెఁదజీవాన క్రొత్తడి -తనమువలన. ౯౨

తే॥ పెక్కు-వనములు చుట్టిన - పెద్దదేశ, మెటిఁగియెల్లలఁగని పల్క- - నెవరి తరము?
ఒత్తువెల్లువల్గల సర - యూనది పలు, దారులం దారియుం గస - నేరదయ్యె.

తే॥ ప్రళయకాల వాయువులచే-వనధిరేఁగి, పొంగి వచ్చిన నాశంబుఁ - బొందనట్టి
కోసలంబుమహిమ యిట్లు - కొలలు నింక, నరయుదము నగరంబు తీ - రబ్బు వఱకు.

## 3. నగర పటలము. ౭౫

మ॥ లలి మాధుర్యము సర్థపుష్టి సరసా-లంకారరీతుల్ ధ్వనుల్
గలయుంబల్కు- మహాకవీంద్రులకు శ్లా - ఘ్యంబై యజాండస్థ జీ
వులు దుస్సాధ తపఃఫలాదికముచేఁ - బొందంగనై దివ్యలం
దలి జన్మంబున కాస సేయఁగ నయో - ధ్యాపట్టణంబొప్పెడిన్ ౯౫

మ॥ ధరణీదేవి ముఖాబ్జమో? తిలకమో? తన్నేత్రమో? దివ్యసుం
దర భద్రాయత సూత్రమో? కుచతటో - దంచన్మణీ హారమో?
వర జీవస్థలమో? రమావసతి యా - పద్మంబొ? శ్రీవిష్ణుపే
రురమో? కౌస్తుభ హేమ పేటికయొ? దే - వౌకంబుపై లోకమో? ౯౬

మ॥ ఉపమానం బొకలేని నెమ్మనములం - దూహించి యిన్నాళ్లుగా
త్రిపురద్వేషియు బ్రహ్మయున్ హరియు సా - ధింపంగలేరైరి యు
య్యుపమంగాంచ నడంపరాని తమితో - నుల్లంబు ప్రేరేఁపఁగా
నిపుడున్ జెప్పలు వాల్పకంతరమునం - దీక్షింత్రు చంద్రార్యముల్. ౯౭

మ॥ అమరాధీశ ధనేశ పత్తనము ల - భ్యాసంబుచే నైన య
ట్లమరం జేసిన బ్రహ్మ యీవలనె య - త్యంతంబు వైశాల్య మం
దము పెంపారఁగ సృష్టిచేసిన యయో - ధ్యంగాంచి సంకల్ప శి
ల్పము దేవాసుర కారువుల్ మఱచుచో - వర్ణింపఁగా శక్యమే? ౯౮

ద్విపద॥ పుణ్యాత్ములకు స్వర్గ-మున సుఖంబనుట, గణ్యమాశ్రుతుల వా - క్యంబద్ది నిజమ
తపము ధర్మంబును - ధరణి ఫలింప, నుపకరించిన ప్రభుం - డొక్క-రాముండు
తక్క- మఱెవ్వరా - తామరసాక్షుఁ, డిక్క-గాఁ గొనియేలె - నెల్ల లోకముల
నన దీనికంటె సు - ఖానుభవమునఁ, దనుపు తలంబు భూ - తలమునఁగలదె? ౯౯

ఉ॥ తోరపు ధర్మమున్ గరుణ - తోడి జితేంద్రియతన్ భజించి పెం
పారు తపంబుచే నెఱుక - యబ్బిన వారలకున్ శరణ్యమా

శ్రీరమణుండు పుట్టి యటఁ - జెల్వగ నొప్పెను సీతతోడ నూ
ఱాఱుల యేండ్లనంగ దివి - నైనను దాని సమంబు గల్గునే? ౧౦౧

చ॥ కలరట రాజులు స్నగలు - గల్గును గల్గు నమూల్యరత్నముల్
కలవు మదేభముల్ హయలు - కాంచనముల్ భువి గల్గు నన్నియుం
గలవు మునీంద్రయక్షసుర - కాండము వచ్చుచు సంస్తుతించు న
న్నెలవున కొక్క మేలుపమ - నేర్పునఁ దెల్పఁగ నుండెనం గదా?. ౧౦౧

## కోట గోడలు.

చ॥ చదరము శాస్త్రసమ్మతియుఁ - జక్కఁదనంబును పెద్దకొండలం
గుదురవు గాన నాపసిఁడి - కోటలకుల్ సరిరావు శాస్త్రముల్
చదివి ప్రయోజనంబుగల - చాడ్పునఁ గట్టిన వానిచెల్వ మే
పొదవు మహోన్నతంబుల మ - హోన్నతమై పెనుతెల్వికై వడిన్. ౧౦౨

సీ॥ శిల్ప విజ్ఞానంబు - చేఁ దుదిఁ గాంచమి, వేదమ్ములంబోలె - వి స్తరిల్లు
భువిమీఱి దివిఁజేరి - పొలుపారు చుంటచే, దేవతలంబోలె - దేజరిల్లు
నతి బలిష్ఠంబులై - యడరు నింద్రియములు, నడఁచుటచే మునీం - ద్రాళిఁబోలు
నెల్లప్పు డేమఱ - కెసఁగి కావలి గాచు, కర్జంబుచే దుర్గ - కరణి వెలయు

ఆ॥ శూలమును ధరించి - శోభిల్లు చుంటచేఁ, గాళిఁబోలి భీతి - గానిపించు
నమిత గౌరవమున-నన్నింటిఁ బోలు టు, ప్రాపమగుట దేవు-భాతిఁబోలు ౧౦౩

సీ॥ నెలవంకలంబోలి - పొలుపారు నఖములు, చెందామరలఁ బోలి-చెలఁగుకాళ్లు
అలరుఁ దీవియఁ బోలి-యసియాడు మధ్యంబు,లెడనీటి కాయల-నెనయు చనులు
వంచిన వంగు లే - మించు వెదురు వోలె, లావులై మృదువులౌ-లలితభుజము
లింపుసొంపుగ రుచి - యించు తేనియఁబోలు, సరస సుశ్రావ్య వ -చస్సు లమరు

తే॥ యువతులెల్లెడఁ గాంచిన - నొప్పుమిగిలి, సిండియున్న ప్రాకారంపు - నెలవుగలుగు
నయ్యయోధ్యకంటెను సాగ-సరయఁ గలదే?, అమృతభుక్కులు వసియించు-నమరపురెని

సీ॥ ప్రజలచేఁ గొలువంగఁ - బడుటచే శత్రురా - ణ్మకుటంబు లురలించు - మహిమచేత
శాస్త్రపద్ధతిఁ జను - చక్కఁదనముచేతఁ, దేటి చూడఁగరాని - దిటవుచేత
నధిక బలంబు పెం - పారుచుండుటచేత, నాయుధాభ్యాసన వి - ఖ్యాతిచేత
గురు తంత్ర యంత్రముల్-కుదిరియుండుటచేత, జయపతాకా విలా-సములచేత

తే॥ అమిత మహితోన్నతాతిశ - యంబుచేత, రాజచక్రంబు నడపు స- త్క్రమముచేత
రాజరాజులకై వడిఁ - దేజరిల్లు, గరిమ గల్గిన యచటి ప్రా-కారచయము. ౧౦౪

చ॥ అతి శిత ఖడ్గ తోమర శ - రాసన శూల గదాది సాధన
ప్రతతులు గల్గి తార్క్ష్యని ప్ర - భంజను దోమల మానసంబు నే

వితమునఁ జెంగనీయక వి-భేద మొనర్పఁగఁ జాలు యంత్రముల్
మితమును మించియుండునన - మిక్కిలి చెప్ప నీకేమి యుండెదుర్? ౧౦౬

చ॥ తొడవులకంటెఁ గీరితియె - దొడ్డగుణంబనియెంచి జీవకో
ట్లుడరుల నొందనీక జగ — తీశుల దండము నాధికార్యముల్
దడయక స్వర్గముల్ దిశల — దాఁటియుఁ గాచుచు నుండఁ గోటలా
పుడమికి సొరుగా వెలయు—భూషణమాత్ర మనం దొసంగొకో? ౧౦౭

సీ॥ బంగారు వెలగాఁగఁ♦బడయు వేశ్యలమది, వితములోఁతయి నీచ ♦ వృత్తి యడరి
యల్పకవిత్వ మ ♦ ట్లమరి స్పష్టతలేక, లోని యర్థము దురా ♦ లోకమగుచుఁ
గులకన్యకల వలెఁ ♦ గోరి యెవ్వరి కంట, రాని యత్యధికమా ♦ రతుఁ గలిగి
చక్రవాళము ప్రక్క♦సంద్రంబు మాడ్కిఁ బ్రా, కారంబుఁ జుట్టి య — గడ్తయొప్పు.

తే॥ మంచిత్రోవలఁ బోనీక-మార్చిచెడుగుఁ, దారులం దోర్చు నింద్రియ-తతిని పోలి
యొడఁద కడలును గూర్చెడు-జెడిదములగు, క్రూరమకరముల్ మిక్కిలి-కొఱలునందు

చ॥ తరలెడు గుంపుగల్గిన ప్ర-ధాన పయోదము మేరమీఱి య
య్యురగ జగంబు లోఁతు విరి - వొప్పు నగడ్తను పోలఁ గాంచి భీ
కరమగు నబ్ధియంచుఁ గడఁ - కన్ జలమానుచు లేచి యుప్పరం
బొరసిన కోటఁగాంచి గిరి - యూహను వర్షమునించు దానిపై. ౧౦౯

తే॥ పరిఖయందున జనియించి - విరిసి పరిమ, ళంబు వీచు పంకేజ వ - నంబుచూడ
మున్ను మగువలసొగసు మో-ములకు నోడి, బలముచేర ముట్టడిగొన్న-వలను దోచు

ఉ॥ ఆరసిచేసినట్టి పలు ♦ యంత్రచయంబుల తోడ నొప్పు ప్రా
కారముఁజుట్టి నిండిన య ♦ గడ్త మునుంగుచు లేచుచున్ మహా
కారతనొప్పు నక్రములు ♦ కంధిని మత్తగజేంద్ర సంఘముల్
కోరిక మీఱ వేడుకలఁ ♦ గూడి చరించు విధానఁ దోఁచెడున్. ౧౧౧

చ॥ క్రకచముఁబోలు వాలమును ♦ ప్రక్కలకార్చుచు లేఁతచందురున్
వికటముసేయు కోఱగవ ♦ వెల్వడి భాసిల నోరువిప్పి ని
ప్పుక లెసఁ గన్నులం దురలఁ ♦ బోరొనరించు మొసళ్లు కిన్కమై
జకచక రక్కసుల్ కసిమ ♦ సంగి పెనంగెడు భంగి నొప్పెదున్. ౧౧౨

సీ॥ ఈవల కావల ♦ కీఁదుచు విహరించు, రాయంచ లాతప ♦ త్త్రములుగాఁ గ
వింతలౌ మొసళులు ♦ వినువీథి గ్రహములు, తిరుగు మేరువుఁబోలు ♦ కరులుగాఁగ
చలిత నాళములతో ♦ వెలయు తమ్ములతోడి, తరఁగల గుంపులు ♦ తురగములుగఁ
గొరలుచుఁ దుల్లుచు ♦ మెఱయు మత్స్యంబులు, ఖడ్గాది బహువిధ♦ కరణములుగఁ

తే॥ జూడఁజూడ గంభీరమై ♦ చూడ్కి కడలు, నించి తుదిమొదల్ నడుము గా♦న్పింపకుండ
నల్లనల్లనఁ గదలు సై♦న్యంబొ యనఁగ, నప్పురము చుట్టి యొప్పారు ♦ గొప్ప పరిఖ.
తే॥ ఓరదిన్నెలు వెండిచే ♦ నొప్పి లోని, పైఁడి తేకుల ప్రక్కనఁ ♦ బటిక త్రాలు
పొదుగఁబడఁగ నగడ్త నీ♦రిది యటంచుఁ, దెలియఁ జూపుదు మనుట ది♦వ్యులకు సరిది
తే॥ పరవి లోఁతైన పరిఖయర్ ♦ వనధిచుట్టు, బలసి బలిసిన యడవినాఁ♦బరఁగు వనము
కదలకుండు నిరులగుంపు♦ పొదలె ననుచుఁ, గోటకోట నల్లనగ యంచుఁ♦ జాటవచ్చు

## గోపుర ద్వారములు

మ॥ నలుదిగ్వీథుల నిల్కడన్నిలిచి యుం ♦ టంజేసి నల్దిగ్గజం
బులఁబోలున్ హరి స్వర్గముం గొలుచుచోఁ ♦ బొల్పారు పాదంబు క
న్నులలిన్ వర్ధిలి సర్వజీవులకు స ♦ న్మార్గంబు తాఁజూపుటన్
నలువేదంబుల మాడ్కి నొప్పు నగరిం ♦ దద్గోపుర ద్వారముల్. ౧౧౮

తే॥ పొలఁతిఁబిల్చియు రామి గో♦పురము మీఁది, పెంటిచిత్రముఁజేర నా♦ప్రియయుఁ గినుక
గూకిపైఁబూని తపసులు ♦ కోరిచేరు, నమరపురిలోని సందన ♦ మందు డాఁగు

సీ॥ మలిచినతాల న ♦ మర్చి ముందర స్ఫటి, కపురాలఁగట్టి పై ♦ గాంతిగల్గు
బంగారు దూలముల్ ♦ రంగారఁగా నిల్పి, పై వెండిదంతెలు ♦ పరపి వాని
పైని వజ్రాల కం ♦ బంబులు నవరించి, పచ్చలబోదెలు ♦ పరఁగ నునిచి
రీతియూ రత్నచి ♦ త్రిత సింహముల మీఁదఁ, బసుపు రాల్కడ్యాలఁ ♦ బాదుకొలిపి
తే॥ యేడుజగముల వార్నిల్వ ♦ నెంచినట్లు, పెద్దయంతస్తులేడు క ♦ ల్పించు గోపు
రములు శిఖరాల నొప్పారు ♦ రత్నకలశ, ములు ధరాదేవి శీర్షక ♦ ములను పోలు

## మేడలు.

క॥ నల్లనిదె నెలయు ననఁదగి, వెల్లఁదనమునొంది నంక ♦ వెల్లయడరు నా
తెల్లనిమేడలు గాలిం, దల్లడపడు పాలవెల్లి ♦ తరఁగలఁబోలున్. ౧౧౯

క॥ సొగసగు పనిగల బంగరు, తగటి కొణిగలన్ విటంక ♦ తండములు కడున్
నెగడినమేడలు కైలా, సగిరిన్ లేరెుండఁగాయు ♦ నరణి వెలుంగున్. ౧౨౦

క॥ వెలి మణి కంబంబులఁ బ, చ్చల బోదెలపై న శిల్ప ♦ చతురిమ వెలయం
గలమేడలఁ గని తమరథ, ములె యని యమరులును భ్రమలఁ ♦ బొందుదురచటన్

తే॥ పటిపుగా నెలతాలను ♦ పటిపిపైన, చందన స్తంభములు వరు ♦ సలుగ నిలిపి
పగడపుం బోదెలుంచి శి ♦ ల్పంబమర్చు, మణుల బొమ్మలమేడలు ♦ మలయుఁగోట్లు.
తే॥ పెడఁగుపనినేర్పుగలతూండ్ల ♦ యడుగు తమ్మి, రూపు పున్నాగయుక్తి సు ♦ రూపగరిమ
దర్శనీయ శిల్పంబు మ♦ధ్యంబు బయలు, పై తళుకుల మేడలు పోలుఁ ♦ బణ్యానతుల

ఉ॥ లోపలఁజొచ్చువారు తమ ♦ లోచనముల్ దగనార్పకుండి సం
దీపితదేహులై సురల ♦ తీరువహింపఁగ, దివ్యులెక్కి మేల్
తోఁపికతో విహారములఁ ♦ దోఁచు విమానచయంబుఁబోలి యె
త్తై పరపై నమేడలు వి ♦ యచ్చరలోకమునంటి భాసిలున్. ౧౨౭

తే॥ సుందరదనలతో చెలులు న ♦ రిందములగు, వీరవరులు మాత్రలుచేయ ♦ వెడలియున్నఁ
గనక రత్న గేహమ్ములఁ ♦ గ్రమము చెడక, ప్రాంతధర్మపద్ధతు లెడ ♦ పడక నడచు

తే॥ మింటినంటఁబెరిఁగి మితి ♦ మీఱుకలిమి, కలిగి యున్నతి కాంతియు ♦ నలరుమేడ
లందనింద్య ధర్మప్రభు ♦ లట్లువిభవ, యుక్తులగుచు నుదారులై ♦ యుంద్రుజనులు

చ॥ ఝురములఁబోలి ముత్తెముల ♦ జాలరు లొప్ప మొగుళ్లగుంపులన్
దొరసి ధ్వజాళియున్, మణుల ♦ తోరపురాసులు, హేమరాసులుం
బెరసి మయూరసంఘముప ♦ మెల్లలు రాజిలుమేడ లారయన్
గిరివర సంచయంబనఁగఁ ♦ గిరితికెక్కు మహోన్నతంబులై. ౧౨౮

ధ్వజములు.

తే॥ అగురుచేఁ బొగచూరి పై ♦ మొగుళులందుఁ, గలిసిపోయిన కేతనా ♦ గ్రములనున్న
శూలసంతతి కాంతుల ♦ జాలుకొనుచుఁ, బగటిపూటనె మెఱుపుల ♦ పగిదిమెఱయు

మ॥ స్తనభారంబును మోవలేనిపగిదిన్ - జవ్వాదు లేఁగౌనుతో
వనితల్ కాళులయందియల్ మొరయఁగా - వర్తించు తద్దేహకే
తనవస్త్రాంచల వాయు ఘూర్ణ పత - త్కల్పప్రసూనవ్రజం
బనువందం గయిసేయు తోరణ విధం - బైయందు రాజిల్లెడిన్. ౧౨౯

తే॥ గిరులఁ గనవచ్చు కదళికా - కీర్ణవనము, పగిది గ్రహమండలమునంటు - ధ్వజపటంబు
లొరయుటంజేసి ఖిన్నత్వ - మొందిక్రుంగి, ప్రతిదినంబును శశి కృశ - త్వంబుఁగొనెడి

సంకీర్ణము.

చ॥ కలవటఁబైఁడి చప్రములె ♦ కాక సుమంబుల మండపంబులున్
గలవటఁ గొల్వుకూటములె ♦ కాక మహోన్నత మందిరంబులున్
గలవటఁ గృత్రిమాద్రి తతి ♦ గాక మణీమయ కుట్టిమంబులున్.
గలవట వట్టి ముంగిళులె ♦ కాక సుమౌక్తిక కాయమానముల్. ౧౩౦

తే॥ వన్నెమీఱిన బంగారు ♦ పనితనంబు, లధికముగఁ గల్గి పేరొందు ♦ నయ్యయోధ్య
మెఱుపనఁగ దీపమన సూర్య ♦ కిరణమనఁగ, జోకనెలుఁగ స్వర్గము హేమలోకమయ్యె

మ. హరికాంతుల్ తొలివేళఁ దక్కువయి మ ♦ ధ్యాహ్నంబునందెక్కువై
చర మాహ్నంబునఁ గ్రుంగఁబాఱుటకు నా ♦ చాంపేయ మాణిక్యసం

భరిత శ్రీ పుర మోహనాంగి తను శో ♦ భం బొందు భేదంబులే
తిరమగా కారణ మయ్యెనంచుఁదగ ను ♦ త్ప్రేక్షింత్రు విద్వత్కవుల్.

ఉ॥ అందపు మేఖలల్ నడుము ♦ లందు ధరించిన స్త్రీలు మేడలం
బొందఁగవేయు ధూపముల ♦ నొడ్డుగ లోఁగొను మేఘపంక్తి యొ
య్యందిగినట్టి యబ్ధియె మ ♦ హాద్భుత వాసన గుప్పు నప్పుచో
దందడి నచ్చటం గురియు ♦ ధారల గంధము నేల చెప్పఁగన్? ౧౩౮

ఉ॥ వేణురవంబుఁబోలు ముడి ♦ వే యని కన్నెల తొక్కుపల్కులున్
వీణరవంబుఁబోలు నలి ♦ వేణుల యింపగు ముగ్ధవాక్కులున్
జాణల ప్రౌఢ వాక్కులు ప ♦ సందుగ మద్యము సమ్మి వాడలన్
గాణల నృత్యగీతయుత ♦ క్రమ రవంబును పోలు నెల్లెడన్. ౧౩౯

తే॥ కనుల మిడుఁగుఱుల్ రాల్చెడు ♦ కలభసమితి, నేలఁద్రవ్వఁగా నమవుగా ♦ బాలురాడు
వంతలగుచుండు నటులాడు ♦ వానియందు, వారియొడలి గందపుఁబొడి ♦ పడుచు నిండు

తే॥ తరుణు లొక్కటఁజెండ్లాట ♦ తవిలి యాడ, రాలి ముత్యాలు చెదర వా ♦ రలను ప్రోత్స
హించు చెలు లవ్వలికిఁ ద్రోయ ♦ నించు కాంతి, చల్లనై వెన్నెలలు మీఱి ♦ వెల్లివిరియు

చ॥ తరుణులు నృత్యశాలల ము ♦ దంబున నాడుచు నుంద్రు వారి సుం
దర విచల త్కటాక్షశర ♦ ధాటి పిటాలి యెదం గరంచు నా
సరసుల ప్రాణముల్ చెలుల ♦ సన్నని కౌనువలెం గృశించుఁ బైఁ
బెరిఁగెడి బాళి మాత్రమది ♦ పీడదు వారి యురోజపద్ధతిన్. ౧౪౦

తే॥ కొన్ని వనము●ద్రొంగేదె ♦ గురియుచుండు, మలయపవనంబునళులొప్పు ♦ మందగతుల
నందు విహరింప విరహ తా ♦ పాగ్ని నుడుకు, వారి మైదీవలు కృశించి ♦ వాడు వాఱు

ఆ॥ మకర వీణరవము ♦ మద్దెల నాదంబు, చెలుల గీతికలకుఁ ♦ జెలువు నించుఁ
జెలుల తోడ నించు ♦ పలుకాడు చిలుకలు, వినుచుఁ గనులు మూసి ♦ కునుకుచుండు

తే॥ అరయ గనయింపునొసలు బిం ♦ బాధరంబు, గలుగు కలుకులు ప్రణయింపు ♦ టలుకనొంది
మృదుపదంబులఁ దన్నఁగా ♦ మేటి వీర, వరుల భుజదండములు జాజు ♦ వాఱుచుండు.

చ॥ పగలును రేయి వేఱుపడు ♦ పద్ధతి గానమి సాటిలేని యా
నగరమునందు దీపము ల ♦ నం దగి వెల్గెడి పూజ్యరాంద్ర కాం
తిగల శరీరదీధితులఁ ♦ ద్రిప్పనిచూడ్కులఁ జూడనేమొ? వ్రా
యఁగఁబడు కుడ్య చిత్రములు ♦ నయ్యరె! వ్రాల్పవు కంటిరెప్పలన్. ౧౪౧

చ॥ జలజ గృహాంతరస్థయు న ♦ చంచల లీల వచించు మేడలం
జెలఁగుచుఁ గాంతు లీనుచును ♦ చీఁకటులం దొలఁగించునట్టి వం

దుల గల నేతి దీపముల ♦ తోరపుఁగాంతులు గాను రత్నదీ
పుల నికరంబు; కానియెడఁ ♦ బొల్తుల మేని మెఱుంగు సన్నియల్. ౧౪౩

ఉ॥ తాళ మృదంగ కీర్తన ని ♦ తానముతోఁ దగు శాస్త్రపద్ధతిన్
గాల జతు ల్గదించి నట ♦ నం బొనరింతురు నూత్నభావనల్
శీలన చేసి యాజతులఁ ♦ జెల్వుగఁ జూపుచు నుండునట్టి వ
క్కాళుల మువ్వలందియలె ♦ కావు హయంబుల కాళ్ల గజ్జెలున్ ౧౪౪

చ॥ చిఱు నగ వంకురించు నది ♦ చెచ్చెర మిక్కిలి కామవేదనం
బఱపును కాముకావళికిఁ ♦ బాటలగంధుల కౌనులెప్పుడుం
దఱుఁగుచు నుండఁగాఁ దఱిఁగి ♦ తాఱ నురోజము లుబ్బరించుచున్
మఱిమఱి హేమ తార మణి ♦ మాలికలన్ ధరియించు బర్వుగన్. ౧౪౫

చ॥ నడ బెడఁగైన లేవయసు ♦ నల్వ గుఱాలును వాలు మీలు సం
గడులగు గండుఁ దేటులును ♦ గంధ గజంబులె కావు తానమా
డెడు పువుఁబోండ్ల నేత్రముల ♦ టెక్కగు చూడ్కులు నొత్తరించి యిం
పడర వెలుంగఁజేయు ♦ జలజాకర సంతతులన్ రకంబుగన్. ౧౪౬

చ॥ కసలున నెత్తునో కనులు ♦ గల్గు మృగేంద్రము లొప్పు కందరల్
వసఁబడ నున్న శైలముల ♦ వంటి మదేభనికాయముల్ బయల్
గొను మదధారలం గురియ ♦ లోఁతుగ భూమిని పంకమేర్పడున్
గొనకొని వాసిలోన ధ్వజ ♦ కూటము రాజిలు తేర్లు పూఁడెడున్. ౧౪౭

చ॥ పడఁతులు క్రొవ్విరుల్ ముడువఁ ♦ బాఱఁగ నూడిచి నైచ్య ప్రాఁతపూ
వడములు వీథులం గునిసి ♦ పాఱఁడు మావుల కాళ్లఁ గట్టి దూఁ
పెడిని; పునారతంబుఁ దల ♦ పెట్టు నెలందులు గబ్బిగుబ్బలం
దుడిచి విదుర్చు పంకములు ♦ త్రొవను పోయెడి వారి జార్చెడున్. ౧౪౮

తే॥ అశ్వములు గిట్ట లఱుగంగ ♦ నవనిఁ ద్రవ్వ, వెడలు ధూళిలో రత్నముల్ ♦ వెలుఁగకుండి
ధారణీశ్వర పుత్త్రిలు ♦ తొల్చుమేటి, విరిసరుల తేనె చిందఁగా ♦ వెలయు నపుడు. ౧౪౯

ఉ॥ వీచును వేఁగిగంధ మెడ ♦ వీడక దంతి మద ప్రవాహముల్
వీచును కల్వగంధ మెడ ♦ వీడక చామల వక్త్రబింబముల్
వీచును మేటికాంతులెడ ♦ వీడక బంగరు భూషణావళుల్
వీచును పూలగంధ మెడ ♦ వీడక క్రొవ్విరిఁబోండ్ల క్రొమ్ముడుల్. ౧౫౦

చ॥ మునుపె మునీశ్వరుల్ తొడఁగి ♦ మోక్షద పట్టన సప్తకంబునం
గొనని మహేంద్రపట్టణముఁ ♦ గూర్చి వచింపఁ బనేమి యిచ్చటన్?

మొనసి సమస్తవస్తువులఁ బూర్తిగఁ గల్గు నయోధ్యవీథులం
గనిన యనంతరంబ యల కాపురి యోటమినొప్పెఁ బూర్తిగన్. ౧౫౧

ఉ॥ రాజకుమార మండలుల రంజిల మ్రోఁగును వీరమద్దియల్
తేజము మీఱు ఖడ్గముఖ దీధితు లెండలు గాయు సర్వదా
భ్రాజిలు రత్నభూషలును వాసిలుఁ గస్తురి, తారహారముల్
రాజిలు, మాలలన్ మధుక రంబుల గాన మనూనమై చనున్. ౧౫౨

తే॥ శంఖ కాహళ కిన్నరీ స్వనము తోడ, సుషిర వీణా మృదంగ విస్ఫురిత రవము
మఱియు బహువిధవాద్యముల్ మట్టుమీఱి, డంబుమై నబ్ధి ఘోషమ్ము నడంచుచుండు

సీ॥ మెప్పుగాఁ బరరాజు లొప్పించు కప్పముల్, కానుకల్ లెక్కింపఁ గడఁగు చోట్లు
హంసయానలు విలాసార్థమై నృత్యంబు, లలవాటు లొనరింపఁ గలుగు చోట్లు
రాజకుమారకు లోజ నాయుధ విద్యఁ, దెలఁగుగా నభ్యాస పఱుచు చోట్లు
వేదముల్ నాలుగు విడునక వల్లించు, విప్రులచేఁ జాల వెలయు చోట్లు.

తే॥ చదివి తర్కించి మఱి విమర్శనముచేసి, యొలఁగఁదగిన శాస్త్రంబుల నెఱుఁగు కొఱకు
ననువుగాఁగ విద్వద్గోష్ఠు లెనయుచోట్లు, దండిగాఁ గల్గు నాయయోధ్యాపురమున

చ॥ పొలుచు జగామణుల్ తరణిఁ బోలి ప్రకాశము నొందు తోరణం
బులుగల రాజవీథులను బొందికఁ బాఱఁగఁ జూడ దిక్కులే
యలుపములై కనంబడును హస్తి మదాంబుఝరుల్ గనన్ ఝరుల్
కొలఁదిగఁ దోఁచు గుజ్జముల గుంపులకున్ జలధుల్ కొలందులౌ. ౧౫౫

చ॥ తమ శిఖరాలిచే మొగులు దాఁకెడు తోరణ సౌధవీథులన్
రమణుల యాస్యబింబములు రాజిలఁ దోఁచు వెలుంగు లీనుచౌ
సుమహిత నేత్రపద్మములఁ జూపుల తూపులు దోఁచు నవ్వి సిం
హములను బోలు వీరుల హృదంతరమందునఁ గ్రుచ్చిచొచ్చెడున్. ౧౫౬

ఉ॥ బంగరుతేరి నిస్వనము వాజులగంటలు కింకిణీధ్వనుల్
రంగరు వీరమద్దియల రావముతో నెదురొడ్డి మ్రోఁగు; హే
మాంగుల పాదనూపురము లల్లన మ్రోయఁగఁ గన్యకాళి ప్రే
మం గలఁగించు డిగ్గియుల మానుగ హంసలు మాఱు కూసెడున్. ౧౫౭

మ॥ సరసోక్తుల్ పచరించుటన్ గినియుటన్ సాంగత్యముల్ సేయుటన్
బరిశుద్ధంబుగఁ బాడుటన్ వినుట మే ల్పన్నిట నీరాడుటన్
తరువల్లీ ఫల పుష్పవాటికల మోదంబొప్పఁ గ్రీడించుటన్
విరులంగోయుటఁ దాల్చుటన్ దినములన్ వెళ్లింత్రు స్త్రీలచ్చటన్. ౧౫౮

తే॥ గిరులఁ బోలిన కరులపై • హరులపైన, స్యందనములపైఁ గ్రీడలు • సలుపుటందు
యాచకుల కష్టములు తీఱ • నరయుటందు, ప్రొద్దుపోవుఁ గొందఱకు నా • పురమునందు

తే॥ కరులఁ గరులఁ బోరించుటకు • గార్ముకంబు, లభ్యసించుటఁ గ్రొత్తహ • యమ్ములెక్కి
తిరుగుటకు బంతియాట మొ • గ్గరముఁ గూర్చి, చర్చచేఁ గొందఱకుఁ బ్రొద్దు • జరగునచట.

తే॥ విరులఁ గోయుట హరిణుల • కరణిఁ జేరి, ప్రియులతో నీదులాడుటఁ • బెదవియెఱుపు
వదల మధువుసేవించుటఁ • బగడసాలఁ, దరుణులకుఁ బ్రొద్దుపోవుఁ బ • ట్టనమునందు.

క॥ పరవిన మొగుళులు కడలిని, తఱుచుగ జలమానక్రియ సు • ధాహర్మ్యములన్
జెరిపిన ధ్వజపటములు తని, వఱ స్వర్గంగాజలంబు • నలలుఱఁ ద్రావున్. ౧౬౨

చ॥ గొనబగు తోరణాల్ గలుగు • గోపురముల్ మఱి పైఁడికోటలున్
బొనుపుగ స్వర్గముం గడచి • పోవఁగఁ జోటులేక నిల్చినా
నొనసి మహావనీపతుల • యీఱమివాఱిన కీర్తిరాశిఁ బో
లినవయి నిర్జరావళుల • లీలఁగ సిగ్గిలఁజేయుచుండెడున్. ౧౬౩

చ॥ దొరువులు సానువుల్ దొనలు • తోఁటలు కొండలవాఁగు లంబుజా
కరములు శాద్వలంబులు స • గడ్డలు పంటలచేలు గొప్పయు
ప్పరిగలు మేటిముత్తెముల • పందిరు లొందికగల్గు తావులం
దరవిరి పానుపుల్ తలిరు • టాకుల తల్పము లొప్పు మెప్పుగన్. ౧౬౪

చ॥ కడలియుఁ దేటనీరుగల • కారుమొగుల్ దిగులొంద దుందుభుల్
జడియుచునుండు వీథుల ని • జంబుగ దొంగిలువారు లేమి నం
దడరిన ద్రవ్యరాసులకు • నద్దికమే కనరాదు దాతలు
గ్గడువుగఁ గీర్తికెక్కరొనఁ • గంగొనువారలు లేకయుండుటన్ ౧౬౫

చ॥ చదువనివారు లేమి మఱి • చక్కఁగ నేర్చితి మన్న వారలుం
బొదలరు చూడఁ బాండితిని • పొందనివారును లేరు సంపదల్
పొదువుగ సన్మార్గములఁ • బొల్చుటచేతను బీదవారలున్
వెదకినఁ గానరారు పెను • విత్తముగల్గినవారు లేరటన్. ౧౬౬

చ॥ చదువను విత్తు మొల్కగొని • శాస్త్రచయశ్రుతిపేరి శాఖలం
గదిరి తపంబులన్ నసలు • క్రమ్మి తలిర్చుచుఁ బ్రేమ మొగ్గలం
బొదలి యపారధర్మమను • పూవులుపూచి సుమాళమన్ ఫలం
బొదవఁగఁ గొన్న యానగరి • యొప్పిన వైభవ మేమి చెప్పుదున్. ౧౬౭

ఉ॥ తన్నగరేశ్వరుండు కడు ♦ ధర్మముతోఁ బరిపాలనంబు ను
ద్యన్నవలోక భూముల మ ♦ హామహిమంబుగఁ జేసినాఁడు పె
న్మన్నన గొన్న యీకథకు ♦ నాయక వీరుని గన్నతండ్రి పృ
థ్విన్నరనాథ నాథుఁడు వి ♦ తీర్ణ సురారి చమూ సముద్రుఁడున్. ౧౬౮

ఉ॥ సత్యము ధర్మమున్ దయయు ♦ శాంతము తెల్వి పరాక్రమంబు సం
స్తుత్యబలంబు దానమును ♦ తోరపు నీతియు నెంచ మంచి సాం
గత్యమునేమిఁ బొచ్చెమయి ♦ కానఁగనౌఁ బెరరాజులం దహో
నిత్యపథానువర్తులయి ♦ నిల్చును తన్నగరాధినేతకున్. ౧౬౯

మ॥ చతురంభోధి పరీత భూతలమునన్ ♦ సత్కీర్తిపాత్రంబుగా
నతులోదారుని స్వచ్ఛదాన సలిల ♦ వ్యాప్తంబు గాకుఁడు హా
స్తశలంబే నహి వేదచోదితమహా ♦ ధాత్రీంద్ర దుస్సాధ స
త్కీర్తితు సంతానములెల్ల నావిభుఁడు మున్ ♦ గాపించి యున్నట్టివే. ౧౭౦

ఉ॥ ఆవిభుఁ డెల్లవారియెడ ♦ నర్మిలిఁ బూనుటఁ దల్లిఁబోలు మే
లౌ నిలసిల్లఁ జేయుటను ♦ హెచ్చు తపంబునుపోలు ముఖ్యుఁడై
భావుక సద్గతుల్ గలుగఁ ♦ బొల్పడుచుండుటఁబుత్త్రిఁబోలు శ్రీ
శాలనిధి నౌషధంబగును ♦ జ్ఞానముఁబోలును ధర్మవిజ్ఞతన్. ౧౭౧

సీ॥ అధికమై యుప్పొంగు ♦ సర్థివారాశిని, దానమున్ తెప్పచే ♦ దాఁటినాఁడు
చూడనలవికాని ♦ సూక్ష్మధర్మాంబుధి, నెఱుకయున్ నౌకచే ♦ నీఁదినాఁడు
వీరశత్రూద్వేగ ♦ భీకరాంభోరాశి, ఖడ్గమున్ నావచేఁ ♦ గడచినాఁడు
సంపల్లసిత మహా ♦ సౌఖ్యసముద్రంబు, తనివియున్ కలముచేఁ ♦ దఱిసినాఁడు

తే॥ వెల్లువల మృగములఁబట్టి ♦ వితతిఁ బణ్యాఁ, సతుల మనముల నౌకరీతిఁ♦జిక్కనడఁచెఁ
జతురుదధివేష్టితావనీ ♦ చక్రమందు, స్థిర యశుండగు దశరథ ♦ క్షితివరుండు. ౧౭౨

తే॥ చక్రవాళగిరిశ్రేణి♦ సాలములుగఁ, గడలి గంభీరమైన య ♦ గడ్త గాఁగ
శైలములు రత్నరాసుల ♦సౌధములుగ, నొప్పు మేదిని యతనికి ♦ యయోధ్యఁబోలు

తే॥ రాజుచేతి ఖడ్గము త్రుప్పు ♦ రాలిపోవ, వాఁడిగా సానఁబట్టుట♦వలన నఱుగు
విభుల రత్నకిరీటాగ్ర ♦ వితతి పడుట, మాత్ర నతని బంగరు పీఠ♦మద్దె లఱుగు.౧౭౪

తే॥ పృథివి సర్వమలమి జీవ ♦ వితతికెల్లఁ, జల్లనీడ నొసఁగ నిరుల్ ♦ సాగఁదోలఁ
జక్రి గొడుగను జాబిల్లి - చాలియుండ, నాకసంబున శశియుండు ♦ టధికమగును.

తే॥ వజ్రకవచి సింహబలుండు ♦ ప్రభుఁడు ప్రేమఁ, బ్రాణముంబోలె జీవుల ♦ నరసికావ

భువిఁ జరాచరకోటికి ♦ భూపభుండు, ప్రాణములకు నిమ్మైన దేహంబుఁబోలు. ౧౭౬

చ॥ గిరినిభ పీన దీర్ఘభుజు ♦ గెల్పునె పొందెడి యాజ్ఞచక్రము
గ్రరుచుల భానుమండలము ♦ కై వడిఁ గ్రాలుచు నున్నతస్థలిం
బొరయుచు నిల్చి నిల్చి యెన ♦ వొందనిదై భువనంబులెల్ల సం
చరణముచేసి జీవులను ♦ చల్లఁగఁ గాచు విశేషపద్ధతిన్. ౧౭౭

ఉ॥ తెమ్మని భేరముల్ పలికి ♦ లీలగ యుద్ధముచేయు శాత్రవుల్
కిమ్మనలేమిఁ దీఁట యడఁ ♦ గింపఁగరాక యులర్చుచున్ మృదం
గమ్మను పోలు బాహువులు ♦ గ్రాలుప్రభుండు సమస్తభూతలం
బిమ్మగఁగాచెఁ జిన్నపొల ♦ మేర్పడఁ గాచెడు బీదపోలికన్. ౧౭౮

## ౫. అవతార పటలము. (౧౩౭)

ఉ॥ భూవరుఁ డొక్కనాఁ డజుని ♦ పోలు వసిష్ఠుని గాంచి మ్రొక్కి-యో
దేవ! మదీయ సూర్యకుల ♦ దీపకులౌ తొలివార లెల్లరున్
భావనచేసి మీచరణ ♦ పంకజముల్ భజియించుచుండ్రు మా
దైవము మోక్షసాధన వి ♦ ధానము ధర్మనిధాన మీరెకా! ౧౭౯

తే॥ తెలియ మాపూర్వులినుకంటెఁ ♦ గులము మిగుల, వెలుఁగ దుష్కీర్తి లేకపృ ♦ థ్విని భరించి
రిపుడు మేరలేని ధరణి ♦ నే భరించు, టెల్ల మీకరుణామృత ♦ వృష్టిఁగాదె? ౧౮౦

తే॥ వెడలె నింతకు నఱువది ♦ వేలయేండ్లు, శత్రుల నడంచి యేలితి ♦ జగతినెల్ల
నాకు వెన్క నరాజక ♦ మై కలంగు, నేమొ? యనుచింత యొండెనా ♦ యెడఁదఁగలిగె.

తే॥ వరతపోధనులును భూమి ♦ సురులు దుఃఖ, మనుటయే లేక యున్నాళ్లు ♦ మనినవారు
నా వెనుకఁ గష్టములు వారి ♦ నలఁచునేమొ?, యనెడి యొక చింత యేచాల ♦ నలఁచునన్ను.

సీ॥ భేరులెల్లప్పుడు ♦ పిన్నంటమ్రోఁగెడు, నగరి వాకిలియుర ♦ త్నాలసరుల
పెనుకిరీటమ్ములను ♦ విలసిల్లు రాజిల్లు, పలికిన యంత నా ♦ బ్రహ్మసుతుఁడు
క్షీరాబ్ధి నడుమను ♦ శేషశయ్యాపయిని, యోగనిద్ర వహించు ♦ యోగినుతుఁడు
హింసయే వృత్తిగా ♦ నెసఁగు రక్కసుల యు, పద్రవంబులు నశిం ♦ పఁగ నొనర్తు.

తే॥ ననుచు మితిమీఱి వెతగూర ♦ నలఁగి దీన, వదనుఁడై యున్న నిర్జర ♦ వరుల కవిస
పలుకు లప్పుడాను పూర్విగాఁ ♦ దలఁపునందు, దెచ్చుకొనియెను తన దివ్య ♦ దృష్టివలన.

తే॥ అమరులసురులవలనఁ గ ♦ ష్టముల నొంది, యభవు పాదపద్మంబుల ♦ నాశ్రయించి
తెలుప వారలఁజంప నా ♦ వలన వీలు, కాదనుచు వారితోఁ దానుఁ ♦ గడచి నడచి.

తే॥ మేరుశిఖరి నడుమఁ దేట- మెఱుఁగులీను, రత్నమయ మండపముచేరి-బ్రహ్మ యప్పుడు

వందనముచేసి దానవ - ప్రతతి సేయు, పిడుగు వంటెదు శ్చేష్టల-వినిచినారు. ౧౮౫

ఆ॥ ఇంద్రుఁ గొనుచు లంక - కింద్రజిత్తేగిన, నాఁడు తాన యతని - విడుచు కథ
పద్మజుండు చెప్పెఁ ♦ బార్వతీశ్వరునకు, మొదటినుండి యాను ♦ పూర్విగాఁగ.

క॥ తలలు పది చేతు లిరువది, గలిగి తెలివిచెడిన పంక్తి - కంఠుం డంపా
గల నేర్పు మన యెడను లే, దల విష్ణుఁడె వానిఁ దునుము - నని వారలతో. ౧౮౭

తే॥ పాలకడలిఁ బరుండి దే - వత్వమొందు, మరకతాద్రిని బోలిన - మాధవునకు
గేలుమోడ్చి వినతిచేసి - కీర్తనంబు, సలుప, ముక్తి జ్ఞానులకిచ్చు - కలుషహారి.

చ॥ కమలవనంబు పూచి శశి ♦ కంజవినోదుల రెండుప్రక్కలం
దమరికఁ జేర్చుకొంచు జిగి ♦ యారిన బంగరు కొండనెక్కిన
ల్లమొగులు వచ్చుపోలిక వి ♦ లాసముతో సిరితోడఁ దార్క్ష్యునె
క్కి-మధువిరోధి ప్రేమ తుల ♦ కింపఁగవచ్చెఁ బ్రసన్నమూర్తియై. ౧౮౯

ఆ॥ గరళకంధరుండుఁ - గమలాసనుండును నిం, ద్రాదులెల్ల సంభ్ర - మాదరముల
నిలిచి పొగడి పొగడి - నెగడు స్వానందాశ్రు, పూర్ణులగుచు హరికి - మ్రొక్కిరపుడు.

తే॥ తులసిమాలలుగల పాద - జలజములకు, మ్రొక్కి రక్కసు లప్పుడే-ముగిసి రనుచుఁ
గడఁక బ్రేమ మధువునాని - యొడలు మఱచి, పాడిరాడి రిట్టట్టులు - పరుగులిడిరి.

ఉ॥ బంగరు కొండనుండి దిగఁ - బాఱు పయోదమువోలె లోకమా
యంగడఁబాపువాఁడు వెల - యన్ మముగాచెడు తార్క్ష్యునుండి మిం
టం గొనదాఁకు మండపము - డాయుచు డిగ్గి మనోహరాకృతిన్
సింగపుఁ బైఁడి గద్దెపయి - చెన్నలరార వసించి సంతటన్. ౧౯౨

ఆ॥ రాజహంసాళి యబ్బు-రంబంది యుండ బ్ర, హ్మాయు మునీంద్రు లమరు - లంతఁ గదిసి
పాపదైత్యులెల్లఁ - బనివడిగావించు నెడరులెల్లఁ దెలుపఁ - దొడఁగినారు ౧౯౩

## వేల్పులు రాక్షసబాధల విష్ణువునకు విన్నవించుట.

తే॥ అధిప! రావణుండును వాని ♦ తమ్ములాది,గలుగు బలియురచేత స్వ-ర్గమును భువియుఁ
జలుపఁదగు తపంబులు చేయఁ- జాలకుండె, బ్రదుకు తెరువులేదని యార్పు-వదలినారు

ఆ॥ అమరు లట్లు పలుక-నప్పుడు జాబిల్లి, రేలపూలు జడధ ♦ రించు భవుఁడు
సంజ్ఞచేసి వారిఁ - జాలింపుఁడని విష్ణు, వదన మట్టెచూచి ♦ పలుకఁదొడఁగె. ౧౯౫

తే॥ పద్మనేత్ర! రక్కసులు మా - వరబలమున, మూఁడుజగముల హింసించి♦ముంచినారు
ఇంకనైన వారల వధి ♦ యింపకున్నఁ, జిటికలో జగద్ధ్వంసంబు - చేయఁగలరు. ౧౯౬

క॥ అనిహరుఁడు విస్మయింపఁగ, వినతులగుచు నమరులెల్ల - వినుతింపఁగ న
వ్వనమాలి చింతపడకుం, డని వారల తలలఁ ద్రుంతు - నడలకుఁ డింకన్. ౧౯౭

తే॥ అయిన నొకమాట చెప్పెద • నవధరింపుఁ, డమరులెల్లఁ గ్రోఁతులు గాఁగ • నడవులందు
గొండలందునఁ బుట్టుఁడు-కూటములుగ, ననుచుఁ గరుణామో మలరంగ- ననియెనిట్లు.

తే॥ దానవుల వరముల జీవి • తముల తోడ, మాఱులేని యస్త్రములచే • నీఱుచేయ
జలధిఁ బోలిన చతురంగ • బలము గలుగు, నాజికిం గుమారుఁడనయి • యవతరింతు.

తే॥ వలమురియుఁ జక్రమును బడ • బాగ్ని నేని, మాడ్చువిసముతో విరివిఁ బూ • మ స్తకములు
గలుగు శేషుఁడు నాకుఁ ద-మ్ములుగఁబుట్టు, వారలాయయోధ్యాపుర -వరమునందు.

క॥ అతఁడిట్లు పలుకఁగా వా, సిత తులసీమాలఁ బాల్చు - శ్రీవరుఁ డిపుడే
హితముగ మము గాచె ననుచు,, గుతుకంబున నాడిపాడి • కునిసిరి వేల్పుల్. ౨౦౧

ఉ॥ కష్టము వీడెనంచు సుర - కాంతుఁడు మిక్కిలి సంతసించె నా
స్రష్టయు శ్రీగళుండు నమ - ర ప్రకరంబు ముదంబుమీఱ మా
యిష్టముకూడె హీనదశ - లెల్లను నేఁడె తొలఁగె నంచు సం
తుష్టిని బొందెఁ దార్క్ష్యవడి • తో భువనోదయుఁ డెక్కె లీలమై. ౨౦౨

తే॥ మాప్రభుండట్లు వరమిచ్చి మరలు పిదప, జాంబవంతుఁడు భల్లూక • జంభభేది
పుట్టె నాయంశమున నగ్ని • పోలుపుతోడఁ, బుట్టుఁ డనియె నిర్జరులకు-మొదటివేల్పు.

తే॥ అంగదుఁడు వాలి నావార-లనుచు వేల్పు, ఱేఁడనంగ నావాఁడు సు • గ్రీవుఁడనుచు
నర్కుఁడు వచించెనగ్ని నా-యంశమనుచు, నీలుఁ బేర్కొన సమ్మహా-నిలుఁడుచూచి.

తే॥ ఆంజనేయుఁడునాయంశ-మన్నయంత, హరుఁడు నాయంశమాతఁడే-యనియెఁబిదపఁ
దక్కువారలు భువిఁబుట్టఁ - దలఁచినారు, వారిలెక్క యింతని యిడ - మేర కలదె?

మ॥ కరుణావారిధి పంకజోదరుని వా - క్యంబుల్ దలం దాల్చి య
య్యరవిందాసన శంకరాదులు స్వకీ • యాంశంబులం దెల్పఁ భీ
కర కాంతార గిరీంద్ర కందరములం - గ్రవాద్య నాశార్థమై
సురవర్గంబు జనింప నిచ్చగొనుచుం • జొచ్చెన్ వెసన్ నాకమున్. ౨౦౬

తే॥ మునుపె నడచిన దీయంశ-మని వసిష్ఠ, ముని మనంబునఁ దలఁచి, భూ-పునకుఁబలికె
లోకములఁగాచు పుత్త్రుల నీకొసంగు, జన్నమొనరింప మదిని క • ష్టంబు తొలఁగు.

తే॥ అని వసిష్ఠుఁడు పలుకఁగా • నవని విభుఁడు, కేలుమోడ్చి మునీంద్ర మీ • పాలఁబడిన
నాకు దుఃఖముల్గలవె? జ • న్నమునకింక, వలయువానిఁ దెల్లంబుగఁ-దెలుపుఁడనుడు.

సీ॥ శితికంఠుచేతను - స్తుతియింపఁదగువాఁడు, వేదశాస్త్రములందు - వినుతిఁగొన్న
జ్ఞానంబు శాంతంబు - సచ్చరిత్రము వినయంబు మున్నగువాని-యందు నిబుధ

విఖ్యాతుఁడగు తండ్రి - విధముసఁజనువాఁడు, పరిశుద్ధులైన దే - వతలతోడ
దనుజుఁడై తుల్యుఁడగన్న - తండ్రికాశ్యపునకు, కొడుకు విభండ కా - ఖ్యుఁడు లసకు

• తే॥ నతని దయనొంది పెరిఁగిన-యమలగుణుఁడు, సర్వశాస్త్రార్థవేత్త ని-శ్చలుఁడు బ్రహ్మ
సముఁడు లోక విజ్ఞానలే- శంబు లేని, వాఁడు హరిణ శృంగము తలఁ-వఱలువాఁడు.

సీ॥ శేషుని పడగలఁ - జెలువారు భూమిపై మెలఁగు మనుష్యులు మృగములెయను
బుద్ధిగలాఁడు త - పోధనుం డారయ సజ్జానస త్రిపు - రారి వినుత
శాంతాదిసద్గుణ -సంయుతుండగు ఋశ్య, శృంగునిచే వేల్మి - మొసక మొసఁగఁ
బూర్తి గావించినం ♦ బుత్త్రిలు నీకుఁ గ, ల్గుదురని యమ్మౌని •♦ సదయుఁడగుచుఁ

ఆ॥ బలుక నతని పాద ♦ పద్మంబుల కెఱఁగి, యాతఁడిప్పుడెచట ♦ నలరు? నిటకు
నెట్లువచ్చుఁ గృత్య ♦ మెయ్యది? యనిప్రభుఁ, డడుగ మౌనివర్యుఁ ♦ డనియె నిట్లు.

ఉ॥ భూని ధరం భరింపఁదగు ♦ పూజిత సత్త్వుఁడు ప్రేమ సత్కృపా
నూన పదాస్పదుండు సమ ♦ యోచిత బుద్ధిగలాఁ డజయ్యుఁ డు
త్తానపదాఖ్యుఁ డొప్పు మను ♦ ధారణినాథు కులంబువాఁడు తా
మానిత రీతి రోమపదు♦మాన్యు వదాన్యుని గాంచెఁ బుత్త్రిఁగాఁ. ౨౧౧

తే॥ అతఁడు పాలించు నంగరా ♦ జ్యబునందు, చాలకాలము గాఁగ వ ♦ ర్షంబులేమి
జనులు పలుకష్టముల నొంద♦మనుజవరుఁడు,మునులఁబిలిచి కర్తవ్యంబు♦వినఁగఁగోరె

ఉ॥ వారలు ఋశ్యశృంగముని ♦ వర్యుని దెచ్చితివేని వర్షముల్
మేరకు మీఱివచ్చునన ♦ మేదినినాథుఁడు చింతనొంది యీ
ధారణి మానవావళి నె ♦ దఁ మృగజన్మము లంచునెంచు పెం
పారు తపోధనాఢ్యు నిట ♦ కక్కట యెవ్వరు తెచ్చువారనఁ ౨౧౩

సీ॥ అర్ధచంద్రాకృతి ♦ నలరారు నొసళులు, నీలంబులౌ దీర్ఘ ♦ నేత్రములును
అరుణాధరములు చం ♦ ద్రాభమౌ వదనంబు, లాణిముత్తెములపొం ♦ దమరుపండ్లు
బలిసిన బటువైన♦వక్షోజ యుగళంబు, తనరు రోఁచెలులఁ గొం ♦ ద ఱటలేచి
భూమీశ! మేమా త ♦ పోధనాఢ్యుని దెత్తు, మనిన వారల పల్కు ♦ లాలకించి

తే॥ అంత కీరు తగరె? హరి - ణాక్షులార! యంచు వస్త్ర భూషల వారి♦ నాదరించి
పొందు కృతకృత్యులై వేగ ♦ రండటంచుఁ, బంపవారలు తేరెక్కి ♦ బయలుదేఱి.

తే॥ వగల జిగిగుల్కు వెలమాంద్రు♦మిగులదూర, మేగి ఋశ్యశృంగుఁడువసి♦యించునెలవు
యోజనం బున్నదని యెంచి-యొక్కచోటఁ, బర్ణశాల యందుమంద్రి తా -పసులఁబోలె

తే॥ ఆవల విభండకుఁడు లేని - యదను చూచి, ఋశ్యశృంగుఁజేరంగ నా ♦ ఋషివరుఁడు
తన్నుఁ బోలు మొకములంచుఁ- దలఁచి వారి, కుచితరీతిఁ బ్రియముమీఱ ♦ నుపచరించె

తే॥ అర్ఘ్యపాద్యాదు లర్పించి♦యాసనమిడి, విశ్రమింపుఁ డనఁగ వారు ♦ విశ్రమించి

క్రమ మృదులోపచార వాక్యములు పలికి,వడిగఁ దమ యాశ్రమమునకు వెడలినారు.
తే॥ అవలఁ గొన్నినాళ్లేగఁగ్రాసరుగు దెంచి, భువన మోహినులౌ వెలపువ్వుఁబోఁణు
లమృత రుచికంటెఁ దీపైన యరఁటి పనస, మావిపండ్లను దిననిచ్చి మనసు గూర్చి.
క॥ మా యాశ్రమంబునకు వి, చ్చేయుండని ప్రార్థనంబు సేయఁగ నతఁడున్
వారెత్తి మాటుపలుకక, రోమాంచ్రమర వెంబడిన్ మ రుల్కొని చనియెన్.
చ॥ తమ మదివోలె నిభ్రమము తద్దయుఁగూర్చ్చ సమర్థరాండ్రు మో
దమున నిదే యిదే యనుచు దారిని చూపుచు నేగుచుండ మే
లమకము తోడ నప్పుని వ ధాన్యుఁడు వెంబడిఁబోయి యంగదే
శమునట డాయమున్న పడెఁ జాలిన వర్షము భూమి శాంతిలన్. ౨౨౦
చ॥ వరవలు పెక్కులై వఱలు పట్టులు గల్గు కొలంకు లేనులున్
శరధులఁబోలె నిండ గిరి చాపుని కంఠమువంటి మేఘముల్
కురిసెను కుంభవృష్టి; యన ఘుండగు రాజిదినేమి యంచు న
చ్చెరువునఁ జింతచేసి తెలి సెన్ దగు హేతువు నెమ్మనంబునన్. ౨౨౧
సీ॥ పంకజాస్యములు బింబఫలోష్ఠములు ముత్తె, ములవంటి రదనముల్ పొగను పోలు
నీలంపు నెఱికురుల్ నెగడారు జిగిదేఱు, నలచెలు లనువైన వెరవుచూచి
మరపెంచి తేరఁ గా మక్రోధమోహర, హితుఁడైన యాఋశ్య శృంగచూని
నారుప వచ్చెఁగా యని యెంచి యొడలు పూ, రింపఁగా నయ్యంగ నృపవరుండు.
ఆ॥ వేదవేత్తలైన విప్రులతోఁ బరి, వారసమితి తన్ను బలసిరాఁగ
వాద్యవితతి మ్రోఁగ వైభవోపేతుఁడై, నడచె రెండు యోజనములు మున్ను ౨౨౨
ఆ॥ ఇట్టులేగి తాపి-యించు వేఁఖలుగల, వారసతుల నడుమ బలు తపంబు
రూపుగొన్న కొండ రూపున నేతెంచు, ఋశ్యశృంగ మునిని నృపుఁడు గాంచె. ౨౨౩
మ॥ అమితానందము నొంది డెందమున నేత్రాబ్జంబులన్ మోద బా
ష్పము లొక్కుమ్మడి వెల్లివాఱ మునికిన్ సాష్టాంగ దండప్రణా
మము లర్పించి; మహాత్మ జీవములతో మన్నారమంచున్ సుదుః
ఖములం దీర్చితి రంచు రోమెలఁదులన్ భూనాథుఁ డగ్గింపఁగన్. ౨౨౪
మ॥ పనివారల్ మునివర్యులున్ బహుజనుల్ పార్థివ్యుతోఁ జేరఁ గాం
చినయాతండిది వంచనంబనుచు రోఁ చింపన్ సుపర్వాణులున్
ముని కోపంబున కంజ, నొప్పె నతఁడ బ్భాభిమాను సంప్రార్థనన్
ఘనమర్యాద నతిక్రమింపని తరం గ శ్రీయుతాంభోధి నాన్. ౨౨౫
ఉ॥ తోలొఅయందు వజ్రనిభ దుర్దమ ఖడ్గముఁదాల్చినటి భూ
పాలుఁ డనింద్య శీలుఁడగు బ్రహ్మ సముస్ దగఁబెక్కు-సార్లుగాఁ

గేలు మొగిడ్చి వేఁడి తమ ♦ కీడు తొలంగిన తీరు తెల్పఁగా
జాలి మనంబునం దవులఁ ♦ జయ్యన నమ్మని శాంతఁ జూటయుక్. ౨౨౫

తే॥ మోహమడఁచిన సుజ్ఞాని♦మునివరుండు, ఋశ్యశృంగుండు వేడ్కమై ♦ నృపవరేణ్యుఁ
గరుణ వీక్షించి యుపదేశ ♦ కర్తలైన, మునులతో రథమెక్కి య - ప్పురికి నేగె. ౨౨౬

క॥ నగరము కయిసేసి జనులు, మొగి నెదురుకొనంగ రాజ ♦ ముఖ్యుఁడు మునితో
నగరిం జేరి హిరణ్మయ, మగు సింహాసనము మీఁద ♦ నాతని నునిచెన్. ౨౨౭

తే॥ చెప్పఁదగిన దేదియు వేఱు ♦చెలువు లేని, యట్లు తోఁపఁగ నర్ఘ్యపా ♦ ద్యాదివిధుల
నర్చనముచేసి తనకూఁతు♦నతులశాంత, శాంత నొసఁగి వివాహంబు ♦ సలిపివైచె.

ఆ॥ వఱపు దీఱ మేఘ ♦ పంక్తి పర్విపఁగా, నంగదేశకష్ట ♦ మంతరించె
శాంత యుపచరింప ♦ నమ్మని తృప్తుఁడై, యొప్పమీఱ నచట♦నున్నవాఁడు. ౨౩౦

సీ॥ నావుడు మునివరు ♦ నకు వందనంబాచ, రించి నేఁడే వెళ్ళి ♦ ఋశ్యశృంగుఁ
దోడితెత్తు ననుచు ♦ దొరకొని సామంత, నృపులు సుమంత్రాదు ♦ లిష్టజనము
లైన పండితవరుల్ ♦ మానుగఁ గొలిచిరా, దశరథేశ్వరుఁడు ర♦థంబునెక్కి
దుఃఖసంతతి నేఁడె ♦ తుదముట్టె నని సుర, వరులు పూవులవాన ♦ కురియ నడచి

తే॥ కాహళాదిక రావముల్ కడలికంపుఁ, జెలఁగి ఘోషింపఁ బెద్దలా ♦ శీర్వదింపఁ
దలిరుఁబోఁడులు విజయగీ ♦ తములు పాడ, నరుగుదెంచి తా నంగరా ♦ జ్యంబుచేరె.

చ॥ సుతయశుఁడైన యాదశర ♦ థుం డరుదెంచుటెఱింగి యంగభూ
పతి మది నుత్సుకుండగుచు ♦ భ్రాజితభూషులు వంది మాగధుల్
నుతులొనరింప బాంధవ జ ♦ నుల్ పరివారము గొల్చిరా, మహా
తత విభవాధికుండగుచు♦దవ్వుగ నేగెను తా నెదుర్కొనన్. ౨౩౨

ఉ॥ వచ్చిన రోమపాదుఁగని - వారని ప్రేమను కోసలేశ్వరుం
డచ్చుగ స్యందనంబు డిగ - నాతఁడు పజ్జలంబుపైఁబడన్
హెచ్చుగఁ గౌఁగిలించుకొని - యింపగు మాటల నాడుచుండఁ బె
న్మచ్చికతోడ నంగపతి - మానుగఁ జేతులు మోడ్చి యిట్లనున్. ౨౩౩

చ॥ నిలుకడగాఁగ స్వర్గమును - నిల్పి యశంబును గాంచు మిత్రమా!
తలఁపని యట్లు మీరిట క - దాటున వచ్చుట చూడ నాతపః
ఫల మొకొ? మా ప్రజల్ సలుపు - భవ్య తపఃఫలమో? మఱేదియో?
తెలియఁగదయ్య యంచుఁ దన - తేరునఁ దోడ్కొనిపోయె నింటికిన్. ౨౩౪

ఉ॥ అంగవిభుండు హాటక మ - యంబగు సంతిపురంబు లోపలన్
రంగరు రత్నమండప వ - రంబున రాజిలు సింహపీఠిపై

సంగతి నుంచి మన్ననలు - సల్పుచు విందులుపెట్టి ప్రేమను
ప్పొంగుచు వచ్చుహేతువును - మోదముతోఁ దెలుపంగఁ గోరినన్. ౨౩౫

తే॥ తానువచ్చిన కార్యంబు - తగినరీతి, దశరథుఁడు దెల్ప, రోమపా-ద ప్రభుండు
వినుత శలుని ఋశ్యశృం-గుని యచటికి, పిలుచుకొని వత్తునని రాజు-వెడలె మరలి

తే॥ వేదములు మూ ర్తిమంతమై-వెలసెననఁగ, నొప్పు మునిఁజేరి యంగరా-జొక్కవరము
వేఁడ, నతఁడేదియో తెల్పు-వేఁడ! యనఁగ, నాతఁడిట్లని పలికె న-యంబు మీఱ.

ఉ॥ పావుర పిట్టకై కరుణ - పారము ముట్టఁగఁ ద్రాసునెక్కెనే
భూవరుఁ డట్టి సత్కుల వి - భూషణుఁ డంచిత ధర్మమూ ర్తి దై
త్యావళి నాజిఁ దున్మి దివి - జాలయ మెప్పటి నిల్పె నా యయో
ధ్యావని నాథుఁ డేలు పురి - కర్మిలి మీఱఁగఁ బోయి రండనన్. ౨౩౮

ఉ॥ మంచిది తేరు తెమ్మనఁగ - మానవనాథుఁడు మిత్రు కోరికల్
మించి ఫలించెనంచు నెన - మీఱిన సంతసమంది తేరు తె
ప్పించితి బాలచంద్రసమ - విస్తృత భాల రమాసమాన ప్రే
మాంచితమూర్తి శాంత యరు • దారఁగఁ దోనరుదేర లెండనన్. ౨౩౯

తే॥ మనుజపతి కేలుమోడ్చి న-మస్కరింప,మునులు పెక్కండ్రు తనచుట్టు-మొనసి రాఁగ
శాంతతో ఋశ్యశృంగుఁడు-సంతసమున, రథమునెక్కి యయోధ్యకు-రాణనేగెనరం

తే॥ తమ్ముగాల్చి హింసించెడు-దనుజవరుల, నడఁప విష్ణుండు భూమిపై-నవతరించు
ననుచు ధర్మదేవతయు నిం-ద్రాది సురలు,వాద్యములుమ్రోగ మంచిపూ-లవైచినారు

క॥ దూత లయోధ్యాపురమున, కేతెంచి మునీంద్రురాక-యెఱిఁగించిన నా
భూతల నాథుఁడు మీఱిన, కౌతుకమను సాగరమ్ము-కడలుల దేలెన్. ౨౪౧

క॥ అరదము చేర విరిసోనలు, గురిసెను; దుందుభులు పెల్లు-ఘోషించె; మునుల్
విరివిగ దీవన లొసఁగిరి; విరిసెను మొదలంటఁ బాప-వితతులు భూమిన్. ౨౪౩

సీ॥ పుడమి యదరుపుట్ట-బెడిదంపు భేరుల, మ్రోఁతతో దశరథ - భూమివరుఁడు
తన మదింగల దుఃఖ-మను పర్వతంబు ను,గ్గై నది యనియుబ్బి - మానితముగ
గొప్ప తపములెల్లఁ - గూటువలై యక, లంకరూపము దాల్చు - లలివెలింగి
జింకతో లును నార - చీరయు ధరియించి, దివ్యాల కష్టముల్ - దీక్షయజ్ఞ

తే॥ కర్మము లొనర్చు నేర్పధి - కముగ వెలయు,వాని బ్రహ్మదండం బాత-పత్రిమును క
మండలువు గలవానిని - పండుతపము, గలుగువానిని కన్నులఁ-గాంచె విభుఁడు. ౨౪౪

తే॥ రథము దిగి విభుఁ డతని చ-రణ సరోజ,ములకు మ్రొక్కఁగఁ బ్రాఁజదు-వులను తీఁగ
లెలమిఁ బ్రాఁక మాఱాకు నా-వెలయునతఁడు,చెలఁగి యర్ఘ్యపాద్యాక్షభా-శిస్సులొసఁగె

ఉ॥ ఆ ఋషితోడ వచ్చిన మ-హర్షులు దీవన సేయఁ దోయము
గ్ధారలఁ బోలు దానజల - ధారలఁదోఁగు కరంబుల న్నమ
స్కారముచేసి భూఁపుడు వి- శాల మనోహర నేత్రయుగ్మ మొ
ప్పారెడు శాంతతోడ రథ - మందునఁ దోడ్కొనివచ్చె నాతనిన్. ౨౪౬

తే॥ రత్నమకుట విరాజచ్ఛి . రస్కుఁడంతఁ, గమలవదనలు విజయగీ-తములు చదువఁ
జెవులు వాద్యఘోషములచేఁ - జిల్లులువడ, నగరముం జేరెఁ దా ముని - నాథుతోడ

తే॥ పాపమూలంబులౌ చెడు - పనులుచేయు, దొంగలై దుగురం దుంప-దూల్చినట్టి
మునివరుఁడు వసిష్ఠుఁడువేద-మూర్తి ఋశ్య,శృంగుఁడును రాట్సభ వెలుంగ-జేరినారు

క॥ ఇహామునఁ బ్రాఁజదువులవలె, మహిమగలుగు ఋశ్యశృంగ-మౌనివరుని దా
బహుమాన పూర్వకంబుగ, మహిపతి యుపచారములఁ గ్ర - మంబుగఁ దేర్చెన్.

తే॥ ధర్మమును తపమ్మును మేను♦దాల్చినట్లు, వెలయు పరిశుద్ధమూర్తి! మీ♦లలితకరుణ
వలనఁ దరతర మెడలేక ♦ వచ్చు రాజ్య, పాలనము నెలకొనె నాత♦పము ఫలించె.

తే॥ అనుడు మునివరుఁ డిట్లను ♦ ననఘ! నీవు, వరతపోధను సాయంబు ♦ వడసినాఁడ
వమల కార్యంబులే చేయ ♦ నరయువాఁడ, విట్టి నిను పోలుదురె రాజు♦లెందఁజేని?

క॥ గిరి నిభ చాప భుజా! నను, కరమరుదుగఁ బిలువనంపు♦కార్యము శ్రేయ
స్కరమగు హరిమేధమునకొ, మఱి దేనికొ చెప్పవయ్య ♦ మనుజేంద్ర! యనన్.

క॥ కడగానని పెక్కేఁడులు, పుడమిని పాలించి వినుగుఁ ♦ బొందితి సుతులన్.
బడయనయితి రాచతగవు, తడవి నడపు తనయు నాకు♦దయచేయుము నాన్. ౨౫౩

క॥ భువిమాత్రమె? పదునాలుగు, భువనంబుల నేలఁజాలు ♦ పుత్త్రిల నొసఁగం
దవు మఖము నిప్పుడే యిటఁ, దవిలి నడపు మనుచు ముని ము♦దంబునఁ బలికెన్.

## పుత్త్రకామేష్టి.

ఆ॥ జన్నమునకు వలయు సామగ్రు లన్నిటి, విరివిగాఁగ దెచ్చి ♦ పేర్చినారు
చక్రవర్తి శుద్ధ జలమున నీరాడి, శాస్త్రయుక్తి నమరు ♦ సాలఁజేరె. ౨౫౫

తే॥ విధియుతముగమూఁడగ్నులు♦వేల్చియాహు,తులనొసంగుచుఁబండ్రెండు♦నెలలు♦రప
దేవదుందుభుల్ మ్రోసెను♦దివిజులెల్లఁ, బై నిలిచి తృప్తుల మనుచుఁ♦బలికినారు. ౨౫౬

తే॥ వదనములు వికసింప దే♦వతలు కల్ప, పుష్పముల దూసిచల్ల న- మ్మునివరుండు
సుతుల నొసఁగంగఁ దగిన యా♦హుతుల వేల్చె, నగ్నికుండంబునందు శా♦స్త్రానుసరణి

తే॥ అంతఁజుట్టి మండెడు వహ్ని♦యనఁగనొప్పు, వెంట్రుకలు నెఱ్ఱని కనులు♦వెలయు భూత
మొండు సుధఁబోలు నన్నంబు♦నిండుగఁ గల, స్వర్ణపాత్రముతో నటఁ ♦ బైకి లేచె,

తే॥ లేచి యాపాత్రమట నుంచి • లీలతోడ, నందె మఱుఁగయి పోసన • య్యతివరుండు
దశరథుంగాంచి యీయమృ • తంబు నీదు, భార్యలకుఁ దగు రీతిగా • బంచు మనియె.

తే॥ అతని యాజ్ఞాప్రకారమా • యవనివిభుఁడు, పేశల విసిల గురుకేశ • పాశమును వె
లుంగు మోము బింబాధరం • బంగుమీఱు, చుండు కౌసల్య కొకభాగ • మొసఁగినాఁడు

తే॥ కొలఁకులును నదులును వన-ములును హంస, పిండుఁగల కోసలమునకు-విభుఁడు పిదప
మొదటి పద్ధతినే చేత-మొసయు దాన, సగము కైకేయి కొసఁగె ని - ర్జరులు పొగడ.

తే॥ శత్రు భీకర బలయుత - చక్రవర్తి, సగమొసఁగె సుమిత్రకుఁ దొంటి - చందమునను
శత్రువులు నశించిర యంచు-శచీవిభుండు, తన్ను పోలు దివ్యులతోడఁ-దవిలి యార్వ.

క॥ ఎడమ దెస శత్రువిశతికిఁ, గుడిభాగము తక్కు- జీవ - కోటికి నదరన్
గడమయు సుమిత్ర కే పద, పడి యొసఁగెఁ బ్రభుండు ప్రజయుఁ - బరితోషింపన్.

తే॥ తురఁగమేధ యజ్ఞంబుఁ బు-త్త్రులకుఁ జేయు, జన్నమును సక్రమంబుగా-జరగు పిదప
జగములం గాచు బలశాలి -చక్రవర్తి, జనము స్తుతియింప నయ్యాగ-శాల విడిచె.

చ॥ క్రమముగ శాస్త్రపద్ధతిని - కార్యకలాపము పూర్తి కాఁగఁ గ
ష్టములఁ గలంగు ప్రాణులును - సంతసమందెను వాద్యఘోషముల్
తుములముగాఁ జెలంగె గుణ - ధుర్యుఁడు కోసల భూవిభుం డపా
రముగఁ గృపాతరంగములు - రాజిల నిల్చెడు కొల్వు చేరఁగన్. ౨౬౫

ఉ॥ చేయఁగఁ దగ్గ పద్ధతులు - చెప్పెడు శాస్త్రవిధిన్ విరుద్ధముల్
డాయనిరీతిఁ జేయఁగఁ గ - డంగి రమాపతికిన్ సురాళికిన్
ధేయములౌ హవిస్సుల ను - దీర్ణత నిచ్చి మహీసురాళికిన్
పాయక హేమవర్షము న - పారముగాఁ గురియించె నిమ్ముగన్. ౨౬౬

తే॥ రాజులకుఁ బాలనము తోడ - రథ గజాశ్వ, ధన విభూషణాంబరములు - తగినరీతి
నిచ్చి వాద్యంపు మ్రోఁతతో-నేగి సరయు, వందు పెంపార నవభృథ - మాచరించె.

సీ॥ భేరులు శ్రేణులై - మిన్నంట మున్నుమ్రోఁగ, బహువిధ వాద్య రా-వములు చెలఁగ
ముత్యాల గొడుగులు - ముద మొప్పఁ బైనిల్చి, నినుపారఁ జల్లని • నీడ నొసఁగ
పలువురు రాజులు - బలసి నల్వంకలఁ, గొలువ వెలసి రాచ - కొలువు చేరి
బ్రహ్మయు సిగ్గిలు - ప్రాఁజదువులగని, యగు గురుపదములు - తగ భజించి

తే॥ దీవనలుగొని గొప్పకీ-ర్తిని వహించు, మునికి ఋశ్యశృంగునకుఁ గే-ల్మోడ్చి దేవ!
కలఁ గృతార్థుఁడ నింక నా • కేమి వలయు? నంచు నింపుమాటల గౌర-వించి మఱియు.

చ॥ పరమ తపోనిధీ! భవద - పారకృపా మహిమంబుచేత దు
స్తర గురు దుఃఖరాశి కడు - దవ్వుల కేఁగెఁ గృతార్థుఁడై తి నం

చరమరలేక పల్కి-స ధ - రాఘ్యుస కష్టు వికాసమానసుం
దురు గుణుండౌ మునిప్రవరుం - డొప్పుగ దీవన లిచ్చెఁ బ్రీతిమై. ౨౮౯

ఉ॥ తక్కుమునీంద్ర సంతతి యు- దారగుణుండగు రాజు భ క్తిమై
మ్రొక్కఁగ దీవనల్ సలిపి - మోదమునొందిన ఋశ్యశృంగుతో
నొక్కటఁ గూడి పైనమయి - రొప్పుగ భూపతి చాలదవ్వు పెం
పెక్కఁగఁ బోయి వీడ్కొలుప - నేగె స్వదేశము ఋశ్యశృంగుఁడుఁ. ౨౯౦

తే॥ అవలఁ గొన్నినాళ్లకుగంగ- సతని సతులు, గర్భములు ధరియించి వి-క్ల మము నొంద
మోములేకాక తక్కఁగ-ములును సొంపు, నూనఁ జంద్రసమానలై - కానఁబడిరి. ౨౯౦

## శ్రీ రామ జననము.

సీ॥ ఉర్వికి రోమాంచ - మొదవఁ బునర్వసు, కటకముల్ మిన్నంది - గఁతు లిడఁగ
మానరాజము చైత్ర - మాసంబుగాఁగ స, వమి తిథులఁ గౌర-వంబు నొంద
సౌమ్యవారము చాల - సార్థక్య మొందంగ, శుక్ల పక్షము మఱి - శుద్ధిగాంచ
గరుడ పన్నగ సిద్ధ - గంధర్వ కిన్నర - సాధ్య విద్యాధర - సముదయములు

తే॥ నిత్యసూరులు శ్రేణులై - నిలిచి యుత్స, హించి కోలాహలముసేయ - నెడఁదలోని
కలఁకవిడి ధర్మదేవత - యలరు చుండ, జీవకోటి సంతసమునఁ-జెలఁగుచుండ. ౨౯౨

సీ॥ సకల సద్గుణఖని - సన్నుత చారిత్ర, జనుల మేటి కౌ - సల్యగనిరు
నొకకాలమునఁ దన - యుదరంబునందు భు, వనముల నణఁగించి ♦ కొనెడివాని
నాల్గువేదములకు - నలువకు మునులకు, మానుగా నెఱుఁగంగ - రానివానిఁ
గాటుక క్రొమ్మొగుల్ - నీటు చూపుచును తే,జోరూపుఁడై వెల్గు - సొగసుకాని

తే॥ అఖిల శుభలక్షణంబుల - కాలవాలుఁ, దుదిమొదలు లేక యెఱుకకుఁ - దోచుశీలు
రాక్షస కులాంతకుని భ క్త-రక్షణాఘ్యు, ధర్మసంస్థాపకుని మహో-దార గుణుని ౨౯౩

ఉ॥ మోదముతోడ నార్వసుర - ముఖ్యులు దిక్కుల మింటనిల్చి యిం
ద్రాది దిగీశులు న్నమితు - లై రయిగి దీవనలీయ వాయువా
మోదముతోడ వీవఁ బొర - పొచ్చెముగాంచని కైకపుమ్మయిఁ.
గాదిలిసూను నొక్కరుని - గాంచెను లగ్నము మీనమొప్పఁగఁ. ౨౯౪

మ॥ ఋతుధరోన్నతిత వృక్షరాజయుత భూ-భృద్వార దుర్వార ప
క్షతులంద్రుంచిన యింద్ర ముఖ్యదివిజుల్ - కైవారముల్ సేయ భూ
పతి ప్రేమంపుఁ గనిష్ఠదేవి సుతు నొ - ప్పంగాంచె నాశ్లేషతో
జత యయ్యెం గటకంబు పావనముగా - సంపూజ్యమానంబుగఁ. ౨౯౫

చ॥ పలుపడగల్ ధరించిన కృ - పాళుఁడు శేషుఁడు మోచు భూమియుఙ్
చెలఁగి నటింప వేదములు - చెచ్చెర నాటకమాఁడ గీర్తి రా
జిల హరిరాశికిఙ్ మఖకు - శీలగుణాన్విత నీలనేత్ర పెం
పలరు సుమిత్రగాంచె సుగు - ణాకరుఁడౌ మఱియొక్కపుత్రికఙ్. ౨౪౭

ఉ॥ ఆడిరి మేనకాదు లను - రావళి సిగ్గై నటంచు నుబ్బుచుఙ్
బాడిరి కిన్నరుల్ మధుర - భావములఙ్ సుధఁబోలు పల్కులఙ్
దీఁడిరి పెక్కువాద్యములు - దివ్యులు వ్యోమము బూరటిల్లఁగా
వేడిరి దైవముఙ్ భయము - వీడి చరించిరి దేవమానవుల్ ౨౪౮

చ॥ చెలువలు పాఱివచ్చి ప్రభు - శేఖరుతో సుతజన్మ వృత్తముల్
పలికిరి సంతసంబునను - పాడిరి యాడిరి బ్రాహ్మణోత్తముల్
దెలిపిరి జన్మలగ్నములఁ - దేరిన సత్ఫలముల్ జగంబునఙ్
గలిగిన కష్టసంతతులు - కష్టములోం దెడి నంచు నుబ్బుచుఙ్ ౨౪౯

తే॥ ధర్మ భాల పట్టముగల - దంతిబోలు, రాముజన్మంబు మేష చై - త్రంబు శుద్ధ
నవమితిథి పునర్వసువు ల - గ్నంబు కటక, ముచ్చగతులు సల్వురు పదు - నొకటవారు

తే॥ తగిన పద్ధతిఁబరికించి - తక్కుముగుర, రీతి జాతకములు పైడి - తేకులపయి
వ్రాసి దేవగురుండును - ప్రస్తుతింపఁ, జదివినారలు తత్సభా - స్థానమందు. ౨౫౦

తే॥ చక్రవర్తి సంతసమున ♦ సరయువునకు, నరిగి స్నానంబుచేసి ధా ♦న్యంబు ధనము
సమితముగనిచ్చి భవ్యవా-ద్యములతోడ, గురునితోనేగి కొమరుల-కొమరుగాంచె.

సీ॥ కాంచియుప్పొంగి రోషమూంచువైఁ డేఁడు, లుర్వికిఁబన్ను లే కుండుఁగాక!
బొక్కసంబుల తలు ♦ పులు తీసివేయుఁడు, యుద్ధంబు లింక లే ♦ కుండుఁ గాక
భూవిభుల్ తమదేశ ♦ ముల కేగుదురుగాక! ధర్మక్రియావృద్ధి ♦ తనరుఁగాక!
తిరునాళ్లచే దేవ ♦ తృప్తి యొప్పెడుఁగాక!, మూఁడువేళల పూజ ♦ మొనయుఁగాక!

తే॥ అగ్రహారముల్ చదుకము-లాలయములు, వేడ్కవనములు క్రొత్త వి ♦ వెలయుఁగాక!
అనుచుఁ జాటింపఁ జారుల ♦ కాజ్ఞయొసఁగె, నెల్లమీఱిన మెలమి ని ♦ లేశ్వరుండు. ౨౫౧

తే॥ ప్రభువునాజ్ఞను గొని తల ♦ వరులు మంచి, యేనుఁగులనెక్కి తుడుముల ♦ నడ్చికొట్టి
దేశమందెల్లఁ జాటించి ♦ తెలిపినారు, పురుషులును స్త్రీలు సంతోష ♦ శరధి మునుఁగ.

చ॥ క్రమముగఁ బ్రేమ మీఱఁగఁ బ ♦ రంపరలై చెలరేఁగఁ గేఁక లో
కమొగిఁ జెమర్చి మేలు పుల ♦ కంబులకుం గులకంబులయ్యె వృ
త్తము వినునెల్లవా రెదురు ♦ దార్కొను వారి కొసంగి రెచ్చు ద్ర
వ్యము; భగవంతుఁడే జనన ♦ ముందుట వారిమొదల్ గ్రహించెనో? ౨౫౨

చ॥ విరివిగ వీథులొప్పె నల ♦ వీట వెలందులు చేటికల్ చెలుల్
తరుణులు పౌరులుం దమి దమ ♦ లర్వఁగ నూనెయుఁ జందసంబుఁ గ
స్తురియును నేయి గందవొడి ♦ యొప్పడ వీథులఁ జల్లి ముగ్గులన్
మురువుగఁ దీర్చి పండుగలు ♦ మోదముతోఁ గొనియాడి రత్తఱిన్. ౨౮౯

తే॥ ఇట్లు పౌరులు మదినిండి ♦ యెల్లమీఱి, వెల్లివిరియు మోదముతోడ ♦ వీఁగి యుబ్బి
తనువు లెఱుఁగక పండ్రెండు ♦ దినములుండ, శిశువులకుఁ బేరువెట్ట వ ♦ సిష్ఠుఁ డెంచె.

నామకరణము.

తే॥ మొసలి పోరుటచే డస్సి ♦ పూర్వ జన్మ, పుణ్యమునఁ గజేంద్రుం డాది ♦ మూల! యనఁగ
వచ్చి యపుడె కాచిన నిత్య ♦ వస్తువునకు, రాముఁడను పేరువెట్టె దూ ♦ రంబు చూచి.

తే॥ వ్రతములందెల్ల వేదశా ♦ స్త్రములయందు, నిత్యవస్తువు నటుచేతి ♦ నెల్లెఁ బోలె
నెఱిఁగిన మునీంద్రుఁ డవ్వలి ♦ చిఱుతవాని, కిడియె భరతుఁడన్ నామంబు ♦ నెడఁద నెంచి.

తే॥ పుట్టినప్పుడె వంచకుల్ ♦ పొలిసినారు, సురలు బ్రదికిరి దుఃఖంబు ♦ ధరణి నీఁగె
ననుచుఁ గాంతి సొగసు బల ♦ మమరు బుడుత, కమరిచెను లక్ష్మణాఖ్య సా ♦ ర్థముగ వెలయ.

తే॥ ముత్తెములె యొకబిడ్డ రూ ♦ పును వహింప, సందు చెందామరలు విరి ♦ యంగ నొప్పు
సొబగు గల్గు నీజ్యోతిచే ♦ సుకృతులెల్ల, పగ లటంచు శత్రుఘ్నుఁడన్ ♦ ప్రఖ్యయుంచె.

ఉ॥ పొల్లగు మార్గ మింతయును ♦ పొందని పుత్త్రుఁడు వేదపద్ధతిన్
బిల్లల పేరువెట్టఁ బృథ ♦ వీపతి చేతులనుండి దానమున్
వెల్లువ లుప్పతిల్లి తగ ♦ నిర్మల నిర్గుణ నిత్య తత్త్వముం
జల్లగఁ గాంచు మానస వి ♦ శాల తరాబ్ధుల నించె సత్తఱిన్. ౨౯౦

ఉ॥ సల్లని కల్వ లెత్తి నలి ♦ నంబులు నోజ లిఖించు తీరునం
జెల్లు మనోజ్ఞతం దనరు ♦ జ్యేష్ఠునియందె మహీశ్వరేశ్వరుం
డెల్లకు మీఱు ప్రేమము వ ♦ హించె శరీరము ప్రాణ మెప్పుడే
నొల్లవు వేఱువేఱుగ నొ ♦ కొక్కటి నిల్వఁగ నన్న చెన్నునన్. ౨౯౧

మ॥ అమృతం బొల్కెడు తొక్కుపల్కులు బెడం - గౌ తప్పటడ్గుల్ క్రమం
బమరంగా నలవాటు గొంచుఁ దమి వా ♦ యం బుట్టు నాదిత్యు చం
దమునన్ శబ్దముచేతనే యెదుఁగు వే - ద ప్రక్రియన్ భూమి దే
వి మనస్సంకటములు నశింపఁగ వెసం - బెంపొంది రప్పుత్త్రకుల్. ౨౯౨

క॥ నెలతాల్పుఁ బోల్వసిష్ఠుం, డలరుచుఁ జౌలంబు నుపన - యనము జరపి యీ
కొలఁది యనరాని నిలుకడ, గలుగు శ్రుతులు శాస్త్రములును - క్రమముగ నేర్పెన్.

సీ॥ హారుల నెక్కుటయును - కరుల నెక్కుటయును, తేరుల నెక్కుట - నారనేర్పి

5

చ॥ అని యిటు తత్పురీజనము ♦ లర్మిలి నాతని కీర్తి నిండఁగీ
ర్తనములు సల్పఁ దమ్ములు ప ♦ దమ్ముల చాయ వసించి సంస్తుతుల్
పొసఁగుప సర్వలోకులకుఁ ♦ బూజ్యులు నాయకులౌ త్రిమూర్తులన్
దనరగు నాజ్ఞ నద్భుతగుణ ♦ ధాముఁడు రాముఁడు భూమి వర్ధిలెన్. 30౨

తే॥ రాజరాజగు దశరథ ♦ రాజమూర్తి, ధరణియెల్ల నేకాతప ♦ త్త్రంబు నీడఁ
దనర జయభేరి మ్రోఁత రో♦దసియునిండ, మునులు హాగశ నానందాబ్ధి♦ మునుఁగుచుండ

## ౬. అర్చనా పటలము. (౨౪)

చ॥ ననలుతలిర్చు కల్పక వ ♦ న ప్రభ నింపెడు స్వర్గ పత్తనం
బున వసియించు నెల్లరును - పొందికఁ జేరెడు శంక గొల్పి నె
మ్మనమున కూహకందని య - మర్త్య జగంబునకంటె నున్నతిం
బొసఁగెడు రత్నమండపము ♦ పొల్పు వహింప నరేంద్రుఁ డుండఁగన్. 30౪

తే॥ అమల మార్దవ భూరి సిం ♦ హాసనమున, రమణ నుండు భూపతిని చా♦రణులుగాంచి
యింద్రుఁడని తొట్టతొలి సంశ ♦ యించి పిదప, రేయికనులు లేవని శంక♦వీడినారు

కౌశికుఁడు దశరథుని గాన వచ్చుట.

చ॥ జగములఁ బ్రాణులన్ సురల ♦ సారసగర్భునితోడ వేఱుగా
నెగడ సృజింప నెమ్మదిని ♦ నిట్టలుకన్ మొనకట్టినట్టి స
ద్గుగలుగువాఁడు బ్రహ్మఋషి ♦ దుర్దమ సింహపరాక్రమాభ్యుఁ బు
ణ్యగుణ విభూషణున్ దశర ♦ థావని నాథుని గాన వచ్చినన్ 30౬

చ॥ గురుమతిఁ బద్మసంభవుని ♦ కూర్మి నెదుర్కొను నింద్రుపోల్కి, భూ
వరుఁ డురమందు దాల్చిన ప్ర ♦ భా మణి హారము సూర్యుఁబోలె నం
బరమును కాంతిమంతముగ ♦ మార్చఁగ వైభవమలేచి, యమ్మునీ
శ్వరు పద పంకజంబులకుఁ ♦ జాఁగిలి మ్రొక్కె సభక్తికంబుగన్. 30౭

ఉ॥ మ్రొక్కి యనామయం బడిగి ♦ భూరిమణీమయ సింహపీఠిఁ బెం
పెక్కఁగ నుంచి పాదముల ♦ నిచ్చ భజించుచుఁ గేలుమోడ్పుతో
మ్రొక్కి మదీయ పాపములు ♦ శుద్ధ చరిత్రులు మీరు వచ్చుటన్
నిక్కము నేను ధన్యుఁడ ము ♦ నిప్రవరా! సరివారిలోపలన్. 30౮

ఉ॥ మోదముతోడ నే వలచి ♦ మ్రొక్కుటకుం దగునట్లు మీర లెం
తో దయనిట్లు రాఁగతము ♦ యోచనచేసిన దేశభాగ్యమా?
కాదు; మదీయసత్కృతులు ♦ కారణమా? యనఁగాదు నాదు; వం
శోదిత పూర్వభూవరుల ♦ యుత్కట పుణ్యఫలంబె యయ్యెడున్. 30౯

సీ॥ అనుచు భూవరుఁడు ప్రి ♦ యంబు లాడిన గాధి, నందనుం డిట్లను ♦ నయము మీఱ
శత్రు విమర్దన ♦ శాత కృపాణ ద, క్షిణహ స్త! యనుపోలు ♦ మునివరులును
త్రిదివవాసులు నొక ♦ దెప్పరంబును బొంది, రేని నిక్కము వచి ♦ యింతు వినుము
హసిత సమస్త మ ♦ హాద్రి విలాసంబు, వెల్లని చల్లని ♦ వెండికొండ

తే॥ పాల సంద్రంబు పద్మజు ♦ పట్టణంబు, కల్పక వికాస భాసి స్వ ♦ ర్గంపు నగరి
యింపు గులుకు మేడలుగల ♦ యీ యయోధ్య, తక్క వారికి నెవ్వొక్క ♦ దిక్కు గలదె?

సీ॥ రాజ శిరోమణీ! ♦ రమణీయ కిసలయ, ప్రచయ సుందర సుర ♦ పారిజాత
వృక్షంబు గందంబు ♦ నీచుచు మధుకణం, బులు బొట్లు బొట్లుగా ♦ నొలుకుచుండఁ
జల్లనౌ నీడ వి ♦ శ్రాంతిఁ జెందుట వీడి, నీ యొక్కటి గొడుగు ♦ నీడఁజేరి
తమ కొఱంతలఁదెల్పి ♦ తగు సాయ మర్థింపఁ, గులగిరి నిభభుజుఁ ♦ గ్రూరచరిత

తే॥ శంబరాసురుఁ గులముతోఁ ♦ జావఁ బొడిచి, వశము గావించికొని నాఁడు ♦ వాసవునకు
నీ వొసంగినదే కాదె ♦ నేఁడుగూడ, నతఁడు పాలించుచున్నట్టి ♦ యమరజగము.

## కౌశికుఁడు యజ్ఞరక్షణార్థము రాముని గోరుట

చ॥ నలువుగ భేరి వాద్యము ల ♦ నారతముం జగడించుచుండు మో
సల గల భూవిభుండు ముని ♦ చంద్రుని వాక్యము లాలకించి ము
జ్జలధి మునింగి పొంగి ఋషి ♦ సత్తమ! రాజుగనుండి పొందు స
త్ఫలమును గంటి నింకఁ జలు ♦ పందగు దాని విధింపుఁ డర్మిలిన్. ౩౧౨

చ॥ అనవుడు మౌని యిట్లను జ ♦ నాధిప! నేనొనరించు జన్నముల్
బనివడి యోగి వర్యుల త ♦ పంబున క య్యరిషట్కముంబలెన్
దనుజులు విఘ్నముల్ చలుపఁ ♦ దార్కొను వారలు, దాని మాన్ప నీ
తనయులలోన జ్యేష్ఠుని ము ♦ దంబున నా వెనువెంటఁ బంపుమా. ౩౧౩

సీ॥ అని ప్రాణమర్థించు ♦ యమునికై వడి వేఁడఁ, తపియింపఁజేసిన ♦ తపసి పలుకు
నెఱుకు నాటఁగ నీఁటె ♦ నెఱవిన పుంటిలోఁ, గొఱవిదూర్చిన యట్లు ♦ గ్రుచ్చి చెవులఁ
గాఁడినయంతన ♦ కాలదండముఁ బోలు, నాయుధపాణియా ♦ నవనిభర్త
మనసునఁ బొడమిన ♦ పెనుచింత పట్టి వె, ల్వలికిఁద్రోబ్బఁగ ప్రియ ♦ ప్రాణ వితతి

ఆ॥ ఉదరి డోల కరణి ♦ నూఁగగఁ జనుపొంద్ధుఁ, డెడను నేత్రములను ♦ పడసి మరల
నవియ నవసి కుములు ♦ ననువున మిగుల సం, తాపమొంది కుందెఁ ♦ దల్లడిల్లె. ౩౧౪

సీ॥ పెర యూరుక్రియఁదేనె ♦ కురియు సుగంధ మా, లిక ధరించిన ప్రభుఁ ♦ డొక విధముగఁ
జింతను మది నడం ♦ చి కొని కౌశికుఁ గాంచి, యిట్లను మునివర్య! ♦ యితఁడు బాలుఁ
డస్త్రశాస్త్రిఁ డిదియ మీ ♦ యాజ్ఞ యేని వినుండు, గంగాధరుండును ♦ కమలభవుఁడు
నిర్జరేశ్వరుఁడును ♦ నిలిచి యొక్కొక్కరై, గుమి గూడియేనియుఁ ♦ గూర్చునట్టి

ఆ॥ విఘ్నతతికి మాకు విఘ్నంబుచేసి ని, ర్విఘ్నముగ నొనరు • నేల్మి మీకు
బాలు మాట మాని • యయులు దేటుండు మీ, వెంట నపుడు సేస • వేసల వత్తు. 3౧౯

సీ॥ పరమేష్ఠి సృష్టికిఁ • బ్రతిసృష్టి చేసియు, కౌశికుఁ డతఁ డనా • క్యపుప్మ వినుచుఁ
జెను కిన్కతో లేవ •విబుధులు బ్రహ్మయ మం, చును కాదనుచు శంకఁ • జొచ్చినారు
రవి మండలం బంబ • రంబున మఱుఁగయ్యెఁ, గలఁతనొందినవి జ • లంబులెల్ల
దిక్కులఁ దిమిరంబు • నిక్కె కాపులు గప్పెఁ, గుల పర్వతంబులు • చలనమొందె.

తే॥ మునికిఁ గనుబొమల్ నొసటిపై •ముడులుపడియెఁ, బెదవు లదరెను జేగుఱు•బెరసి కనుల
నిప్పుకలు రాలె సభయెల్ల • నిలుకడ చెడె, తోడనే సర్వ సైతము • దోఁచెనంత.

తే॥ ఇంతయును వసిష్ఠుఁడుగాంచి•శాంతిఁబొందుఁ, డనుచు గాధేయునేఁడి జ •నాధునితోడఁ
బలుకు సుతులకుఁ బొందింప • వలదు కానిపి,మేల్లు వచ్చుకాలమును నాఁప •మేరయగునె?

తే॥ వానకురియంగ వెల్లువల్ • పరువులెత్తి, యంబుధిఁ జేరుచందాన • పలువిలేని
యఖిలవిద్యలు నీసుతునంటి • సరుగుపెంచి, సీకువరూరుఁ జేరెడి వేళ • నేఁడు కలిగె.

తే॥ అనుడు కులగురు వాక్యంబు • లాలకించిఁ యాజి విజయశీలుం డాజి • యరిగి రాముఁ
బిలువుఁడన భటు లేతెంచి పిలుచునంత, బుద్ధిమద్వర్యుఁ డరుదెంచి • సొంత నిలిచె.

## రామలక్ష్మణులు కౌశికు వెంటఁ జనుట.

ఉ॥ తమ్మునితోడ వచ్చు గుణ • ధాముని రాముని చూపి మౌని ర
త్నమ్మ! మదీయ పుత్త్రులకుఁ • దండ్రివి మేలగు తల్లివీవె ప్రే
మమ్మున నొప్పగించితిని • మానుగఁ గావుఁడు వీరిచేత మీ
కెమ్మెయి కార్యముల్ వలయు • నెల్లను గైకొనుఁ డంచు నిచ్చెనర్. 3౨౦

చ॥ విమలచరిత్రుఁడైన ముని • వీరుఁడు భూవరుఁ డొప్పగించు నా
సుమతులఁ గాంచి మున్ను మదిఁ • జొన్పిన కోపము వీడి ప్రేమతోఁ
దమిఁగొని దీవనల్ సలిపి • దగ్గఱి పుత్త్రకులార! మేటి జ
న్నము మన మూని పూరితీ రెను • నర్తమ? యంచుఁ జనం దొడంగినన్.

చ॥ జగములఁ గాచు రాముఁడు ని • శాత కృపాణము సవ్యపార్శ్వమం
దు గడకఁదాల్చి గొప్ప మల • దోయిని పోలిన యున్నతంపు దో
ర్యుగమున సత్యధర్మముల • యొప్పు వహించి కొఱంతకాని యూ
శుగ యుత తూణముల్ చెరివి • నూటిగఁ దాల్చె జయిష్ణు చాపమున్.

తే॥ తన్ను పోలిన తమ్ముఁడుఁ • దాను జనకు, తీపిప్రాణముల్ వెలి బైలు • దేఱు కరణి
నియతు గాధేయు వెన్నంటు• నీడ వోలెఁ, గాంచనమయ దుర్గంబులఁ• గడచి చనిరి.

చ॥ వరములు వెల్లిన ప్రకట ♦ సంబోనరించెడు వారు చేరు ని
ర్జర నగరంబులుగా నవతు ♦ రాని పురంబును దాటి నృత్య మం
దిర పటు దంగనా పద వ ♦ నేజ రటద్వర కింకిణీ సమా
భ్యురు రవ హంసయుక్త సర ♦ యూనదిఁ జేరిరి వార లంతటన్. ౩౨౪

సీ॥ చెఱకులు గాలికి ♦ నొరయఁ దగిలి పోఁక, ప్రమాకులఁ గాఱిన ♦ మధురసంబు
గనిమలఁ బొరలు బం ♦ గానులఁ దిరుగాడు, హరిణాక్షులును కృశో♦దరలు నైన
పొలఁతులు పొలు గోర♦ముడిచి మల్లిన గీర్ణ, కుంతలములఁ బోలు♦కొమరుఁ దేంట్లు
వసియింప నిరనైన ♦ వనమొందు గని యరుండు, గానసి యారాతిరి♦ గడిపి యవలఁ.

తే॥ వెను మొగుళ్ల తండములు కో♦మ్మునను గలిగి, ముఖపటముగల దంతినా♦మొనయు నుదయ
శిఖరి శిఖరంబు మీఁదికిఁ ♦ జెలుకగంగు, వాఁజు లేచెక్కి నని దాఁటి ♦ నయను మెరి.

చ॥ క్రతుభుజులెప్పు నాలుకలఁ - గ్రొత్తొను నాహుతిసేయ నిమ్ముగాఁ
గ్రతుముఖమందు లేచు ప గ - క్రమిమ్మన యొక్కవనంబుఁ గాంచి స
న్మతిఁ బురుషోత్తమోత్తముఁడు - తమ్మపతి పుత్త్రుఁడు రామచంద్రుఁ డో
యతివర! యీవనం బెవరి - దర్మిలి నాకు నెఱుంగఁ జెప్పవే. ౩౨౬

## ౭. తాటకవధ పటలము. (౨౮)

కవిరాజ విరాజితము.

అనవుడుఁ గౌశికుఁ డిట్లను మారుఁ డొ - కప్పుడు మోహనబాణము నీ
శుని పయి నేయఁగ నాతని నిప్పులు - జొబ్బిలు నేత్రమునుండి మహా
శని క్రియ లేచిన యగ్ని దహింపఁగ - సొరగు వాని శరీరము మం
డిన యదికోలె ననంగుఁడె యయ్యెఁ గ - డింది మగండును కంతుఁ డిటన్. ౩౨౭

తే॥ భవుఁడు మదనుని దహియింప♦వానియొడలు, బూదియై గుఱుటఁ జిందుటఁ♦బోలిచె సిద్ధి
యంగదేశంబనెడిపేర ♦ సార్థకముగ, విశ్వవినుత సుగుణచయ! ♦ వేదనిలయ! ౩౨౮

ఉ॥ ఆశయుఁ బాశముల్ మొదలి - కంట నశింపఁగ జన్మదుఃఖముల్
నాశమునొంద దత్త్వము న - నారత చింతనసేయు జ్ఞానులే
యీశు భజింతు రట్టి యగ - జేశుఁడె యిందు తపించె నన్న సీ
దేశ మహాత్మ్యసంపద ను - తింపఁగ నెవ్వరి కేని శక్యమే? ౩౨౯

చ॥ అని ముని పల్కు నచ్చటికి ♦ నచ్చెరువందుచు నేగి సంతసం
బున నెదురైన సచ్చరిత ♦ ముఖ్యధనంబుగఁ గల్గు మానులన్
గని మది సంతసించి గుణ ♦ గణ్యులతో నట నాఁడు వుచ్చి వే
ఘనుఁ డుదయాద్రి నెక్కుతఱి ♦ నేగి మరుస్థలిఁ జేరి రొక్కటన్. ౩౩౦

పొనుపడి యుండుటల్ గనఁగఁ - బోలు నభస్థ్సలమెల్లఁ బర్వి యే
ర్చిన బడబాగ్నిఁ గాలి యిలఁ - ద్రెళ్లిన మబ్బుల తున్కలో యనన్ ౩౩౮

ఉ॥ అమ్మరుభూమి సంచరిలు - నట్టి మరీచిక గుంపు లారయన్
గ్రమ్మిన వేఁడి యందడరి - క్రాసి నభస్థల మంటునేని స్వ
ర్గమ్మును మాఁడుసంచు నను - కంప సురావళిపైఁ గదించి తా
నిమ్ముగఁ బల్చిమాధిపతి - యేప్రున డీగ్గిన రీతిఁగన్పడున్ ౩౩౯

ఉ॥ వేఁడిమి నుండి తోఁచి పెను - వీఁకను పర్విన యెండమావు లా
పాడరి మండుచున్న వన - పాలుఁడు వేసఁగిఁ గూరుచుంటకై
పోఁడిమిఁ జర్చచేసి వడిఁ - బూన్చిన బంగరు కోడు లెత్తుగాఁ
గూడిన స్ఫాటికాసనము - కోరిక నిల్పిన శేవ దోఁచెడున్. ౩౪౦

చ॥ కడు వగ నింప సేతువగు - కర్మమునాలం దిగఁద్రోచి యవ్వలం
గడవఁగరాని ముప్పగలి - గండగు కోటలదాఁటి మోక్షముం
బడయఁగ నెంచువాని మది - భాతిఁ బసిండి పణంబు గోరు రో
పడఁతుల శూన్య మానసము - వైఖరి ధారణి సారహీనమౌ. ౩౪౧

ఉ॥ ప్రేలిన పక్కలౌ శ్లనసి - బీఁటలు వాఱిన ఘూయెడారి పా
తాళము దాఁక త్రోవవడి - తక్కక పెద్దగఁ గానవచ్చుటన్
వాలిన యెండఁ దాళుకొన - భారము దోపఁగ రాగరత్న భో
గాలి చెలంగు శేషు నిల - యంబు చొరం దగియుండు నెప్పుడున్. ౩౪౨

ఆ॥ ఇట్లు సెగలు లేచి - యెడరిచ్చు మరుభూమిఁ, జేరినంత మహాని - వీరు గొప్ప
శక్తిమంతు లయ్యు - సౌకుమార్యము గల, వారు గానఁ గష్టపడుదు రనుచు.

ఆ॥ ఎంచి వారిఁ గాంచ - నింగిలజ్జులు ముని, యంఘ్రి పంకజముల - నాశ్రయింప
బ్రహ్మసృష్టియైన ♦ పరమవిద్యల రెంటి, వారి కపుడు నేర్పె ♦ వాంఛతోడ. ౩౪౪

క॥ మనమున వానిని వారలు, మననం బొనరించు నంత ♦ మరుభూమియుఁ జ
ల్లని తేటనీట నడచిన, యనువయ్యెను రాముఁడిట్టు ♦ లను సన్మునితోన్. ౩౪౫

ఉ॥ కౌశిక మౌనిచంద్రమ! త్రి ♦ కాల విదుండవు తెల్పుమయ్య యీ
దేశము రేలపూవులను - దివ్యనదిన్ జటఁ జుట్టినట్టి గౌ
రీశుని యగ్ని నేత్రమున ♦ నిట్టులు పాడగునేమి? దుష్ట భూ
మీశుని నేల కన్న నిది ♦ యెక్కువ నాశిల హేతువేదొ కో? ౩౪౬

## తాటక వృత్తాంతము.

ఉ॥ నావుడుఁ గౌశికుండు రఘు - నాథుని ప్రేమను గాంచి యిట్లనున్
భూవరపుత్త్రి! సత్పురుష! ♦ ముఖ్యులఁ జంపి భుజించి వేయి నా

గావళి చేవగల్గి జము కంటె భయంకర రూపమొంది దు
ర్భావముతోఁ జరించు నొక పాపపుటింతి చరిత్ర చెప్పెదన్. ౩౪౭

చ॥ జగములు వింతనొందు బల శాలి కుబేరు కులంబువాఁడు మ
త్తు గలుగ కుండువాఁడు గజ దోర్బల యుక్తుఁడు వహ్నివంటి కి
స్కగలుగువాఁడు జంకు వయి నం బనుకంప యొకింతయేని లో
నగపడకుండువాఁడు భువి - యందు సుకేతుఁడనం బ్రసిద్ధుఁడౌ. ౩౪౮

ఆ॥ సంతులేని చింత మంతనమ్మున సుకే, తునకు నలము కొనఁగ మొనసి మూఁడు
మూర్తులందు మొదటిమూర్తిఁ బద్మాసను, గూర్చి చేసెఁ దపము కోరి తడవు

తే॥ శాస్త్రవిశ్రుత సంపన్న! సజ్జనాభి, రామ! ప్రాఁ జదువులగని బ్రహ్మ యతని
మెదుటి కేతెంచి నీకోర్కె యేది యనినఁ, బుత్రహీన దుఃఖమును దీర్పుమని వేఁడె.

చ॥ కొమరులు నీకుఁ గల్గ రొక కూఁతురు గల్గును లేఁతనెమ్మొ మై
కొమరు వహించి లక్ష్మివలె గోమున నొప్పుచు వేయి మత్తనా
గముల బలంబుగల్గి త్రిజగంబులఁ బేరువహించు నంచు నా
కమలభవుం డొసంగి మఱిఁ - గం జనియెన్ దన యిమ్ము చేరఁగన్. ౩౪౯

చ॥ వనజభవ ప్రసాదమున - వానికిఁ గల్గిన పుత్త్రి లక్ష్మి శే
వను క్రమరీతి గోముగను - వర్ధిలి పెండిలి యీడు నొంద నొ
ప్పిన వరుఁడెవ్వఁ డబ్బునని - పేరిమి నారసి తండ్రి, సుందుఁడన్
తనకులమందు మేటి గుణ - ధన్యున కచ్చెలిఁ బెండ్లిసేసినన్. ౩౫౦

తే॥ మేటి రతి మన్మథులఁ బోలు-మిథున మిద్ది, యనఁగ సుందుఁడు మోహిని-నెనయు సుదతి
తాటకయు రేయుఁ బవలు మొ-దలు తుదియును, లేదనఁగఁ గూడి తేలిరి-మోద జలధి.

తే॥ చాల దినములు గడవ నా-చానయంతఁ, గాంచె మారీచు బలుమాయ-కాని నవలఁ
బడసె గిరినిభ బాహు సు-బాహు మల్లు, వీరు జగముల ప్రాణులు - భీతి నొంద.

ఉ॥ వారలు మేటి మాయయును - వంచనయున్ దులలేని యుద్ధసం
చార చణత్వమున్ గలిగి - చాతురిఁ దల్లికిఁ దొమ్మిదంతలై
మీఱినవారికే నెఱుఁగ - మేవడి చాలనిరీతి వర్ధిలన్
దేఱిన మేటి సుందుఁడు మ - దించెను సంతసమంది యుబ్బుచున్. ౩౫౧

చ॥ చెడుగులు మేరమీఱి వెసఁ - జేయు సురారుల యొవ్వరాని దుం
డుడుకులు మూలముట్టుగను - దోరఁగ నంబుధి తోయమంతయుం
బుడిసిటఁ బట్టి త్రావిన త - పోధను నాశ్రమవాటిఁ జేరి య
క్కడి తరుజాలము ల్పెఱికి - కానట బీసట చేసి యంతటన్. ౩౫౨

మ॥ రమణీయ స్థితిఁగూర్చి వాటికి మునిం - ద్ర ప్రేమకుం బూర్ణపా
త్రములై యెప్పుడు కృష్ణసార రురు సా - రంగాదులన్ సాధు జీ
వములం జంపి భుజించి సుందర తరు - వ్రాతంబు భంజింపఁ గో
పమునం గుంభజుఁడట్లు చూడ నతఁడున్ - భస్మంబయ్యె నాశిలెన్. ౩౫౪

తే॥ సుందుఁ డీల్గుట యాతని- సుదతియైన, తాటక యెఱింగి యగ్ని వి - ధాన మండి
యమ్మునిని వినాశమొనరింతు-ననుచుసుతుల, గెలుచుకొంచుఁదదాశ్రమ-స్థలికిఁజనియె

చ॥ పిడుగుల తో లయాగ్నియును - భీకరవాయువు బెగ్గడిల్లఁగా
వడఁకి సురాళి మోహములును - వాడ రవీందులు త్రోవఁదప్ప మిం
చడరు మొగుళ్లు సంచలన - మంద ధమీ యని యండగోళముల్
బెడియుచు బీఁటలెత్త వడిఁ - బేర్చుచు నార్చుచు డాయనంతటన్. ౩౫౯

ఉ॥ ద్రావిడమన్ సముద్రము ను ♦ దారమతిం దయచేసి నాతఁడా
పావక సన్నిభుండు నిడు - పాఱు క్రుధాగ్ని మిడుంగురుల్ వెసన్
గ్రోవుల పోల్కి వెల్వఱచి - క్రూరులు వీరలు దైత్యులై చెడం
జావుఁ డటంచు వజ్రనిభ- శాప వచస్సుల నాడి నంతటన్. ౩౬౦

ఉ॥ రాగి కరంగి వెల్వడిన - రాణ బయల్వడు కోపవహ్నితో
నేగి జగంబులం గలఁచి - యేర్చి నరాసురకోటిఁ గూల్చుచున్
సాగి సమస్తజీవులను - చంపి భుజించుచుఁ గ్రూరకర్ములై
క్రాఁగి చరించు నీచులగు ♦ రక్కసులై రి రయాన మువ్వురున్. ౩౬౧

తే॥ అట్టు లమ్మునిశాపంబు ♦ సధిగమించి, క్రియకుఁ బ్రతిరొనరించు శ ♦ క్తియును లేమి
నేగి వారు సుమాలితో - నేము నీకుఁ, జెలిమి కొడుకులమని వాని ♦ చేసికొనిరి.

ఉ॥ లప్పుడు చెయ్యలం జలుపు ♦ తాటకపుత్రులు వానితోడఁ జెం
పొప్ప రసాతలంబునన ♦ యుండి, దశాస్యుఁడు గాంచి కూరిమిం
గుప్పుచు మామ లంచుఁ దము - గొప్పగ మిక్కిలి గారవింప, వా
రెప్పటి హింసతోడ భ్రమి - యించిరి పెన్ సుడిగాలి పోలికన్. ౩౬౩

తే॥ గొప్ప బలవంతులగు కొడు - కులను వీడి, ముని కినుక నెంచి మండెడు ♦ మనసుగలిగి
త్రోవలెల్ల జ్వాలాగ్నికి - తావులైన, యివ్వనముఁజేరెఁ దాటక ♦ యేపుతోడ. ౩౬౪

॥ ఇలయెల్లఁగినుకతో ♦ నెత్తంగ వలసిన, జలధి నీటెసి ఁ - వలసిన యెడఁ
గోరి స్వర్గముఁ జీలఁ ♦ గొట్టంగవలసినఁ,జేసి ముగించు నా - చెడుగు జోట
ఎన్ను నలవికాని - హింసలు నుద్ధయై, యురువొందె సన నొప్పు- నువిదమేను
రెండుకొండల తోడ ♦ మండెను షముతోఁ, బిడుగుల మించు న - ల్కుడులతోడఁ

తే॥ బ్రహ్మయ వహ్నితో నర్ధ చంద్ర ద్వయంబు, నొంది సడతెంచు కడలి యొం-దుందునేని
బెడిదముంగూర్చు సద్దాని -యొడలితీరు, కొంత యూహింపఁబోలు నీ ♦ కువలయమున

సీ॥ కాంచి పురుషులుం - గామినీత్వముఁగోరు, భుజ సుందరత్వంబు- పొసఁగు రామ!
బెడిదంపు శూలంబు - పెనుపాఁప కడియంబు, చేఁబాల్చియుండు నా- చెడుగుజోటి
యివ్వాసంబున వసి - యించుచు నుండు నా, టకటాంకుపేరు తా - టక యటంచ్రదు
మనసున బంధ మీఁగని లోభ మొక్కటి, మాత్రముండిన లెక్క- మాలినట్టి

తే॥ సద్గుణావళి నాశంబు - సలుపు కరణి, నలసి యిడరాని కొడిమ బు ♦ ద్ధుల వలంతి
చెడని పంటలుగలుగు నీ ♦ క్షేత్రభూమి, వట్టి మరుభూమిగా మార్చి ♦ పాడుచేసె

తే॥ నీలమేఘ సుందర దేహా! నీరజాక్ష!, రావణాజ్ఞ చే నాచేయు - క్రతువు నెపుడు
పర్వత బలంబుతో వచ్చి - పాడుచేయు, నంగదేశ వంశంబు ల - డంగఁ దిరుగు. ౩౬౮

చ॥ జగములఁగాచి ధర్మమునుఁ - జాఁగెడి జీవులఁదన్ను పోలెఁ బెం
పుగఁ దలపోయు భూపసుత! - బూటక తాటకఁ గూర్చి నీకుఁ బె
క్కుగఁ బలుకంగనేల? యిటు - కొన్ని దినంబులు సాఁగెనేని యీ
జగతి సమస్త జీవులను - చంపును నింపును పొట్టలోపలన్. ౩౬౯

## తాటకవధ.

తే॥ ముని యిటులు పల్క విని శంఖ-మున్ ధరించు,చేత విల్లుదాల్చినవాఁడు-చిందులేని
గంద మలరు మాలిక సిగఁ-గదలుచుండ, నెట వసించు సయ్యాది వచి-యింపుఁ డనిరెను

చ॥ అనవుడు చక్రాని మూఢి నిజ - తాకునుఁ డిట్లను హస్తయుగ్మముం
గొనిన గిరీంద్రముగా వయసు - కోణను పోలిన రాముఁగాంచి యీ
వనమగు దానికెల్ల యని - పల్కియుఁ బల్కక మున్నె మండుచున్
దనుజయు నంజనాచల వి ♦ ధంబున వచ్చె ధరిత్రి దద్దఱన్. ౩౭౦

ఉ॥ కొండలు గజ్జెలం బొనిపి ♦ కూర్చిన కాళ్ళ ధరన్ దిగంబరన్
గండుగఁ ద్రొక్కి లొక్కివడు ♦ గాతముఁలందు పయోధి తోయముల్
నిండఁగ నిప్పుకల్ చెరుగు - నేత్రము విప్ప జముండు భీతిమైఁ
గొండ గుహల్ చొరన్ గిరుల - కూటమి తన్నె యిదన్ గడున్ వడిన్.

చ॥ ఎలయుచు నిక్కి కొంతె చలి ♦ యించు బొమల్ నెలవంకఁబోలు ధం
ష్ట్రిలు పెనుమూఁతగల్గు గుహ ♦ చాడ్పున నొప్పిన బాకి నోటితోఁ
బొలఁతుక నిండు సంద్రమునఁ ♦ బొల్చిన వార్వపుటగ్గి రెండు పా
యలు గొని నిర్గమించు క్రియ ♦ నగ్గి బయల్వడ విచ్చెఁగన్నులన్. ౩౭౨

ఉ॥ తోరపు మత్త దంతులను ♦ తొండము తొండముతో ముడించి మేల్
పేరుగఁ దాల్చుటం గడలు ♦ పెన్నడుముం గల దైత్య గట్టిగా
నాటిచె నన్ని లోకములు ♦ నన్ని దిశల్ మఱి యన్నిచోట్లు దా
ర్కొని యది కాడ్పడన్ పిడుగు ♦ రావముసైతము పుల్ల గిల్లఁగన్. ౩౨౩

తే॥ పిడుగు వానలఁ బోలిన ♦ బెడిదురాలు, గర్జనముచేసి వారిని ♦ గాంచి వగుచు
వాఁడి శూలమున్ కాలుని ♦ పాఱఁజూచి, పండ్లు గీఁటుచు గుహఁబోలు ♦ వాయిదెఱచి.

చ॥ కడిమి నజేయమౌ బలము ♦ గల్గిన నా యురు రక్షణ స్థలిన్
గడఁక సమస్త జీవులను ♦ గ్రచ్చుఱఁ జంపితి నౌర! మీరకో
కడుకొని వచ్చినార లిటఁ ♦ గమ్మని మాంసము నాకు లేమినో?
చెడువిధి త్రోవఁ జానకో? ♦ చెచ్చెర నంచదలించి నవ్వుచున్. ౩౨౪

ఉ॥ అంబుద సంఘముల్ సుఱుము ♦ లై పడఁ గన్నులు విచ్చి చూచి యు
ల్లంబును మండ గొప్పమల ♦ లం బొడియై పడఁ గాలఁ దన్నుచున్
డంబగు బాలచంద్రు మొన ♦ డాల్గల కోఱలఁగీటు చార్చుచున్
బంబిన కిన్క నొమ్ములను ♦ వ్రచ్చెద నంచుఁ ద్రిశూలముం గొనన్. ౩౨౫

చ॥ అరిది తపోధికుండు ముని ♦ కద్ది యభీష్టమయయ్యె సద్గుణా
కరుఁడగు రాముఁడా వనిత ♦ కంఠము ద్రుంచెదనంచు వింటవే
శరమును పూన్పఁడయ్యెఁ దము ♦ చంపుటకే బెడిదంపుఁ జెయ్వులన్
జరపుచున్నది యయ్యె నది - చానగదా యని యెంచె జాలిమై. ౩౨౬

ఉ॥ వెల్లని పండ్లు నెత్తుటగు ♦ వెంద్రుకలుంగల తాటకాఖ్య త
న్నెల్ల విధంబులం బొడువ ♦ నెంచి త్రిశూలము గొన్నఁ జంపఁగా
నొల్లకయున్న రాఘవుని ♦ యుల్లము దిట్టమొఱంగి వేదవి
త్తల్లజుఁ డిట్లనున్ మదిని ♦ తత్తఱ మందుచు రామచంద్రుతోన్. ౩౨౭

చ॥ ఇలఁగల పాప సంఘముల ♦ నెల్ల నొనర్చి రసంబులేని ప్రా
ణుల మని నిశ్చయించి మము ♦ నుగ్గుల నూచముచేసి మ్రింగఁగాఁ
దలఁచిన కుండ వీడినది ♦ తా నొనరింపక వెలివైమె యిడే
కల దీక నేమనం గలదు ♦ కామిని యే యన దీనిఁజెల్లునే? ౩౨౮

మ॥ త్రపయే ముఖ్య గుణంబుగాఁగలుగు కాం ♦ తా మాత్రముం జంపఁగా
నపహాస్యంబగుఁగాని వీర్యబల శౌ ♦ ర్య స్థైర్య తేజోయుతుల్
విపరీతస్థితి నొందువా రతివ పే ♦ ర్వెన్నంతనే భీతులై
చెవులా మొచ్చుటఁ బౌరుషంబు నిలుపన్ ♦ జెల్లాదు నీకీయెడన్? ౩౨౯

తే॥ మఘవుఁడోడె సైన్యంబులు • మఱియ దేవ, దైత్యులోడిరి దీని దో • ర్దండయుగము
మందరముఁ బోలునన నిఁక • మగలనమున, మగలయందు దీనికి భేద • మగునదేమి?

క॥ ఇఁక నీకుఁ జెప్పవలసిన, దొకటిగలదు వినుము • రఘుకుల • లో ల్లంసమ! ము
న్నొక కాలంబున నడచిన, సకటక్రమ ముద్దియనుచుఁ • బలికెద మరలన్. ౩౮౨

చ॥ భృగుముని భార్య ఖ్యాతియను • పేర్గల వాలుగకంటి మానసం
బుఁ గరఁచు ప్రేమనూని దితి • పుత్త్రుల కొక్కెడ గొప్పసాయ మొ
ప్పుగ నొనరింపఁగా నెఱిఁగి • పూర్ణమతిం దన చక్రధారచేఁ
దెగఁ గొనె నామె ప్రాణములు • తెంపున దైత్య విరోధి యయ్యెడన్. ౩౮౩

తే॥ దేవ భూలోకములఁగల • జీవసమితి, మెల్లఁదనకు నొసంగిని • యెంచు కుమతి
కుమతియనుపేరిదాని స• య్యమరవిభుఁడు, కులిశధారచేఁదలఁద్రెంచి • కూలఁద్రోచె.

తే॥ అఖిల జగదభిరామ! క • ల్యాణధామ!, రామ! విష్ణువునకు దేవ • రాజునకును
వర్ణనీయమౌ కీర్తి • వచ్చెఁగాక, దాన నొకనింద గలిగెనే • తలఁచిచూడు. ౩౮౫

ఉ॥ నీరజలోచనా! విమల • నీరజమిత్ర కులాబ్ధిచంద్రమా!
సారమతిన్ నిజంబుగ వి • చారణసేయ బుధాళితో మహా
వైరమునూని ప్రాణివధ • పాటిగఁ జేయుచు ధర్మనాశమున్
దారుచు దానికిన్ మగత • నంబును గావలెనే వచింపుమా? ౩౮౬

చ॥ అరులకుఁ గాలుఁబోలు నసి - హ స్తమునం గల వీర! బ్రహ్మ దే
ర్పఱచిన యాయువుం దెలిసి - పాడి యెఱింగి సమీక్షతోఁ గృతం
బరయుచు జీవసంతతుల - నావలి లోకము చేర్చువాఁడు గా
కెఱచికి దీనిఁబోలెఁ బసి- యెద్దినఁ జంపెడు కాలుఁడుండునే? ౩౮౭

తే॥ పెక్కుప్రాణులఁదనపొట్టఁ - బెట్టుకొనెడి, దుర్గుణముకంటెఁ జెడుగేది - దొరయఁగలదు
జడగలది మీసలేనిది - మడఁతి యనుచు, దీనిఁ దలఁచుట యవివేక - మే నిజంబు.

ఉ॥ న్యాయత నాశముం గనని - యుద్ధృత ధర్మము చెప్పినాఁడ నే
దీని వయిం జలంబుగొని - తీరుగఁ జెప్పెడివాఁడఁగాను నీ
మానసమందు జాలిపని - మానుము చక్కటికాదు రక్కసిన్
మానిని నాక యింకఁ బరి - మార్పుమ యంచు మునీశ్వరుం డనన్. ౩౮౯

చ॥ మునివచనంబు విన్న రఘు- ముఖ్యుఁడు వాకొను సత్యరూప! మీ
మనమున సందియంబు లేక - మానుఁడు ధర్మ విరుద్ధ కృత్యమై
నను తగఁజేయ నాజ్ఞయిడ - నర్మిలి మీ నుడి వేదమంచు మే
ల్మిని పొనరించుటేకద చ - లింపని ధర్మపథంబు మాకగున్. ౩౯౦

ఉ॥ భామిని రూపుఁదాల్చి దవ - వహ్నిని పోలిన తాటకాఖ్య గం
గా మధురాంబు పావన జ - గంబగు కోసలదేశమేలు రాట్
సోముని పుత్తుఁ, యజ్ఞపు క - డుక్ మదిఁ గైకొని కిన్కఁ గన్నులన్
భ్రామిడి దూఁకు మంటలును - రాఁజఁగ శూలము ద్రిప్పివైచినన్. ౩౯౧

ఉ॥ క్రొత్త యముండసం దగిన ♦ క్రొమ్మమనం బెరియంగ వైవఁగా
నెత్తిన శూల నామకల ♦ యాగ్ని కడంక మునీంద్రు నాజ్ఞచే
జిత్తము నిశ్చలత్వమునఁ ♦ జెందఁగ నిల్చిన రామచంద్రుపై
కెత్తున నిండు చంద్రుమపయి ♦ కేగెడు రాహువు పోల్కి నేగఁగన్. ౩౯౨

చ॥ ఇనకులవీరుఁ డా యదన - నే శరమెత్తుట కూర్చుటల్ శరా
సనమున నారి లాగుటయుఁ - జయ్యనఁగాంచిన వారులేరు కా
లుని కడనుండి లాగికొని - లోఁగక తాటక యేసినట్టి ము
మ్మొనలు గలట్టి వాలు పలు - ముక్కలఁ జూచిరి నేలపైఁబడన్. ౩౯౩

తే॥ ఇరులు మొగులును గలరంగు ♦ పరఁగు పడఁతి, యొక్క పలుకాడు నంతలో - నుదధినిండఁ
జేయు పెనురాలవాన వ-ర్షించె నదియు, రామ కోదండముక్త వ-ర్షమున నడఁగె. ౩౯౪

శా॥ నీలాంభోదనిభుండు రాముఁడు వడి - న్నిర్నిద్రతన్ ఘోర శా
లాపంబును బోలు శాతశర మే - యన్ వజ్రశైలాంతర
స్థూల ప్రస్తరరీతి నొప్పు చెలి వ - క్షోదేశముం జొచ్చి నెన్
హేలాలీలను డుస్సి మూఢులకు జ్ఞా - నేంద్రోపదేశక్రియన్. ౩౯౫

చ॥ కనక నగేంద్ర ధీరుడగు - కార్ముకవీరు నిశాతసాయకం
బునఁబడి తాటకాఖ్య భువి - ద్రుంగుట దోఁచె యుగాంతకాల సం
జనిత మరుత్తతుల్ విసర - జంతు లయంబుగ నాకసంబు గ్ర
మ్మిన పెనుమేఘముల్ పిడుగు - మించులతోఁ భువిఁ బడ్డకైవడిన్. ౩౯౬

సీ॥ దుమ్మునిండిన యవన్వ - నమ్మొల్లరక్త ప్ర, వాహమ్ము లతిశయిం - పంగఁ బడిన
మెఱుపులకైవడి - మెఱసెడి కోఱలుఁ, బోట నోరును గల - తాటకాఖ్య
భువనవిజయుఁడయి - పొలుపొందు రాక్షసే, శ్వరునకు మొదటి న - శ్వకున మగుచు
నా దినంబున భూమిపైఁ దెగిపడ్డ సాం, పైన జయధ్వజ - మనఁగ నొప్పె

తే॥ అడవి మార్పడి కడలియగా - నట్లురమున, శరముగాఁడి దూసిన క్రోవ - జాతి నల్ల
నంజనెల్లినో మిన్నుఁత - జాతి యవనిఁ, బడినదియుఁ బోలె వనమెల్లఁ బర్వెనప్పుడు.

సీ॥ కలికి క్రొవ్విరిదమ్మి - గద్దెనెక్కిన వానిఁ, బోలు కౌశికునాజ్ఞఁ - బూని సడపు
రత్నకాంచన భూమి - రాముని కన్నెక, య్యమున సాయుధహస్తు - లైన దనుజ

కులమువారల యనుఅుల నాశ భయపడి, సిగ్గిలి మఱి యాస - చిగురుత్తుత్త
భ్రమయుచు నుండిన- జముడును నాడొక, మాత్ర చొక్కపు రుచి -మఱగినాడు

తే॥ మా నివాసంబులు మరల - మాకుదక్కె, క్రతువు నీకగు దివ్యాస్త్ర - తతులితని
కిమ్మనుచు మునితో వచి - యించి సురలు, దండి సురిసిరి విరులు కో - దండిపైని.

౮. యాగపటలము. (౩౯౯)

ఉ॥ తీరగు దీవనల్ సలిపి - దేవత లేగఁగఁ బుష్పవృష్టిచే
మీఱి ప్రశాంతమై మరు - మేదిని దాఁటుచు లేమి మందనం
బేరు వహించు*దాసగుణ - పీరు సమోఘ మహార్థయుక్త వా
గ్ధారకు దీటుగల్గు విశి - ఖంబు లొసంగెను మౌని వారికిన్ ౩౯౯

ఉ॥ శాంతుఁడు జ్ఞాని కౌశికుఁడు - సన్మతినిచ్చిన దివ్యబాణముల్
సంతత శుద్ధ మానసుఁడు - చక్కటిఁజేసిన సత్కృతంబు జ
న్మాంతరమందు దోసి తన - యంతట వానిని చేరునట్లు సు
స్వాంతుని రాఘవుంగదిసెఁ - జయ్యన వేడ్కమదించి పైకొనన్. ౪౦౦

శా॥ వీరాగ్రేసర! నిన్నుచేరితిమి నీ - స్వేడంగలే మెప్పుడున్
గారామార విధించు కార్యములు చ - క్కఁజేసి నీయొద్దకే
చేరన్ వచ్చెదు నీదు తమ్ముని క్రియన్ - జేయంగ నూల్కొందు మం
చారం బల్కు మహాస్త్రసంతతుల శ్యా-మాంగుండు నెమ్మిందొనెన్. ౪౦౧

తే॥ అంతరెండామడలు వార - లరుగ నచట, గొప్పశబ్దంబు వినబడ - గురు గుణుండు
రాముఁడిది యేమి యనఁగఁ గ-ర్మములు నీఁగఁ,దప మొనర్చిన మునిపల్లు-దానిగూర్చి

తే॥ మానసమునఁ బుడమి సర-యూనది యన, నొప్పి సిద్ధరనినుతుల - నొందు బూసఁ
గలియు గోమతి రవమని-పలికి యవలఁ, నడచి భవహారియగు నొక -నదిని చేర. ౪౦౨

—:కౌశికీనది వృత్తాంతము:—

సీ॥ దేవతాస్తుత్యమై - తెలివొందు నిసద, వృత్తమేమని రఘు - పరుఁ డడుగఁ
గౌశికుం డిట్లనుఁ -గమలగర్భుఁడు తొల్లి, పొందిన గౌరవం - బును జయంబు
గొనిన రారాజగు-కుశుఁడు స్వపత్నియం, దమరంగ నల్వురు - కొమరులఁగనె
వారు కుశాంబుఁడు - ప్రథితుఁడౌ కుశనాభుఁ, డా ధూర్తజుఁడు వసు - వనెడువారు

తే॥ అందుకౌశాంబియందుకు-శాంబుఁడుండె,సమరేఁగుశనాభుఁడుమహోద-యంబునందు
అలరె నాధూర్తజుండు ధ - ర్మాటవిని గి, రివ్రజంబున వసువు కో - రికను నిలిచె

సీ॥ ఆ భూపతులఁ గుశ - నాభునకుంగల్గి, రలరెడు లలితవా - క్కులు ప్రవాళ
సుందరాధరములు - పొందిన సద్గుణ, వతులు నూర్గురు ప్రియ - సుతలువారు

* తిరువెణ్ణెయ్ నల్లూరి శఠైయప్ప వాక్యములను పోలిన యస్త్రములను- అని మూలము.

గోముగా వర్ధిల్లి - కౌమరు ప్రాయమునొంది, యొకనాఁడు విహరించు - నుత్సుకతను
చెలులతోడ వనంబుఁ - జేరి క్రీడింప వా, యువు వారిఁగని మోహ - మొంది కుంది

తే॥ మావి పిందె బోల్కఁ బన్నుల - మగువలార!, మరుని గుదుసుపడిన వింటి ♦ మార్గణంబు
మదిని గాఁడి నొప్పించె నే♦మఱుఁగుచుంటిఁ, బెండ్లియాడుఁడి మిమ్ము నే♦వేఁడుచుంటి

సీ॥ అని వేఁడఁగా వార ♦ లా సమీరణుఁగాంచి, మాతండ్రి వేఁడుము ♦ మమ్ముఁ దాను
దానపూర్వకముగా ♦ దయచేసెనేని నీ, కోరిక యప్పుడొందుఁ ♦ బార మనఁగ
గంధవహుండంతఁ ♦ గడఁకతో వారి వీఁ, పుల గూను గావించి ♦ పోవుటయును
కర కంకణ స్ఫుట ♦ కాంతులొలయ సడ, వఁగలేక వారలు ♦ పడుచు లేచి

తే॥ తండ్రికడ కేగి యమృతంబుఁ ♦ దన్నునట్టి, గోనబు పలుకులతో నోరు♦కొతుకువడఁగఁ
బోలఁజెప్పఁగ నోదార్చి ♦ చూళి కొడుకు, బ్రహ్మదత్తున కలఁడు వా♦రల నొసంగె.

మ॥ చెలులన్ వేదిక బ్రహ్మదత్తుఁ డెలమిం ♦ జేపట్ట నక్కన్నకల్
లలితాకారము దాల్చి రాతని తపో ♦ లాభప్రభావంబునన్
జెలఁగన్ సూనుఁడు లేమి కిన్నఁ బ్రువుఁడెదం ♦ జింతించి పుత్రేష్టి మా
నులచే వేల్వఁగ నందు గాధి కలిగెన్ ♦ బ్రోద్యత్తురంగాళితో. ౮౦౭

చ॥ సలువుగ రాజ్యమెల్లఁ గుశ ♦ నాభుఁడు గాధికి నప్పగించి య
క్కులనిధి నాకలోకమున ♦ కుం జన గాధి మహోదయంబు స
ద్బలయుతుఁడై ప్రపాలన ము ♦ దారమతిన్ జరుపంగ గాధికిం
గలిగితి మంతఁ గౌశికియు ♦ గాదిలి పుత్త్రుఁడు నేఁ గ్రమంబునన్. ౮౦౮

తే॥ అవలమాతండ్రి భృగుపుత్త్రుఁ♦డైన ఋచికు, నకుఁ బాసంగఁ గుమారిఁ గౌ♦శికి నొసంగఁ
గొన్ని యేండ్లు త్రివర్గముఁ♦గోరి తనిసి, తపముచే సత్యలోకం ♦ బందు చేరె. ౮౦౯

చ॥ పతి గగనంబు త్రోవ నడు ♦ వన్ విరహంబు సహింపలేక త
త్సతి సదిరూపుఁగొంచు భువి ♦ దారిని వెన్నవులంగఁ గాంచి త
త్పతి ఋచికుండు భూజనుల ♦ బాధలఁ దోలుచునుండు మాపగా
కృతిఁగొని యంచు నాజ్ఞయిడి ♦ యోగ విరించిపదంబు చేరఁగన్. ౮౧౦

ఉ॥ సోదరి నిమ్నగాకృతి వ ♦ సుంధరయందె వసించె నంచు స
త్యోదర మొప్పఁ గౌశిక మ ♦ హాముని పల్కఁగ విస్మయంబు స
మ్మోదము సెంది రాఘవులు ♦ ముచ్చటఁ గొంత పథంబుపోయి యం
భోదముఁ గ్రమ్మియుండు వన ♦ ముం గని యెవ్వరి దంచు వారనన్. ౮౧౧

వామనచరిత్రము

సీ॥ వహాని యిట్లను భువి ♦ లోన మానినులకుఁ, బతికంటె గొప్ప దై ♦ వంబు లేద
యనెడు పతివ్రత ♦ మనసుఁబోలిన పరి, శుద్ధ విషయమిది ♦ శ్రద్ధవినుము

వేద సంతతికిని ♦ విబుధుల బుద్ధికి దక్కనివారి కం ♦ దకమై యుండుఁ
గమల నాభుఁడు కొంత ♦ కాలంబు దుష్కర, తప మొనరించిన ♦ తానదిద్ది

తే॥ అమరులును భూజనములు బం♦ధములఁ బేఁగ, వాని శ్రీనామమే నోటఁ ♦ బలుకుచుండ్రు
వాని కపటనాటక మెన్న ♦ వశము గాదు, అతని నుతియించు ఫలము శ♦క్యంబె తెలియ.

తే॥ కడకఁ దపియించె నూఱు య ♦ గంబు లిచట, నాదినంబుల భూగోళ♦మమరు దంత
ములను గల పోత్రిఁ బోలిన ♦ బలియుఁడై క, బలి వశము చేసికొనియె ది♦వంబు భువము

తే॥ శంక యొక్కింత మది లేక ♦ జరగు వాత, యురు తపశ్శాలి సురలకు ♦ సరిది యైన
మఖము నెఱవేర్పఁ బూని సమస్త భూమి, నేల వేలుపులకు సేయ ♦ నిశ్చయించె. ౪౧౪

తే॥ జరుగుచున్నది యెఱిఁగి ని♦ర్జరులు హరిని, గలిసి కేల్మోడ్చి ప్రార్థించి ♦ బలి యొనర్చు
కోడిమెలం దొలఁగించి చే♦కూర్పు సుఖము, కాంతి యన నతఁ డటు చేయ ♦ సమ్మతించె.

ఉ॥ శ్యామల వర్ణుఁడున్ మహాత - సాత్త్వికుఁడై స రమేశుఁ డంతఁ ద
త్త్వామల వేది మూఁడు సమ - యంబుల చర్య తెలియంగువాఁడు దై
త్యామర తాత కశ్యపున - కర్మిలి పుత్త్రకుఁడై జనించి తా
వామనుఁ డయ్యెన్ వింత దలఁపన్ వటబీజము న్యాయ మొప్పఁగన్. ౪౧౫

సీ॥ ఒప్పారు చేష్టలు - ముప్పూరి జందెంబు, మొలయందు మౌంజియుఁ - గలుగువాఁడు
వేదముల్ విస్పష్ట - విధిఁ బల్కు నాల్కయుఁ, గరమునం దగ్నియుఁ - గలుగువాఁడు
జ్ఞానులకే యెఱుఁ - గం దగ్గ యెసదు చి, ద్రూపాభ మౌనొక - రూపుదాల్చి
యరుదెంచు వామను - నాగమనంబును, త్రిభువన జేతయు - ధీరుఁడు బలి

తే॥ యెఱిఁగి యచ్చెరువంది ము-న్నెదురు వచ్చి, కొంచుఁ బోయి పూజించి సద్గుణగరిష్ఠ!
నిన్ను బోలు విప్రులును లేరు - నన్ను బోలు, ధన్యులును భువి లేరని - తనియఁ బలికె.

తే॥ అంత నమిత వివేకియై - యలరు గుజ్జు, యాచకులు కోరుకం కొన - యర్థిక మొసఁగు
దీర్ఘభుజ! నీకడకు నేగు - దెంచునట్టి, వారె భాగ్యయుక్తులు; రాని - వారు కారు.

తే॥ అనుచు వచియింప నలరి యా-దనుజరాజు, వలసినది యేది తెలియంగఁ-బలుకుఁడనిన
నెనరు కలదేని ముయ్యడుగు - నేల వలయు, ననిన యంత నిచ్చితి నని - యనుట తోడ

చ॥ కవి కొడుకిట్లు పల్కెనిది ♦ కైతవ వేషము నమ్మఁబోకు దా
నవ కుల చంద్ర! భూసురుఁడు - నల్లని మేఘముఁ బోలు నొక్క మా
నవుఁడని గుజ్జు రూపని య-నం జన దెల్ల యజాండ గోళముల్
తవిలి యొకప్డు తుందమున - దాల్చిన యాతఁ డెఱుంగుమా యనన్. ౪౨౦

తరల॥ దనుజ దేశిక! మత్కరంబది - తద్దయుం బయిఁ గ్రాలఁగాఁ
దనకు నొప్పని రీతి మిక్కిలి ♦ తాఁటి యుండును దృష్ణఁగా

నెనమొఱుంగని నీలవర్ణుని ♦ యిందిరేశుని శ్రీకరం
బనఁగ నాకిఁక సంతకంటెను - హాత్మ! మేలెది చూడుమా! ౪౨౧

తే॥ వలయువారలు వలవని - వారటంచుఁ, గనక నిర్ణయించిన యాచి-ఘనుల కొసఁగఁ
దగినదని ధర్మతత్త్వవే - త్తలు వచింతు, రితనికి సమాను లధికు లెం - దేని గలరె?

ఉ॥ ఒత్తుగ మేన వెల్లఁదన - మొందిన వాఁడవు గాన నంటి వి
ట్టుత్తములైన దాతలకు - నొప్పఁగ నీయఁగరాని వంచునే
పాత్తమునందు గల్గు నెవి! ॥ బొందిని తీయని ప్రాణమైనఁ దా
నెత్తిడి వేఁడు టెగ్గు మఱి - యిచ్చుట లగ్గు తలంచి చూడుమా! ౪౨౩

ఉ॥ చచ్చినవారు లోకమునఁ - జచ్చిన వారలు కారు ప్రాణముల్
నొచ్చి సగంబు చచ్చి కయి - నూఁక్కొనఁ జాఁచుచు వేఁడువారలే
చచ్చినవారు నిక్కముగఁ - జచ్చినవారలు లేచిరారు పై
నిచ్చినవారు గాక యిల - నెవ్వరు సుస్థిరులో వచింపుమా. ౪౨౪

ఉ॥ పెచ్చు నిరాపనిందలను ♦ పెంచెడువారలు కారు శాత్రవుల్
ఇచ్చెడు వారిఁజేరి తగ ♦ నీయకుఁడీ యను వారె శాత్రవుల్
నిచ్చలునట్టిరే తమకె ♦ నిక్కము చేటొనరించు కొన్న వా
రిచ్చుట మాపుకంటె మఱి ♦ హెచ్చగు పాపములేదు ధారణిన్. ౪౨౫

ఉ॥ పెద్దల వాక్యముం దలఁచి ♦ పెచ్చుగ ద్రవ్యము చేత నుండఁగా
నెద్దడి నొచ్చువారలకు ♦ నిచ్చి యశంబు గడించి ధర్మముం
దద్దయు నాచరించి భవ ♦ ధన్యతఁగాంచెడు వారిఁ జేరి పే
రొద్దిక లోభముల్ విడకుఁ ♦ డో యను దుష్టులె దొడ్డశాత్రవుల్ ౪౨౬

తే॥ నయము లేని యాచార్య!దా♦నమును చెఱచు,కృపణ!యొక్క రొకరికె త్తి♦యిచ్చుచుండ
భంగపఱచుట దగునె? నీ♦బంధు సమితి, కూడు గుడ్డయు లేక య ♦ ల్లాడుఁగాక! ౪౨౭

తే॥ అని పలికి మంత్రిదుర్గుణుఁ♦డనుచు నెంచి, యాతనిని లెక్కగొనక మూఁడడుగులిలను
నీవె కొలుచుకొమ్మని చెప్పి ♦ నీటిధార, బలి త్రివిక్రము చిన్ని చే ♦ తులను విడిచె.

చ॥ విమల సరోజలంబు బలి ♦ వీడిన ధార బిరాన చిన్నిహ
స్తములను పడ్డమాత్రఁ దలి ♦ దంద్రులె నవ్వఁగఁదగ్గ గుజ్జుత
న్నమరఁగఁ జూచువారలు భ ♦ యంబును విస్మయముల్ భజింప ను
త్తములకుఁ బ్రేమతో నొసఁగు ♦ దాన ఫలంబు విధాన వర్ధిలెన్. ౪౨౮

ఉ॥ ఊనిన పాదమొండు విపు ♦ లోర్విని నిండుచుఁ బిన్నదిద్దియం
చే నిజ మవ్వలం గడచి ♦ యేగదు; మిన్ను సమస్త మొక్కటన్

బూని యడంచి స్వర్గ పద ♦ ముం గొని దానిని దాఁటి యవ్వలన్
మానిత రీతి నేగుటలు ♦ మానెను సుంతయుఁ జోటు లేమిచేన్.        ౪౩౦

ఉ॥ రెండు పదమ్ములన్ నెలువ ♦ గించి సమస్త జగమ్ముఁ గొల్చి బ్ర
హ్మాండమునందు మూఁడవ ప ♦ దాక్రమ మెచ్చట లేమి దానికిన్
నిండు ప్రియంబు గల్గు బలి ♦ నెత్తిమె తావలమయ్యె వింతౌ కో
దండ ధరాగ్రణీ! ప్రథిత ♦ దైత్యవిరోధియుఁ బిన్నవాఁడెకా!        ౪౩౧

ఉ॥ నల్లనిసామి యింద్రునకు ♦ నల్వగుఁ గా కని యీ జగత్త్రయిన్
జల్లఁగ మేటి యేలుబడి ♦ నల్వనొసంగి జగంబుఁగొల్చి రా
జిల్లి క్రమించు పాదములు ♦ చేత రమాపతి తాఁకు రక్తిమన్
జెల్ల మహాగభీరిమను ♦ చెందిన పాల్కడలిన్ బరుండెఁదాన్.        ౪౩౨

చ॥ అరుదగు కర్మపాళి మొద ♦ లంట నశింపఁగఁజేయు రామ! యీ
పరమ పవిత్రవనా వనము ♦ బాధ రతిం గను వారు జన్మదుః
ఖ రహితులై చెలంగుదురు ♦ కాంచుమ వేద వచోనుయుక్తి నా
కిరవుగ యాగమును జలుప ♦ నిద్దియె యిమ్మ మజ్ఞాందు లేదిఁకన్♦        ౪౩౩

శా॥ ప్రారంభించెద జన్న మివ్వనమునన్ ♦ రండంచు సిద్ధాశ్రమం
బారం జేరుచు విఘ్నముల్ దొలఁచి త ♦ ద్యజ్ఞంబుఁ గాపాడఁగా
మారాకారుల రామలక్ష్మణులఁ బ్రే ♦ మ న్నిల్పి యజ్ఞీయ సం
భారంబుల్ సమకూర్చి కొంచుఁ దొడఁగెన్ ♦ మౌనీంద్రుఁ డుద్యాతిమై

## యా గ ర క్ష ణ ము .

ఆ॥ మన్ను మిన్నుఁగాచు ♦ మన్నీని కొమరులు, పెన్నువారిఁగూర్చి ♦ మెన్నఁజేయ
సరిదిమైన వేల్మి ♦ నాఱు నాళ్ల రసిరి, గన్నుగాచు ఱెప్ప ♦ కరణిఁ గాచి.        ౪౩౪

తే॥ తిరుగుచున్న నగంబుల ♦ తెఱఁగుఁదెలుపు, రాఘవులలోనఁ బెద్ద, స ♦ ర్వజ్ఞుఁడైన
గాధిజుం గాంచి యావిఘ్న ♦ కారులైన, యసుర లెప్పు డిటకు వత్తు ♦ రనుచు నడిగె.

తే॥ మౌనియై జటి మాటాడఁ♦బూనఁడయ్యె, వీరవరుఁడు రాముఁడు మ్రొక్కి♦వినతితోడ
వెనుదిరిగి మిన్ను చూడంగఁ ♦ బిడుగు మ్రోఁత, బిడియపడ వినవచ్చెను♦వికటరవము.

తే॥ గుప్పిరేసిరి విసరిరి ♦ నిప్పునీరు, గురిసి రద్రులఁ బెకలించి ♦ దొరలవైచి
రఱచి రదలించి తిట్టిరి ♦ మొఱకులపుడు, పరశువులవైచి మాయలు ♦ పఱపినారు.

తే॥ ఏచి కోపించి యేయఁగా♦ నెఱచి కఱచు, కొనినయాయుధములుకాల్కొ♦గుళ్ళుగురియు
కరణి వనమెల్ల విరియ రా ♦ క్షసు లంతఁ, గడలి ఘింటిఁగప్పె ననఁగఁ ♦ గ్రమ్మినారు.

చ॥ మెఱసెడి కత్తులుం గదలు - మిక్కిలి వైచుచుఁ బెక్కువాద్యముల్
మొరయఁగఁ జేయుచుఁ బిడుగు - మొత్తములంబలెఁ గంటగింపఁగా
నఱచుచు దైత్యులేచుటయు - గాంతముగఁ మహీ ముంచ నెంచి మి
న్నొరసి పగిల్చి కొంచుఁ దగు - నుద్ధతివచ్చు మొగుళ్లు నాఁ దగెన్. ౪౪౦

ఉ॥ కోఱల జంటలొప్ప మిడి - గ్రుడ్లను ద్రిప్పుచు రక్తరోమముల్
సూఱిఁ వెలుంగ నోరు బిగి - మేకొని నిప్పులు గ్రక్కఁజూచుచుఁ
బాఱుచు వచ్చువారు ముని - వంద్యుఁడు పల్కిన వారె యంచు నా
మోఱకులన్ రఘూత్తముఁడు - మున్కొని తమ్మున కొందఁ జూపఁగన్.

ఉ॥ కాంచిన లక్ష్మణుండు కడ - కన్నుల నిప్పులు రాల మింట ను
గ్రాంచిత రీతిఁజూచి తన - హస్త శరాసముఁ గాంచి రాఘవా!
మించిన క్రూరరాక్షసుల - మేనులఁ కండల తుండ్లు గండ్లు గా
న్పించఁగఁ గొండలై పడుట - నిక్కము చూచెదుగాక యియ్యెడన్. ౪౪౨

తే॥ అనుడు నీలెలఁ బట్టిన - యసురవరులు, వైచు రక్తమాంసమ్ములు - పడఁగనీక
కాండముల నేసి పైకప్పు - గప్పివైచె, నిండుగా రాముఁడా హోమ - కుండమునకు.

ఉ॥ హాలహాలంబు పొంగి జగ - మంతట మూపఁగ రేగునంతలోఁ
జాల వడంకి నిర్జరులు - చంద్రధరున్ శరణంబు నొందు నా
పోలిక మానులెల్ల భయ - ముం గొని సద్గుణధాముఁ జేరి యో
నీలశరీర! యెట్టులును - నీవె శరణ్యము వేఱు లేదనన్. ౪౪౪

చ॥ మదిని కలంక నొందకుఁడు - మానిజనోత్తములార! యిప్డె యి
య్యది తొలఁగింతు నంచభయ - హస్తమొసంగి గుణంబు కర్ణమున్
గదియఁగ లాగి రక్తమయ - కంధిగ భూమి నొనర్చి వీరతన్
గుదులుగఁ గూర్చి రాఘవుఁడు • కూల్చె నిశాచర మూర్ధ శైలముల్. ౪౪౫

తే॥ కమలనేత్రుఁ దివ్యాస్త్రంబు - కఱకు బెడిదు, రాలు తాటకగన్న పుత్త్రకులలోన
నొకని నంభోధిలోవైచె - నొకనిఁబట్టి, విందుగాఁగఁ గాలాంతకు - వీటికనిపె. ౪౪౬

మ॥ వనమాలా ధరుఁడైన రాముఁడు వడిన్ - బాణావలిన్ దక్కియు
న్న నరాశి ప్రకరంబుపై విడువ నా - నారాచముల్ మిన్నుగ
ప్పినఁ గాకుత్థ్సులు పీన్గు కొండలపయిన్ - వేయెక్కి చంపం గలా
రని చెల్లాచెదరయ్యె దైత్యబలముల్ - ప్రాణంబులుం గాచుకోన్. ౪౪౭

క॥ పిడుగుల వలె బెడిదములై, విడువఁగ రామాస్త్రవితతి - వెన్నంటఁగా
విఱిగియుచు మొండెము లాడెను, గడుకొని గ్రద్దలు పిశాచ • గణము నుతించెన్.

ఉ॥ ప్రబ్బిన పుష్పవృష్టియట - గ్రద్దల పందిరిఁ జీల్చు కొంచు బ
ట్టాబ్బిన రాలె నంబునిధి - ఘోషణముంబలెఁ దూర్యరావముల్
మబ్బులు మ్రోఁగెఁ బాకబల - మర్దన ముఖ్యులు గుంపుగూడి వే
వుబ్బున వచ్చి రామునకు - నున్నతి నిచ్చిరి మేటి దీవనల్. ౨౪౯

చ॥ పరమ పునీతులైన ముని ♦ వర్యులు గంధ సుమాక్షతంబులన్
శిరములఁ జల్లి దీవనలు ♦ చేసిరి తద్వన వృక్షజాలముల్
విరులను రాల్చె మాని జన ♦ వీరుఁడు కౌశికుఁ డంత యజ్ఞమున్
గురుతర శాస్త్రపద్ధతిని ♦ గోరిక దీర ముగించి యిట్లనున్. ౨౫౦

చ॥ అఖిల జగంబులన్ మొదట ♦ నాపర మొప్ప సృజించి పిమ్మటన్
నిఖిలము కడ్పులోపలనె ♦ నించుచుఁ బెంచెడు నీవు పూని యీ
మఖమును గాచు టెచ్చగునె? ♦ మన్ననతో నిట కేగు దేర నా
సుఖతర భాగధేయ మది ♦ చొక్కము గొప్పది యంచు నెంచితిన్. ౨౫౧

చ॥ అనవ్రుడుఁ బుష్పముల్ ఫలము ♦ లందము గూర్పఁగ వృద్ధిఁ బొందు వృ
క్ష నికరముల్ చెలంగి కడుఁ ♦ జల్లనయైన వనంబునన్ మహా
మునులను గూడియున్న గుణ ♦ పూర్ణుఁడు రాముఁడు మాని కౌశికుం
గని యిఁకఁ జేయఁగాఁ దగిన ♦ కర్జము మాకేది తెల్పుఁడీ యనన్. ౨౫౨

ఉ॥ నే నరుదన్న వే యయిన ♦ నీకరుదైన దిటయొండు భూమి లే
దైనను గొన్నియున్న యవి ♦ యావలఁ జూతము నీటియేర్వ మా
గానియె చూడ నెల్లెడలఁ ♦ గ్రమ్మిన యమ్మిథిలా పురావనీ
జాని యజించువాఁ డతని ♦ జన్నము చూతము రండు లెండనన్. ౨౫౩

## ౬. అహల్యా పటలము. (౮౬)

సీ॥ మంచి దనఁగ వార ♦ లంచిత గతి ముప్ప, రును మిథిలాపురి ♦ త్రోవఁ జనుచు
సమల రత్నశ్రేణి ♦ యగురు చందనము గం, ధంబొప్ప పులిన త ♦ లంబు లనెడి
వక్షోజములును లేఁ ♦ బ్రబ్బలి తీఁగలన్, మధ్యంబు సూక్ష్మ సు ♦ మప్రతాన
మనుమేఖలయు గొన ♦ బగునల్ల యిసుకయన్, కొమ్మడి శైలంబుఁ ♦ బమ్మివచ్చు

తే॥ కాల్వలను గజ్జెల రొదలు ♦ గలుగు కాళ్ళ, చెలఁగి చెలువంబుచేత న ♦ చ్చెరువు గొలుపు
శోణనదియను తెఱవను ♦ చూచివారు, మేరమీఱిన రహిఁ దరిఁ ♦ జేరినారు; ౨౫౪

సీ॥ అంత భాస్కరుఁ డుద ♦ యాన నిచ్చిన చల్లఁ, దనము జగతి కిచ్చు ♦ తలపు గలిగి
జీవులఁ దపియింపఁ ♦ జేసెడి తనమేని, వేఁడిమి తగ్గించు ♦ వాఁడపోలె
నరుణుని నయనంబు ♦ లరుగుట కంటెను, ముందంజ వైచుచుఁ బోవు హారులఁ
గట్టిన యొంటి చ ♦ క్రపుఁ దేరితో నేగి, పడమటి కడలిలో ♦ పల మునింగె.

తే॥ జల్లనగు నీటిపట్టుల ♦ జలజగృహము, చవిమలను తలుపులు మూయఁ♦దలరి గండుఁ
దేంట్లు పెంట్లతోఁగూడి గే ♦ శేర ననువు, నెలయు నొక తావి వనమున♦విడిసినారు

ఇంద్రునకు దుర్వాస శాపము

తే॥ ఈ వనం జేరిదని యాడుఁ ♦ డెలుపు నడుగఁ, గదఁగి గురు తపోధనుల దగ్ధ♦కర్ముఁడనియె
మున్ను దితియను కశ్యపు ♦ నాయి గూచటఁ, వన కుమారులకై కుంది♦ తపమొనర్చె

శా॥ ఈ లోకంబులు కావలన్ వెలసి వు ♦ ప్పొంపారఁగా నేలు మా
లోలుం డున్నెడఁ జేరి సన్నియతియై ♦ లోలాక్షి విద్యాధర
స్త్రీలం దోర్తు భజింపఁగా నలరుచున్ ♦ శ్రీలక్ష్మి ప్రత్యక్షమై
రోలంబ ధ్వని యొప్పు పుష్పసరమా ♦ ప్రోవుంలి కిచ్చెన్ రహిన్. ౨౫౨

ఉ॥ ఆ సుమమాల వీణియకు ♦ నాదటఁ జుట్టి విరించి లోకముం
జూసిఁ గాంచి కట్టెదుట ♦ డయ్యాని కిన్కఁదుఁ దావలంబు దు
ర్వాసుఁడు లక్ష్మి సన్నిధిని ♦ శ్రావ్యసుగీతము లాలపించు నం
చా నకిఁ కంజలిం జలిపి ♦ హర్షముతో వినుతింప నామెయున్. ౨౫౩

ఉ॥ లోకములన్ సృజించి కృప ♦ లోఁ గొని కాచుచు వెల్వరించు నా
శ్రీకరు వక్షమందున వ ♦ సించి సమున్నముఁ గాంచు తల్లి యా
స్తోక ముదంబునన్ జడను ♦ చుట్టిన మాలిక నా లతాంగి వే
కై కొనుమంచు నామునికి ♦ గారవ మార నొసంగి నంతటన్. ౨౫౪

ఉ॥ వేడుక లోకమాత తన ♦ వేణిని దాల్చిన మాలఁగాంచి నా
వోడిమి దొడ్డదంచుఁ గొని ♦ మోదముచే గరుపాఱు మేనితో
బోడ జటన్ ధరించి భవ ♦ ముల్ పొనుఁగొంది విముక్తి గాంచు మే
ల్జాడ యిదంచు వేడ్కమెయి ♦ స్వర్గపురంబును డాయఁబోవుచో. ౨౫౫

సీ॥ రజతమయంబయి ♦ రాజిల్లు సుందర, సగమున్పైఁ గురియు కా ♦ ర్మొగులు వెలసి
చెందామరలు వేయి ♦ చెలువుగా వికసింప, నెట్టని వెలుఁగుల ♦ నెసయు నినుని
కాంతి నొందినరీతిఁ ♦ గ్రాలుచుఁ బొలుపారు, తనువుతో నైరావ ♦ తంబు నెక్కి
చెలువు రుచినినేని ♦ చేడుగా నొనరించు, లలితవాక్కులుగల ♦ లలనలైన

తే॥ రంభ మేనక మున్నగు ♦ కుంభకుచలు, చిత్తజుని శరావళుల వ ♦ ర్షించు తూణ
ముల నెనయు పదకినల నూ♦పురములులియ,నాడుచును పాడుచును ప్రమోల♦నరుగుచుండ

సీ॥ బలు నీలగిరి కిరు ♦ వలఁకుల నిలసిల్లు, జ్యోత్స్నవనా నొప్పారు ♦ సురఁటు లొలయు
జాబిల్లి దిగివచ్చి ♦ జానొందె నన జెల్లు, ధవళాతపత్త్రంబు ♦ తనరుచుండ

పటహకాహళ శంఖ ♦ పణవాది రవములు, తెఱచయి వందిగీ ♦ తములు ముంప
వేద చతుష్టయ ♦ నాద ముప్పొంగెడి, యంబుధి ఘోషంబు ♦ ననుకరింప.

తే॥ జగములను మ్రింగ వచ్చెడు ♦ పగిదిఁ దోఁచు, నుత్సవ ప్రాభవముఁ గాంచి ♦ యుబ్బి యబ్బు
రంబు గొని తాను దెచ్చిన ♦ ప్రసవమాల, కేలఁ గొని హరికేయ నుం ♦ కించునంత. ౪౮౨

తే॥ దాని దోఁటితోఁ గొనుచుఁ జే ♦ దంతి మెడను, నగవిభేది వైచు దాను పు ♦ న్నాగమంతఁ
దాడిఁ బోలిన కరముతో ♦ దాని లాగి, కాలితోఁ ద్రొక్కి వేఁడయకా ♦ కరణి నలఁచె.

ఉ॥ మున్నె కటూగ్రకోపితను ♦ ముందటనే యటు లౌటఁ గాంచి తాఁ
గన్నుల నిప్పుకల్ వెడలఁ ♦ గ్రక్కన జాంఘచయంబు బూదియై
చెన్నఱ నంచు నిచ్చి పఱ ♦ చెన్ సురసంఘము సూర్య చంద్రులుం
దెన్నులు దప్పఁ గప్పెఁ దమి ♦ దిక్కులఁ దల్లడ మందె లోకముల్. ౪౮౪

ఉ॥ ఊరుపులందునుండి పొగ ♦ లొక్కట లేవఁ బురారి యట్ల హా
సారవ లీల నార్చి నగె, ♦ యాననమందు బొమ ల్ముడు ల్పడన్
బారలుగాఁగ నాలుకలు ♦ పర్వెడి యుజ్జ్వలితాగ్నిఁ గ్రక్కు ను
ద్ఘోర కఠోర నేత్రముల ♦ తోఁ బురుహూతుని గాంచి యిట్లనెన్. ౪౮౫

శా॥ ఓరీ క్రూర! సురాధమా! తులువ! నీ ♦ యుద్వైభవం బెంత? లో
కారాధ్యుండును లోకనాయకుఁడు లో ♦ కాధారుఁడౌ విష్ణు వ
క్షోరంగంబుననుండు లక్ష్మి జడలో ♦ సొంపొందు నిర్మాల్య నే
నారం బొందితిఁ బూర్వ జన్మ సుకృత ప్రా ♦ ప్యప్రాప్తి గర్వాంధుఁడా! ౪౮౬

ఉ॥ నీ యురు వైభవంబు గని ♦ నీకది తగ్గది యంచు నేఁడు మో
దాయత బుద్ధినై యొసఁగ ♦ నంత యలక్ష్యము చేసినాఁడవే
మాయురె! నీదు పెన్నిధులు ♦ మంగళ సంపద లెల్ల నంబుధిన్
మాయును గాతఁ గుంది యిడు ♦ మ ల్గడు నొందుదు గాక దుర్మతీ! ౪౮౭

మ॥ అని దుర్వాసుఁడు శాప మిచ్చుడును రం ♦ భాద్యప్సరోవర్గముల్
వెను లిబ్బుల్ వెలి పూవు కామగవియున్ ♦ వేగంటి చౌదంతి స్వ
ర్వాస భూజాదికముల్ సమస్తమును సం ♦ రంభంబుతోఁ జేరెఁ బో
ఘన విస్తార తరంగ ఘోష యుతమౌ ♦ గంభీర వారాన్నిధిన్. ౪౮౮

మ॥ కడు కిన్కం గల నమ్మునిశాపమున స్వ ♦ ర్గంబాది లోకంబు ల
ట్లుడికెన్ లేవడి చీడ పట్టినటులై ♦ యుగ్రత్వముం జూప న
ప్పుడు నాకౌకసు లబ్జిజారమణు నం ♦ భోజాసనుం గూడి పా
ల్కడలిం జేరిరి మాధవుం గని మొఱ ♦ ల్గావింప దైన్యంబుతోన్. ౪౮౯

తే॥ కమలజుండును త్రిదశులు ♦ కతిను డైన, మునివలస నైన కష్టముల్ ♦ వినిచి మాకు
నీచరణము లే శరణముల్ ♦ నీరజాక్ష!, యనుచు వేడఁ ద్రివిక్రముఁ ♦ డనియె నిట్లు.

## క్షీరసాగర మథనము.

చ॥ కలఁగక మందరంబు కగు ♦ కవ్వము వాసుకి త్రాడు నిండు జా
బిలి తరిగంబమై తనర ♦ వేఱుగ వేఱుగ దేవ దానవా
వలి యిరు ప్రక్కల న్నిలిచి ♦ పాల్కడలిన్ జిలుకుండి యోషధుల్
దళముగ వైచి వెన్నపడు ♦ దాఁకను పూనిక వీడకుండఁగన్. ౪౭౧

ఉ॥ మేమును వత్తు మచ్చటికి ♦ మీరు బిరానఁ బదండి యంచు ల
క్ష్మీ మహిళా మనోహరుఁడు ♦ మేకొని పల్కఁగ నింక నెవ్వ వే
యామడ లోడి పాఱెనని ♦ యానిన నమ్మికచే ముదంబు నె
మ్మోములఁ దోఁప వేలుపులు ♦ పోయిరి పాడుచు నాడుచున్ రహిన్. ౪౭౨

ఉ॥ లీలగ మందరంబుఁ బెక ♦ లించిరి వాసుకిఁ జుట్టినారు జే
జేల పసాదము న్నిలువఁ ♦ జేసిరి కంబముగా మహౌషధుల్
కేలను గ్రుల్లగించు కడ ♦ లిం బడవైచిరి చిల్కి రంబుధిన్
నేల చలించె శేషుఁడును ♦ నెమ్మొయిఁ గుంచె సహించలేమిచే. ౪౭౩

చ॥ అరయగ ధర్మ హీన హృద ♦ యంబులఁ జేరని కేశవుండు మం
దరమును పీఁపుపైఁ దిరుగఁ ♦ దాల్చి బలిష్ఠ ఫణీంద్ర రూపుఁడై
గిరి నిలువంగ మోచి వెయి ♦ కేలు గడల్కొనఁ జేసి మాని యుం
టరమునఁ బోయి పట్టివి కె ♦ డంక ఫలింపఁగఁ జేసె నత్తఱిన్ ౪౭౪

చ॥ మఱఁగిన సంపదల్ మరల ♦ మమ్ము కృపామతి నేలువానిచే
దొరకెఁ బరస్పరంబు పగ ♦ దోఁచె సురాసురకోటి కంత శ్రీ
వరుఁ డొక మోహినీ రమణి ♦ వాలక మూని సురారులన్ భ్రమం
పఱపుచు మోసపుచ్చి సుధ ♦ వారక మెక్కిరి వేల్పు లంతటన్. ౪౭౫

చ॥ బెడిదపు టాలమున్ శశిని ♦ భీమునకున్ సురభూరుహంబుతో
బెడఁగగు వస్తువుల్ శిఖరి ♦ భేదికిఁ దక్కిన సంపదల్ ప్రియం
బడర సురాళి కిచ్చి కమ ♦ లాలయ లక్ష్మిని కౌస్తుభంబు మై
వడిఁ గయికొంచు మాధవుఁడు ♦ పైనము చేసెను వైనతేయుపై. ౪౭౬

ఉ॥ అంత దురంత చింత దితి ♦ యందుచు నెమ్మది లేక భర్తనే
కాంతమునందు గాంచి తన ♦ హస్తములన్ ముకుళించి నా సుతుల్

వంతల నొందిదుందుడ వసి ♦ వాడి సశించిరి దేవసంచనఁగా
బంతసుతోడ వారిఁ జెఱు ♦ పం దగు పుత్రుని నాకొసంగవే. ౪౬౭

చ॥ ఘనవృషు కశ్యపుం డను ద ♦ యామతి నీకొక సూనునిచ్చితిఁగా
జనిగొని భూమి కేగి వెయి ♦ వత్సరముల్ తపమాచరింపు మ
ట్లొనరిచితేని నీదు వర ♦ ముత్కటరీతి ఫలించునన్నఁ బ
త్యనుమతి నామె భూమిని మ ♦ హా తపముం బొనరించె నిష్ఠమై. ౪౬౮

చ॥ అది విని వాసవుం డడలి ♦ యామెకు సేవ యొనర్ప నేగి వే
కుదిరి తదీయకార్యమునఁ ♦ గొండొక దోసము గాంచి మెల్లఁగా
నుదరము చొచ్చి యాకరువు ♦ హాయన 'మారుద' యంచు నేడు తుం
డ్లదయతఁ ద్రుంచి తున్కలకు ♦ నొల మరుత్తు లనంగఁ జేరిచెఁగా. ౪౬౯

తే॥ ఈ స్థలం బిట్టి దచట మ ♦ హేశ్వరునకుఁ, బార్వతికిఁ గల్గి వాయువు ♦ వలన గంగ
వలన భరియింపఁగా రాని♦బలియుఁడు గుహుఁడు,డడరు శరవణ మది యని♦నుడువుచుండ

చ॥ యమ తను కాంతులం దెగడు - నచ్చపుఁ జీకటులం దొలంచి లో
కములను గాచు వేవెలుఁగు - కాంచనచేలుని నాభియందు మొ
ట్టమొదట బ్రహ్మ యుప్పతిల - డంబుగఁ బుట్టిన తమ్మివోలె సం
దము గల తేరితో విలస - నంబుగఁ బుట్టెను నీల నీరధిఁగా. ౪౭౦

సీ॥ పొసఁగఁ ద్రిమూర్తులఁ - బోలిన గాధిజ, రామలక్ష్మణు లంత - రయము మీఱఁ
గదలి మెట్టిని కనుల్ - గల వృషభేశ్వరు, నెక్కిరింతగ మజి - టెక్కెముగను
పడసిన శంభు క - పర్దంబునుండి నిం, డిన మకరందంబు - చినుకు రేల
పూల నీడ్చుకొనుచుఁ - మోఁదుచు నిరుపరుల్, వృద్ధి మహా కతనఁ గా - వేరిఁ బోలు

తే॥ విమల జలపూర్ణ మైన యా - విన్నువాఁకఁ, గాంచి దీని చరిత్ర సా - కల్యముగను
దెల్పవే యని రాముఁ డ - ర్థించినంత, నిట్టులనియె విశ్వామిత్రుఁ - డింపు నింప. ౪౭౧

## గంగా వృత్తాంతము.

సీ॥ మీనవంశమునఁ బుట్టి - మేదినిఁ బాలించి, తగ నయోధ్యా మహా - నగరమందు
నెగడు విజయశీలుఁ - డగు సగరునకు వై, దర్భియనా తొలి కళ - త్రంబునందు
జనియించు నసమంజ - సుని కంశుమంతుండు, కలిగె రెండవభార్య - ఖగ కులేంద్ర
సోదరి సుమతి యఁగా - సుదతికి నుదయించి, రఱువది వేవుర - త్యధిక బలులు

తే॥ తండ్రి కొడుకుల కడిమికిఁ - దనిసి పూని, గొప్ప యశ్వమేధంబు బా - గొప్పఁ జేయఁ
గినిసి సుమనసుల్ దాని జి - ష్ణునకుఁ దెలుపఁ,గపిలు వెనుక యాగాశ్వంబుఁ-గట్టెసతఁడు

తే॥ హయము వెంటఁ బోవుచు నున్న - యంశుమంతుఁ,
డెదఁ గలఁగి యుంద్రదు మోసంబు - నెఱుఁగలేక

చ॥ హరుఁడును గాంచి మేటి జట • యందునఁ జిందఁగనీక చుట్టి స
వ్వర నది తచ్ఛిరోగ్రమున, వ ర్తిలె నొక్క తృణాగ్రమందునన్
మెఱసెడు వారికణంబు క్రియ • నిక్కలి దిగ్భ్రమ నొంద ఁడేఁదు, శం
కరుఁ డడలంగ నేల యని • కాఱఁగ జాఱెను సల్ప భాగమున్. ౫౦౩

సీ॥ గంగ యయ్యంగంబు • రంగార భూరంగ, మునకు దిగుడు రాజు ముందు నడచె
సమసిన సాగరుల్ • సద్గతి నడయుదు, గను సంతసంబున • నతి రయమున
నట ధ్యాన మగ్నుఁడై • యమరు జహ్నుని నూఁగ, శాల సన్వాంక ముం•చంగఁ గాంచి
నాల్కలు చాఁచుచు • నూలుకొని కోపాగ్ని, చెంది యు పాం దఱ • చేత వారి

తే॥ త్రావివైచె గంగను శిష్య • తతులు చెలఁగ, రాజు ప్రణతుఁడై యనంతరము • ప్రస్తుతించి
జరుగువృత్తంబువివరింపఁ•గరుణతో డఁ,గొనుచుఁబొమ్మనిచెవినుండి• మునియునదర.

చ॥ సురనది దూఁకుచుం గదలి • చూఁడిన సాగర భూతిరాశిపైఁ
బరవఁగ దుర్గతుల్ దొలఁగె • నారికి, దివ్యులు భద్రరావముల్
మొరయఁగ సన్నుతించి లలిఁ • బువ్వుల సోనలు రాల్చి రమ్మహీ
నరుఁడు కృతార్థుఁడై మరలెఁ • బ్రబ్బిన మోదముతో నయోధ్యకున్.

చ॥ అలమిన యండగోళముల • కావలిదై కమలాక్షు లోకముల్
గొలిచిన కాలఁ బద్మజుఁడు • గొన్న శుభంకర పాదతీర్థమై
తెలిసి భగీరథుండు గొని • తేర హరుండు శిరంబునం గొనన్
బొలసి యిలాతలంబుఁ బరి • పూత మొనర్చెను గంగ యిప్పుడున్. ౫౦౫

తే॥ కడఁగి సాగరులకు మేలి • గతులు గూర్చఁ, దపమునేసి భగీరథ • నృపుఁడు దేర
గంగ భాగీరథి యను నా • ఖ్యం దనర్చె, జహ్నుచెవినుండి రాఁ జనె•జాహ్నవియన

చ॥ అని ముని పల్కు నచ్చెరువు - నందుచు వందన మాచరించి గం
గను తరియించి యవ్వలఁ ద - గం జనుచుండ విశాల పట్టనం
బున వసియించు ధర్మ పరి - పూత చరిత్రుఁడు పార్థివుండు క
న్గొని శుభ వార్త లాడి తమ - కుం గురుపూజ లొనర్చి పంపఁగన్. ౫౦౭

విదేహదేశవర్ణనము.

సీ॥ నిద్దుర పీడిన • నీరజంబులు గ్రాలు, పొలముల నారణ • పులుఁగు లలరి
కలుపులు డీసెడి • కలుకుల తళుకుల, బెళుకుల కనుల నీ • డలను గాంచి
బేడిన మీలంచు • వేగ వచ్చి పొడిచి, బ్రమ పాటునకు బిడె • పడుచు నుండు
సురు విశాల క్షేత్ర • పరివేష్టితంబయి, యింపా విదేహదే•శంబు చేరి

తే॥ కలుపుగా నూడ్చు కలువలు ♦ కంజములును, కన్నులం బోలెఁ గానరాఁ ♦ గలుగు లుదరి
చూపులం ద్రిప్పికొనెఁ బ్రియుల్ ♦ సూచి విసుగు, చుండు పొలములుఁ విలసిల్లు ♦ చుంటఁ గాంచి

సీ॥ అందలి తోఁటలం ♦ దనకట్ట తూముల, ధ్వనులు మృదంగని ♦ స్వనము గాఁగ
నరవిరి కంకేళి ♦ విరు లంద మొప్పారు, ప్రవిమల లసిత దీ ♦ పములు గాఁగ
నరములఁ బోలి సో ♦ నలు కాఱు తేనియ, పరఁగు పుష్పములె వి ♦ పంచి గాఁగ
విరి దమ్ములం జెవి ♦ విందులుగా మధు, పము లొనర్చు రొదలె ♦ పాట గాఁగ

తే॥ సతత ఝిల్లీ రవంబులు ♦ శ్రుతులు గాఁగ, సకల పక్షులు గను సభా ♦ సదులు గాఁగ
నెగడఁ బురి విప్పి నెమళులు ♦ నృత్యలీల, సలుపుచుండుట గాంచి య ♦ వ్వలికిఁ జనుచు

సీ॥ కొలఁకుల యందు మి ♦ క్కిలి మన మలరించు, నంచయానల నడ ♦ యందము గని
తమ చుట్ట లనుచు హం ♦ సములు వెంబడి రాఁగఁ, గలకంఠకంఠులు ♦ జలములందు
పొంకంబుగా నాడఁ ♦ గుంకుమ పంకంబు, రహి యొడళ్లంటఁ బ ♦ రస్పరంబు
కలహించు ఖగములఁ ♦ గాంచి నదులయందు, నెనుముల పొదుఁగుల ♦ నెనయు రసము

తే॥ తరువులకు మావిఫలములు ♦ గురియు రసము, చెఱకు గానుఁగులందుండి ♦ తొరఁగు రసము
తేనె పెరలఁ గాఱడి తావి ♦ సోన రసము, తక్కఁ దెలినీరు లేకుంట ♦ చొక్కి కనుచు.

సీ॥ కొండ కొమ్మలఁ బోలు ♦ గురు కుచమ్ముల ప్రేఁగు, మోవఁజాలక నూలి ♦ పోఁగు కంటె
సన్ననౌ నడుములు ♦ చలియింప వర్షంబు, వంటి చూపు లొలయఁ బడఁ - తులాడు
నాట్యశాలల మృదం ♦ గ ధ్వని కులికి లే, బత్తెలు మడుఁగులఁ ♦ బాఱి కలఁప
వాలుగల్ దరిఁ బోక ♦ పాళల కుఱుకుట, కలికి చూపు కటారు ♦ లొలల నడఁగ

తే॥ మునిఁగి క్షీరాబ్ధిఁ దోఁచు ల - క్ష్మిని దలంపఁ, జేసి నీటి పిట్టలతోడఁ - జేతి బిగువు
తెల్లగాజులు మొరయ మ - దించి నీట, నాడు తలిరుఁబోఁడుల జల - క్రీడఁ గాంచి.

## అహల్యా శాపముక్తి.

సీ॥ హర్ష మొందుచు విదే - హారామములఁ జూచి, వెలలి ప్రాకార సం - వేష్టితమగు
మిథిలా నగరి కొక్క - మేటి యలంకార, మై పొడవైన ధ్వ - జాళి వెలయు
బయటి ప్రహరికి వె - ల్పల వచ్చి నిల్వ గా, ర్హస్థ్యోచితము పతి - వ్రత గుణంబు
వదరి పాడొనరించి - భర్త్రు శాపంబున, రాయియై పడియున్న - రామ యపుడు

తే॥ రాము పద ధూళి సోకఁ బూ - ర్వంబు మనసు, నలము నజ్ఞాన మత్తత - దొలఁగ నెఱుక
తేఱ రూపాంతరం బొంది - దేవ్వ నెదుటఁ, బొలుచు జని పోల్కిఁ దోలి రూపు - తోలఁక నిలిచె

ఉ॥ క్రిందికి గంగఁ దెచ్చిన భ - గీరథు వంశమునం జనించు నో
సుందర! తృప్తిమై మెఱుఁగు - చొప్పునఁ గ్రేవ నొద్దింగి నిల్చు నీ

గోఱలుచుఁ దెల్లనై మొగిలు ♦ గుంపులఁ దాఁకుచు నాని తేమయై
పారుపగు ధూపసంతతుల ♦ నాటుట వారలు గాంచి రయ్యెడన్. ౫౨౭

చ॥ ఉమృతముఁ గుంచె సద్దుకొని ♦ యంగజుఁ డంగములన్ లిఖించు నే
ర్పమరక చూచి చూచి భ్రమ ♦ మందుట దక్కఁగ నెగ్గలేని సౌ
రమరిన జానకిం బడసి ♦ నందున లక్ష్మి వసించు తమ్మి చం
దమున వెలుంగు నమ్మిథిల ♦ దాసిరి లోనికిఁ జొచ్చి రంతటన్. ౫౨౮

చ॥ నుడువుల తీరెత్తింగిన ఘ ‑ నుండగు కుంభజుచేతఁ ద్రావఁగాఁ
బడిన మహాబ్ధి చందమున ‑ భంబులు పర్వ సభంబు చాడ్పునన్
బడఁగు శశాంకఫాలలును ‑ వీరులు వేసటఁ బాఱవై వఁగాఁ
గెడసిన భూషణాళి గల ‑ గీముల వీదులఁ బోయి రంతటన్. ౫౨౯

చ॥ నడచిరి యంకుశంబున క ♦ ణంగని కొండలఁ బోలు నేనుఁగుల్
విడుచు మదాంబుధార లొక ♦ వెల్లువయై తురగాల నుర్వుచే
వడి నొక మార్పు చెంది రథ ♦ వర్గము లెప్పుడు సంచరింపఁగా
నడుసయి దుక్కయై బహు ద ♦ శాంతరము ల్గొను రాజవీథులన్. ౫౩౦

చ॥ నడచిరి రెండు ప్రక్కల ఘ ♦ నంబగు ప్రేమ మొకింత త్రెంపు లే
కడరి యనంగసంగరము ♦ నందు పెనంగి యలంగు బోట్లకై
వడిసె వియోగ బాధ గల ♦ పల్లవపాణులు కిన్కఁ ద్రెంచు పూ
వడములఁ దేనె మోడిగిల ♦ పంకము నొందిన రాచవీదులన్. ౫౩౧

సీ॥ కర పల్లవాంగుళు ‑ లోరయ జనించిన, వీణారవము చెవి ‑ విందు సేయ
శ్రావ్యంబుగాఁ బాడు ‑ సరసిజాక్షుల గీతి, కా భావములు మదిఁ ‑ గరఁచు చుండ
గంభీరమగు మృదం ‑ గ ధ్వనుల్ పొందికఁ, జెలఁగి టుక్కిలిగ ఘో‑షించుచుండ
హాస్తాభినయమున ‑ కనువుగా నయనాభిఁ, నయము నయంబుగ‑ నడచుచుండ
తే॥ నయన నటన శుద్దినిని మ ♦ నంబు వోవ, భావ గతులును వెన్వెంటఁ ♦ బరుగులాడ
నున్నవో లేవో యను కౌను♦లూఁగి యాడ, లలన లాడెడు నాట్యశా♦లలను గనిరి.

సీ॥ పగడాలఁ బోలిన ‑ జగడాలు గెలలును, మరకత చ్ఛాయల ‑ వటులు బోదె
లలరిన పోఁక మ్రాఁ ‑ కులలోనఁ బొడవుగా, వ్రేలాడుచుండు ను‑య్యాలలందు
పాపజన్మముఁ బోలి ‑ వచ్చుట పోవుట, యెడతెగ కుండఁగా ‑ నడరు చుండ
బడతుల సన్నని ‑ నడుములకో యన, భ్రమరముల్ ముసరుచుఁ‑ బరితపింప
తే॥ యువకుల మనస్సు లల్లైయు ‑ ద్భ్రాంత లూఁగ, నాకవనితలఁ గాల్ద్రివ్వ‑నయముదోఁప
మింటికిం గాల్లు చాఁచుచు ‑ మీఁజె మొగసి, యూఁగు వారల బాగోగు ‑ లోలిఁ గనిరి

ఉ॥ మేరకు మీఱు రత్నములు - మేలికడానియు నాణిముత్తెముల్
వారణదంతముల్ చమర - వాలము పీలియుఁ దావికస్తురుల్
వారి కృషీవలుల్ గనిమ - వారక పోయు దరుల్ గలట్టి కా
వేరిని పోలు నంగళులు - పెక్కులు గాంచిరి వారు ముందరన్. ౫౩౪

ఉ॥ కామశరంబు కవ్వము ర - కంబుసఁ గాఁడ నసూత్కరంబుఁ బోల్
ప్రేమ గలట్టి కాముకుల - రీతిని భూమిధరద్వయంబునన్
సామజముల్ పరస్పరము - సంధిలి తొండము లెత్తి కిన్కతో
దీమస మొప్పఁ బోరుటలు - తేఁకువఁ గాంచిరి వార లంతటన్. ౫౩౫

సీ॥ పదుచులు వాఁడి గో - ళ్లదరు చిగురుఁ గేలు, నొవ్వులఁగ వీణియ - చెవులఁ బట్టి
యొడిసిన కల్లు నా - నొప్పు నరమ్ములు, చాఁగఁ దంత్రుల శ్రుతి - చక్కఁ గూర్చి
హస్తాంగుళుల త్రోవ - నఖులు వోవంగ, నఖుల దరి హృద - యంబు చనఁగ
వెలిదంతముల కాంతి - వెలువడ శ్రవణపే, యంబుగఁ దేట భా - వంబుతోడ

తే॥ జిలికి గానామృతంబు వ • ర్షించుచుండ, వశము దప్పి యెదలు పర • వశత నొంద
గర్ణపుటముల సంతృప్తి • గనక త్రావి, నడచి రమ్మువ్వురును రాచ • నగరివీథి

సీ॥ కుమ్మరిచేవడి • నిమ్మగాఁ దిరుగుచ, క్రము వోలె గుండ్రన • గాఁగఁ దిరిగి
పెద్దలతోఁ జేయు • పేరిమి చెలిమి నా, నడుమంతరంబునఁ • గడఁక విడక
జ్ఞానుల తలఁపుల - చందమ్ముగా గురు, మతి నిశ్చలత్వ మే • మఱక గలిగి
బ్రహ్మాంబుభాతిఁ జ - ర్మంపుఁ జత్తువులకు, నిట్టిట్టిదని సుంత • యెఱుఁగ రాక

తే॥ పైఁడి కత్తెముల్ మొగముట్టు - పట్టుజీను, పిగిలి కుచ్చులుమున్నగు - సొగసులొప్ప
నురుగు లూడ్చుచు నేడ్తెఱఁ • బరుగువాఱు, మేటివారువములఁ గాంచి • మించిచనుచు

ఉ॥ ఊచిన యీఁటెలున్ వలపు - రాయని విండ్లు శిలీముఖ ధ్వనుల్
మోచిన నీల కుంతలము - లున్ నులి కౌనులు దాల్చి యొప్పెడున్
సైఁచిన కందు నీఁగి మణి - సౌధ గవాక్షములందు సొంపుగాఁ
దోఁచిన చంద్రబింబములఁ - దూకొని కాంచిరి వార లత్తఱిన్. ౫౩౮

కవిరాజ॥ పటికపు గిన్నెలఁ బోసిన క్రొత్త సు - వాసన వీచెడు తేట కలున్
దిటముగఁ ద్రావి బయల్పడు నవ్వునఁ - దీరు తడంబడు పల్కులతో
స్ఫుటమయి డాఁగని నెయ్యపు టల్కను - పొల్పుగఁ దెల్పెడి చూడ్కి వగల్
పటువగు కైపు వెల్యార్చు బెడంగగు - పద్మనికాయముఁ గాంచి రొగిన్.

మానిని॥ కాయసుఖంబు సమంబుగఁ జెందియుఁ • గాముకపాళి విమోహితులన్
జేయుచుఁ బైవెలయుం గొను వేశ్యల • చిత్తమునన్ స్ఫటికం బనఁగా

నా మెలనాఁగల కాటుక చూపుల ♦ నచ్చము నల్లనివై కయిఁ గెం
జాయఁ దనర్చుచు రంగుల మార్పుల ♦ జానగు బంతులఁ గాంచి రొగిన్.

కవిరాజ॥ కడియము లుంగరముల్ మణి చేరులు ♦ కమ్మలు పీణలు వస్త్రముల్
బడలుగఁ బందెము లుంచి సువాసిత ♦ పాశము లూఁగఁగఁ గుక్క మొగం
బడరెడు స్ఫాటిక శారులు రక్తము ♦ నందఁ గరంబులఁ బట్టుచు ను
క్కడమగు నీటులఁ బోలిన కన్నుల ♦ కన్నెక లాడుట గాంచి రొగిన్.

చ॥ నలినము లుత్పలంబులును ♦ నాఁచును తీవియ లాకు లెల్లనా
ఫలములు సైకతంబులును ♦ వాలుగ బేడిస మీలుఁ గోకముల్
వెలవెల పోవఁగా దమకు ♦ వే యుపమల్ తగ లేని యంగముల్
గల చెలు లీఁదు డిగ్గియలఁ ♦ గాంచిరి పెక్కులు వారలత్తఱిన్ ౫౪౨

చ॥ అతి చపల స్వభావమయి ♦ యచ్చటి కిచ్చటి కేడ్చు నింద్రియ
ప్రతతికి లోఁగి పర్విలిడు ♦ భావము భాతిఁ జలించి యింతలా
గితులఁ జరించి మై నలఁదు ♦ గంపపుఁ బూఁత రవంత రానిని సం
చ్యుతి గననీక కత్తు లను ♦ పొందఁగఁ ద్రిప్పెడి వారిఁ గాంచుచున్. ౫౪౩

చ॥ ఇన సమ తేజులన్ గొతుక ♦ కిచ్చెడి వారల భర్త కంటె సి
ప్పూనఁ బడి లక్కయై కరఁగి ♦ పోవని మారుని విల్లు బాల్చు సె
జ్జని కరముల్ గలారి నుడు ♦ రాజ నిభాస్యల యల్కఁ దీర్చు ప
ట్టూనఁ గడు నెట్టనౌ తలము ♦ డుల్ గల వారలఁ గాంచి రంతటన్ ౫౪౪

ఉ॥ చక్కెర పాగుఁ బోలిన వ ♦ చస్సులు చిల్కలతోడఁ బల్కుచున్
మిక్కిలి సిగ్గు నొందిరి ది ♦ మెల్లలు నెత్తులఁ బాఱ నూనముల్
చొక్కటఁ గోయఁ గేకి మయి ♦ వారలు లఠాంగుల నించ లోడి లో
స్రుక్కఁగఁ జూచి తేఁటి గమి ♦ క్రోల్చు వనంబులఁ గాంచి రొక్కెడన్ ౫౪౫

చ॥ అమరులకున్ వసింపఁ దగు ♦ హారి హిరణ్మయ సౌధపాళి య
చ్చమరిన నీడలో దివము ♦ సందము నచ్చటఁ జూపి గంగ చం
దమున గభీరమై యరివి ♦ దారుని యంతిపురంబు చుట్టు కు
ల్యముఁ బరి గొన్న కంపకము ♦ నంతటఁ గాంచిరి వారు డాయుచున్ ౫౪౬

ఉ॥ పూవుల తావి మీల్ సవురు ♦ పొన్ను మెఱుంగును తేనె తీపు సం
భావిత సత్కవిత్వ సిరి ♦ పక్వ రసం బుమియిల్లు రాజక
న్యావలి యున్న యోవరుల ♦ హంసలు గుంపులుగా నటింప సొం
పై విలసిల్లు ముంగిళుల ♦ నంతటఁ గాంచిరి వారు డాయుచున్ ౫౪౭

## సీతారాముల పరస్పర వీక్షణము

చ॥ పొగడఁ దొడంగుచో బలుకు ♦ బోటికి మగండగు బ్రహ్మయాదిగా
మొగిలిన సత్కవీంద్రు లుప ♦ మించి వచించెదు లక్ష్మియే స్వయం
బుగ విజయంబు చేయఁ ఎవ ♦ పోలిక యిట్లు దక్క నా మొ దక్క నే
బుగ నుపమాన మారసి యె ♦ ట్టుంగఁ దరంబె? నుతింప సాధ్యమే? ౫౪౯

మ॥ గిరిజాద్యుత్తమ సాధ్వులుల్ దలలు కే ♦ లీలించి మ్రొక్కంగఁ ద
గ్గ రహీన్ సద్గుణరాశితో జనక రా ♦ ట్కన్యా విలాసంబు ని
ర్జర వర్యుల్ దిలకించి సౌరు పొలిమే ♦ రం గాంచఁ గాంక్షించియే
తెఱగంట్టితిమి రెండు కన్నులును బ్రా ♦ తిం గాన లేవంద్రు నూ ౫౫౦

సీ॥ హరిణంబుఁ గూర్చి పే ♦ రందిన కుంతంబు, కొల యలవాటైన ♦ యలుఁగు వాలు
జెనుదీయ నాలుగల్ ♦ వెఱగొందఁ జలియించు, కను గొందు జానకి ♦ కవ్వపు మల
తిరుగఁ గో యని యూర్చు ♦ వర దుగ్ధ వార్థిలోఁ, గాక యా శుద్ధాంత♦కాంత లచటఁ
గాంచిన యమృతంబు ♦ కరణి నొప్పినయది, యిక్కన్యఁ బోలు వే ♦ ఱొక్క కన్య

తే॥ నొనరుపు మటంచు సురలు వేఁ♦డినను బ్రహ్మ,వలన నీకన్నె న సృష్టింప♦వలనుపడునొ?
అమృతభుక్కులు బతిమాల♦నబ్ధియేని, యిచ్చు సుధ దక్క వేఱెద్ది♦యీయఁజాలు?

తే॥ వలచి వేల్పులు తడవు న♦ప్సరస లెల్ల, సీత మేనియందము గాంచి ♦ సిగ్గుపడుచుఁ
కంది కుందిరి వారి మొ♦గంబు లనెడి, యబ్జ మండలములకు నె ♦ ల్లపుడు పగలె ౫౫౧

తే॥ ఇమ్మగువ పంకజమునుండి ♦ యిలకు రాఁగ, ఘోర తపమాచరించిన♦వారు సురలొ?
జగమొ? విప్రులో? స్వర్గమో?♦తగవొ?యెదియొ?,దీనినిజము నిజంబుగ♦దెలియలేము

చ॥ అరయఁగ వేఱు వేఱు పను ♦ లందని సుందరు లండ నిల్చి యో
వర మృగనేత్ర! తల్లి! మధు ♦ వా! యరుదా నమృతంబ! యంచు సం
బరమున దూరపుం బువులఁ ♦ బజ్జను హర్వుగఁ జల్లి నిల్వ న
వ్విరులపయిన్ గమించు నలి ♦ వేణి సుఖంబుగ మెల్ల మెల్లనన్ ౫౫౩

చ॥ మృదులపదంబులన్ బసిఁడి ♦ మించులు గజ్జెలు దాల్చి కౌనునన్
వదులుగ మేఖలన్ మెడను ♦ నాఁడెపుఁజేరులు పూల మాలలున్
ముదితలు కూర్చి కాంచ మెఱు ♦ ముల్ శతకోటులు సేవ సేయ నొ
ప్పిదముగ మించు రాణి ప్రభ ♦ నించె ననం దగి సీత యొప్పెదున్ ౫౫౪

ఉ॥ చంపెడి కుంతముల్ శమనుఁ ♦ జక్కఁగఁ గెల్చును గెల్చునంచు బీ
రంపు నుడుల్ వచింపఁ దగు ♦ రాణ వెలింగెడి కన్నులొండె వ
ర్ణింపఁగ వీలు కాని పవి ♦ నిల్వనఁ గాంచిన పర్వతంబులున్
బెంపగు గుండ్లు గోడలును ♦ పిల్లుఁ గరంగి ద్రవంబుగా నగున్ ౫౫౫

శా॥ ప్రేమానందము గూర్చు నేత్రములకున్ • వీక్షింపఁగాఁ బండువై
యామోదంబును పెంప నెల్లరు జలే • జాక్షుల్ గనం గౌతుకం
బీమాడ్కిం గలిగించుటన్ చెలులకే • యింపౌ సుధం బోలు తాం
తామ తల్లిక సీత రామునకు • నే తాత్పర్యముం గూర్చునో? ౫౫౬

ఉ॥ భూషలు కుండలాదు లపి - మున్నె సువర్ణముఁ బోలి శైత్యముం
బోషణ చేయు చూపు గల - పొల్తుల కెల్లను గలవడ్డ నైన నీ
యోషలమిన్న ధాత్రిసుత - యుప్పతిలన్ భువి సోమరత్నయు
గ్భూషలు మేటి భూషణముఁ - బొందినవై విలసిల్లె నెంతయున్ ౫౫౭

తే॥ ఊహ కరుదైన సౌందర్య-మొందు సీత, యిట్లు నిలునన నిర్వుర కన్ను-లెనసి యొకటఁ
గలిసి యిర్వుర తెలువులు - కలఁకవాఱ, గాంచె రాముఁడు సీతయుఁ -గాంచె నతని

చ॥ జనకజ చూచు చూపులను - శాణ విఘర్షణ నుంత యుగ్మమా
ఘన బలుడైన రాము భుజ - కాండములన్ దగ వ్రాలె ఘల్లనన్
ధ్వనిగాను వీర మద్దియలు - దాల్చిన రాముని చూపుఁదెంట్లు వ్రా
లెను జలజాత నద్మ లవ - లీ లలితాంగి ముఖాంబుజంబుపై ౫౫౯

చ॥ వలపు వహించు చూపు లను - పాశముచే నిరు మానసంబులున్
బలముగ లోఁగి లాగఁబడ - భాను కులాంబుధి సోము మానసం
బల జనకాత్మజాత యెద - యందు వసించెను సీత మానసం
బల రఘురామచంద్రు నెద - యందు దగుల్కొనెఁ జిత్రమై ఖరిన్ ౫౬౦

చ॥ కన నడు మింత లేని జన - కప్రభు పుత్త్రియు శుద్ధ మానసుం
డనఘుఁడు రాముఁడుం గలిసి - యంచితమైన తను ద్వయంబునం
దునిచిన యొక్క ప్రాణమన - నొప్పిరి; మున్ను సుధాబ్ధి శేష శ
య్యను జత వీడి యిప్పు డరు - దందఁగఁ జేరుటఁ జెప్ప శక్యమే? ౫౬౧

ఉ॥ అంతము లేని సుందరత - నందిన రాముని గూడలేని హృ
చ్చింతను గుంది సీత యొక - చిత్రపటంబును పోలి యుండెఁ జే
ర్వంతఁ దలంపు బెట్టు చెలు - వంబును దార్ఢ్యము వెన్నడన్ మహీ
కాంతుని పుత్త్రిదున్ దపసి - కౌశికు వెంటఁ జనెన్ మఱుంగుగాన్ ౫౬౨

## సీతాపంతాపము.

తే॥ అట్లు వనమాలి కనుమఱుఁ-గై నయంత, నెడఁదయును మదద్విరదంబు-దృఢత యనెడి
యంకుశముఁద్రోచివైచె స్వే-చ్ఛానువృత్తి, సీత యాఁడుఁదనం బెట్టి-స్థితి భజించె?

చ॥ తనకు రఘూత్తముం డెదురు - దార్కొన సీత మనంబు మేను ప
ల్చనిధగు పోఁగు వంటి తన - జానగు కౌనును పోలె నూఁగఁగాఁ

దనుకుచుఁ గాల్వవంటి కను - దమ్ముల క్రొవ్వను లోనికేగి యు
ర్వ్వెను మరుబాధ దుగ్ధమున - నేడిన చేమిరి పర్వు కై వడిన్ ౫౬౪

ఉ॥ నొచ్చును రానురాను గడు - నూలొగిని వర్ధలు కామవేదనం
బచ్చుగఁ జెప్పలేక యెద - యంటె గలంచి కలంగ, నూరుఁడున్
హెచ్చుగ మందు కుండమున - నింధనమున్ మఱి వైచు పోలికన్
బుచ్చెను వాఁడి పూ ములికి - పుర్రిగ నామె మనంబు గాఁడఁగన్ ౫౬౫

తే॥ నేయి పూయక నిప్పున - నేయకుండు, వాఁడి యూఁటెనఁ పోలె శ్రీ - పముల దాఁకు
కనులు గల సీత వలువల్తో - మనసు నలఁగ, నప్పుఁ బడిన పూలతవోలె - వాడి పోయె

తే॥ ఉలియు మేఖలను ధృతిని - వలయములను, నాఁడు మనసును తెలిపిన - నప్పువన్నెఁ
దొరఁగి జానకి, వేల్పులు - తరవ నెల్ల, విడిచినట్టి కడలిఁ బోలి - వేద యెసఁగె ౫౬౬

చ॥ నగలునువిడ నామనసున - నానయునూడ నొయ్యార నుందమును
దొగడుగఁ బూఁడ మారు నిరి - తూపు స్తనాంతర మందుగాఁడఁ దీ
పగు నసువుల్ తపించి యురి - యూడ మొగంబును వాఁడఁ గాంచి వే
మగువలు జానకిం గొని శ్రీ - మంగడి లోనికి నేగి రంతటన్ ౫౬౭

ఉ॥ కమ్మలఁ బట్టి మ్రింగు గను - కంబుక వచ్చిన సూటిఁ బోలు నే
త్రమ్ములు గల్గు జానకి వ - దమ్ములఁ గేలను పో ల్చివుల్ల మొ
త్తమ్ముల నొత్తుగాఁ బఱపి - దండిగ గొజ్జఁగి నీరు చల్లి శై
త్య మ్మొకదొట్టి పానుపున - నెల్లనఁజేరిచి రంత మైథిలిన్ ౫౬౮

చ॥ గిరిపైనఁ బోలి మంచునకుఁ - గీడ్పడు తూండ్లు గలట్టి క్రొత్త తా
మర కొలఁకున్, గటారి కెన - మాఱని రాహువు మ్రింగినట్టి చం
దురు సరి పోల్పఁగాఁ దగిన - తోయలి మైథిలి తాప మిచ్చు క్రొం
బ్వోరి తలిమంబునం దొడలు - వేసటఁ జేర్చెను వెచ్చ నూర్పుచున్ ౫౭౦

చ॥ చినుకులు పర్వతాగ్రమునఁ - జిందిన సంచునఁ జూచుకద్వయిన్
గనుఁగవనుండి ముత్తెముల - కై వడి బొట్టుగ నశ్రు బిందువుల్
చినికెను;వింటి కోపు లలిఁ - జెన్నగు నెన్నుదుటన్ జెమర్చి క్రాఁ
గు నెసటినుండి లేచు పొగ - కోపగు నూర్పుల మానెఁ బిమ్మటన్ ౫౭౧

చ॥ నిలుకడయై బలిష్ఠమగు - నెమ్మది గల్గియు వేఁటకాని తూ
పుల నిలఁ గూలు నమ్మృగిని - పోలిన యాయమ క్రాఁగుచున్న లో
పలి మదనాగ్ని మండి పొగ - వాఱఁగ మిక్కిలి వాడి వత్తలై
ఘలఁగెడు పూ లతంబలె శ్రీ - మంబున గ్రుంగి యొఱంగెఁ బాన్పుపై ౫౭౨

చ॥ విరిసిన పూలపైఁ బడుచు - వీచెడు పయ్యెరత్రాడు, సంజయు
ప్పురమను నెత్తి వెంద్రుకలు - మైకము చేసి స్మరాగ్నిలోపలన్
బెరుఁగఁగఁ జేయు మబ్బనెడి - పేరిన నల్పుమెంటన్ వహించి యు
ద్ధురగతి రాత్రియన్ జముఁడు - తోఁచె విదేహ నృపాల కన్యకున్. ౫౦౫

ఉ॥ పైన ధ్వనించు పక్షుల ర - వంబులు వాద్యములుగాఁగ ఘోషముం
బూనిన యబ్ధియే యడుగు - మువ్వలుగా నెఱ మిన్నె రక్తపుం
బానముగాఁగఁ జీఁకటియు - ప్రబ్బిన కంచెలగాఁగ సంజ యన్
చాన మహోద్ధతిం బరఁగు - శాకిని భూతము వోలె వర్ధిలెన్. ౫౦౬

సీ॥ కొలఁకు లనెడి యగ్ని - కుండంబులం బడి, విరియు పువ్వులనుండి - విసము గొనుచుఁ
బచరించు దక్షిణ - పవనుండు మారుండు, ప్రయ్యనేయఁగ సైన - వ్రణములందు
తూఁటి లో నేగఁగా - దూపిల్లు తెలివియు, మైలైన స్త్రీత్వంబు - నేలఁ గలియ
సంభ్రమించెడు సీత .. సంజను గని యిది యా? మన్నిగొన వచ్చు - యాముని రూపు!

తే॥ కదలియో! కాలమేఘమో! నిప్పు మలయొ! యెడరు గలిగించి కన్నుల - నేడిపించి
మూవిదీయు మకేదియో-యనుచు నామె, మలయ పసురవన్నె యముని-మూపువచ్చె

సీ॥ గగన నీలిమయు బు♦ ష్పములను పసి దంష్ట్రలును తెమ్మెరను నూర్పు♦లును విశాల
మగు జేవ ప్రాకిన ♦ మను పిషద్భృతి యొప్పు, జగ నోరు గలిగిన ♦ సంజ పాము!
నాలుకతో లాగి ♦ జాలెఁ బూన్చుట యేల? అమ్మయ్య నిండు పి♦ల్లమరువాఁడు
కొంచెమైనను చేయి ♦ క్రిందికి దింపఁడే, ఉన్నది నా కొక్క ♦ యనుమతె సుమ్ము

తే॥ విప్పి బ్రదుకఁగ నేనుండ ♦ గొప్పరట్టు, ప్రాన్చి యిట్టులు నన్నాడి ♦ పోసికొనఁగ
నేమి యపరాధ మొదవెనా ♦ మెచ? నిదేల, వైర భావంబు నవ్వలవంత పఱుప?

ఉ॥ క్రమ్మిన మబ్బుమూపు నిటు ♦ గైకొని హాలహాలంబు పంగెనో?
యిమ్మయి నబ్ధిపొంగెనో? ర ♦ మేశ్వరు మేని హారంగు నెల్లవా
రిమ్మగ నెంచుచుంట నది ♦ యే యిటుపర్వెనో? కాలునల్లు త్రో
రమ్మగఁ గాటుకన్ మెదిపి ♦ రాచిరొ మింటికి మంటి కెవ్వరేన్. ౫౦౯

చ॥ అరుదుగఁ గానవచ్చి సతిఁ ♦ దా మఱుఁగై చనె సప్త పెట్ట నో
క్కరుని గనంగ లేర రొుకి ♦ కన్నికి యెల్లిద మైన దంచు లో
నరయక మబ్బున న్నలిచి ♦ యమ్ముల నేయ నసంగుఁ డిట్లు నీ
కిరవుగ నేర్చెనో? యిందియు ♦ నే నొనరించిన పాప రూపమో? ౫౧౦

ఉ॥ అంకిలి నొంది సీత యిటు ♦ లంగడఁ గ్రుంగుచు నెమ్మఁ గాంచ న
భ్రంకష సౌధమందు నెల ♦ తా జగ తిన్నియ చుట్టు నాజ్య దీ

తే॥ వెన్నె లనెడి సమ్మెట నీల ♦ వేణిచనుల, పైఁబడఁగ వేఁడి నిప్పునఁ ♦ బడిన హంసి
వోలె నొర్వక చెందమ్మి♦పూల పాన్పు, మీఁదఁ బడి పొరలుచు నుండె♦మోదము చెడి

తే॥ దొండడిగఁ గ్రమ్మ వెన్నెలల్♦తూఱి తాఁకఁ, దల్ల డిల్లి యుడికి సొమ్మ♦సిల్లెఁ బాన్పు
వాడి చెందమ్మి జేకులు ♦ మాఁడిపోయెఁ, గీరవాణి దేహము చాల ♦ మాఱిపోయె.

తే॥ చెలులు చలి కలపంబు పైఁ♦జేర్చునంత, సీత మఱి యింత యుడుకుచుఁ♦జీఁదఱ గొనె
వీవ వీవఁ గుచంబుల♦వేఁడి యెక్కె; మదిని మదన వేదన కేది♦మందు మహిని?. ౭౦౨

తే॥ ఒడలి నుడికించి కామాగ్ని - యుబుకుచుండఁ, గిసలయములు పుష్పాడి చిందు -
వేసివాడఁగా వానిని-దీసివైచి,మార్చుచుండిరి తల్లి ప్రే-మంపుఁ జెలులు.[ప్రసవములును

తే॥ సుందరంబైన శుద్ధాంత ♦ మందు విరుల, శయ్యపై సీత యీరీతి ♦ శ్రమల నొందఁ
గలికి మించు మైసంచును ♦ గాంచినట్టి, రాముఁడెటులుండెఁజూతము ♦ రండుపాదము

తే॥ అట్లువారుమువ్వురుచని♦యధిపుఁగాంచ, నతఁడు సత్కృతు లొనరించి♦ యమరనాథు
సదనముం బోలు చాంపేయ ♦ సౌధమందు, విడిది చూపఁగ ముదముతో♦విడిసిరచట

తే॥ అచటి కేతెంచె నతి బలుఁ ♦ డైన రాము, పాదధూళిచేఁ దొలిరూపు ♦ వడసి నట్టి
మడఁతుక యహల్యకొడుకుస♦మస్త శపము, లొక్కరూపొందెనని చెప్ప♦నొప్పువాఁడు

ఆ॥ కానిపించు మునిని ♦ గని మహోదారుండు,మ్రొక్కసుగుణధనుఁడు ♦ పెక్కుశుభము
లొనర దీవవలు స ♦ మున్నతి గావించి, గాధిజునకు నెఱఁగి ♦ గారవమున. ౭౦౪

క॥ గౌతమ పుత్త్రుఁడు కౌశికుఁ, గౌతుకమునఁ గాంచి మీరు - కడఁక నిటకు రా
నే తపము చేసె నీపురి, నా తరమా తెలుప నూని - నాథా! యనఁగన్. ౭౦౫

క॥ చల్లని పద్మాసనమున, నుల్ల సిలు పితామహుండె - యుపమకుఁ దగి రా
జిల్లు శతానందుని ముని, తల్ల జుఁడగు కౌశికుఁడు ము - దంబునఁ బలికెన్. ౭౦౬

క॥ ధీరచరిత! వినుము - మహో, దారుం డీ దారకుండె - తాటక యసువుల్
పేరుగ నా యాగము పెం, పారఁగ నీతల్లి శాప - మరిదిగఁ దీర్చెన్. ౭౧౦

క॥ అరసి యిటు పల్కు కౌశికు, నరసి శతానందుఁడిట్టు ♦ లను మునిచంద్రా!
అరుదగు నీ దయ గలుగఁగ, నరు దెయ్యది విజయ శీలుఁ - డగు రామునకున్. ౭౧౧

తే॥ కడలి నీలంబు మబ్బుల - గమియు నల్ల, గలువ లుపమగా నొప్పిన - కన్నుటొడలు
గలుగు రాముని వదన మండలముఁగాంచి, యిట్టులను నహల్యా పుత్త్రుఁ డింపునిండ.

విశ్వామిత్ర చరిత్రము.

క॥ వనమాలీ! యిమ్మని మును, జనపాలుం డగుచు పెక్కు - సంవత్సరముల్
మను నీతి దప్ప కేలెను, దన కెదు రెద్దియును లేని - తాత్పర్యమునన్. ౭౧౩

తే॥ ధర్మమార్గానుసారియై - ధరణి నేలు, చుండి యొకనాఁడు వేఁటాడ - నుల్లమందు
కడఁక జనియింప దట్టంపు - టడవి కేగి, పూజ్యమగు వసిష్ఠాశ్రమ - మునకుఁ జనియె.

సీ॥ అమ్ముని యంతన - త్యధికాదరంబున, నాతిథ్య మొసఁగి జ - నాధినాథ!
ఇచట నేఁటికి వసి - యింపు మనఁగ సేనఁ, దక్లే యనుడు నాతఁ - డలరి సురభిఁ
బిలిచి యిప్పుడు రాచ - వీరుల కింపైన, యమృతముం బోలు నా - హార వస్తు
నిచయంబుఁ బిడుకుము - నీవని నియమింప, నదియు నవ్వారిగా - నపుడ కురిసె.

తే॥ షడ్రుచులతోడి యాహారంబు - సైన్య సమితి
తోడఁ దృప్తిమైఁ గొనుము మ - న్నీఁడ! యనిన
నందఱు భుజించి విరిసరుల్ - చందనంబు
తమ్ములము గొని శ్రమదీఱి - తనిసి యుండ.

సీ॥ కౌశికుండు వసిష్ఠుఁ - గాంచి యిట్లను ముని, జనగణ్య! నీవు లే - చినది లేద
యీ ధేనువే మాకు - నెల్ల సైన్యములకు, నిష్ట మృష్టాన్నంబు - లిచ్చు కతన
కలుష దూరులు శాస్త్ర ♦ కర్తలు మును 'రత్న, హారీతు పార్థివ' ♦ యనుట కతన
నీ కామధేనువు ♦ నీకుఁ దగ్గది కాదు, నా కిమ్మనవుడు మా ♦ నంబు గొనుచు

తే॥ క్షణము సేపుండి యమ్ముని♦చంద్రుఁ డనియె, దారుణ కృపాణ దీర్ఘ హా♦స్తా! తపస్వి
వల్కలిని పేద నే నీయ♦వలఁతిఁ గాను, ఈవ కొనిపొమ్ము వచ్చు న♦శ్లోని దీని.

తే॥ అనిన గౌశికుఁ డట్టులే ♦ యనుచు లేచి, పసిని బంధించి యాడ్వె స♦ప్పశువు కట్లు
త్రెంచికొని మునిఁ జేరి స♦న్నృపవరునకు, నిచ్చినాఁడవే యన నతఁ♦డిట్టు లనియె. ౨౧౭

సీ॥ నేన యొసంగలే ♦ దీ నరపతి జయ, చ్ఛత్రంబు గలవాఁడు ♦ సరభసముసఁ
బలిమిమైఁ గొనిపోవు ♦ వాఁడన నందిని, యితని బలంబు నే ♦ నిపుడ చెఱుతు
నని కోపమున దేహ ♦ మల్లార్ప రోమ కూ, పంబుల బోయలు ♦ బర్బరులును
చీనులు జోనకుల్ ♦ వేనవేలుగఁ బుట్టి, జననాథు బలము నా♦శంబు సేయ

తే॥ రాజపుత్త్రులు మునిరాజుఁ ♦ గ్రమ్మి కినుకఁ, బశుబలమ్మ గాదిది వీని♦వంచనమ్మె
పొడువుఁడనియార్చునాబుషి♦పుంగవుండు, నుఱిచిచూడ వారలు మండి♦యుర్విఁబడిరి

మ॥ తన పుత్త్రుల్ మడియంగఁ గౌశికుఁడు క్రు♦ద్ధస్ఫూర్తి దుర్వృత్తుఁడై
ధనువుం గొంచు గుణంబుఁ గూర్చి శరముల్ ♦ దంభోళి దోస్సారత౯
మునిపై నేయ వసిష్ఠుఁ డా నియును వే ♦ భూపాలుపై వైచెఁ జే
తను దాఁ దాల్చిన బ్రహ్మదండమును త ♦ ద్ధాత్రీశుఁడు న్నవ్వఁగ౯. ౨౧౯

మ॥ వర దివ్యాస్త్రచయంబుఁ దొట్టి తన య ♦ భ్యాస ప్రపుష్టంబు తా
శరముల్ వీడుచునుండ ద౦డము మహా ♦ శ్చర్యక్రియ౯ ౙ్రమింగ భూ

వరుఁడంతం గనకాద్రి ధన్విని మదిం ♦ బ్రార్థింపఁగా మెచ్చి యా
స్మరశత్రుం డొసఁగెన్ నరేంద్రున కసా ♦ మాన్యంబులౌ నస్త్రముల్.

చ॥ అతఁడవి యేసె నప్పు డమ్మ ♦ తాంధను లవ్వడి సూచి లోకముల్
హుతవహు లౌటఁ బడ్డవని ♦ యుత్తలమంది వడంకి రెప్పటిన్
యతిపతి హుంకృతం చతని ♦ యస్త్రము లెల్లను ద్రింగి యుగ్ర తే
జిత తనుఁడయ్యె నిట్లు శశి ♦ శేఖరు నస్త్రము లెల్ల వమ్ముగాన్.

చ॥ కుశికసుతుండు కాంచుచు న ♦ కుంఠితతేజము సత్తపస్వికే
వశమగుఁగాని తక్కఁగల ♦ వారికి నుండుట కల్ల; లోకముల్
యశమున నేలు శక్తి యది ♦ యచ్చపు సత్త్వము గాద యంచుఁ దొ
ల్దిశకుఁ జనెన్ మహా తపము ♦ తేఁకువఁ జల్ప వినిశ్చితాత్ముఁడై. ౭౨

ఉ॥ రాజగు కౌశికుండు ముని ♦ రాజు వసిష్ఠు జయంబు తీరు తా
నోజఁ దలంచి యంతఁ గడు ♦ నుగ్రముగాఁ దపియించి నిష్ఠమై
రాజిత శక్తినొంద నమ ♦ రావతి నాథుఁ డెదన్ భయంబునన్
*దేజు దొలంగి యచ్చరలఁ ♦ దేజు తిలోత్తమ నంపెఁ బెంపునన్. ౭౩

చ॥ నృపతి తిలోత్తమా తను వి ♦ నిర్మల సౌష్ఠవ మొప్పఁ గాంచి తాఁ
జపల మనస్కుఁడై మరుని ♦ సాయకముల్ హృదయానఁ గాడఁగాఁ
దపము కృశింప నాచెలికిఁ ♦ దద్ద వశుండయి చాలకాల మ
ట్లు పఱవ మేలెఱింగి వెగ ♦ టుం గొని నవ్వె మనంబులోపలన్. ౭౪

తే॥ ఇంద్రు వంచన మిదియని ♦ యెఱింగి కినుక, నవని మానిసివై పుట్టు ♦ మనుచు దానిఁ
దిట్టి యచ్చోటు పీడుచు ♦ ది గధిపతుల, సత్త్వవంతుఁడౌ జము దెస ♦ సరగఁజేరె.

తే॥ ఇచ్చ మెయి నటఁ దపము వ♦హించుచుండ, శక్తిమ దయోధ్యయందు త్రి♦శంకువనెడు
ప్రభువు పాలించుచుండి త♦ద్వంశ గురుని, ముని వసిష్ఠుని గాంచి యి ♦ ట్లనుచు నడిగె.

మ॥ మయితో స్వర్గముఁజేరఁ గాంతు నొడమెన్ ♦ మన్నించి యికార్యమె
మ్మెయినైనం బొనరింపుఁ డన్ననతఁడున్ ♦ మోమింయుం గాంచి యా
పయి నేనెవ్వరిచేతనైన నొనరిం ♦ పం జూతు నన్నంతనే
నయిరా! నాకపచారముం దలఁచి యా ♦ చార్యుం బరుం దెత్తువే? ౭౫

ఉ॥ ఆలము చేసియిట్లు మరి ♦ యాద దొలంగితి గాన నీవు చం
డాలుఁడ వౌదు వంచు ముని ♦ నాథుఁడు తిట్టుడు సూర్యుఁడుం బ్రకా
శాలి రహింప హేతువగు ♦ సట్టి నృపాలక తేజ మాఱఁగా
గాలి యొనర్పఁగాఁ దగిన ♦ కీడ్పడు రూపము దేని కేర్పడెన్. ౭౬

*తిలోత్తమ యని మూలము.

ఉ॥ హారములుం గిరీటమును ♦ హారి విభూషలు లోహభూషలై
జారు పటంబులుర్ మెడను ♦ జందెము త్రోళ్లఁగ మాఱి దేహముర్
పేరిన నల్లనై చెడఁగ ♦ వీడని చింత నృపాలుఁ డింటికిర్
జేరఁగ నెల్లవారచట ♦ సీయని రోయఁగఁ బోయెఁ గానకుర్. ౬౨౯

తే॥ ఒక్కనాఁడు విశ్వామిత్రుఁ ♦ డురు తపంబొ, నర్చు వనమున కేగఁ జం ♦ డాలుఁడవగు
నీవెవండ విటకువచ్చి ♦ తేలయన్న, మునికిఁ దన వృత్తమెల్ల భూ ♦ పుఁడు వచించె.

చ॥ అదివిని గాధిపుత్త్రుఁ డిది ♦ యాకథ! యంచు హసించి యజ్ఞముర్
వదలక చేసి పంపెదను ♦ స్వర్భువికంచు వచించి మానులర్
ముదమునఁ బిల్వనంప భయ ♦ ముంగొని వచ్చిరి వారలెల్లరుర్
బదరి వసిష్ఠ సూను లిటు ♦ పల్కిరి గర్వము కందళింపఁగర్.

ఉ॥ మాలఁడు యజ్వయంట! మఱి ♦ మాల పురోహితుఁ డంట రాజు! చా
ల్చాలును సమ్మతింప మన ♦ సన్మని కౌశికుఁ డంత నుగ్రుఁడై
యాలముచేయు కట్టెఁడి దు ♦ రాత్ములు నీచపథానువర్తులై
మాలుదు రంచు శాపమిడి ♦ మానక యాగము పూర్తి చేయుచుర్. ౬౩౨

ఉ॥ వేలుపు లార! రండనుచుఁ - బిల్వఁగ వారలు మింట నిల్చి యీ
మాలని కగ్ని కార్యము క్ర - మంబుగఁజేయుచు మమ్ము పిల్చు నీ
శీలము వోలదంచుఁ బ్రహ - సింపఁగ నిమ్ముని కిన్కనూని దా
మేలితపంబుచే నమర ♦ మేదిని ఁజేరుమ యంచుఁ బంపఁగర్. ౬౩౩

చ॥ మనుజవిభుండు వేచని వి ♦ మానమునర్ దివిఁజేర నిర్జరుల్
చను మిటరాకు మాలఁడవు ♦ చక్కటియే యిది యంచుఁద్రోవ, వో
మునివర! కావుకావు మని ♦ భూపుఁ డధోముఖుఁడై పడంగ రా
ముని నిలునిల్వుమం చశనిఁ ♦ బోలె నొనర్చె మహాట్టహాసముర్. ౬౩౪

సీ॥ నన్ను లెక్కింప కి ♦ ట్లున్నత గర్వులై, యవమతి గావించు ♦ నమరవరుల
పెను వైభవముకంటెఁ ♦ బేరిమిగాఁగ రెం, డవ త్రిదివంబు క ♦ డంగి యిపుడ
కావింతుఁ గమలాప్త ♦ కమలారులును ఋక్ష, తతియును గ్రహములు♦తవిలి పొడుపు
వలదెస యందును ♦ వడకడఁ గ్రుంకును, గలిగి సంచారంబు♦గాంచుఁగాక

తే॥ అనుచు నానతి యొసఁగి తా ♦ నంతఁబోక, సురల దిక్పతులను చరా♦చర వితాన
ములను సృష్టింపఁ బూనె నీ♦మ్మునివరుండు,భువన సముదయములు భీతిఁ♦బొందివడఁక

సీ॥ కల్పకవనమునఁ ♦ గాంక్షమై విహరించు, నెఱదంట నలువయు ♦ నీలగళుఁడు
తక్కునిలింపుల్లు ♦ తల్లడంబులై వచ్చి, శాంతింపు మునివరా! సైఁపు మిపుడు

శరణ మందినవాని ♦ కరము వీడక కాచు, తగవు నీకమరుట ♦ మునులలెన్న
ఈత్రిశంకుండు న ♦ క్షత్రసంఘము తోడ, నుస్వరంబునఁగూడి ♦ యుండుఁగాక
తే॥ ఎదురిక్కలు వలదెస - యందునిలిచి, నీమహామహిమను చాటి - నెగడుచుండు
నీవురాజర్షివై యొప్పు - దిది మొదలుగ, ననుచు వారలు నెలవుల - కరుగు నంత. ౭౩౬

## శునశ్శేపునివృత్తాంతము.

సీ॥ కడలి రాయనిదెస - నడరు నడవి కేగి, కౌశికముని సల్పె - ఘనతపంబు
ఆకాలమునఁ జతు - రంగ బలాధిపుఁ, డంబరీషుండను - నవని విభుఁడు
ప్రాణివర్గములకుఁ - బ్రాణసమానుండు, సుధఁబోలు పలుకుల - చొప్పువాఁడు
కొలచేసి జన్నంబు - సలిపెడు నరమేధ, మొనరింపఁ బిన్నవాఁ - డొనరకునికి
తే॥ నరయుచుంబోయి ఋచికుని-యాశ్రమంబు, చొచ్చి యడుగంగ మువ్వురు-సుతులలోనఁ
బిన్న నీఁజాల ననియెను - కన్నతల్లి, తనకు జ్యేష్ఠుండు కూర్చువాఁ - డనియెఁదండ్రి.
తే॥ మధ్యముఁడు నవ్వి విభుఁగాంచి-మానవేంద్ర!, ప్రేమఁ గని యెత్తి పెంచిన-పితరులొందు
పేదఱిమిఁబోవ ద్రవ్యమ్ము - వేఁడినంత, యిమ్మనుచు వారలకు మ్రొక్కి - యెక్కెఁదేరు.
తే॥ ఇనుఁడునడుమింటికెక్కంగ-మనుజనాథుఁ, డొక్కచోటమాధ్యాహ్నిక-మొనరుపంగ
నిలువ నాశునశ్శేపుఁడు - నియత కృత్య, ములను దీర్పఁగ మఱియొక - కెలని కరిగి ౭౩౯
ఉ॥ అచ్చట సన్మునీంద్రుఁ గుశి - కాత్మజుఁ గాంచి యడల్ గడల్కొనన్
జెచ్చెర పాదపద్మముల - శీర్షముఁ జేరిచి మ్రొక్కి యేడ్వఁగా
ముచ్చట నక్కుమారుఁగని - మూఁడిన యాపద చెప్పుమన్న వాఁ
డచ్చముగాఁగఁ దెల్పెఁ దన - యమ్మయు నయ్యయుఁ జేయు కార్యమున్. ౭౪౦
తే॥ అక్కయును బావయును సుతు-నమ్మికొనుట, దెలిసి చింతించియతఁడు చిం-తింపవలదు
నీదు ప్రాణముల్ గాచెద - నేనటంచుఁ, దనకుమారుల నతనికై - చనఁగఁ బనుప. ౭౪౧
చ॥ కొడుకులు సమ్మతింపమికిఁ - గోపమునం గను లెఱ్ఱఁజేసి దుం
దుడుకున రోమకూపముల - దూఁకఁగఁ బ్రస్ఫుట విస్ఫులింగముల్
వెడమతులార! నాపలుకు - వెడ్డఱికంబున మీఱినారు మీ
రడవులలోఁ బుళిందులయి - యారట మందుఁడి యంచుఁ దిట్టుచున్. ౭౪౨
చ॥ మునుపు వసిష్ఠు కోపమున - బ్రుంగని నల్వురు శాపయుక్తులై
చనఁ దనయల్లునే పిలిచి - చక్కన నేరిపి రెండు మంత్రముల్
మొనసి పఠించితేనియుఁ ద్రి - మూర్తులు వేల్పులు వచ్చి జన్నమున్
ఘనుమతుఁరు నిన్ను గాత్తురని - మన్ననతోఁ దగ నంపె నాతనిన్. ౭౪౩

చ॥ ముని వచియించినట్లతఁడు - మున్కొని మంత్రములం బఠింపఁగా
వనజజ విష్ణుశంభులు సు - పర్వులతో నటకేగి యక్కుమా
రుని యనుపుల్, విధిక్రమతి - రూఢిగఁజల్పిన రాజువేలిమిన్,
గొనకొనఁ గాచి రంతఁ జనెఁ - గోరిక గాధిసుతుం డుదీచికిన్. ౬౪౪

సీ॥ అచట విశ్వామిత్రుఁ ♦డధిక నిష్ఠను హ_స్త, పద్మాంగుళుల ముక్కు ♦ పైన నునిచి
ఇడను పింగళతోడ - నెనయించి మనమునఁ, బ్రణవజపము బహు - వత్సరములు
నియతిమై నొనరించి - నిశ్చలుండై నిల్వ, మూలాగ్ని వలనఁ గ - పాల మంత
భేదిల్లి తమసంబు - విరిసిన యనువున, ధూమంబు లోకముల్ - తూలునట్లు

తే॥ త్రిపురదహనుండు గజము వధించినట్లు,గప్పుకొన్న చెన్నున మొగుల్ -కమ్మురహిని
జగములం బర్వ భానుతే - జంబు మాసె, దిగిభ దిక్పాల నేత్రముల్ - మొగిచికొనియె

తే॥ మొగులు నిండు గగనమెల్లఁ ♦ బొగలునిండ, జంగమ స్థావరంబులు ♦ సంచలించె
దిక్కు లెల్లెడఁ గావులు ♦ తిసిరి కప్పె, దివ్యులును వెఱగందిరి ♦ తేఱిచూడ. ౬౪౬

తే॥ పద్మజుఁడు పద్మనేత్రుండు - పద్మబాణ, వైరి కులిశియుఁ దక్కు గీ - ర్వాణసమితి
యచ్చటికి వేఱువేఱుగా - వచ్చిచేరి, ఘన తపోధనుఁ గౌశికుఁ - గలిసికొనిరి.

తే॥ చంద్రమౌళియు వనమాలి - జలజభవుఁడు, గాధిజుం గాంచి పరమ త ♦ పోధనాఢ్య!
వేదపారగుల్ నిను మించి - వేఱులేర, అని వచించిరి యెద సంది _ యమ్ము లేక.

తే॥ అన్నుడువుల వీనులువిచ్చి - విన్నయతఁడు,శిరమువంచి కేల్ మొగిచివాం-ఛితఫలమ్ము
లొసరె నేఁటికి నేను ధ - న్యుండనైతిఁ,ననుడు వారు స్వస్థలముల - కరిగినారు. ౬౪౯

క॥ గతమైన చరిత్రంబిది,యితనికి సములైన తపసు - లిలలేరు మహా
స్నిత నియతుఁ డితని కనికర, మతులితముగఁ బడయు మీకు - నరిదియుఁ గలదే?

క॥ అని గౌతమ పుత్త్రుఁడు చె, ప్పిన రాఘవు లచ్చెరువును ♦ వేడ్కయుఁ గొని య
మ్మునికిం బ్రణమిల్లఁగ దీ, వనలిడి మరలెన్ స్వకీయ ♦ భవనంబునకున్. ౬౫౦

క॥ మునియుం దమ్ముఁడుఁ దనతమ, కనువగు సెజ్జలఁ బరుండి ♦ రంత నిరులు పం
డును పోలు రాముఁ డను రే,యును శశియును చాను సీత♦యునుఁగా నొప్పెన్. ౬౫౧

క॥ జీమూతంబును వీడిన, యామెఱపే యిట్లు నెలఁత ♦ యంగముఁ గొనెనో?
యేమో? యెఱుఁగఁగ రాదిది, నామదిఁ గన్నులనుదాని ♦ నవురే తోఁచెన్. ౬౫౩

క॥ విమలౌదార్య కరాబ్జము, లమరిన వెన్నుఁడు పరుండు ♦ నబ్ధి నెనయు నే
త్రములు గల రమణి నాహా, త్కమలంబున నిలిచెఁగానఁ ♦ గమలయె యగునో. ౬౫౪

చ॥ నెన రెద లేని దయ్యుఁ దమి ♦ నెక్కొనఁగాఁ గడుబేడిదంపు వే
దన మిడు నంజుగల్గు కను ♦ దమ్ములచే నను లోఁగొనంగ నా

కనులకుఁ గానవచ్చెడు జ ♦ గంబులఁ గల్గు చరాచరంబు లె
ల్లను వనితా సువర్ణమయ ♦ లాలిత సుందర రూపమే గొనెన్

చ॥ పరవిసగల్ చలింపఁదగు ♦ బంగరుకుండలు పేర్మిలేని నా
యురమున నాటకుండినను ♦ జ్యోత్స్నను బోలిన మందహాసముల్
బొరపలు మోవి దొండయును ♦ భూషలుగాఁ బెనుపొందు నా మనో
హారి ముఖచంద్రమండలము ♦ నారయ నింకొకసారి గల్గునే? ౬౫౬

ఉ॥ అంచిత మేఖలంగలుగు ♦ స్యందనమొక్కటి వాలుఁబోలు నే
త్రాంచల యుగ్మముల్ గనుల ♦ కబ్బని పీనకుచద్వయంబు లోఁ
గ్రుంచెడు మందహాసము న ♦ కుంఠితరీతి వహించుచుండు లె
క్కించగ నిన్నికావలయు ♦ నే సమవర్తికి నాయుధావళుల్?

తే॥ తావిగల పై డిబొమ్మయా-తలిరుఁబోడిఁ, దలఁచు మాత్ర నాపై నించు-పిలుతుఁడిట్లు
బాణవర్షంబు గురియించి - పఱచె ననఁగ, బలమనెడి యాగుణంబేరి - వలస నిలుచు?

తే॥ పుడమిఁ గొల్లమెట్టుటకయి-పొంగిలేచు, పాలకడలి వెల్లువవోలెఁ - బరవు చంద్ర
కాంతి నాయసుఖులఁ దియ్యఁ - గడఁగు కతనఁ, దెలి పెనంబొందు కలదను-తీరుదోఁచు.

క॥ చరియింపఁదగని స్త్రీ వను, జరుగదు నామనము నిజము - చక్కెర పలుకుల్
పరఁగునది పడుచెయగునని, పరితాపం బగ్గలముగఁ - బడుచుండు నెడన్

తే॥ చెల్లఁ గాలంబు రేజని - తెల్లగొడుగు, పడుటఁబోలెఁ బశ్చిమ దిశా - వనిత నొసల
నడరు గుంద్రని పతకంబు - వడిన లీలఁ, జంద్రమండల మంత న - స్తమయ మందె

తే॥ ప్రేమపతి చంద్రుఁడేగ నా - శౌమ్యగాత్రు, లెల్ల వల్లభుఁ డలఁదిన - తెల్ల కలప
మునుమనోవ్యథఁదుడిచిరో-యనఁగ మున్ను, పరవియుండిన వెన్నెలల్-మఱుఁగుపడియె

సీ॥ పొడవైన తోమాల - పొలుపుగాఁ దాల్చిన, రాముఁ డిష్వాధమునఁ - గామబాధ
నిర్వాటిలఁగ నొచ్చి - నిద్దుర లేకయె, సంతాప మొందుచు - జరపె రాత్రి
చెదరిన మదిలోనఁ - జింతించు చెందామ, రలను చెల్వాల మొగ - పున్నను చెలంగ
విరివిగాఁ దఱుచుగాఁ - బరవిన యిరులును, గుహలకుఁ జేతి మై - కుదుచు కొనఁగ

తే॥ ఎట్టచుక్కల మొగమొప్పు - నేన్గు చర్మ, మొనరఁగప్పినయుదయాద్రి-యనెడురుద్రు
నొసటిపై నగ్నిమయమయి-యొసక మెసఁగు, మూఁడవదియగుకన్నునా-మొలచె నినుఁడు

సీ॥ వడియు సత్త్వముగల్గు-పచ్చనిగుత్తాల, గిట్టల తాఁకునఁ-గెరలుధూళి
విప్రుల యర్ఘ్యంపు-విరులఁగూడిన నీటి, చేఁదెమ్మగాఁ బూర్వ-శిఖరి మీఁదఁ
బూర్వదిగ్దంతి మో - మున నుంచు సిందూర, తిలకంబు నా నొప్పె - జలజహితుఁడు
వచ్చువేళఁ దెలిపి - పగఱపై నేగిన, ప్రియులు తేరెక్కి రాఁ-బ్రీతిఁగాంచు

తే॥ తహతహంగల్గు క్రొత్తడి-తరుణుల ముఖ, కమలములు విచ్చుక్రియను వి-కాసమందె
సరసిజాకర ముఖసరో-జంబులెల్ల, సూర్యకిరణంబు లెల్లెడఁ-జొచ్చినిండ. ౬౬౪

సీ॥ కిన్నరుల్ గానంబు - తిన్నగాఁ గావింప, జనములు భక్తిమై - సంస్తుతింప
మునులు విప్రులువేలు-పులు కరములు మోడ్పఁ,గడలియు మద్దెలఁ - గా ధ్వనింప
గగనరంగమ్మునఁ-దగిలి నర్తించు భా, స్కరుఁడను రుద్రు బం - గారు జడలు
విరిసి భూతలమునఁ - బరవిన యటులెపోలెఁ, కిరణ జాలంబు క్రి-క్కిఱిసి పరవ

తే॥ విల్లుపూని చక్రంబు చే- విడిచి సతఁడు, పాలకడలి వీడి విచార - వనధి మునిఁగి
తరణి లేఁగరంబులఁ బాద-తలము లొత్త, రాత్రియను వార్ధితీరంబు-రమణనొందె.

ఉ॥ కల్పము దోరినట్టులొక - కైవడి రాతిరి యేగ దంతి నాఁ
దల్పము వీడి ప్రాత రుచి - తక్రియల న్నెఱవేర్చి మేటి సం
కల్పముతో మునీంద్రునకుఁ - గైముకుళించి యనుంగుఁదమ్ముతోఁ
బొల్పుగఁజేరె నాజనకు - పుణ్యుసుపేటికి యజ్ఞవాటికిన్. ౬౬౬

ఉ॥ అమ్మిథిలాధినాథుఁ డట - యజ్ఞము సాంగముగా ముగించి క
ర్ణమ్ములు దిమ్ములెత్తు శుభ - రావములొప్పఁగ రత్నమంటప
మ్మమ్ముగఁజేరి యింద్రుని వ - హిన్ మునితో సనుజన్ముతోడ వి
ల్లమ్ములుదాల్చుమేటి సుగు - ణాకరుఁడున్ వసియింప నొప్పుచున్. ౬౬౭

మత్త॥ కూరుచుండిన రాకుమారులఁ - గూర్మిమోముల యంద మిం
పారఁగ్రోలెడు పోల్కిఁగాంచి మ - హాత్మ! యెవ్వరు వీరనన్
వీరు నీమఖమున్ గిరీశు న - భేద్య చాపముఁ జూడఁగాఁ
గోరి వచ్చిరి మేరుధీరులు - కోసలేంద్రు కుమారకుల్. ౬౬౮

## ౧౧. వంశమహిమాను వర్ణన పటలము. (౨౯)

సీ॥ జలజాప్త కులజుండు - తొలి చక్రవర్తి యగా, మనువు నెఱుంగని - జనులు ఘనులె?
ప్రాణివర్గము గోద - వడి చెడకుండఁ బృ, థ్విం బిదికిన పృథు - వినవె నీవు?
వ్యాధులూడఁగ శత్రు - బాధలు మాఁడఁగఁ, బెద్దకాలంబు త - పించి శేష
శయను వెలుఁగు రూపు - జనులెల్లఁ గాంచ శ్రీ, రంగవిమాన ము - ర్వరకుఁదెచ్చు

తే॥ ప్రభువు నిక్ష్వాకు నెఱుఁగని - వారలెవరు? ఇంద్రుఁడెద్దయి తనుమోవ - నేగి యసుర
వరుని తలఁద్రుంచి స్వర్గంబు - బలవిరోధి,కొసఁగినకకుత్స్థుఁదెలియని-యొకఁడుగలఁడె?

తే॥ నరపు ముడుతలు వృద్ధత్వ - మరణములును, వఱలకుండ క్షీరాబ్ధిని - తరచి సుధను
వేల్పులకొసంగి తనకీర్తి - నిశ్రుతముగఁ, బరపి నాతఁడీ వంశసం - భవ్యుఁడొకండు,

చ॥ కదనమునందు గెల్చి యొఱఁ - గాంచెడి ఖడ్గము దాల్చుభూప! యొ
ప్పిదముగ మూఁడులోకములు - వీరత నేలిన సద్గుణాకరుల్
పొదలిన వీరివంశమున - భూపుఁడె జింకలు బెబ్బులుల్ పగల్
వదలుచు నొక్కరేవునను - పానము సేయఁగ నేలె నొక్కటన్ ౬౭౧

చ॥ అరి నరపాల పూజిత ప ♦ దాబ్జ! సురాసుర లొక్కయప్డు సం
గర మొనరింప నాకులకు ♦ ఖడ్గము విల్లును దాల్చి పాడి దే
వరవల బాసపై నిలిచి ♦ పట్టుగ రక్కసులన్ జయించి యా
సురపురిఁ గాచినాఁ డతఁడె ♦ సూ ముచికుందుఁడు వీరివంశ్యుఁడే. ౬౭౨

చ॥ మెఱపును నవ్వు కాంతిగల ♦ మేటి నరాజిని దాల్చురాజ! కా
ల్గొఱసెడు వీరమద్దియల ♦ నూనిన సూర్యకులంబువారు పెన్
దెఱకువ జీవరాసులకుఁ ♦ దియ్యని జీవమువోలె నేలి ర
త్తెఱఁగు శిబీంద్రుఁ డండజముఁ ♦ దేఁకువఁ గావ శరీర మీయఁడే? ౬౭౩

చ॥ రిపుల శరీరముల్ దొలువ ♦ రేఁగు కరాసి ధరించుభూప! యీ
విపులకులంబువారు పృథి ♦ వీధరముల్ కొనకాలఁద్రోయు చి
ప్పపగిది దొర్లఁజేసి మఖ ♦ వాజికినై జలరాశిఁద్రవ్వి ర
న్నపు డీఁకఁ జెప్పఁగావలెనె ♦ యానృపవర్యుల వీర్యసంపదల్. ౬౭౪

చ॥ పగఱ దశల్ గ్రహించు కర ♦ వాలము గల్గినతేఁడ! శేషుఁడే
తగ వివరింపలేఁడనఁ బ ♦ దంపడి నేఁ బలుకన్ వలంతినే?
సిగముడి రేలపూల నెలఁ ♦ జేర్చిన శంభునిపొందు నిర్జరా
పగ నిల కానయించిన నృ ♦ పాలుఁడు వీరల వంశజుండెకా! ౬౭౫

ఉ॥ కుందెటి మచ్చలేని నెల ♦ కున్ సరివచ్చెడి యెల్లిగల్గు రా
జేందుఁడ! వీరిపూర్వుఁడొకఁ ♦ డేడ్తెఱ వార్ధిపరీత భూతలం
బంది జయేందిరన్ గరత - లామలకంబుగఁ జేసికొంచుఁ బే
రొందఁగ నశ్వమేధ శత - మూని యొనర్చె సురేంద్రుఁ డంజఁగన్. ౬౭౬

ఉ॥ చందురు గెల్చి నాతఁడును - శర్వు జయించినవాఁడు దూపుచే
దుందువుఁ గూల్చి నాతఁడును - తోఁచిన భాస్కర వంశమందె పు
ట్టొంది రఘుండు దేవవిభు - నోరిచి యెన్మిది దిక్కులన్ జయం
బంది యనర్గళంబగు ప - రాక్రమ మొప్పఁగ నేలె లోకమున్. ౬౭౭

చ॥ ధనువను మందరంబు గొని - దర్పిత శాత్రవ రాజులన్ సుధా
వననిధిఁ ద్రచ్చి జ్యోతి మయ - బంధుర సుందర మందహాసముల్

ననుచుచు నుండు నిరుపమతి - నాఁజను నిందిరఁగాంచి పద్మనా
భునిబలెఁ దద్భుజాశ్రిత ప్రజ - భూపతి భూమిఁగఁ దాల్చెఁ బెంపుమై. ౬౭౮

చ॥ మంగళ రావముల్ సతతము - మానుగ మ్రోఁగు నజార మొప్పు భూ
పాంగ! జగంబునన్ దశరథ - ధావని నాథు నెఱుంగకుండు వా
రుంగలరేమి? వారి కొమ - రుల్ గుణవీరులు వీరి నేరు సా
రంగ వచింప నల్వకుఁ ద - రంబె? యెఱింగిన యంత పల్కెదన్. ౬౭౯

చ॥ సిలుగులు లేక ప్రాణి తతి - శ్రేయము లొంది భువిన్ సుఖింప వే
వెలుఁ గివముంబలెన్ విమత - వీరుల దూల్చి జగంబుఁ గాచు వాఁ
డిల మనువు న్నయంబున జ - యించినవాఁడు ధనుస్సహాయుఁడు
జ్వలిత సుధర్మవర్ముఁ డజు - పట్టి కుమారులు లేని చింతచే. ౬౮౦

సీ॥ వింటికోపుల వంటి - వెడఁద నొసళ్లును, తొక్కుపల్కులఁ బోలి - నిక్కునుడులు
నింపైన బింబాధ - రంబులు నీలాల, శాల నేత్రంబులు - సంకుమెడలు
నులియు మధ్యంబులు - వెలకిచ్చు భోగంబు, లలరు సణ్యస్త్రీల - నరసి కుచము
లను కొమ్ములను గల్గు - సడగిమెకంబులు, గానెంచి వారితోఁ - గదలివచ్చు

తే॥ ఋశ్యశృంగునిచే చింత ♦ లీఁగఁదలచిఁ, దుర్భగుఁడ నాకుఁగొమరులు ♦ దోఁపరైరి
నేలమొత్తము నావెన్క ♦ నేలఁదగిన, తనయుల నొసంగుమనుచు నా ♦ తనికిమ్రొక్కె.

తే॥ మ్రొక్కనమ్ముని యుత్సాహ-మున వచించె, భూమిమాత్రమే యననేల- భువనమెల్ల
నేలుపుత్త్రుల నీకిత్తు- వేలిమికిని, వలయు వాసిని సమకూర్పు - పార్థివేంద్ర! ౬౮౧

తే॥ అనుడు వస్తువుల్ సమకూర్ప ♦ ననఘుఁడంత,బుత్త్రకామేష్టి సాగించి♦ పూర్తిచేసెఁ
గనక కలశంబునన్ సుధా ♦ కల్పమైన, యన్నమునుంగొని భూతమొం ♦ డందు వెడలె

తే॥ అన్నముం గొని మునివరు ♦ ననుమతమున, తన్నుతాఁబోలు దశరథ ♦ ధరఁణీధవుఁడు
ముప్వ రర్ధేందు నిటలల ♦ ముదముతోడఁ, బిలిచి నాలుగుపాళ్లు గా ♦ పంచి యిచ్చె.

శా॥ పండంబాఱి పగుళ్లు పుట్టిన మహా ♦ పాపక్రియాసిద్ధిచే
నిండంబాఱిన వేదచోదిత లస ♦ న్నిత్యక్రియాసిద్ధిచే
దొండంబోలిన నోరుగల్గిన సదా ♦ తుష్టాత్మ కౌసల్య యా
దండ న్నిల్చు నలేఖ్యసుందరు జగ ♦ త్కల్యాణ దాయిం గనెన్. ౬౮౨

చ॥ త్రోయఁగరాని నీతులను ♦ తోరపు టేఱులు వచ్చిచేర లోఁ
తై యలరారు సద్గుణచ ♦ యంబను నబ్ధి ననింద్య సద్గుణా
మేయ మనోహరత్వముల ♦ మేలుగ నీతనిఁబోలు పుత్త్రిఁగై
కేయి గనెన్ మహామృదుల ♦ కీర్తిరతున్ భరతున్ సుధీరతున్. ౬౮౩

చ॥ అరుదగు చేవచే గెలుపు ♦ నందుచు ధర్మము పాడొనర్చు నే
ర్పరులగు దానవేంద్రుల భ ♦ రంబగు క్షితిని ముంచు శూరులన్
వరధనువుల్ ధరించి నిలు ♦ వం గనకాద్రిని ప్రాప్యశైలముల్
స్ఫురణమందెచ్చువారి నిరు ♦ బొట్టెలంగాంచెం జగన్ సుమిత్రయున్. ౬౮

మానిని॥ నాలుగు వేదములంబలె నొప్పిన ♦ నల్వురుపుత్త్రులు సూక్ష్మమతిన్
జాలి సరస్వతికిం బయివారయి ♦ చక్కటి నాలవ వేదమొగిన్
దాళక లోఁగిన శాత్రవులై వడి ♦ దాస్యముసేయఁగఁ బూర్ణ నిశా
పాలుఁడుపుట్ట ధ్వనించుచుఁ బొంగెడు ♦ వార్ధులకై వడి వర్ధిలఁగాన్

సీ॥ ఒఱలోనె నిద్రించు ♦ చుండెడు ఖడ్గంబు, గల మిథిలాధీశ! ♦ తెలియ వినుము
కాన్కలతోఁ గూడఁ ♦ కడఁగి రాజన్యులు, వచ్చిమ్రొక్కులిడఁగఁ ♦ బాత్రమగుచు
వీరమద్దియలచే ♦ వెలుగొందు పాద ప, ద్మంబు లొప్పారిన ♦ దశరథేశు
కొడుకు లనెడు పేరొ ♦ కొంచు మాత్రమె యుప, నయనంబుగావించి ♦ నయమునేర్పి

తే॥ శ్రుతులు చదివించి శాస్త్రసం ♦ తతులఁదెలిపి, యెల్ల కర్జంబులెల్లప్పు ♦ డెల్లవిధుల
జరపిపోషించి నాతఁడు ♦ గురుతపస్వి, చూళిబ్రహ్మనిభుఁడు వసి ♦ ష్ఠుండె చుమ్ము.

ఉ॥ ఏనొనరించు జన్నము స ♦ హింపక పాడొనరించు క్రూరులన్
బూనికతో వధించు తలఁ ♦ పుం గొని యీసుకుమారపాదులన్
దోనడపించుకొంచు గుణ ♦ తోయధి! నావనమందు చేరితిన్
బూనితిఁ బూనిపూనికయె ♦ ముందుగఁ దాటక మమ్ము దాకొనెన్

చ॥ జడనిధిఁబోలు రాఘవుని ♦ శౌర్యము సుస్థిర శీల మందమై
పొడవగు దోర్యుగంబు బల ♦ మున్ గనఁ జాలెదుగాకఁ యమ్మొకం
డడరుచు మండుకన్నుగవ ♦ నార్చెడు తాటకబొమ్ముఁదొల్చి వెన్
దొడరి మహీధ్రముల్ తరులు ♦ దొల్చుచుఁ దూలెను భూమిలోపలన్.

చ॥ ఎఱుపగు మిన్ను వన్నెయయి ♦ యేరుపుఁబోలిన కేశమూర్ధముల్
గుఱికొని గుప్పతిప్పలుగఁ ♦ గూలె నొకప్పునఁ గాలుప్రోలికిన్
బఱచె సుబాహు, వింకొకఁడు ♦ పడ్డసలం బె యెఱుంగ వేలిమిం
గొఱంతలులేక చేసికొని ♦ కూరిమితో నిటకేగుదెంచితిన్. ౬౨

చ॥ నృపవర! బ్రహ్మయేనెఱుఁగ ♦ నేరని రాము మహత్త్వ సత్త్వమీ
విపుడె గ్రహింతుగాక! జగ ♦ మెల్లను కాలిచి బూదిసేయు నే
రుపుఁగల తూపులన్ మునుపు ♦ రూఢతపంబునఁ బొందియిచ్చు నేఁ
డ్రదపగొన నయ్యవీతనికి ♦ దాస్యముచేయుచునుండె నిచ్చలున్. ౬౩

ఉ॥ ఈతని వీరమద్దెలు వ ♦ హించిన పాదసరోజ ధూళియే
గౌతముపత్నికిన్ మొదలి ♦ కాంతిని రూపము నిచ్చెఁ బ్రేమ సం
గాతము మెండు బ్రాణముల ♦ కంటెను రాముని యందు నాకు ను
ర్వీతలనాథ! యంచతని ♦ వృత్తము వీనుల విందుచేయఁగన్. ౬౯౪

## ౧౨ కార్ముకపటలము. (౬౬)

చ॥ ఉరుతర చిత్ర కార్ముకము ♦ నుంకువ చేయుటచేఁ దలంపు పెం
పొరయ ఫలింప కుండఁగ మ ♦ జ్జోఁడు వచింపఁగ నేమి యుండు? నీ
వరగుణుఁ డీశు చాపమును ♦ వారక యెక్కిడి లాగెనేని నా
వరము ఫలించు జానకి త ♦ పంబు ఫలంబు కరంబు నిండగున్. ౬౯౫

### శివధనువును గని పలువురు పలువిధములఁ దలఁచుట

క॥ అనిపలికి మునియు నీకొన ♦ జనకుఁడు తన భటులఁ గాంచి ♦ శంకరు ధనువున్
గొని తెండు వేగ పొండన ♦ ధనుర్గృహము చొచ్చి వారు ♦ దానిం గనుచున్. ౬౯౬

చ॥ కలభముఁ బోలు దొడ్డ దృఢ ♦ కాయులు కొండలఁ బోలు బాహువుల్
వెలి మెలి వడ్డ వా రయిదు ♦ వేల జనంబులు మధ్య మధ్య దం
డెల నెలకొల్పి క్రిందుగ వ ♦ డిన్ భుజ మూర్ధము లాన్చి మోచి పా
టల గతి తప్ప కద్గులు శ ♦ డంబడకుండఁగఁ దెచ్చుచుండఁగన్. ౬౯౭

సీ॥ విపులయౌ ధర తన ♦ వీఁపు నొప్పిని మాన, మేరువు లజ్జను ♦ మించి పూన
వచ్చుచుండఁగ వార్ధి ♦ వంటి విశాలమౌ, పురమున జనులు గుం ♦ పులుగఁ గూడి
కలకలమంచు లో ♦ కంబునం దెల్లెడఁ, జోటు లేదన వచ్చి ♦ చొచ్చి చూచి
శంఖ చక్రమ్ముల ♦ జానుగఁ దాలిచి, మగ సింగముం బోలు ♦ మాధవుండు
తే॥ గాక వేఱెవ్వరీ వింటిఁ ♦ దాఁకు వారు!, నేఁడు రాముఁ డీ ధనువు గు ♦ ణీకృతంబు
చేసెనేని శుభాంతమై ♦ సీతపెండ్లి, పొసఁగు నని యొక రొకరితో ♦ ననెడివారు.

సీ॥ కార్ముకం బనుపెల్లఁ ♦ గైతవమే యగుఁ, గనకపర్వత మిది ♦ యనెడివారు
ధాత చేతుల తోడఁ ♦ దాఁకి చేయఁగలేదు, ఘన తపోబలముచే ♦ ననెడివారు
మును దీని నెక్కిడి ♦ తన కుపయోగించు, కొనినవాఁ డెట్టిఁడో ♦ యనెడువారు
మేరువునే యిట్లు ♦ మెదిపి చేసిరొ వార్ధి, మునుచిల్కు కొండయో ♦ యనెడువారు.
తే॥ చిలువఱేఁ డిది యంచు వ ♦ చించువారు, వారిదమునుండి యింద్ర చా ♦ పంబు జారి
పడెనొ మేదిని పయి నని ♦ పలుకువారు, పడుచు చూచెనే యిదియని ♦ నొడువువారు.

సీ॥ పెను వింటి నిటకుఁ దె ♦ ప్పింపుఁ డనుచుఁ బ్రభుఁ, డాజ్ఞ యెందులకిచ్చె ♦ ననెడివారు
ఘుల్తి చెడి వచ్చిన ♦ మన్నీం ద్రెవండేని, కలరె యింద్గని వగఁ ♦ బల్కువార్లు

పూర్వ తపఃఫలం ♦ బున నైన నొకవేళ, కూడదో? యనుచు వా ♦ క్రుచ్చువారు
ఏత ద్ధనుర్విద్యము ♦ క్షేపుప్రునకు లక్ష్య, మై యమరున దేవో ♦ యనెడువారు

తే॥ సీత పెండ్లి కె దీనిని ♦ చేసిరనుచుఁ, జక్రిఁ బోలిన రాముఁడు ♦ చారు తనుఁడు
వీఁగ కెక్కిడునే యని ♦ విధిపిధించు, చెడుగులిట్టివే యని జనుల్ ♦ నొడువుచుండ

తే॥ భటులుహారువిల్లుగొనిపోయి ♦ ప్రభునియెదుటఁ,బుడమి వీఁపునెటుక్కన ♦నడఁగి పల్ల
మడర నుంచి రా చాపంబు ♦ నరసి నృపులు, తెచ్చిరే యని కేలు వి ♦ దిర్చి కొనిరి.

చ॥ కలభముఁ బోలు రాఘవుని ♦ కాయము నందము గాంచి వేదనన్
గొలిపెడు వింటిఁ గాంచి తన ♦ కూఁతు నదృష్ట మెడందఁ గాంచు రా
ట్రిలకునిగాంచి గౌతమ జ ♦ టిప్రభు పుత్త్రుఁడు మండపంబునం
గల నృపరాజిఁ గాంచి నయ ♦ గౌరవుఁ బల్కెల మించి యిట్లనున్. ౨౦౨

సీ॥ మేరువు విల్లుగా ♦ మెఱయు శంభుఁడు తన, సామేన వసియించు ♦ సతికిఁ దండ్రి
యవమతి యొనరించె ♦ నను కారణమున ను, ప్పొంగి లేచెడు కిన్కఁ ♦ బూని యప్పు
డీ విల్లు గొని వెస ♦ నేగి దక్షుని యాగ, శాలఁ జేరంగ న ♦ చ్చుటఁ గలట్టి
కొండఱ పండ్లూడె ♦ ♦ గొందఱ కరములు, విఱిగె వేలుపులును ♦ విచ్చి పాఱి

తే॥ పోవరానిచోటులకెల్లఁ ♦ బోయి డాఁగి, రగ్నులునశించెముక్కంటి ♦ యలుకతొలఁగఁ
దనదు విల్లిచ్చె నీవంశ ♦ మున జనించు, దేవరాతున కమ్మహా ♦ దేవుఁ డపుడు ౨౦౩

తే॥ నేను శివ ధనుర్బలము వ ♦ ర్ణింప వలెనె?, చంద్రమౌళిఁ బోలిన ముని ♦ చంద్ర! నీవ
తెలియఁ దగు వాఁడ వింక నీ ♦ కలికి సీత, జనన వృత్తాంతమును విను ♦ సాంగముగను

## సీత వృత్తాంతము.

సీ॥ ఇనుముఁ బోలిన దీర్ఘ ♦ శృంగముల్ బలితంపు, టఱ్ఱులు గల కోడె ♦ లమరఁ బూన్చి
బంగారు మడకకు ♦ వజ్రంపు గఱ్ఱును, రత్నాల నొగయును ♦ రంజిలంగ
స్ఫటికంపుఁ గాఁడి యొ ♦ ప్పఁగఁ గూర్చి జన్నంబు, నకు సమపఱుపంగ ♦ నొకపొలంబు
మును దున్నఁగాఁ గఱ్ఱు♦మొననుండి బాలభా,స్కరుఁ బోలు కాంతులు♦గలిగిభూమి

తే॥ దేవి వెలువడె నన నొప్పి ♦ తేజరిల్లి, పాల కడలిలో సుధతోడఁ ♦ దేలినట్టి
సిరియు దీనకై యొదుఁగు మే♦ల్చెలువు గలుగు, కలుకులకు రాణి యా సీత♦గానిపించె

సీ॥ రమణి గుణంబుల ♦ రమణ యేమన నగు!, నవియ తమంతఁ ద ♦ న్వంగిఁ జేరి
మేలుపడఁగఁగోరి♦మీఁదుమీఁదుగఁద్రోచి, కొనివచ్చియొండొండు♦పెనఁగుచుండుఁ
జెలువు నెలవు గోరి ♦ బలు తపంబొనరించి, పూఁబోఁడి నెమ్మేని ♦ బొందినయది
భటువు కమ్మల కొమ్మ ♦ ప్రభవించినదది మొదల్, మిగిలిన మగువలు♦మేల్మి తఱఁగి

తే॥ వేల్పులేటి యుప్పరమునుండి ♦ పృథివిఁజేరఁ, దక్కు నదులెల్లఁ బెంపునఁ♦ దఱిఁగినట్టు
లైరనఁగఁ జాలదే యెక్కు ♦ వైతి యగునె?, మాని నక్షత్రగణరాజ! మహిత తేజ!

తే॥ విమల కర్తవ్య విజ్ఞత ♦ విని కృతంబు, వేఱుగా నుండ లక్ష్మిని ♦ వేల్పులెల్లఁ
గోరినట్లు సీతను నృపుల్ ♦ గోరినారు, దీనిఁ బోలిన చిత్రమెం ♦ దేని గలదె? ౨౦౭

చ॥ గుగు మద దంతిఁబోల్న నృపులు ♦ ఘోషము గొల్పు చమూ సముద్రులై
యురవడి వచ్చి పెండ్లి పలు ♦ కొప్పఁగఁ బల్కిన యెల్లవారికి
సరణి వచించి నార మల ♦ శర్వుఁడు పోరున నెత్తు వింటి నే
పురుషుఁడు వంచువాఁ డతఁడె ♦ పో వరుఁ డయ్యెడు సీత కియ్యెడన్. ౨౦౮

ఉ॥ శాప శరంబుచే జగముఁ ♦ జక్కఁగఁ జేయ వలంతి యైన యో
తాపసవర్య! యీధనువుఁ ♦ దాఁకఁగ లేక ప్రసూన సాయకం
బోపఁగలేక పర్వతిస ♦ మున్నత చాపముతోడ వచ్చు నీ
తా పరిశుద్ధమూర్తిఁ గని ♦ తత్పరతన్ నృపరాజి పోరఁగన్. ౨౦౯

తే॥ అలరుకీర్తిఁగోరునుదారు♦కలిసి పోల్కి, జనకుసైన్యంబు తఱిఁగియుఁ♦బెనుపుమిగిలె
భ్రమరయుతసుమవేణిపై♦భ్రమవహించు, ప్రభులసైన్యంబుతమయాస♦వలెనవిఱిగె

చ॥ విమల పథాను వర్తులగు ♦ వేల్పులు సత్త్వవరిష్ఠుఁ డుగ్ర చా
పము తన పట్టి కుంకువగఁ ♦ బల్కుటచే నగు పోరఁ గ్రుంగుచుం
ట మదిఁ దలంచి నేసల కు ♦ టంబుగ నంపుట గాంచి రేయి ఘూ
కముఁ గని పాఱు కాకముల ♦ కైవడిఁ బాఱిరి సేనతో నరుల్. ౨౧౧

ఉ॥ అప్పటినుండి నేఁటివఱ ♦ కప్పుడు పాఱిన వారలేని వే
తెప్పుడమీశులేనియు ను ♦ మేశుని చాపము డాసినారు కా
రెప్పటికేని పెండ్లియగు ♦ టేర్పడదా? యని యుంటి మీతఁ డిం
పొప్పఁగ నెక్కు వెట్టిన న ♦ హో వితి చెందదు సీత యందమున్. ౨౧౨

ఉ॥ అమ్మని పల్కువార్తఁ దగ ♦ నారసి కెంజడ లాడఁ గౌశికుం
డిమ్ముగ మూర్ధ మూఁచి యని ♦ కేడెఱఁ బూనెడు కోడె మాడ్కి బీ
రమ్మునఁ గానవచ్చు రఘు ♦ రాముని మోమును గాంచెఁ జిత్ర రూ
పమ్మును పోలు మేను గల ♦ పార్థివ పుత్త్రుఁడు గాంచె సింగిణిన్. ౨౧౩

రాముఁడు శివధనువు కడ కేగుట.

తే॥ నేయి పోయఁగ నట నుండి♦నింగి నంటఁ, బొంగి లేచెడు జ్వలితాగ్నిఁ♦బోలె లేచె
విభిగె హార ధను వని వేల్పు♦లఱచినారు, విజితకామాది రిపులు దీ♦వించినారు. ౨౧౪

తే॥ విమల సత్త్వపోధనునిచేఁ ♦ బ్రేరితుండగు, రాముండా పెంటెనారికగూ ♦ ర్పంగమున్న
సుందరుల మనముల నేయ♦నూపబాణుఁ, డెక్కు వెట్టెను పూన్కిమైఁ బెక్కువిండ్లు

సీ॥ కనఁబడు పెనువిల్లు ♦ కాలి బలిమిఁ బోలు, ననియగ్గలికఁ బల్కు ♦ లాడువారు
సిగ్గరియగు సీత ♦ చెలువంపుఁ గెంగేలు, రాము కెంగేలు గూ ♦ ర్పఁబడదేని
పుట్టువుల్ సఫలతఁ ♦ బొందె వనెడివారు, నిపుడుఁ డిప్పు డె ♦ క్కిడఁడయేని
అలివేణి సీతతో ♦ నలఁత లేక మనము, నగ్నిఁ బ్రవేశింత ♦ మనెడివారు

తే॥ దాతయగు మిథిలేశుండు ♦ సీత పెండ్లి, చేయఁ గోరుచోఁ గొను మని ♦ యీయకుండ
భవుని విలు దెచ్చి యీపిన్న ♦ వానిముందు,నునుచు టెంతయు నవివేక♦ మనెడివారు

తే॥ మునికి లజ్జ లేదనువారు ♦జనకుకంటెఁ, గ్రూరుఁ డొక్కఁడు లేఁడను ♦ వారు రాముఁ
డీ ధనువు వంప లేఁడేని ♦ యింతి జీవి, తంబు ధరణిపైఁ జాలవ్య ♦ ర్థ మనువారు.

తే॥ నెమలి మైచాయ మగువ లీ♦రమణఁ బలుక, సాధువులు వొంగ విబుధులు♦సంతసింపఁ
బైఁడికొండ యేనుఁగు పెను ♦కోడె సిగ్గు, వడఁగ రామచంద్రుఁడు వింటి♦కడకు నడచె.

తే॥ కనక కంకణములు సందు ♦ గాజు లొప్పి, పొంద నరుదైన రత్నంబుఁ ♦ బోని సీత
మెడను వైవ నెత్తిన విరి ♦ వడ మనంగ, నెత్తె రాముఁడు మేరువు ♦ నెనయు విల్లు.

ఉ॥ తోరపు విఘ్నముల్ సలుపు ♦ తొంగలి ఱెప్పల వాల్పుకే సభా
స్తారులు చూచుచుండినను ♦ సభ్యుల నొక్కఁడునేని చాపముల్
వారక కాలఁద్రొక్కుటయు ♦ నారి తగుల్చుట గాన రైరి చే
నారఁగఁ జూచి రంత నిని ♦ రారవ మావిలు తున్గి కూలుటల్. ౭౨౦

చ॥ అమరు లజాండ గోళమె ర ♦ యంబున వ్రీలె నిఁకేరి మర్వ చొ
త్తమని వడంకినా రనఁగ ♦ ధారణి వాసుల బీతు చెప్ప వ్య
ర్థమ యగుఁ దల్లి వేరువలె ♦ ధాత్రిని మోయుచునున్న శేష నా
గము తన నెత్తిపైఁ బిడుగు ♦ గాటముగాఁ బడె నంచుఁ బెల్కుటెన్. ౭౨౧

చ॥ గురు భయ దాసిచే జయము ♦ గొన్న విశేష మహీశు పుణ్య మి
ప్పరుసునఁ బండె నంచు విరి ♦ వాన సురల్ గురియించి రంబుధుల్
గురిసెను రత్నముల్ మిగుల ఘోషము సేయుచు నంబుదంబులున్
గురిసెఁ బసిండి వాన ముని ♦ కూటము దీవన లిచ్చెఁ బ్రేమమై. ౭౨౨

సీ॥ అమృతంబుకంటె నిం ♦ పైన వివిధ వాద్య, ములునిండి మెల్లెడ ♦ మ్రోఁగుచుండ
విరుల సరంబు లా ♦ భరణముల్ చందన, మును గందవొడియును ♦ పునుఁగు కడలి
ముత్తెముల్ రత్నముల్ ♦ పొన్నును సన్నని, వలువ లొండొరులపై ♦ వైచికొనఁగ
నగరంబు పర్వంబు ♦ నన్ వారిరాశి ఘో, షించుటవోలె ఘో ♦ షించు చుండె

తే॥ మేఘములఁ గని పొంగు నె ♦ మిళ్ల మాడ్కి, నలరి తరుణులు మకర వీ ♦ ణలనుపూని
యులివు తేనెలు గురియఁ గం ♦ డలము లాడ, సగలుతళతళ మెఱయంగ ♦ నెగడిరపుడు

ఉ॥ బమ్మెర గొల్పు నాసవము ♦ పానము చేసినవారిఁ బోలె నే
త్రమ్ముల కెంపు గల్గు వని ♦ తామణు లంగద సీఁగి భర్తలం
గ్రమ్మి కవుంగిలించి రల ♦ కంధి జలంబును ద్రావు మబ్బు నా
నిమ్ముగ వారుకొంచుఁ జని గెద్దడి ♦ బీదలు రాజు ద్రవ్యముల్.

తే॥ వైణికులయు నటకులయు ♦ వైణుకులయు, మధుర గీతంబులను చెవి ♦ మాఁగ వినిన
దేవ మనుజ దేహాషు లొక్క ♦ తీరుఁగాఁగఁ, జిత్ర సమముగ నిలిచె వి ♦ చిత్ర గతిని.

ఉ॥ రామ ధను ర్విఖండన వి ♦ రావము విన్న సుపర్వ భామినుల్
ప్రేమను తద్భుజంబులను ♦ వీక్షణ సేయఁగఁ గోరి వచ్చి భూ
భామల రూప చేష్టలను ♦ పాటల నాటల భిన్నతల్ గనం
గామిని కౌఁగిలించుకొని ♦ కన్నుల నార్ప భ్రమించి రవ్వలల్. ౭౨౬

సీ॥ దశరథ పుత్త్రుఁ డి ♦ తం డనః వారును, కమలాక్షుఁ డనువారు ♦ కారు మేఘ
మనువారు పువ్వువంటి ♦ తను వను వారును, మనుజుఁ డీతండు కాఁ ♦ డనెడువారు
చౌఱమీఁలు దిరుగాడు ♦ వర కలశాబ్ధిలోఁ, బండు విష్ణుండని ♦ పలుకు వారు
మనుజ దేహుం డంట ♦ మరు లెపో యనువారు, నవని తపము చేసె ♦ ననెడువారు

తే॥ మేని యందము గనుఁగొన ♦ మెలఁత కింక, వేయి గన్నులు వలయు న ♦ బ్జాయతాక్షు
సౌరు గన నాతనికి నట్లె ♦ వీరి నిటకుఁ, దెచ్చు మునికి మ్రొక్కుండని ♦ తెలుపువారు.

తే॥ అతనిఁ గన్న ట్లెయాతని ♦ యనుజుఁ గాంచుఁ, డనుచు నుండ నచ్చట సీత ♦ యవలఁజూడఁ
గోరు నాసచే నుసుఱులు ♦ కొంత నిలువఁ, బొరలుచుండెను పరితాప ♦ మునఁ బగంట.

## సీత చింతనము.

సీ॥ ఉట్టూఁత లూఁగెడు ♦ నుసుఱులతో వసి, వాడిన పానుపు ♦ వీడి చెలులు
ప్రమ్మిరాఁ బద్మాక ♦ రము దరి స్ఫటిక హ, ర్మ్యంబున నెలతాల ♦ యరుగుమీఁదఁ
బన్నీరు చల్లిన ♦ పానుపుఁ జేరి యీ, తెఱఁగున నను దమ్మి ♦ తీఁగలార!
అబల కిటులు గల్గె ♦ నని యెంచి దయయుంచి, తన మేనివన్నె ప ♦ త్రములఁ జూప

తే॥ మ్లానతను వీడు చుంటిఁ బ ♦ ల్లవముఁ బోలు, నా మొదలి రంగు గొనిపోవు ♦ నంటుకాని
కనుల రంగు మీఁ విరులచేఁ ♦ గొనఁ జేసి, నాదు ప్రాణముల్ దీయఁ బూ ♦ నంగఁదగునె?

సీ॥ తన భుజంబులఁ గాంచి ♦ తొఱి సిగ్గిలు మేరు, వును పోలు విలుదాల్చి ♦ గొనముతడవు
దోస్స్తంభ యుగ్మంబు ♦ తూణంబు వెన్నెల, పగిది జన్నిదమును ♦ వైజయంతి

పోరలేదు వక్షంబు ♦ మరలఁ గాంతున యేని, కాన నోపుదు నాదు ♦ ప్రాణములను
గగన సంచారి యా ♦ తోఁగల రాయని తోడ,మధుపముల్ రోదసేయు ♦ పూలలుగల

తే॥ క్రొమ్ముడియుఁ గల్గి పెనుబిల్లు గూడఁ దాల్చి, రెండుకన్నులుగలమబ్బొ ♦ కండునాదు
ప్రాణ జీవనముల ముంచి ♦ త్రావివైచె, నది యెడఁద నిపు డున్న దె ♦ ల్లపుడు నుండు

ఉ॥ తుంటరి మన్మథుండు నను ♦ దూదిని గాల్చెడు నగ్నివోలె త్రొ
మ్మంటగ వేఁడి తూపుల ర ♦ యంబునఁ గాల్పఁగఁ జంచలించు నా
వంటి సుకాసికిన్ బ్రదుకు ♦ పద్ధతి వచ్చి "భయంబు మాను నే
నుంటి" నటంచు దాపు గన ♦ నొప్పని దెవ్విధి పౌరుషంబొకో? ౨౩౧

మ॥ అడఁగంబాఱని యో పయోధరము లా ♦ రా! పైపయిం బొంగి యి
వ్వడువై యేమి యొనర్చి నార లిఁకనే ♦ పాటైన వే పొంది యె
క్కిడఁగా రాని ధనుస్సుఁ దాలిచిన ధా ♦ త్రీశాను వక్షంబు నే
ర్పడ నాటం గయికూడునేని తప మొ ♦ ప్పం జేయుఁడీ వేడెదన్ ౨౩౨

చ॥ అడరుచు నామదిం గల య ♦ నంగుఁడు వైచిన సాయకంబుచేఁ
బొడమిన చింత వర్ధిలుచుఁ ♦ బోసె నురోజ యుగంబుపై విసం
బెడపక యాతఁ డెవ్వఁ డిటు ♦ లేఁచెడు రాత్రులఁ బీడ సేయు చం
ద్రుఁడొ? నడుమం గలంకమును ♦ తోఁపదు వీఁ డెట నుండి వచ్చెనో? ౨౩౩

మ॥ మనమా! భావజుఁ డెత్తి వచ్చి యెడఁదన్ ♦ మాఁడించి నాటించు తూ
పను నంజెంతో కలంపఁ గ్రాఁగక యెటో ♦ యాపై బయల్దేఱి న
ల్లని మత్తేభముఁ బోలు వాని పదముల్ ♦ పట్టింపుగాఁ బట్టి యా
తని వెన్నాడిన ప్రాణముల్ మరలి వం ♦ తం గుండ రా నేలొకో? ౨౩౪

ఉ॥ మింటను తోఁచు పెన్మొగులు ♦ మించులతో దిగి వచ్చె నన్న తీ
రొంటిన త్రొమ్మునన్ మెఱయ ♦ నొప్పెడు ముప్పిరి నూలితోడ మా
యింటిని డాయు రాకొమరుఁ ♦ డెవ్వఁ డటం చెఱుఁగంగనైతి నా
కంటఁ జరించు నప్పుడును ♦ కారణ మేమొ యెఱుంగనయ్యెదన్ ౨౩౫

ఉ॥ పెక్కు లొసంగి దాత యని ♦ పేరు వహించిన పాలవెల్లిలోఁ
జొక్కముగాఁ జనించి యొక ♦ చో మతి పుట్టని మందు పొందికన్
జిక్కిన హేమకుంభమును ♦ చేకొనకుండెడు మూఢభంగినా
చక్కనివానిఁ జేవిడిచి ♦ జాలిని బొందెద మాట లేటికిన్! ౨౩౬

చ॥ మనసునఁ దూలి తూలి యిటు ♦ మానిని కుందుచు వెచ్చ నూర్పుచున్
వనరుచు నుండఁ జల్లని స్వ ♦ భావము నల్లని కన్ను లొప్పు భా

మిని యొక చేతి రాట్సభను ♦ మేరు నిభంబగు విల్లు తున్గుటల్
గని తనలోని వేడ్క సడ ♦ కంబుగ నుంచఁగలేక చెచ్చెరన్ ౭౩౭

—:మాలిని యను సఖి సీతకు హర ధనుర్భంగ వృత్తాంతము తెలుపుట:—

తే॥ కలువకంటి మాలిని యను ♦ కాంత తపదు, హారములు కుండలంబు లిం♦ద్రాయుధంబు
వోలె వెలుఁగంగ ♦ వస్త్రముల్ మాలికలును, చెదర మెఱుపుతీఁగియ వలెఁ ♦ బదరిపాఱి

తే॥ మొగసి వచ్చి మైథిలి కట ♦ మ్రొక్కకుండ, నలసి మిక్కిన కుతుకాన ♦ నాడుచుండ
నేమి హేతువే దీనికి ♦ నెఱుఁగఁ బలుకు, మనిన సీతకుఁ జెలి యిట్టు ♦ లనియెఁ దుదకు ౨౩౯

సీ॥ చతురంగ బలములు ♦ చాలఁ గలుగువాఁడు, సర్వ విద్యావేది ♦ చతుర గుణుఁడు
మొగులు నాఁ గురిసెడు ♦ పొడవు చేతులవాఁడు, దశరథుఁ డనెడు భూ♦దారవరుఁడు
త త్తనయుండు మ ♦ దను కంటె సుభగుండు, సాలంబులను పోలు ♦ కేలువాఁడు
వై కుంతుఁ డనుశంక వదలనీయనివాఁడు, శ్రీరాముఁ డనుపేరఁ ♦ జెలఁగువాఁడు

తే॥ తమ్మితోడఁ గౌశికుఁడను ♦ తపసితోడ, మనపురికి శివ ధనువును ♦ గనఁగ వచ్చి
యమ్మునీంద్రు నానతిని చా ♦ పమ్ము డాసి, తేలికగ నెత్తె నాతఁడు ♦ లీల మెయిని.

చ॥ క్షణమున వింటి నొక్క కొసఁ ♦ గాలను ద్రొక్కఁ జివుక్కుమంచు సిం
గిణి యటు లేవఁ బట్టికొని ♦ కేలను ము న్నలవాటుపడ్డ దీ
త్రిణయను చాప మం చచటి ♦ ప్రేక్షకు లాడఁగ నెక్కు వెట్టి త
ద్గుణమును లాగుడున్ విఱిగెఁ ♦ దోరపుఁ జాపము ధాత్రి దద్దరన్. ౨౪౧

చ॥ అనిమిషు లెల్లరుం బొగడి ♦ రాడిరి పూవులు చల్లి నారలో
జనకజ! యంచుఁ బల్క విని ♦ సన్ముని వెంబడు మేఘమంచుఁ దొ
ల నవలఁ బంకజాక్షుఁ డనఁ ♦ దాపముఁ గూర్చిన వాఁడె యంచుఁ గా
మిని మది శంక వీడెఁ దెగె ♦ మేఖలయున్ జఘనంబు లుబ్బఁగన్. ౨౪౨

చ॥ కలదని లేదటంచుఁ బలు ♦ కం దగు కౌనును గోమలంబులై
బలియు పిఱుందులుం గలుగు ♦ బంధుర దేహము బూరటిల్ల నా
లలనయుఁ జేటి చెప్పిన వి ♦ లక్షణముల్ గమనించి నిక్కమా
లలితుఁడె, కానిచో ననువు ♦ లం దొలగించెద నంచు నెంచుచున్. ౨౪౩

తే॥ జానకి తపించుచుండ నా ♦ జనకరాజు, వేల్పు శిల్పి నిర్మించిన ♦ విల్లు విఱుగు
నులివు విని మేర మీఱిన ♦ యుబ్బు గలిగి, కౌశికునితోడ నొక్కవా ♦ క్యంబు పలికె.

ఉ॥ ఓమునివర్య! ప్రేమ చిగు ♦ రొత్తఁగ నీ వెనువెంట వచ్చు శ్రీ
రాముని పెండ్లి యిప్పుడె త్వ ♦ రన్ నెఱవేర్చుట మీకు నిష్టమా?

యీ మహిఁ జాటి యా దశర ♦ థేశునకుఁ విని పించి యందఱుఁ
బ్రేమను గూడి చేయుదమ? వే వి♦వరింపవె యన్న నాతఁడున్. ౨౮౪

తే॥ దశరథుఁడు వచ్చి చేరుట ♦ తగు నటంచుఁ, దెలుప జనకుండు నానంద♦జలధి మునిఁగి
నడచు వృత్తాంత మెల్లఁ దె♦ల్పుఁడి యటంచు, దూతలం బంపె శుభలేఖ♦తోడనపుడు

౧౩. ప్రయాణపటలము. (౧–౭)

చ॥ వడిఁ జనఁజాలు దూతలును ♦ పాద బలంబున గాలి పోలికన్
నడచి మృదంగ కాహళ సి♦నాదము రెచ్చు నయోధ్యఁ జేరి య
ప్పుడమి నృపాలు దర్శనము ♦ పొందక రాణ్మకుటంబు లెల్ల రా
పిడి వడుచుండు తిన్నగరి ♦ వీథులఁ గాంచుచుఁ బోయి యయ్యెడన్ ౨౮౭

చ॥ ధరణిపు నాజ్ఞ నొంది యుచి ♦ తం బగు రీతిని లోనఁ జొచ్చి భూ
వరు పద వారిజంబులకు ♦ వారని భక్తిని మ్రొక్కి రాజశే
ఖర! భవదీయ పుత్త్రకులు ♦ కౌశికు వెంటను పోవు టాదిగా
జరిగిన వృత్త మిద్ది యని ♦ సంతస మారఁగఁ బల్కి యవ్వలన్. ౨౮౮

తే॥ అమిత సుగుణ భూషణ! యిది♦యదియ యనుచుఁ
జదువ నియమింపఁబడిన వి ♦ ద్వ దవతంసు
చేతి కొసఁగంగ లేఖఁ బు ♦ చ్చికొని యతఁడు
చదివె నెల్లరు విన రాజు ♦ ముదల నొంది.

ఉ॥ వీనుల నగ్గ పుత్త్రు విలు ♦ విద్దె సమర్థత యన్ సుధారసం
బానిన యంత రాజునకు ♦ నంగదముల్ వదనంబు విచ్చి బీఁ
టూని ధరిత్రి వ్రాలు క్రియ ♦ నున్నత వజ్ర భుజంబు లుబ్బె ము
న్నూనిన యాగ సత్ఫలము ♦ పూర్తి భుజించు తెఱంగు దోఁపఁగన్. ౨౯౦

తే॥ ఖండపరశువు దక్షయా ♦ గంబు వేళ, నేడు లోకాల వారి జ ♦ యించినట్టి
బలితపు విల్లు రాముచే♦భగ్న మైన, ధ్వనియకా నెంతు మన మప్డు♦వినిన రవము. ౨౯౧

తే॥ ఎప్పు డెప్పు డెట్టెట్టుల ♦ నెసఁగె ననుచు, నడుగుచుండు వసిష్ఠాదు ♦ లరయఁ బలుకు
దూతలకుఁ గయికొండని♦దోర్బలుండు, నగలు నుడుపులు మఱి మఱి♦తగ నొసంగె.

చ॥ మనుపటి సూర్య వంశజుల ♦ పుణ్యఫలంబునఁ బుట్టినట్టి య
మ్మనసిజమూర్తి యున్న పుర ♦ మార్గముఁ బట్టి దళంబు రాజులున్
మును నడవుండు బంధు హిత ♦ ముఖ్యుల రండని యెన్న లెక్కి ప
త్తనమునఁ జాటఁ జేయుఁడని ♦ ధారణి నాథుఁ డనుజ్ఞ చేయఁగన్, ౨౯౩

చ॥ జగముల నెల్లఁ గొల్వ మును ♦ చక్రి త్రివిక్రముఁడై నవేళ నీ
జగతికిఁ దద్విధం బరయ ♦ శంభుఁడు దెల్పిన యట్లు వారువం
పు గమి కడళ్లు గల్గు పుర ♦ భూమి సుధాంబుధి చుట్టి వార లే
నుఁగుల పయి న్నగారుల ధ్వ♦నుల్ చెలఁగన్ వడిఁ జాటి రంతటన్. ౭౫౪

క॥ చాటింపు వినక మున్నే, పాటించి కుమారతతి, ప్ర ♦ భంజనుఁడు వడిన్
దాటించిన జలనిధి వెట, తాటం బగునట్లు పురము ♦ తడఁబడఁ దిరిగెన్. ౭౫౫

తే॥ అవనిఁ జోటు రవంతలే♦దనగఁ నిండి, వృషభ గంభీర యానుని ♦ వీర సమితి
విలయ వాయువు నీవఁగా ♦ జలధికలఁగి, పొంగి పొరలిన చందానఁ♦బొలిచి నడచె

తే॥ జగము చిన్నదె యనఁదగి♦ స్యందనముఁలు, వెలిఁగెఁ బ్రభులచే భానులఁ♦గలవి పోల
రత్నముఖ పట కాంతి ద్వి♦రద చయంబు, వెలసె నింద్ర ధనుర్యుక్త♦జలద భాతి. ౭౫౭

ఉ॥ అంచలు పాలవంటి తమ ♦ యచ్ఛపు ఱెక్కల విచ్చి విన్నపై
నించిన చందమై విరిసి ♦ నిండెను కాఁడలతోడి చుట్టువుల్
మించిన కేతనావళియు ♦ మిన్ను సమస్తము చర్మ మొల్వఁ గా
న్పించిన సంచునన్ వెలసి ♦ నిండె నభస్థ్సల మెల్లఁ బర్వుచున్. ౭౫౮

తే॥ దానధారలు గాఱు మా♦తంగములను, కడలి యని యెంచి యెల్లెడఁ ♦ గప్పి నీరు
త్రావ దిగు శరన్మేఘ సం♦తతులఁ బోలెఁ, బరవి చలియించెఁ దెల్లని♦ధ్వజపటములు.

చ॥ తొడుగులు దాల్చియుండు నెడ ♦ దోరని వెన్నెల గాయు వెన్నెలల్
గొడుగుల నీడలం జెఱచి ♦ గుబ్బతిలున్ మఱి యవ్వి మేఘపుం
బెడఁగు చెడంగఁ బై విరిసి ♦ పేరిమి నెల్లెడ నిండు, మబ్బులున్
విడివడి వోవ దుందుభుల ♦ భీకర రావము మీఱి మ్రోఁగెడున్. ౭౬౦

చ॥ గరితల మోచికొంచు జను ♦ గజ్జెల గుత్తము లంచపిండులన్
వెరవున మోచు నాపగల ♦ విన్ననువొందుఁ; బసిండి సొమ్ములున్
బిరుసు కుచంబు లల్లికల ♦ వేణులు గల్గిన స్త్రీలు మించనన్
వఱలఁగ వారి మోచు మద ♦ వారణముల్ జలదాళి నాఁ జనున్. ౭౬౧

తే॥ పడుచు లేచుచు నిఱుకుట ♦ వలన రాలు, సఖుల వక్షోజ కుంకుమ ♦ సంకుమదము
యువకు లలఁదిన చందన ♦ మొరసి రాలి, నడచు త్రోవయు మెత్తని ♦ పడకఁ బోలె.

చ॥ మృదు మధురోక్తు లొప్పెనఁగు ♦ మెత్తల పైఁటలలో మఱింగి క్రో
వ్విదమయి మిత్తిఁ బోలెఁ జెడు ♦ వేదన గూర్చెడు చన్నుదోయిపైఁ
బొదలెడు తారహారములు ♦ పొల్పుగ వెన్నెల గాయు, రత్నముల్
పొదిఁగిన భూషణంబులు స ♦ మున్నతి వీచును లేఁత యెండలన్. ౭౬౩

ఉ॥ దోసములేని మానిసులు ♦ దొడ్డ భుజంబులు గల్గువారు సం
వాసిలు క్రొమ్మెడల్ గలుగు ♦ వారలు ధన్వులు ఖడ్గధారులై
భాసిలు రాట్కుమారకులు ♦ భార్యల వెంబడిఁ బోవుచుండ్రి సం
తోసము తోడుతం బిడుల ♦ త్రోఁ జను గంధ గజాళి కైవడిన్. ౨౬౪

చ॥ మలసిన తావి క్రొవ్విరులు ♦ మబ్బులలో ధరియించినట్లు కొ
ప్పులఁ దగిలించు కామినుల ♦ ముద్దుల మోములు కానవచ్చుటన్
వెలుచనఁ బూర్ణచంద్రములు ♦ పెక్కురు పోవు విమానసంఘముం
బలెఁ జెలు లెక్కు పల్లకులు ♦ భాసిలుచున్ దగఁ బోయెన త్తఱిన్. ౨౬౫

చ॥ పరవి మదంబు కాఱ నగు ♦ పంకమునం గయిసేఁత గల్గు పెన్
ద్విరదము లంబుధిం బలె రు ♦ తిం బొనరించెడు నాసికాగ్రముల్
పరఁగు కరంబు లెత్తికొని ♦ పట్టుగఁ బోవుట చూడ నొప్పె ది
క్కరుల మదంబుచే నెదురఁ ♦ గా జతనంబునఁ బోవు కైవడిన్. ౨౬౬

ఉ॥ పంబెడి కింకిణీ రుతికిఁ ♦ బ్రావ పడన్ లయ దప్పకుండఁ బా
దంబులు వైచుచున్ ధరణిఁ ♦ దాఁకియుఁ దాఁకక రోవెలంది చి
త్రంబు గతిన్ సుపర్వుల వి ♦ ధంబున మింటన పోవుచుండె వా
ర్వంబులు గ్రద్దనన్ గనిన ♦ వారలు దేవ హయంబులో యనన్. ౨౬౭

తే॥ ప్రణయకోపంబుగల ప్రియ♦రమణు లోకటఁ, జూచిచూడక బోమముడి♦చూపువిడక
యూర్చుచలరులుక్రొవ్వేద♦నుంచుకొనక, ప్రియులయుసుఱులెయనడాసి♦వెలలుచుండ్రి

మ॥ ఝురి సంకాశ మదప్రవాహ తటముల్ ♦ సద్యత్సృణీ సామ సం
స్మరణామర్షకముల్ మదావళ తతుల్ ♦ స్పర్థిత్వ చింతారతిన్
దరులన్ మోది మహా తరూత్కరములన్ ♦ దాటించుచున్ గూల్చుచున్
విఱుగం ద్రోయుచుఁ బోవుచుండెఁ దటినీ ♦ వేగోద్ధుర ప్రక్రియన్

చ॥ అనదల కూఁతయా నినకు ♦ లాధ్యుఁడు కాలు గదల్పఁ డంతలో
నన నువుగింజ వైవ భువ ♦ నంబునఁ జోటు గనంగ లేదహో
మునుచను సైన్యమందు గల ♦ ముందటి భాగము పోయి చేరె నా
జనకుని కేతనాంచిత వి ♦ శాల విదేహ పురంబు చేరువన్. ౨౭౦

తే॥ పలు వగల నలంకృతములై ♦ వెలలు బండ్లు, చూచు వారల మనములఁ♦జూఱలాడు
నీలవేణుల ముఖముల ♦ లీలచేత, నడచు చెందమ్మి కొలఁకులు ♦ నాఁగ నొప్పె. ౨౭౧

తే॥ శకట మెక్కిన యొక బోటి ♦ చనవు వలన, వెంటఁబడు నంటుకానిఁ గ్రీఁ♦గంటఁ జూడ
నా కటాక్షంబునందలి ♦ ఘుంజనంబె, యతని కమృతంబు పోలె సౌ♦ఖ్యంబుఁ గూర్చె

క॥ హారిణాక్షిం బెడఁబాసిన, తరుణుం డొకఁ డేగుచుండు ♦ దారిం బద్మా
కరమున వేడ్కం దిరిగెడి, వరటా మిథునమ్ముఁ గాంచి ♦ వసటం బడియెన్. ౨౨౩

క॥ చిందములు భేరు లబ్దము, చందమ్మున నులియ బెరయు ♦ చామరములచే
తం దెలి గొడుగులచేతన్, మందాకినిఁ బోలె దండు ♦ మలసిన తలముల్. ౨౨౪

క॥ ఇంపు పలు కాడు వారు ని, లింప సతులఁ బోలు వారు ♦ లికుచ కుచలు చూ
పంపఁ బురుషుల యెద నొ, ప్పింపఁగ నది సమరభూమి ♦ విధమై తోఁచెన్. ౨౨౫

తే॥ నెరసె స్తంభంబులంబోలు ♦ నెతి భుజములు, మెఱసె నాయుధ కాంతులు ♦ మెఱపులట్లు
విరిసెఁ బాద సంతతులు తా ♦ మరల కరణి, బెరసెఁ గాల్బల మచటఁ గే ♦ సరులసరణి

క॥ చెలువ పయోధరములపైఁ, గొలిపిన కను లల్లి యుండ ♦ గ్రుడ్డియ పోలెన్
జెలువుఁ డొకఁడు చని చని యొక, కలభము డీకొనియె జనులు ♦ కలకల నవ్వన్. ౨౨౬

క॥ వర జాతి తురంగ మొకటఁ, గెరలి పఱవ నిలువలేక ♦ క్రిందఁ బడెడు తా
మరసాక్షి నొకఁడు చేతుల, ధర దింపక బెదర కనుచుఁ ♦ దడవుచు నిలిచెన్. ౨౨౭

తే॥ పద్మ యుగళంబు నొవ్వ వెం ♦ బడిన వచ్చి, కంటి తూపుల నొప్పించు ♦ కలువకంటిఁ
గూర్చి పీన సుందర కుచ ♦ కుంభిఁ గట్టఁ, దనకుఁ దగిన స్థలంబు లే ♦ దనిరు నొకఁడు

తే॥ తుఱుముక్రొమ్ముడిమధుపంబు ♦ లఱచుచుండ, నడకమదపు టేనుఁగుఁబోలు ♦ నంటొకండు
వనితకన్నులఁగనిచాల ♦ వాఁడిగలవి, యనుచుఁ దన యీఁటె నొకకంటఁ ♦ గనుచునుండె.

చ॥ అలలను బోలు వంకరలు ♦ నందము దీర్ఘము లైన కేశముల్
జలజముఁ బోలు పాదములు ♦ జానుగఁగుంతముఁ బోలు చూపులున్
గల చెలిఁ గాంచి యొక్కరుఁడు ♦ క్రమ పయోధరలార! మీరు మీ
యులిసెడు కొనులన్ మఱచి ♦ యుంచితి రెచ్చటఁ జెప్పరే యనెన్. ౨౩౦

తే॥ తీక్ష్ణ దృష్టులఁ దక్కవా ♦ తెఱఁ గదల్చి. పలుక కేగెడి పడఁతితోఁ ♦ బలుకు నొకరుఁ
డింతి! బిగి యింత యున్న ని ♦ న్నేటి నీటఁ, జేతులం బట్టి దాఁటించు ♦ శీలి యెవఁడొ?

తే॥ దింపఁగా రాని బరువు నె ♦ త్తికొని పోవు, నొంటి యింపగు చివ్రుళులఁ ♦ దింట వీడి
వేప మున్నగు వానిని ♦ వెదక సాగెఁ, బాలు విడిచి కల్లాని్రవు న ♦ ప్రాజ్ఞు నట్లు. ౨౩౩

తే॥ ఎట్టని కనులు నల్లని ♦ యురులఁ బోలు, మేను లొప్పు బర్బరులు న ♦ మ్మొటలు పాఱ
లూని త్రోవలు సమముచే ♦ యుచు నుమూఁపు, లందు గావళ్ల మోయుచు ♦ నరుగుచుండి.

తే॥ పిచ్చి పట్టిన యేనుఁగు ♦ పెనఁగి కరిణి, పైనఁ దుండ మూనఁగ దాని ♦ పైని తరుణు
లదరి కను మూయఁ జేతుల ♦ కణఁగ కుంట, మనసు క్రుంగ దుఃఖంబున ♦ మఱిఁ గిరపుడు

తే॥ రత్న మేఖలా యుత లైన ♦ రమణుల కెడఁ, జారునద్య దుత్ఫుల్ల కం ♦ జవనమందు
కమఠముల మీఁది గోదురు ♦ కప్ప లనఁగ, హా స్తినులపైన కుఱుచవాం ♦ డ్రరిగినారు

తే॥ మదగజము వెంబడింపంగ ♦ మాఁకొండు, పాదములు వంచి పవన జ♦వంబుతోడఁ
బాఱుచుంటఁ జూడఁగ నీమె ♦ పాకవైరి, కర్పూరాలని కొనిపోవు ♦ నట్లు దోఁచె. ౨౯౨

తే॥ తండ్రి శ్రీరాముచే శివ ♦ ధనువుదునిఁగె, ననుచుజనులాడవినినతో ♦ యలులుపరుగు
లిడిరి జడల పిరులురాల ♦ ముడుచుకొనక, తెగినమొలనూలుచిందఁగాఁ ♦ దెలిసికొనక

తే॥ కుండికలు గొడుగులు చేతఁ ♦ గూర్చి పట్టి, ముక్కుమూసినవ్రేళ్ల లై♦ మొగిడియుండఁ
గరులతోఁ గామినులతోడ ♦ జరుగ నిష్ట, పడని మునివరుల్ మెల్లన ♦ నడచినారు

తే॥ తావి పూవులు తుఱిమిన ♦ తరుణులు తమ, కనుల నశ్రువు లురలన ♦ ల్కగొనిచన్న
ప్రియులు గానరా వచ్చుట ♦ వేడ్కయేని, వచ్చి తేరెక్కఁ డని సన్న ♦ లిచ్చువారు

తే॥ అంగమైన శతాంగమా ♦ తంగముల తు, రంగముల మురజాదుల ♦ రావ మెల్ల
యెడల నిండి పర్వఁగ నట ♦ నెవ్వరేది, నుడువ వినలేక మూఁకమై ♦ నడచె జనము.

తే॥ సాలె పురుగులు నేసిన ♦ నూలు నేత, వంటి సన్నని వలువలఁ ♦ బడఁతు లుడిచి
యందుకారావములతోడ ♦నరుగుతుటుము,కలకలంగూయుపులుఁగులకొలఁకుఁబోలె

క॥ కెరటములు తెరలు కలశాం, బురాశిఁ జనియించు లక్ష్మిఁ ♦ బోలు మృగాక్షుల్
తెరచీరనుండి చూడఁగఁ, బురుషుల కను లుల్లసిల్లి ♦ పొలుపుగ నార్చున్. ౨౯౩

క॥ నెఱకులఁ దాఁకఁగ నాటెడు, కటికన్నుల సకుల యందు ♦ కంబులు మంద్ర
స్వరము ధ్వనించుం దోడుగ, ఖురువుల సకిలింత లొప్పు ♦ ఘన గర్జలలిన్. ౨౯౪

క॥ ధర పులకరింప నరిగెడు, తరుణుల కాంతి గల మోము ♦ దమ్ముల నిందిం
దిరము లనఁ బ్రియుల చూడుకు, లిరవుకొనియెఁ గాంచి మరుఁడు ♦నెద ముదమందన్

తే॥ అగపడని కొను పగడంబు ♦ పగిది నోరు, ఫలరసము వంటి పలుకులు ♦ గలుగుచెలుల
కోల మెలనీటికాయలఁ ♦ బోలు చనుల, నుండి రాలు గందవొడియె ♦ యుర్వినెఱసె.

క॥ తలఁప నరుదైన చిత్రం, బులు గల యరదములనెక్కి ♦ పురుషులు స్త్రీలున్
బలువుకు దారి నెరసి పే, రులివ్వనఁ జనుదెంచుచుండి ♦ రొప్పారంగన్. ౨౯౭

తే॥ వారువంబులు తేరులు ♦ వీరవరులు, నేల నడవఁగ నెగసిన ♦ ధూళి నెరసి
మొగులునీరు వెల్వడు ద్వార ♦ ములనుగప్పెఁ, గప్పె దిగ్గజ దాన మా♦ర్గములఁగూడ

సీ॥ కాలియందెలు ఘల్లు ♦ ఘల్లున నడ తెంచు, చిలుకల కొలుకులఁ ♦ జెలువు గనుచు
డాలు దాలిచియున్న ♦ డాకేల వాఁడియై, తళ తళ లాడు ♦ కత్తుల ధరించి
రత్న కంకణములు ♦ రాజిల్లు వల కేలఁ, దరుణుల మృదువుగాఁ ♦ దవిలిపట్టి
మదగజ ధారల ♦ పదనుచేఁ దడిసీ పం, కంబైన యాత్రోవఁ ♦ గడవలేక

తే॥ చేల యొక్కింత పైకొనఁ ♦ గేలఁబట్టి, నడచు తమవారి మెల్లన ♦ నడపు కొనుచుఁ
బెండ్లి నడకల నప్పుడే ♦ వేడ్కఁజూపు, కరణి జలములుగాఁ బురుషులు ♦ కదలు చుండ్రి.

తే॥ ఘాలములయందు మడుఁగులయందు ♦ కొలఁకులయందుఁ బిరియు రకరకములగు తా ♦ మరలు
వదన కర నయనాదుల♦పదురు చూపఁ, గోసి యుండని కొందఱు♦కోరినారు. [తొవలు

ఉ॥ చూపుల కొప్పు గుజ్జముల ♦ జోటులు దిగ్గుచునుండి కుంజరం
బేపున డాసెనంచు సగ ♦ లెల్లెడ రాలఁగఁ గేశపాశముల్
వీఁపునఁ వ్రేల వస్త్రములు ♦ వ్రీలఁగఁ బ్రాణము మానమేఁచఁగా
దాపలి కేలఁ బట్టికొని ♦ తాఁటెరి పాఱిరి కేకులంబలెన్. ౧౦౧

చ॥ గొడుగులు నేనుఁగుల్ పికిలి ♦ కుచ్చులుఁ డెక్కెపు గుంపు లొత్తుగం
దొడరికఁ బర్వి యెల్లయెడఁ ♦ దోరపుఁ జీకటి నిండఁజేయఁగాఁ
దొడవుల నాయుధంబులను ♦ దోఁచిన యాఁజువు లుండ గాయ న
య్యెడ నొకవేళ యందొకట ♦ నేర్పడె వింతగ రేయియుం బవల్. ౧౦౨

తే॥ వదన కంజంబులందున్న♦వాఁడియలుఁగు లెడఁదఁ జొచ్చి యుచ్చుఁదొలంగు♦డెడగనను
దొలఁగ కేతెంచు కుంభ స్త♦నులకుఁదొలఁగి,తాఁకుదురు సూర్య తేజులౌ శూరవరులె. [చుఁ

సీ॥ తొలఁగ శక్యముకాని ♦ త్రోవలో నిఱుకుచేఁ, జిక్కితునిఁగి ప్రకా ♦ శించుచుండు
రత్నముల్ ముత్తెముల్ ♦ రాలి గుచ్చుకొని చాఁ, లఁగ బాధ వెట్టుఁ గ♦లాపములను
దాలిచి సట్టి సుం♦ దరుల పాదంబుల, యందెలు దురపిల్లు ♦ నట్టు లులియఁ
దడఁబడి కోమలు ♦ లడుగిడ లేక యుం, దంద నిలుచుచుండి ♦ రవలఁబోక

తే॥ ఉత్కటంబుగ వాద్యంబు♦లులియ నులికి, బండ్ల యెద్దులు చానలు పాఱఁ♦ బరుగులిడుచు
భారములు పాశములు వీడి ♦ పడుచునుండ, మానులంబోలె నవిధము శ్ర♦మంబు నీఁగె.

చ॥ కొలఁకులఁగన్న యేనుఁగులు ♦ కూరిమితో దిగి మావటీంద్ర యుం
డల గణియింప కంగసల ♦ డంబగు గుబ్బలఁబోలు కుంభముల్
బలుపు రదంబులుం దెలియఁ ♦ బాల సముద్రమునం జనించు నా
వెలిగవురుంబలె న్నిలిచె ♦ వేతట మెక్కక నీటిలోపలన్. ౧౦౫

తే॥ సొరుమిఱిన గాయనీ ♦ జనముతోడ, వైణికలు మావులెక్కి శ్రా ♦ వ్యముగ మేఘ
రంజితంబు పాడుచు నను ♦ రాగ మెసఁగఁ, దరలి నారలు కిన్నర ♦ దంపతులన. ౧౦౬

చ॥ నిమిరిన యంకుశంబునకు ♦ నిర్ఝర శైలముఁబోలు నేనుఁగుల్
క్రమముతొలంగి పర్విడఁగఁ ♦ గాతరులై జనముల్ తొలంగ నీ
లిమగల తెక్కలొప్పు మధు ♦ లిట్టులు తత్తలినుండి లేచి స్త్రీ
ల ముడులఁ జేరి యాలఁ బిడు ♦ లంబడి పోవుచునుండె వింతగన్. ౧౦౭

## రాజపత్నుల ప్రయాణము.

ఉ॥ పున్నమ చందమామ తగఁ ♦ బుట్టఁగ మ్రోఁగు సముద్రమట్టు లు
ద్యన్నయవాద్యముల్ మొరయ ♦ దారి శతాంగ తురంగముల్ కరుల్
మున్నుగ నేగ రక్తకణ ♦ ముల్ గల కుంతముఁ బోలు కన్నులొ
ప్పన్నవలల్ చనంగ గరు ♦ వంబున లేచిరి రాట్కళత్రముల్. ౨౦౮

తే॥ అరయ నిరిదమ్మికొలఁకున♦హంసి యనఁగఁ, గైక వేవురు వెలయాండ్రు♦గలిసికొలువ
వేల్పుటిల్లాండ్రు సిగ్గిల♦వెడలసాగె, చెన్నుమీఱిన రత్నాల ♦ శిబిక నెక్కి. ౨౦౯

సీ॥ కారణ రహితమై ♦ కనులెఱ్ఱగలచెలుల్, కంచుకులును వేత్ర ♦ కరులు గూడి
యాశ్రితులై నేల♦ సరుగువారయి తడఁ, బడు నొడువులుగల ♦ వారలగుచుఁ
బట్టంపుదేవుల ♦ పాదము ల్గొలుచుచు, వినయ ముట్టిపడఁగ ♦ వెడలుచుండ
వేసడంబుల నెక్కి ♦ విరిబోండ్లు పలువురు, కొలిచిరాఁ గవల పి ♦ ల్లలను గన్న

తే॥ యలసుమిత్ర కార్మొయిలున ♦ వెలయు మెఱుపు, నాఁగ నీలముల్ చెక్కిన♦నాణెమైన
శిబికయందు గూర్చుండి వి♦శిష్టమైన, వీణగానంబు చెవులార♦వినుచు వెడలె. ౨౧౦

తే॥ సప్తసాగర వేష్టిత ♦ జగతియందు; నవల లేఁకలే రనఁగఁజెలుల్ ♦ నెమలి హంస
చిలుక గొరవంక ప్రతిమలు♦చేధరించి,చామరలు వీచు చంచల♦జరుగుచుండ్రి. ౨౧౧

చ॥ తెలి రదనాళితోఁ గళలఁ ♦ దేఱిన మోమును గాంచి చంద్రుఁడం
చెలమిని ఋక్షసంఘములు ♦ సేవలు సేయఁగఁ జేరెనన్న చె
న్నలరిన రత్నసంఘటిత ♦ మా శిబికన్ రఘురాముతల్లి వే
ల్పులు నుతియింపఁగా వెడలెఁ ♦ బొల్పుగ గాణలు పాడుచుం జనన్. ౨౧౨

తే॥ గూనుముట్టికాళులవారు ♦ కుఱుచవారు, మగువలెక్కిన తెల్లని ♦ మావు లపుడు
హంసలం బోలి నడవఁగ ♦ నలరుఁబోఁణు, లోలి నిరుదెసఁ బిడినడఁ♦బోలి చనిరి.౨౧౩

తే॥ మొగ్గచనుగుబ్బ లడరిన ♦ ముగుద లబ్జ, నిలయకంటెను సుందరుల్ ♦ నీటుగాఁగ
పలు వగల మణుల్ పొదిఁగిన♦బండ్లనెక్కి,ప్రతిమలం బోలి కౌసల్య♦బలసి చనిరి.౨౧౪

సీ॥ బ్రహ్మకే నొచ్చెంబు ♦ పలుకఁజాలిన వారు, బహుళ శాస్త్రామృత ♦ పాయులైన
వారు త్రివిష్టప ♦ వాసులు జిహ్వాల, తోఁ గొను హవ్యముల్ ♦ తుష్టిగాఁగఁ
జేతులతో మంత్ర ♦ పూతంబుగా నిచ్చు, విప్రోత్తములు కొన్ని ♦ వేలమంది
తనచుట్టుఁ గొలిచిరా ♦ ముని పరివేష్టిత, బ్రహ్మ గౌరవమునఁ ♦ బరిఢవిల్లి

తే॥ నెలవెలుఁగుగాయుగొడుగుల♦నీడలోనఁ, గొఱలు ముత్యాల శిబికలోఁ♦గూరుచుండి
వేదపాఠ రవంబులు ♦ వేడ్కనినుచు, సతి యరుంధతితో వసి ♦ ష్ఠముని కదలె ౨౧౫

సీ॥ మొండొడ్డి పోరాడు ♦ శుండాల యూథముల్, వాయువేగంబొప్పు ♦ వారువములు
దేవ విమాన దీ♦ ధితులొప్పు తేరులు, వీరమద్దెలు దాల్చు ♦ వీరవరులు
సాగరం బోకమహా ♦ శైలంబుఁజుట్టెన, వడువునఁ దము చుట్టి ♦ వచ్చుచుండ
జయలక్ష్మి నిలుచు వ ♦ క్షంబులు గలవారు, దివ్యాంబకంబులు ♦ దివ్యధనువు
తే॥ లమరు కరములుగలవార ♦ లతిరథులగు, భరత శత్రుఘ్ను లమ్మని ♦ వరు వసిష్ఠు
వెంటఁజనిరి విశ్వామిత్రు ♦ వెంటఁజన్న, రామలక్ష్మణులంబోలు ♦ రాణయొప్ప. ౧౧౮

సీ॥ ముత్యాల రత్నాల ♦ భూషలొప్పిన రాజు, నిత్యకృత్యంబులు ♦ నియతిఁదీర్చి
నారాయణునిపాద ♦ పలినంబులకు మ్రొక్కి, విప్రోత్తములకు సం ♦ ప్రీతితోడ
భూరి హిరణ్య గో ♦ భూ రత్న దానమ్ము, లొనరించి భవ్యము ♦ హూర్తమందు
బ్రాహ్మణుల్ రత్నకుం ♦ భములఁజేఁదాల్చి ప్రాఁ, బలుకులు చదివి దీ ♦ వన లొనర్చి
తే॥ గటికతో నీరుప్రోక్షింప ♦ గరిమ మ్రొక్కి, రత్నమేఖలల్ దాల్చిన ♦ రమణులింపు
పల్కులను వంశగీతముల్ ♦ పాడుచుండఁ, బ్రభుఁడు దశరథనృపమౌళి ♦ బయలుదేఱె

సీ॥ మురజ శంఖాదులు ♦ మ్రోఁగుచుండెడినంచుఁ, బ్రస్థాన భేరీ ర ♦ వంబటంచు
భూజాని వెడలెఁ గాఁ ♦ బోలు నక్షత్రవారలై, బలసిన రాజులు ♦ ప్రబ్బినచ్చి
మముచూడలేదని ♦ మముగాంచె నంచును, కుండలంబులు జాఱి ♦ క్రుంగె ననుచు
నీకరాజుడాయుట ♦ యెట్లొకోయనుచు నొం, డొరుఁ ద్రోసికొనుచు ముం ♦ దరకు జరగి
తే॥ గెలుపు నొందిన ఖడ్గముల్ ♦ వెలయుచుండు, భూప కరములకా కెందమ్మి ♦ మొగ్గలెల్ల
మొగుడ మణుల తేరెక్కియా ♦ భూవిభుండు, ప్రభల రెండవయినుఁడునా ♦ బయలువెడలె

తే॥ పైఁడిగాజుల చెలు లెక్కు ♦ పసిఁడిగజ్జె, లులియు తేజులు చుట్టును ♦ బలసికదల
జలజములు వికసించిన ♦ జలధియలల, తోడఁగదలిన చందంబు ♦ దోఁచెనపుడు. ౧౧౯

తే॥ దుమ్ము మినుదాఁకె దిక్కులఁ ♦ దూటిమూసెఁ, గన్నులగపడకుండఁగఁ ♦ గ్రమ్మె నంతఁ
బోక సాగర వైరంబు ♦ పూనెనసఁగ, కడలిలోఁజొచ్చి జలముల ♦ నడుసుచేసె. ౧౨౦

సీ॥ పణవ కాహాళ శంఖ ♦ పటహా భేరీ మహా, రావంబు లశని వ ♦ ర్షముల నడఁప
నాలవట్టంబులు ♦ పీలి జాలరులు ఛ, త్రంబు లాదిత్యుని ♦ ప్రభలఁ గప్ప
ధవళాతపత్రంబు ♦ తసరుటఁగాంచి జ, క్కవగొంగ సిగ్గిలి ♦ యవలికరుగ
నమరుల మొదలు ది ♦ గ్భ్రమినొంద దేవేంద్ర, విభవుండు దశరథ ♦ విభుఁడు విప్ర
తే॥ సామ గానంబు లాశీర్వ ♦ చన రవంబు, వంది మాగధ కీర్తనల్ ♦ వరుస మీఱ
వేత్రహస్తుల సందడుల్ ♦ విరియ గీఁక, హేషలును దెసల్నిండఁగా ♦ నేగుదెంచె. ౧౨౧

తే॥ తాను గాంచు దిక్కులనెల్లఁ ♦ దన్నెకాంచు, నరవరులు విరికేలు దా ♦ మరలు మోడ్చ
బొంగి యొండొండొరయు చతు ♦ రంగబలము, నగచురజములు మిన్నుమ ♦ న్నుగనొనర్చ

ఉ॥ తేరులు వీరులుం గరులు ♦ తేజులు నిండిన సేన నిల్వఁగాఁ
దీరగు చోటులేద మఱి ♦ తెల్పఁగ వేఱొక భూమియున్న దే?
ధారిణి వీఁపువంగి దిట ♦ దప్పి నెటుక్కుమనెన్ నృపాలు చే
ధారణి భారమీఁగెనని ♦ తథ్యముగా వచియింప నెట్లగున్? ౮౩

చ॥ ఇనుఁ డటు రెండుయోజనము ♦ లేగి పథమ్మునఁ జంద్రశైలమున్
గని గిరిక్రిందఁ దా విడిసెఁ ♦ గంతుని దంతియుఁ బూలతూపులున్
వనితల గుబ్బగుబ్బలును ♦ బాలసమీరము చందనంబు భూ
పుని పెనుసేనయుం దిగియెఁ ♦ బ్రొద్దును పోయెను పశ్చిమాద్రికిన్. ౮౪

## ౧౪. చంద్రశైలపటలము. (౭౭)

సీ॥ మేరువు నోడంగ ♦ మెండొడ్డి నిలుచున, వృసుఱులఁ దీయంగ ♦ నుసలు నవియు
మరునకు నిరవుగా ♦ నెరయునవియు ముత్తె, ముల సరుల్ గలవియా ♦ మొగ్గచనులు
గొరవంక పల్కులు ♦ కొమరొందు నబలలు, ప్రియుల భుజంబులఁ ♦ బెనఁగవైవ
నుప్పరం బందుచు ♦ నుండెడు వటశాఖ, లిలను విఱిగికూల ♦ నిలుచునవియు

తే॥ సరసులం గోరు నవియు మేల్ ♦ చాప ధరుల, గంతుఁ గేరెడు వీరులఁ ♦ గలవియైన
దంతు లట దేవదారు చం ♦ దన మహీజ, ములకుఁ గట్టంగఁబడియె శృం ♦ ఖలల తోడ

ఉ॥ పేర్చి యడంపరాని యరి ♦ వీరుని నీతిబలంబుచేతఁ బెం
పార్చి జయింప నొనను న ♦ రాధిపు యోచన వోలె నేనుఁగొం
డార్చుచు మేఘమండలము ♦ నంటిన రెమ్మలతోడ సాలముం
జేర్చి యగల్చికొంచు నడ ♦ చెన్ వడి నొక్క గిరీంద్రముంబలెన్.

చ॥ బటువగు కాండముల్ బలుపు ♦ వాఱిన కొమ్మలుగల్గు మద్ది లో
క్కటట మొదలంటఁ గూల వెను ♦ కం బడి దొర్లుచు వచ్చు ఱోటితోఁ
దటపటఁదోఁగు కృష్ణుక్రియ ♦ దంతి యొకం డిరు దేవ దారువుల్
కటపెటఁ గూల మధ్యఁజనెఁ ♦ గట్టిన గూటము ప్రీలి వెంటరాన్. ౮౭

తే॥ కినుక యడఁగ మచ్చిక బుజ్జ ♦ గించివశము, సలుచుకొనఁజూచుపరికాఁడు ♦ ప్రగడఁబోలె
మంత్రి హితముపదేశింప ♦ మదినిగొనక, స్వేచ్ఛవర్తించు నృపుఁబోలె ♦ నిభ మొకండు

చ॥ పగఁగని నట్లు గొప్ప విర ♦ వం బొనరించుచు మేఘముం బలెన్
నెగడు మదేభ మొక్కఁడు స్రృ ♦ ణిం గణియింప కరణ్య హస్తి ముం
దుగఁజను త్రోవ వెంబడిని ♦ దొమ్మిగ గ్రద్దలు వో మరుద్గతిన్
దెగటునఁబోయె ముస్సుచను ♦ తెన్నున వెల్లువ వోవుకై వడిన్

చ॥ కరిఘుట లొక్క చోటునను ♦ గట్టఁగ లేచు మదంపు వాసనల్
పొరయఁగ నొక్క దంతి సిడి ♦ పోటసి వోవఁగ మీఱిరేగి యా

తెరువునఁ బాటి యొక్క వడిఁ ♦ ద్రెంచుచు ముందటి కాళ్ల రాచుచున్
సురుముగఁ జేసి పైచెనొక ♦ సుందరసాలము పాల వృక్షమున్ ౧౩౦

ఉ॥ లెక్క యిడంగరాక యవ ♦ లేపము నొందిన వారణంబులున్
జిక్కని చెంద్రము న్నదుటఁ ♦ జేరిచి దిద్దిన హస్తినీ తతుల్
మిక్కిలి గన్నలున్ గలిగి ♦ మీఱిన తద్వనయూథమట్లు పెం
పెక్కఁ దదీయ చంద్రగిరి ♦ యేపగు యూథపుఁబోలె నయ్యెడన్.

తే॥ పెద్దలగువారు పిన్నల♦యొద్దఁ జేర, వారి చెడుపద్ధతులు మార్చి ♦ వారలనుట
నిజము రథముల బంగారు ♦ నేమి దొరలి, నల్లబాళ్లను తనదు వ♦ర్ణంబు నొసఁగె

తే॥ ఇంద్ర గోపంబులనుకప్పి♦మెలయుననుచు, దొండపండుఁబోల్ నోళ్లను♦ తొడరిచూచి
హరిణ నేత్రల మైయందు ♦మరయు పూన్కి, భ్రమయుచందానఁదిరిగెను♦నెమళులచట

తే॥ అశ్వముల నుండి దిగి చెలుల్ ♦ హంస లట్లు, నడచి లేఁజెట్ల నీడకు ♦ బడలి చేర
వారినగలప్డు తళతళ ♦ ల్వాలుచుండ, పూచి యున్న లతలఁబోలి ♦ పొలిచి రచట

తే॥ మాలికల నున్న తేంట్లు తా ♦ మరలటంచు, కలికిపదము లమొగము లఁ♦గ్రమ్ముకొనఁగ
సఖులు నిక్కంపు టొడలికై ♦ శంక నొంద, పటిక బండలపై వారు ♦ పండినారు౧౩౧

చ॥ మెఱుముఁలతోడి మేఘములు - మేదినిఁ జేరఁగ నున్నవంచుఁ జూ
పఱు దలఁపంగ హస్తినుల - పైఁగల రామలు డిగ్గి థక్కనా
నిఱు కగు మధ్య మొప్పెనఁగ - నిందిర తామర వీడి భూమిపై
వఱలిన మాడ్కి నూపుర ర - వంబు చెలంగఁగఁ గూడి రచ్చటన్. ౧౩౬

చ॥ పలు విషయంబులందు గొనఁ - బడ్డవి వన్నెలు చిన్నెలొప్పి పే
రలుకను గూర్చు హేషలు గ - లట్టివియున్ గయి సేతయున్ మహా
బలము జవంబు పొల్పెనఁగు - వాశ్వములం దగు మేఁతవెట్టి భూ
లలన యురః కలాపమన - లాయము గట్టిరి పంక్తి పంక్తిగాన్ ౧౩౭

చ॥ తరఁగల నిల్పు పొల్పునను ♦ దండడిగాఁ డెరలెత్తి కట్టి రా
శరధులఁ గూర్చు మచ్చునఁ బ ♦ సారపు వీదు లమర్చి నారు పెన్
శరద చయంబు చేర్పులలి ♦ సామజ పంక్తులఁ దీర్చినార ల
క్కురువలి బారు నిల్పు వహిఁ ♦ గత్తళలన్ దగ నిల్పి రత్తఱిన్ ౧౩౮

తే॥ నటన మొనరుచు నెమిళు ల ♦ నంగఁ దగిన, హరిణ నేత్రలు వీరులు ♦ నట్టు నిట్టు
లరసి ధ్వజములవలన భ ♦ ద్రారవముల, వలన నెఱిఁగి డాసిరి తమ ♦ ప్రభుల విడిది.

తే॥ పాలనురుఁగుఁబోలినసన్న♦వలువలఁగొని,యువకులొడలినంటినదుమ్ము♦నూడ్చితుడువఁ
జిత్రకారుండు చిత్రముల్ ♦చికిలిచేసి, యుంచుక్రియ నుల్ల సిల్లిరి ♦ యువతు లచట,

తే॥ రా కుమారు లున్నత శిఖ ♦ రస్థ హారులు, మొగిని దిగినట్లు దంతుల ♦ దిగి విరిసిన
పాళలంబోలు చామరల్ ♦ సరవ నేగి, చేరి రందమై వెలసిన ♦ శిబిరములను. ౨౪౧

తే॥ ఒక్కొ-ములుగల తెల్ల కు ♦ టీరములను, పద్మగంధుల మొగములు ♦ పరిఢవిల్ల
విమల చంద్ర బింబము లల ♦ లలరు తేట, నీటఁదోచిన కైవడి ♦ నీటుగాఁగ. ౨౪౨

తే॥ పొరలి లేచి నల్లని ధూళి ♦ యురల దులిపి, తెల్ల తావిరజం బొక్క- ♦ దెసను దాల్చి
కాళి సామేన ధరియించు ♦ కాలకంతు, మాడ్కి- నొప్పారె నటనొక ♦ మదగజంబు

తే॥ దుష్ట జనులతో స్నేహించు ♦ శిష్ట జనులు, వారి స్థితిఁగాంచి పిమ్మట ♦ వదలు నట్లు
తురగములు సన్న దుమ్మునఁ ♦ బొరలిలేచి, చెదర విదలించి కొనుచు ని♦ల్చినవి పిదప

## తరుణీతరుణుల విహారము.

సీ॥ అన్నాన మన్నాన ♦ పౌన్నాన, యనియెడు, ముప్పూరి త్రాటిని ♦ మొదలఁద్రెంచి
ధ్యానబలంబుచేఁ ♦ దమ్ము తామెఱిఁగి యి, య్యిలఁగాంచి కర్తవ్య♦మెఱుకపడఁగ
సత్పథంబునఁ జను ♦ సాధుల చందానఁ, దత్తడుల్ ముప్పూరి ♦ త్రాటిఁద్రెంచి
చేష్టాబలంబుచేఁ ♦ జేతలఁదెలిసి య, నంతర మిలఁగాంచి ♦ యడఁగి మరల

తే॥ కలదిదాఁచక యొసఁగు దా ♦ తలనుపోలి, నదులు వెల్లువ లడఁగియు♦వదలకొసఁగెఁ
దోఁడఁగాఁ దోఁడఁగా లోనఁ ♦ దోఁచు తేట, నీరు కొంచెకొంచెమ్ముగ ♦ వారికొదవ.

తే॥ మంచుఁబోలిన తెరలు చ - లించునపుడు, లోన నచ్చనగండ్లాడు - చానల కను
లరయ సరసుల యలలలోఁ-బొరలు వాలు, మీలనఁగ నొప్పి మినమిన-మినుకుచుండు

చ॥ నెఱయు శిరోజముల్ విరిసి - నిప్పులతో మెఱపుల్ చరించు న
ట్లురమున రత్నహారముల - నొప్పిన వీరులు క్రొత్తవాసనల్
పరవు గుడారులందు చొరఁ - బొఱిరి ధీరత సింగముల్ గుహాం
తరమునఁ జొచ్చులీల సము-దగ్రభుజోన్నతి వెల్లడించుచుఁ. ౨౪౬

సీ॥ మత్తసారంగముల్ - మావటీంద్రుఁ తెలుపు, సూచనల్ గ్రహియించు - చొప్పువీడి
చుట్టుపట్టులనున్న - చుట్టంపు ఏనుఁగుల్, చేరఁగఁ దీరంబు - చేరఁబోక
పెద్దలు చెప్పిన - బుద్ధివినక చుట్ట, పక్కంబు లదలింప - లెక్కగొనక
వెలయాంద్ర కలయిక - కలవాటుపడిన ముం, డల మార్గఁబోలె వి - డంబనమున

తే॥ నెత్తవెంద్రుకల్ కోఱలు - నెత్తి నొసలు, నీఁటలును నంటరొదలొప్ప-నిభచయంబు
వెల్లువలఁ గాడుపఱచె మున్ - విడక కలశ, జలధిఁ గలఁచిన మధుకైట-భులను పోలి.

తే॥ స్త్రీలు పురుషులు రవికాంతి♦తెలియరాక, ప్రావుల నుంచు నగురుకట్టు♦పొగలుగ్రమ్మ
గర్జనములేని మొగుళులు ♦ కదఁకద్దిగిన, పఱపుకడలిని పోలె నా ♦ ప్రాంతచోటు. ౨౪౯

ఉ॥ భూధర కందరంబులకు ♦ భూషణ లీల వసించుచున్న వి
ద్యాధరులెల్లఁ దమ్ముఁదమ ♦ యక్కము పక్కము విస్మరించి క్షో
ణీధవు వర్గముంగనుచు ♦ నిశ్చలులై రదిదేవలోకమే
యీధరఁ దప్పిదారి వసి ♦ యించె ననందగ వైభవోన్నతిన్. ౮౫౦

చ॥ రమణులు మున్నుగానె దిగి ♦ రంజిలు తత్ప్రియపాళియొద్ద బిం
కము సవు రింపు నింపు నలు ♦ కన్ ఛికముంగని ముచ్చటించుచున్
బ్రమదముతోఁ బ్రతిధ్వనులు ♦ వల్కెడి కొండలతోడఁ బల్కుచున్
నెమిళుల లీలఁ గ్రుమ్మరిరి ♦ నెమ్మొయి చాయల నెల్లఁ గప్పుచున్. ౮౫౧

చ॥ పురుషులు, వీరమద్దియలు ♦ మ్రోయఁగ మాలికలందు తుమ్మెదల్
విరుత మొనర్ప ఖడ్గరుచి ♦ వింతగఁ గ్రేవ వెలుంగ నంగద
స్ఫుర దురురత్నకాంతి మెఱు ♦ పుల్ మెఱయన్ దమ కేలవంటి య
గ్గిరిఁగల యొప్పిదంబుఁ బర ♦ కించిరి సింగములట్టు లేగుచున్. ౮౫౨

తే॥ వనధి మేరువుఁగవియఁ జు ♦ ట్టినవిధమున, క్షోణిధవుసేన శైలంబుఁ ♦ జుట్టివిడిసె
భూపులును రాణులును వారి ♦ పుత్త్రకులును, నెఱయఁజంద్ర శైలముదర్శ ♦ నీయమయ్యె

తే॥ తేంట్లు గ్రమ్మిన కల్పక ♦ దీర్ఘశాఖ, కలను తాటి మ్రాఁకుంబోలు ♦ కరము సాఁచి
చివుళులం ద్రుంచి ప్రాణంబు ♦ నిదినునాఁడు, కరిణులకు నందియిచ్చెను ♦ కరిచయంబు.

తే॥ కొమరు గల్గిన యచ్చటి ♦ కొఱవతలకుఁ, జెలువుగాఁ బురోహితవృత్తి ♦ చేయువేఁగి
పూల విసుగొంపు భ్రమరముల్ ♦ పొన్నగుత్తు, లనుచు రిక్కలపై వ్రాలు ♦ నప్పుడపుడు.

సీ॥ ఋక్షంబు లనెడి క ♦ రేణువులం గూడి, వఱలు రేరాజను ♦ వారణంబు
వంపైన క్రొన్నెల ♦ వంకయన్ దంతాగ్ర, మున మిన్ను గ్రుమ్మఁగా ♦ పొదలిపాఱు
తేనియ మడవలఁ ♦ ద్రిప్పి పూఱిచికట్టి, కొట్టుచేల్గొంచెడు ♦ కొఱవ లపుడు
చదలేటి నీరు వి ♦ చ్చలవిడి పాఱించి, వరిపై రు పెంతు ర ♦ వ్వారిగాఁగ

ఆ॥ తొలఁగి పోవలేక ♦ నిలిచిన చందురు, నొక్కప్రక్క నచటి ♦ యువతులు గని
తను యలంకృతులను ♦ దగదిద్దికొంద్రు రం, భాదు లవలిప్రక్క ♦ నట్లె కాంత్రు.

తే॥ కొలిమిఁబడక నేయి చిలుము ♦ గొనకయునుఱు, లూడ్చు బల్లెంబ నెడికను ♦ లొప్పుచెలుల
నొసళులంగాంచి యర్ధేందుఁ ♦ బొసఁగఁగొలిచి, పోలికలఁగనుఁగొందురు ♦ పురుషులచట.

తే॥ సింగపుంబిల్ల లేన్గు ని ♦ సుంగు లచటి, ముంగిసలఁ జెఱలాడును ♦ ముదముమీఱ
వం కగలిగిన లేనెల ♦ వాంఛతోడఁ, గొఱవ పిల్లలతోఁ గూడి ♦ తిరుగులాడు. ౮౫౮

మ॥ వర నీలద్యుతులుల్లసిల్లు శిఖర ♦ ప్రాంతంబులన్ గిన్నరే
శ్వర విద్యాధర నీలకేశ విలసత్ ♦ ప్రాగ్భార మూర్ధంబులన్

గరియూథంబులఁ జంపు సింహవితతుల్ ♦ గాఢ్లించు నంకంబులుఙ్
దరుణాలక్తక యుక్తసిక్త పదచి ♦ హ్నాంబుల్ ప్రకాశించెడుఙ్. ౨౫౯

సీ॥ వాలుగలంబోలు ♦ వాలిక కన్నులు, చెవులనఱకునేగి ♦ చిందుగొనక
వెలిదంత కాంతులు ♦ వెన్నెలకాయక, గ్రొమ్ముమల్ విడియొడల్ ♦ గ్రమ్మకొనక
రంగారు కనుబొమల్ ♦ రాణించి నిక్కక, కరరవమును కంఠ ♦ వర రవంబు
పరఁగనొక్కటిచేసి ♦ సరములమీటి యు, మృతమూర రమణులు ♦ కృతులుపాడ

తే॥ వినిన కిన్నర పక్షులే ♦ వెఱఁగుపడును, వారికుంకుమ సంకమొ ♦ ప్పారు పటిక
దొనలఁ గల్లునించిన కెంపు ♦ మణులగిన్నె, లట్లు విలసిల్లు చుండు నం ♦ దన్ని యెడల

చ॥ పొలయలుకఙ్ వహించు పువుఁ ♦ బోణులు కాటుకతోడికన్నులఙ్
నులుముచు నంటుకాంద్రురు మ ♦ నోవ్యథ హెచ్చఁగఁ దత్తఱింపఁగఙ్
వెలలుచుఁ గ్రొవ్విదల్ తిగిచి ♦ విచ్చి చెదర్పఁగ రాలినట్టి పూ
వులు వసివాడకుండ మధు ♦ వుఙ్ విడకొప్పెడి నచ్చటచ్చటఙ్. ౨౬౧

ఉ॥ మావిచివుళ్ల రంగడరి ♦ మై మెఱుఁగెక్కిన చెంచుకన్నెకల్
పూవడముల్ ధరించి తమ ♦ పోలికచూతురు వేల్పుఁగాంద్రతో
దేవనక్షిమణుల్ మణుల ♦ దీధితు లొప్పిన గాజులూడ్చి మేల్
తావులుగల్గు మాలికలఁ ♦ దాలిచి పోలికగాంత్రు వారితో. ౨౬౨

ఉ॥ అమ్ముగలట్టి వింటి నెన ♦ యంగల కంటిబొమల్ నటింప గా
నమ్ములు వీణతోఁజలిపి ♦ నమ్ములతోఁ దగ నాట్యమాడి స్వ
ర్గమ్మున మేపకాదు లటఁ ♦ గ్లాంతిని వీడిన హారసంచయం
బిమ్ముగ వానరాలి ధరి ♦ యింప ముదంపడు నాఁడుకోఁతులుఙ్. ౨౬౩

ఉ॥ చందనవృక్షముల్ పెరుఁగు ♦ సానువులం గల కావిశాల రా
పుం దగఁగొన్న హస్తినులు ♦ పోలును కుంకుమ లిప్త దేహలఙ్
పొందికఁ బద్మరాగ రుచి ♦ పూరము గప్పఁగ నాకసంబు కెం
పుందనమంది సంజయను ♦ పొందిక నొప్పును సర్వకాలముఙ్ ౨౬౪

తే॥ భూమిదేవికిఁ ద్రోడనగు ♦ ముత్తియములు, చెదరి హారుమీదఁ బడు వియ ♦ న్నదిని పోల
హేమముంజేరి పడు సెల ♦ యేళ్ల వరుస, యలత్రివిక్రము నుత్తరీ ♦ యంబుఁబోలు ౨౬౫

ఉ॥ పొన్న లవంగ పూవుల స ♦ మున్నతిఁగూరిచి తాల్చువారలుం
గ్రన్నన దేంట్లఁదోలి మక ♦ రందము పొందికఁద్రావు వారలై
కిన్నరపక్షులందు దిగి ♦ కిన్నరవోలె రహించి పాడఁగాఁ
గిన్నరు లల్కదీఱి తమ ♦ కించి చరించుట గాంచి రయ్యెడఙ్ ౨౬౬

చ॥ యువతుల బొమ్మలట్లు కెడుప ♦ యోధర యుగ్మసుఁబోలు కర్ణికా
ర వితతి చెంతఁ గొనుల తె ♦ అంగున నూఁగెడు కొమ్మలందునం
దవిలి వసించు పెంట్లు తమ ♦ దట్టపు గ్రొమ్ముడిఁ గండుఁ దేటులుఙ్
గవగొని క్రొత్త పెండ్లి పసి♦గాంచుట గాంచిరి వార లయ్యెడఙ్

చ॥ పటిక దొనల్ గనంబడఁగ ♦ బండలె యంచు భ్రమించి సుందరుల్
తటుకున బోవ వస్త్రములు ♦ దావణులుం దడియంగ రత్నయు
క్కటకములొప్పు హస్తముల ♦ గట్టిగఁ దట్టుచు వీరమద్దియల్
బటువుగ గాళ్ళఁ దాల్చు నె ♦ బంటులు నవ్విరి కేకవెట్టుచుఙ్. ౧౬౮

సీ॥ నూచిరి పెక్కింటి ♦ పొంపుపూఁబొన్పుల, బంగరు సరుల నా ♦ రంగఁగనిరి
గాంచిరి శిరపాగ్నిఁ ♦ గ్రాఁగి మాఁడిన కిస, లయములు గలుగు త ♦ ల్పములుకొన్ని
కని రింద్రగోపంబు ♦ లనుపోలు తంబలఁ, బారాణి యంటిన ♦ పటికతాలఁ
జిదిమి సరులుగూర్చి ♦ చెదరవైచిన వాని, నొరపిడిచే దావి ♦ పొరయు తరులఁ

తే॥ బసయె లేదని వెలయూగ్రమ♦వదలునిటులఁ, బోలె సుందరుల్ మితిమీఱి♦పుష్పరసము
త్రావి పాఱవై వఁగఁ బడి♦క్రాలుచుండు, కమ్మ మధుపాత్రములు పెక్కు♦గాంచిరచట

సీ॥ కలువలఁబోలు క ♦ న్నులు మిక్కిలిచలింపఁ, బగడంపు నోటఁ జి ♦ ర్నగవు తొలఁక
కనుదోయి కింపైన ♦ చనుదోయిపైఁ దార, హారముల్ లేచుచుఁ ♦ దారుచుండ
ముఖచంద్రుఁ గబళింప ♦ మొనయు రాహువనంగ, వేణియు వెన్నంటి ♦ వీఁగియాడఁ
గుండల యుగళముల్ ♦ గునిసియాడఁగ వేల్పు, గరిత లుయ్యాల లూఁ ♦ గంగఁగనిరి

తే॥ నిసులు పగలుగ మార్చెడి ♦ నేర్పుగలుగు, పటిక బండలపై మరు ♦ పనులుపూని
బడలి నిర్జరకాంతలు ♦ విడిచిపట్టి, కల్పమాలికల్ తొడవులు ♦ గాంచి రచట. ౧౭౦

సీ॥ కరతలంబు వలె వి ♦ కాసమొందెడు కుట్మ, లాంగ మలరు నాగ ♦ లింగముఁగని
పడగపాముని బ్రమ ♦ పడి శూలములఁబోలు, కనులనుముకుళించు ♦ కొనెడువారు
మగజాలలో నీడ ♦ దగఁగాంచనగు పూలఁ, గోసియుండని ప్రేమఁ ♦ గొసరువారు
కంగేలి చిగురులఁ ♦ గెంగేల గోళ్ళఁ, జిదిమి వక్షముల నుం♦చికొనువారు

తే॥ విరులఁ దమకించి కోయంగఁ ♦ బఱచువారు, వివిధ వర్ణముల్ నవరత్న ♦ వితతి వలన
నడరు మలయందు మలయుచు ♦నంచలట్లు, మొనసిదొడ్డదొనలలోన ♦ మునుఁగువారు

ఉ॥ కాంత! చలింపవెల్లు నహా ♦ కార సువర్ణదళంబు లన్నియుం
గాంతిచలింపవెల్లు నహా ♦ కార సువర్ణదళంబులే యగుఙ్
సంతత మంజులప్రసవ ♦ సౌరభ సీమలె కొమ్మలయ్యెడఙ్
సంతత మంజులప్రసవ ♦ సౌరభ సీమలె కొమ్మ లయ్యెడఙ్ ౧౭౨

క॥ శుకవాణీ కలకంఠీ, నికరధ్వని విని భుజంగ ♦ నివహము లేవన్
శుకవాణీ కలకంఠీ, నికరధ్వని విని భుజంగ ♦ నివహము లేచున్ ౧౭౩

క॥ తావుల గోరంట కోమలు, తావుల గోరంట కోమలు ♦ తనివి చెలంగన్
మావుల మురువైన పరువు, మావుల మురువైన పరువు ♦ మన్నించి రొగిన్. ౧౭౪

తే॥ రాజ ముఖ దర్శనంబునఁ ♦ దేజు మాసి, పుండరీక చయంబుల ♦ పొలుపు లడఁగ
రాజముఖ దర్శనంబునఁ దేజు మాసి, పుండరీక చయంబుల ♦ పొలుపు లడఁగె

క॥ తిన్నని యామోద మలరఁ, బున్నాగ చయంబు లచటఁ ♦ బొలుపుగ వెలయన్.
దిన్నని యామోద మలరఁ, బున్నాగ చయంబు లచటఁ ♦ పొలుపుగ వెలసెన్. ౧౭౫

ఉ॥ శ్రీరమణీయ నీతి మహి ♦ షీయుతి స్యందన వాహి నీంద్ర భూ
దార విహార భాసుర ము ♦ దస్థితి చామర ఖడ్గభాతి వం
శీరుతి యూథ సంహతి వి ♦ శేషక ధాతు పరాగరక్తి సొం
పారు ద్విజన్మరీతి గన ♦ నవ్వని పొల్చె నృపాలు వీడు నాన్. ౧౭౬

క॥ విలసిత గణికాతతి సర, సుల సుమనో మోద గరిమ ♦ సురుచిర మయ్యెన్
విలసిత గణికాతతి సర, సులసుమనోమోద గరిమ ♦ సురుచిర మయ్యెన్. ౧౭౭

క॥ భోగి హారి నాగ సద్ద్విజ, పూగమ్ముల నొప్ప రాజ ♦ భూభృద్వరుఁడున్
భోగి హారి నాగ సద్ద్విజ, పూగమ్ముల నొప్పె రాజ ♦ భూభృద్వరమున్. ౧౭౮

తే॥ భవ్యసురసాలములు వర ♦ ఫలముఁబొసఁగు, కతన నందన సరణిఁ బ ♦ ర్వతము వెలయు
శీత లాంబుశీకర ఝరీ ♦ శీర్షకంబు, నగుచు హారకపర్దము వోలె ♦ నంద మొందు. ౧౮౦

తే॥ పొంగుచున్న తేనెను ద్రావఁ ♦ బువ్వులలోన, ముసరు మధుపంబులం బోలి ♦ మూఁగి స్త్రీలు
పురుషులుం గూడి యా గిరి ♦ చరియలందు, వీడ మదిరాక క్రీడించి ♦ రాడిపాడి. ౧౮౧

తే॥ దిగుట దలఁచిన గొప్ప వీ ♦ డగను దోఁప, దాని మాని యా గిరి వీక్షి ♦ తరలరైరి
స్వర్గ సుఖమును గోరు స ♦ జ్జనులవలెఁ ద, దేక మానసులై వీడి ♦ రితర చింత. ౧౮౨

తే॥ మొగుళులొప్పనస్త్రాద్రి యే ♦ నుఁగునుపోలెఁ, గమలమిత్రుండు దుముకుసిం ♦ గమును పోలె
గజవిరోధి క్రుమ్ముటచేతఁ గాఱునెత్రు, కరణి నాకస మెఱ్ఱనై ♦ కానిపించె. ౧౮౩

తే॥ మావి మ్రాఁకు లెఱ్ఱని కాంతి ♦ మలయ నొప్పెఁ, గొఱఁత లేక క్రౌంజిగుళులు ♦ కొఱలు సరణి
తన యొడలు మొత్తమా కాంతి ♦ తనరు కతన, రత్నఖచితమౌ రహిని ప ♦ ర్వతము మెఱసె

తే॥ కనుల పండువౌ తద్దృశ్య ♦ కాంతివలన, వెలుఁగు శిఖరముల్ పెక్కులు ♦ కలిగియుంటఁ
జందనం బురంబు పయి న ♦ లంది నట్టి, వెన్ను చందాన నమ్మల ♦ వెలసె నపుడు. ౧౮౫

'కాంత! చలింప' అను పద్యమునుండి ఎనిమిది పద్యములు మూలమునను కేవల శబ్దాలంకార ప్రధానములై యుండుటచే సరిగ అనువదింపఁబడక స్వతంత్రించినవి.

తే॥ ఒడలు ప్రాణంబులట్లు లోం ♦ గూరులు ప్రేమ, గలుగువారలుసింగముల్ ♦ గజములేణ
ములును తమతమ పెంటులంగ ♦ గలిసి వెడలు, విధమునఁగ వచ్చి మలక్రింద ♦ విడిసిరంత.

ఉ॥ వేఁడి మయూఖ జాలమును ♦ విస్తృత కేసరముల్ జ్వలింపఁగాఁ
బోఁడిమి నొప్పు క్రుద్ధ హరి ♦ ముఖ్యుఁడు నాఁ జను నొంటికల్లు తే
రేఁడు గుఱ్ఱాల జోదు పగ ♦ రేలిక క్రుంకుడుగట్టు చేర నా
జాడ యెఱింగి దంతులప ♦ సాగి బయల్పడె మబ్బు తెట్టువల్. ౮౮౭

సీ॥ మందారమును మించు మకరంద గంధంబు, పరపు దామము దాల్చు ♦ ప్రభువరేణ్య
వాహిని యను పెను ♦ వారాశి యందెల్లఁ, జెంబామరలు పూచు ♦ చంద మొంది
దీపముల్ వెలిఁగె నిం ♦ పే పార జనముల, మనముల రంజించు ♦ గోసము తోడ
యచ్చంపు టిసుకలో ♦ నాణిముత్తెములీని, శంఖంబు చరియించు ♦ సరణి నమరి

తే॥ శీతలాబ్ధిలో బింబముల్ ♦ చెదరఁజేయు, నలల నడుమను వెలువడి ♦ చలువజోతి
వేల్పుమూఁకల విందు వి ♦ స్వాదిఁదోఁచెఁ, జుక్కలెల్లను గొలుచుచుఁ ♦ జుట్టియుండ.

తే॥ పొలసునీచు పీచెడిపల్ల ♦ జలధి తెల్ల, చంద్రుఁ గాంచఁగ నది యొర్వఁ ♦ జాలనట్టు
భూపవాహిని మానినీ ♦ ముఖములనెడి, విమల చంద్రులఁ గాంచెను ♦ వేలకొలఁది. ౮౮౯

చ॥ వెడలిచి రత్నహారముల ♦ వేడుకఁ దాలిచి తారహారముల్
సడలిచి కేశపాశములు ♦ చక్కనితావి పొగల్ దగిల్చి ముగ్ధ
ముడిచిన చల్లఁదేనెగల ♦ మొల్లసరంబుల నిచ్చలేమిచే
విడిచి మృగాక్షులంతఁ దమ ♦ వేణులఁ దాల్చిరి జాజిమాలికల్. ౮౯౦

సీ॥ నటకులు నటియించు ♦ నర్తన స్థలముల, వెలలు మృదంగ గుండ ♦ డీల రవమ్ము
నతివల పాటల ♦ నలరు స్వరంబును, బిగినరంబులఁ దోఁచు ♦ విమల రవము
లయమైచు కరతాళ ♦ లలితనినాదమ్ము, పిల్లనగ్రోవి పాం ♦ పిరి రుతమ్ము
క్రొత్తగాఁ బదములు ♦ గూర్చి పాడెడుధ్వని, లమరులు వెలుఁగంద ♦ నతిశయిల్లెఁ

తే॥ త్రావు వారల తొట్రు శ ♦ బ్దములు నతుల, కపురు రొదలును కరులగేఁ ♦ కలును హరుల
హేషలును గూడి యేదియు ♦ నెఱుఁగరాక, కలకలంబు లా గుంపులఁ ♦ గలయఁ బర్వె.

సీ॥ పొలుపుగాఁ బూర్వంబు ♦ భుజియింపఁబడనిను, ధంబోలు మదనశా ♦ స్త్రవిషయంబు
లనుభవ విజ్ఞాన ♦ మొసరుట చేతను, దొరకక దొరకక ♦ దొరకినట్టి
యమృతంబుఁబోలు ల ♦ తాంగుల హృదయంబు, నం బుట్టు ప్రణయకో ♦ పంబు వోవఁ
బలు పాట్లువడి యూఱ ♦ డిలఁజేయు చేఁతలఁగ, గ్రొత్తమట్టులఁగొని ♦ కూర్చుపదము

తే॥ పాడుఁడనుచు వెలందుల ♦ వేఁడికొనుచు, వారు పాడఁగఁ జెవి చవు ♦ లార వినుచుఁ
దత్త్వము గ్రహించి కనుల న ♦ ర్తనముచేసి, రంజిలుటచేతఁ దెలియక ♦ రాత్రి కడచె

## ౧౫. పుష్పాపచయ వర్ణనము (౩౯)

చ॥ రిక్కలు పండ్లుగాఁ జెలఁగు ♦ రేయను రాక్షసరాజుఁ గూల్పఁగా
నెక్కసమైన వెల్గులను ♦ వేయికరంబులు మీఱఁ జాఁచి ప్రా
గ్దిక్కుధరం బనం జను సు ♦ దీర్ఘ కవాటము నందు దోఁచె బెం
పెక్కఁగ భానుఁ డక్కసర మృ ♦ గేంద్రుఁడు సర్వజగంబు మేల్కనన్   ౮౯౩

మ॥ ఇన రాజన్య విశిష్టుఁడై దశరథుం ♦ డింపారఁ గాల్యంబులన్
బాసరం దీరిచి తన్ను చుట్టి జనముల్ ♦ భూపాలురుం గొల్వ స్యం
దనమం దెక్కి వనంబులుం దొరువులుం ♦ దన్పొందఁగా నొప్పుశో
ణనదిం జేరె దినేశ్వరుండు నడుమిం ♦ టన్ జేరె నవ్వేళలన్   ౮౯౪

తే॥ రాజులును రాకుమారులు ♦ రాణువయును, తమ వరాంగులతోఁ గూడి ♦ తనియఁ దిరిగి
సుమములం గోయు మాత్రములు ♦ తున్నకత నొంద, సొంపు పెంపారు వనములఁ ♦ జొచ్చిరంత

చ॥ భామలు శరాసనంబులుగఁ ♦ బూనిచి చూపుల తూపు లేసి గా
యాపము నోనరింతు రంచుఁ జను ♦ నంగమునం ♦ జనె బర్హి సంఘముల్
ప్రమదల పల్కులన్ విని త్ర ♦ పం గొని చిల్క లొదింగెఁ గాల్నడన్
భ్రమసి బిడెంబు నొందు క్రియఁ ♦ బొఱలుచు నుండె మరాళ సంఘముల్.

తే॥ కుండలంబులు మెఱయంగ ♦ నెండ ముసరు, తుమ్మెదలు పొదసేయ నీఁ ♦ దుటలు చూచి
హితులు పతులు లతాంగులు ♦ లతలనుండి, యెఱుఁగలేక మిణకరించి ♦ రెంతొ సేపు.

ఉ॥ కోయిల లయ్యెడన్ మణులు ♦ గూర్చిన భూషణముల్ ధరించి రా
గాయిత వాక్చమత్కృతుల ♦ నందిన యక్కలకంఠు లుబ్బుచున్
కోయని యార్వ బెగ్గడిలి ♦ కూయక యుండగ లేదు సిగ్గుచే
వాయి గదల్ప నల్పులు సు ♦ వక్తల సన్నిధి వా మెదల్తురే?   ౮౯౮

తరువోజ॥ విసముకంబును మించు ♦ వెడఁద కన్గవల, వేడ్క నమృతమునఁ ♦ బ్రేమించి చూచి
యొసపరుల్ కేల్దమ్మి ♦ నొందఁగ వంప, నున్నతంబులయి పూ ♦ లొప్పిన లతలు
కుసుమ కోమలమూర్తుల ♦ కోమల పాదములఁ, గూరిమిఁ బువ్వులు ♦ గురిసియడంగె
గొసరక సుమలతాం ♦ గులకడ నుఱిది, క్రుంగ నమ్రములుగాక ♦ కొఱలువారెవరొ.

ఉ॥ ఇందిరఁ బోలు నిందుముఖు ♦ లిమ్ముగఁ దాఁకఁగఁ గేలు దమ్ములన్
సుందర పీన వక్షములు ♦ శోభిలు విక్రమ సింహ దోర్గిరుల్
చెందిన యున్నతిం గుదిసి ♦ చిక్కి వినమ్రము లౌచు నుండ స
న్నందన మొందు పూలతలు ♦ నమ్రము లౌటఁ దలంప నబ్రమే?   ౯౦౦

చ॥ సరసులలోనఁ బూవని ప్ర ♦ శస్త వనేజ కువాలయంబులన్
దిరపడఁ జంద్రవంక గల ♦ తీవలు పూవఁగఁ గాంచి తుమ్మెదల్

వెరవున వచ్చి మూఁగి మఱి ♦ వేసరి తోలినఁ బోవకుండెఁ గ్రొ
త్త రుచులఁ గోరువారొకట ♦ దక్కిన వానిని వీడువారలే? ౯౦౧

చ॥ శిలలనఁ జెల్లి చేవమెయిఁ ♦ జెన్నలరారు భుజంబులొప్ప వీ
రుల కడఁ జేరు కేకి సవు ♦ రుం గల చామలఁబోలెఁ గొన్ని పు
ష్పలతలు కోమలంబులయి ♦ వంగి యడంకువ నొప్పెఁ గొన్ని తీ
వలు మఱి చేతికందవును ♦ వంగవు కిన్వడు వారికై వడిన్. ౯౦౨

ఉ॥ పూవులు కోయఁగా లతలు ♦ పోఁడిమి మాయుటఁ గాంచి బొమ్మలన్
కైవడి నొప్పు కప్పురపు ♦ గందులు కాంతుల కివ్వి యెవ్విధిన్
మైవడి గూర్చునంచు మణి ♦ మండనముల్ కయిసేసి సన్ననౌ
తీవలఁ గాఁచుచుండి రటఁ ♦ దేఁకువఁ జల్లని తూపు చూపులన్. ౯౦౩

ఉత్సాహ॥ అలరు విరులఁ దేనె ద్రావు ♦ నళులు వికచ పుష్ప మా
లలను వదలి పట్టి వగు వె ♦ లందుల జడఁ జేరి మున్
వలచు పువులఁ దలఁప ♦ వయ్యఁ బ్రాజ్ఞ వరులు సంగడం
బులు పొసంగు చోట సుఖము ♦ పొందువారలే గదా? ౯౦౪

ఉ॥ అందముచేత నిందిరకు ♦ నాభరణం బని చెప్ప నొప్పు రా
కేందు నిభాస్య కంజము క ♦ యిం గదియించి పలుంగు బండ నీ
డం దన బింబముం గని యె ♦ డంద తడంబడ నీరు గార్చె నీ
చందనగంధి నాప్రియు ని ♦ జంబుగ లోఁగొనె నంచు నెంచుచున్ ౯౦౫

చ॥ పొలుపుగఁ దాల్చియున్న విరి ♦ పూసరముం గొని యొక్క భూపుఁ డి
మ్ములఁ బ్రియురాలి కంఠమునఁ ♦ పూన్పఁగఁ గాంచిన చెల్వ యొర్తు పే
రలుకను మోము వాడ్చె నయ ♦ నాశ్రులు ముత్తెము లట్లు గబ్బి గు
బ్బల పయిఁ జింద నేడ్చెను; స ♦ పత్నుల మేలిమి నోర్తురే చెలుల్? ౯౦౬

చ॥ ప్రియుఁడగు నొక్క రాజు తన ♦ ప్రేముడి కాంత మయూర లీలలన్
గయికొని రాఁగ నామె మది ♦ గానఁగ నొక్క లతా నికుంజముం
బయికొని డాఁగ రాము చొరఁ ♦ బాఱి మనోహరుఁ గానలేమికిన్
మయి తన ప్రాణమున్ వెదకు ♦ మాడ్కి మఱింగె సురింగెఁ జెంగటన్.

ఉత్సాహ॥ కాటుక గల కఱ్ఱి కనులఁ ♦ గావి రంగు గానరా
మీటి యీఁకెఁ దాల్చి యున్న ♦ మేటి పైని యీసునన్
జోటి యొకతె యందకుండు ♦ సుమముఁ గాంచి కోయుమా
మ్మాటి కొంద్లు వనుచుఁ గేలు ♦ మడిచి వేఁడెఁ గోకిలన్. ౯౦౮

తే॥ పెద్ద యెడ నీటి కాయను ♦ ప్రియుఁడు గాంచి, పడఁతి గుబ్బలఁ బోలు నీ♦ ఫల మనంగ
నే పడఁతి గుబ్బలని మది♦ యెరియ నేడ్చి, వెక్కి వెలవెల పోయెను♦ వెలఁది యొకతె.

తే॥ ఆల మన్నంతఁ బెల్లుబ్బ ♦ నద్రి భుజుని, పుష్పములఁగోయు స్మరనిభుఁ♦బూవుఁబోణి
నీలవేణి కోకిలవాణి ♦ కేలఁగనులు, మూసి, మెవరన నిట్టూర్చి ♦ మోము వాడ్చి.

తే॥ బురదఁ బుట్టని తమ్ములఁ♦ బోలు కేలు, చాఁచి పూలు గోరిన తన♦సకులఁ గాంచి
ననల నొసఁగక యొక్కఁడు♦నడుమ నిలిచె, దాఁప కీయకుండెడు లోభి ♦ దంభియట్లు.

తే॥ ప్రియుఁడు పొరపడి వేఱొక♦పేర బిలువ, నూడఁ దీసిన చురియ నా ♦ నుఱికిచూచి
పరువు తలవంపఁ బూవుతో♦వైచె నొకతి, అదియు నిట్టూర్పుచే నల్ల♦నయ్యె మాఁడి.

తే॥ కులసతులువిరిదమ్మిమో♦ముల వెలుంగు, కఱికనులఁజూచి కాంక్షతోఁ♦గలయఁదిరుగ
మదజలముద్రావ మధుపముల్ ♦మలయఁదిరుగు, మదపుటేనుఁగుఁబోలెను♦మన్నెఁడొకఁడు

ఉ॥ పొచ్చెము లేని హసాను గల ♦ భూవరుఁ డొక్కఁడు సంజఁ దోఁచు రే
నెచ్చెలి వంక వంటి నయ ♦ నెన్నుదు రొప్పు లతాంగికిన్ మదిన్
మెచ్చొనరించు వేఱు చెలి ♦ మిన్నక సామగఁ బంచు పువ్వులన్
జెచ్చెరఁ జిమ్మి పోయి రటఁ ♦ జీఁదఱితోడఁ గలాపపాళితో. ౯౧౪

సీ॥ నైజ గంధమునొంది♦నలువుగా విరిసిన, తుఱుము నెప్పటి యట్ల ♦ తుఱుముకొనక
జాఱిన పయ్యెంట ♦ సవదరింపక త్రోవఁ, జెదరిన ముత్యాల♦ చింత గొనక
తాను వెదకునది ♦ తనలోని ప్రాణమో?, యేదో? యనఁగ నెల్ల ♦ యెడలఁ దిరిగి
మకరంద బిందువుల్ ♦ రకముగఁ జిందు క్రొం, దలిరుల నెదకె సుం ♦ దరి యొకర్తు

తే॥ ప్రియుఁడు ముదమున వచ్చుచో♦బిఱ్ఱ బిగిసి, పలుక కాతంకు వేసరి ♦ తొలఁగు పిదపఁ
దహతహంపడి దయితుని ♦ దారి నిలుపఁ, జిలుక నంపి తానును వెంట♦ వెలఁతె నొర్తు.

తే॥ విరుల సరములుదాల్చిన ♦ పేరురమున, విరుల శరములు విరివిగా ♦ విచ్చి తూఱఁ
గృత్యమెఱుఁగక మాధవీ!యీయఁగలవె?, మంచిమందార సుమమని♦మసలునొకఁడు

తే॥ అగడు కల్పించుకొని కోప ♦ మూఱ కేడ్చి, వెదకి చేర్చి కూర్చిన తావి ♦ విరి సరంబుఁ
దాల్చి యద్దంబు గని భర్త♦తడసి యున్కి,కడలుగొని చిడిముడిపడె♦మడఁతి యొకతె

చ॥ యమునకు నోరె మిచ్చు గుణ ♦ మందిన కుంతముఁ దాల్చు నాప్రియుం
డమిత ముదంబు నందు నను ♦ నాసను దాల్పఁగలే దలంకృతుల్
తమి గొని యీ శరీరమునఁ ♦ దాల్పను జీవము లంచు భూషలన్
గ్లమమున నూడ్చియిచ్చె నొక కామిని ♦ కోర్తి వియోగ వేదనన్. ౯౧౫

ఉ॥ చెంగటి యీఱమందు తన ♦ చిల్క యడంగుట గాంచి కంచెలన్
లొంగక బూరటిల్లిన వ ♦ లుంద చనుంగవ మోవలేమిఁకిం

గ్రుంగి నడుంకు నెవ్వడుచును ♦ కూడని నొవ్వవహింపఁ జెచ్చెరన్
బంగరు గిన్నెఁ బట్టికొని ♦ పర్విడు నొక్కవరాంగి కుందుచున్. ౯౧౯

ఉ॥ అంచను గాంచి దాని నడ ♦ యందముఁ గాంచి సహాయ లీల నే
తెంచుట గాంచి మైత్రి నరు ♦ దెంచె నటంచుఁ దలంచెఁ దోడు గా
నెంచెను నన్నుఁ గాంచు ♦ను ♦ రెంచరె యందము లేని దంచు నీ
కించెనె భూష లిత్తు ధరి ♦ యింపుమ యంచొక ముద్దరా లనెన్. ౯౨౦

చ॥ విమల శిరోమణిం గటిని ♦ వ్రేలెడి నీలడఁ గాంచి పెన్ భుజం
గము మని కాటి నెమ్మి వెను ♦ నం బొడుపం గని సుందరాంగి యో
ర్వనిత భయంబునం బఱచి ♦ యప్పటి కుండిన కిన్క వీడి మో
దము వలకాని కెచ్చిగిలఁ ♦ దానె నను౦గు నొడిం దటాలునన్. ౯౨౧

చ॥ అసదృశ సుందరాంగి రుచిక ♦ యర్మిలి కాంతను పైఁడిబొమ్మ! యిం
పెసఁగు మరందమా! ప్రియస ♦ ఖీ! నను గన్గొను మంచుఁ గన్నులన్
బొసఁగఁగ మూసి క్రోయఁదగు ♦ పుష్పలతా నికటంబు చేరి యో
హాసపరి! రోసి కాంచు మని ♦ యుబ్బున నవ్వను గేలి గొట్టుచున్. ౯౨౨

తే॥ వింటి నారి లవంగ తీ♦గియలఁ జుట్టి, పంకజాస్త్రుఁ గాల్చి యువక ద♦ర్పకుఁ డొకండు
నీలవేణుల వదన వ ♦ నేజములను, నుదయ రాగ భాస్కరుఁ బోలె ♦నొప్ప మిగిలె.

తే॥ చెఱకువిలుకాఁడు మన్సిగ్గులు♦చెలువ మమరు, మగలు కొందఱు తరితీపు♦లెగయఁగొలుపు
చెలుల కలికి పలుకులకు ♦శేష ఫణితి, శాస్త్రములకు వలెన్ వ్యాఖ్య♦నలుపువారు.

తే॥ భ్రమర గీతముల్ వంచె ర♦వమ్ము గాఁగ, నసము శరుఁడను వ్రేఁడు ల♦క్ష్యమ్ము చూపఁ
గదుపు నడుమను కోడెలు ♦ గదలు కరణి, గలువ కంటులు చుట్టిరాఁ♦గదలువారు.

తే॥ మదిఁ గడంకచే మును లు మ♦న్మథుని గెటి, గెలుతు రనుకొంట వట్టి మా♦టలె నిజంబు
చిన్ని లతలఁ బ్రసూనముల్ ♦చిదుము సీమె, కనఁబొమలెవారిలొంగింపఁ♦గలవు చూడు.

క॥ పొన్న తరు వెక్కిన ప్రియుని, యెన్నికలో నెక్కినిలిచె ♦ నిందువదనయే
యెన్నఁదగు జ్ఞానులేనిం, దిన్నగ గురు కుచల గెలిచి ♦ తిరుగం గలరే? ౯౨౮

తే॥ దేవతలచేతనేని చి ♦ త్రింపరాని, సుషమ యంద తలంపును ♦ చూపు నిలిపి
పుష్పశాఖపై నుండిప♦పురుషుఁ డొకడు, మొగ్గలును చిగురులుగోసి♦ముగుదకొసఁగె

తే॥ గదను పోలిన భుజములు ♦ గల యొకండు, ప్రియసఖుని గాంచె నాయలి♦వేణి బింబ
ఫలముఁబోలునోటదుడుకు♦పలుకువలుకఁ, గనలు గొనె నని మదిజాలఁ♦ గలఁతనొందె

క॥ అను నిట్టి చెయ్వులం గల, వనితలు పురుషులును గూడి ♦ వనమున విరులన్
దనియఁగఁ గోసిరి వేసట, గొని జలముల నాడ నిచ్చ ♦ గొనిరి మనములన్. ౯౩౦

## ౧౬. జలక్రీడా పటలము. (౩౩)

చ॥ లలితులు దివ్యమూర్తు లక ♦ లంకులు దేవ గణంబు సిగ్గిలన్
బొలసి శిరోముఖంబులు ప్ర ♦ ఫుల్ల సరస్సులనుండి ఝుంకృతుల్
సలుపుచు మూఁగి లేవ విల ♦ స ద్వనవాటులనుండి పెంటులం
గలిసి మదేభముల్ చను ర ♦ కంబున నేగిరి స్త్రీలతోడుతన్. ౯౩౦

తే॥ కొలకులం దిగి క్రీడింప ♦ వెలయు లీల, మునుపు దుర్వాసుఁ డింద్రుని ♦ గనలి తిట్ట
నతని సంపద యప్సర ♦ స్సతులతోడ, గడలిఁ జేరిన దృశ్య మ ♦ య్యెడలఁ దోఁచె.

చ॥ కలువల కన్నులం బలెనె ♦ కల్వలు పూచెను కల్వలంబలెన్
జెలువల కన్నుదోయి వికి ♦ సించెను కోకనదంబులెల్ల న
వ్వెలఁదుల మోముదమ్మి వలె ♦ విచ్చె వరాంగుల మోములెల్ల నా
జలజము లుల్లసిల్లు క్రియ ♦ జానుగఁ బొందె వికాస సంపదన్. ౯౩౩

ఉ॥ ఇందిరఁ బోలి కొందఱు ని ♦ జేశుల ఱొమ్ములఁ జేరినారు వే
కొందఱు వారి కేలు జత ♦ గూర్చి జయేందిర నాఁగ నుండ్రి పైఁ
గొందఱు పాళ విచ్చుక్రియ ♦ గొట్టములం గొని నీరు చిమ్మ రం
దందుల మీలు త్రుళ్ల భయ ♦ మందిరి చేరిరి వారి కౌఁగిలిన్. ౯౩౪

తే॥ గంధపొడినొండొరులుచల్లఁ ♦ గడఁగువారు, విమలజలమునోళులఁబట్టి ♦ యుమియువారు
అంజలులఁ దోయములు చల్లు ♦ లాడువారు, కుచములంటవిరులు పడఁ ♦ గుందువారు.

తే॥ మెఱుపుఁబోలిసమధ్యముల్ ♦ మెఱయువారు, వెదురుఁబోలినభుజముల ♦ వెలయువారు
విరియు కేశముల్ మొగముల ♦ మఱుఁగు పఱుపఁ, జేరి క్రీడింప నంచలఁ ♦ జీరువారు. ౯౩౬

సీ॥ పగడంబు డంబు బిం ♦ బంబు రాగంబు ప, ద్మంబు నింబారు మొ ♦ గంబు లలర
కువలయ నయనముల్ ♦ చవ్వలించు నించు సం, చున మించు మించిన ♦ సుందరాంగు
లడరి జడమ్ముల ♦ నడుమును నడయాడు, వాలుగ మీలను ♦ లీలఁ గనుచు
నీతటాకంబుల ♦ కెల్ల ను కన్నులు, కలవె యటంచు హితులఁ ♦ బలుకువారు

తే॥ తమిని విభుల భుజంబులఁ ♦ దడవు పూన్కిఁ, దరుల నున్న మయూరముల్ ♦ విరిసిపాఱఁ
గుందసపుఁ గుండలమ్ములు ♦ గునిసి యాడ, దరులఁ జేరువారలు నైరి ♦ తరుణు లపుడు

తే॥ నిర్జరాంగనఁ బోలిన ♦ నెలఁత యొకత, నీటఁ బ్రతిబింబితంబైన ♦ నీడఁ గాంచి
నేను నవ్వ నవ్వునది నా ♦ నెచ్చెలి యని, గబ్బి గుబ్బల సరి మీయఁ ♦ గడఁగెఁ బ్రీతి.

తే॥ అచటఁ బొసఁగిన దొసఁగేవొ ♦ యరయరాను, మీలఁబోలియెఱ్ఱనిచాలు ♦ వాలుకనుల
నెఱ్ఱఁజేసి సంకజములం ♦ దిమిడి నిలువఁ, జెలువ మొగమేర్పఱుప శంక ♦ చెందెఁ బ్రియుఁడు.

చ॥ తలిరులవంటి హస్తములఁ ♦ దాల్చిన కంకణముల్ శిలీముఖం
బుల పొదతోడ నార్వ జల ♦ పూరమునం జొరఁబాఱి హేమమే
ఖలలు తునింగి కాళ్లఁ బెనఁ ♦ గన్ భుజగంబులు చుట్టె నంచు వె
ర్వాల గొని కంప మొందిరి వి ♦ భీత మృగాక్షులు కొంద ఱత్తఱిన్. ౯౪౦

చ॥ తొలి కలశాబ్ధిఁ ద్రచ్చునెడ ♦ దుర్ఘటచక్ర సుధతోడఁ దోఁచు వే
ల్పుల జవరాండ్రు చుట్టుకొనఁ ♦ బొల్పగు మందరమట్టు లంగదం
బులు కడియంబులున్ వెలయు ♦ పుష్ట భుజుండగు నొక్క రాజు తన్
గలుకులు చుట్టి నిల్వ జల ♦ కంబుల నాడుచునుండె వేడ్కమై. ౯౪౧

ఉ॥ కంకణముల్ ధరించు కర ♦ కంజములున్ జిఱునవ్వు కవ్వు రా
గాంకితమైన మోవులు ధ్వ ♦ జాంచలలీలఁ జలించు మధ్యముల్
పొంకముగాఁగ నొప్పు పువుఁ ♦ బోఁడులలోనఁ జెలంగు రాజ మీ
నాంకుఁడు తోఁచె నిర్ఝరిణి ♦ హస్తినలం గల హస్తికై వడిన్. ౯౪౨

ఉ॥ కారు నెమిళ్ల క్రొవ్వు లడఁ ♦ గం దగు చాయలు గల్గి మబ్బులం
గేరిన కేశ పాశములు ♦ గీల్కొను చిక్కుల కొల్కి కూటముం
జేరిన యొక్కతెఁడు విల ♦ సిల్లె సురాపగ తీరమందు పెం
పారిన ఋక్ష సంచయ స ♦ మాశ్రిత పూర్ణ శశాంకుకై వడిన్. ౯౪౩

చ॥ అరుదగు తుంట వింటి యస ♦ మాస్త్రినకున్ వల పొండె కాక యం
పఱయఁ నొసంగు దృష్టి గల ♦ మానిని యొర్తు సఖీ జనం బలం
కరణము గూర్పఁ జెల్వల ని ♦ కాయమునన్ వెలసెన్ మనోజ్ఞయై
విరుల తటాకమందు కడుఁ ♦ బెద్ద జలేజము విచ్చు మచ్చునన్ ౯౪౪

తే॥ చెలులు పలువురు తన చుట్టు ♦ నిలిచియుండఁ, బ్రమద యొక్కర్తు విరిసిన♦ప్రసవనికర
వల్లు లొకకొన్ని యొలయఁగాఁ♦బాల వెల్లిఁ, బొడమినట్టి కల్పకవల్లి ♦ పోడవు సూపె.

సీ॥ గురు రథంబుల నుండి ♦ కొన్న నితంబముల్, కొబ్బరి ప్రమాకులఁ ♦ గొన్న కుచము
లేరి యొద్దను గొన ♦ నేరని యనవద్య, సౌందర్య మొప్పారు ♦ నన్ను తాంగి
కంచెలలోన బి ♦ గించిన వక్షోజ, ములును వెలికి దూఁక ♦ మునిఁగినంత
విమల జలంబుల ♦ వెలుఁగు రాకా చంద్రు, ప్రతిబింబ మన మోము ♦ పరిఢవిల్లె.

తే॥ వలుఁద భుజములు వలువల ♦ వెలికి నుఱుకు, నుత్తిదిపిఱుఁదులుకుంభప♦యోధరమ్ము
లొండొకటి మీఱి క్రమ్మెచు ♦ నుంటఁ జేసి, వెల్లువలు తటముల మీఱి♦విరియఁబాఱె

తే॥ ఎట్టి నోరు తెల్లఁగ గను ♦ లెట్టఁగాఁగఁ, దాని గందము తొలఁగ వ ♦ స్త్రములు నలఁగ
జలజ వదనలు మునిఁగిన ♦ కొలఁకు చూడఁ, బ్రేమ మీఱఁగఁ గవిసిన ♦ ప్రియునిపోలె.

తే॥ మాన్యులంగూడితిరుగు సా♦మాన్యలేని, మాన్యలౌట యుక్తమకదా? మత్స్యములును
దరుణుల యొడళ్ల తావులఁ ♦ బరిమళించెఁ, బెర నిదర్శన మిఁక దీని ♦ కరయ వలెనె?

క॥ తరుణుల చందనములతోఁ, దరుణుల కుంకుమము గలిసి ♦ తగ నిండిన యా
సరసి నొకచోటు నీలపు, శరదమ్మున నెఱ్ఱ మొగులు ♦ చంద మ్మయ్యెన్. ౧౪౯

క॥ అలఁదిన యొడలి యగురుతోఁ, గలిసిన కలపంబు నీటఁ ♦ గడుగం బడఁగాఁ
దులకించు మెఱుఁగుఁబోణులు, విలసిల్లిరి సానఁ దేఱు ♦ పెను మణు లనఁగన్. ౧౫౦

క॥ చెలువుని భుజమున నంగన, చెలువుగ గందమున వ్రాయు ♦ చిత్రము సరసీ
జలములఁ దుడువఁబడుట తాఁ, దెలియక కను లెఱ్ఱఁజేసి ♦ తీక్ష్ణతఁ జూచెన్. ౧౫౧

తే॥ వలుఁద పిఱుఁదులు దర్పక ♦ జ్వరము కలుగఁ, నతివ యొక్కతె కలపంబు ♦లలదుఁదేనె
క్రొవ్విరులు పుష్పాడియుఁ గొలఁ ♦కున జలంబు, తోడ సలసలనుడికెను ♦ ధూమమెగయ

క॥ వనజ నివాసిని బ్రాఁతిని, దన కరమున జలక మార్చు ♦ దంతిం బోలెన్
వనమాలా భుజుఁ డొక్కఁడు, తన కరముల నీర మెత్తి ♦ తరుణిం దడిపెన్. ౧౫౩

తే॥ మెల్లని నడక నోడింప ♦ మెలఁత లుంచు, మృదు పదములఁ బోలిన వన♦నెదలఁ గనలి
త్రొక్కులాడుచున్న వియనఁ ♦ దొట్రుకొనియె, నలినముల మీఁది యంచపి♦ల్లలు నయారె

తే॥ చందనము వోవఁ దేటయై ♦ సౌరు గొనుచు, హేమ కుంభంబులంబోలి ♦ యెసక మెసఁగు
గబ్బి గుబ్బలఁ గని దర్ప ♦ క జ్వరమున, నడలు కాముకు లెందఱో ♦ నుడువఁదరమె?

క॥ వలిక విరిసిన తామరఁ, బోలిన కేల్సాఁచి జాడ ♦ పోలపము దెలుపన్
లోలాక్షి చేటి కన్నుల ♦ మూలముగఁ గటాక్ష సంజ్ఞ ♦ బోఁడిమిఁ జేసెన్. ౧౫౬

తే॥ అలలు త్రోయుచుఁ బరువిడి ♦ యలముకొనఁగ, నురలు నీట మునుంగు ర♦క్తోత్పలములు
హరిణనేత్రల మోమంద ♦ మంద లేమి, మదిని సిగ్గిలి డాఁగిన ♦ మాడ్కి నొప్పె. ౧౫౭

క॥ ఈరీతిం గ్రీడించిన, వీరులు మానినులు సరసి ♦ వీడుచు దరులం
జేరుచు దువ్వలువ లలం, కారంబులు దాల్చి రెల్లఁ ♦ గాంచిన తనివిన్. ౧౫౮

ఉ॥ కోరిన వట్టు నీరములఁ ♦ గ్రుంకి పదంపడి వీడినట్టి కా
సారము లొప్పె రిక్కలును ♦ చంద్రుఁడు వీడిన మిన్నువోలె నిం
డారఁగ విచ్చియున్న జల ♦ జావళి యెల్లఁ దొలంగి దోపు వో
గారము దక్కి కుంది మదిఁ ♦ గంది యలంఘురు పేద చందమై ౧౫౯

క॥ హరిణాక్షులతోఁ బురుషులు, బెరసి జలము లాడుచుంట ♦ వీక్షించిన యా
తరణి యటులాడఁ గోరెన, కరణిం జని చాయతోడఁ ♦ గడలిఁ గ్రుంకెన్. ౧౬౦

క॥ బలహీనుఁ డగుచు నోడియుఁ, జలమున మఱి యరుఁ పైకిఁ ♦ జను నృపుఁ బోలెన్
వెలఁదుల మొగముల కోడిన, నెలయు మరలఁ బైకి నెక్కి ♦ నెలకొను కడిమిన్.

## ౧౭. పుష్పాపచయపటలము. (౬౭)

ఉ॥ తెల్లని కల్లు వెల్లువనఁ ♦ దేటగు పాటలు రూపుతో నిటుల్
చెల్లె ననంగ, నల్లపునఁ ♦ జిక్కని మోహము నిండిపోర్లి యా
వెల్లువ యయ్యె నా వెలసి ♦ పెల్లుగ వెన్నెల లెల్ల నేత్రముల్
చల్లన గాఁగ నెల్లెడల ♦ సాంద్రముగాఁ బరవెన్ జగంబునన్. ౯౬౨

చ॥ కలిసినవారి చేతలకుఁ ♦ గల్లునుపోలి వియోగ మొందు వా
రల యసు ఁదాను దుర్విష వ ♦ రంబయి నెయ్యపు టల్కఁ బూను క
ల్కులకును గూర్చు దూతియయి ♦ గొప్పగ విప్పగ వెన్నెలల్ జగం
బులఁ బరవెన్ మరుండు తన ♦ పూన్కికి బాసట గోర వచ్చె నాన్. ౯౬౩

ఆ॥ నదులు గంగలయ్యె ♦ నుదధులు పాల సం, దరములయ్యెఁ బర్వ ♦ తంబులెల్ల
వెండి కొండలయ్యె వెన్నెల పెల్లిద, మంగవించు టేమ ♦ సంగవచ్చు? ౯౬౪

ఉ॥ ఎల్లరు నెల్ల దిక్చ్చయ ♦ మెల్ల పదార్థము లుల్లసిల్లి క్రొం
దెల్లని పాటచేత జగ ♦ తీ తల మెల్ల నెలింగెఁ దొల్లి యు
త్ఫుల్ల సరోజ బాణుఁడిలఁ ♦ బుట్టిన నాఁడు రమా సుమాంగి లో
వెల్గిఁ బాలు సముద్రము ♦ పెరిమిఁ గప్పిన వెల్ల యొల్లె నాన్. ౯౬౫

మ॥ పొలఁతుల్ చేరిరి చుక్కలల్లెనఁగు మే ♦ ల్ముత్యాల పందిళ్లనీ
డల సంచార పయోదముల్ దిగెడు ద ♦ ట్టంబౌ వనాంతంబులన్
జలమం దేటీన నీరుపోలు స్ఫటిక ♦ స్ఫీత స్ఫుర ద్వేదికా
స్థలులం బుష్పిత కాయమానముల ని ♦ ష్టాగోష్ఠిఁ గ్రీడింపఁగన్. ౯౬౬

తే॥ పుష్పవేణులతోఁ గూడి ♦ పూల సెజ్జ, లందు కాలంబు పుచ్చెదు ♦ నానఁ బురుషు
లమృతముంబోలి తేటయై ♦ యలరు మధువు, హైమచషకంబులం గొని ♦ యానిరపుడు.

తే॥ అమర గంధర్వ విద్యాధ ♦ రాబ్జముఖులఁ, గేరు సౌష్ఠవ మొప్పు న ♦ క్కీరవాణు
లలరులం దేంట్లు తేనియ ♦ లాను లీలఁ, జప్పరించి రాసవమును ♦ చవులు వాఱ. ౯౬౭

తే॥ చంద్రికను పాలఁ బోలిన ♦ చషక మూను, చేతికాంతిచేఁ జెలువారి ♦ జేగుఱయ్యె
సుదతి మోనిన సుర స్రాగ ♦ సుధను పోలె, నింతి కనుఁగవ యప్పుడ ♦ యెఱ్ఱఁబాఱె.

తే॥ అగురుపొగగ్రమ్మఁ గ్రొమ్ముడి ♦ యవఘళించు, మగువ త్రాగిన తెల్లని ♦ మధువువహ్ని
కుండమున నేయిపోసిన ♦ కుదురుదాల్చి, యుల్లమున నున్న కామాగ్ని ♦ నొలుకఁ జేసె.

చ॥ విలసిత శాల మైప యలి ♦ వేణి యొకర్తుక పైఁడిగిన్నెలో
పలఁ దన నీడఁ గాంచి చెలు వా! మధు వానుదు రమ్మ యంచు వే

పిలిచె; వినంబుఁ బోల్కనుల ♦ వేఁడిమి వాక్కుల నబ్ధి వెన్నయున్
వలయు మనోజ్ఞరాంధ్ర యతి : వేఁపు దీటు మఱొండు గల్గునే? ౯౭౧

చ॥ అలుకఁగఁ దగ్గ కౌను గల ♦ యంగన యాసవ పాత్ర మందు వే
నలియును కెంపు మోవి చిఱు ♦ నవ్వు విష స్ఫురితాగ్ర కుంత వీ
క్షలు గల నీడఁ గాంచి వెఱి ♦ చానరో యేమి యొనర్తు వద్ది యెం
గిలి యిది క్రొత్త త్రావు మని ♦ కేరెను కుట్మల దంత కాంతితో. ౯౭౨

ఉ॥ నూత్న విధంపు హింసలను ♦ నూల్కొనఁ జేసెడి చూపులాఁడి మేల్
రత్నపు గిన్నెఁ గౌముది చొ ♦ రంబడఁ గల్లని సంభ్రమించి వే
యత్నముతోడ నానునెడ ♦ సంగన లెల్లరు కేరి కామినీ
రత్నముఁ గాంచి నవ్వఁల ♦ రామయు శీర్షము వంచి సిగ్గిలెన్. ౯౭౩

ఉ॥ వీణకుఁ బిల్లఁగ్రోవి కొద ♦ వెంచెను శ్రావ్యత యీమె యంచు వి
న్నాణముగా వచింపఁదగు ♦ నారి యొకర్తుక కల్వ తావి కల్
నాకెపుఁ బాత్రఁ బట్టి నయ ♦ నంబుల నీడను గాంచి యంత సిం
గాణి బొమల్ వెలుంగఁ బోలఁ ♦ గన్ వడి నూఁదె ద్విరేఫమన్ భ్రమన్.

తే॥ కైపు మిక్కిలి ఘూర్ణిల్లు♦కనులతోడఁ, గల్లునం దిందు బింబంబుఁ ♦ గాంచి యొకతె
యీపురాహుభయంబున♦నిచటడాఁగి, యుంటె?యడలకుమభయంబు♦నొసఁగితినను

క॥ సుడియే యనఁదగు పొక్కిలి, యడరు పసఁతి వస్త్రాల సంది ♦ రందలి జ్యోత్స్నన్
సుడియు మతిచేత మధువని, తొడిఁబడి గిన్నియకుఁ బట్టి♦దొడఁగెం దోడ్తోన్. ౯౭౬

తే॥ మించు నంచునఁ జలియించు♦ నించుఁబోఁడి, సుధను పోలిన పలుకుల♦చొప్పుచెడఁగ
రశన నూడిచి విరుల స♦రంబు చుట్టె, శిరసునం గట్టె బంగారు ♦ సరిగ చీర. ౯౭౭

తే॥ కల్లుపాత్రలోఁ దనమోముఁ గాంచి యొకతె, నిండుఁ జానఁగ వచ్చెనం♦చెదఁ దలంచి
చంద్ర! వొలయల్క వేళలఁ♦జల్ల నగుదు, వేని యీ కల్లు నీ కిపు♦డిత్తు ననియె. ౯౭౮

తే॥ ఒక్క తిలనాస ముంజేయి ♦ త్రొక్కులాడ, నాననముపయి నొలికించి ♦ యాసవంబు
మైకమున నెఱుఁగక మఱి ♦ మధువు నాన, గిండి కెమ్మోవిపై బోర ♦ గించె మరల.

చ॥ పిసిని ధనంబుకై యరిగి ♦ వేచిన యాచకు లట్లు తుమ్మెదల్
ముసరి రవాళి సేయ నొక ♦ ముగ్ధ ముఖాబ్జము విచ్చి యాసవం
బెసరఁగ నాన నానగొని ♦ యింబుగఁ గోరను నానవైచు నా
బిసమున జుఱ్ఱసాగె నలి ♦ వేణులు వింతగఁ గాంచుచుండఁగన్ ౯౮౦

ఉ॥ వాలుగ మీలు బెట్టు చెడి ♦ పాఱ నొఱన్ వెలివాఱు కత్తి నా
వాలికలైన కన్నులును ♦ వ్రాల్జడయున్ మద భర్మి చాయయున్

గ్రాలు లతాంత కోమల రెయి ♦ కర్త ప్రియుండు సురక్ గ్రహింపఁడక్
మేలి గుణంబుతో సదియు ♦ మేకొన దానఁగ నుత్సహింపదుక్. ౯౮౧

తే॥ ఒకతె కోపాభినయ మూను♦నొఱప్పు దోఁపఁ,గన్ను లెఱుపొందనొసలు వ♦క్రతభజింపఁ
బండ్లు గొఱుకుచు సులలిత ♦ పల్లవముల, తిమురడఁచు కర తలములఁ ♦ ద్రిప్పుచుండె

చ॥ చలనమునొందు మోవియను ♦ జానగు నెట్టసి దొండపంటిపైఁ
జెలి నెల కాతులంగినిసి ♦ తేటిన తెల్లని పండ్ల నొక్కుచుక్
దొలఁకుచు శత్రు రక్తమునఁ ♦ దోఁగిన ప్రాసముఁ బోలు కన్నులక్
జిలుకకి చూచు చెల్వ మయిఁ ♦ జెమ్మట గ్రమ్మెను చిందు కల్లునాక్ ౯౮౩

ఉ॥ పండిన మోవి దొండపయి ♦ భాసిలు రక్తిమ రెండుకన్నులక్
నిండఁ, దలంచు టొక్కటియు ♦ నేర్పునఁ బల్కుట యొక్కటైన యా
యండజయాన మోమసెడి ♦ యబ్జములోఁ గల కన్నుబొమ్మ కో
దండను వంగెఁ గంపనము ♦ దాల్చెఁ జెమర్చెను భాలచంద్రుఁడుక్ ౯౮౪

ఉ॥ బూరుగపూవు కీవి గల ♦ మోవి మెఱుంగునువీడఁ బండ్లయం
దూరిన నీరు తేనెవలె ♦ నొల్కఁగ, ఆొమ్మన తైకతోడుతక్
జీరయు జాఱ, వేసలియుఁ ♦ జిక్కయి జీరుకులాడ గేలి న
వ్వారఁ బ్రియాభిషంగమము ♦ నాసవ సేవయు నొప్పె సామ్యమై ౯౮౫

తే॥ అసమశరునిచే వలవంత ♦ నందుచున్న, యొర్తి ప్రియుఁ దేరఁ జేటిక ♦ నొగిని పంప
నెంచియోచెలీ!నీవునా♦యెడఁదవలెనె,యచటనేయుందొ?మరలుదొ?యనుచుఁబలికె

క॥ హరిణాక్షి యొకతె తనప్రియు, వరుఁ బిలువగఁ జెలులనెల్ల ♦ వరుసగఁబంపెక్
దరువాత వారివెంటనె♦తరలె నొకర్తుకయు తాను ♦ దయితుని కడకుక్ ౯౮౭

క॥ వలచు విరి సెజ్జపై దరి, దెలియని మోహాబ్ధి మునుఁగు ♦ తెఱవ యొకతె తీ
పొలయఁగ వల్లభు పేరులఁ, బలుకు చిలుకఁ గౌఁగిలించెఁ బ్రాఁతి♦ తొలంకక్ ౯౮౮

క॥ వనజాక్షి యొకతి శయ్యను, దన తోడగు చిలుక నలను ♦ దయితుఁ బిలువ కే
మనియెదు? జక్కవతో నీ, వును తాపము గూర్తె? యనుచు ♦ బోరున నేడ్చెక్

క॥ తన సవతి పేర దయితుఁడు, తను పిలువఁగ నవ్వు వచ్చెఁ ♦ దరలాక్షికి వెం
టనె కనులనుంచి పలపల,మని బాష్పకణంబు లురలె ♦ నలుకయుఁ దొలఁకక్. ౯౯౦

తే॥ మునుపు దొనఁగుచేయుప్రియుండు♦నెనరుదోఁపఁ, బిఱుఁదు మొలనూలిపైఁ గేలు♦
ధరుణికన్నులనశ్రుము♦ క్తములునేల,జిందెఁదెగుమేఖలామణుల్ ♦చెదరుమున్నె[ వెట్టునంతఁ

చ॥ అలుగుదునా ప్రియుం డిటకు ♦ నచ్చిక బుచ్చిక సేయ వచ్చినక్
కలియుదునా యెదం గలుగు ♦ కంతుని వంత తొలంగు నట్లుగా

పలుకుమనా మనోహరు న్వ ♦ భావ విశిష్టత వీణ మీటుచున్
దెలుపుమనా మనోవ్యథను ♦ తేటగ నంచొక యింతి చింతితిన్. ౯౯౨

క॥ ఒకరిత తన వాలయల్కను, సకులకుఁ దెలుపకయె వీణ ♦ చయ్యనఁ గొని హ
స్త కమల మెత్తిన యగునటు, సుకముగఁ దన మదిని గలది ♦ చొక్కఁగఁ బాడెన్ ౯౯౩

క॥ కాంచును శకునం బొకసతి, కాంచిన యపు డెల్ల నసువు ♦ గానని వగచే
నించు విలుతు నేటుల నుసు, అంచితముగ వెడలఁ బాఱు ♦ నస నిట్టూర్చున్. ౯౯౪

తే॥ కందుకమున కందం బిడు ♦ సుందర కర, ప్రియుని పిలువఁగా జోటి నం ♦ పినది యంత
లోన వచ్చె నన్నంతఁ ద ♦ ల్పులను మూసె, నామె తలఁపేమొ యెఱుఁగశ ♦ క్యంబుగాదు

క॥ అమరిచిన పానుపునఁ జెలి, యమర్షముఁ దొలంచు త్రోవ ♦ యరయని దయితున్
విమలాంగి కల్ల సోమరి, తిమురున నీలుగుచు నడిగెఁ ♦ దిన్నగ గడియల్ ౯౯౫

క॥ పదరి యొక తె లత్తుక గల, పదమునఁ దాఁపగఁను నిండు ♦ వపువను చేనన్
నెద వేయఁగ వల మొలకలు, పొదలె ననన్ గగురుపాటు ♦ పుట్టెఁ బ్రియునకున్ ౯౯౬

తే॥ పగఱ నోరిచి మరలిన ♦ బంటొకండు, సుందరీ స్తనములు కృశిం ♦ చుటను గాంచి
పొంగి తన్ను మించిన ము ♦ దం బున మొగంబు, తేటనొంద భుజంబులు ♦ మీటనిలిచె

తే॥ లలిత సుందరుఁ డొకఁడు త ♦ ల్పంబుఁ జేరి, కంతు సంపద యెల్లెడఁ ♦ గప్పి యున్న
పగిది నొప్పు పానుపు మీఁది ♦ పల్లవములు, మాఁడుటం గంటఁగని దిగ్భ్ర ♦ మంబునొందె.

తే॥ కలప ముడుకు తాపము గల ♦ కదనవిజయ, వరునకుం బ్రియురాలిబొం ♦ గరపుఁజనులు
తనకు నభిషేక మొనరింప ♦ ఘనులు నిలుపు, కనకపూర్ణ కుంభములను ♦ గరిమఁగాంచె

ఆ॥ కనక లతిక ప్రియుని ♦ కడఁ జేర నుంకించి, గజ్జియలును రశన ♦ కంకణములు
దొలఁగఁజేసి వారపు ♦ గల చందురుని మదిఁ, గనలి యుఱివిఁ చూచి ♦ కడఁక మానె.

క॥ నవ మదనున కొక్కర్తుక, తవిలి పువ్వులు కోసి చుట్టి ♦ తార్చిన సరికిన్
బవి భుజ యుగళము లొంగెను, బువ్వ సరము బలంబు నేము ♦ పొగడం దరమే?

తే॥ కుటిలకుంతల తనలోని ♦ కుములు దెలుప, మన్మథుని గాంచి తన చెలిన్ ♦ మరలఁగాంచె
నింతియుద్దేశమును గ్రహిం ♦ యించిసఖియు, సుందరుఁడుచను త్రోవను ♦ చూడఁదొడఁగె

తే॥ రాజవీరుని కడ కొక ♦ రమణి వెళ్లె, నాతిఁబిలిచిన దూత మ ♦ నంబుఁ గలఁచు
మధువొ? మాకుతమో? మాపొ? మరుఁడొ? యేమొ? అరసిపలుకంగ నేరికి ♦ నయితిగాదు

తే॥ పొంగినట్టి మోహామునకు ♦ లొంగి వాన, వంటి చల్లని కనుల బా ♦ ష్పములు రాల్చ
నేమి మూఁడెనె యని హితుం ♦ డెదుర నవ్వ, నవ్వె సిగ్గు వీడిన చెల ♦ నాఁగ యొర్తు.

తే॥ లేమి నెలవగు కటి గల ♦ లేమ కనలు, ప్రబలఁ దడవిన చేతి న ♦ వ్వాలికిఁ ద్రోచెఁ

ద్రోచునా చేష్టయాస్త్రీయు • నుమ్మనందు, కంతుసుం గ్రుచ్చుటం బోలెఁ • గుములఁ జేసె

ఆ॥ చెలిమి కలిమి గలుగు • చెలి చేయి దడవుచుఁ, జెలువుఁ బిలువుమంచుఁ • జెప్పఁబూను
దను యెడంద సిగ్గు • తెలుపు త్తుఁ జెప్పకో, రంత ప్రొద్దు నిలిచి • యలమటించు. ౧౦౦౭

ఆ॥ సుడిసి వలపు పైకిఁ • బొడుచుచుండ నొకర్తు, బయలి ప్రాణమైన • వలపుకాని
చేష్టలెల్ల సఖికిఁ • జెప్పంగ నంకించి, బిడియమంది నేల • నుడువ లాడె. ౧౦౦౮

తే॥ ఒక తెయుల్లమునఁ ప్రాణము • నొకతెనిండు, ప్రేమయొక సాటి చేయైన • ప్రియుఁడుఁ బ్రియయు
నొడళు లొకటి చేసంగఁ బోలు • నొత్తిబిగియఁ, గౌఁగిలించికొనిరి వారు • కాంతు లూఱ

క॥ సుందరుఁ డెదు రగుపడ మనసు, ముందేగ మనంబుఁ బోలు • మొగమును ద్రొక్కెన్
సుందరునకు నది క్రొత్తగు, చందముగా సిగ్గు ప్రాచెఁ • జానకుఁ బోలెన్. ౧౦౧౦

చ॥ పలుకు లయాలుకఁ బసించు వల • పుం గొని దత్తల మూహ సేయు చా
పలమతి యొత్తి కొంటిమెయి • వల్లభుఁ జేరక రేయి వోలెఁ గ
ర్వలివలెఁ జేటి చేరఁ జని • బంధుర దేహ! యిదేటి తీరు? పైఁ
జులుకఁ దనమ్ము గాదె? యని • సూక్తులు పల్కెను తల్లి పోలికన్. ౧౦౧౧

తే॥ సంజదయ్యును దాఁకిన • సరణి నొప్పు, వలపరి యొకర్తు తల యెత్తు • నిలుచుఁ జూచుఁ
బలుకుపదిదేమొ యొయ్యఁ గదు • చెలువుఁ బిలువ, బంపు దూతితోఁ దన తెల్పి • సంగ పెనేమొ?

తే॥ జనసమరణచక్రమునం దెల • సంచలించు, మనసుతో మొయిలునఁ దోఁచి • మరల మఱుఁగు
మించువలె బయటికి వచ్చి • కాంచుఁ బిదప, నేగుచుండు లోనికి నొక • యించుఁ బోణి.

తే॥ మకరికా యోగ్యసం చన • ములల మీఁద, కంతుతూపులు తొలిచిన • గాయములను
కేల నదుము నేడుచు నవ్వుఁ • గినుకఁ జింత, వెల్లడించుఁ బొమ్మని దూతి • వేఁడు నొకతె

తే॥ సంభవము నార్తినెఱిఁగిన • జనులయొద్ద, జెప్పికొనుటలు వృథయని • చెమ్మరించి
యుడికి కృశియించి పడకపైఁ • బడుచు నొర్తు, ప్రక్క నిలిచిన చేటిని • పాఱఁ జూచె.

తే॥ లికుచకుచలగు కన్యకా • లికిని మించి, బ్రమయుచున్నాఁడు మదులందు • పచ్చకాని
కరణిఁ జొచ్చి వారలు ద్రావు • కల్లు తేటఁ, ద్రావెగాఁ బోలుఁ బూని క్రొఁగం • దర్పుఁ డిపుడు.

తే॥ తరుణులం గూడ రశన లం • బరము లూడ్చి, తొలఁగఁ జేసిరి వల్లభుల్ • తుదముపంటి
వారలేనియు వెలి వఱు • పంగఁ దగని, చెయ్వులొప్పార దగ్గఱఁ • జేరఁ దగునె? ౧౦౧౭

తే॥ బయలి మేఖలల్ వలువలు • వదలఁ జేయు, టబ్రమే? యొర్తు బిడియంబు నవలఁ ద్రోచె
నాద పదిలంబు గలుగు సన్న్యాసి వలెనె, తన్ను సన్న్యసించుటయు ని • త్తఱిని గలదు.

తే॥ తరుణుఁ డొకఁ డొక తరుణి కం • దర్ప కదన, మందు సములైరి హెచ్చుతగ్గ • రయరాక
యిరువుర తలంపులూపిరు • లేక మయ్యె, నన్న చో నెవ్వ రందు గెల్పందువాఁడు. ౧౦౧౯

తే॥ ఒక్కరుఁడుకరముఁదనయురమునమూయ, నెదనుపసియించుప్రాణనాయికకుఁబోటు
గలుగు నని వంచనమ్మునఁగిరితలముప, మూయుచున్నాననుచు నొత్తయందిత కసరె.

తే॥ పగడపు మొక్క వక్షోజపర్వతములు, మృదుల హస్తముల్ భల్లంబు. నెనయుఁకనులు
గలుగు సతియోర్తు వలపులకడలిమైసె, ప్రియున కట రంభవలె మేటిప్రేమ నొసఁగె.

తే॥ వలపు కాని యసత్యవాక్యులఁ దలంచి, మేర లేని కోపముగాని మూర కదన
మందు మగపోఁడిమింజేసి యడఁగి యున్న, యాసయేగెల్వ నొకచాముయతిశయిల్లె

తే॥ హింస్ర సాధనములు రూప మెనసి నట్లు, మెఱయు కన్నుల చెలి తన యొఱపు కాని
నలమి గుబ్బలి గెలుచు గుబ్బలు కడిందిఁ, విభు నురము దూసి చనెనని వీఁపుచూచె.

క॥ చెలువల క్రొత్త వలపులను, వలకాండ్రు భజింప గంధ పంక మురలె వే
నలు లూడె గాజులందెలు, గలగల మనె సంచలించె గటి సూత్రంబుల్. ౧౦౨౪

క॥ కలువల దాయ యువము వలె, వలపు కినుకఁ దోల నొకతె వడి నొడికముతో
బలు కల్ల నిద్దురం గొని, కల సాకున నొరిమకానిఁ గౌఁగిటఁ జేర్చెన్. ౧౦౨౫

తే॥ ఇందు బింబాస్యయును తన హితుఁడుఁజేరు, తిరుణముబ్బుటచేదాసిఁదలఁగద్రోవ
కొడలి నొడలింగోఁ బైనవై చిమొదయిక నెద, నరయరై రియుదయమూటయరయరై రి

ఆ॥ కాంతలూఱునుత్సు కత వరులకు. వక్ర, కుంతలలకు రతులఁ గూర్చ రేయి
వలుఁద చనుల మోయుబలిమిఁ గాంచని మధ్య, ముబను పోలి కార్శ్యమనుభజించె

ఉ॥ పున్నెపుఁ గర్జముల్ తొడఁగి పూర్తి యొనర్పని వారి సంపదల్
చెన్నుగ మధ్య వచ్చుచు న శించెడు రీతి విధుండు క్రుంకెఁ బై
వెన్నుని ఱొమ్మునం బరిఢ విల్లెడి కౌస్తుభ రత్న లీల వా
రాన్నిధియందు దోఁచె గ్రహ రాజు జగంబులు తెల్వినొందఁగన్ ౧౦౨౬

## ౧౮. ఎదురుకోలుపటలము. (౩౪)

సీ॥ చెడు నీతి త్రోవలలోఁ జెల్లక ధర్మశా, స్త్రానుగుణ్యంబుగ నరుగు నెఱుక
నయము దప్పని పాల నము గల్గు దశరథ, చక్రవర్తియు గొప్ప సామజముల
మద జల ధారల సదులు పాఱుచునున్న, సేనా సముద్రంబు చేరి కొలువ
నాగలోకంబును బాగుగాఁ గనఁబడు, పరిశుద్ధ సైకత ప్రభలు గలుగు

తే॥ త్రిపథగం జేరఁగా నాయు ఖీయమైన, సైన్య వారాశి లజ్జల సమితిఁ గ్రోలె
దానిఁ గాంచిన యుప్పు సం ద్రంబు గూడఁ, దేట నీరు ద్రావెడు నాస దీటుకొనఁగ

తే॥ పృథుల కేదార వేష్టిత మిథిలఁ జేరు, నంత దశరథు రాకకు నలరి జనక
వల్లభుఁడు మహోదారుండు వార్ధి వలెనె, పొంగి యెదురుకోల్వచ్చె విభుత వెలుంగ

మ॥ ప్రబలోత్సాహము చెంగలింప మద సా ♦ రంగంబులున్ దేరులున్
విబుధశ్రేణి తురంగపాళి బలయున్ ♦ వీరావళుల్ గొల్వ న
వ్విబుధేంద్ర ప్రతిమానుఁ గోసల విభున్ ♦ వీక్షించి తోడ్తేర ధీ
ర బలుండౌ జనకుండు వోయె రవిఁ జే ♦ రం బోవు చంద్రుండు నాన్.

శా॥ గంగా ప్లావిత భూ విభూత్తము చమూ ♦ కాండంబు షడ్వారిధుల్
తుంగోద్వీచుల శంఖ నాదములతోఁ ♦ దోతేర శ్రీలక్ష్మి నా
రంగం గాంచు సుధాబ్ధి సంతసమునన్ ♦ బ్రత్యుద్గమంబైన జో
కం గన్యామణి సీతఁ గాంచు జనక ♦ క్ష్మాపాలుఁ డేగెన్ వడిన్. ౧౦౩౨

తే॥ పరఁగ నశ్వత్థ దళ రూప ♦ భల్ల సమితి, యడరు దశరథుసేనకు ♦ నబ్ధి సప్త
కంబు చతురంగ బల రూప ♦ గరిమ నొంది, జగము పరవంగ నదియ పో♦సాటియగును

తే॥ జాలరులు జాలువారు మ ♦ త్స్యాల గొడుగు, లోలి పీలి కుచ్చులు గప్ప♦నుప్పరంబుఁ
బగలు మఱిఁగి యిరులు గ్రమ్మఁ♦బ్రభుని సేన, రంగు పూవుల పద్మాక♦రంబుఁబోలె

మ॥ కమలాదేవికిఁ గాణయాచి విపుల ♦ క్ష్మాపాలు పెక్కండ్రో? వ
క్షమొ? కోటీర మొ? నిస్తులీ కృత వళ ♦ క్ష చ్ఛత్రమో? సత్కుల
క్రమ సంపాదిత రాజ్యమో? బహుళ సం ♦ ఖ్యం బొల్చు సైన్యంబొ? బల్
శ్రమలం జెందియు నిర్ణయించి పలుకన్ ♦ శక్యంబె యెవ్వారికిన్? ౧౦౩౪

సీ॥ కంచుకాపూర్ణ కు ♦ చాంచితోరస్కల, నీలవేణికలంపు ♦ నిండుతేంట్ల
ధ్వనులనే పోలు నా ♦ దస్వర సప్తస్వ, రారావములు బహు ♦ వ్యాప్తి గనియె
రథనేమి రవము వా ♦ రాశి ఘోషముఁ బోలె, గజ ఘీంకృతులు మేఘ ♦ గర్జఁ బోలె
జగతి పరిఖయైన ♦ జలధి మెరకగాఁగఁ, బెంధూళి నిండి యా ♦ పిదపఁ బైని

తే॥ యేడు లోకంబులను ముంచి♦యెసఁక మెసఁగె, ననుట తేలిక మాటయా♦నసుర వైరి
జగములం గొల్చు పాదము ♦ చన్న త్రోవ, నేగి యావలి లోకంబు♦ లెల్లఁ బ్రాకె. ౧౦౩౬

తే॥ పరవు గొడుగులవరుసలు♦ప్పరముగప్పఁ, గలుగునిరులఁదొలంచుట♦సులభమె యగు
మణి విభూషలు వెన్నెల♦మరపు దెచ్చుఁ, గొరడువైచు నెండయుఁగాయు♦ మెఱుపుమెఱయు

తే॥ కోసలేశుండు రా జన ♦ కుండు గరిమ, నెదురు వచ్చు పథము లెల్ల ♦ హేమరజము
గందవొడియుఁ బుప్పొడి పచ్చ♦కప్పురంబు, పెక్కు వగల తావుల ధూళి♦ బెరసియుండె

తే॥ పునుఁగు కస్తురి కుంకుమ♦పువ్వునగురు, కలిపి చల్లఁగా నైన పం ♦ కంబుతోడఁ
గరుల మద జలధారలు ♦ గలిసి పాఱ, నైన బురదలే వీథుల♦యందు నిండె. ౧౦౩౮

తే॥ నీడ లన్నియుఁ బరిమళ ♦ నీల కచల, కనక రత్న భూషల కాంతిఁ ♦ గలుగు నవియు
పిడయ చిహ్న పతాకలు♦ పెరియు మేలు, కట్లు గొడుగులు గప్పఁగాఁ♦ గలుగునవియు.

తే॥ దశరథుని సేనతోడ ను♦త్కంఠమెయిని, జనకు సేనయుఁ గలిసె ఘో ♦ షణమునిండ
ఘన తరంగాకులారావ♦కంధియందు,నదులు చేరఁగా జరుగు వి♦న్నాణమొప్ప.౧౦౪౧

తే॥ జనకుఁ డుత్సాహమున లోక♦జనకుఁ డనఁగఁ,దగిన దశరథు రథమును ♦ డాయవచ్చె.
రథికవరులతోఁ దన మనో♦రథమువంటి, రథముపై నాసఁ బోలిన♦రయము మెఱయ.

ఆ॥ డాసి తేరు డిగ్గి ♦ మీసరంబగు సేన, వెనుక నిలువ మున్ను ♦ వెడలు నతని
దశరథుండు కేలు ♦ తగఁ జాఁచి యరద మెక్కించికొనియెఁ గౌఁగి ♦ లించికొనియె.

తే॥ పులియెదుటి సింగముం బోలి♦పురుషవరుఁడు, చెలిమి బంధు మిత్రాదుల♦సేమమడిగి
ముందు జరుగ నిమ్మన ముద♦మంది యెల్ల, వారు మిథిలాపురంబును♦చేరినారు. ౧౦౪౪

ఆ॥ ఇట్టులింపుపెంప ♦ నిరువు రేగుచునుండ. తన్ను దాన పోలు ♦ ధన్య గుణుఁడు
శివుని ధనువు విఱుచు ♦ శ్రీరామచంద్రుండు, జనకు జనకు నెదురు ♦ కొనఁగ వచ్చె

ఆ॥ విబుధ మనుజ నాగ ♦ వినుతుండు రాముండు, బలసి వీరవరులు ♦ గొలిచి రాఁగఁ
దమ్ముతోడఁ దాను ♦ తపనీయ రథమెక్కి, వచ్చిచేరెఁ దండ్రి ♦ వాంఛవోలె ౧౦౪౬

తే॥ దశరథేశు నెదుర్కొనఁ ♦ దరలుసేన, లోన నేనుఁగులో? పిడు ♦ లో? హయములొ?
లెక్కపెట్టంగ మానంబు లేకయున్న, యా సమృద్ధిని పలుక శ ♦ క్యంబె తెలిసి?౧౦౪౭

సీ॥ నీలోత్పలమ్ముఁ ద ♦ మాల పుష్పముఁ బోలి, చిత్రసౌందర్యంబు♦చెడఁగ నొప్పి
యమర వినుతమైన ♦ యడుగుఁదమ్ములు గల, పిన్నవాఁడగు రామ♦విభుఁడు మున్ను
వదలిన ముఖ్య జీ♦వమ్ము పిదప వచ్చి, చేరిన కరణిని ♦ చేరి యంతఁ
దక్కువారు తనకు మ్రొక్కుచుండఁగఁ దన, కన్న జనకు పాద♦కమలములకు

ఆ॥ వినతుఁ డగుచు లేవ♦మనువనఁ దగు దశ, రథుఁడు గాఢముగ ను♦రమ్ముఁ జేర్చి
యలమికొనియెరుద్రు♦విల్లుద్రుంప మున్నెగు,మహితబాహు గిరులు♦మఱుఁగుపడఁగ

ఆ॥ తొలఁగ వీలుకాని♦దుఃఖమ్ము మొత్తమ్ము, మాయ మైన యంత ♦ తమ్మ విభుండు
లలిత రీతి మ్రొక్క ♦ లక్ష్మణుఁ గ్రుచ్చిక, వుంగిలించికొనెఁ గ ♦ రంగుప్రేమ. ౧౦౪౯

ఆ॥ భవుని ధనువు ద్రుంచు ♦ నవ మన్మథుండంత, మరలి తల్లులకు న ♦ మస్కరించె
వారి యెడఁదఁ బొడమి♦పారమ్ము మీఱిన, సంతసంబు దెలుప♦శక్తు లెవరు? ౧౦౫౦

తే॥ మేటి భక్తి యతిశయించి ♦ తేట యైన, కరణిఁ గన్నీటి కణముల ♦ సరము లురల
మ్రొక్కు భరతుని తను తండ్రి♦మున్ను తడవు, పగిదినురమున, జేర్చె జీ♦వములఁబోలె.

శా॥ శ్యామాకారునితోడ వచ్చు ఘనుఁడౌ ♦ సౌమిత్రియుఁ గా విస్ఫుర
త్ప్రేమాకారునితోడ వచ్చు గుణవ ♦ ద్వీరుండు శత్రుఘ్నుఁడుం గా
ప్రేమ శ్యామల రూప భూషణములై ♦ పెంపారు పాదాబ్జముల్
మోముల్ చేరిచి మ్రొక్కఁ జేర్చికొని రా ♦ మోదంబుతో షట్పదుల్

తే॥ నీతికరుణలే విభుని ♦ ఖ్యాత ధనము, లని యెఱింగిన తమ తండ్రి ♦ ననుగమించి
యనుప మాగమోక్త క్రమ♦మనుసరించు, సుతులు పలువురు చూపఱు♦ సూడ్కి గొనిరి

ఆ॥ సాక్షి యనఁగఁ దగ్గ ♦ సత్పరిపాలన, మడరఁ దల్లిఁబోలె ♦ నమరువాఁడు
దశరథుండు పిదపఁ ♦ దనయుని వీక్షించి, వైభవంబుతోడఁ♦బదము యనియె. ౧౦౫౮

తే॥ కరులఁ బోలిన యావీర ♦ వరుల ప్రేమ, మెంతిదో? వారికౌతుక ♦ మెంత పొడవో?
కనఁగలేము కుమారులు ♦ కదలునంతఁ, బరిజనోత్సాహ మాతండ్రి ♦ పగిదిఁ బోలె.

తే॥ ప్రేమమయులగు తమ్ములు ♦ ప్రక్కలందు, సమ్ములై వేడ్కతోఁ దురం♦గములమీఁద
రాఁగ నున్నత రథముపై ♦ రాముఁ డేగె, భేరి మున్నగు వాద్యముల్ ♦ బోరు కొనఁగ

తే॥ పరవి యభ్రంక షోత్తుంగ♦ భర్మ హర్మ్య,ములను చిత్రాకృతులఁబోలు♦ పొలఁతిగముల
విసము నిండిన ట్లుండిన ♦ వీక్షణములు, పుష్ప వర్షమె యన నొప్పఁ ♦ బురము సొచ్చె.

సీ॥ అందంపు మేడల - యందెల్ల కర కంక, ణంబులు మొరయ వే - నలులు విరియఁ
జెందమ్మి పాదమ్ము -లం దాల్చు నందె లా, గమ పద్ధతుల తాళ - గతులు దెలుప
కుంభి కుంభంబుల - దంభంబు చెడ డంబు, నింబారు వక్షోరు ♦ హంబు లొప్పు
పన్నుతాంగులు గల - సౌధంబు లెల్లను, సత్తరనశాల లే - నాఁడుఁ గావు

తే॥ దేవదేవుండు శ్రీరామ♦భూవరుండు, దరియ నా బాలికా ప్రౌఢ ♦ మరసిమరుఁడు
ప్రణయము సేయ వారు గా♦ వించు చేఁత, లెలమి నవధరింపఁగఁ గుతూ♦హలులుగండు.

## ౧౯. విహార పటలము. (౫౪)

సీ॥ పూలచేఁ దరియు క్రొ♦మ్ముడు లొప్పు పడఁతులు, జింకలగుంపులు♦చేరు పగిది
బర్హి సంఘంబులు ♦భ్రమియించుటం బోలి, ఋక్ష బృందము తేజ♦రిల్లు కరణి
మెఱుపుల రాసులు♦ మెఱసిన కైవడిఁ, దుమ్మెదల్ జుమ్మని♦క్రమ్మి యార్వ
జాఱిన క్రొమ్ముడుల్ ♦ సవరించుకొనకయు, మొలనూలు తెగుటయుఁ ♦ దెలియకుండ

తే॥ పైఁటలుం జాఱ నవదరిం♦పక యుఁగౌను, లులియ లెక్కింపక యుడాసి♦ తొలఁగు తొలఁగుఁ
డనుచు మధువ్రు గ్రోలఁగ వచ్చు♦నళులయట్లు, సరభసంబున మునసరి దు♦త్సాహ గరిమ

సీ॥ కనులతోనే ప్రేమ♦ యను వస్తు రూపంబు, గాంతము గాక యో♦ కాంతలార!
ఈ నాతి జన్మంబు♦చే నొందఁ దగు ఫలం, బీ నాఁడె కందమో♦యింతులార!
రాతికిఁ దొలిరూపు♦రమణఁ గావించిన, పదములఁ జూతమో♦పడఁతులార!
కను బరువైన శ్రీ♦కంతు విల్విఱిచిన, కరము లీక్షింతమో ♦ కలుకులార!

తే॥ అనుచు నీటి యెద్దడి నొచ్చు - హరిణ చయము, విమల జల పూరముం గన్న - విధిని పల్ల
ముకుఁ బాఱు జలముఁ బోలి - మనసు పఱవఁ, బట్టఁ బరుగిడు చందానఁ - బరుగు లిడిరి

ఉ॥ నూనుగఁ దేరిపై నగర - మార్గమునం జను రాముఁ డప్పు డ
న్నే నయనంబు లార్పక ర - హించి కనుంగొనుచున్న యట్టి కాం
తా నికరంబు కన్నులనె - దప్ప కెలుంగఁగఁ జేసె నుత్తమ
జ్ఞానులు తన్ను కృష్ణుఁ డను - నామమునం గల యర్థ మంతయున్. ౧౦౬౧

చ॥ తలఁపును మించి యీతని ర - థంబు రయంబునఁ బోవ కీచ్చటన్
నిలుచునుగాక యంచుఁ దరు - ణీ మణు లెల్లఁ దపించుచుండఁగా
నిలను దివంబుఁ గొల్చిన ర - మేశుని రాఘవు నప్డుఁ గంటి తె
ప్పల కటు దాఁటనీక నిలు - పం దగు మానిని యెంత ధన్యయో? ౧౦౬౨

చ॥ వలఁతి యొకర్తు స్త్రీత్వమును - నల్వయుఁ జిన్నెలు భూషణంబులున్
దెలివి తెఱంగు తేటయును - తేజము లజ్జయు మానసంబు స
త్కులము బలంబు గౌరవము - గోలతనంబును గాత్రమున్ స్వజీ
వ లవము దక్కఁ దక్కినవి - పాయఁగ నిల్చెను పుత్త్రికాకృతిన్. ౧౦౬౩

తే॥ కమ్మలం దాఁటి వెలుగొందు - కనులయందు, మబ్బువోలె నీరోడియుంగ - మరుశరమ్ము
లెడము లేకెద గాఁడఁగ - వడఁకె నొకతె, మొగులు లేని మించనఁదగు - మొలనుపోలి

మ॥ అలినీలాలక లెల్ల జెప్పలిడ కా - శ్యామాంగు మైయందముం
గలయం గాంచుటఁ జేసి నీలిమము నా - కన్నుల్ తగం బొందెనో
కలుకల్ కాటుక కన్నులన్ విరిసి యు - త్కంఠన్ విలోకించుటన్
నలుపై యొప్పెనొ రాము మేను తెలియం - గా రాదు సుంతేనియున్.

మ॥ చిగురుం బోఁడులు రాముపై విరులు వ - ర్షింపఁగఁ గందర్పుఁడా
పగిదిన్ వారలమీఁదఁ బుష్పశరముల్ - వర్షింప నొక్కర్తునున్
జగతీనాథుని చండశాసనము నీ - శ్యామాంగు చిత్తోన్నతిన్
దగవున్నేరక భీత నేత్రలకు బా - ధం గూర్చు వీఁ డెవ్వఁడే! ౧౦౬౬

చ॥ లలిత వరాంగి యొక్కతె య - లంకరణంబులు వీడి రాలఁగా
వలువ యొకండు మాత్ర కర - పల్లవమందునఁ జిక్కఁబట్టుచున్
మలఁగుచు నిల్చె శిల్పకుఁడు - మాటలఁ బ్రేమల దాఁటి నిల్చు పెన్
వలపునె ముద్దచేసి చెలు - వంబుగఁ దీర్చిన చిత్రమో యనన్. ౧౦౬౭

ఆ॥ గెలుపు హింస గలుగు - క్రేఁగంటి చూపుల, చెలువ యొర్తు నొసలు - చెమ్మరింప
మనసు సొక్క నిలిచి - మఱి యొండు గానక, రాముఁ డొంటి యున్నె - చామ! యనియె.

ఆ॥ మనసు కరఁగి యున్న - మగువ యొక్కర్త యీ, వంచకుం డెడంద - వచ్చి చొచ్చె
వెనుక కేగకుండఁ - గను ద్రోవ మూసితి, సెజ్జ గదికిఁ బోదు - చేటి! యనియె. ౧౦౬౯

ఆ॥ ప్రతిమఁ బోలు నతివ • రతిపతి శరములు; గణన గొనక రశన • కంచుకంబు
ప్రీల వచ్చి నిలిచి • ప్రేమమ్మె రాము మై, యొప్పఁగాంచు వారి•నుతిమి చూచె. ౧౦౭౦

తే॥ ఉత్సుకతతోడ నేతెంచి • యువతి యొకతె, దీర్ఘ చపల నేత్రంబులఁ • దేఱి చూచి
తృప్తివడి ప్రేమ గొని యెడ• తెఱపి లేని, లోని సంతాప మడరంగ•లోని కేగె. ౧౦౭౧

ఉ॥ తోరపుఁ గేశపాశములు • దొడ్డ కుచంబులు బల్ పిఱుందులున్
దూఱఁగనీక దట్టమయి - తోఁపఁగ, గన్నులఁ జూడలేక య
వ్వీరుని సారు గాంచు తమి - ప్రేరణ సేయ శుభాంగి యొర్తి యిం
పారఁగ వారి కౌనుల బ - యల్లనె వంగుచుఁ గాంచె సత్తఱిన్. ౧౦౭౨

చ॥ మదనుని సూన బాణములు - మానసముల్ గలఁపంగ వీథులం
జెదరిన భూషణావళులు - చిందిన గంధము జాఱు మేఖలల్,
కొదరిన తారహారములు - క్రొమ్ముడి జాఱిన ప్రూసరంబులున్
బొదలిన చోట్లు దక్క - మఱి - పుట్టదు వేఱగు తావొకింతయున్. ౧౦౭౩

సీ॥ భుజములఁ గనువారు - భుజములే కాంచిరి, పదములఁ గనువారు - పదులె గనిరి
ఆజాను బాహుల - యందంబు గనువారు, వానినే తప్పవా-ల్పకయె కనిరి
వాఁడి కన్నులు గల - వారిలో రూపంబు, పూర్తిగాఁ గాంచిన - పుణ్యు లెవరొ?
తమ మతానుష్ఠాన - ధర్మంబు చొప్పున, చెప్పంగఁ బడు మహా - చిద్విలాసు

తే॥ పెక్కురూపులుతోఁపనొ•క్కొక్కరూప, మొనరసద్భక్తిఁగాంచునొ•క్కొక్కమతము
వారిఁ బోలిరి వీక్షించు - వారలెల్లఁ, జారుతరమూర్తి రామ వి - హారవేళ ౧౦౭౪

క॥ తనుమధ్య యొకతె బ్రతుకుట, కనువుగ నతఁ డామె యెడఁద - నడఁగె జగముల్
దన కుక్షి నడంగించిన, ఘనాఘన నిభాంగుకంటె - ఘనులెవ్వారల్? ౧౦౭౫

క॥ చెలి యొకతె తేర్చి తొడిగిన, గలగల మనఁ బూవు రెమ్మ - కరణి నరిగి యా
వల వలవల నేమ్పుచుఁ జె, ల్వాల చేతులలోన మరలె - భవనంబునకున్ ౧౦౭౬

క॥ గిరి నిభ ధనువును విఱచిన, కరణిఁ జెఱకు విల్లు విఱిచి - కావఁగఁ దగదే?
వరవీర! దాసి ననియెన్, బిరుసు మనము గల యొకర్తు - బింకము చెడగన్. ౧౦౭౭

క॥ చెలి యొకతుక యనియెఁ దపః, ఫల మనఁదగు రాఘవుండు - బండిం దిగి క
న్నుల యెదుట నిలుకు త్రోవ, న్నిలిచిన యీ చేత కలయొ? - నిజమో? కపటమో?

క॥ కనకాంగి యొకత మదినే, తన దూతిగఁ గొనుచు నునుఱు - తలరెడి చింతన్
వనజాక్షి జనకనందిని, మును ఘన తపములను చేసెఁ - బూనిక ననియెన్. ౧౦౭౯

క॥ పొచ్చెంబు లేని చిత్రపు, టచ్చనఁదగు పడఁతి యొకతి - యడలి బడలుచున్
ఓనెచ్చెలి! యీ దృశ్యము ఘురుఁ, డచ్చముగా వ్రాసి యుంచ - నగునే? యనియెన్

క॥ హరిణాక్షి యీ రాత్రి యాచయ, నరునకు నీ లక్షణములు - నలువొందునె? శ్రీ
వరుఁ డితఁడు నిక్కమియ్యది, యరయఁగలరు కన్నులార - నారయెఁ జెలులతో.

క॥ వనజాక్షి తోడవ్రు లూపఁగ, మనసు కరఁగ పాడి యితఁడు - మన పురమునకుం
జనుదెంచుట తొలిఁ జేసిన, జనకు తపఃఫలమె యంచుఁ-జక్కఁగఁ బలికెన్. ౧౦౮

క॥ కను లశ్రులు రాల్ప నొకతె, తన యొడ లొడికంబు వీడఁ - దపియించి యితం
డనుఁగులు మునులును విడివడ, వనట నొలఁగఁ గలనునేని - వచ్చునె? యనియెన్

క॥ జలదమ్ముఁ గాంచిమురియు నె, మలిబోలెం గనక లతిక - మది వల దాఁచం
దలఁచె, నది మారుఁ డెఱిఁగెను, తలఁపుల మది దాఁచినట్లు - దాఁచునె మోమున్?.

ఆ॥ వాలుగంటి యొకత - పూల పానుపుఁ జేరి, పిడుగు మ్రోఁత విన్న - పడగదారి
చాడ్పు మిట్ట యిఱుకు - చన్నులు చెమరింప, బుద్ధి చెడఁగ నూర్పు - పుచ్చుచుండె

తే॥ చెంగలువఁ బోలి యమృతంబు-చెంగలించు,నధరబింబ లిట్టులు లోన-నలయుచుండ్రి
సీత చేసిన వ్రతములు - చేయకుండు, వార లెటు లుండఁ గల రాత్రి - వడయకుండ.

తే॥ ఒడలు చెమరించి ప్రాణంబు-లుడుకు నొకతె,విమలుఁడగురాముఁడింతేని-ప్రేమతోడ
నొకరిఁ జూడఁడ తలఁపడ-యుబ్బు గొనఁడ,వలపుసుంతేని మదిలేని-వాఁడొ? యనియె.

చ॥ పురమునఁ గల్గు పైదలులొ - పూర్తిగ లెక్కకు మించినారు దా
శరథి శరీర సౌష్ఠవము - చాఁగురె! యెల్లయె లేనిదయ్యె నె
చ్చిరి చిరి కాతు మాత్ర మికఁ - జేయునదేమి?కరంబునందు పూ
శరములు వట్టిపో వయిచెఁ ♦జయ్యన మొగ్గ కటారి దూయుచున్ ౧౦౯

తే॥ భువిని వెలఁదులకే గాక ♦ దివిని గలుగు, నారులకుఁ గూడఁ గలిగెను ♦ మారు పోరు
లిచట నుండిన మన మద్ది ♦ యెఱుఁగ లేద, ఇచట విడిచిన శరములే ♦ యచటఁ దాఁకె.

తే॥ మోహమునఁజిక్కి భ్రమియించు♦ముగుదలింద, ఱుండనొకతెనేనిగొనమి♦యొప్పనేమి
ఇతఁడుసన్న్యాసియో?కాఁడు♦సతులపాలి, చెడుగుకొలకాఁడనుచునొక♦చెలువపలికె

తే॥ మఱుఁగు తాపము గల తను♦మధ్య యొకతె, కాలు సేతులు తూలఁగా♦సోలి పడియె
కనిన వార లయ్యో పాప♦మనుచు బ్రదుకుఁ, గాక!యనివచించిరి మిత్తి♦తాఁకెననుచు

తే॥ యువతియొక్క తెయుయ్యెల♦యూఁచ వోలెఁ,గాళ్లుకాయలుగాయ న♦క్కమలనేత్రుం
వెంటఁబడి కొంత దవ్వేగి ♦ పిదపమరలి, చేరె యింటి కిదెవ్వరు ♦ చేయు తీరు?

తే॥ ఉత్కటంపు మనోభ్రమ ♦ మొప్ప మగువ, లందొకతె మఱియొక గోల♦నరసియచట
నా మనముఁగూడఁగాంచితే♦నాతి!యనియెఁ,దలఁపుమితిమీఱు నెడసిగ్గు♦నిలుచునేమి?

క॥ ఇ న కులము వారు శరణం, బనఁ గాచిన వార లౌనఁగి ♦ యనువులనేనిన్

వనితల యనుజులం గోను టీ, తన కట్లబ్బె నను యొక్క ♦ తరుణి వచించెన్. ౧౦౯౪

ఆ॥ సిగ్గుచేత నెలవు ♦ చెడిన చంద్రబానన, హారుని ధనువు నితఁడు ♦ విఱుచు నెన్న
సీతకొఱకుఁ గాదు ♦ చేపడు పలుబిద్దె, వలఁతి తనము చూప ♦ వలచి యనియె.

ఆ॥ మేలి ప్రాణ సతి ♦ తూలు నొక్కరుక, ఘోర ధనువు దాల్చు ♦ వీరు నెదుట
మారుఁ డిట్లు మమ్ము ♦ మారాము సేసెడి, నెంత బల్లి దుండె ♦ యాతఁ డనియె. ౧౦౯౬

ఆ॥ వనిత లెల్ల రిట్లు ♦ వలవంత పాలుఁగా, విమల మానసుండు ♦ వినుత గుణుఁడు
చేరెఁ గౌశికుఁడు వ ♦ సిష్ఠుఁడు నృపవరుల్, కూడియున్న కొలువు ♦ కూటమందు.

ఆ॥ రాముఁ డంత మెఱపు ♦ భ్రమియించు తీరున, హాని తతి చలన ♦ మందు చుండ
కాలమేఘ మొందు ♦ నేల ప్రాలు కరణి, చాఁగి శిరము వంచె ♦ సన్మునులకు. ౧౦౯౮

తే॥ ధర్మమును గానఁ బుట్టిన ♦ తాటకారి, మ్రొక్కి దీవించి వారు కూర్చుండు మనఁగఁ
బుష్ప శిల్పంబు గల పసిఁడి ♦ పొన్ను గద్దెఁ, దమ్ము లిరుగడ నిల్వ మ ♦ ధ్యమునఁ గొప్పె.

క॥ నక్షత్రములు భజింపఁగ, ఋక్షేశుఁడు మిన్ను వెలుఁగ ♦ నే తెంచు క్రియన్
బక్షముల విభులు గొలువ న, పేక్షన్ మండపము దశర ♦ థేశుఁడు చేరెన్. ౧౧౦౦

తే॥ చేరి మునుల పదంబులు ♦ కోరి మ్రొక్కి, భూసురాశీఃపదములతోఁ ♦ బుష్పవృష్టి
గురియ నుచితాసనంబునఁ ♦ గూరుచుండె, నగవిభేదియు సిగ్గిలి ♦ మొగము వ్రాల్ప.

సీ॥ గంగరాజులును కా ♦ ళింగులు వంగులు, నంగభూపులును క ♦ ళింగవరులుఁ
బాండ్యులు చోళులా ♦ వంతికుల్ చేరులు, మాళవుల్ మాత్స్యులు ♦ మాగధులును
శకులు కొంకణులు సో ♦ మకులు చీనులు పుళిం, దులుతురుష్కులును చై ♦ ద్యులును పౌర
వులు కటినాటి ప్ర ♦ భులు తెల్గుదొరలును, యాదవుల్ నేపాలు ♦ రాదిగాఁగ

తే॥ నాదిభూతంబుచేఁ గని ♦ యంగఁబడిన, కడపటిదిది యగు పృథివిపైఁ ♦ గల సమస్త
రాజు లెల్లఁ గిరీట వి ♦ భ్రాజమాను, లగుచు వచ్చిరి పెండిలి ♦ కలవి లేక. ౧౧౦౨

ఉ॥ చక్కరబోండ్లు వీచు వెలి ♦ చామరముల్ భువనంబు లెల్లెడన్
నిక్కిన కీర్తి వృక్షమున ♦ నెక్కొను పల్లవ పంక్తియో యనన్
మిక్కిలియు న్వెలింగె; బహు ♦ మేదుర వంశ రుతంబుఁ బోలి పెం
పెక్కిన వంశగీతు లెల ♦ యించిరి ముగ్ధలు తత్సభాస్థలిన్. ౧౧౦౩

క॥ తన వంశంబునఁ బుట్టిన, జనకజ పెండిలిని సంత ♦ సంబునఁ గాంచం
జను దెంచు చంద్రుఁడో యనఁ, దనరెన్ దశరథుని గొడుగు ♦ ధవళిమ మీఱన్.

ఆ॥ ఉన్నచోటనుండి ♦ యొందుగంగ స్థలము లే, కునికిఁ జేసి గొప్ప ♦ యుదధిఁ బోలి
జనము చేరి నిలువ ♦ జనకు రాజ్యం బొక్క, పట్టనంబె యైన ♦ పగిది నొప్పె. ౧౧౦౫

తే॥ జనకరాజు కౌతుకమున ♦ సంపదలను, చల్లి సంతసించిన ప్రేమ ♦ జానకి యెడ
రామునెడ బీదలందును♦రాజులందు, రామునందును సమముగా♦వ్యాప్తినొందె.

## ౨౦. అలంకారపటలము . (౪౩)

చ॥ ప్రతిమలు ప్రాణముం గొనిన ♦ పాటిగఁ గ్రేవల రాణు గొప్ప నా
శత విభవేంద్రుఁడౌ దశర♦థ క్షితిపాలుఁడు సంతసించు నా
తతిని వసిష్ఠుఁ డారసి సు ♦ ధా మధురోక్తుల నిట్లు వల్కె- సీ
సుత సిరికిఁ బిల్వనంపుము య ♦ శోనయశౌర్యధనాఢ్య! మైథిలా! ౧౧౧౭

క॥ అనవుడుఁ బ్రియ మానందము, తొనఁకఁగ జనకుండు చెలుల ♦ తోఁ బ్రుక్కీజం
గొని తెండన వారలు వడి, జని దాదుల కత్తెఱంగు ♦ జానుగఁ దెలుపన్. ౧౧౧౮

ఉ॥ ఆరుచు జెప్ప లక్షలకు ♦ నందము గూర్ప నొనర్పఁబడ్డ యా
తీరున భూషణంబు లని ♦ తేటగు రూపముఁ గప్పనంచుఁ దా
నూరయలేక తీయఁదన ♦ మంబుధినెప్పరుఁ గూర్చు కై వడిన్
సౌరుకు సౌరు గూర్చిరి; వ ♦ సుంధర యజ్ఞత గొన్నదే కదా! ౧౧౧౯

తే॥ రామచంద్రుని మై వన్నె ♦ రామ యెడఁద, నెరసి తీఁగలువాఱి పై ♦విరిసె ననఁగ
నొప్పు కప్పుఁ గొప్పునఁ బూవు♦లొందఁ జెరిని, రంబుదంబున మందరా♦యందమంద.

తే॥ చుక్క లెల్లను తొగ తేనిఁ ♦ జుట్టినట్లు, నెత్తి నిండఁ బాపటబొట్టు♦నెత్తి కట్టి
యబ్జుఁ డను క్రేపుఁగన్నమ♦బ్బనెడిపశువు, చాఁచునాల్కనాఁగఁ దురాయి♦సవదరించి

మ॥ హర కోదండ విఖండనుం డయిన పీ ♦ ర్రాగ్రేసరుం డౌనె? ము
న్నరవౌ ప్రాణములున్ దపింప వలచే ♦ నుజ్జూట లూరించి నా
తరుణీత్వంబు గ్రహించువాఁడని యెడం ♦ దం జింత గావించు సుం
దరికిం దాల్చిరి యూఁగునట్టి మది చం ♦ దం బందు తాటంకముల్. ౧౧౨౦

మ॥ బలజాతాక్షుల కెల్ల భవ్యమగు ల ♦ జ్జం గల్గు కంఠంబులం
దిలకంబై తగు నీమె కంఠమునకున్ ♦ దీప్త ప్రభా భూషలుం
గలవే? మాపతి దాల్చు శంఖమె యిటం ♦ గల్యాణ రూపంబుతో
సలరె న్నాఁ జను కంఠమం దిడి రమూ ♦ ల్యంబైన హారావళుల్

ఉ॥ పన్నుగ మింటి రిక్కలను ♦ ప్రావగఁ గూర్చిన కోవ యందమా?
వెన్నెల జేనిఁ జిల్చి తటి ♦ వెట్టి కుదిర్చిన మాల యందమా?
చెన్నగు లజ్జతో నెనఁగు ♦ చిర్నవు వెన్నెల పర్వె నందమూ?
యెన్నఁగఁ దారహారము న ♦ యించిన పొందిక నేమనందుమో? ౧౧౨౧

ఉ॥ చిన్ని పదంబులన్ మఱుఁగు ♦ చేరెఁ దమ్మికి రాగ మిచ్చు నా
యన్నులమిన్న మేనఁగల ♦ యందము చందము సౌరు మీఱి పే
రెన్నికఁ గన్న చన్నుల ప ♦ యిందగు హారము దాల్చినంతనే
మున్న వళక్షమై పరఁగు ♦ ముత్తెము లెట్టిన యయ్యొ నయ్యెడన్. ౧౧౫

తే॥ అంగదంబులు దాల్చిన ♦ హస్తములకు, నొప్పులల్లార్ప మిఱుమిట్లు♦ గప్పు పద్మ
రాగములు ముత్తెములు గూర్పఁ ♦ గ్రాలుపట్టి, వెదురు గల్గిన సమత నొ♦ప్పి కొనవచ్చు

ఉ॥ రాగపుఁ గేలు దమ్మి రఘు ♦ రాము భుజంబులఁ దాఁక నోచి త
ద్రాగము నొందఁ బాత్రమయి ♦ రాత్రులలో ముకుళింపవంచు బా
గోగుల నెంచి చంద్రముఖు ♦ లొందగ మానికముల్ ఖచించుటన్
జేగుఱు మీఱు గాజులను ♦ చెల్వుగఁ దాల్చిరి సీత కంతటన్ ౧౧౭

చ॥ నెలఁత కుచద్వయం బనెడి ♦ నీలమణుల్ గల కుందనంపుఁ గుం
డల పయిఁ బుష్పవల్లి రతి ♦ నాయకు చాపము నేణనాభి సం
కలితముగా లిఖించి కడఁ ♦ కం బరమార్థముఁబోలె శంకచే
గలదని లేదనం దగిన ♦ కౌనును నొవ్వఁగఁ జేసి రెల్లరున్. ౧౧౮

తే॥ రంగు లీనెడు పట్టు వ♦స్త్రంబు గట్టి, రత్న ఝల్లరుల్ గల మొల♦త్రాడు చుట్టి
వివిధ కాంతు లొడలి నుండి♦వీచుచుండ, చెలులె భ్రమియించి నిలిచి రీ♦క్షింపలేక.

తే॥ లక్తకము లేకయే రాగ♦లహరి వీచు, పదములు శిరీషములకంటె ♦ మృదువులగును
వాని యందిడునందెలు♦వరుస మ్రోయు, మృదువులే మృదువులె మఱి♦మృదువులె యని

చ॥ సారిది విషంబు మధ్యమునఁ ♦ జుట్టు సుధం గొని కర్ణమూలముల్
నారసియు వంచకత్వమును ♦ నొంగుటికంబును లేక గోముగాఁ
బెరిఁగిన కన్నుదోయి నలి ♦ వేణులు నించిన యంజనంబొ? శ్రీ
వరుఁ డగు రాము మేని నును ♦ వన్నెయొ కాంచఁగ లేము నల్లనన్. ౧౨౦

సీ॥ అందమై విరిసిన ♦ చెందమ్మిలోన నిం, దీవరద్వయ ముప్ప ♦ తిల్లునేని
వానిపైఁ గ్రొన్నెల ♦ వంక నిల్చునయేని, తన్మధ్యమునఁ జుక్క ♦ తనరునేని
యెన యగు నని వచి ♦ యింపంగఁ జెన్నారి, త్రిభువన కన్యకా ♦ తిలకమైన
జనక కన్య నుదుట ♦ జాణైన కస్తూరి, తిలకంబు దిద్దిరా ♦ తెఱవ లంత

తే॥ వివిధ మధుపాళి ముసరిన♦ వివిధ వర్ణ, కుసుమ నిచయంబు మాలికల్ ♦గూర్చియుంచి
తుఱిమి చెరివిరి మొత్తిరి ♦ మురువుగాఁగఁ, బొన్న పుప్పొడిఁ బోలిన ♦ పొన్ను ధూళి.

తే॥ నేతి దీపంబు చుట్టి ప ♦ న్నీరు పువులు, చల్లి కుల దేవతల మ్రొక్కి ♦ తెల్లయావ
పోఁడి నొసట నుంచి మూరతి ♦బడిసి వైచి, రక్ష కట్టిరి సీతకు♦రాజ ముఖులు. ౧౨౩

తే॥ చిల్కలకుఁ బల్కులను నేర్పు ♦ సీత చెలువ, మళులవలె, నాని చెలువలే♦వలపుగొనిరి
ఏమి చెప్పుదు నావింత ♦ యెంచి చూడ, యువతులకు యువకుల కుల్ల ♦ మొండె కాదె?

చ॥ చెలువలు జానకీ రమణి ♦ చెల్వొను ఫున్నమ చంద్రుసట్లు క
న్నులఁ గని సొక్కి సోలిరి; జ ♦ నుల్ పరికింపఁగ వాంఛ నీయమై
పొలఁతుల కొక్కొకంగమె ప్ర ♦ పూర్ణ మనోహర రీతి నొప్ప నా
చెలువములెల్ల నొక్కయెడఁ ♦ జేరఁగఁ గాంచి భరింప శక్యమే?

ఉ॥ సంకు ధరించియుఙ్ గమల ♦ సద్మము నొందియు నెల్లవారి హృ
త్పంకజమందు చిత్రగతిఁ ♦ బర్వి తలంచిన యెల్లచోటులం
బొంకముగాఁగఁ గానఁబడి ♦ పూరుష వర్యుని రాముఁ బోలె నా
సొంకవగంధి సీత యిఁకఁ ♦ జక్కఁగ వర్ణన చేయు టెట్లగుఙ్? ౧౧౨౬

చ॥ పరవిన మేఖలల్ పసిఁడి ♦ పాప పటంబు మొగంపు టందియల్
కరములఁ గంకణంబులు ర ♦ కంబుగ మ్రోఁగఁగఁ గీరవాణు ల
ప్సరసలఁ బోలు సుందరులు ♦ సారసగంధులు పెక్కుమంది ని
ర్భర కుతుకంబుతో జనక ♦ రాజ కుమారిని గొల్చి చుట్టి రాఙ్. ౧౧౨౭

తే॥ గుజ్జులును గూనివారు స ♦ ఖులును బలయు, మణుల మేల్కట్టునీడ నా♦మగువమిన్న
చుక్కలందునఁ జందురు ♦ సొంపు దాల్చి, నవయకుండు జోతిం బోలె ♦ నడవసాఁగె.

తే॥ తన్ను గన్న భూదేవి యా ♦ తన్వి మృదుల, పాదములు నొచ్చునని నేలఁ ♦ బఱచినట్టి
ననలు నా నొప్పు తన మేటి ♦ నగల డాలు, ముందు పరవఁగ సీత జా ♦ నొంద నడచె.

తే॥ వినుతి కెక్కిన తనయాన ♦ మునకు నోడి, పడుచు లేచుచుఁ జను తెలి ♦ పక్షుల వలె
నిరు గెలంకుల వెల్ల చా ♦మరము లాలయు, బర్హి కాంతితోఁ జను బర్హి♦భాతి నడచె

తే॥ ఎల్ల లోకంబులందలి ♦ యిగురుఁ బోండ్ల, కంటి పాపయై యొప్పు నీ ♦ కన్య హావుసు
చూడ రామ వంశాద్యుండు ♦ సూర్యుఁడె దిగె,నాఁగఁ జనువితానము నీడ♦నడచివచ్చె

తే॥ మణి కలాపంబు చుట్టును ♦ మలసి వెలుఁగ, నడుమ దేహ కాంతి మిగుల♦నౌరుచూప
మండలాకృతి వెలయుంగఁ ♦ గుండలములు, కౌను చలియింప నడచె న ♦ క్కలికి మిన్న

తే॥ విరుల తావియు బంగారు ♦ మెఱుపు కాంతి, చందనపుఁ జల్లఁదనమును♦పొందియంచ
లచ్చరలు సుధ సిగ్గిల ♦ నవని పతులు, వఱలు రత్న ఖచిత మండ ♦ పమునఁ జొచ్చె.

తే॥ కల్పనాకర్త లేని యా ♦ గమ మనంగఁ, దగిన వలుఁద పాలిండ్లొప్పు ♦ మగువఁ గాంచి
స్త్రీలు పురుషు లెల్లరు వట్టి ♦ చిత్రములను, పోలి రాప్పక యూప్పక ♦ తూల పోక

తే॥ ఆమెయో? కాదొ? యని శంక ♦ నందుచున్న, ఇనకులేశ నందను డామె♦నెదుటఁగాంచె
ఖిన్నము పుట్ట నిర్వేదించి♦వెనుక నమ్మెత,ముద్ద విల్లు మూర్జిలు పురు♦హూతు రీతి ౧౧౩౫

తే॥ ముదురు చవి సుధఁ బెరఁగిన ♦ పుణ్యఫలమొ, నాఁగఁ దగిన బింబాధర ♦ నా యెడంద
యుందకాక వెల్వలను పెం ♦ పొంద నున్న, యదియొ! యని తలపోసె సీ♦లాబ్ద తనుఁడు

తే॥ ఎలమి మా చేయు గురు తపః ♦ ఫలము వలన, మహిని రాముఁడై పుట్టెను♦మాధవుండు
అతని ప్రేముడి పత్నియా ♦ నబ్జనిలయ, సీత యని వసిష్ఠుఁడు సంత♦సించె మదిని.

తే॥ కోసలేశుండు జానకి ♦ కొమరు గాంచి, యేడు దీవుల నేలిన ♦ వాఁడ నైన
నేఁడు తత్ఫల రూపంబు ♦ నియతితోడ, దైవ మొసఁగె నం చమిత మో♦దంబునొందె

ఉ॥ నైవళవీణఁ బోలు బలు ♦ నాణెపుఁ బల్కులు గల్గు సీత యా
త్రోవను పోవఁగా దశర ♦ థుండు మహర్షులు తక్కఁ దక్క వా
రా వనితామణిం గనిన ♦ యంతస మ్రొక్కిరి వారి డెందముల్
దైవమ యంచు నెంచెఁ దను ♦ ధర్మ మెడందకు లోఁకువే కదా! ౧౧౩౯

చ॥ విసివి సరోజముల్ విడిచి ♦ వేడ్క వైదేహ గృహంబుచేరు నా
వసుమతి పుత్త్రి మానులకు ♦ భక్తిని వందన మాచరించి పెం
పెనఁగఁగఁ గోసలేంద్రునకు ♦ నిచ్చను మ్రొక్కి యనంతరంబు సం
తసమున బాష్పముల్ వదలు ♦ తండ్రికడన్ వసియించె గద్దియన్ ౧౧౪౦

తే॥ ఈమె లక్ష్మియే యగు నిజ ♦ మితఁడు గిరిశు, వర శరాసన మనవేల? వలయునేని
యేడు కొండల విఱువంగ ♦ లేఁడె యనుచు, నిరుసు వంటి వసిష్ఠ ము ♦ నీంద్రుఁ డెంచె

ఉ॥ వేడుక వింటి నెక్కిడుట ♦ విర్చుట చెప్పఁగ నాలకించియున్
బోఁడిమి యుండె సందియము ♦ పొందిన సుందరి శంక వీడి లో
వీడని రూపమున్ గనుచు ♦ వెల్వలి రూపము కంకణంబులన్
వాడుకచేఁ గుదిర్చెడు నె ♦ పంబునఁ గాంచెఁ గటాక్షవీక్షలన్. ౧౧౪౨

తే॥ లీలఁ గ్రేఁగంటి చూపుల♦డాలు వోయి♦ప్రాఁతి రాముఁడన్ జలధి జీ♦వనముగొనియె
దక్కసుధ పూర్తిగఁ దానె♦త్రావినట్లు, లోడలుపొంగారె మెల్లన♦నూర్పువెడలె. ౧౧౪౩

చ॥ తన మది నున్న వంచకుఁడె ♦ తథ్యము చాపముఁ ద్రుంచె నంచు నా
జనకజ లోని దుఃఖమును ♦ చయ్యన వీడెను జన్మ దుఃఖ కా
రణ మగు మాయఁ దోలి తగు ♦ జ్ఞానముచేఁ దనలోనఁ దన్నుగాం
చిన జని ముక్తి నొందు క్రియఁ ♦ జెందె నొకానొక ముక్తి నామెయున్

తే॥ విమలకీర్తియా దశరథ ♦ విభుఁడు వేద, విదుని కౌశికుఁ గాంచి యో ♦ వినుతచరిత
జానకీ రాములకుఁ బెండ్లి♦జరుగఁదగిన, శుభ ముహూర్త మదెప్పుడో ♦చూడుఁడనఁగ

సీ॥ వాలుగల్ మిడియుచుఁ ♦ బాఱఁగ్రుమ్మటచేత, శిఖరి మత్స్యంబులు ♦ చేరి దుముక
నేనుఁగుల మెదడును ♦ పృష్ఠముల్ ప్రీలంగ, కొఱమీలు పాళలు ♦విరియ దుముకు

చుండు సుక్షేత్రముల్ ♦ దండిగా, గలిగిన, కోసల జననాథ!కోఅంతలేని
శుభ ముహూర్తము రేపె ♦సాంపారు నని గాధి,తనయుండు పల్కఁగాఁ♦దగు నటంచు

తే॥ ఱేఁడు లెల్లరు మ్రొక్కఁగాఁ ♦ విడుకొలిపి, భూరి వాద్య ధ్వనులు భువి♦బోరు కొలుప
మునులకుఁ మ్రొక్కి వారల♦యనుమతిఁ గొని, దశరథుఁడు లేచి విడిదికిఁ♦దరలెనంత

ఆ॥ అంచయాన సీత ♦ యరుదుగా నెడఁబాయ, హేమ సౌధమునకు ♦ రాముఁడరిగె
ప్రభులు మునులు వారి ♦ విడుదుల కేగిరి, మేరువున మఱుంగె ♦ సూరుఁడంత ౧౧౪౭

౨౧. కల్యాణపటలము. (౧౦౪)

క॥ స్థిర యశుఁడు మిథిల నాయకుఁ, డరుదారఁగ నుపచరింప ♦ నాబాల ధరా
వర మొదలితోడ నిర్జర, పురిఁ జేరిన భాతి మోద ♦ ముం బొందె నటన్ ౧౧౪౮

సీత తహతహ.

క॥ భరియింపరాని వెరవున, విరివిగ దగ గొన్నవారు ♦ వెదకి జలేజా
కరము గని త్రోవ లేమిన్, సురుఁగు దశం బొందె సీత♦ నుడివడు మదితోన్ ౧౧౪౯

క॥ కొలమిఱు రాత్రిరీ! యబ, లల వంచన నేఁచు వారి ♦ లం గలరొక్కో !
తెలవాఱఁ బ్రియుఁడు రాఁడో!, తెలవాఱుము దుఃఖ జలధిఁ ♦ దేర్చుము నన్నున్.

క॥ మునితోడఁ గూడి చనరా, మునితోడంబోయి మరలఁ ♦ బొడగానవ యా
తనితో వత్తువె? మనమా!, మనుతోడున్ వదలియుంట ♦ మరియాదయొకో. ౧౧౫౧

క॥ తాడిపయి చక్రవాకీ!, యేడు సముద్రములఁ బోలు ♦ నీరాతిరి నా
కీడునఁ జనదే? యాఱడిఁ, గూడుదువే యొంటిఁ బఱిచి♦కోఅమాలి యయో! ౧౧౫౨

క॥ వాఁడిమి కొడిమల పోఁడిమి, వేఁడిమితో నగ్గలించు ♦ వెన్నెల! దొనఁగే
నాఁడు గన కార్తిచే నా, నాఁడుం గృశియించు వారి ♦ నలఁచుట తగవే? ౧౧౫౩

క॥ తావికిఁ జల్లఁదనమునకుఁ, దావలమగు మలయ గుహను ♦ తారు పయిర యన్
మూఁవన్నె మెకము! యెరకై, వే వచ్చితె? కోఅ లనెడి ♦ వెన్నెల విరియన్ ౧౧౫౪

క॥ తెరువునఁ దిరుగుచు నొకరుఁడు, నెరవిన పెను కాల మేఘ ♦ నిభ దేహుఁడు నన్
బఱిచె నిసి పగలు పీడక, వర వంశ్యులు కన్నెల కడ ♦ వఱలుట తగవే? ౧౧౫౫

క॥ ఎడ నమ్మఁదగని పనులన్, దుడుకఁడు నిర్దయుఁడు వాని ♦ దోర్యుగళంబున్
దడవఁ జనఁ దగదు; నల్లని, కడలి యపారంబు; రాత్రి ♦ కడచను నొక్కో?. ౧౧౫౬

తే॥ పాటులా తగ్గుటయె లేదు ♦ పగలు రాదు, కూరుకా లేదు నిసి వోదు♦కోర్కి విడదు
నల్లమునవొప్పువదలదు♦నుసుఱుచనదు, నిట్లు కుందుట విధియే మొ♦యెఱుఁగరాదు.

తే॥ అమలజలధి! నీవును కంక♦ణములు జాఱఁ, బడుచు లేచుచుఁ గార్శ్యంబు♦వడసియెల్ల
వేళలందు నిద్దుర లేక ♦ వేఁగుచుంట, కన్యవో నీవు? మరునిచేఁ♦గలఁగినావొ? ౧౧౫౮

## రాముని యుత్కంఠ.

క॥ అని యీ విధమగు పలవర, మున నొగులుచు సొమ్మసిలుచు ♦ మిగుద యటుండన్
ఘన విభుఁడగు రాముఁడు తన, మనమునఁ దలపోసె నిట్లు ♦ మల్లడిఁ గొనుచున్.

తే॥ మున్ను కాంచి వీడక రెండు ♦కన్నులనెడి, ప్రాంత కలములు నామదిన్ ♦ బ్రాసె; మరలఁ
గనియు సుషమాంబునిధి దరి♦గానవైతి, మించఁగనువారు మఱియొండు♦గాంచుటెట్లు?

తే॥ జానకీ ముఖమే యైన♦చలువ ఱేఁడ!, కామ బీజంబుఁ బండించు♦కలువ ఱేఁడ!
యేమి యీకార్య పద్ధతి?♦యింత యెఱుఁగ, వేల?నాయెడ బంధువై ♦యెసఁగరాదొ?

తే॥ ప్రాణముల వెలువడ నీడ్చు♦రామ కనుల, కరణి నిరులును పరవెను♦కొఱఁతవడక
విభుఁడు రణభూమి మరణింప♦విఱిగి పాఱు, వీరవరుని యపఖ్యాతి♦విధము దోపఁ.

చ॥ వన హరిణంబుఁ బోలు వర ♦ వర్ణినితోఁ జను మానసంబ! పో
యిన యది పోక యంచుఁ జని ♦ యెంచవదేలొకొ? దారిదప్పెవొ? మ
న్నన గల చోట నిల్చుటలు ♦ న్యాయమె కాని యనాదరంబు గాం
చిన యెడ నిల్చు టెల్లిదము ♦ చెల్లునె సన్నుట విస్మరించుటల్. ౧౧౬౩

ఉ॥ కన్నులనుండి నిప్పుకలు ♦ గ్రక్కు భుజంగము కోఱలన్ విషం
బెన్నఁగ నుంట నిక్క మది ♦ యెల్లెడఁ దెల్లము మున్ను యిష్టొ నా
కన్నుల చూపులందు నెస ♦ కంబుగ మానసమందుఁ బర్వినన్
బన్నుగ నేఁచుచుండునది ♦ భామిని కన్నుల చూపులోనిదే. ౧౧౬౪

శా॥ లీలోద్యానములున్ బ్రకల్పిత గిరుల్ ♦ క్రీడా విరామ స్థలుల్
కేళాకూళులు చంద్రశాలలును లె ♦ క్కింపంగఁ బెంపారి హే
లా లోలాక్షి చరింప నుండినను వా ♦ ల్లభ్యంబుతో నామదిన్
వాలాయంబు వసించుచున్నది మఱే ♦ వస్త్వంబు నిచ్ఛింపదున్. ౧౧౬౫

తే॥ రాముఁ డిట్టు లుల్లమున వి♦రాళిఁ గొనుచు, నుండ సీతా వివాహమ♦హోత్సవంబు
దెపె నగరమెల్ల నలంక♦రింపుఁ డనుచు, తివి భేరీ రవములఁ జాటింపఁ బడియె. ౧౧౬౬

## పురాలంకరణము.

ఆ॥ ఘోషణంబు వినుచు ♦ గుములయి పెద్దలు, పిన్నవారు స్త్రీలు ♦ వేగిరపడి
పరుగువాఱువారు♦పనిచేయువారునై, యపుడు పురము కడలి♦ననుకరించె. ౧౧౬౭

ఆ॥ రామవిభుఁడు జనక ♦ రాజపుత్త్రిని పెండ్లి, యాడు టెఱిఁగి చూడ ♦ నరుగుదెంచె
నన(గ నిరుల తెరను♦మొనసి గెంటుచు నినుం, డేకచక్ర రథము♦ నెక్కి వచ్చె. ౧౧౬౮

సీ॥ తోరణ స్తంభముల్ ♦ తీర నాటువారును, వానికిఁ గై సేయఁ ♦ బూనువారు
మంగళ పూర్ణ కుం♦భంబు లెల్లెడ నిల్పి, యెలుపలు సవరించి ♦ యలరువారు
మందిరాంగణములఁ ♦ జందనాదులు చల్లి, కనచముల్ కై సేయఁ ♦ దివురువారు
విప్ర దీనానాథ♦వితతికిఁ బెట్టంగఁ, జెలఁగుచు వంటలు ♦ సేయువారు

తే॥ ముత్తెములభూషలనుదాల్చి-మురియువారు,మణులతొడవులధరియించి-మలయువారు
పైఁడి సొమ్ముల వహియించు-పడుచువారు, పూలచే నలంకారముల్ - పూనువారు.

సీ॥ చందనంబు నగురు-గందంబు వీథులఁ, జల్లుచు సందంద - జరుగువారు
విరులఁ జల్లుచు వేడ్కఁ-దిరిగెడువారును, సాంబ్రాణి పొగవేయ - సాగువారు
ముత్యాల జాలరుల్ - ముంగిళ్లఁ గట్టువా, రనఁటి ద్రాఁకులఁ గట్ట - నలరువారు
వివిధ వాద్యంబులు♦వినఁగ మూఁగెడువారు, మణిదీపములఁ గాంచ♦మలయువారు

తే॥ తిన్నియల రత్నపాలికల్♦దిద్దువారు, రిక్కలట్లు పందిట మణుల్ ♦ చెక్కువారు
మించుఁ బోలు దీపంబుల ♦ నుంచువారు, దీపములకుఁ గై సేయంగఁ ♦ దివురువారు.

ఆ॥ వజ్రమణులు వెలుఁగు ♦ పచ్చల మేడలఁ, జెక్కడములను వెలయఁ ♦ జెక్కువారు
బండ్లపైన విరుల♦పల్లవంబులు పంప్ల, నిండఁ గొంచుఁ దెచ్చి♦నింపువారు ౧౧౭౧

సీ॥ కలపంబులను మేన♦నలఁదుకొనెడువారు, విలువయౌ వలువల ♦ వెదకువారు
తురుములందు విరులు ♦ తురుముకొనెడివారు, తిలకముల్ నొసళుల ♦ దిద్దువారు
మాలికల్ మెడలందు ♦ తాలుచువారలు, నధరంబులకుఁ గావి ♦ యద్దువారు
కనులకు సొగసుగాఁ ♦ గాటుక యిడువారు, లత్తుక పదముల ♦ కత్తువారు

తే॥ కుండలము లెండ గాయఁగా♦గొలువ యాట,లాడువారును కైసేయు♦నపుడుఁ బ్రణయ
కోపముం గొను వేళలఁ♦గొదరి విద్రుచు, వానిఁ గొని వీథులం బాఱ ♦ వైచువారు.

తే॥ ఏనుఁగులకుఁ గై సేయంగ ♦ నెలయువారు, తేజులకు బాగు సేయంగఁ ♦ దివురువారు
స్యందనంబుల కందంబు♦ సలుపువారు, బిరుద చిహ్నంబులం దాల్చి♦తిరుగువారు.

తే॥ వైభవంబులతో నృపుల్ ♦ వఱలువారు, వేద ఘోషల విప్రులు ♦ వెలయువారు
వైణికుల గాన సుధఁ గ్రోల♦శ్రేణులైన, వారు వెల వెలందుల యాట♦ గోరువారు.

తే॥ రాజ మకుట ఖచిత రత్న ♦ రాజు లొరసి, కంఠ తారహారంబులు ♦ గదిసి రాలు
మణుల పొంధూళి యచ్చటి ♦ మండపముల, నగరి వాకిటఁ గుప్పలై ♦నెగడుచుండె.

ఆ॥ అరిగ లెండగాయ ♦ నసులు వెన్నెల గాయ, ద్విరదములను బోలి ♦ తిరుగువారు
చెలులు నటన లభ్య♦సించువా ర్చెఱునవ్వ, చేత జీవములను♦చిద్రుచువారు. ౧౧౭౬

తే॥ అమిత కాంతుల నగపడు♦నటియుఁగానఁ, బడక ప్రతిఫలించుటఁజేసి ♦ పుడమిజనులు
నమరులుంగూడ సురపురి♦యదియొయిదియొ,యనుచుభ్రమగొనిదిక్కుల♦వరయువారు

ఉ॥ తేరులమీఁద బండ్లపయిఁ ♦ దేజులపై మణి దీప్తు లొప్ప నం
బారుల లోనఁ గాల్నడను ♦ బల్లకులందు జనంబు లెక్కకుక్
మీఱి సరోజనేత్రలు స ♦ మృద్ధ సుధాధరలుక్ సుమధ్యలుక్
సారవచోవిలాసినులు ♦ సామజ యానలు చేరి రొక్కెడక్. ౧౧౭౮

తే॥ తారహారముల్ ధరియించు♦వారు రత్న, హారముల్ విచ్చి విసరెడు♦ వారు పూలు
పెక్కువగల జడలఁ గ్రుచ్చి ♦ పెక్కువగల, చీరలం గట్టు వారలు♦నైరి స్త్రీలు.

తే॥ మిథిల నిండిన సంపద♦మేదినిపయి, నొక్కచోఁ గాంచఁగా నిట్టు♦లొప్పు టరిది
పాకశాసను పట్టాభి♦షేక వేళ, నమరపురిఁ బోలె నొప్పారె ♦ నప్పురంబు. ౧౧౮౦

దశరథాదుల వివాహ మండపము చేరుట.

తే॥ ఎల్ల మెఱుఁగంగ నరుదయి ♦ హిమగిరివలె, నున్నతంబయి మైథిలి ♦ యుద్వాహమున
కెల్ల సామగ్రి నిండిన♦ హేమ రత్న, రచిత మండపంబును దశ♦రథుఁడు చేరె. ౧౧౮౧

తే॥ నిండి తెల్లని గొడుగు వె♦న్నెలలు గాసె, నించు మించు నగల రాసు♦లెండ గాసెఁ
దేంట్ల గములు గీతమ్ములు♦తివిరి పాడెఁ, దురగ ఖురధూళి మొగసి యం♦బరము గప్పె

తే॥ నీరదముపోలె మంగళ♦భేరు లులిసె,శంఖములు మ్రోసెఁ గాహళ♦సమితి మొరసెఁ
బ్రాఁజదుపుల ఘోషణములు♦రాత్రివేళఁ,గొఱలుచుండు పారావార♦ఘోషమీఱె

తే॥ కరి తురగ రథ నికరముల్ ♦ వరుసదీరి, నడచుచుండఁగ సామంతు ♦ లెడములేక
నిరతముం గొల్చువారలు♦నియతి నరుగ, నింద్రుసేవించు వేల్పుల ♦ యెసక మొనసె.

తే॥ అట్లు చేరవచ్చిన కోస ♦ లాధిపుండు, రత్నమయ హేమ పీఠిపై♦రమణ నొప్పె
మునులు నృపులు గూర్చుండిరి♦జనకుఁ డపుడు, బంధు వర్గంబుతో మంట♦పంబుచేరె.

క॥ నృపులును మునివరులును వే, లుపులు జనులు హంసయాన ♦ లును నెఱయంగా
నపుడా పెండిలికూటము, విపులంబగు మేరుశైల♦విధమున నొప్పెక్. ౧౧౮౬

తే॥ మేఘములుగ్రహ తారకల్ ♦ మెఱుములుఱుము,లోకటమండలయుగళంబు♦నొప్పుమిగిలి
బమ్మచేసిన యండగో ♦ ళమ్ము నెనసె, మయవినిర్మిత తన్మణి♦ మండపమ్ము. ౧౧౮౭

క॥ మునులును నృపులును విబుధులు, జనములు నడఁగంగ నచటి ♦ సభ బ్రహ్మాండం
బును లోఁగొని యడఁచిన విష్ణుని నల్లని కడుపువోలెఁ♦జూడఁగ నొప్పెక్.౧౧౮౮

క॥ జగములె ప్రేరేఁపఁగ నిం, బుగఁ జేరె జనంబు లనఁగఁ ♦ బొగడఁగ నగునే?
జగములు వేడుటవలన భు, జగ శయనము వీడు నతని ♦ చరితము వినుఁడీ.

రాముఁ డలంకరించు కొనుట.

తే॥ సప్తసాగరములనుండి ♦ సప్తనదుల, నుండి తెచ్చిన నీట శా ♦ స్త్రోక్త విధిని
మంగళ స్నాన మొనరించి ♦ మహిత రీతిఁ, బీత చీన వస్త్రము రామ♦విభుఁడు తాల్చె

తే॥ అజుఁడు మొదలుగఁ దృణముప♦ర్యంతమెల్ల, జీవులు దవ్వులు పెన్మాయఁ♦జిల్చియవల
మరలిరాకుండుపరమమ్ము♦దొరయఁజేయు, తనదుతిరునామమునుదుటఁ♦దానుఁదాల్చె

క॥ యతివరులకు నాకర్ణా, యతనేత్రల నొసఁగి పెండ్లి ♦ యమరిచి తపముల్
స్తుతమతిఁ జేసిన యినకుల, పతులు గొలుచు మొదటి వెలుఁగు ♦ భక్తిఁ బ్రమొక్కెన్

క॥ పొనుఁగువడు తపము ధర్మము, పున రుద్ధరణమ్ము సేయఁ ♦ బొడమిన కరుణా
తనుఁడు తన మేన జలదము, నెనసిన వెన్నెలనఁ కలప ♦ మింపుగ నలఁదెన్. ౧౯౩

తే॥ కడలి మంగళ కర పూర్ణ ♦ కళలు గలుగు, తొగలఱేనిఁ బూచిన దనఁ ♦ దగిన పగిది
సిగను క్రొవ్విరుల్ చుట్టి ప ♦ సిండి సరులు, పూలమాలిక లెసకంబు ♦ పొసఁగఁ బెట్టె

క॥ రేయిం బగటం బడు మరు, దాయము గని యిందుఁ డినుఁడు ♦ దౌత్యము గొని యా
తోయలి తోయము చెవులం, బోయి తెలుపు చెలువు నెనయు ♦ పోఁగులఁ దాల్చెన్

తే॥ శ్రీగళుఁడు పెనుజడయందు♦చిన్న చంద్ర, కలనుధరియించె నదియేటి♦కార్యమనుచు
పూర్ణ దివ్యకాంతిసమితి♦పొలుపు మిగుల, దిద్దె నన పేరపట్టంబు♦తిలకమూనె. ౧౯౬

తే॥ చక్రమును వెను దవిలిన ♦ శంఖ మనఁగఁ, దగిన కంఠమునందు ము ♦ త్యాల సరులు
సీత మందహాస రుచులు ♦ చేరి మదిని, వెలికి నుబికిన వస నొప్పి ♦ వెలయుచుండె.

తే॥ వజ్రములు మచ్చు లట్టులు ♦ వఱలుచుండ, పద్మరాగ దీప్తులు వహ్ని ♦ వలె వెలుంగ
నంగదంబులు మును మంద ♦ రాద్రిఁ జుట్టి, నట్టి కవ్వపుఁ దరి త్రాటి ♦ ననుకరించె.

తే॥ ఆణెముత్యాల ముప్పేట ♦ హార మొప్పె, జగము రక్షించు దీర్ఘ భు♦ జముల నడుమ
షుజ్జగంబుల కితఁ డాది ♦ మూర్తి యనుట, కొప్పినట్టి యభిజ్ఞాన♦ముంచురీతి. ౧౯౯

తే॥ వచ్చి వేఁడిన వారికి ♦ నిచ్చుకొఱకు, గల్పకంబు కాంచన రత్న ♦ కంకణములఁ
బూవుఁ గొమ్మల నుంచిన ♦ పొందు దోఁచి, దర్శనీయములైన హ ♦ స్తములు వెలిఁగె

ఆ॥ కనుల నిలయ లచ్చి ♦ కాణాచి యగు నురోం, తరమునందు మెఱయు♦సరులచయము
మెఱుము లడర నొప్పు ♦ మేఘంబు నడుమను, దోఁచు నింద్ర ధనువు♦తోయమందె.

ఉ॥ చేరుటకుం దొలంగుటకుఁ ♦ జెల్లిన విజ్ఞుల తెల్వి పోల్కెఁ బైఁ
జేరిన యుత్తరీయ మెదఁ ♦ జెందు దయాకృతి కంఠమందు సొం
పారిన తారహార నిభ ♦ మంది వెలార్చిన కాంతిఁ బోలి వి
స్తారముగాఁగ లక్ష్మికి వ ♦ శంబగు ఱొమ్మునఁ దోఁచెఁ బేరిమిన్. ౨౦౨

తే॥ చెనయరాని ప్రభాకరు ♦ చెన్ను దాల్చి, యున్న ఱొమ్మున ముప్పేట ♦ జన్నిదంబు
త్రిదశులును దెల్పలేని మూ.♦ ర్తిత్రయంబు, రూపమిది యెఱుఁగుండని♦తోఁపనొప్పె.

ఉ॥ అక్కముపక్కముల్ మిగుల ♦ సంగగు బంగరు రంగు లీనఁగా
నక్కటి రత్న బంధనము ♦ సందలి మేరువు ప్రజ్వలించె వే
ఱొక్క జగంబు దాని కజుఁ ♦ డొక్కఁడు వెల్వడ నాభియందు స
మ్యక్కనకాంబుజంబు పోలు ♦ సందఁగఁ బూచిన దన్న సంచునన్. ౧౨౦౪

ఆ॥ అలవి దెలుపఁ గాక ♦ యమిత గంభీరమౌ, నీల వారి రాశిఁ ♦ గేలు సాఁచి
పాల కడలి యలమి ♦ పట్టిన విధముసఁ, దెల్ల పట్టు వలువ ♦ తెలియఁ గప్పె. ౧౨౦౫

తే॥ ముత్తెముల నీలముల కాంతి♦మురువునూపఁ, బసిఁడి కాసియలోఁ గత్తి ♦ పరఁగఁ జెక్కి
ముత్తెసరముల గుత్తులు♦కత్తిప్రక్క, బాల భాను కాంతుల నీన♦ వ్రేల విడిచె. ౧౨౦౬

తే॥ రత్న కాంతులు, కాంచ నే ♦ త్రముల కాంతి, నిండఁగ, నమూనశిల్పము♦నెరయుమకర
ముఖముగల దంతపుంబిడి♦ మొసని మెఱుపు, లలిని మెఱసి దిక్కుల యెల్లఁ♦గొలిచి చూపె

చ॥ పరవిస రూపముం గలిగి ♦ పద్మజు నండము గొల్చు టెంక నె
ట్లురవగు సంచు నొక్కొకటి ♦ యుం దగ విఘ్నము గూర్చు పోలికన్
మెరయుచు నేరు నారసి క ♦ నుంగొన శక్యము గాని శిల్పముం
బూరసిస వీరమద్దియలు ♦ పొందగు నందెలు కాళ్ల శోభిలన్. ౧౨౦౭

తే॥ వేయి మాణిక్యదీపముల్ ♦ వెలుఁగు భుజగ, రాజు సెజ్జను యోగని ♦ ద్రను సురాళి
వేఁడ వీడిస రాముఁడి ♦ న్విధము తన్నె, పోలు నొక యలంకారంబు ♦ పూనె నపుడు.

మ॥ అరవిందాసన ముఖ్య మూర్తులకు నా ♦ ద్యంబై మునీంద్రాళికిం
బరమ ప్రాపకమై జగజ్జనకమై ♦ భవ్యంబు సేవ్యంబునై
నిరతానంద మయంబునై యొసఁగు నా ♦ నిత్యాత్మయే వచ్చి యీ
సర రూపంబుసలంకరించి కొస న ♦ న్నా! తెల్ప శక్యంబొకో? ౧౨౧౦

తే॥ అమిత గో భూ హిరణ్య దా ♦ నాదికములు, సజ్జనులకు బీదలకును ♦ సరసులకును
విరివిగా నొసరించుచు ♦ వేద ధనులు, వినుతి సేయ రాఘవుఁడు స్యం ♦ దనము నెక్కె.

తే॥ గుండు బంగరు టిరుసును ♦ వెండి చక్ర, ములును వజ్ర మయంబులై ♦ వెలయు నడిమి
భాగమును చుట్టు రత్నముల్ ♦ ప్రజ్వలింప, రాము రథము మార్తండుని♦ రథముఁ బోలె

తే॥ మంచి లక్షణములు సూక్ష్మ ♦ మతిని తెలియఁ, దగు జవంబు బలంబునం♦ దమ మెలంకు
వొలయఁ బురుషార్థములఁ బోలి♦ వెలయు తురగ, ములు జగత్ప్రభు తేరికిఁ♦ బూన్పఁబడియె

తే॥ నరుణు కై వడి నొగలపై ♦ భరతుఁ డెక్కె, మోద బాష్పాంబుమిశ్రిత♦ముఖముతోడ
కశను చేకొని రథ చోద ♦ కత్వ మూనె, నిరు దెసల నిల్చి కవలు చా ♦ మరలు వీవ.

చ॥ అమరిన పొందికంగలుగు ♦ నందముచే నటు లయ్యెనేమొ? శాం
త మనసుచేఁ దలంచుటను ♦ తప్పక యప్పుడు రొప్పె నేమొ? స

త్యము నెఱుఁగంగ లేము తగి ♦ నట్టుల యయ్యెడుఁగాక! యయ్యెడం
దమి గొని చూడ నెల్లరు స ♦ దా యనిమేషత దాల్చిరిమ్ముగన్.

తే॥ జగములను హింస సేసి నా♦శంబు గనక, యున్న పొలసుదిండులపాటు♦లాబ్బెడయ్యె
నేఁడె యని వేల్పు కూటంబు ♦ నిండు వేడ్క,నచ్చరలఁ గూడినటియించె♦నిచ్చకోలఁది

తే॥ పుర పురంధ్రులు విరులను ♦ గురిసినారు, పసిఁడి వలువలు రత్నముల్ ♦ విసరినారు
రాము చెలువంపు సుధఁ ద్రేమఁ ♦ ద్రావిరేమొ? వారి చేఁతకు వేఱేది ♦ కారణంబు?

ఆ॥ తమకుఁ గల వొసంగి ♦ తాల్చినవియు నిచ్చి, వారి తీరుగా ను ♦ దారుఁ గన్న
నారు లమిత మొసఁగి ♦ నార లందపు మేనఁ, గలుగు సొమ్ము లూడ ♦ నిలిచినారు.

ఆ॥ నృపులు మద కరీంద్ర ♦ నిచయంబువలెఁ జుట్టి, నిలువ దశరథుండు ♦ నెలవుకొన్న
కూటమందు చేరెఁ ♦ గోదండపాణి మే, రువును చేరు సూర్య♦రూపు దోఁప. ౧౧౯

చ॥ వరదుఁడు తేరినుండి దిగి ♦ ప్రక్కలలో నిరుగేలు ప్రేమమై
భరతుఁడు లక్ష్మణుండు దయి ♦ వాఱఁ గొనన్ సముదీర్ణులౌ మునీ
శ్వరుల కెఱంగి తండ్రి పద ♦ పంకజముల్ దల సోక మ్రొక్కి యం
దఱకును మేని యందము ను ♦ దారత విందులు సేయుచుండఁగన్. ౧౨౦

సీ॥ పై నొక్క ధనువును ♦ వాలుగలను క్రిందఁ, గలిగి పూర్ణేందు మం ♦ డలముఁ దాల్చు
నెఱ్ఱని సుమలత ♦ యింపైన స్తనకుట్మ, లములతోఁ దేరిపై ♦ నమరి తూర్పు
దెసఁ బుట్టినదివోలెఁ ♦ దేజరిల్లెడు సీత, తొల్త సుధాంబుధిఁ ♦ దోఁచి మరల
ధరణి నవతరించి ♦ తరువాత నొకేమల, యొద్దఁ బుట్టిన దన ♦ నొప్పె పెండ్లి

తే॥ మండపము చేరవేల్పులు ♦ మగువఁ గాంచి, మరల రాముని గని సుధా ♦ మథన వేళఁ
బొడమ లక్ష్మి వెన్నుని మెడఁ♦బూల మాల, వైచునాఁటికంటెను సొంపు♦వఱలె ననిరి

తే॥ జగతి జనములకంటె ని ♦ ర్జరులకంటె, నాగలోక వాసులకంటె ♦ నాణె మొంది
వెలుఁగు జానకి పెండిలి ♦ విభవ మెల్ల, వాక్పతికైన వర్ణింప♦ వలను పడునె? ౧౨౨

తే॥ ఇంద్రుఁ డింద్రాణితో మింటి ♦ కేగుదెంచె, భవుఁడు చనుదెంచెఁ దవిలి ♦ భవానితోడ
బ్రహ్మయే తెంచె బ్రాహ్మితోఁ ♦ బ్రమదమంది, జానకీ రాముల వివాహ♦సరణిచూడ

క॥ వడుగులు వైదికులును వెను, కడలి కరణిఁ జుట్టి రాఁగఁ ♦ గార్యంబును ప్రా
పడువున నడప వసిష్ఠుఁడు, వడి నుపకరణములతోడ ♦ వచ్చె ముదమునన్. ౧౨౪

ఆ॥ తండులములు పఱపి ♦ దర్భల నుంచి స్థా, సమును శాస్త్రవిధుల ♦ నమరఁ జేసి
పుష్పములను చల్లి♦పూజించి హోమాగ్ని, నిరవు గొల్పి కార్య♦మెల్ల జరపె. ౧౨౫

ఆ॥ పెండ్లి వేదియందు ♦ ప్రేమంపుఁ దోడగు, భూమిజాతతోడ ♦ రామ విభుఁడు
కూరుచుండ వారు♦కొమరొందఁ గలిసిన, భోగ యోగములను♦పోలియుండ్రి. ౧౨౬

తే॥ శ్రీవరుఁడు లక్ష్మితోఁ బోలెఁ ♦ జెలఁగి నీవు, సీతతోఁగూడి భువి చిరం ♦ జీవి వగుచు
సమ సుఖంబుల ననుభవిం ♦ పుమ యటంచు, జనకరాజు రామునిచేత ♦ జలము విడిచె

క॥ విప్రాశీరావములు వ, ర ప్రమదా విజయ గీత ♦ రవములు రాజేం
ద్రప్రవరవంద్యులగు విబు, ధ ప్రకరాశీస్సుతోడ ♦ దరములు మొరసెన్ ౧౨౨౮

తే॥ వేలుపులు కురియించిన ♦ పూలవాన, పుడమిపతులు చల్లిన పైఁడి ♦ పూలవాన
లెక్కవారలు విసరు ము♦త్యాలవాన, గలిసి యాభూమి గగనంబు♦కరణిఁదోచె ౧౨౨౯

తే॥ రాముఁ డప్పుడు శ్రద్ధ మం♦త్రము పఠించి, యగ్ని కాహుతిగాఁగ నా ♦ జ్యంబు విడిచి
జానకీ మృదు కిసల హ♦స్తంబు తనదు, దీర్ఘబాహువు చాఁచి మో♦దించి పట్టె. ౧౨౩౦

తే॥ తివిరి హోమకార్యము తీర్చు ♦ దీర్ఘ భుజుని, వెంట నగ్నిని వలగొను ♦ వేళ గోల
సీత మఱు పుట్టువునయందు ♦ జీవమును శ,రీర మనుగమించిన యట్టి♦క్రియను దోచె.

చ॥ మురువగు కంకణంబు క్రియ ♦ ముప్పురి రక్ష ధరించి యున్న య
గ్గిరి భుజుఁడున్ విదేహ జన ♦ కీర్తిత కన్యయు హోమకార్యముల్
హరువుగఁ దీర్ప జానకి న ♦ యంబుగఁ ద్రొక్కుచు సన్నెకంటి సం
దిరవుగఁ బూజలం గొని ర ♦ హించు నరుంధతిఁ గాంచె మ్రొక్కుచున్.

తే॥ చేయఁదగువానిఁ బూర్తిగాఁ ♦ జేసి సంత, సంబు నొందిన మునులకుఁ ♦ జాఁగి తెలచి
దశరథుని పదంబులకు స♦ద్భక్తి మ్రొక్కి, సీతతోడ శ్రీరాముఁడు♦చేరె మేడ. ౧౨౩౩

గీ॥ చిందములు మ్రోసె, భేరులు♦చెలఁగె వేద, గోష్ఠి వెలసె శాస్త్రములు పె♦క్కులు పఠింప
బడియె వందిమాగధనుతి♦బలిసె సురల, కలకలంబులు మిన్నందెఁ♦గడలి పొంగెనన

తే॥ కన్నతల్లి ప్రేమముకంటెఁ♦గడుఁ బ్రియమునఁ, దన్నుఁ గాంచు కైకేయి పా♦దముల కెఱఁగి
జనని చరణంబుల శిరంబు ♦ చాఁచి మ్రొక్కి, విమలమతి సుమిత్రకడను ♦ వినతుఁడై న

తే॥ ముగుర పాద పద్మంబులు ♦ మూర్ధమునకు, భూషణంబులుగా సీత ♦ మ్రొక్కసంత
వారిఁ గని వార లుబ్బిరి ♦ వారిజాస్య, రామునకు మేటి తోడవుగాఁ ♦ గ్రాలు ననుచు

క॥ కొమరెను గౌఁగిలి గొని తమ, కొమరునకుం దగిన దార ♦ కువలయమున సీ
యమ దక్కఁ గలదె యనుచుం, దమ మనములు కనులు దనియఁ ♦ దడవిరి ప్రేమన్

క॥ అలవి యగు నిష్కములు వలు, వలు దాసీజనము నగలు ♦ వర దేశంబుల్
వెలఁదుల దేవత యగు సీ, యలికేశిని పొందుఁగాక ♦ యని యిచ్చి రొగిన్ ౧౨౩౮

శా॥ నీలాంభోనిధిఁ బోలు నొక్క కరుణో - న్నిద్రాబ్ధి శాస్త్రాంబుధిన్
వేలం గాంచిన విజ్ఞ వాక్క్రమమునన్ ♦ బ్రేమాంబుధిన్ గొంచు నా
శ్రీలక్ష్మిం గల పూర్వపుం గలశవా ♦ ర్ధిన్ శేషశయ్యాభవా
లీలా తల్ప గృహంబు చేరెఁ జెను శా♦ళిన్ సంభ్రమోత్కంఠతోన్ [illegible]

తే॥ మీనమాసంబునం దుత్త - రానుషంగ, దినమునందు సహస్రాభి - ధేయ ఋషివాఁ
　పెండ్లి నడపె నసిష్ఠుండు - వేద విధిని, మంగళంబులు వర్ధిల్లు హో - మంబు చేసె. ౧౨౮౦

తే॥ నెపములేని విజయశీలి - నృపవరుండు, నాదు తమ్ముని బిడ్డల - మోదమలర
　రాము తమ్ముల కిత్తు మా - రాము లేక, యనుచు నడిగినప్పుడు నిశ్చ - యంబుచేసె. ౧౨౮౧

తే॥ జనకుఁడు కుశధ్వజుఁడు ప్రేమ - మున నొసంగ, *లక్ష్మణాఖ్యుఁ డూర్మిళను కే - ల్వట్టె భరతుఁ
　డుద్వాహం బాడె మాండవి - నుత్సహించి, కొనియె శ్రుతకీర్తి శత్రుఘ్నుఁ - డను గుణముగ.

తే॥ అన్ని పెండ్లిండ్లు జరిగిన - యవల దశర, థుండు కూర్చియుంచిన కీర్తి - యొండుదక్క
　దక్క రూపవస్తువులెల్ల - ధారవోసెఁ, గోరువారు కోరిన వానిఁ గోరినంత. ౧౨౮౩

చ॥ నరపతి యిట్లు దానములొ ♦ నర్చి యమేయ ముదబ్ధి మున్గి యే
　ర్పఱచిన శాస్త్ర విశ్రుతియు ♦ బాధతవంబును గల్గు సన్మునీ
　శ్వరులఁ గుమారులం గలిసి ♦ బాంధవ ధర్మముతోడ నుండె న
　ప్పురమున మెల్ల మెల్లఁగనె ♦ పోయెను గొన్ని దినంబు లచ్చటన్. ౧౨౮౪

## ౨౨. పరశురామ పటలము (౫౦.)

తే॥ సీతయునురాముఁడును సము♦చితసుఖంబు, లొందుచుండఁగౌశికముని♦డెంద మలరఁ
　గని యమోఘ వాక్యముల దీ ♦ వన లొసంగి, కృత మనోరథుఁడై హిమ♦ గిరిని చేరె.

క॥ ఒకనాఁడు దశరథుఁడు కొ, తుకమునఁ బురి కేగఁదలఁచి ♦ తోడనె సేనా
　నికరమున కాజ్ఞ యిడి రా, జకులము సేవింప బయలు ♦ సాగె రథమునన్. ౧౨౮౬

చ॥ బలియుఁడు కోసలేశ్వరుఁడు ♦ బంధుర బాహు చతుష్టయంబు నా
　నలువురు పుత్త్రులుం దమ జ ♦ నంబులతోఁ బరివార సంఘముల్
　గొలుచుచు రా విదేహ జన ♦ కూటము ప్రాణము వీడు దేహముం
　బలె ఘన దుఃఖవార్ధిఁ బడు ♦ మార్గము పట్టెఁ గుతూహలంబుతో. ౧౨౮౭

తే॥ తండ్రి ముందేగ జనుల డెం ♦ దంబు లెల్లఁ, దన్ను వెన్నంట నడుమను ♦ తన్ను పోలు
　ననుజులుం జేరి రా మించు♦నంద మొందు, జానకిం గూడి రాముఁడు♦చనుచునుండె.

చ॥ నడవఁగ నెమ్మి మున్నగు వ♦ న ద్విజముల్ కుడిప్రక్క వచ్చె న
　ల్లెడమను ముందుగాఁ జనుచు ♦ నెడ్డము వచ్చెను వాయసాదు ల
　వ్వడువు గ్రహించి దారి నొక ♦ పాటి నిరోధము గల్గునంచు భూ
　పుఁడు తన యున్నతంపు రథ ♦ ము న్నిలుపన్ సెలవిచ్చి యత్తఱిన్. ౧౨౮౯

తే॥ ఒక్క దైవజ్ఞు రాపెంచి♦యున్న రూపు, నొత్తి పలుకు మనంగ నై ♦ మిత్తికుండు
　భూవరేణ్యా! నట్టొక కొండ♦వోలె వచ్చి, మంచువలె వీడి శుభమగు♦నంచుఁ బలికె.

* ఊర్మిళాదులు మువ్వురును కుశధ్వజుని కూఁతులని ఋషులన్న.

చ॥ ఇరులను పాఱఁదోలు జిగి ♦ నెట్టి జడల్ గలవాఁడు గొడ్డలిన్
గరమునఁ గల్గువాఁడు నడ ♦ కల్ గల మేరువుఁ బోలువాఁడు చి
చ్చురలు కను ల్గలాఁ డశని ♦ యొప్పగు పల్కులవాఁడు మేలి బం
గరు మయమైన వింటి నెస ♦ కంబుగ మూఁపునఁ గల్గు నాతఁడున్. ౧౨౧

తే॥ ఉదధిలోఁ బ్రభంజన హతి - నురలు కలము, పగిది జగములు గడగడ - వడఁక దిగ్గ
జమ్ము లట్టులె స్తంభించి - పామ్ముసిల్ల, జలధి లోలో నుడికి పొంగి - నిలుక దప్ప.

చ॥ సురలు కకావికల్ వడ వ - సుంధర నింగికిఁ బైన నిల్వనో?
ధరణి సమస్త జీవులను ♦ దండధ రాననమందు చొన్పనో?
దురుసున నింగిఁ గూల్పనోకో? - దొడ్డ వ్రణంబు ముఖంబు వ్రీల నె
త్తురు క్రియఁ గన్నులం గనలు - దోఁచి వెలింబడ హేతు వేమొకో?

చ॥ సమరమె ముఖ్యవృత్తిగ భు - జస్థలిఁ గ్రాలు పరశ్వథాగ్రధూ
మము వినుగప్ప భాస్కరుఁడు - మార్గ మెఱుంగక రిచ్చవోవ సం
భ్రమునఁ గలట్టి బాడబ ము - దగ్రత నుప్పర మంట లేచి లో
కములను బూది సేయు గమ - కంబున వేడి వెలుంగు పర్వఁగన్. ౧౨౪

ఉ॥ జానువు లంటు బాహువులు - చాఁగి దిశ ల్గొలువన్ వలంకులం
దాని తుఱుంగలించెడు జ - టాగ్రము మిన్నునఁ జెంగలింప న
చ్చో నెలయున్ గనంబడ వ - సుంధర తోయము వహ్ని గాలి వి
న్నూనములై నశింపఁ బ్రళ - యోద్ధత రుద్రుని భంగిఁ బొంగుచున్.

మ॥ చతు రంభోధి పరీత భూతల మహా ♦ సామ్రాజ్య ధౌరేయుఁడా
కృతవీర్యాత్మజుఁ డర్జు పృథూత్కట తరు ♦ శ్రేష్ఠం బుదంచద్భుజా
యత సాహస్ర సుశాఖమున్ విదళన ♦ వ్యాపారముం జేయు నా
తత విఖ్యాత కుఠారమున్ గురు భుజ♦స్తంభంబునం బూనుచున్. ౧౨౬

తే॥ నింద నొందిన భూలోక ♦ నృపకులంబు, నిరువదొకమాఱు ఖండించి♦నియతిఁ బాడి
పొలమునందలి కలుపును ♦ దొలఁచి రక్త, నదుల నొంటిమై మునుఁగుబె♦ట్టిదపుజెట్టి

ఉ॥ ఓరుపు రూపుగొన్న క్రియ ♦ నొప్పు తపంబును మందు నగ్ని నా
నీరన గల్గువాఁడు తన ♦ యెట్టెదురన్ బయిలోడి ప్రక్కకున్
దాటు కుమారుపైఁ గనలి ♦ దర్పితుఁడై విహగాళి యిమ్ముగాఁ
దూటెడు నట్లు కొంచమలఁ ♦ దొల్చిన ముల్కులెఱింగి నట్టిడున్. ౧౨౮

తే॥ ధరణీధరములు క్రుంగ నం♦ద్రములు పొంగఁ, జేయు వలఁతి భార్గవుఁ డటఁ♦జేరునంత
నశుద్ధుగా ధాముఁ గన్న య♦న్నరవరుండు, కతిను ధాకశఁ గత మెఱుం♦గక తపించె,

తే॥ సేన భయపడి తడఁబడి ♦ చెదరి పఱవ, భూములు మడివడఁ గనుల ని ♦ స్ఫులిలు రాలఁ
బిడుగువోలె గర్జించి గంభీరుఁ డైన, రాముఁ డెంతెను నచ్చె భార్గవుఁడు కడకు.

చ॥ అతులిత భక్తి సంభ్రమ భ - యంబులు తోఁప్పఁగ జామదగ్న్యు నా
క్షితిపతి యాతిథేయము ర - చింపఁగ డాసి తదీయ పాద సం
గతముగ శీర్ష మూన్చినది - గంబడ కుగ్ర లయాగ్నిఁ గ్రక్కుచున్
దత భయద స్థితిన్ సుగుణ - ధాముని రాముఁడు గాంచి యిట్లనున్. ౧౨౬౧

చ॥ ఎఱుఁగుదు భగ్నమైన గిరి - శేశుని చాప బలంబు పూర్వమే;
యెఱుఁగఁగఁ గోరి వచ్చితి మ - హీశ్వరపుత్త్రక! యంగదంబులన్
మెఱసెడు నీ భుజంబు బలి - మిన్ మును క్షత్త్రియ కంఠనాళముల్
తఱిఁగిన మద్భుజంబులఁ దొ - లంగదు తీఁటయు రాఁ గతం బిదే. ౧౨౬౨

చ॥ అనవుడు భూపుఁ డిట్లను భ - యంబున నుల్లము గ్రుంగ ధారుణిన్
మునుమిడి గెల్చి తిచ్చితివి - పొందుగఁ గశ్యపమౌని కో మహా
మునివర! నీకు లెక్కయె త్రి - మూర్తులు? మర్త్యులనంగ నెంత? ఈ
తనయుఁడు నాదు జీవములు - దప్పక ని న్నభయంబు వేఁడెదున్. ౧౨౬౩

చ॥ చెడుమతిఁ బాపకర్మములు - చేసిన దుష్టులు వధ్యు లౌదు రీ
బుడుత మదాతిరేకమున - బుద్ధి చెడం గొఱగామి చేసెనే?
పుడమి బలిష్ఠులతోఁ దవిలి - పోరినఁ గీర్తి లభించుఁ గాక యీ
బడుగులతోడఁ బోర బల - వంతుల చేవ ఫలంబు గాంచునే? ౧౨౬౪

ఉ॥ కొమ్మని భూమి కశ్యపున - కుం దయచేసి జగత్త్రపాలక
త్వమ్ము భరింప వీడిన కృ - పాకర! వీడుమ యిట్టిచేత నే
మమ్మున మానవావళిని - మానుగఁ గాచెడు ఱేఁడ్లఫట్లఁ గో
పమ్మును మాని తీవ్ర పిద - పన్ వహియించుట పాడి యౌనొకో? ౧౨౬౫

చ॥ పలువురు గేలిసేయ నొక - పక్షము నూని గురుత్వ మొందు నా
బలము ఫలం బొసంగునొకొ? - పాడియె యయ్యది? ధర్మపద్ధతిన్
నిలిచి వహించు నయ్యశమె - నిర్మల సత్త్వమనంగ నొప్పు; శూ
రు లనఁగఁ దగ్గ వార లొక - రున్ బల మందురె దీని నెయ్యెడన్?

చ॥ పగతుఁడు కాఁడు వీఁ డితని ♦ ప్రాణము వోయినఁ జుట్ట పక్కముల్
వగగొని పౌరులున్ మిగుల ♦ వందురి యెల్లరు వెంబడింప నే
నెగులున జీవముల్ విడుతు ♦ నిక్కము కింకరు నన్ను నాకులం
బగులక కావు మార్యవర! ♦ యంజలితో శరణంబు వేఁడెదన్, ౧౨౬౭

చ॥ అని యిటు వేఁడు కోసల జ ♦ నాధుపు పల్కులు లెక్క సేయకే
కనలు మిడుంగురుల్ చెదరఁ ♦ గట్టలుకన్ వడిఁ దేఱి చూచి రా
మునికడ కేగఁ బ్రాణములు ♦ మొత్తము తావులు దప్ప మించఁ గాం
చిన భుజగమ్ము తేవఁ బలి ♦ చేయున దెయ్యది లేక యుండఁగన్. ౧౨౬౮

తే॥ మాసి యగు దశరథుఁ డిట్లు ♦ మతిచెడంగఁ, దనకు నాగతి కానుంట ♦ దలఁప లేక
హర ధనువు బలహీనత ♦ నందు చరిత, పల్కఁదొడఁగె రామునితోడ భార్గవుండు.

తే॥ మేరు సారంబు దినకరుఁ ♦ గేరు కాంతి, పాటవము దైర్ఘ్యమును వి ♦ వంగరాని
చేవ గల రెండు విండ్లను ♦ చేసె మును, తేర్చి విశ్వకర్మ యనెడు ♦ దేవ శిల్పి. ౧౨౭౦

తే॥ ఒక్క చాప ముమాపతి ♦ కొసఁగి గ్రహించె, రెండవది త్రివిక్రముఁడు వ ♦ రించికొనియె
నేయ దా రెంట మిగుల బ ♦ లీయ మనుచుఁ, ద్రిదశులందఱు చేరి వి ♦ రించి సమగ

క॥ జలజాసనుఁడును వేల్పుల, తలఁపు గొప్ప దనుచుఁ దలఁచి ♦ తగ నొక్కటి వా
రలకుఁ బొడ మించి యాధను, వులఁ గొని కడు నలుకఁ బెద్ద ♦ పోరఁగఁ జేసెన్.

తే॥ ఇరువురును రెండు చాపంబు ♦ లెక్కు వెట్టి, జగములెల్ల నిలుక దప్పి ♦ బెగడుగుడువ
బవర మొనరించుచుండఁగ ♦ వర్ధి విల్లు, చేవ చెడుటయుఁ గని మది ♦ శివుఁడు కినుక.

తే॥ మరలఁ గలనికిఁ గడఁగ ని ♦ ర్జరులు నడుమ, నిలిచి వారించి రంతట ♦ నీలగళుఁడు
తన శరాసన మింద్రు వా ♦ స్తమున నునిచె, ఋచిక ముని కిచ్చెఁ దనవిల్లు ♦ శ్రీవరుండు

తే॥ ఋచికుఁ డొసఁగె మా తండ్రికి ప్రియముతోడ, సతఁడు నాకిచ్చె నీవింటి ♦ నమర నీవు
వంచితేని నీ సదృశు లె ♦ వ్వరును లేర, నేను నీతోడి యుద్ధంబు ♦ మాను వాఁడ.

చ॥ మొదటనె చేవ వోయినది ♦ మూలను పడ్డది త్రుప్పు వట్టి ప
ట్టు దొలఁగి యున్న దానిని పు ♦ టుక్కునఁ ద్రుంచుట దొడ్డ చేఁతయే?
పదరక దీని నెక్కిడుము ♦ పాయదు ప్రాంత చలంబు నామదిన్
మదిమది నున్న శాంతనిధి ♦ మజ్జనకుం బొరిమాల్చు దుష్కృతిన్. ౧౨౭౬

చ॥ ఇరువది యొక్క మాఱులు మ ♦ హీతల మెల్లను చుట్టి రాజులన్
దరమిడి గొడ్డట న్నఱకి ♦ తద్రుధిరమ్మున శాస్త్ర పద్ధతిన్
జరపి పితృక్రియల్ పిదప ♦ శాంతి వహించితి నీడ్చి కొల్వ మా
ధయురె పిడి దక్క వౌదు; మది ♦ నుత్తల పెట్టితి విట్లు బాలకా!

చ॥ కలఁకుల గెల్చి యిమ్మహిని ♦ కశ్యపమౌని కొసంగితిన్ విరో
ధుల కుల మార్చితిన్ గొలఁది ♦ దోఁపని పెందప మాచరించితిన్
బలువిడి శూలి చాపమును ♦ భగ్న మొనర్చిన ప్రమోఁత నా శ్రవం
బులకు జొరఁ గిన్క వచ్చితిని ♦ పోటరివే నిద్ధి వంచు పోరితన్. ౧౨౭౮

చ॥ అనుటయు మందహాస రుచు ♦ లానన మందాక శోభఁ గూర్ప న
య్యనకుల వీరుఁ డిమ్మనుచు ♦ శ్రీశుని ధర్మమున్ గొంచు జామద
గ్న్యుని హృదయంబు భీతిమెయిఁ ♦ గ్రుంగ స్వదోర్బలమొప్ప వంచి కో
పనుఁ డగ్గు మాని గాంచుచు న ♦ పార కృపారస ధాముఁ డిట్లనున్. ౧౧౯

ఉ॥ రాచకులంబు మాలిచిన ♦ రక్కసి వైనను మేటి బోడకుం
దోఁచి తపస్వి వేషమును ♦ దొడ్డితి గాన వధింపఁబూన నా
రాచము నాకరంబునఁ దొ ♦ డంగిన నూరక పోవ దింక నీ
వే చెపుమా బిరాన గుఱి ♦ యెయ్యది దీనికిఁ జూపుమా యనన్ ౧౨౦

చ॥ ఎఱుఁగ కొనర్చు దోషము స ♦ హింపుము కావుము దేవదేవుఁడం
చెఱిఁగితి నెల్లప్రాణులకు ♦ నీశుఁడ వాది వనాదివైన నీ
కుఱువుఁగ నిందు మాళి ధను ♦ వుంకువ సేయఁగ నెత్తునంతలో
విఱుగుట యబ్బురంబె? యది ♦ వేడుకఁ బట్టుట కేని చాలునే? ౧౨౧

తే॥ పురుష మోహన! నీవిటు ♦ భువన రక్ష, బొంటె నవతరించుకతనఁ ♦ బొందె జగము
నెమ్మదిని నే నొసఁగిన ♦ నీదు విల్లు, నీ బలంబున కుఱువు గా ♦ నిదియె సుమ్ము. ౧౨౨

తే॥ కూర్చు నాశుగమ్మునకు నా ♦ గొప్ప తపము, నాహుతిగ నొసంగితి నన ♦ నపుడు చేయి
వదులు విడువ నస్త్రం బేగి ♦ పరశురాము, తపము పూర్తి వారుకొని య ♦ త్తఱిన మరలె

తే॥ నీల జీమూత నిభ గాత్ర! నిగమ వినుత, పాత్ర! పరిశుద్ధ సుగుణ చ ♦ రిత్ర! నీవు
తలఁచు కార్యంబులొనఁ గూడఁ ♦ గలవు నాకు, సెలవెయని భార్గవుఁడు మ్రొక్కి ♦ తలఁగె నచటు

తే॥ అంత రాముండు పంచేంద్రి ♦ యక్రియాలి, తొలఁగి పోలిన తన తండ్రిఁ ♦ దఱిసి తడవి
మ్రొక్కి దుఃఖ సాగరమున ♦ మునిఁగియున్న, యతనికిం జూపె సమ్మోద ♦ మనెడు వేల

ఆ॥ తెలిసి తేఱి వంత ♦ వొలఁగ నిబ్బరమగు, నుబ్బు గలిగి లేచి ♦ యుర్విభుఁడు
అరిది దుఃఖ జలధి ♦ దరిఁజేరి దరిలేని, మోద వార్ధిలోన ♦ మునిఁగిపోయె. ౧౨౬

ఆ॥ కటికి పరశురాము ♦ కార్ముకంబును గొని, యతని నోర్చి నిలుచు ♦ నఘ విరాము
రాము నలమికొని శి ♦ రంబు మూర్కొని సమ్మ్మ, బాష్ప కుంభ వారి ♦ నాడఁ జేసె.

చ॥ నయమునఁ జిన్ననాఁట నెరయ ♦ నర్చిన యద్భుత పౌరుషోచిత
క్రియల జగత్త్రయం బాకప ♦ రిం గమకించినఁ జేయఁగూడునే?
అయమనయంబులం జలుపు ♦ ప్రాణులకుం దగినట్టు లీతఁడి
మ్మయి మఱుమై యొసంగెడు ర ♦ మాపతియే యని యెంచె నెమ్మదిన్.

తే॥ నిరులవానతో వచ్చిన ♦ నిబుధులందు, వరుణుఁ గని క్రూర ఘోర చా ♦ పంబు గాఁచు
చుండుమని యిచ్చి తన వార ♦ లుత్సహించి, బలయు రాముఁ డయోధ్యకు ♦ వచ్చి చేరె.

తే॥ చేరి ప్రేమంబుతోడ వ ♦ సించుచుండ, దశరథుం డొకనాఁడు మో ♦ దమున భరతుఁ
గాంచి దైవవశమున ఘ ♦ టించినట్టి, విషయ మొక్కటి దాఁ దెలి ♦ పింపఁదొడఁగె.

తే॥ తనయ! నీ తాత కేకయ ♦ ధరణి ధవుఁడు, నిన్ను చూడఁ గోరినవాడు ♦ నెమ్మితోడ
పోయి రమ్మని యానతి ♦ సేయ నతఁడు, మంచిదని తండ్రి చరణ ప ♦ ద్మముల కెఱఁగి

తే॥ మొనసి రాము పాదములకు ♦ మ్రొక్కి యతని, కన్న వేఱు ప్రాణంబు లే ♦ కున్నకతన
ప్రాణముల వీడి గాత్ర మ ♦ వ్వలికిఁ బోవు, విధని భరతుండు రాముని ♦ వీడిచనియె.

తే॥ మేనమామతో భరతుఁడు ♦ మేనితోడి, నీడవంటి శత్రుఘ్నుండు ♦ తోడ రాఁగ
స్యందనం బెక్కి యేడు వా ♦ సరము లరిగి, యరయ సొంపైన కేకయ ♦ పురము చేరె.

చ॥ భరతుఁడు చన్న పిమ్మట స్రు ♦ పాలుఁడు ధర్మపథంబునన్ జనుల్
జరుగఁగ దగ్గ పద్ధతిని ♦ సత్పరిపాలన సల్పుచుండఁగా
సురల మహా తపః ఫలము ♦ చోద్యము గావున మిక్కుటంబుగా
జరగిన దెల్లఁ దెల్పెదము ♦ శ్రద్ధమెయిన్ వినుఁడీ మహాత్మకుల్. ౧౨౯౭

బాలకాండము సంపూర్ణము.

శ్రీ రామచంద్రార్పణమస్తు.



శ్రీ

# కంబరామాయణము — అయోధ్యాకాండము.

## ౧. మంత్ర పటలము. (౯౯)

సీ॥ రాజు రెండవ భార్య ♦ రాముని పినతల్లి, కుబ్జయా మంథర ♦ కొడిమ సేయ
రాజ్యంబు వీడి య ♦ రణ్యంబు సేరి స, ముద్రంబు దాఁటి స ♦ న్మునిసురేంద్ర
మానవావళి యిడు ♦ మలు తీర్చు శ్రీపాద, ములు గల శ్రీరామ ♦ భూవరుండె
మూలప్రకృతిఁ దోఁచి ♦ భువనంబులందు వ్యా, ప్తిం బొందు పాంచ భౌ ♦ తికములైన

తే॥ జంగమ స్థావర పదార్థ ♦ సమితి యందు, మేను ప్రాణముల్ ప్రాణ వి ♦ జ్ఞానములును
గూడియున్నట్లులో వెలిఁ ♦ గూడియుండు, నాత్మయనిపల్కు—చంద్రు మ ♦ హాత్ముఁ డెపుడు ౧

తే॥ రాజవర! నీవు భూమి పు ♦ త్త్రికున కొసఁగి, దుష్కరతపంబుసేయంగఁ ♦ దొడఁగఁదగిన
కాల మిదియని చెవిఁజేరి ♦ లీలఁ దెలుపు, కరణి జెవిమూలమున నర ♦ గాన నయ్యె.౨

తే॥ ప్రాణికంటకుఁడైన రా ♦ వణుఁడు సేయు, పాపఫల మప్డు పలితమై ♦ వచ్చిచేరె
ననఁగ నరసిన నరపు న ♦ రాధివరుఁడు, ముకుర మందున నొకనాఁడు ♦ మొనసికాంచె

ఆ॥ శంఖ కాహళాది ♦ శబ్దంబు లంభోద, లీల మొరయఁ జామ ♦ రాలు బెరయ
మానవేశ్వరుండు ♦ మంత్రాంగ సభ కేగె, మనము సంచలించి ♦ మలఁగుచుండ. ౪

ఆ॥ ఏఁగి పిదప నృపుల ♦ నెనలేని చుట్టాల, సంగడీంద్రఁ బ్రేమ ♦ సాగనంపి
యొనర జగము గావ ♦ యోగనిద్రవహించు, విష్ణువనఁగ నొంటి ♦ వెలసియుండె. ౫

ఆ॥ పూర్ణచంద్రుఁ బోలు ♦ ముక్తాతపత్ర మా, కసమునంట విభుతఁ ♦ గ్రాలుభూపుఁ
డమర గురునిపోలు ♦ ననదృశ మంత్ర వృ- ద్ధులను సభకు నంతఁ ♦ బిలువఁబనిచె. ౬

తే॥ అవని విభునకు రక్షచే ♦ నాజ్ఞచేత, దైవమనుచు భావింపంగఁ ♦ దగిన వాఁడు
మూర్తులందున నాలవ ♦ మూర్తియనఁగఁ, దగు వసిష్ఠుఁడు రాజ స ♦ దంబు చేరె.౭

సీ॥ వంశమూలంబైన ♦ ప్రాఁతదనంబును, విద్యానవద్యత ♦ వెలయువారు
కార్యఫలంబును ♦ కడు చెడు గొనరిన, మాధ్యస్థవృత్తి నే ♦ మఱనివారు
కోపాదులం దెగఁ ♦ గోసి కడిందియా, సద్ధర్మ పద్ధతి ♦ జరగు వారు
జరిగిన యదిగాని ♦ జరిగెడు దాని నూ, హాము సేయఁజాలు క ♦ శాగ్ర మతులు

తే॥ అదియుఁ గర్మానుగుణముగా ♦ నైసదైన, మార్పఁదగు పట్టుదలగల ♦ మాన్యగుణులు
కులమునకు ననురూపమా ♦ గుణముగలరు, *చమరమృగమునుపోలుమా ♦ నముగలారు.౮

* ఒక వెండ్రుక యూడినను ప్రాణము విడుచునది చమరమృగము.

సీ॥ తరుణంబు స్థలము సా ♦ ధనమును చదివిన, మన్నైనీతి యెఱింగి ♦ మసలు వారు
దైవాను కూల్యంబు ♦ తగు సూక్ష్మమతిచేత, నెఱిఁగి ధర్మపు వృద్ధి ♦ పఱచు వారు
సత్స్వభావంబు య ♦ శస్కరకార్యంబు, గలిగి రాడ్భాగంబు ♦ దెలుపు వారు
రాజు కోపించినఁ ♦ బ్రాణంబునకుఁ దెగి, కష్టమోరిచి నీతి ♦ గఱపువారు

తే॥ సత్పథంబు తొలంగని ♦ స్వచ్ఛగుణులు, తెలియఁ దగ్గ త్రికాలముల్ ♦ తెలియువారు
నాయకునకు మేల్కడుల ♦ సాయలరసి, వైద్యుఁబోలె హితంబునే ♦ నలచువారు. ౯

తే॥ మించినెంజిలి ప్రభు సంక్ర♦మించినపుడు, మొదలి పుణ్యఫలముఁ బోలి♦యొదవువారు
వేలకొలఁది వారైనను ♦ విభుని హితము, పట్ల నైకమత్యంబునఁ ♦ బరఁగు వారు. ౧౦

తే॥ మాటయెన్నఁడుఁ దప్పని♦మహిత మతులు, తొలఁకుచుండు సంపద్వృద్ధి♦కలుగువారు
పొరలుచుండు సలలు గల ♦ శరధివోలె, వచ్చిచేరిరి మంత్రాంగ ♦ భవనమునకు. ౧౧

తే॥ చేరి విమల విజ్ఞాని వ♦సిష్ఠ మునికి, జోతయొనరించి తమ భూభు ♦ జునకు మ్రొక్కి
తగిన గద్దెలపై గ్రమం♦బుగ వ♦సించి, యుచిత వాక్యజ్ఞు కనికర ♦ మొంది రంత. ౧౨

ఆ॥ ఆజి వారి మోము ♦ లనువొంద సీక్షించి, చెప్పఁ దలఁచు సరిది ♦ చెయిది గలదు
నాదు బుద్ధిఁబోలు ♦ నయగుణ విమలార! వినుఁడీ సావధాన ♦ మున నొకింత. ౧౩

ఆ॥ ఇన కులంబు వారి ♦ యింపైన నడవడి, నించు కేని కొఱఁత ♦ గాంచకుండ
మాసహాయశక్తి ♦ మేదిని సఱువది, వేలయేండ్లు మెఱసి ♦ యేలినాఁడ ౧౪

తే॥ కోమరెలకు నెల్లఁ బోడవగు♦క్రొత్తడి తన, మమరఁ బ్రేమ యొప్పార ధ♦ర్మము దలిర్ప
జీవకోటికి హితమునే ♦ చేయుచుంటి, నింక నాజన్మమును కిల ♦ వెంచి నాఁడ. ౧౫

ఉ॥ కోరితపంబుకై తెరువుఁ ♦ గూరుచు ముప్పును గన్నయేను భూ
భారము సర్వరాజ కుల ♦ పర్వత దిగ్గజముల్ విరామ మిం
పారఁగ నొంద మోచితి స ♦ యంబున పృథ్వి మోవఁజాల మా
వారలు పోయినట్టి పెను ♦ బాటనె పోయెద మోక్షమందఁగన్. ౧౬

చ॥ అమల మనస్కులై జగతి ♦ సంతయు నేలిన మాకులంబు దీ
పములగు పెద్ద లిప్పుడమి ♦ భారము పుత్త్రులు మోవ వీడి దు
ర్గమ విష యేషణంబులు తొ♦లంగి నశింపఁగ ముక్తి నొంది రా
క్రమమునె యేను పూనికొనఁ ♦ గాఁ దలపెట్టితి నిక్కవంబుగాన్. ౧౭

తే॥ త్రిజగములఁ గల యరుల దో♦రిచినయేను, దొంగలం బలె చాఁగి యొ♦దుంగు కామ
ముఖ మనశ్శత్రువులకు నీ♦ముదిమి యందు, వెఱచి నడ పీన్గు కరణి జీ♦వింపఁగలనె? ౧౮

తే॥ అరుణ కిసలయ మృదుపద ♦ మైన కైక, కొలగొన దశాసుర ♦ రథికులను కూల్చ
నాకు మాపన భూతంబు♦నడపునైదు, తేరులను గెల్చుటన దొడ్డ ♦ దియె తలంప?

మ॥ చతురంగ ప్రతివీర సైన్యముని గోఁ ♦ జక్కాడుచుం జావరే
నతుల జ్ఞానము నొందరే సకల సౌ ♦ ఖ్యంబుల్ విచారింప శా
శ్వతముల్ గావని వీడరే సమల వి ♦ ద్వద్వ్యాఖ్యానులం జేరి సం
సృతి విధ్వాంతము దాఁటరేని యగునే ♦ చేరంగఁ గైవల్యముల్? ౨౦

తే॥ ఎన్న 'జాతస్య హి ధ్రువో మృత్యు' వనెడి, నుడిని మఱచుట కంటెను ♦ చెడుగు గలదె?
యొనర సన్న్యాస మను తెప్ప ♦ యొప్ప దేని, జననమను మహాంబుధి దాఁట ♦ శక్యమగునె?

తే॥ మహిత సన్న్యాసము తదీయ ♦ మార్గమంచు, బంధువగు నెఱుకయు నను ♦ పక్షయుగము
దొరయునేని జనన మను ♦ దొడ్డచెఱను, కడచు కంటె నింపగు గొప్ప ♦ కార్యమేది. ౨౨

చ॥ అరుదగు మేలనం దొడరి ♦ యవ్వల నెవ్వగ నించు నింద్రియా
వరణ సుఖంబులైన నయ ♦ వంచక శాత్రవవర్గ దుష్కృతుల్
వెరవున నీఁగి మోక్ష రమఁ ♦ బెంపునఁ బొందఁగఁ ద్రుష్ణఁ జేసి తొం
దరపడు డెందమందున హి ♦ తం బగునే యిల నెండమావులున్? ౨౩

ఉ॥ ఏలితి మీరు తోడుపడ ♦ నిద్ధరఁ బద్ధతితోడ సత్కృతుల్
పోలఁగఁ జేసితిన్ యశముఁ ♦ బొందితి నీజననంబునందు నా
కీ లలి సాయపడ్డ సుహృ ♦ దీశులు మీరలు భావి జన్మసౌ
ఖ్యాలికి నిట్టులే తగ స ♦ హాయులు గండిదె మిమ్ము వేఁడెదన్. ౨౪

చ॥ నెగడిన పాపముల్ తొలఁగ ♦ నీఁగు తలం పనుకంప నింపు పెం
పగు తపమొప్పఁగాఁ జలుప ♦ నయ్యెడు నేని యమర్చియుంచు తీ
పగు నమృతంబు వీడి విస ♦ మర్మిలిఁ ద్రావుట పోలు నొక్కొ? బల్
నెగటుగఁ దోఁచె నాకుఁ బృథి ♦ వీభర సౌఖ్యము లుల్లమందునన్. ౨౫

తే॥ భద్రగజము మీఁదఁ - బరవు చికిలి పీలి, కుచ్చు లమరు వెల్ల - గొడుగు నీడ
సతము గాదనంగ - సహియించునే చాల, కాల మనుభవించి - క్రక్కు కూడు. ౨౬

తే॥ చిర మపుత్త్రిక చింత ము-చ్చిరుచు నుంటి, రాముఁ డా చింత దొలఁగించె- బ్రాఁతి నించి
యింక నాతండు కష్టింప - నేను జీవ, న్మాత్రఁ గడతేర్చుకొను మార్గ - మరయువాఁడ.

తే॥ రణమునన్ మరణింపఁడు - రాము తండ్రి, వార్ధకం బొందియును ధర్మ-పథమునుండి
సన్న్యసింపఁడన్ వాస్త సం-జనన మొందు, పిదపఁ బుట్టలే దనుకంటె-వేఱ యగునె?

చ॥ ఇరవుగ జ్యేష్ఠపుత్త్రుఁ డుద - యించెను జానకి యన్ రమా సతీ
వరణము కన్నులారఁ గని - బంధుర మోదము నొందినట్టి యే
నరవుగ మానినీత్వమున - నొప్పిన భూ వనితా వివాహముల్
జరపి మదంతరంగమున - సంతసమెంతయు నొంద నెంచితిన్. ౨౯

తే॥ భూమిదేవియు శ్రీదేవి ♦ ప్రేమతోడఁ, జేరఁ గోరు నాయకుని వి ♦ శిష్టమైన
ప్రాణములఁబోలెఁ బొందు త ♦ పః ఫలంబుఁ, దామసింపఁ జేయుట నాకుఁ ♦ దగవుకాదు

ఉ॥ కాన సమస్త రాజ్యమును ♦ గ్రచ్చఱ రామున కొప్పగించి య
జ్ఞానము వీడమిన్ విడని ♦ జన్మ పరంపర వీడఁగోరి నేఁ
గానకుఁ బోఁదలంచితిని ♦ గాఢ తపంబొనరింప, సింక మీ
మానిత భావముల్ దెలుప ♦ మక్కువతోడ వినంగఁ గోరెదన్ ౩౧

తే॥ దశరథుం డిట్లు వల్కఁ జి ♦ త్తముల నుండి, పొంగి పొరలిన యుత్సాహ ♦ పూర్ణులయ్యు
మంత్రు లవనిపు నెడఁబాటు ♦ మదిఁ గలంపఁ, గ్రేపు జంట కడలు గోవు ♦ క్రియ నలంగి.

తే॥ అట్లు కుంది వేషేదియు ♦ సథిపు హితము, లేమి భూమిఁ బ్రాణితతికి ♦ రాముఁబోలు
నుత్తములులేమి విధి బలం ♦ బుల్లములను, వంచ నెట్టకేలకు సమ్మ ♦ తించినారు. ౩౩

తే॥ సలువ కొడుకు వసిష్ఠుఁడు ♦ కుల హితుండు, సచివుల తలంపు పుత్త్రి పి ♦ శ్వాసము గల
తండ్రి తలఁపును లోక హి ♦ తంబు దలఁచి, తాఁదటస్థుడై యిట్లని ♦ తనియఁ బలికె.

ఉ॥ తొల్లిటి నీదువంశ గుణ ♦ ధూర్వహు లందున రామువంటి స
త్తల్లజుఁ గన్నవారెవరు? ♦ తజ్ఞుఁడ నీకిది యుక్తకార్యమే
యుల్లమునందు మిక్కిలిగ ♦ యోచన చేసియె నిశ్చయించి తీ
వెల్ల విధంబులం దలఁప ♦ నియ్యది చేయఁగఁ దగ్గ దియ్యెడన్. ౩౫

ఉ॥ పున్నెము గూర్చు జన్నములు ♦ పూర్తిగఁ జేసిన రాజచంద్రమా!
యెన్నఁ దపంబు సేయఁదగు ♦ దేడ్తఱ నీవిఁక నీదు పుత్త్రుఁడున్
నిన్ను దొఱంగఁ గాంచి ధర ♦ ణీ తరుణీ మణి యంధురాలు కా
దన్న తెఱంగునన్ బృథివి ♦ నంతయు నేల సమర్థుఁడే చుమీ. ౩౬

చ॥ తగవొక రూపుదాల్చి యువ - తారము నొందిన దంటకంటె వే
ఱుగ నొకయర్థమెత్తి యను - రూపముగా వచియింపఁ గల్గునే?
పొగడిత కెక్కు నీవిజయ - భూషణుఁడెల్ల సృజించి కాచి త్రుం
గఁగ నొనరించు నమ్మగుర - కార్యములన్ సరిదిద్దు వాఁడగున్. ౩౭

చ॥ స్థిరగుణ ధీర! లక్ష్మియగు - సీతయు భూమియు నింక నీతఁడే
యురవగు ప్రాణపంచకము - నొప్పిన తోడని యెంచు రాఘవుం
డిరవుగ స్వీయ జీవముల - కిష్టుఁడ యంట వృథా ప్రలాప మె
ల్లరకుఁ బ్రియుండు తన్నుగని - లాలన చేసిన నీకునుంబలెన్. ౩౮

ఉ॥ రాజవరేణ్యా! రాముని తి - రంబగు నామము ప్రాణికోటికిన్
దేజముఁగూర్చి దుఃఖములఁ - దీర్చు కతంబున విప్రులాదిగా

భూజనముల్ దలంత్రు తమ - పొందిన ధర్మబలంబ యంచు వి
భ్రాజిత కీర్తిశాలిపయి - బ్రాంతిని గూరిచి యేల చెప్పఁగన్? ౩౯

సీ|| కీర్తిమీఱినజాన - కీదేవి యంటి మా, భూదేవి కంటెను - పొడవుగలది
కలుముల జవరాలి - కంటెఁ గాత్యాయని, కంటె సరస్వతి - కంటె దొడ్డ
శ్రీరాముఁ డంటిమా - సీతా కటాక్ష వీ, క్షణముల కంటెను - శాంతపరుఁడు
నేర్చిన వారలు - నేర్వని వారు త్రా, వెడు నీటికంటె జీ - వితము కంటె
తే|| మించి నీజ్యేష్ఠ సుతునె ప్రే-మించు వారు, నర సురాదుల యిహము ల-ణించి కాచు
వారు రాముకంటెను గొప్ప - వారు లేరు, కాన నీకుఁ దపముగాక - కలదె వేఱు?

తే|| అనుమునీంద్రుడు పల్కు-లు విని-నంతఁ దండ్రి, కన్న నాఁటికంటె భవుని-కార్ముకంబు
విఱుచు నాఁటి కంటెను భృగు-వీరు గెలుచు,నాఁటి కంటెను గొప్పయా-నంద మొందె

సీ|| అట్టి సంతోషంబు - నందిన నరపతి, కనుల నానందాశ్రు - కణము లొలుక
నమ్మని పాద ప - ద్మమ్ముల కెఱఁగి వ, సీంద్ర యింపుగ వచి - యించితయ్య
మీదయచేతనే - యీ దాసుఁ డీభూమిఁ, దాల్చె రాముని కది - తగకయున్నె?
యుత్సాహమున హిత - ముపదేశ మొనరింప, మద్వంశ్యులగు పూర్వ - మనుజపతులు
తే|| అఖిల కకుబంత విశ్రాంత-యశముఁగనిరి, వేలుముల లెక్క-కును మీఱి-వేల్చినారు
గురు తరంబగు తమ దయ - గొంటి మంటి, మింటి సంటితి ధన్యతఁ - గంటి ననియె. ౪౨

తే|| అంత నెంతయు సంతయు-మంతు సలుపఁ, జాలు మంత్రులు మొగముల-జాడ వ్రాసి
చూప నింగితజ్ఞుండు రా-జునకుఁ దగు సు, మంత్రుఁ డిట్లని పలికెన - మస్కరించి. ౪౩

ఆ|| రాముఁడొందె రాజ్య-రమ యను ముదము మీ, సన్న్యసించు వార్త-సమయఁజేసెఁ
దలఁగఁ దగదు పూర్వ - ధర్మ పద్ధతు లిఁకఁ, దగవు కంటెఁ జెడుగు - ధరణిఁ గలదె?

ఆ|| పౌరులకును రాజ - వరులకు మునులకుఁ, మంత్రులకును భేరి - మది ధ్వనింప
జ్యేష్ఠ పుత్త్రు రాజుఁ - జేసి నీమఱు జన్మ, హితము చూచికొనుము - నృపశశాంక! ౪౫

తే|| అను సుమంత్రుని పలుకుల-కతఁడు మెచ్చి, రామ పట్టాభిషేక పూ - ర్వకము గాఁగఁ
దక్కినవి యొనరింపుఁ డీ - తరుణ మంద, యీవ వడినేగి రాఘవు - నిటకుఁ దెమ్ము.

క|| అని దశరథుఁ డాడఁగ నా, తని పదముల కెఱఁగి విమల - తత్పరుఁడై యా
తని మదిబోలెన్ వైళమ, కనక రథముఁ గొనుచు రాము - కడకుం జనియెన్. ౪౬

శా|| లోకంబుల్ వశమైన చందమునఁ బొ - ల్పుం గాంచి యుప్పొంగి య
స్తోకామోదముతో సుమంత్రుఁడు వడిన్ - జొత్తెంచి సౌధంబునన్
భూకన్యా మణితోఁ బ్రియానుజునితోఁ - బొంగార భాషించు రా
మాకారామృత మాని నేత్రములతో - నానంద సంపూర్ణుఁడై. ౪౭

మ॥ కని కైమోడ్చి రఘూత్తమా! కలదు వే - గం గార్య మొక్కండు ర
మ్మని మీతండ్రి ముదంబుతోఁ బిలువ స - న్నంపంగ నేతెంచితిన్
జనుదెండంచు వచింప రాముఁడు వడిన్ - సద్భక్తిమై లేచి స్యం
దన మెక్కెన్ బెను మేఘ మొందు కుధరేం - ద్రం బెక్కు చందంబునన్

చ॥ తొడరిక దుందుభు ల్మొరయఁ - దోయజనేత్రల కంకణంబులున్
సడలి ధ్వనింప గోరికలు - సాగ నటంచు సుపర్వు లార్వఁ బూ
మాడ్కిఁ గల చంచరీకములు - మూఁగుచు సందడి సేయఁ దేరిపై
వడివడి నేగె రాఘవుఁడు - వారని ప్రేమము తొల్కరింపఁగన్ ౫౦

ఉ॥ నిండెను వాద్య ఘోషములు - నిండెను మంగళ గేయ నాదముల్
నిండెను మారు తూపులును - నిండెను శింజిని మ్రోఁత పెల్లుగా
నిండెఁ దలంపుల న్నినులు - నిబ్బరపుస్మది మానకట్టుగా
నిండెను సిగ్గు వీడి హరి - ణీ తతి నాఁ దరుణీ వితానముల్. ౫౧

ఉ॥ కుండల కాంతితో విరియు - క్రొవ్విద తోడుతఁ జంద్రశాలలున్
మండిత గేహాళీ తతులు - మానిత రీతిని పూచెఁ దామరల్
గండెలు రక్తసిక్తముగు - కత్తులు కుంతములున్ ద్విరేఫముల్
నిండి భ్రమించి నిల్వ జిగి - నెక్కొనఁ జూచె గవాక్ష పంక్తులున్. ౫౨

తే॥ నిండు జాబిల్లి వెలుఁగొందు - నీరదంబు- వంటి రాముతొమ్మ్మెన విరి - వడమునందు
విద్రుమోష్ఠుల స్థైర్యంబు-బిడెముతోడ, వాలుగలు మధుపములతో-వరుసఁ బారలె.

ఉ॥ చిందెను కొన్ని పూవులు శ - శిప్రభ తోడ మొయిళ్లు జాజులన్
చిందెను కొన్ని ముత్తెములఁ - జెందొవఁబోలిన వౌ కటాక్షముల్
చిందెను కొన్ని చందనముఁ - జిక్కని చన్నులు వేఁడిఁ దాల్చుటన్
చిందెను కొన్ని పుష్పముల - శ్రీకర మందిర చంద్రశాలలున్. ౫౪

చ॥ తొలుక రయొలున్ దిగన్విడిచి - తుంపెసలాడు నరాజి వంటియా
జలజవిరోధి మోచికొని - చంచల మందెడి పైఁడి తీవలం
గల మొల సీటి కాయ లధి - కంబుగ సన్నని మంచు మొగ్గలన్
నులియఁగ రాల్చు నొక్కయెడ - నువ్వుల పేలలవంటి పొంబొడిన్ ౫౪

తే॥ తెరువునం జేష్ట లట్లుగాఁ - బురుషు లెల్లఁ, దల్లిఁ దలఁచు క్రేపుల వలెఁ-దమిని నిలువ
విమలుఁడగు తమ్ముతో రామ-విభుఁడు కడచి, చేరె నృపతి యతనిఁ బ్రతీ-క్షించు నెడకు

తే॥ తొలుతఁ దమ కులగురునకుఁ- దెలచి పిదపఁ, దండ్రి చరణాబ్జములకు వం-దన మొనర్ప
రాజ్యలక్ష్మికి నిరవైన-రాము నురము,నలము కొనియె భూవరుఁడు ము-దశ్రులొల్కఁ

చ॥ తనయుని కౌఁగిలించె నని ♦ తక్కువగా వచియింప నేల? మే
దిని వహియింపఁగాఁ దగు స్థి ♦ తిన్ గ్రహియింపఁ దలంచి దోర్యుగం
బును వనమాలకున్ సిరికి ♦ ముఖ్య గృహంబు విశాల వక్షమున్
దన భుజవక్షముల్ పఱపి ♦ ధారణి నాథుఁడు కౌఁగిలించి నేర్పడన్. ౫౮

ఉ॥ అంత మహా ముదంబున హృ ♦ దబ్జ మెలర్పఁగఁ జెంత నుంచి కొం
చెంతయుఁ బ్రేమ నిట్లను న ♦ హీనకుమారక రాము కీర్తి య
త్యంతము బ్రస్తుతింపఁగఁ జేసిన మ ♦ హాభుజ! నిన్ గని పెంచినట్టి యే
నింతగ వేఁడి పొందఁదగి ♦ యేర్పడ నొక్కటి విన్నుమ పల్కెదన్. ౫౯

తే॥ కష్టమొందితి ముదిమియుఁ ♦ గదిరె నొడలు, మోవఁగాలేక దుఃఖించు ♦ భూమిభార
మనెడి చెఱవీడి సత్పథ ♦ మునఁ జనంగ, నెంచి నీదగు సాయ మ ♦ ర్థించువాఁడ. ౬౦

చ॥ స్పృహ గొని పుత్త్రులం గనుట ♦ చెందిన దుర్దమ దుఃఖ మీఁగఁగా
నిహపరసౌఖ్యముల్ వడయ ♦ నే యని చెప్పుట పెద్దవారికిన్
సహజము ధర్మదేవత య ♦ సం దగు నిన్ గని యిట్లలంగు టి
మ్మహిఁ దగవే? యొడంబడుమ ♦ మానుగ నేఁ గడతేఱ నిష్టమేన్. ౬౧

చ॥ మన మహిమాన్వవాయమున ♦ మానవ నాథులు పూర్వులెందఱో
తనయులు భూమి భారమును ♦ దాల్పఁగ నింద్రియ పంచకంబుచే
మొనసెడి దొడ్డ ముప్పగను ♦ మూలము ముట్టఁగఁ ద్రుంచి నిష్ఠమైఁ
జనఁ దమ జీవితంబులఁ బ్ర ♦ శాంతముగాఁ గడతేర్చి రిద్ధరన్. ౬౨

ఉ॥ తొల్లిటి జన్మ పుణ్యముల ♦ దొడ్డ ఫలంబున నీభవంబునన్
గొల్లఁగఁ జేయు యాగములఁ ♦ గూడిన భాగ్యముచేతఁ బేర్మి రం
జిల్లఁగ నిన్నుఁగాంచియును ♦ చెందిన లాభమదేది? ముప్పునన్
జెల్లని రాజ్యచింతను ము ♦ నింగి యలందురుచుంటి నేనియున్. ౬౩

మ॥ ఒక పక్షంబునఁ గుంటి వేఱుడెన యం ♦ దుద్దండమౌ బర్వు నో
పక యల్లాడు వృషంబు భంగి నలఁచెన్ ♦ వార్ధక్యమున్ రాజ్యమున్
వికటించెన్ భువి భోగముల్ మనమునన్ ♦ వేసారితిన్ మోక్ష రూ
పక సామ్రాజ్య సుఖంబు గోరితిని త్రో ♦ వన్ దోడుగా వేఁడెదన్. ౬౪

చ॥ మును మనవారు సద్గతులు ♦ పొందు దశల్ చెడి బ్రుంగ వారికిన్
మనుమఁడు వంశదైవమగు ♦ మాధవు పజ్జలజంబు నుండి పు
ట్టిన యమరాపగన్ బలు క ♦ డింది తపంబునఁ దెచ్చి యవ్వలన్
జననము లేని మోక్షమును ♦ చక్కనఁ గూర్పఁడె యాపితాళ్లకున్? ౬౫

ఉ॥ వారక పీడఁదగ్గ పెను ♦ వంతల పీడిన వారు రాజులా
కారు సుధాంశు భోజనులు ♦ కారు సురేంద్రుని పోలు వారలా
కారు తపోధనాఢ్యులును ♦ కారు వ్రతంబులు చేయువారలా
కా రెవరన్న మాట వినఁ ♦ గాంచిన పుత్త్రులఁ గన్నవారలే. ౬౬

తే॥ ఐన జనకుఁడు వంచించి ♦ యా ర్తిభరము, గూర్చి నాపయి నని కయి♦కొనఁగ వలదు
రత్న మకుటంబుఁ దాల్చి ధ♦ర్మమును కావు,తండ్రి నీయెడఁ బొందంగఁ-దగిన విధియ

మ॥ జనకుం డిట్టిధిఁ బల్క రాముఁడెద ని ♦ ష్టం బింత లేకున్న మా
అని వాఁడై విధియంచుఁ దండ్రి మది నా ♦ రం జూచి బోధించు నా
పని యేదైనను మాఱువల్కకొనరిం ♦ పం బూనుటే నీతి పు
త్త్రిని కంచూహాముచేసి యొప్పికొన ♦ ను ద్యోగించె వల్లే యనెన్. ౬౭

ఉ॥ రాము తలం పెఱింగిన ధ ♦ రావరుఁ డాదట నావరంబు నీ
వో మితె యంచుఁ బ్రాణముల ♦ నొంటఁగఁ జేరిచి వేదసన్నిభుల్
ప్రేముడి మంత్రిపుంగవులు ♦ వెంబడిరా విభవాను భావుఁడై
హేమ మహీధరోన్నత మ ♦ హీశ్వరసౌధముఁ జేరె వేడుకన్. ౬౮

ఉ॥ ఉత్తమ విప్రులున్ విభవ ♦ యుక్తులు రాజులు స్త్రీలు పూరుషుల్
చిత్తము రంజిలన్ వెనుకఁ ♦ జేరి ప్రమోద భరంబు తోడ రా
నొత్తి మెలుల్ వహించి పెను ♦ పొందిన సుందర దోర్యుగుండు తే
ర్మెత్తన నెక్కి యేగెఁ దన ♦ మేడకు భేరులు బోరు కొల్పఁగన్. ౭౦

సీ॥ జయ శీలురగు నృప ♦ జనముల రండని, బంగారు రేకుల ♦ పైన వ్రాసి
గరుడ ముద్రను వైచి♦ గరువంబుతోఁబంపు, కులగురు నీక్షించి ♦ కువలయేశుఁ
డానిక సను భగ ♦ వానుడా! మకుటాభి, షేక సామగ్రిని ♦ సేకరింపఁ
దగు నన నతఁడును ♦ తపసికూటముతోడ, వెడలుడు సామంత ♦ విభులఁగాంచి

తే॥ రాజ ధర్మాను సారంబు ♦ రామ విభుస, కిమ్మహీంతలమొసఁగంగ ♦ నియ్యకొంటి
సనిన యవ్వాక్య మైరేయ ♦మాని క్రమము, దప్పి మోదాబ్ధిమునిఁగిరా♦ధరణిపతులు.

చ॥ ఎడగల కౌతుకం బుబికి ♦ యేపున రోమ బిలంబులందు వె
ల్వడఁ దమిఁబొంది తోడుతనె ♦ స్వర్గముఁ జేరినవారిఁబోలి యొ
క్కెడఁద గలారలై తమకె ♦ యియ్యల దక్కిన యట్టులుబ్బి య
వ్వుడమి వరేణ్యు భక్తిమెయి ♦ మ్రొక్కి వచించిరి వార లిట్టిధిన్. ౭౧

ఉ॥ ఇర్వదియొక్క మాఱు చరి ♦ యించి నృపాలుర యన్వాయముల్
గుర్వగ గొడ్డట న్నఱికి ♦ కూల్చిన యొక్కటి జామదగ్న్యుదు

ర్గర్వమడంచి మాకులముఁ ♦ గాచిన యాజగదేక వీరుఁడీ
యుర్వర నేలఁగాఁ దగును ♦ యుక్తమ నీవొనరించినాఁడవుర్ ౨౩

ఆ॥ మాఱువడక నృపకు♦మారులావిధిఁబల్కఁ, వినిన విభుఁడు మదిని ♦ వేడ్కనడఁచి
కొనుచు మఱియు నొక్క♦గురుహేతు భూతమౌ, వాక్యమిట్లుపల్కె♦వారితోడ. ౨౪

ఆ॥ పుత్రమోహమునను ♦ బుద్ధి నశింప ని, స్వార్థ నుడువ మీారు ♦ పలికి నట్టి
పలుకు మనసునిండఁ ♦ బలికినదో? లేక నన్నె యనుసరింపఁ ♦ బన్నినదియో? ౨౫

ఆ॥ అనుచుఁ బ్రశ్న సేయ ♦ నాసభ రాజులు, నిండు గుణముగలుగు ♦ నీదుతనయు
పై నిగలుగు ప్రేమ ♦ బహు దేశవాసుల, పలుకు లివ్వి యనుచుఁ ♦ బలికినారు. ౨౬

ఉ॥ దానము ధర్మముం దగవు ♦ తజ్ఞుల శీలము నభ్యసించు వి
జ్ఞానము లోకమందుగల ♦ సద్గుణ పుంజములెల్ల నిండె స
మ్మానితరీతి రాజ్యరమ ♦ మన్నన లొందఁగఁ జేరఁదగ్గ నీ
సూనుని ధైర్యశౌర్యములు ♦ చొప్పడఁబాయకయుండు నిచ్చలున్. ౨౭

క॥ ఉపయుక్త నరసి నాడఁగ, నుపయోగ కుజంబు పండ ♦ నొగి మొగిళుల వా
న పడంగ మళ్లవెల్లువ, లు పఱవ నద్దుకొను వార ♦ లుం గలరొక్కొ? ౨౮

క॥ భూమీశ! నిన్ను మిక్కిలి, ప్రేమించెదు ప్రజలపట్లఁ ♦ బ్రియ మెట్లుండున్
రామునకు నట్టిప్రేమయె, రామునియెడ నుండు నిజము ♦ ప్రజ కెల్లపుడున్. ౨౯

క॥ అని పలుకఁ గోసలేశుఁడు, మనమున నానందవార్ధి ♦ మగ్నుం డగుచున్
దనిసెను చింతల నీఁగెను, కనుల ముదశ్రువులు రాల ♦ గడ కిట్లనియెన్. ౩౦

క॥ నడియునికి తగవు చెడుగుల, యెడఁ గశివత గలుగు శీల ♦ నృపులారా! యీా
తఁడు నాకొడుకెట్లగు మీా, కొడుకగు నిల్లడగ వీనిఁ ♦ గొనుఁడం చవలన్ ౩౧

క॥ రాజసభనంపి కోసల, రాజన్యుఁడు శుభదినమున ♦ రాజిలు లగ్నం
బోజఁ గన జోస్యులంగొని, యోజింపఁగ నొక్కచవిక ♦ కొందగఁ జనియెన్. ౩౨

క॥ మడఁతులు నలువురుప్రేముడి, దొడఁకఁ బిగులు చన్నుకట్టు ♦ గలిగిన వారల్
పొడవు జడ గలిగి సన్నని, నడుములు గలవారు పరుగు ♦ నం జనువారల్. ౩౩

క॥ ఆడుచు నొడలి వివశతం, బాడుచుఁ జేడియల మీాదఁ ♦ బడుచుఁబ్రియమునం
గూడుచు వారలకుం గై, మోడుచుచుం బఱచి డాయఁ ♦ బోయిరి వడిగాన్. ౩౪

తే॥ కాలజీమూత దేహుని ♦ కన్నతల్లి, వారి చేష్టలఁ గని చంద్ర ♦ వదనలార!
పట్టరానట్టి సంతోష ♦ వార్తయొండు, గలిగినటు దోఁచెఁ గలదేని ♦ పలుకుఁడనఁగ

తే॥ ధరణిపులు వీరకటక పా♦దములుగొలువ, నింపుమైభూమిఁ జిరము పా♦లింపుమనుచు

నీదు జ్యేష్ఠపుత్త్రునకు భూ♦నేత ప్రాంతి, మకుటమ్ము గూర్పనున్నాఁడు♦మస్తకమున. ౨౬

తే॥ రామునకు రాజ్యసంపద ♦ క్రాలె ననుచు, మునమునం దోఁచు నానంద ♦ వనధి గురుతి నవనిపుఁడు సన్న్యసించెడు ♦ ననెడి భయము, బాడబముఁ బోలె వట్టి పో♦వంగఁ జేసె.

ఆ॥ అట్టిదయ్యు నామె ♦ యరుదైన మణిహార, వితతి ద్రవ్యరాశి ♦ వేడ్కనొసఁగి మైత్రి పాత్రమగు సు ♦ మిత్రతో నేతెంచె, జక్రపాణి యమరు ♦సదనమునకు. ౨౭

ఆ॥ చేరి భక్తి మ్రొక్కి ♦ శ్రీదేవి భూదేవి, తో సనాదియగుచుఁ ♦ దోఁచి యమర వరులకెల్ల మేటి ♦ ప్రాణంబు జ్ఞానంబు, నగు ముకుందు శ్రీప ♦ దాబ్జములకు. ౨౮

తే॥ లోకముల గొప్పయుదరంబు♦లోనడంచు, కొన్న విశ్వేశ! వరద! నా♦కొడుకుఁ గాచు టెల్ల నీయధీనంబని ♦ యుల్లమంద, యడఁగు తపమొప్పు కౌసల్య ♦ యర్థిఁ బలికె. ౩౦

తే॥ షోడశోప చారంబుగ ♦ శ్రుతి హితముగ, నాదిదేవు నారాధన ♦ మాచరించి యచటనున్న తపస్వుల ♦ నాదరించి, వత్సయుత ధేను వితతుల ♦ వారికొసఁగె. ౩౧

ఆ॥ భూసురులకు మణులు ♦ భూములు కన్యకల్, చందనంబు పసిఁడి ♦ సన్న వలువ లన్నమును విభూష ♦ లరుదైన గేహముల్, నిరిని గాఁగ నొసఁగె ♦ వేడ్క నొసఁగ

తే॥ ఒసఁగి శ్రీవరు పదముల ♦ కొనర నెఱఁగి, పొగడి సేవించి వలగొని ♦ నగరి కరిగి ప్రాంత వ్రతముల నన్నింటి ♦ నూంత గొనియె, రామునకు మంగళంబులు ♦ రాజిలంగ

## ౨. మంథర బోధన పటలము. (౨౩)

క॥ భూమీశుఁడు జ్యోతిషికుల, మోములు వీక్షింపఁ గాంచి ♦ ముదితుండై శ్రీ రామాభిషేక మతులు, కామెంతగాఁ దగిన లగ్న ♦ మరయుఁడి యనినన్. ౩౪

తే॥ భవ్య లగ్నంబు రేప రే♦పకడ నున్న, దనుచు మౌహూర్తికులు వల్క♦మనుజవిభుఁడు విని యనింద్య తపోగ్రణి♦విమల సుగుణ, గణ్యుఁడు వసిష్ఠుఁ డిటువచ్చుఁ♦గాక యనియె

తే॥ దేవపీయూష మట్లరు♦దెంచు మౌనిఁ, గాంచి శుభ ముహూర్తము రేపె♦గాన మీరు శ్రేయములు గూర్చు విధు లాచ♦రించి రాఘు, వునకు వలయు నీతులను తె♦ల్పుఁడీయనంగ

తే॥ తమియుఁ దానుగా ముందేగి♦తపసి వరుఁడు, రాము సుందరోన్నతమంది♦రంబుఁ దఱియ మౌని రాకయెఱింగి సం♦భ్రమము దొలఁక, నెదురు వచ్చి లోనికిఁగొని♦యేగె నతఁడు

క॥ నేరువఁ దగు శాస్త్రంబులఁ, గూరిమి విని తనివినొందు ♦ కొమరుని గని యో వీరాగ్రగణ్యా! రేపే, భూరమణుఁడు నీకుఁ బట్ట ♦ ముం గట్టుఁ జుమీ. ౩౫

క॥ ఉన్నవి నుడువఁగఁ దగినవి, మన్నిసికి సావధాన ♦ మతివై విను మీ విన్నవి మఱవక మనమున, నెన్నికఁ గొని యట్లు నడవు ♦ మిద్ధ చరిత్రా! ౩౬

క॥ హరి హరధాతల కంటెను, ధరాది భూతముల కంటెఁ ♦ దథ్యము కంటెన్
స్థిర విబుధు లున్నతులు త, త్పర మతివై నలుపు తత్స ♦ పర్యలు వత్సా! ౧౦౦

క॥ అలిగి చెఱుపఁ గరుణించియుఁ, గలిమి నిలుపఁ గందువంబు ♦ గల వారలు వే
ల్పులె నొచ్చి విచ్చిరన నా, ర్యుల మహిమం గొలుచు బద్ధ ♦ యున్నదె? వత్సా!

క॥ క్రూర గుణములకు మిక్కిలి, దూరుల చరణములు శిరము ♦ తోట్టఁ దెలిచి యిం
పారఁగ మాటాడుము నుడి, వారల దూషణము సేఁత ♦ వదలుము వత్సా! ౧౦౨

క॥ పొదలను ప్రిమలను వారల, ముదలఁ గొనియె విధియు నడచు ♦ మొగి నన నీఁక నె
య్యది గలదు పూజ్య పూజకు, సదృశం బిరు మెయికి నరయఁ ♦ జను నిడి వత్సా!

క॥ పలుకు నుడివాలు శూలము, గలిగి వలఁతులైన ముగురు ♦ కర్తలకును ని
శ్చలత దయ తగవు లేదే, నలవడునే మేల్మి యించు ♦ కంతయు వత్సా! ౧౦౪

క॥ వసుధఁ జెలి యాది సప్త, వ్యసనంబులు సేకు లేని ♦ వగు నైసనవే
కసటుల కెల్లను కుదురులు, కసెము లనుచు హృదయమందు ♦ కాంచుము వత్సా!

క॥ సమరస భావము గలిగిన, సమరమ్ములు గలుగ వసము ♦ స్రగ్గదు సేనల్
సమయవు తత్సుకృతస్థితి, యమరినఁ జెడఁగోర వలెనె? యరులను వత్సా! ౧౦౬

క॥ తనియఁగ నింద్రియములు కలి, మిని నిత్యము పెనిచి పాడి ♦ మిగులంగ దిటం
బున నేలున దేల్బడి య, ప్పని యసిధారా వ్రతంబు ♦ పాటిది వత్సా! ౧౦౭

క॥ హరి హర హిరణ్య గర్భులు, పొరసిన భుజ బలము పెంపు ♦ పొందిన యేనిన్
నర వరులు సచివ బల మను, సరించుట బలీయమైన ♦ చక్కటి వత్సా! ౧౦౮

క॥ నరుల కమరులకు బలితపు, టరులగు నక్షముల నిగ్ర ♦ హము చేయుటచేఁ
బెరుఁగునె సంపద జగముల, నరుదగు ప్రేమంబు మిగుల ♦ నడరక వత్సా! ౧౦౯

క॥ జనములె జీవముగాఁ దాఁ, దనువుగ నొప్పారు ధరణి ♦ ధవునకుఁ దగవున్
నెనరును నిచ్చలముగ ని, ల్చినచో జన్నంబు లేల ♦ చేయఁగ? వత్సా! ౧౧౦

క॥ ప్రియ వాక్యజ్ఞత యాగియు, జయము విమల గుణము శుద్ధి ♦ జతనము తగవున్
దయయుఁ బరామర్శము గల, నయ విదులం జేటు లలమి ♦ నలఁచునె? వత్సా! ౧౧౧

క॥ సిలుఁగులఁ దొలఁచుచుఁ ద్రాసున, ములు పగిదిఁ దటస్థుఁడైన ♦ భూవరునకు మం
త్రుల లక్ష్య సమీక్ష యొనరఁ, గల కాలము గాక కనులు ♦ గలవే? వత్సా! ౧౧౨

క॥ ధర ధూమకేతు లనఁదగు, తరుణుల వలలోనఁ జిక్కి ♦ తపియింపఁడయేన్
సెరగను పేరును గలుగదు, నరకంబును లేదతనికి ♦ నమ్ముము వత్సా!. ౧౧౩

తే॥ తగ విమర్శింప నెడలేని ♦ తగవుపనులు, గోటగాఁగల ప్రాజ్ఞ వా ♦ క్కులకు లొంగి
తెరువు దప్పని విధియు వ♦ ర్తించు వారి, కరుణ పడయు నదియ మేటి♦తెరువు వత్స!

తే॥ తత్త్వవిదుఁ డిట్లు పెక్కు వి ♦ ధాల నయము, భువన గర్భున కుపదేశ ♦ మును బొనర్చి
యరయుకను వెలిఁగించి న ♦ హస్ర శీర్షు, నాలయంబున కేతెంచె♦నతని తోడ. ౧౧౫

తే॥ శేష శయనుఁ డౌ లక్ష్మీశుఁ ♦ జేరికొలిచి, వేద పూత జలంబుచే ♦ వేగ జలక
మార్చి సద్విధుల్ చక్కఁగాఁ♦దీర్చి తెల్ల, దర్భలఁ బఱపి రామునా ♦ స్థలిని నిలిపి.

ఆ॥ రామచంద్రుఁ డందు ♦ రంజిల్ల నుపవసిం, పఁగ వసిష్ఠుఁ డేగి ♦ ప్రభున కద్ది
తెలుప నతఁడు సేవ♦కులకు నాజ్ఞాపించె, లలిత రీతిఁ బురము♦ లంకరింప. ౧౧౭

తే॥ రామచంద్రుండు రేపు భూ♦రమణుఁడగుచుఁ, బట్టముం గట్టుకొన నుండెఁ♦బౌరులార!
పురముఁ గై సేయుఁడని తల ♦ వరులు పూన్కి, భేరులన్ మొరయించిరి ♦ వేల్పులలర.

ఆ॥ గేయమాస విమల♦కీర్తి రాముఁడు రేపె, ప్రాభవంబు తోడ ♦ రత్న ముకుట
మును ధరించు నన్న♦మోదవాక్కులు వారి, కమృత మబ్బి నట్టు ♦ లయ్యెవినఁగ.

క॥ జనములు కోలాహలముగ, ధ్వని చేసిరి తనిసి రాడి ♦ పాడిరి పులకల్
తనరఁగఁ బూరించిరి త్రే, నిని పొగడిరి తలవరులకు ♦ నినిచి రుపదలన్. ౧౨౦

ఆ॥ ప్రేమతోడఁ బ్రజయు ♦ వేవెలుంగును కౌస్తు, భమును సానవట్టు♦ పగిదినొప్పి
మును పె యంద మగుచు ♦ మొనసిన నగరంబు, నంచుగా నలంక♦రించి నారు. ౧౨౧

క॥ పలు రంగుల వెలయు పతా, కలు చూడన్ రాము కలిమిఁ ♦ గాంచెడు వేడ్కన్
బలు వన్నెల పులుఁగులు వరు, సలుగా నప్పురము చేరు ♦ సరణిం దోఁచెన్. ౧౨౨

చ॥ వనితల నిద్దమౌ తొడల ♦ వంటి యనంటులు వారి గొంతులం
జెనసిన పోఁక బ్రమాఁకులును ♦ చెన్నగు వారి రదాళిఁబోలు సం
తనగల తారహారములు ♦ తత్కుచ సామ్య మహిష్ఠ తప్త కాం
చన కలశంబులున్ నగరి ♦ జానుగఁ గానఁగ నయ్యె నెల్లెడన్. ౧౨౩

ఉ॥ అంబుధి సంభవుం దగులు ♦ నట్టి వినూతన తోరణంపుఁ గం
బంబులు వెల్గు గోపురపు ♦ ద్వారము లందలి ఢాలు సుప్రభా
తాంబుజ మిత్రుకాంతి వడ ♦ నగ్గలికంబుగఁ గ్రొత్త చంద మం
దంబుగ నొందియొప్పెఁ గను ♦ దమ్ములకున్ మిఱుమిట్లు గొల్పుచున్.

తే॥ ధవళ కవచ రత్న స్తంభ ♦ తతులు భూతి, గలుగు నర్ధ నారీశ్వరు ♦ కైపు దోఁచె
విద్రుమ స్తంభములుమంచు♦విరియమఱిఁగి, యులరుమార్తాండురూపంబు♦ననుకరించె.

ఉ॥ ముత్తియముల్ మనోహరతఁ ♦ బూర్ణ శశాంకుని కాంతి వీవ సం
పత్తమ పద్మరాగములు ♦ ప్రాగుదయార్క గభస్తి లీన న

తే॥ చెదుగుసేయువాలునుపోలి♦చిలుముగలుగు,రాహుకబళించువఱకుమా♦ఱనిమృగాంక
బింబముంబలె వెల్గువ ♦ విధినిరెచ్చు, దుఃఖములు సమీపింప ని ♦ ద్దుర వహింతె?

ఆ॥ కొడిమ విసముఁ బోలు ♦ చెడుగరి గుజ్జట్లు, పలుకఁ గైక చాప ♦ పాణు లగుచు
నా కుమార వరులు ♦ నలి నున్న వారు ధ, ర్మంబు దలఁగ రెట్లు♦మలయుఁగీడు? ౧౩౭

ఆ॥ పొగడఁ దగిన సుతులఁ ♦ బొందిన జనములు, కీడు దొలఁగి పోను ♦ ఖంత్రు నిజము
శ్రుతులఁ బోలు రాము ♦ సొంపారఁగను నాకు, నాపదయును కలదె♦యవని యందు?

తే॥ గారమను నబ్ధి మునిఁగిన ♦ కైక యిట్లు, పలుక వంకరసాసంబు ♦ పగిది నొప్పు
కుబ్జయనుఁ, దూలె మేలిమి♦కూలె సిరియు, నేర్పు చేతఁ గౌసల్య య♦న్నియుఁగడించె.

తే॥అనుడుఁగైకయిట్లనుభర్త♦యధిపుఁడగుడు, పొగడఁదగుగుణభరతుండు♦పుత్త్రుఁడగుడు
నింత కంటెను కౌసల్య ♦ కేమి కోరఁ, దగిన సుఖ జీవితం బింక ♦ధరణిఁ గలదు? ౧౪౦

తే॥ వీరులు హసింప మగపాడి♦దూఱువడఁగఁ, దాటకంజంపురాముఁడు♦త్యాగియగుచు
నెల్లి రాజ్యాభిషేకంబు ♦ నెనయఁగలఁడు. కడకుఁ గౌసల్యగాంచు సు♦ఖంబు నిదియ.

తే॥ అనుచు మంథర యవ్వార్త ♦ వినుచు నంతఁ, గైక కౌసల్యల యెడంద ♦ లేక మగుచు
భేదముంబొందకుండె భూ♦విభుఁడుదశర,థుండు కైకేయిమదిఁబొచ్చి♦యుండఁబోలు

చ॥ కలిగిన గొప్ప ప్రేమ యను ♦ కంధి విరావము తోడ నుబ్బఁగాఁ
గలఁగని నిండు చందురుని ♦ కైవడి నొప్పు మొగంబు తేటయై
వెలయఁగఁ గైక యుల్లమున ♦ వేడుక యెల్లను మీఱ మూఁడు వ
హ్నులకు శిరో విభూష యన ♦ నొప్పిన రత్న సరం బొసంగఁగన్. ౧౪౩

ఉ॥ వంచక దాసి నేత్రముల ♦ వహ్ని కణంబులు రాలఁ జూచె గాం
డ్రించె నదల్చెఁ దిట్టె బెద ♦ రించె రదంబులు గీఁటె భూమలం
ద్రెంచెను నెత్తి గొట్టు కొనెఁ ♦ ద్రెళ్లెను బోరున నేడ్చె వెక్కెఁ గో
పించెను రత్నహారమును ♦ వేసెను మేదిని పల్లమేర్పడన్. ౧౪౪

ఉ॥ వేసటఁ జూచి చూచి యవి ♦ వేకిని వింత యెఱుంగ లేవు పె
న్మోసము లేమి నింకఁ జెడి♦పోయెదు పుత్రుని తోడ నీవు, నా
కోసలరాజ పుత్త్రి తన ♦ కోరిక నొందెను నీ సపత్నికిన్
దాసుల కింక నేఁ జిరము ♦ దాస్యము సేయఁగఁ జాల నోర్చుమె. ౧౪౫

తే॥ అవనిజయు రాఘవుఁడు నున్న♦తాసనములఁ, గ్రాల నీపట్టి యట నిల్చి♦కేలు మోడ్చి
పనుపు సేయ నీవొందు నం ♦ బర మదేది?, దీనఁ బొందిన నీమన ♦ స్థిరత యెద్ది? ౧౪౬

మ॥ తన మేల్గున్ మది నెన్నఁడున్ మఱవ దా ♦ తంత్రజ్ఞ కౌసల్య, త
త్తనయుండో తన తండ్రి రాజ్య రమఁ దా ♦ దక్కించు కొన్నాఁడయా, నీ

తే॥ చెడుగుసేయువాలునుపోలి♦చిలుముగలుగు, రాహువకబళించువఱకుమా♦ఱనిమృగాంక
బింబమునుంబలె వెల్లువ ♦ విధిని రెచ్చు, దుఃఖములు సమీపింపని ♦ ద్దుర వహింతె?

ఆ॥ కొడిమ పినముఁ బోలు ♦ చెడుగరి గుజ్జట్లు, పలుకఁ గైక చాప ♦ పాణు లగుచు
నా కుమార వరులు ♦ నలి నున్న వారు ధ, ర్మంబు దలఁగ రెట్లు♦మలయుఁగీడు? ౧౩౭

ఆ॥ పొగడఁ దగిన సుతులఁ ♦ బొందిన జనములు, కీడు దొలఁగి పోను ♦ ఖంత్రము నిజము
శ్రుతులఁ బోలు రాము ♦ సొంపారఁగను నాకు, నాపదయును కలదె♦యవని యందు?

తే॥ గారమను నబ్ధి మునిఁగిన ♦ కైక యిట్లు, పలుక వంకర పాపంబు ♦ పగిది నొప్పు
కుబ్జయనుఁ, దూలె మేలిమి♦కూలె సిరియు, నేర్పు చేతఁ గౌసల్య య♦న్నియుఁగడించె.

తే॥అనుడుఁగైకయిట్లనుభర్త♦యధిపుఁడగుడు, పొగడఁదగుగుణభరతుండు♦పుత్త్రుఁడగుడు
నింత కంటెను కౌసల్య ♦ కేమి కోరఁ, దగిన సుఖ జీవితం బింక ♦ధరణిఁ గలదు? ౧౪౦

తే॥ వీరులు హసింప మగపాడి♦దూఱువడఁగఁ, బాటకంబంపురాముఁడు♦త్సాహియగుచు
నెల్లి రాజ్యాభిషేకంబు ♦ నెసయుఁగలఁడు. కడకుఁ గౌసల్యగాంచు సు♦ఖంబు నిదియ.

తే॥ అనుచు మంథర యవ్వార్త ♦ వినుచు నంతఁ, గైక కౌసల్యాల యెడంద ♦ లేక మగుచు
భేదముంబొందకుండె భూ♦విభుఁడుదశరథుండు కైకేయిమదిఁబొచ్చి♦యుండఁబోలు

చ॥ కలిగిన గొప్ప ప్రేమ యను ♦ కంథ నిరావము తోడ నుబ్బఁగాఁ
గలఁగని నిండు చందురుని ♦ కై వడి నొప్పు మొగంబు తేటయై
వెలయఁగఁ గైక యుల్లమున ♦ వేడుక యెల్లను మీఱ మూఁడు వ
హ్నులకు శిరో విభూష యన ♦ నొప్పిన రత్న సరం బొసంగఁగన్. ౧౪౩

ఉ॥ వంచక దాసి నేత్రముల ♦ వహ్ని కణంబులు రాలఁ జూచె గాం
డ్రించె నదల్చెఁ దిట్టె బెద ♦ రించె రదంబులు గీఱె భూషలం
ద్రెంచెను నెత్తి గొట్టు కొనెఁ ♦ ద్రెళ్లెను బోరున నేడ్చె వెక్కెఁ గో
పించెను రత్నహారమును ♦ వ్రేసెను మేదిని పల్లమేర్పడన్. ౧౪౪

ఉ॥ వేసటఁ జూచి చూచి యువి ♦ వేకిని యింత యెఱుంగలేవు పె
న్మోసము లేమి నింకఁ జెడి♦పోయెదు పుత్రుని తోడ నీవు, నా
కోసలరాజ పుత్త్రి తన ♦ కోరిక నొందెను నీ సపత్నికిన్
దాసుల కింక నేఁ జిరము ♦ దాస్యము సేయఁగఁ జాల నోర్పమై. ౧౪౫

తే॥ అవనిజయు రాఘవుఁడు నున్న♦తాననములఁ, గ్రాల నీపట్టి యట నిల్చి♦కేలు మోడ్చి
పనుపు సేయ నీవొందు సం ♦ బర మదేది?. దీనఁ బొందిన నీమన ♦ స్థిరత యెద్ది? ౧౪౬

మ॥ తన మేలున్ మది నెన్నఁడున్ మఱవ దా ♦ తంత్రజ్ఞ కౌసల్య, త
త్తనయుండో తన తండ్రి రాజ్య రమఁ దాఁ ♦ దక్కించు కొన్నాఁడు, నీ

తనయునిం డెల్లను నీఁగెఁ దెచ్చి నతండొకఁ ♦ డక్కేకయియుం గాఁడ, యే
మని నీ దుఃఖము దీర్చి కొందు? భరతుం ♦ డా! నీవు కన్నావొకో! ౧౪౮

చ॥ ధరణిని రాముఁడే యతని ♦ తమ్ముఁడు లక్ష్మణు తోడ నేలుచో
భరతుఁడు వాని తమ్ముఁడును ♦ భారపు జీవిత కాల మంతయున్
దొరలఁగ రాజ్యము న్విడిచి ♦ దుర్గమ కానన సీమలందు దు
ష్కర తపముల్ వ్రతంబులును ♦ చల్పఁగఁ బంపుట మేలు చూడఁగన్. ౧౪౯

తే॥ రథ గజాదులఁ గల్గి భూ ♦ రమణి వలచు, నంత సుందరుఁడై రాజు ♦ లందు లెక్క
పెట్టఁ దగినట్లు భరతుండు ♦ పుట్ట లేదు, కాన గిట్టుటయే మేలు ♦ కాదె తలఁప. ౧౪౯

తే॥ పుణ్య హీనుని భరతుని ♦ మున్నె తండ్రి, యాజ్ఞ యొసఁగి కారడవి ద ♦ వ్వరుగు నట్లు
వడిగఁ బంపిన హేతు వి ♦ ప్పట్ల నాకుఁ, దెల్ల మయ్యెఁ; బట్ట పగట ♦ దీప మేల? ౧౫౦

తే॥ భేద బుద్ధి మనంబునఁ ♦ బెట్టి యిట్లు, రాజ్య మాతని కిచ్చు కా ♦ రణము వలన
తండ్రి క్రూరుండు తల్లియు ♦ దైత్యురాలు, చిన్ని భరత! నీవే మిఁకఁ ♦ జేయు దయ్య.

ఉ॥ రాజ కులంబునం బొడమి ♦ రాజ గృహంబుననే పెరింగి పై
రాజ గృహంబు సొచ్చి మఱి ♦ రాజ కళత్రమ వైతి వయ్యు నీ
వోజను వేల గానని మ ♦ హోగ్ర విపజ్జల రాశిలోఁ బడం
గాఁ జనుచుంటి చెప్పినను ♦ కానవు నీకును లేదు బుద్ధియున్. ౧౫౨

ఉ॥ విద్యయు యౌవనంబు నల ♦ విం గనరాని బలంబు మేల్ ధను
ర్విద్యయుఁ బేర్మి యందమును ♦ వీర్యము శీలము సద్గుణంబులున్
హృద్యముగాఁగ నీసుతున ♦ కేర్పడి యుండుట శౌర్యలంబుపై
నుద్యమ మొప్ప దేవ సుధ ♦ నొల్కఁగఁ జేసిన చందమయ్యెఁగా!. ౧౫౩

తే॥ నాల్క చేదగు నట్లు మం ♦ థర వచించు, చెడుగు పలుకులు మండెడు ♦ చిచ్చునందు
ప్రాజ్యముం బోసినట్లు కో ♦ పంబుఁ బెంపఁ, గనులు కెంపుగదురఁ బల్కెఁ ♦ గైకయిట్లు

చ॥ దినమణి యాదిగాఁగఁ గుల ♦ ధీరులు ప్రాణ ధనంబు లూడినన్
దనరిన నీతి మార్గమును ♦ తప్పరు; కేకయ వంశ విశ్రుతుల్
మనుకుల మాఱు దూఱువడు ♦ మార్గము దెల్పెదె? క్రూరురాల! యే
మని వచియించి తిట్టు లిఁక ♦ నాడకు జీవము లింత లీపయేన్. ౧౫౫

చ॥ తనియఁగ నాకు మేలల్పుపు ♦ దానవు కావిఁక నాదు పట్టికిం
జనవున శ్రేయముం బొనరఁ ♦ జల్పెదు దానవు కావు రాచ పా
డిని గమనింప నీకును ఘ ♦ టింపదు లగ్గు వివేకహీన! నిన్
గొని కలుషంబు దుర్విధియుఁ ♦ గోరిక నార్పఁగ నాడి తిన్విధిన్. ౧౫౬

ఉ॥ పుట్టిన గిట్టిన న్నరులు ♦ పొందుట వీడుట కీర్తియే యనన్
జుట్టులు వీడినన్ గుణము ♦ మాఁడిన నీతి విపర్యయ స్థితిం
బట్టిన వీక దప్పినను ♦ పాడి తపంబులు మాఱు పొందినం
బుట్టిన వంశ ధర్మమును ♦ పో విడువం దగునే సరోజినీ! ౧౫౭

చ॥ నిలువక పొమ్ము నాయెదుట♦నిల్చి దురాపము లల్పవాక్యముల్
పలికిన నీదు నాలుకను ♦ పచ్చడి సేయక యోర్చి మానితిన్
బలుకకు మిద్ది యొద్దు వినఁ ♦ బాప ఫలంబును తప్ప కొందెదో
పలువ! దురాత్మురాల! యిట ♦ వాగకు మాయుము నోరి నింకనే. ౧౫౮

చ॥ విసమును తీసిపై చినను ♦ వీడక ప్రాణిని కష్టపెట్టు స
శ్లైసఁగి తదీయవాక్యముల ♦ కించుక జంకక కుబ్జ యోర్పు మై
గుసుమలతా! మదాశ్రయమ! కొంచక వెక్కసమైన నీకు మే
లొసఁగు హితోక్తులన్ విడువ ♦ నోప సటంచును పట్టెఁ బాదముల్. ౧౫౯

తే॥ జ్యేష్ఠునకె రాజ్యభారంబు ♦ చెల్లునన్నఁ, దండ్రి కంటె రాముఁడు పిన్న ♦తండె కాఁడె
తేఁడె దీనికి సంగీక ♦ రించె ననఁగ, భరతునకు నీయ సక్రమ ♦ భంగ మగునె?. ౧౬౦

ఉ॥ ధర్మము నిండు ప్రేమగల ♦ తాపస వర్యులకైన సార్ద్రమా
శర్మము నొందు నాపిదపఁ ♦ జయ్యన మాఱు స్వభావ ముల్లస
త్కర్మలె యయ్యు నింతవడి ♦ కష్టము గూర్పని వారు మీఁద దు
ష్కర్మవు లాచరింత్రు మదిఁ ♦ గాఱియ సెందుచుఁ గ్రుంగునట్లుగన్. ౧౬౧

తే॥ నూనుఁ జేలికయైన న ♦ నూయ యెడఁద, గలుగు కౌసల్య కత్యంత ♦ బలము గలుగు
నీకు నీకొడుకున కామె ♦ నెసరు చేసి, యిచ్చు నల్పంబు గాక వే♦ఱేమి గలదు? ౧౬౨

ఉ॥ ప్రేరణ సేయు కష్టమును ♦ బీదఱికంబును దొట్టి నిల్వ ని
న్నోరిన వారికిన్ సవతిఁ ♦ గోరి యొసంగెదొ? సిగ్గు నొందెదో?
మాఱని సంకటంబునను ♦ మాఁడెదొ? యూరక పొమ్మటందువో?
యేరహి జీవితంబు భరి ♦ యించెదొ? కుందెదొ? క్రుంగికూలెదో? ౧౬౩

ఉ॥ ఏమి యొనర్ప నీయెడఁద ♦ నెంచితి వింకను కొన్ని నాళ్ళలో
లేమిని దీసతన్ మది చ ♦ లింపఁగ నిన్నను తల్లిదండ్రులో
ప్రేముడి చుట్ట పక్కములొ ♦ వేడఁగ వచ్చినవారొ కాంచుటల్
నీమహిమమ్మొ? నీసవతి ♦ నిక్కపు సంపదయో వచింపుమా? ౧౬౪

చ॥ చసవును చూపు నీపతికి ♦ జంకియె నిక్కము సుమ్ము జానకీ
జనకుఁడు రాము మామ యని ♦ జక్కఁగఁ జేయఁగలేకపోయె నీ

జనకుని యింక నాతనికి ♦ సౌఖ్యమయంబగు జీవితంబు గ
ల్గునె? నినువోలె నాఁడిని ♦ కుందఁగఁబుట్టిరె యేరు వీఁటిఁడీ! ౧౬౫

తే॥ క్రూర శాత్రవుల్ తండ్రి మాఱుకొనిన వేళ, వీర లెంతమాత్రముతోడు ♦ గారుగాన
జయ మదెట్లబ్బు? నీవు సీ ♦ జనుల తోడఁ, జెడఁగ దుఃఖాబ్ధిఁబడ సాహ ♦ సించి తిట్లు

క॥ నీ ముద్దు కొమరుఁ జెఱచితి, వీ మహి తొలుదొల్త నబ్బు ♦ నెవని కతని గా
రాము సుతుల కయ్యెడు నా, పై మాఱుక యట్లె వారి - వారికి నబ్బున్. ౧౬౭

ఆ॥ పలువ దాసి యిట్లు ♦ పలుక దివ్యుల మాయ, వలన వారు పొందు ♦ వరబలమున
ఘనులు చేయు తపము ♦ కతమునఁ గైకేయి, విమల మనము మాఱి ♦ వెడఁగునొందె

తే॥ సురవిరోధుల క్రౌర్యంబు ♦ సురల తపము, పండి ప్రేరేపఁగ మధుర ♦ వాణి కరుణ
వీడుటఁగదా రాముని ♦ వినుత కీర్తి, సుధను ద్రావుచున్నారలు ♦ సుజన వరులు

తే॥ అట్టి కైకేయి మంథర ♦ నలరఁ జూచి, సన్ను ప్రేమించి నా పుత్త్రు ♦ నకు నయంబు
సేయుదానవు ముకుటాభి ♦ షేకమతఁడు, పొందువిధమది పొనఁగఁ దె ♦ ల్పుమ యటన్న

తే॥ దాసి యిట్లను కైమోడ్చి ♦ దైన్యమింక, నీకుఁగల్గునె? నావాక్య ♦ నియతి విడక
జరుగుదే నయోధ్యయెకాదు ♦ జగములెల్ల, సంతరింతు నీసుతునకుఁ ♦ జదురు రాలు!

తే॥ అరసి చెరిఁగి గ్రాలించి వా ♦ క్యం బొకండు, పలికెదను విను మున్ను శం ♦ బరుని కలన
గెలుచు నాఁడొసఁగిన వర ♦ ములను రెంటి, నిపుడు పడయుము విడక ప్రా ♦ ణేశునొద్ద

తే॥ ఒకట మేదినిఁగొని మఱి ♦ యొకట సవతి, కొడుకు రాష్ట్రంబు త్యజియించి ♦ ఘోర కాన
నముల నలయ నంపుముసమ ♦ స్తముఫలించు, నని యెనొడలియుల్లెడవంక ♦ యమరుకుబ్జ.

తే॥ దాసియారీతిఁబల్కసం ♦ తసమునొంది, యలమికొనుచుఁ గైకయమూల్య ♦ హారమమిత
ధనమొసంగి నాసుతునకు ♦ ధరణియెల్ల, నిచ్చితిఁక రాజమాతవు ♦ నీవ సుమ్ము. ౧౭౪

తే॥ మంచి వెరవు బోధించితి ♦ వంచితముగఁ, బొట్టివారికిఁ బుట్టెఁడు ♦ బుద్ధులనుట
నిజము; నేఁడు నాకోరికల్ ♦ నెగ్గుటొ పతి, కడన జీవముల్ వదలుటొ ♦ గలుగుఁ బొమ్ము

మ॥ అనుచుం దాసిని సాగనంపి సుమశ ♦ య్యం డిగ్గి నీలంపుఁ గొ
ప్పును విప్పెన్ విరులన్ విదిర్చెను శిరో ♦ భూషల్ త్యజించెన్ మహా
ఘన జీమూతమునన్ మఱుంగిన సన ♦ క్షత్రము న్నిశానాథు బై
లునకుం దీసిన లీలఁ దేనియ కళు ♦ ల్మోఁగన్ రొదల్సేయుచున్. ౧౭౬

చ॥ పెరిఁగెడు కీర్తి వల్లికను ♦ వేరులతోఁ దెగఁద్రుంచె నాఁగ బం
ధుర లసదంగమా రశనఁ ♦ ద్రుంచి విదుర్చుచుఁ గాలి యందెలన్
వర కటకంబులం దిగిచి ♦ వైచి శశాంకు కలంకు దుడ్చు వై
ఖరి నుదుటన్ రహించు తిల ♦ కంబును పోఁదుడిచెం దటుక్కునన్. ౧౭౭

చ॥ తొడవుల నొక్కొకండుగను ♦ త్రుంచి చెదర్చి ధరాతలంబుపైఁ
బొడవగు వెండ్రుకల్ వలపు ♦ పొంపిరి వోవఁగ విప్పి కన్నులం
దడలిన యంజనంబు వడి ♦ ధారలుగాఁ గరఁగంగ నేడ్చుచుం
బుడమిని పొర్లుచుండె నట ♦ బువ్వులు రాలిన తీఁగపోలికన్ ౧౭౮

ఉ॥ పెచ్చగు తాపమొంది పృథి ♦ వింబడు జింకను పోలి నృత్యమున్
మచ్చికఁ జేయు నెమ్మి పురి ♦ మడ్చి యడంగిన భాతి సీత యన్
లచ్చి యయోధ్య వీడుటఁ ద ♦ లంచి ముదంబున నామె యక్కయం
దచ్చుగఁ జేరినట్లు పడి ♦ యాఱట నొందుచు నుండెఁ గైక దాన్. ౧౭౯

## ౩. కైకేయీ పటలము. (౧౧౦)

తే॥ అర్ధరాత్ర మరుగు నంత ♦ నవని విభుడు, కార్యనిర్వాహకులగు భూ ♦ కాంతు లెల్లఁ
గొలువ వీణాధ్వనియులోనఁ ♦ గుందఁదగిన, మధురవాణి కైకేయి వే ♦ శ్మమునకరిగె. ౧౮౦

ఆ॥ వెంట వచ్చిన రాజులు ♦ వినతులగుచు, వాకిటను నిల్వ దశరథ ♦ పార్థివుండు
పరిజనంబులతోడ లో ♦ పలికి నేగి, పడక వీడిన కైకేయి ♦ కడకు నరిగి ౧౮౧

తే॥ కాంచి చలియించి కలఁగిన ♦ కత మదేది, యనుచుఁ జింతించి పిడియేనుఁ ♦ గునువహించు
వనగజంబట్లు కైకను ♦ తన కరములఁ, గ్రుచ్చి లేవంగ నెత్తె న ♦ క్కార్మికేఁడు. ౧౮౨

సీ॥ కాంతు ప్రాణములం బోలు - కైక తన్ను, తడవి యెత్తిన దీర్ఘ హ - స్తములఁద్రోచి
వైచి చలియించు మించు నా - వఱలి నేలఁ, బడి పలుకకుండ నూర్పులు - విడువసాగె. ౧౮౩

చ॥ అదిగని రాజు భీతులికి ♦ యంగద యెయ్యది సంఘటించెనో
యెదకుఁ గలంక గూర్చు జను ♦ లేడు జగంబుల నున్నఁ జావు వా
దుదు రెటువంటి వారలైనఁ దోయలి! యొందిన దేదొ తెల్పి యూ
పిదప గ్రహింతుగాక పృథి ♦ వీపతి కార్యము లంచుఁ బల్కఁగన్. ౧౮౪

తే॥ విభుఁడు పలికిన పలుకులు ♦ విన్న కైక, మొగులుఁ బోలు కనుల బాష్ప ♦ ములు తొనంకి
స్తన గిరులు నిండ నామెడ ♦ నెనరు గలుగు, నేని నాఁడిచ్చు వాని నేఁ ♦ డిమ్మనంగ

తే॥ ఆ మెయు ద్దేశమెఱుఁగని ♦ యవనివిభుఁడు, మెఱుపు తేఁఱగునవ్వి యో ♦ మెఱఁతవినుము
నీ కుమారుఁడు శ్రీరాము ♦ ని పయి నాన, వరము లిత్తు నించుకయు లో ♦ పంబు సేయ.

తే॥ అని పలుకఁ గైక నామది ♦ సడరు చింత, దీర్తువేని వేల్పులె సాక్షి ♦ తేట పడఁగ
నాఁడు రణ రంగమున మెచ్చి ♦ నాకొసంగు, రెండు వరముల నేఁడు గోరెద ఫలింప.

తే॥ వ్యథమనస్కయా కైకేయి ♦ యెడఁదఁగనక, వరముగోస నింతతడఁ బోటు ♦ వసటవలదు
నా ఖరువు తగ్గ నిత్తు నీ ♦ నాఁడె కోనుము, తెలుపుమది యేదో యని రాజ ♦ తిలకుఁడనియె

ఉ॥ క్రూరుల లోనఁగ్రూర, తన ♦ కోరిన రెండిట నొక్క-దానిచే
ధారణి నాతనూజునకుఁ ♦ దప్పక పట్టము గిట్ట నొక్క-టన్
నారలు గట్టి దుర్గమ వ ♦ నంబులలోఁ బదు నాలు గేండ్లు నీ
తారమణుండు చేర; నని ♦ ధైర్యము మీఱ వచించె రాజుతోన్. ౧౮౯

తే॥ నాగముం బోలు కైకేయి ♦ నాల్క-నుండి, తాప కర వాగ్విషంబు తన్ ♦ దాఁకునంత
వడఁకి యొడలెల్ల నుడుక భూ♦వరుఁడు సోలి, ప్రాగ రడంగు నేనుఁగు వలె♦భూమిఁగూలె

తే॥ ఉర్విపైఁబడి ఘోరలిన ♦ సార్వ భౌము, నధిక దుఃఖముఁ దెల్ప సమర్థు ♦ లెవరు?
ఉమ్మలిక వడి ముదురంగ♦ నుడికి యుడికి, కొలిమి నిప్పులఁ బోలె నూ♦ర్పులను విడిచె

ఉ॥ నాలుక వాడి యెండెను మ ♦ నంబు చలించెను కుంది ప్రాణము
య్యాలల నూఁగె నేత్రయుగ ♦ మచ్చుగ రక్తము లొల్కె- నక్షముల్
తూలెను చేయఁదగ్గదియె ♦ తోఁచక చంచలతన్ భజించె మూ
ర్ఛాలసతన్ సమస్తము ర♦యంబున లేనిద యయ్యె నంతలో. ౧౯౨

తే॥ పదరి జీవముల్ లపియింపఁ♦బార్థివుం డొ, కింత తెలివొందుఁ గుములఁగ♦నేడ్చి నిల్వ
యత్న మొనరించి మఱి కూలు♦నాపి యడఁగఁజిత్రముం బోలెఁ జూచును♦చేష్టదక్క-

ఉ॥ పాపినిఁబట్టి కొట్ట మది - భావన సేయు మడంతి యంచు రా
నోపిన నిందకున్ బిడియ - మొందు ప్రణంబున బల్లెముం జొరం
జోపిన నొచ్చి కూలు కరి-చొప్పునఁ దల్లడ మందు లోని పెం
దాపముతోడ నూర్చు కను - దమ్ములు పోయిన యట్లు దూపిలున్. ౧౯౪

ఉ॥ స్తంభమునందు గట్టువడు - సామజముం బలె భూవరుండు సం
రంభము దక్కి- దూపటిలి - ప్రజ్ఞదొలంగి యలంగుచుండఁగా
జంభ విరోధి ముఖ్యులును - జంకి వడంకిరి లోక విప్లవా
రంభము దోఁచె నైనను క - రంగదు కైక మనంబు నుంతయున్. ౧౯౫

తే॥ భర్తచింతను గని భయ-పడఁగ లేదు, మనసు కరఁగదు బిడియంబు - గొనదటంచుఁ
బలుక సిగ్గగుఁ బెద్దలు - వంచనంబె, యువిద జన్మమందురు దాని - కూఁత యనరు.

తే॥ అట్లెసితి నున్న కైకేయి - నట్టెచూచి, నీవు భ్రమసితివా? లేక - నేర్చినట్టి
వంచకుల బోధ కలదొ? నా-పైన నాన,నిజము వచియింపుమని పల్క-నృపవరుండు.

క॥ నాథా! నే భ్రమియింపను, బోధించిన దింతలేదు ♦ మున్నొసఁగిన వే
సాధింతు నీయవేనిన్, వేధింపఁగ నింద నిన్ను♦విడుతు నసువులన్.

తే॥ రాముఁడే ప్రాణమగు దశ ♦ రథ విభుండు, వెలఁది పల్కు-నగము విని ♦ వినక మున్నె
మూఁడు బొబ్బపై బల్లెంబు♦గాఁడి నట్లు, లైనఁ దపియించి యఱచచ్చి♦ యువనిఁ వ్రాలె

చ॥ త్రిజగము లందు గెల్పుగొని ♦ తేఱిన ధీరుఁడు, కాలకూటమా!
భుజగమ! మృత్యువా! యనును ♦ మూలుగు మూలుగు విహ్వలించు మై
గజగజలాడ నేలఁబడుఁ ♦ గ్రమ్మఱ లేచును సత్యవాక్యమే
నిజముగ నన్ను చంపె నను ♦ నెంజిలి ధర్మమె చెడ్డదా నను౯ ౨౦౦

తే॥ వీరవరుల వీర్యంబులు ♦ బీఱు వోవఁ, జెనకె నాతఁడు జగము న ♦ స్త్రక్రమముగను
వాఁడి వాలున ఖండించి ♦ వై చియేను, వధము లొందు దుర్గతిఁ గొందు ♦ ననుచుఁ గనలు

తే॥ సత్యకీర్తియా దశరథ ♦ చక్రవర్తి, కేలు మోఁదు నొడుగొఱుకుఁ ♦ గిడెయుమ్యొ
సత్యమున ననుఁ గంపించు ♦ సంతపించు, నిప్పుపై ఘృతమట్లు గుం ♦ డెయుఁగరంగ ౨౦౨

సీ॥ సత్యవాక్యంబు ర ♦ క్షణము త్యజించి శి, క్షించినఁ జెడుగె యి ♦ చ్చినను చెడుగె
కలదని యొర్చుట ♦ కంటెను తన పట్టు, వదలని పాపిసీ ♦ వధముకంటె
యాచించు టే కార్య ♦ మని లేచి కట్టుగం, బముల లాగెడు మద ♦ వారణముల
బలము గలట్టి రా ♦ జులు ముందు తొడరి పూ, జించెడు చరణ రా ♦ జీవ యుగళ

తే॥ మమరు దశరథుఁ డంత దో ♦ సములఁ ద్రోవ, దలఁచు వారలఁ బోలి రాఁ ♦ గలుగు మేలు
కలదయేని శాంతము కావఁ ♦ గలదె యంచుఁ, దలఁచి భూపతి కైక పా ♦ దముల వ్రాలె.

క॥ నీకొడుకు రాజ్య సంపద, గై కొనఁ డటు కొనిన జగము ♦ కై కొనదెపుడు౯
లోకమునఁ గీర్తినిలువదు, నీ కగునది నింద యొకటె ♦ నిక్కము పడఁతీ! ౨౦౪

సీ॥ త్రిదశులు నంగీక ♦ రింపరు మర్త్యులు, ప్రాణము ల్విడుతురు ♦ పంకజాక్షి!
తక్కువారల కథ ♦ తడవంగ నేల? నీ, వెవ్వరిఁ గొనిరాజ్య ♦ మేలు దాన
వేను పల్కుట వల్ల ♦ నే సమ్మతించిన, రాముండు నీదు పు ♦ త్రకున కటులె
తప్పక యొసఁగు; వ ♦ దాన్య కేకయుని పు, త్త్రీ! నాదు కన్నుల ♦ ర్థింతువేని

తే॥ యిపుడ యొసఁగెద జీవంబు ♦ లింతువేని, నీవశమ కావె వరము లే ♦ నియును ధరణి
మాత్రము గొనుము వేఱొండు ♦ మఱవుమబల!, నాపయిం దయయింతైనఁ ♦ జూపఁదగవె?

సీ॥ ఇచ్చితి ననిపల్కి ♦ యిఁకఁ దప్పఁగాఁ జాలఁ, బెను వగముంచి త ♦ పింపఁ జేసి
శోంచకు మిట్లు వయా ♦ చించినఁ గ్రూర పి, శాచ మేనియుఁ దల్లి ♦ చాయనిచ్చు
నిన్ను మిక్కిలి వేఁడు ♦ నీ మగనికి దీని, నొసఁగిన దొసఁగులు పొసఁగు నేమి?
యని భర్త తను వేఁడఁ ♦ దనసాటి తానయై, పిడుగుల ముద్దయా ♦ చెడుగు కైక

తే॥ మున్నె వరము లొసఁగి యిప్డు ♦ పొక్కుటోట, గొసఁగ నేముండు? నీకసత్య ♦ మును భరింప
నెవరు గల వారలో భువి ♦ నెఱుఁగనైతి, ననుచు మది నుంత కరఁగని ♦ దై వచించె.

సీ॥ కల్లలాడుట యొఱుం ♦ గని నిత్యశీలిభూ, పాలుఁడా వాక్యంబు ♦ నాలకించి
జీవంబు లుడుగ మూర్ఛిల్లుచు నోర్పుమై, నీవనితా రూప ♦ ఘోంచిమ్మాడఁ

జిలుమును చిచ్చును ♦ గలిపి చేసినయది, యనుచు లజ్జించుచు ♦ నావిలేని
మనుజు వైఖరి నుండి ♦ మరల నిట్టూర్పులు, విడిచి దీనత దోఁప ♦ వేడికొనుచు

తే॥ నీకొడుకె రాజ్యమేలును ♦ గాక నీవు, స్వేచ్ఛ నధికారమును జర ♦ పింతు గాక
యింత వశమగుఁగాక పా ♦ లింతుగాక, యొసఁగితిని తప్పి దానికై ♦ వినుగనేను. ౨౦౭

సీ॥ నాప్రాణములను నా ♦ నయనంబులంబోలి, భువిఁబ్రాణి తతికెల్లఁ ♦ బుత్త్రుఁ బోలి
నడఁచు నాకొమరుఁ డీ♦పుడమి వీడకయుండు, మాత్రంబు కరుణింపు♦మమరువిడుము
తెలియ సత్యమె వేరు♦ తెగఁగోయు కార్యమా,టకు నిట్లు వందువాఁ♦డను మృగాక్షి
నాల్కపిడుచగట్టె ♦ నాకుమారుఁడు కన్ను, మఱుఁగగునేని నే ♦ మఱేఁగి చత్తు

తే॥ నాదు జీవముల్ నిను శర ♦ ణంబు వేఁడు,చున్న వని యామె పదముల♦నొఱఁగఁ గైక
యిచ్చి యడుగకు మనుట నీ♦కెట్లు పాడి, యనుచుఁ ద్రోపాడె నిందయు♦నగడు గొనక

తే॥ కఠిన పాషాణహృదయ యా ♦ కైకయట్లు, పలుకఁగొమరుండు కానకు♦ వెలలుమున్నె
నేను జీవముల్ నీఁగుట ♦ నిజమటంచుఁ, బిడుగుపడు కొండవలెరాజు ♦ పృథివిఁ ద్రెళ్లె

తే॥ త్రెళ్లి క్రూర దుఃఖాంబుధి ♦ దిగి మునింగె, మునిఁగి దరి గానకావ్యాళ ♦ ముఖి కఠోర
వాక్కు గుండెల నగలింపఁ♦ బాపచరిత, నీచతకు సహింపక పడి ♦ నేలఁ బొరలె. ౨౧౦

చ॥ సతులిల జీవితేశ్వరులు ♦ చావక మున్నె సుఖంబు రోయుచున్
బ్రతుకు త్యజించి రా యశము♦బ్రాఁతిగఁ గోరక యింతదాఁక ద
త్పతుల వధించు నారులను ♦ ధారిణిఁ గానము వంశ నాశినీ!
పతి నిటు నీకరంబులనె ♦ పాపపుఁ జిత్రవధం బొనర్తువే? ౨౧౧

ఉ॥ పాపము లెక్కలేదు కుల ♦ పద్ధతి మాడ్చితి ధర్మ మెంచవున్
దాపము నొందవున్ గరుణఁ ♦ దార్కొని చంపితి వాక్ఛరాగ్ని చే
వేఁపుచుఁ దీపి ప్రాణముల ♦ వెంపర లాడి వధించి తింక నే
పాప మెఱుంగ కుండు ప్రజ ♦ ప్రాణములం గొన నాన చేసితే? ౨౧౨

చ॥ ముగుదతనంబు జంకు బిడె ♦ మున్ నెఱి భూషలుగాఁ గలారలే
మగువలు; కీర్తికై బిడెము ♦ మన్నన సేయుట లోక ధర్మమా
తగవు గణింపరేని వని ♦ తల్ మగవారల లోనఁ జేరఁగాఁ
దగుఁ జెలి రూపుఁబట్టె వని ♦ తాతతిఁ జేర్చుట యెట్లు పొందగున్?. ౨౧౩

క॥ బలమున బుద్ధిని రాజుల, గెలిచితి దేవతలవఱకు ♦ గీమున నొక స్త్రీ
వలఁ దవిలి చెడితి ననియెడు, బలు నిందం బొంద నిపుడు ♦ పాలైతిఁ గదే! ౨౧౪

క॥ మేరుగిరి వేఱు మేరువు, తో రాజిలు కరణి వెలయు ♦ దోర్యుగళుండా
భూరమణుఁ డగలుఁ బొగులున్, దూఱుఁ బొరలుఁ లేచుఁ జూచు ♦ దుఃఖిల్లు వెతన్,

ఆ॥ ఒఱలి యొఱలి ధూళి ♦ నెఱయఁ బొరలు రాజ, వరుని గాంచి కైక ♦ పదరి పలికె
వరము లిత్తువా? భ ♦ వత్సన్నిధినె యిప్పు, ప్రాణములఁ ద్యజింతు ♦ నా? వచింపు

ఆ॥ విరిసి యెరిసి జీవ ♦ పితతిఁ ద్రావెడు వహ్ని, వంటి కైక మఱియుఁ ♦ బలుకు నిట్లు
ఒక్కరాజు సత్య ♦ మొగిఁ గావ నొడలిని, కోసియీఁడె? యిచ్చి♦కుంద ఫలమొ? ౨౧౭

ఉ॥ చచ్చునదే యటంచు మఱి ♦ చచ్చియు స్త్రీ కొల చుట్టునంచు ఛేఁ
డిచ్చితి నిచ్చితిం గొమరుఁ ♦ డేలఁగ దుర్గమ కాననంబు నేఁ
జచ్చి దివంబు నేలుదును ♦ చావక నెత్తిని గట్టు కొంచు నీ
విచ్చను రాజ్యమున్ జలధి ♦ నీఁది దరిం గనలేక క్రుంగుమా. ౨౧౮

చ॥ పలుకఁ దొడంగు మున్నె నగ ♦ పాలు కొలన్ ముగియించు కత్తి నాఁ
జెలఁగు మనోవ్యథల గుదురు ♦ చెందని వాఁడయి చేష్ట దక్కితేఁ
డిలఁ బడి యట్లుసల్కె మది ♦ నెంచిన దట్లు గడించి కైక పే
రలరున లోన నుబ్బుచు ర ♦ యంబున సెజ్జకుఁ జేరె సమ్మదిన్. ౨౧౯

చ॥ అతిశయమైన నాళ్లనొక ♦ ప్రాణముఁ బోలిన మేటి కార్య సం
తతు లొనరించి వెండి పరి ♦ తాపమునొందిన భర్తఁగాంచి యీ
యతివ రవంతయైన నడ ♦ లందదు సవ్వడి దీనిఁగాంచి యే
గతిఁ దలయెత్తనౌనని వ ♦ గన్ జనెఁ జల్లని రేవెలందియున్. ౨౨౦

తే॥ కైకవలనఁ దద్వరునకుఁ♦గలుగు చెడుగు, గని కలఁగి పక్కులనియెడు♦కరములఁ గొని
కడుపు మోఁది కొనుచు నేడ్చు♦కరణిఁ దోఁచె, కొక్కొరోకోయనుకడజాము♦కోళ్లకూఁత.

తే॥ మదవతులకాలియందెల-రొదలఁబోలి,కొలఁకులందుఁద్రమ్మెఁకులయందుఁ-గూడికూయు
పక్షులరుతంబు కైకేయి ♦ పరుసుగాంచి,మండి లోలోనఁ దిట్టెడు ♦ మాడ్కినుండె.

తే॥ మఱవఁ జాలని భద్ర నా ♦ మంబు గలుగు, రాముఁ డడవికి జానకీ ♦ రమణి తోడఁ
బోవ నేము దేశము వీడి♦పోదు మనుచు, లేచు కరణి శాలలనుండి♦ లేచెఁ గరులు.

చ॥ ప్రభగల పద్మనేత్రుఁడగు ♦ రాము బలిష్ఠ మదేభహస్త స
న్నిభ కరమందు కంకణము ♦ నిండఁగఁ గట్టకమున్నె చల్లనౌ
నభమున రిక్కకూటువలు ♦ నాశిలి తెల్లన యయ్యె నీడగాఁ
గ భువికి వైచు పందిరి యు♦ గల్ప బటాబయలైన, కైవడిన్. ౨౨౪

ఉ॥ పూవిలు పోరు గల్గు నిసి♦పోయెను వచ్చెను వచ్చె నేటికిన్
శ్రీవరుఁ గొల్చు పండువని ♦చెల్వుగ లేపుచు మ్రోఁగె భేరులా
రావము కొండపై జలధ ♦ రంబుల మ్రోఁతను పోలఁగా మయూ
రావలిఁబోలి లేచిరి ము ♦ ఖాంబుజముల్ వికసింప నంగనల్. ౨౨౫

ఉ॥ కొందఱు పెక్కుతో విరుల ♦ గుత్తులపైఁబడి మందచారియై
గంధవహుండు మేఖలలఁ ♦ గాంచన వస్త్రములన్ జెదర్పఁగాఁ
గుందిరి; తాపముల్ సురఁగ ♦ గొందఱు వల్లభులన్ ముదంబునన్
సందిటఁ గొన్న కైతవపు ♦ స్వప్నము లాఱ నలంగి రొక్కెడన్. ౨౨౬

చ॥ ఇలువడి సున్న చేసి కుల ♦ మెగ్గుల బొగ్గులుగా నొనర్చి ని
శ్చలమగు నింద చేకొని య ♦ శంబును చూఱలు వుచ్చి సిగ్గఱన్
నిలిచిన కైక చేష్టలను ♦ నివ్వెఱఁ గ్రొత్తడు లెల్లఁ గాంచి మో
ముల ముకుళించి రిట్లనఁగ ♦ మోడ్చెఁ గువాలయముల్ మొగంబులన్.

చ॥ కుతుకము నిండ నాలుకలు ♦ గ్రోసెడు మాఱని వాఁడితూపులున్
మతకరి మందమారుతము ♦ మాడ్చె మ వెన్నెల మేనిఁ గోయ జీ
వితముల రోయుచున్న యు ♦ రుభీతమృగాక్షుల కప్పు మేలు కొ
ల్పు తెఱఁగు గ్రాఁచుఁ బాము చెవి ♦ లోఁ జొరఁబాఱె చందమేర్పడెన్.

సీ॥ చక్రియై శ్రీరామ ♦ చంద్రుని పట్టాభి, షేకంబునకు నెడ ♦ సేయు చెడుగు
రాత్రి యుగాంత స ♦ రణిఁ బెద్దదె యుండు, శేలోకోయని పంక ♦ జాలయమును
భూతవితతితోడ ♦ మాతోడఁ దపము చే, సిన నయనంబులు ♦ చిత్తములును
సఫలత్వ మొందంగ ♦ సమయ మిదేయని, మేలుకనిరి యోగి ♦ మేలువారు

తే॥ కనులు తెఱచిపండువ్రుగరా♦ఘవుఁడుమకుట,ధారియగుచునూరేగఁగాం♦తమయటంచు
విరుల పాన్పుల నుసలి లే♦చిరి కడంక, నలరుఁదేటులు తోడ భ ♦మ్మనుచు లేవ. ౨౨౯

తే॥కుసుమకోమలుల్ దిట్టంపుఁ♦గోప మొంది, యుదయదుందుభుల్ మ్రోఁగంగ♦నులికినగలు
చెదర నడుము లల్లల నాడఁ♦జింత గొన్న, చెలువు లింపొందఁగాఁ గటా♦క్షింపరైరి.

ఉ॥ క్రాలెను పీలి గుచ్ఛములు ♦ క్రాలె వికాసిత పుష్ప మాలికల్
క్రాలెను దుందుభుల్ నగలు ♦ గ్రాలెను పక్షులు క్రాలె వీణియల్
క్రాలె మదేభముల్ హారులు ♦ గ్రాలె రథంబులు క్రాలెఁ జిత్తముల్
క్రాలెను ముక్త మాలికలు ♦ క్రాలెను క్రాలె మదాళు లెల్లెడన్. ౨౩౧

ఉ॥ ఏడు జగాలతోడ మఱి ♦ యేడు జగంబులు జీవ పాళితోఁ
గూడ విహాయితంబు లొనఁ ♦ గూర్చిన భూవర మాళి చింతచే
వేడుక దక్కి యంగములు ♦ వెల్వెల వోయి కృశించి నట్టి మై
చాడుపునన్ వికాసములు ♦ స్రగ్గి మినుక్కనుచుండె దీపముల్. ౨౩౨

ఉ॥ మ్రోఁగెను కాహళాది రవ ♦ ముల్ మధుపాళీ నినాద వైఖరిన్
మేఁగెను దీపనల్ మఱియు ♦ మీఱెను మేలగు మేలుకొల్పులున్

వాఁగెను వాద్యరావములు ♦ ప్రబ్బె దర ప్రకరారవంబులున్
రేఁగెను క్రోవి నాదములు ♦ రెచ్చె హితంబుగ సామ గీతముల్. ౨౩౩

ఉ॥ ధూపముపోలికన్ ముదురు ♦ దొడ్డ తమంబను వైరి భీతిలన్
దీపము లెల్లఁ దేజములు ♦ దీలుపడం దన వంశజుండు సం
తాపము నొంది క్రుంగ దురి ♦ తం బొనరించిన క్రూర కైకపైఁ
గోపము నొందె నాఁగఁ దొలి ♦ కొండను భానుఁడు దోఁచె నెఱ్ఱనై. ౨౩౪

తే॥ మూఁడు మూర్తులై వారికి ♦ మొదలు నైన, విశ్వరూపుని విశ్వేశు ♦ విల్లు విఱుచు
వాని యభిషేకముం గను ♦ వాంఛ నున్న, మగువల మొగంబులట్లు ప♦ద్మములువిరిసె

ఉ॥ ఆ సమయంబునందు గల ♦ యంబుధు లొక్కట లేచె నాఁ బురీ
వాసులు నేఁడు రామునకుఁ ♦ బట్ట మహోత్సవ మంచుఁ గాంత మం
చాసను లేచు నా కలక ♦ లారవ వైఖరిఁ దెల్ప నేరి కూ
హా సముదీర్ణతల్ గలుగు?♦నంచుఁ దలంచి రొకొక్క రయ్యెడన్. ౨౩౬

తే॥ వీరుల మనస్సులను లాగు ♦ వెలఁదు, లెల్లఁ, బాదములకు లత్తుక యిడు ♦వారు సంకు
గాజు లిడువారు కన్నుల ♦ కాటు కిడెడు, వారు క్రొవ్విరుల్ తుఱిమెడు ♦ వారునైరి

తే॥ మోద బాష్ప ధారలు గల ♦ మోము లందు, కల్లు ద్రావువాలుగఁబోలు♦కనులచెలుల
గంధ పంకంబు బొమ్మలఁ ♦ గలుగువారు, పొదలు నుబ్బున లక్ష్మణుఁ ♦ బోలెనైరి

తే॥ సతులు కౌసల్యఁ బోలిరి ♦ జన్ని గట్టు, లల వసిష్ఠుఁ బోలిరి తక్క♦ లలన లెల్ల
సీతఁ బోలిరి జానకి ♦ సిరిని పోలెఁ, బ్రభుని దశరథుఁ బోలిరి ♦ పౌరు లెల్ల. ౨౩౭

ఉ॥ రాముఁడు గద్దె నెక్కనని ♦ రాజ సమూహము వచ్చి చేరె న
య్యామని గాంచు వేడ్క హృద ♦ యంబులఁ బ్రేరణ సేయ మున్నె యెం
తో మది నాసరేప విబు ♦ ధుల్ సుధకై గుమి గూడు లాగునన్
భూమి నయోధ్య తక్కఁ బెర ♦ భూములు శూన్యము లయ్యెనో యనన్.

సీ॥ చకోరఁ బోణులు ♦ సైకత శ్రోణులు, విద్రుమాధరలును ♦ పీన కుచలు
గుములయి పురుషుల ♦ గుంపులతోఁ గూడి, నడవుఁడు నడవుఁడు ♦ నడవుఁడనుచుఁ
బలుమరు పలుకుచుఁ ♦ దొలి నున్న చోటనె, నిలుతురు వెడలెడు ♦ తలఁపు విడరు
ప్రభువుల కూటమే ♦ ప్రబల మనెడు వారు, యౌవతంబే పెద్ద ♦ దనెడు వారు.

తే॥ యోధ వారమే గొప్పది ♦ యువక సమితి, దొడ్డదను వారు వచ్చిన ♦ స్తోమ మెక్కు
డనెడువారు వచ్చెడుగుంపె♦యధిక మనెడు, వారు మొత్తము నెఱిఁగిన♦వార లెవరు?

తే॥ అనుచు నీలోత్పలంబుల ♦ యంద చంద, మీఁటెల దొసంగులం జేర్చి ♦ కొటుక యను
విసము చంద్రు నందుంచిన♦ట్లొసఁగు కనులు, గలుగు సుందరుల్ నెమళుల♦ కరణిఁజనిరి

తే॥ చాల వాసించు నవ వన ♦ మాలికాభి, రాముఁడగు రాముఁడటరాజ్య♦రమనుపొందు
భాగ్యమునుచూడరాకుండు♦వారులంకఁ,గలుగువారును గిరులు దిక్క-రులెయగును

తే॥ ఇంద్రుఁబోలిన రాజులు ♦ చంద్రులనఁగ, నొప్పు ముక్తాతపత్రము ♦ లుప్పరమును
కప్పు నంచల గమి యన ♦ విప్పు గలుగు, చామరల తోడ వచ్చిరి ♦ చవిక కడకు. ౨౮౩

తే॥ విమల తపమున ఫలమొందు - వేదవిదులు, తాము కనిపెంచు ముద్దుల-తనయు పెండ్లి
నడపు లలి వచ్చిచేరి రా-నందమునను, రాడ్రమా రామ కల్యాణ-రంగమునకు. ౨౮౪

క॥ నించిరి సుర లంబరమును, నించిరి దిక్కులను మేది - నిం గల జనముల్
నించెఁ బసిఁడి జడి జలధుల - నించెఁ జెవుల బహుళ భద్ర - నినదారభటుల్. ౨౮౫

ఉ॥ దీపపుఁ గాంతి మించిన యు - దీర్ణనృపాల కిరీట కాంతు లు
ద్దీపిత భాను మండలము - తేజముఁ గప్పె వరాంగనా విభూ
షాపృథుకాంతులొప్పె భువిఁ - జయ్యన గెల్చితి మింక నాకమి
ట్లొప్పున గెల్తమన్ వహీ సు - రేశులకున్ మిఱుమిట్లు గొల్పుచున్. ౨౮౬

తే॥ వలయుపరికరములు వస్తు-వులునుగొనుచు, మునులుశ్రుతులుపఠించుచు-మొనసిరాగ
ద్వార్థినతులు సంభ్రమంబున-దారి దొలఁగఁ, గులగురుండు వసిష్ఠుఁడా-స్థలికి వచ్చె.

తే॥ అమరవాహిని మొదలు క - న్యాకుమారి, వఱకుఁ గల తీర్థములు వా ర్ధి- వారియుంచి
వేల్మి వస్తువులును సింహ-పీఠితోడ, వలయు నన్నింటి నట సిద్ధ-పఱచియుంచె. ౨౮౭

తే॥ జ్యోతిషికులు లగ్నము డాసె - నని వచింప, జ్ఞాన దగ్ధకర్ముఁడు వసి - ష్ఠముని యాజ్ఞ
శిరమునం దాల్చి రాజేంద్రు-శీఘ్ర గతిని, తోడి తేర నెమ్మని సుమం-త్రుండు చనియె.

సీ॥ అభ్రంకషం బగు - నంతఃపురీ సౌధ, మున సార్వభౌముని - గనక యచటి
వారి విచారించి - వడిఁ గైకమందిర, ద్వారంబు చేరి కాం - తా జనంబుఁ
గాంచి కార్యము దెల్పఁ - గా వడివడిఁ జని, చేటికల్ కైకకుఁ - జెప్పనంత
యముఁ బోలు నయ్యమ - యాతనిఁగని రాము, వడిఁదోడితెమ్మని - పనుచునంతఁ

తే॥ బొంగి బంగరు మండప - ములు చెలంగు, వీథులం జని తనలోన - వేడ్క-తోడఁ
దన్నుదాఁ దలఁచుచునున్న-దనుజ రిపుని, మ్రొక్కి యిట్లను వదనంబు-మూసికొనుచు

చ॥ ధరణిపులున్ మునీంద్రులును - తక్క జగంబున వారు తండ్రి తీ
రరితి వహించి నిల్చి రర - యం బినతల్లియు మిమ్ము దోడితే
నిరవుగ నన్ను పంపె వడి - నెక్క శతాంగము బొమ్మిడీకముల్
శిరమునఁ దాల్తు గాక యనఁ - జెచ్చెర నప్పుడ లేచె నాతఁడున్. ౨౯౦

శా॥ ధీరోదాత్తుఁ డుదారుఁ డుత్తమ గుణ - స్థేముండు వారాశి గం
భీరుం డంత సహస్ర శీర్షునకుఁ గే - ల్మోడ్చి సామంత భూ

దార శ్రేణులు చుట్టిరా విబుధ బృం - దంబుల్ సుగీతంబు లిం
పారం బాడ విలాసినుల్ గన శతాం - గారూఢుం డయ్యెం గలలిఁ. ౨౫౩

చ॥ బొమిడికముల్ ధరించుటకుఁ - బోయెడి నంచుబలాట మొంది జీ
వము లటనెల్ల వారికొక - వైఖరినై రథమెక్కి యేగు రా
ము మొగము గన్నవారివలెఁ - బొందికఁ జూడనివారుగూడ మో
దము దయివాఱ గొప్ప నిన - దంబున మ్రోఁగిరి రెండు ప్రక్కలన్. ౨౫౪

చ॥ బెడిదపుఁ గైకవాక్యమున - వీరుఁడు పట్టము భూమి మాని కా
రడవుల కేగు మున్నె వారి - జాక్షుల హస్తములన్ శరీరముల్
నిడుపగు వాలుచూపులను - నేజము లెల్లెడ నిండి యున్న పే
రడవిని చొచ్చె భాస్కర కు -లాంబుధి సోముఁడు రాముఁ డత్తఱిన్. ౨౫౫

సీ॥ గందంబు పుష్పముల్ - చందనం బపరంజి, తొడవులు చెదరంగఁ - దొందర వడి
గాజులు రాల మే - ఖలలు వ్రీలంగ నా, లీలను లజ్జను - కోలుపోయి
కందర్ప శరములు - గాఁడి గాయంబయి, యుబ్బిన పీన ప - యోధరములఁ
గామాగ్ని చే వెచ్చఁ - గ్రాఁగిన కన్నిటఁ, గలుకులు కొందఱు - కడుగువారు

తే॥ జాలి లేని యీతఁడు నేల-నేలఁ దగిన, యతఁడె? యనువారు పుండరీ-కాక్షములును
నల్లరొమ్ము డలును స్యందనం-బెల్లయెడల, నరయఁ బడె రాము లెందులో-యనెడు వారు

సీ॥ అంగన లెల్ల ని - ట్లాడుచుఁ గూటువ, లై నిండఁ బౌరులు - మాని వరులు
యువకులు రాముని -యొప్పుఁ గాంచుచుఁ బ్రేమ, కెల్ల నుగానక - హృదయమందు
నీలోక మింక సుఖ - యించు ననెడు వారు, జన్మముల్ క్రమముగా - జరుగు ననెడి
వారు మా యాయువుఁ - బడసి చిరాయువు, గలిగి నెలయు మంచుఁ - బలుకువారు

తే॥ ఇంద్రియము లై దిటిని గృశి-యింపఁ జేసి, పొందిన తపః ఫలఁబు ని-న్నొందుఁ గాక
యనెడు వారు మాపుణ్య ఫ-లాతి శయము, నీకె లభియించుఁ గాకని-నిలుచువారు.

సీ॥ కరుణ యేపారిన - కన్నులఁ బోలంగ, నబ్జంబు లేమి పు - ణ్యం బొనర్చె
మేని రంగును పోల - మేఘము ల్మిన్నెట్టి, నోము నోచెనో యంచు-నుడువువారు
బహు తపంబులు సేసి - భాగ్య దేవతఁబోలు, రామునిచ్చిన దశ - రథుని కరయ
నీడుగా బ్రత్యుప - కృతి యేది చేయంగ, ననువగునని ప్రేమ - ననెడు వారు

తే॥ రాము ననుకంప వారణ - రాజుఁ గాచు, హరికరుణఁ బోలు నంచుఁబ-ల్కాడువారు
శ్రుత్యతీతు నుత్తము మేని- సొబగుఁ గాంచి, కారణములేక ముద్వారిఁ-గార్చు వారు

సీ॥ నీల మేఘశ్యాము -నిండు బుద్ధియు శీల, మొరుల కెవ్వారి కేని - యరయఁ గలదె?
ఘన తపంబులు పెద్ద - కాల మొనర్చియు, గణుతింప రాసట్టి - ప్రణవమూర్తి

యమరులలో నొక్కఁడగునె? యట్లని యింత, వఱకుఁ జెడితి మని - పలుకువారు
జలధిఁ ద్రవ్వెను సాగ - రులకు స్వర్గంగను, నేలకుఁ దెచ్చిన - నిపుణులకును

తే॥ సురల కొఱకు దైత్యులఁ ద్రుంచు-శూరులకును; పేరుగల వన్నెతోడి వి-స్తారకీర్తి
నిశ్చలంబౌట యీతని - నెఱి భుజములు, కూర్చు కీర్తిచే ననుచు వ్యా-క్రుచ్చువారు.

సీ॥ ఇదె చందనపుగంద - మిదె చెందిరం బియ్యు,దియె మంచి వజ్రాణి - తైతముల రాశి
ఇయ్యవె మణి భూష - లియ్యవె మదకరు, లియ్యవె హారులిట్టి - హేమ సమితి
ద్రవ్యంబు లేని పే - దల కొసఁగుమ యని, చేతి కందిక గాఁగఁ - జేర్చు వారు
తన దూడ దుముకు చు ♦ త్సాహంబుతో రాఁగఁ, గూర్మిఁ గరఁగి కాంచు ♦గోవుకరణి

తే॥ మెఱపుఁ బోలిన తేరిపై ♦ మెఱసి వచ్చు,రాము మనసారఁగని శరీ ♦ రంబు కరఁగి
మనసు నీరుగాఁ బ్రవహింప ♦ మచ్చిక మెయి, చిత్ర రూపంబు కైవడిఁ♦జెలఁగువారు

ఉ॥ ఛత్రము చల్లనీడ నిడ ♦ సైన్యము తో బహు శస్త్ర సంతతుల్
చిత్రముగా వెలుంగ నెదఁ ♦ జిందెడు నెమ్మిని ధాత్రి మేల్మికిం
బాత్రము గాఁగ నేలు నర ♦ పాలురు రాఘవుఁగాంచి యిర్మిలిన్
బుత్త్రులఁగాంచు టింక సరి ♦ పోలదు పో యని నిల్చు వారలున్. ౨౬౧

తే॥ కారుమొగులు సౌదామినిఁ ♦ జేరు నట్లు, రాముఁడీ త్రోవ వడి వడి ♦ రథము మీఁద
నేగునేమొ యీ వీథిని ♦ హేమ రత్న, సమితి ప్రోగు పోయుఁడి యని ♦ చల్లు వారు.

చ॥ పెరుఁగఁడు తల్లి చేతులను ♦ పెద్దగ రాముఁడు కైక చేతులం
బెరిఁగెఁ దపః ఫలాధికతఁ ♦ బెంచిన యయ్యమ మోద మంది యీ
ధరణి నొసంగ నెంచినది ♦ తానుగ నాతని కామె సంతసం
బిరవుగఁ జెప్ప శక్యమగు ♦ నే యని లోన నుతించు వారలున్. ౨౬౩

సీ॥ పాప సందోహము ♦ ల్బహు జన్మ దుఃఖముల్, మొదలంటఁ దెగునని ♦మురియువారు
భూమండలము నేఁడు ♦ రామునకే కాద, యెల్లర కౌనని ♦ యెలయు వారు
భువనకంటకులైన ♦ దివిజవిరోధులఁ, బరిమార్చు నితఁడని ♦ పలుకు వారు
రాము నాజ్ఞలఁ దీర్చు ♦ రాజు లేతపమొన, రించిరో యని సంత ♦ సించు వారు

తే॥ పలు విధంబుల నీలీలఁ ♦ బలుకుచుండ, జవన తురగ ప్రకీర్ణక ♦ స్యందనమున
సౌధపాళులు విలసిల్లు ♦ వీథిఁగడచి, రాచ నగరు ప్రవేశించె ♦ రామవిభుఁడు.౨౬౪

తే॥ మందయానలు చేరి చా♦మరలు వీవఁ, గ్రొత్త యానంద మంది ర ♦ ఘు ప్రవీరుఁ
డతిశయ ప్రేమ నచ్చుట ♦ నరసి తండ్రి, గద్దెపైఁ గొలు వుండుట ♦ గాన లేమి. ౨౬౫

చ॥ శ్రుతులు సమస్త శాస్త్రములు ♦ చొప్పడ నారసి తేజు ఘోగి హ్యా

ద్గత మయి పూఁచు * రూపములఁ ♦ గాంచిన రాముఁడు పూసులు స్మృహీ
పతులును మోదమందఁ బోల ♦ పం బయి నిత్యయశో విశేష సం
గత మగు కూటముం గడచి ♦ కైక గృహంబును చొచ్చె నెమ్మమై. ౨౬౬

చ॥ అటు చనుచుండు రాముఁగని ♦ యందఱు సీతఁడు యుక్తకార్యమే
పటుతర రీతిఁ జేసెఁ దగు ♦ పద్ధతితోఁ దన తండ్రి పాదముల్
నిటలము సోఁక మ్రొక్కి యవ ♦ నీపతి యీయ దినేశు నుండి వి
స్ఫుట గతి వచ్చు సీనకము ♦ పొందిక నొందఁ దలంచినాఁడహో. ౨౬౭

చ॥ అనుచు వచించుచుండ సుగు ♦ ణాలయుఁ డచ్చట సొమ్మసిల్లి తే
జని స్థితి నున్న తండ్రిఁ గన ♦ రాఁ బృథివీ పతి దీని నోటితో
వినుచుటకుం దెగింపఁ డిది ♦ విన్చెద నేనని, కన్న తల్లిగా
మనమున నెంచు రాముఁ గనె ♦ మారణ దేవతఁ బోలు కైకయున్. ౨౬౮

తే॥ తేప కడఁ దల్లిఁ జేరిన ♦ క్రేపుఁబోలు, రాముఁ డామె పాదములకుఁ ♦ బ్రణతి సేసి
యొక్క చేఁ బ్రవాళాస్యంబు ♦ నొనర మూసి, యొక్కచే వల్వ సవరించు ♦ చొదిఁగినిలిచె

చ॥ యముఁడను పేరు లేక యమ ♦ యాతన గూర్చెడు లోహ మానసం
బమరిన కైక యట్లు విన ♦ యంబున నిల్చిన పుత్త్రుఁగాంచి యు
త్తమ గుణరత్నమా! సువిశ ♦ దంబుగ నీ జనకుండు నీకు ని
క్కముగ వచింపఁ గోరినది ♦ కద్దది కోరెద వేని తెల్పెదన్. ౨౭౦

చ॥ అనవుడు రాముఁ డామెఁ గని ♦ యమ్మరో! తండ్రి విధింపఁ దల్లి వీ
వనఁగల దొండు గల్గినఁ గృ ♦ తార్థుఁడనై తిఁ దపంబు పండె నా
జననము ధన్యమయ్యెఁ గెల ♦ సంబు పవిత్రతఁ గాంచె నింత కం
టెను మఱి గల్గునే పలుకుఁ ♦ డీ తలమోచి యొనర్తు నేనన్. ౨౭౧

చ॥ భరతుఁడు రాజ్యమేలఁగఁ ద ♦ పస్వి వలెన్ జడలూని వల్కలాం
బరములు పూని పాలనము ♦ మాని భయంకర కాననంబులన్
బోరిఁ బదునాలుగేండ్లు చనఁ ♦ బుచ్చి పదంపడి రమ్ము నేఁడె యీ
పురమును వీడి పొమ్మనుచు ♦ భూపతి యాజ్ఞ యొసంగె నావుడున్. ౨౭౨

చ॥ వినుతి యొనర్ప నాలుకకు ♦ వీలుపొసంగని మేరలేని మే
ల్గొనముల ప్రోకయైన రఘు ♦ కుంజరు చెన్నగు మోము నన్ను పో

* ఆ రూపములైదు.—పరత్వము, వ్యూహము, విభవము, అంతర్యామిత్వము, అర్చావతారము.
పరత్వము = వైకుంఠ వాసుఁడై యుండుట. వ్యూహము = పాలకడలిని శేషశయనముపై యోగనిద్ర.
విభవము = శ్రీరామాద్యవతారములు. అంతర్యామిత్వము = భక్తహృదయకమలములందుండుట. అర్చావతారము = దేవాలయములందు క్షేమం చేసియుండుట.

లిన వెడఁగుల్ వచింప మొద ♦ లే యను వొందదు; మున్ను కంజముఖ్న్
జెపయు మొగంబు ప్రాప్తి చికి ♦ సించిన పద్మము గెల్చె నయ్యొడన్. ౨౬౩

చ॥ అమల మనస్కుఁడైన ప్రభు ♦ నాజ్ఞను మీఱఁగ జంకి యజ్ఞలో
కమును భరించి కావఁగోను ♦ కష్టము, యుగ్యము కాఁడి క్రిందికే
గు మెయిని సమ్మతించి యాస ♦ ఘుండొకెఁ డవ్వలఁ గాఁడి విప్ప మో
దమునఁ దొలంగిపోయిన వి ♦ ధంబున వీడెను రాముఁ డత్తఱిన్. ౨౬౪

ఉ॥ అమ్మరో! తండ్రియేల? భవ ♦ దాజ్ఞను నేనొనరింప నందునే?
తమ్ముఁడు పొందు భాగ్యమది ♦ తథ్యము నాయది కాదె? యింత కం
టెమ్మఱి యేది నాకొనరు ♦ శేవ? భవద్వచనమ్ము నాదు శీ
ర్షమ్మునఁ దాల్చితిన్ సెలవె? ♦ చయ్యన వెళ్లెద నేఁడె కాననన్. ౨౬౫

౪. నగర విముక్తి పటలము. (౨౪౦)

తే॥ జానకీజాని యీరీతి ♦ చనవు తోడఁ, బలికి తల్లి పాదములకుఁ - బ్రణతి సేసి
తండ్రి యున్న దిక్కునకు వం ♦ దన మొనర్చి, సరగ వెడలెను కౌసల్య ♦ సదనమునకు

చ॥ మొగుళులు గప్పియున్న నగ ♦ ముంబలె నొప్పిన రాఘవుండు మే
ల్జిగి గల బొమ్మిడీకమును ♦ శీర్షమునం ధరియించి రాచ శ్రీ
వి గలిగి వచ్చు నంచు మది ♦ వేడ్కవహించిన తల్లియొద్దకున్
వగ విధి ముందు గాఁగఁ దన ♦ ధర్మము వెన్కఁగ వచ్చె నొంటిమై. ౨౬౬

చ॥ బొమిడికఁ దాల్పలేదు బహు ♦ పుణ్యజలంబుల చేత సార్ద్ర శీ
ర్షము గనరాదు చిత్రమని ♦ శంక యొనర్చెడు తల్లికిం బ్రమో
దమున నమస్కరించు గుణ ♦ ధాముని దీవన చేసి యామె ప
ట్టమునకు నడ్డపాటెదియు ♦ డాయదుగా యని ప్రశ్నచేయఁగన్. ౨౬౭

క॥ మాతా! నీప్రియ తనయుఁడు, నాతమ్ముఁడు నిర్మలుండు ♦ నయగుణచరితుం
డాతతమతి భరతుండీ, భూతల మిఁక నేలు ననుచుఁ ♦ బుత్త్రిం డనుడున్. ౨౬౮

చ॥ నలువుర నిష్కలంకమగు ♦ నర్మిలిఁ జూచుటయందు భేదముం
దెలియని కోసలేంద్రసుత ♦ ధీరున కిట్లను రాజ నీతికిన్
వెలితి యొకండు గాక గుణ ♦ విశ్రుతుఁడా భరతుండు నీకు నే
వలనునఁ దీసిపోఁడు భువి ♦ భారము పూనఁగ సర్వుఁడే చుమీ. ౨౭౦

చ॥ మఱియొక టాలకింపుము కు ♦ మారక! భూవిభు నాజ్ఞ యియ్యెడన్
నెఱసెనొ లేదొ యంచు గమ ♦ నింపక యొప్పుట నీకు ధర్మమాఁ

బెరిమను నీదు తమ్ముసకుఁ ♦ బృథ్వి నొసంగి పొసంగి వానితోఁ
జిరతర భోగ భాగ్యములఁ ♦ జెందుచునుండుము దీర్ఘకాలముల్. ౨౮౧

చ॥ అనుటయుఁ బూతమానసము ♦ నం దకలంక ముదంబు నొందు న
త్తనయుఁడు తల్లి కిట్టులనుఁ ♦ దండిరి సత్ప్రథితుండు నాకు ని
చ్చిన చౌకయాజ్ఞ యుస్నదటు ♦ చెచ్చెర నే బదునాలుగేండ్లు కా
ననముల సంచరించి తద ♦ నంతర మిచ్చటి కేగుదెంచెదన్. ౨౮౨

తే॥ అనుచు రాముఁడాడిన వార్త ♦ యనెడి చిచ్చు, చెవులఁబడియుఁబడకమున్నె ♦ చింతచేఁగృ
శించె భ్రమియించె గుండె శో ♦ షిల్లెఁ బరి తపించెఁ బలవించెఁ గౌసల్య ♦ పృథివిఁగూలె

సీ॥ తనయ నీవీ భూమి ♦ స్తంభము వలె నిల్చి, కౌతుకా కను మాట ♦ కైతవంబొ?
అంత ర్విష మొ!నాదు ♦ ప్రాణముల్ చలియించె, బ్రదుకంగఁ జాల దు ♦ ర్భరమటంచుఁ
జేతిని చేతితోఁ ♦ జేరిచి సలఁచును, వట కిసలయమన ♦ వఱలు తనయు
నుదరంబుఁ గరమున ♦ నూరక తడవుఁ బొ, గలు లేవ నూర్చు లోఁ ♦ గలఁత నొందు

తే॥ చక్రవర్తి కరుణ చాల ♦ సౌమ్య మయ్యె, ననుచు నవ్వు నాయన! యెప్పు ♦ డడవి కేగు
దనుచు లేచు నేనును వత్తుఁ ♦ జనుద మంచు, మించి పలవించు రోదించు ♦ మిగుల నొచ్చు.

క॥ మరణాంత వేళ యాతన, బెరసిన గతిఁ దల్లడిల్లు ♦ విడిముడి జాఱన్
నిఱుపేద వంచి మొగమును, కరమునఁ గప్పికొని యేడ్చు ♦ కరణిని వగచున్. ౨౮౫

ఉ॥ హాయను ధర్మమింకఁ గల ♦ దా యను దైవమ! యిట్టి పాటు తా
నే యను దప్పొకండు గల ♦ దే యను నెక్కరణిన్ భరింప నా
నో యను పూర్వ కర్మఫల ♦ మో యను నుత్తమ పుణ్యకర్మ శీ
లా! యను నక్కటా! యను న ♦ హా! యను లోకము లేనిదే యనున్. ౨౮౬

శా॥ క్రేపుం బాసి తపించు ధేనువు క్రియన్ ♦ గీడ్పాటు మైఁ జింత త
న్నేఁపన్ మూర్ఛిలి నేల వ్రాలు జననిన్ ♦ హృద్యంబులున్ ధర్మ్యముల్
చే పట్టందగు వాక్య సంతతులచే ♦ శ్రీరామ చంద్రుండు సం
తాపం బూడ్చి దిటంబు గొల్ప మదిఁ జిం ♦ తం జేసి తానిట్లనున్. ౨౮౭

శా॥ తల్లీ! మేటి సతీమతల్లి వయి సా ♦ ధారణ్య కాంతం బలెన్
జెల్లం బోలునె? చిత్తమందు తగవుం ♦ జింతింపు మీయాజ్ఞ నే
నుల్లంఘింపఁగఁ బోలునమ్మ! విభు న ♦ త్యోద్ధారుఁగాఁ జేయఁగా
నొల్లంబాటు వహింతువే? యిదియు నీ ♦ యుల్లంబునం దోఁపదే? ౨౮౮

శా॥ నాకంటెం గడు నుత్తముండు సుగుణా ♦ నందుండు తమ్ముండు తా
నీకుం గాదిలి పట్టియౌ భరతుఁ డీ ♦ నేలం బ్రపాలింపఁగాఁ

గీ కారణ్యములఁ వసించి పితృ వాక్ ♦ క్షేత్రంబుఁ బండించు నా
యీ కార్యంబునకంటెఁ బుత్త్రినకు మే ♦ లేదీ ప్రపంచంబునన్?  ౨౮౯

తే॥ మిన్ను మన్ను సముద్రముల్ ♦ మిగులుపంచ, భూతములు సమస్తంబును ♦ పోలియుఁగాక
తండ్రియాజ్ఞను జవదాఁటఁ ♦ దగునె తల్లి! దీనికై నీవు చింతింపఁ ♦ దేఁకు వగునె?

తే॥ అనుడునామెయిట్లనుఁగుమా ♦ రా! యటులైన, జనకునాజ్ఞదాఁటఁగఁ బల్క ♦ సాహసింప
నిన్ను విడిచి యీజీవముల్ ♦ నిలుపఁజాల, నన్ను నీతోడఁగొనిపొమ్ము ♦ న్యాయ్యమనిన.

చ॥ తనయుఁడు రాజ్యము న్నడఁపఁ ♦ దండ్రి తపం బొనరింప నేఁగుచో
వనముల కేగి భర్త నెడఁ ♦ బాయక నోములు నోతుగాకిటఁ
నను విడనాడి కుందు జన ♦ నాథున కూఁటఁగూర్చ కిట్లు నా
వెనుబడి రాఁదలంపఁ దగ ♦ వే? మది ధర్మపథంబు నెంచవే?  ౨౯౧

ఆ॥ ఎద కలంగ హేతు ♦ వెయ్యది? సురలును, మహిత తపము వలన ♦ మహిమఁ గనిరి
వనులఁ దనయుఁ డుండ ♦ వలసిన దినములు, పదియు నాలుగంచుఁ ♦ బదిఁ పడుము.

ఆ॥ మునుపు గాధి తనయు ♦ కనికరమునఁగొన్న, విద్య యవలఁ గల్గు ♦ విభవమెల్ల
వీడె నేమి? వారు ♦ విధియించు కార్యమ్ము, లొనరఁజేత మేల్మి ♦ యొదవు కొఱకె.  ౨౯౪

చ॥ మునులకు సేవ చేసి గురు ♦ బోధము గైకొని కీడు లేని వి
ద్యను గొని వారి దీవనల ♦ నంతము లేని బలంబు నొంది పెం
పెనయఁగ దేవతాహితము ♦ నిచ్చను చేయుచు వారి వీడుకోల్
గొని యిట కేగు దేరఁ బెను ♦ కూరిమిఁ గాంతువు గాక తల్లిరో!  ౨౯౫

క॥ ధాత్రిం బ్రసిద్ధిన సగరుని, పుత్త్రులు తమ తండ్రియాజ్ఞ ♦ పోసఁగించుటకై
గాత్రములు వీడు కతమునఁ, బాత్రములై యొప్పె నుతికి ♦ వారల కీర్తుల్.  ౨౯౬

క॥ శివు గద ధరియించిన భా, ర్గవుఁడు జనకు నాజ్ఞ దాఁట ♦ కయ తన తల్లిఁ
దివిరి తెగనేసె మనకుఁ, థవు నాజ్ఞం దాఁటు టెన్నఁ ♦ దగునే? తల్లీ!  ౨౯౭

క॥ అని యిట్లు పలు విధంబులఁ, దనతల్లిని యూఱడించు ♦ తనయుని పలుకుల్
విని యితఁ డెట్లును రాజ్యం, బును, విడుచున యనుచు నిట్లు ♦ మొగి నూహించెఁ

తే॥ భరతునకె రాజ్యపాలన ♦ పరఁగుఁ గాక, రాష్ట్రమును వీడి దుర్గమా ♦ రణ్యములకుఁ
దపము సేయ రాముని పోక ♦ తడయొనర్ప, నవని విభు వేఁడియే తీర్తు ♦ ననుచు వెడలె.

తే॥ వెడలుచున్న కౌసల్యకు ♦ ప్రనతి చేసి, తల్లి నూరార్చి వనరెడు ♦ తండ్రిఁ దేర్పఁ
దగినది సుమిత్రయేయని ♦ తలఁచి యామె, సౌధమునకు శ్రీరాముఁడు ♦ సరగ నడచె

తే॥ నడచి కౌసల్యకై కేయి ♦ నగరు సొచ్చి, వివశతం బడి యున్నట్టి ♦ విభుని గాంచి

దేహికిం బ్రాణములు బయ ♦ ల్దేఱువేళఁ, దనువు కూలు నట్టులు తెల్వి ♦ దప్పిపడియె

సీ॥ చాలసేపటి కొక్క ♦ చందానఁ దెలివొంది, హానాథ! యనును హా ♦ యంగఁ దగని
వారల నెడఁబాయఁ ♦ గారణ మేమను, నిదిసీతియే? యను ♦ హితమె? యనును
సేవకు రాజ్యేంద్ర మా ♦ స్థితి దలంపవె యనుఁ, బాడియే యిది మహీ ♦ పాల! యనును
అసదల భాగమేయసు! ♦ యనుఁ గంటినే, యను మదీయాశ్రయ ♦ హా! నృపాల

తే॥ నాథ నాథా! యనును లోక ♦ సదయవిశాల!, కర్జమే యను లెమ్మనుఁ ♦ గష్టమనును
అవని నాజీవితం బిఁక ♦ వ్యర్థమనును, ఇట్టు లోటకుఁ గారణ ♦ మేమొ యనును. ३०౨

చ॥ ఇరులను పోవఁ ద్రోలెడు ది ♦ నేశునకున్ సమమైన యాసతిన్
జరపుటచేత నెమ్మదిగ ♦ సాగుచునున్న జగంబు కీడు పా
టొరసి లయంబు నొందు నటు ♦ లుల్లమునం దలపోసియో యిటుల్
కరుణ తొలంగి యుండుటకుఁ ♦ గారణమయ్యె జగచ్ఛరణ్యమా! ३०३

ఉ॥ వారిధి మేఖలా సుజన ♦ భవ్యతపః ఫల సంభవా! మహా
వీర! దయాసముద్ర! సదయ ♦ విశ్రుత! వేద శిరోర్థ సన్నిభా!
శ్రీరమకున్ నిశేషరమ ♦ చేర్చునుదార! మొదల్ ద్రవింప నీ
తీరునఁ గుందుచున్న మము ♦ దేర్పక యూరక యుంట పాడియే? ३०४

చ॥ నిలుకడ చెంద నిలుచువలె ♦ నీటగు దేహము దేహి లేఁ డనన్
దలఁపఁగ రాని దుఃఖమునఁ ♦ దద్దయు మున్గి సరేశ్వరుండు చే
ష్టలు విడి తెల్వి దప్పె నిది ♦ చక్కటి నాఁ డిదమిత్థమంచు నూ
హాల కెఱుఁగంగరాదు తన ♦ యా! విభుదుస్థితిఁ జూడ రమ్మిఁకన్. ३०५

చ॥ ఇటు పలవించు రామ జన ♦ యిత్రి కలధ్వని విన్న రాజులున్
జటిలు లమంగళంబు వినఁ ♦ జాలము దీనికి హేతు వెద్దియో
యిటుకసఁ గాంచి రండనుడుఁ ♦ దత్తఱితోడ వసిష్ఠుఁడేగి సం
కటపడి జేని దుస్థితిని ♦ గాంచి సమాప్తియదంచుఁ జింతిలెన్. ३०६

సీ॥ మనుజుల శీలంబు ♦ మార్పడు విధములు, పరులకు నెఱుఁగ సు ♦ కరముగాదు
నృప వరుఁడో మఱ ♦ ణించి నాతఁడు కాఁడు, కాఁడన్న బ్రతికెడు ♦ వాఁడుఁగాఁడు
కౌసల్యయో వగఁ ♦ గ్రాఁగి క్రుంగుచు నుండె, నడిగినఁ జూడదు ♦ నుడువఁబోదు
పతి వివశుండయి ♦ పడియుండ నించుక, యేని చింతింపద ♦ యెడఁద పదిల

తే॥ మూనె నియ్యమ దెల్పునం ♦ చూహనేసి, యెదుటఁగేలు మోడ్చుపుఘటి ♦ యుంచినిలుచు
కైకఁగని యిది యేమనఁ ♦ గడచువృత్త, మెల్ల వివరించె నద్దేవి ♦ పల్లటిలక. ३०७

సీ॥ పలికిన కైకేయి ♦ పలుకు చుండంగ వ, సిష్ఠుండు దశరథుఁ ♦ జేయి సాఁచి
లేవంగనెత్తి యో ♦ భూవర నీ విట్టు, లజ్ఞాని కైవడి ♦ సడల నగునె?

కైకేయి గుణ మీావు♦కానని దోకోృ?యూ,యమయె రామునకు రా ♦ జ్యంబొసంగు
నిది యెట్టి కార్యంబు ♦ మది చింత వీడి లే, లెమ్మంచుఁ దాళ వృం ♦ తమ్ము తోడ

తే॥ విసరి పన్నీరు చల్లి దు ♦ ర్విషముఁ బోలు, వెలఁది వాకర్భాల మించుక ♦ వెనుక సడల
రామ రామ యటంచు నా ♦ క్రందనంబు, సేయు ధరణీశు ప్రాణముల్♦చెలఁగి కాంచె

సీ॥ కాంచి రాజేంద్ర! నీ ♦ కటు దుఃఖమును మాను,పురుషోత్తముండెయీా♦భూమిఁగాచు
దానికి విఘ్నముల్ ♦ తనరారు నేమి? స, మంజస మందని ♦ యట్టి పలుకు
లాడు కైకేయియే ♦ యవని నొసంగును, నీల దేహుఁడె నేల ♦ నేల కుండ
వనుల కేగన యేని ♦ మన మిట నుందుమే, యను వసిష్ఠుని పల్కు ♦ లాలకించి

తే॥ గురు వరేణ్య! యీాస్థితి నేను ♦ కూలు మున్నె, పట్టముం గట్టి రాముఁడు♦వనుల కేగు
తలఁపు మాన్పి నావాక్యముల్ ♦ దబ్బుగాక, యుండరక్షింపవేయని♦యొడయఁడనుడు

చ॥ మొనసిన పాప రూపమగు ♦ మూర్ఖ మొగంబును గాంచి శ్రీరమన్
జెనసిన దానవమ్మ యిటఁ ♦ జెప్పఁగ నెయ్యది గల్గు నీకు? నీ
తనయున కీ ధరాస్థలి ము ♦ దంబున నిచ్చి భవ న్మనోహరుం
దనుపుము ప్రాణమిచ్చి విశ ♦ దంబగు కీర్తి భరింపు మీావిధిన్. ౩౧౦

చ॥ పొలుపగు ద్వంద్వ కర్మముల ♦ మూలము ముట్ట నడంచి యున్నతుం
డలఘుఁడు నైన వంశ గురుఁ ♦ డవ్విధిఁ బల్కుచునుండఁ గైక భూ
తలపతి సత్య వాక్యమును ♦ తప్పిన నేనుసుఱుల్ దొలంతు నా
పలుకులు నేఁడె నిక్క మఱు ♦ వం గల నంచు నె యేడ్చె వెక్కుచున్.౩౧౧

చ॥ పతి గతియించు నంచు జన ♦ వారము సమ్మతి సేయ దంచు నిం
గిత మగునంచుఁ బాపమును ♦ దెప్పరముం గలదంచు డెంద మం
దతివ తలంపదున్ జల మొ ♦ కంతయు వీడదు నే వచింపఁగా
హిత మెది గల్గు నంచు మది ♦ నెంచి వసిష్ఠుఁడు పాడి గాదనెన్. ౩౧౨

మ॥ తగు మోమోటమి లేక కుంది పతి యం ♦ తం బొందు నంచెంచకే
తగులుం గానక పుంటిలోఁ జొనుప్పు దు ♦ ర్దాహాగ్ని యో? నంజొ? నాఁ
దగి వ్రాకుచ్చుచు నున్న నీవు చెలివో? దావాగ్నివో! భూతమో?
మగఁ డింకేటికి నీకు? రట్టొ? వలదో? ♦ మన్నించు నిన్నిందుపై.

చ॥ నరపతి నోటితో సుతు వ ♦ నంబుల కంపఁగఁ బల్కు మున్నె ని
బ్బరమునఁ బల్కితీవ రఘు ♦ వర్యుఁడొ దుర్గమ కాననంబులన్
దిరుగుటొ పొందుటో విడఁడు ♦ దీపిత కీర్త్యసువుల్ దహించు నో
శరనిధి బాడబంబ! మఱి ♦ సాటి యెసంగరు నీకు భూస్థలిన్. ౩౧౪

తే॥ నిష్కళంకుఁడమ్మునియిట్లు ♦ నియతినుడువ, నృపుఁడునిజనాల్క విసముప్ప ♦ నెలఁతఁగాంచి
పాపినీ! వనములకు నా ♦ ప్రాణములను, నీవపంపితివే? యతఁ ♦ డేగినాఁడె? ౩౧౫

శా॥ నీ యుద్దేశము బాగుగా నెఱిఁగితిన్ ♦ నీజిహ్వికా దుర్విషం
బే యెంతో కుడిపించి తిప్పుడసువుల్ ♦ హేలం గొనం జూతు కై
కేయీ! శాకినీ! నిన్ను నమ్మ యెదుటం ♦ గేల్వట్టఁగా లేదు నా
యాయుఃప్రాప్తము నేఁడె మృత్యువనె యి ♦ ల్లాలించుఁ జేపట్టితిన్

సీ॥ కొడుకు గాకొక దృష్టి ♦ పడయని నాకన్నుఁ, బోఁచెదవేల యో ♦ పోలసు దిండి!
అతఁడు గాకొక ప్రాణ ♦ మరయంగలేని నన్, జంపంగ నెంచితే ♦ అంపెలాడి!
సుతుఁడు గాకొక నాల్క ♦ హీనపడకుండు నా, జిహ్వను కాల్చెదే ♦ చిచ్చుపిడుగ!
వంశాంకురంబును ♦ వనులలోఁ ద్రాఁగింప, నెంచితే రవివంశ ♦ మృత్యుమూర్తి!

తే॥ హృద్విదారిణీ! సిగ్గఁడి! ♦ హెచ్చు లేల?, నీమెడం గట్టు సూత్రంబు ♦ నీసుతునకు
భరతునకుఁ బట్టముం గట్టు ♦ పట్టు నందు, ననువు గాఁగ రక్షాబంధ ♦ మగునుగాక.

చ॥ ముని కుల చంద్ర! యీచెడుగు ♦ భూతము నాసతిగాదు నేఁడె దీ
నిని మనసార వీడితిని ♦ నిక్క మయోధ్యకు భర్త దీని కిం
దనయుఁడు నాకు మారకుఁడె ♦ తక్కఁ గుమారకుఁడౌనె యాతఁడో
జను మఱి యూర్ధ్వదేహికము ♦ నల్పఁగ నర్హుఁడు కాఁడు సుమ్మికన్.

చ॥ అని మఱి కోసలేంద్ర తన ♦ యుం గని ప్రాణపదంబు నన్నిటన్
గనని విధాన నిన్ను నట ♦ గానకయే ననవాటి కేగనే?
యని పలవింప నయ్యపుఁడు ♦ నచ్చటనైన విధం బెఱింగి న
చ్చిన తలఁపున్ మనంబుననె ♦ చెచ్చెర నీడుచు ద్రాలె నేలపై. ౩౧౯

మ॥ ఇది కైకేయి కుచేష్టితం బనియు భూ ♦ మీశుండు కైకేయికిన్
ముద మందన్ వరమిచ్చి తత్ఫలముగా ♦ మూర్ఛిల్లి సంతాపమున్
మదిఁ గొన్నాఁడని లోన నూఱడిలి రా ♦ మా! తండ్రి వాక్యంబు నె
ల్లిదముం జేయక కాన కేగుమని ప ♦ ల్కెన్ లేచి కౌసల్య తాన్. ౩౨౦

సీ॥ పతి పలవింపంగఁ ♦ బలవించు నందింప, నందించు సద్దేవి ♦ నాథుఁగాంచి
యో మహనీయ! యి ♦ ట్లుడుకంగనేల? స, త్యంబునయందు సు ♦ స్థైర్యమతివి
అకలంకమైన నీ ♦ యాచార్యమున కిప్పు, డించుక కలఁకఁ గ ♦ ల్పించెదేని
సుస్థిరగుణి యగు ♦ సుతునెడఁ గల్గు వ్యా, మోహంబుచే వగఁ ♦ బొగిలెదేని

తే॥ జగము వారలీపద్ధతి ♦ సమ్మతింప, రట్లుగావునఁ బుత్త్రుపై ♦ నడరుప్రేమ
నడఁచి యడవుల కాసుతు ♦ నంపి సత్య, వాక్యుఁడవు గమ్ము యశముఁగా ♦ పాడుకొనుము.

ఉ॥ నందనుఁ డేగకుండఁ డిఁక ♦ నాథుఁడొ జీవము నిల్పఁడంచుఁ దా
డెందమునందు కుంది వగ ♦ డిందును భర్తృ యశంబుకై దపిం
చుం దనయుం గృపాళుతను ♦ జూడుమ యంచును వేఁడఁబోవఁ దా
చందనగంధి యెట్టి చెడు ♦ సంకటపాటునఁ జిక్కె దైవమా!　　　౩౨౨

చ॥ సతి యటులాడు వార్త విని ♦ సత్యయశస్కుఁడు భూమిభర్త నా
సుతుఁడిఁక మేదినిం గొనఁడు ♦ సూటిగ సింహ మదేభ భల్ల సం
తతులు చరించు కానలకె ♦ దప్పక యేగున యంచెఱింగి సం
తత పరితాప మంది వసు ♦ ధం బడె రాఘవ! యంచు వ్రోలుచున్.　౩౨౩

మ॥ తనయా! కన్నులు సేరుగాఁగ నసువుల్ ♦ స్థానంబులం దప్పఁ జా
వనె యున్నాఁడను విప్రులగ్ని యెదుటన్ ♦ భవ్యాభిషేకంబు నీ
కొనరింపం గొని యుంచు తోయముల నా ♦ కూర్ధ్వక్రియ ల్సల్పి కా
ననముం జేరు మనంతరంబు నను గా ♦ నం జాల వా మీఁదటన్.　　　౩౨౪

ఉ॥ రాజులఁ బెక్కుమాఱులు ప ♦ రశ్వథముం గొని సంహరించు వి
భ్రాజిత సత్త్వశాలియగు ♦ భార్గవరాముని వింటి చేత ను
త్తేజ మడంచు ధీర! కుల ♦ దీపక! సంతతి వారికెల్లఁ బే
రోజను వచ్చు శీర్షకము ♦ నుంచెద నంచని యిచ్చితిన్ జటల్.　　　౩౨౫

ఉ॥ నీల వలాహకాభ శుభ - నిర్మలదేహా! మనోవచః క్రియా
శీల! కృపాల వాల! శశి ♦ శేఖర చాప విభంజనా! సుధీ
శాలి హృదబ్జరంజన! కృ ♦ శత్వము నొందెడు నొంటి వృద్ధు ని
క్కోల పరిత్యజించి తిఁక ♦ నేనును నిల్వఁగ నోప భూమిపై.　　　౩౨౬

సీ॥ అపరంజి కపరంజి! ఖ్యాతికి విఖ్యాతి, నీ గుణంబులును నీ ♦ నియత చరిత
సత్యంబులకు నిత్య ♦ సత్యరూపంబ! నా, కంటెను ముందీవు ♦ కాన కేగ
నేఁ బసివాఁడనే? ♦ నీకంటె ముందుగాఁ, దేవలోకముఁ జేరఁ ♦ దివురువాఁడఁ
బ్రేమచేఁ గరఁగెడు ♦ పెనుపారు హృదయంబు, ప్రేమచేఁ బ్రాణము♦ల్విడుచు నొడలు

తే॥ పడసి యున్న నే నీ వంటి♦ వాఁడఁగాను, పరమ పావని సీతఁ జే - పట్టివచ్చు
నిన్ను గాంచిన యీ కంట ♦ నీవువనులఁ, జేర వీక్షింపఁజాల వి ♦ క్షింపఁజాల.　　　౩౨౭

సీ॥ జగము నీ విరహంబు ♦ సహియించు నేనియు, దేవతావళియుఁ జిం ♦ తింప దేని
నా తండ్రి! నాయన్న! ♦ నా జీవితంపు స, ర్వ స్వమా! నిను గన్న ♦ వాఁడ నైన
యే నెఱుంగుదు నీ మ ♦ హిమ నాస్థితిం గూర్చి, యేమని వచియింతు♦ నిహము నొల్ల
నాల్గు వారిధులకు ♦ నడిమి భూతలమును, తెఱఁగక ద్ధొలరారు ♦ ద్రవ్య సమితి

తే॥ రథగజాదికములు రత్న ♦ రాజితోడఁ, గీర్తికాముఁడ వగుచుఁ గై ♦ కేయి కొసఁగు
నీ యుదారతయే నిట్టి ♦ నిలువుగాఁగ, నాదు ప్రాణంబులం దీసె ♦ నయ గుణాఢ్య!

చ॥ నర సుర నాగ యక్ష కుల ♦ నాథుల యందును నిన్ను బోలు శ్రీ
కర గుణశాలి విశ్రుతుఁ డొ ♦ కండు గలండె కో? ముద్దుకూన! యం
బరశివు చేతిఁ బట్టు బల ♦ వంతుఁడు గర్వముచే నెదుర్చ నొ
క్కరుఁడవుఁడ నిల్చి మార్కొను మ ♦ గండు జగంబునఁ గల్గ నేర్చునే?

చ॥ అడవుల కీవుపోవ విని ♦ ప్రాణము తోడుత నుండినంగదా
పుడమి జనంబు లెల్ల నను ♦ బృవ్వఁగఁ దిట్టెడువార లిట్టు నీ
వడవుల నుండఁగాఁ గొడిమె ♦ లాఁడి గృహంబునఁ దీపి దేహ మే
నెడపక యుంటినేని బ్రదు ♦ కెల్లిదమౌఁ గద? సద్గుణాకరా! 330

చ॥ స్థిర తప మాచరించి భవ ♦ దీయ బలిష్ఠ విశాల వక్షముల్
మురువుగఁ గౌఁగిలించికొనఁ ♦ బూనిస లక్ష్మియు భూమి దేవియుల్
ధర మనఁజాల రంతియ క ♦ దా? మతి యేనును నిన్ను బాసి యు
ర్వ్వరఁ దగ నుండుచోఁ గయిక ♦ వంటి దురాత్ముఁడనే నిజంబుగన్. 33౧

ఉ॥ కాంతులు గుల్కు భూషలు జ ♦ గా మకుటంబు పసిండి గద్దె ము
క్కాంతరితాతపత్త్రి ముర ♦ మందున లక్ష్మి నెలుంగఁ జూడఁగాఁ
జింతిలుచుండు నే ముదుక ♦ చీర మృగాజినముల్ ధరించు టా
వంతయుఁ జూచు మున్నె మృతి ♦ సందుట యెన్న సుకర్మమే కదా? 33౨

ఉ॥ పుత్ర విమోహ మిట్లు మదిఁ ♦ బొంగఁగ జాలు కరంగనేడ్చు రా
జన్యుఁడు ప్రాణముల్ దరల ♦ నీఁగు స్థితిన్ గృశతన్ భజింప లో
కత్రయ పూజ్యుఁడైన ముని ♦ కాంతుఁడు భూపతిఁగాంచి రాముఁడీ
ధాత్రిని పీడకే నిలిపె ♦ దన్ ధృతిఁ బూనుమ యోర్చుమా యనన్. 333

ఉ॥ పావనుఁడైన మౌని యిటు ♦ వల్కఁగ వేదన నొందుచున్న పృ
థ్వీవరుఁ డీమహాత్ముఁడు ♦ వెళ్లి వచించిన రామచంద్రుఁడుం
బోవక నిల్చునంచుఁ దల ♦ పోసి యొకించుక తేటి వెండి చిం
తావిల మానసుండగుచు ♦ నందఱు హాయనఁగూలె ధారణిన్. 33౪

చ॥ తలఁపును ప్రాణముల్ మఱచె ♦ ధారణి నాథుఁ డటంచు డెందముం
గలఁగఁగ రాముతల్లి, కొడు ♦ కా! యిట రాజ్యముతోడ మమ్మిటుల్
దొలఁచితె? యంచు, నాథ! పెను ♦ దుఃఖమున న్నను వీడి యీరలుం
దొలఁగుట ధర్మమా? యనుచుఁ ♦ దూలుచు సోలుచుఁ గూలె వెక్కుచున్,

తే॥ మనసు నిలుపక మీరిట్లు ♦ మలఁగుచుండ, లోక మెల్లను పెను చింత ♦లో మునుంగు
వచ్చినను ముని తోడ రా♦ వచ్చుఁ గొడుకు, తెరలకుండని పతిసేద ♦ దీర్చఁ బూని.

తే॥ పతి మొగంబును మేనిని♦పాదయుగము, తన మృదుల హస్తయుగళానఁ♦దడవుచుండఁ
దెలివి దప్పిన నరపతి ♦ తేఁటి మెల్ల, వచ్చునే వచ్చునే యని ♦ వార నిసియె. ౩౩౭

ఉ॥ కుటిల మనస్కయైన తన ♦ కుబ్జ కుబోధముచే వరంబులన్
దటుకున నాదు ప్రాణములఁ ♦ దప్పక దీయఁగ లోన నిశ్చయిం
చుటయును గాక యామె ప్రియ ♦ సూనుఁడు భూతల మెల్ల నేలఁగ
ల్గుటయును గాక రాము వని ♦ లోఁ జొరఁ బొమ్మని చెప్పెఁగా! కటా!

దశరథుఁడు కౌసల్యకుఁ దనపూర్వ శాపమ్ముం దెల్పుట.

మ॥ వనితా! రాముఁడుఁ కాన కేఁగుటలు ద ♦ ప్పం బోఁడు నాప్రాణముల్
మును మున్నేచను కొంతయు న్నిజము నేఁ ♦ బూర్వంబు నందొక్క స
న్మునిశాపంబును పొందినాఁడ నది యం ♦ భోజాక్షి! చూడంగ నేఁ
డనుభావ్యంబగు నట్టులుండె వినుమా ♦ యాద్యంత మాగాథయున్. ౩౩౯

మ॥ మృగయా కౌతుక మొక్కనాఁడు మదిలో ♦ మెండ్రింప సైన్యంబుతోఁ
దగురీతిన్ వన భూములం దిరిగి భూ ♦ దార ద్వీప శ్రేణులన్
మృగ రాజాదులఁ గూల్చుచుం గడచుచుం ♦ దృప్తిం గనం బోక యా
పగ తీరంబునఁ బొంచి యుంటి విధి నన్ ♦ బాధింపఁ బెన్జీఁకటిన్. ౩౪౦

మ॥ ఒక జాత్యంధుఁడు భార్యతోడ సుతుఁడే ♦ యొప్పారు పెన్మూఁతగా
నికటంబందు తపంబు సేయు నెడలన్ ♦ నీరంబు గొంపోవ దా
రకుఁ డాయేటికి వచ్చి కుండికను నీ ♦ రం బందు ముంపంగ నే
నిక రావంబని యేయఁగా శరము వా ♦ నిం గూల్చెఁ దీరంబునన్. ౩౪౧

మ॥ ఉదకం బాను మదేభ శబ్దమని యే ♦ నూహించి యస్త్రోవనే
ప్రదరం బేసితి శబ్దవేధిఁగొని త ♦ ద్వాతం బ్రలాపింప న
య్యది మానుష్య రవంబ యం చులికి య ♦ త్యావేగమున్ దుఃఖమున్
గదురం బాఱితి విప్ర బాలు కడకున్ ♦ గాఢాంధకారంబునన్. ౩౪౨

ఉ॥ కుండికతోఁ గరంబు తెగి ♦ కూల ధరం బడి పొర్లుచున్న యా
కొండికఁ గాంచి లోకములె ♦ కూలిన యట్లు దలంచి చేతి కో
దండము జాఱ మైవివశ ♦ త న్మహిఁగూలి తపించి కుఱ్ఱ! యె
వ్వాండవు తెల్పుమా యన న ♦ బద్ధ మెఱుంగని యాతఁ డిట్లనెన్. ౩౪౩

తే॥ మత్స్య మూర్తియా శ్రీరమా ♦ మహిళ భర్త, నాభిఁ బుట్టిన పరమేష్ఠి♦నాల్గువేద
ములను పల్కిన నాల్గు జా ♦ తులను మొదటి, జాతిలో మమ్ము పుట్టించె♦జగతియందు

తే॥ అజుని పుత్త్రుండు కర్త్యస్సు ♦ డతని సూనుఁ, డవని వృత్తేశుఁ డనఁజను ♦ నతనికొడుకు
వైదికుఁడు జలభాజి నాఁ ♦ బరఁగు వాని, యతని పట్టి సురోచనుఁ ♦ డనెడు వాఁడ.

మత్త॥ తల్లిదండ్రులు పుట్టు గ్రుడ్డులు ♦ త్రావ నీరము దెమ్మనన్
వల్లె యంచిటు వచ్చియిచ్చట ♦ బాణ విద్ధుఁడనైతి నా
తల్లి కర్కశలాన దీనికి ♦ దుఃఖ మందకు మేనుఁగం
చుల్లమంపు దలంచి యేసితి ♦ వొంద దియ్యెడ దోసమున్. ౩౮౬

మత్త॥ దప్పిచేఁ దపియించు నా తలి ♦ దండ్రు లాన జలంబులన్
గొప్ప బుద్ధి నొసంగి యవ్వలఁ ♦ గూర్మిపట్టి గతించుటల్
చెప్పి స్వర్గముఁ జేర నంజలి ♦ చేసె నంచు వచింపు మా
యప్ప! యంచు దివంబు చేరె సు ♦ రాళి వేడ్క నెదుర్కొనన్. ౩౮౭

చ॥ తనయుని రాక కై మొదలఁ ♦ దత్తఱ మందెడు వారి చోటి కా
తనయుని కోడ సీరు గొని ♦ దాయఁగ వారు కుమార! యింత సే
పెనయమికేన్ విచారపడి ♦ యెయ్యదొ ముప్పునఁ గూడెనంచు మా
మనమును తపించుచుండె నిఁక ♦ మమ్ము కౌఁగిలి సేయ రమ్మనన్. ౩౮౮

చ॥ మునిజనవంద్య! కోసల వి ♦ భుండను వేటకు వచ్చి సామజం
బును వడి సేయ వ్రేటు గొని ♦ పోయిన దానికిఁ బొంచి యేటి గ
ట్టున మొగి నుండి యీతఁడు బు ♦ డుంగుసఁ గుండిక ముంచు చప్పుడున్
విని కరియంచు సేసితిని ♦ వీనిఁ ణ సేయను దొడ్డ చీఁకటిన్. ౩౮౯

చ॥ శరమొగిఁ దాఁకఁ గూలుయిడిన ♦ శబ్దముచేఁ గరి కాదటంచు నేఁ
బరుగిడి కాంచి నీవెవరి ♦ బాలుఁడ వన్న నతండు సర్వమున్
దెలుఁగు వడంగఁ జెప్పి వెస ♦ దివ్యపదంబున కేగె నంత నే
నరవడి బాలకుం జలము ♦ నొయ్యనఁ దెచ్చితిఁ దాపసోత్తమా!. ౩౯౦

చ॥ కొడుకును చంపు క్రూరుఁడని ♦ కోపము సేయక చూడుఁడీ కృపన్
బుడ బుడ మన్న శబ్దమున ♦ బుద్ధి కలంగి యెనర్చి నాఁడ మీ
కొడుకు బలెన్ సమస్తమును ♦ కూర్చెద సేవ యొనర్చెదన్ సదా
విడువక యుండెదన్ వనట ♦ వీడుఁడి యంచు వచించు నంతటన్. ౩౯౧

సీ॥ పడిరి మూర్ఛిల్లిరి ♦ పనవిరి పొరలిరి, వగచిరి తపియించి ♦ వనరినారు
పల్లటిల్లిరి తల్ల ♦ డిల్లిరి కుమిలిరి, కుందిరి కృశియించి ♦ కూలినారు
నేఁడె మా కన్నులు ♦ నీఁగితి మనిరి మా, మనసుఁ బగిల్చితే ♦ యనిరి నీవు
స్వర్గమందుండ ని ♦ చ్చట మేము వసియింప, మిదె వత్తు మీనిఁద ♦ బ్రదుకఁ జాలనిరి

తే॥ కంటి పాపను బోలు మా ♦ కంపుఁగోలు, పోయి యైహిక సుఖములఁ ♦ బొందుచుంటి
మేని లోకు లాఱడి వెట్ట ♦ రే కుమార! నిన్ననుసరింతు మని వెంట ♦ నన్నుఁగాంచి ౩౫౨

తే॥ అభయమంటివి క్షమియింపు ♦ మంటిగాన, బొమ్మనకె నిన్ను పాసిన ♦ పుత్త్ర కొఱకు
నేడ్చి మావలె సురపురి ♦ కేగుదనుచుఁ, జెప్పి వారలు త్రిదివంబుఁ ♦ జేరినారు. ౩౫౩

ఉ॥ నెవ్వగ యించుకే మది గ ♦ ణింపక పుత్త్రులు లేని నాకు వీ
రి వ్వర మిచ్చి రంచు ముద ♦ మెత్తఱ నొంది పురంబు చేరితిన్
గ్రొవ్విరిఁబోణి! యా పలుకు ♦ గూడెను రాముఁ డరణ్య మేగుటల్
నెవ్వడి నేను కుంది మర ♦ ణించుట యెట్టులుఁ దప్ప దిత్తఱిన్. ౩౫౪

తే॥ భూమి పతి యిట్లు పల్కఁ స ♦ తీ మతల్లి, రాము తల్లి వినుచు నేల ♦ వ్రాలెఁ గలఁగి
అల వసిష్ఠుఁడు విధి బలీ ♦ యం బటంచు, నెడ తెగని దుఃఖములఁ గని ♦ యెడ తపింప

తే॥ భువన విశ్రుత కీర్తియా ♦ భూపు మేడ, ముందు మంగళ వాద్యముల్ ♦ బోరు కొనఁగ
రాము నభిషేకముం జూడ ♦ రాజ చయము, మూఁగి యున్న సభం జేరె ♦ మునివరుండు

క॥ వచ్చిన ముని మొగముం గని, చెచ్చెరఁ బ్రత్యూహ మేమి ♦ చేకుఱె దుఃఖం
బిచ్చటఁ బుట్టం గారణ, మచ్చపడం దెలుపుఁ డనుచు ♦ నవనిపు లడుగన్. ౩౫౭

ఉ॥ శంబరు తోడ భూవరుఁడు ♦ సంగరముం బొనరించు నాఁడు నే
మంబునం గైక గైకొనియె ♦ మానుగ రెండు వరాలు, వాని వే
షంబున రాముఁ డుగ్ర వన ♦ సంచరణం బొనరించు నట్టు లా
యంబసుతుండు రాజ్య భర ♦ ణార్హుఁడుగా వరియించె నిత్తఱిన్. ౩౫౮

తే॥ సత్యవాక్యుఁ డా ముని పల్కు ♦ శ్రవణములను, చేరి చేరక మున్నె య ♦ శేష జనము
స్త్రీలు పురుషులు హా! యని ♦ చెడితి మంచు, దశరథుం బోలె విలపించి ♦ ధరణిఁ బడిరి.

చ॥ వ్రణమున నిప్పు చొన్పు క్రియ ♦ వారని వేదన నొంది కుంది ధా
రణిఁబడి యెల్ల దేహములు ♦ రంజన దక్కఁచుఁ బొర్లె నేత్రవాః
కణములు కాఱి కాల్వలయి ♦ కంధిని బోలిన దట్టిచో నవా
రణమగు రోదన ధ్వని భ ♦ రంబయి నాకము నంటెఁ బెల్లుగన్. ౩౬౦

సీ॥ సుడి గాలి వడి వీవ ♦ సుడిసెడు సుమలతఁ, బోలిన కోమలుల్ ♦ బేల లగుచు
వెలలేని భూషణ ♦ వితతులు రాలంగ, మంగళ హారముల్ ♦ త్రుంగి పడఁగ
కొప్పులు వీడంగఁ ♦ గుచ కుట్మలములపై, వేఁడి బాష్పంబులు ♦ వెల్లి గొనఁగ
వెక్కుచుఁ బురపురఁ ♦ బొక్కుచు సురసుర, స్రుక్కుచు నేలపై ♦ సోలినారు.

తే॥ అక్కటా! ఱేఁడు కరుణ లేఁ ♦ డయ్యె నేమి?, ధర్మ మిఁకఁ వదలితి మని ♦ తలరి నృపులు
గాలిఁగూలిన తరువులఁ ♦ బోలి పడిరి, కడుపు చేవెట్టి కలఁచిన ♦ కరణి గాఁగ. ౩౬౧

ఉ॥ భూరి వదాన్యుఁడైన రఘు ♦ పుంగవుఁ డేగునె యంచు శారికా
కీరసు లేడ్వసాగె నట ♦ గీములలో వసియించుచుండు మా
ర్జారము లేడ్చె రామ విభు ♦ చందమెఱుంగని కూనలేడ్చె సం
సారసు లేడ్చె నేడ్చినవి ♦ సాధను లార్యులఁ జెప్ప నేలొకో? ౩౬౨

ఉ॥ బింబము వంటి నోట బలు ♦ వెల్లని మొల్లలఁ బోలు పండ్లుగా
నంబడఁ జన్నుదోయి పయి ♦ నాణెపు ముత్తెపు సాను త్రెవ్వ చిం
దం బడు చందమొప్పఁ గను ♦ దమ్ముల నశ్రు కణంబు లుర్లగా
టంబుగఁ దొక్కు పల్కుల ప ♦ డంతులు రోదన సేసి రయ్యెడన్. ౩౬౩

ఉ॥ ఏడ్చెను తల్లిఁ బోలెఁ బశు ♦ బృందము క్రేపులు నేడ్చె వారణా
లేడ్చెను తేరులేడ్చె హరు ♦ లేడ్చెను గూఁడుల నున్న పక్షి గుం
పేడ్చెను నాఁడు పూచు పువు ♦ లేడ్చెను తేనియఁగార్చు నందనా
లేడ్చెను వీథులేడ్చె మఱి ♦ యేడ్వక యుండిన దెద్ది యప్పురిన్? ౩౬౪

చ॥ బ్రదుకఁడు నాథుఁడంచు మది ♦ భావన సేయక రాముఁ గాన కం
గద గొని పోవు నట్లదుగు ♦ కైకయుఁ గ్రూర చరిత్రయైన యా
ముదుసలి కుబ్జ దక్క మఱి ♦ ప్రోలున నేడ్వకయుండు వార లె
వ్వరురున వారు? నీరె యయి ♦ పాఱఁ దొడంగిన వెల్ల దేహముల్. ౩౬౫

తే॥ తోరములగు తేరులు పాఱ ♦ ధూళిదుక్కి, యైన వీథు లశ్రు ప్రవా ♦ హంబులయ్యె
వారలుచ్చా వచంబుగ♦వసరు చున్న, వారి మొదలు భిన్నంబులై ♦పరఁగ కుండె

సీ॥ భూదేవి చేసిన ♦ పూర్వ పాపపు రాశి, బలుదొడ్డదగునంచుఁ ♦ బలుకువారు
శ్రీదేవి యొసరించు ♦ చెడుగులంతకు మించి, పోడవైనవే యని ♦ నుడువువారు
జగము వారల కనుల్ ♦ నలిపిసి పాపంబు, వనధి కంటెను గొప్ప♦ దనెడువారు
దుర్విధి మన మొదల్ ♦ దొలిచి పుండుగఁ జేసె, గోడుగా సనుచు వా ♦ క్రుచ్చువారు

తే॥ భరతుఁడిల యేలునే యని♦వనరు వారు,మరలఁడో రాముఁడిఁక నని మ♦ఱుఁగువారు
పట్టమే మన యముఁడని♦పసవువారు, విధి బలీయమనుచు నెంచి ♦ వెగచువారు.౩౬౬

సీ॥ అతివ పైమోహాన ♦ మతిచెడి వరముల, నిచ్చె రాజని లోన ♦ నొచ్చువారు
ఇంత వినియుఁ జావ ♦ కిల నున్న మనకంటెఁ, గఠిను లెవ్వారని ♦ కలఁగు వారు
మనము రాముని తోడ ♦ వనుల కేగుదము కా, దేనగ్గిఁజొత్తమం ♦ చెన్నువారు
ధరణీ హస్తంబులఁ ♦ దడవుచు వెల్లయూ, కన్నీటి తోడను ♦ కలుపువారు

తే॥ ఇంకఁ గౌసల్య బ్రదుకదం ♦ చేడ్చువారు, ఓర్వఁగలవె లక్ష్మణ! యని♦యుడుకువారు
తండ్రి మరణించునే యని♦తలరువారు, కైకయే సాఁకె గదెయని♦కసరువారు. ౩౬౭

చ॥ కొడుకునకుఁ మహీతలము ♦ గోరె సరే రఘురాముఁ గానకుం
గడపఁగ హేతువెయ్యదియుఁ ♦ గానను నిందను గొంట దక్క నా
గడుసరి వేశ్యగావలయుఁ ♦ గావుననే మదిఁ బ్రేమలేక యి
ట్లొడికముతో వలన్విసరి ♦ యుర్వర లాగె వరంబు సాకునఁ. ౩౬౯

చ॥ స్థిర తపమాచరించి మృతిఁ ♦ జెందుటకో? జగమందు జీవులఁ
దరమిడి చంపఁ జూచుటకొ? ♦ ధారణి నాథుఁడు పూని యిచ్చె నీ
వరముల మేలు మేలు ధర ♦ వారలె యేలఁగ నిమ్ము కాన కై
ల్లరమును పోద మయ్యె దక ♦ లంక పురంబగుఁ గొన్ని నాళ్లలో. ౩౭౦

చ॥ అసదృశుఁడైన జ్యేష్ఠసుతు ♦ నందఱ ముందరఁ బిల్చి రాజవై
వసుమతి నేలుమా యనిస ♦ భాస్థలిలో వచియించి కైకకై
వసమయి యామెపుత్త్రునకుఁ ♦ బట్టము నిచ్చిన సత్యమెంతయుఁ
బొసఁగునె? యింతయేల? పతి ♦ బుద్ధి విపర్యయ మయ్యెఁజెల్లరే! ౩౭౧

తే॥ రామునకు నొసంగిన ధరా ♦ రమణినొకరు, వలవఁగా రాము సీత యా ♦ వసుధ వీడ
నామె తోడనె వెళ్లక ♦ బూమెలాఁడి, తనయు నంగీకరించి నిల్చునొకో లక్ష్మి? ౩౭౨

తే॥ నేయి పోయక మొగసన ♦ ద్రోయకుండ, గాలిచే నాడు దీపంబుఁ - బోలి స్త్రీలు
పుండరీకాక్షు నందంపు ♦ మురువు చూపు, పొలయ కున్న నేగతియని ♦ యలయుచుండ

లక్ష్మణునికోపము.

తే॥ ఓరి! కైకేయి క్రౌర్య మత్యధికరింప, వసుధఁ గైకొనెఁ బతి నుండి-వర నిభమున
నన్న కడవుల నొసఁగె ని-ట్లగునె యనుచు, లక్ష్మణుఁడు లయ కాలాగ్ని-లలిని లేచె

చ॥ కడు బెడిదంపు టూరుపులు - గ్రాల నొడల్ చెమటన్ మునుంగఁగాఁ
గడ కనులఁ మిడుంగుఱులు - క్రాయ బొమ ల్ముడివొందఁ జండ భా
నుఁడు నడలూన నొ డదర - నూల్కొను కోపము తోడ లక్ష్మణుం
డడరె స్వకీయమైన తొలి - యాకృతి నప్పుడు గొన్నకై వడిన్. ౩౭౫

తే॥ హరి కిశోరంబునకు నిడు ♦ నామిషంబు, నొక్క ముక్కడి కుక్కకు ♦ నొసఁగఁగోరె
మెలఁత తెలి విద్ది మేల్మేలు ♦ మెచ్చ వచ్చు, ననుచుఁ గేల్దట్టె వికటాట్ట ♦ హాసమొదవ

సీ॥ మణులు చెక్కిన కత్తి ♦ మధ్యంబునఁ బ్రేలఁ, గరమునఁ బెను కార్ము ♦ కంబు గ్రాల
బొన్నలఁ గల పాము ♦ పుట్టలఁ బోలిన, తూణీరములు వెన్కఁ ♦ దూఁగి యాడ
బంగారు కవచముల్ ♦ రంగారు భుజముల, నెఱవైన యురమును ♦ మఱుఁగు పఱుప
పాదంబులందలి ♦ పైఁడి యందుకములు, కడలి బిడియమందఁ ♦ గా ధ్వనింప

ధనముగఁ జేసి నీకుఁ బను ♦ నాల్గు జగంబుల రాజలోకముం
గొనకొని కాచుకార్యము న ♦ కుంఠిత రీతిని కొమ్మొసంగెదన్. ౩౮౪

ఉ॥ తమ్ముఁడిటు ల్వచింప గుణ ♦ ధాముఁడు రాముఁడు మెల్లనిట్లనున్
సమ్మతి నీతి మార్గమున ♦ సాగుచు నుండును నీమనమ్ము నేఁ
డమ్మెయి దప్పి కోపమున ♦ కాకర మీాయని నీయెడంద ధ
ర్మమ్ముమగంట మాడ్చెడు తె ♦ అంగునఁ గిన్కయదెట్లు పుట్టెనో? ౩౮౫

చ॥ లలిత మృదూక్తి నిట్టులన ♦ లక్ష్మణుఁడుం జిఱు నవ్వు నవ్వి రా
ట్తిలకుఁడు నీది రాజ్యమనఁ ♦ దేఁకువ దానికి సమ్మతించి శ
త్రుల వలనన్ సమస్తమును ♦ దోపిడి పోవఁగఁ గాన కేఁగుచో
వలవని కోపమింక మఱి ♦ వచ్చుట యెప్పుడో చెప్పుమా యనన్. ౩౮౬

ఉ॥ నేఁ గను చుండఁగా నవని ♦ నీకు నొసంగిన తండ్రి వెండి స్త్రీ
లోఁ గొన లేదు లేదనెడు ♦ లోభిని పోలె; భవద్విమాత నీ
పైఁ గడు నీసు పూని పెను ♦ వంచనఁ గొనకు నంపె నింకిటుల్
వేఁగుచు నెట్టులుందు నడ ♦ పీనుఁగునై జగ మీాసడింపఁగన్. ౩౮౭

ఉ॥ తమ్ముఁడు కోపముం గొను క ♦ తమ్మటు దెల్పుచు నుండఁ గ్రేపుఁ బ్రే
మమ్మునఁ గాంచు ధేనువు క్ర ♦ మమ్మునఁ గాంచుచు భూమిఁ బుట్టు ప్రా
ణమ్ములఁ గాచు నాజ్ఞయు ఘ ♦ నమ్మగు కార్ముక మూను పుష్టి హ
స్తమ్ములు మేటిసూ మను య ♦ శమ్మును గల్గిన రాముఁ డిట్లనున్. ౩౮౮

ఉ॥ చిచ్చును భాస్కరున్ మెదిపి ♦ చేసిన కైవడి దోఁచి మించుఁ బై
పెచ్చుగ గెల్చు వాలుగల ♦ వీర! నృపాలుఁడు కొమ్మనంగ ముక్
వచ్చెడు కీడు గాన కొడఁ ♦ బడ్డ నెపం బది నాది గాక యిం
దచ్చుగఁ దండ్రికిం గలదె ♦ యాఱడి? యింత యెఱుంగ వేలొకో? ౩౮౯

తే॥ నీరు వట్టి పోక నదికి ♦ నిందకాదు, తల్లి దండ్రుల కీది యట్లె ♦ తప్పుగాదు
భరతు దోషమింతయు లేదు ♦ వత్స! దైవ, కృతము దీనికై నీకింత ♦ కినుక యేల?

ఉ॥ ఊఁదిన కొల్మి మంటవలె ♦ నూర్చుచు మండెడు లక్ష్మణుం డనున్
భేదము గూర్చు కైక మతి ♦ కిన్ మతిఁ గూర్చి త్రిమూర్తు లేనియున్
భేదిలి దాఁట లేని విధి ♦ పేర్మిని సైతము గెల్చు నాదు వి
ల్లాదటఁ జేయు కృత్యము ర ♦ వంత యెఱింగెదు గాక రాఘవా! ౩౯౧

ఉ॥ నావుడు రాముడిట్టులను ♦ నాయన! నీతులు నేర్చు నోటితో
నీవిటులాడఁగాఁ దగునె? ♦ యీా పని పూర్వుల సమ్మతంబునన్

మేవడ నిల్వనేర్చునొకో? ♦ మేదురబుద్ధిఁ దలంచి చూడుమా?
దావము పోలె మండి తలి ♦ దండ్రుల నొంచుట యెట్టి కార్యమో? ౩౯౨

ఉ॥ వారక రుద్రమూర్తి క్రియ ♦ వర్ధిలు లక్ష్మణుఁ డంత నో మహో
దార! గురుండు నీవ మఱి ♦ తల్లియుఁ దండ్రియు నీవ దైవముం
ధీర గుణాఢ్య! నీవ తగు ♦ తెన్నును నీవ యితః పరంబు నే
నేరనటంచు నెత్తఁ గర ♦ నీరజముల్ ముకుళించి భక్తిమై. ౩౯౩

ఉ॥ రాఘవుఁడంత నిట్లను వ ♦ రంబులు గైకొను తల్లి రాజ్యముం
దా ఘటియించుకొంట యది ♦ ధర్మమనన్ జనయిత్రి పల్కులన్
మోఘము సేయకా భరతు ♦ ప్రత్తుఁడు గొంట సమంజసంబ నా
కీ ఘనవృత్తి కెంతయుఁ గన ♦ నెయ్యది మేలగు నీవ చెప్పుమా? ౩౯౪

చ॥ కనఁగ నొకింత కందు మదిఁ ♦ గానక సత్పథ మంద యెప్పుడుం
జనఁ గల తోడు నీడ నను ♦ జన్మని చంపి జగంబు సన్నుతిం
చిన మహనీయుఁ దండ్రి నృప ♦ శేఖరుఁ జట్టలు చీఱి యవ్వలన్
జననిని చంపియే కినుక ♦ శాంతి వహించునొ యేమొ? తమ్ముఁడా! ౩౯౫

చ॥ అనువగు పల్కులన్ వలఁతి ♦ యగ్రజు తన యన్నను గాంచి తమ్ముఁ డి
ట్లనుఁ బగఱు న్నుతించు యశ ♦ మందిన యేను వినిష్ఫలంబుగా
ఘన గిరులంబలెన్ భుజయు ♦ గంబు ధరించి శరంబు విల్లు మో
చి నిలువఁ బుట్టితిన్; వెదవి ♦ చేటుకదా భువిఁ బేద కోపముం? ౩౯౬

తే॥ ద్రవిడ సంస్కృత శరధి పా-రగుఁడు రాఘ, వుఁడు పల్కును మురిపంబు-పొదలనేఁటి
దనుకఁ గాచు తండ్రిని మీఱఁ - దగదు నాకు, నట్లు నామాట దాఁట నీ- కగున దేమి?

తే॥ వేదముల కడ్డుపల్కని - విధిని లక్ష్మ, ణుండు జ్యేష్ఠున కడ్డంబు - నుడువ జంకి
కడలి చెలియలి కట్టను - గడవకుండు, రహి నడంగి యూఱటఁ గాంచె - రామునాజ్ఞ

తే॥ పూని తుదిమొదల్ గనరాని - తానుశివుని, గౌఁగిలించిన కరణి ల -క్ష్మణుని చేర్చి
పిదప వాక్యజ్ఞు రాలగు - పిన్నతల్లి, గీము సొచ్చె రాముఁ డనుజు - కేలువట్టి. ౩౯౯

చ॥ వనముల కేగ సిద్ధపడు ♦ వారలు కన్నులఁ బోలు వారలుం
మునుకొని రాగఁ జూచి మది ♦ పుండయి దుఃఖ మహాబ్ధి తీరముం
గనక తపించు తల్లిపద ♦ కంజములన్ శిరమూన మ్రొక్కి నో
వ్వనియెడు శల్యమూడ్చి యెద ♦ కాదట గొల్వఁగ రాముఁ డిట్లనున్. ౪౦౦

చ॥ జనకుని సత్యవాక్యునిగఁ ♦ జల్పుటకేఁ బదునాలుగేండ్లు కా
ననముల కేగి నెమ్మది న - నంతర మిచ్చుటి కేగుదెంచెదన్

వనముల కేగినన్ విప్రుల - వారిధిఁ జొచ్చిన స్వర్గమేగినన్
నను నొకఁ డేఁపఁగాఁ గలఁడె? - నాకు సమస్త మయోధ్యయే యనున్. ౪౦౧

చ|| ఒడలు చలింపఁ బ్రాణములు - నుల్లల నాడ వివేకముల్ జెడన్
ముడుఁగవ మమ్మరో! యనుచు - ముచ్చిరు తల్లిని నిప్పు నార్చు న
వ్వడువునఁ దేర్చుచుండ నట - వచ్చిరి తెచ్చిరి చెల్వ లెప్పుడుం
జెడని కళంకు నొంది వగఁ - జెందని కైక యొసంగు నారలన్. ౪౦౨

శా|| కాలాంభోదముఁ బోలు రాముఁ గనుచోఁ - గన్నీరు మున్నీరుగా
జాళువ్వాలుట కంటె మున్ను వనముల్ - స్తంభించి తాఁ ర్మాఱులై
సోలంగాఁ బరదుఃఖముల్ గనియు న - శ్రుల్ రాని కైకేయి మా
కేలం బంపిన నార చీర లివిగో - క్షేమంకరా! కొమ్మనన్. ౪౦౩

ఉ|| సుందరు లీయ లక్ష్మణుఁడు - చూచి వసుంధర కాడుగా నొస
ర్వం దలపోసి కైక పను - పం దగు;నన్నియుఁ గైకొనంగ లోఁ
గందక యున్నవాఁ డితఁడు; - కార్ముక మూనియు వట్టి పందనై
పొందుగ వాని నెల్లఁ గనఁ - బుట్టిన యేనును చూతు; నిండనెన్. ౪౦౪

ఉ|| చేడియ లీయ లక్ష్మణుఁడు - చేకొని యిందని దుఃఖ మీఁగఁగన్
దోడనె పోదుగాక యని - త్రోవక తల్లిరో! యాజ్ఞయిమ్మ నీ
వాడిన పల్కెయీఁతయగు - నంచు శిరంబునఁ దల్లిపాదముల్
గూడఁగ మ్రొక్కెనంతఁ దన - కుందును వీడుచుఁ దల్లి యిట్లనెన్. ౪౦౫

సీ|| అవనభూమియు - నీవేఁగఁ దగనిది, కాదు నాయన! యొండు - కలదు వినుము
ఆకానయే సుమ్మ - నీ కయోధ్యా పురి, సీమీఁద మాఱని - ప్రేమ గలుగు
రాఘవుండే దశ - రథుఁడు మా జానకి, యే రాజ్యమును వీడి - యేగు నిదప
మని యుండు సీతల్లి, యను బుద్ధితోఁ బొమ్ము, నీవిఁక నిట నిల్వ - నీతి గాదు

తే|| తమ్ముఁడని కాక రాముని - దాసుఁడ నని, సేవసేయు మీఁతఁడు మము - చేరవచ్చు
నేని తోఁడనె రమ్ము కా - దేని మున్నె, ప్రాణములు వీడు మనుచు న - శ్రములురాల్చె

చ|| ఇరువురు మ్రొక్కినిల్వ జన - యిత్రియు దూడల వీడి గోవు వా
చఱచు విధమ్మునం గురరి - చందమునన్ విలపించె సామ్యముం
దొరయని యక్కుమారకులు - తోరపు దుస్తులఁ దీసివైచి యా
దరమున నార చీరలను - తాల్చిరి వచ్చిరి రాజ వీథికిన్. ౪౦౭

తే|| తాను ధరియించు నారలు - తమ్ముఁడు దువఁ, గాంచి కాకుత్స్థవర్యుండు - కమ్రఫణితి
శ్రద్ధ నీ యుత్తమోపదే - శంబు వినుము, లక్ష్మణా! యంచు నిట్లు ప - ల్కెంగఁదొడఁగె,

ఉ॥ తల్లులు తండ్రియుం గన య♦థాస్థితి కేరు మనంబు లెంతయుం
దల్లడిలంగఁ గుంది కృశ♦తన్ భజియించిరి నన్నుఁబాసి వా
రొల్లక ప్రాణముల్ మఱియు♦నుత్కట శోకమునొందుచుండ్రు నీ
వెల్ల విధాల నాకొఱకు ♦ నిచ్చట సేవ యొనర్చుచుండుమా. ౮౦౯

ఆ॥ అనఘుఁ డట్లు పలుక ♦ ననుజుండు భుజములు, వడఁక నులికి మరల ♦ వచ్చు నొక్క
యనుజు నడుమఁ గలఁగ ♦ నుమ్మలించుచు నను, దానుఁ జేమి మీకు ♦ దప్పొనర్చె.

చ॥ భువనము లుండఁ దామరస ♦ ముల్ కువలంబులు చేప లుండెడున్
భువనము లుండఁ జీవతతి ♦ పొందిక నుండును తీక్ష్ణభానుఁ డీ
దివి వెలుగన్ సమస్తమును ♦ దీపితమౌ నటు లేను సీతయున్
భువి నెవరుండ నుండుదుమొ ♦ పొల్పుగఁ దెల్పఁగదయ్య రాఘవా! ౮౧౦

ఉ॥ గాజులు చేధరించు నొక ♦ కాంతకు లోఁగి జగంబు వాడి యు
త్తేజము వాసి ప్రాణములు ♦ తేఁకువ దప్పి చలింపఁ గానకుం
జ్రాజరఁ ద్రోచియున్ బ్రదుకు ♦ సత్యధనుండగు చక్రవర్తికిన్
వాజ వహించు పుత్త్రుఁడని ♦ పల్కితివో యిటు జానకీపతీ! ౮౧౨

ఉ॥ దండక కీవు పోవుదని ♦ తాల్చిన కోపము నించుకైన లే
కుండ సహింపఁ జేసి తప్పు ♦ డొప్పక యిప్పుడు వెండి నన్ను నీ
వుండని యాజ్ఞసేయుచు ని ♦ టుల్ వచియించుట దానికంటెఁ బై
మెండగు కాఠిణ్యముం గలది ♦ మేలిమిఁ జూడుము జానకీపతీ! ౮౧౩

తే॥ శాత్రవ ప్రేమ పాత్రక ♦ శత్రు నేత్ర, రంజ నాంజన భంజన ♦ వ్యంజనాసి
దక్షిణకర! నీ పొందంగఁ ♦ నగిన భాగ్య, మెల్ల విడిచి మమ్ముఁ నీవిడి♦యేగఁదలఁతె?

తే॥ అనుజుఁ డీరీతి వచియింప ♦ నగ్రజుండు, బదులు వలుకంగ నేమియుఁ ♦ బాలు పోక
తమ్ము మొగము నీక్షించుచుఁ ♦ దమ్మిఁబోలు, చక్షువుల బాష్పకణములు-జాఱనిలిచె

క॥ అంతట నృప సభ నుండి కొ, ఱంత గనని తపము ప్రేమ ♦ రాజిలు మునియున్
జెంతకు రాఁగా మ్రొక్కిరి, వంత నతఁడు చూచి శోక ♦ వార్ధి మునింగెన్. ౮౧౬

ఉ॥ అంచిత సత్యముం గనిన ♦ యమ్మునివారల యాననంబులం
గాంచెను వారి డెందములఁ ♦ గాంచెను కట్టిన నార చీరలం
గాంచెను వారి యత్నమును ♦ గాంచెను చెప్పఁగనేమి లేమియుం
గాంచెను మించి నెంజిలియుఁ♦గ్రమ్మఁగఁ దా మఱచెన్ సమస్తమున్. ౮౧౭

మ॥ అభిషేకంబునకున్ సమగ్రముగఁ గా ♦ ర్యంబుల్ ప్రవర్తిల్ల నా
శుభ లగ్నంబుననే దురంత గతి న ♦ స్తోకార్త శోకంబులా

రభటికిఁ బోవఁగ రాఘవుండు వడి నా ♦ రల్ గట్టె నా బ్రహ్మనే
నభవున్నని నొగులుచు దుర్విధిని త్రో ♦ యంగ శక్యమే యేరికిన్? ౭౧౯

సీ॥ కారాని యీపని ♦ కైకేయి యొక్కతె, వలనఁ గలిగెనంచుఁ ♦ దలఁప రాదు
చూడంగ రాని యీ ♦ గోడు యోచింపంగ, రాముని కొదవన ♦ ర్థమును గాదు
దేనిచే నైనవో ♦ యీ నిర్ఘృణత్వ మిం, కెవ్వరి తలఁపో పై ♦ నెఱుఁగ నగును
అని మదిఁ దల పోసి ♦ యారాఘవుని గాంచి, వత్స! నీవిప్పుర ♦ వరము వదలి

తే॥ వనుల కేగిన సీతెంద్రి ♦ బ్రదుకఁడనిన, శేష శయనంబు పై నిద్ర ♦ చేయు టుడిగి
భూమి నవతార మందు శ్రీ-రామ చంద్రుఁ, డిట్టులను గురువునకు స ♦ హేతుకముగ.

తే॥ చక్రవర్తి యాజ్ఞను శిర ♦ సా వహించి, నడచు టెన్న నావిధి ధరా ♦ నాథుఁ జేరి
కుందు వాపి నెమ్మది నిమ ♦ కుల గురుండ, వైన నీ విధి యిదియె ధ ♦ ర్మంబు ననిన.

తే॥ అడవిఁ జేరఁగ సీతండ్రి ♦ యాజ్ఞ యిడఁడు, పగఱ బాణమువంటి య ♦ వ్వార్త పలుకు
కైక కా వరముల ముందు ♦ గాన కొసఁగె, నను వసిష్ఠుని పలుకుల ♦ నాలకించి. ౭౨౧

చ॥ తగవును నిల్పు కోస మవ ♦ తారము నొందిన రామచంద్రుఁ డిం
పుగ నను సన్మునీంద్ర! వర ♦ ముల్ ప్రియమందఁగ నిచ్చెఁ దండ్రి; నె
మ్మిగలుగు తల్లి కౌసల గ ♦ మింపఁగ నాజ్ఞ యొసంగె; నట్ల యేఁ
దగఁ జరియింపఁ బూనితిని ♦ దానిని మీరలె యడ్డగింతురే? ౭౨౨

తే॥ అనుడు నవ్వసిష్ఠుం డేమి ♦ యనఁగ లేక, కంట నస్రముల్ ధారగాఁ ♦ గాఱ నిలిచె
నమ్మహా భుజుఁడగు రాముఁ ♦ డతని కెఱఁగి, నగరి వాకిటి యొద్దకు ♦ నడచె నంత.

## పురజనుల దుఃఖము.

తే॥ తెసర వల్కలములు దాల్చి ♦ తమ్ము తోడఁ, దమ్మి కంటెను తేటయై ♦ నెమ్మొగంబు
కౌతుకం బొందు రాముని ♦ కడఁక నెఱిఁగి, పుర జనంబులు మిక్కిలి ♦ పొక్కినారు

తే॥ విప్రులును మునిపతులుఁ బృ ♦ థ్వీ వరులును, వనట యేనాఁడెఱుంగని ♦ పౌర జనము
దేశవాసులు గొనుచింతఁ ♦ దెలుపఁ దరమె?, కలఁగి కోరరు సురలు రాఁ ♦ గల శుభంబు

తే॥ దేవకన్యలఁబోలిన ♦ తీవఁబోండ్లు, రాముఁ జూచిన యంతనే ♦ తామర పయి
ద్రాలు తేఁటుల లేఁగొమ్మఁ ♦ బట్టి తోలు, పోల్కిఁ జేతులతోఁగనుల్ ♦ మూసికొనిరి.

చ॥ కొఱవడ కెచ్చు ప్రేమమునఁ ♦ గొందఱు దేహము బెండగిల్ల ను
ర్వరఁ బడి నాకమున్ గొనిరి - రాముని తండిరి కంటె మున్నుగాఁ
దఱుచగు ద్వంద్వ కర్మములఁ ♦ దక్కక మూలము ద్రుంచు చేతనో
యుఱవగు ప్రాణముల్ మరల ♦ కుండుట చేతనొ కానమేమిటన్. ౭౨౩

ఉ॥ కొందఱు నేలపైఁ బడిరి ♦ కొందఱు క్రుంగిరి పొక్కి సోలుచుం
గొందఱు లోననే కుమిలి ♦ కుందిరి దయ్యము సోఁకు చందముం
గొందఱు పొందినారు మఱి ♦ కొందఱు మున్గిరి బాష్పవాహినిం
గొందఱు విహ్వలించి రెల ♦ కుంజము మంటను గూలు కైవడిన్. ౪౨౮

తే॥ కురుల నిప్పంటుకొని నట్లు ♦ పరుగు వాఱి, తల్లడిల్లిరి కొందఱు ♦ ముల్లె కొల్ల
వోవు బీద విధమ్మునఁ♦బొగిలి నారు, తోఁచకేమియు ధరఁబడి♦దొరలి నారు. ౪౨౯

సీ॥ కొందఱు కన్నీరు ♦ కురియక యినుప గుం, డియ నాఁగ బ్రమ్మప్డి ♦ నిలిచినారు
కాయముల్ తడఁబడ ♦ కంపించె జీవముల్, చలియించె నిక్కంపు - నెలవుదప్పి
మతులు గలంగెను - మనసులు దిగఁబాఱె, వ్రణముల నెత్తురు ♦ వచ్చునట్లు
కనుల నీర్వెట్ట ర - క్తంబు స్రవించెను, గద్గొలు పడియెడ ♦ కటకటంక మెల్ల

తే॥ రెండు తుండెములుగను వేదండ లీలఁ, బొలుచు వాఁడలు తెంపునఁ ♦ దలలు డొల్ల
నఱకి కొనినారు కొందఱు ♦ ఛురికలఁగొని, పొక్కఁగనలేక కన్నులఁ ♦ బొడిచికొనిరి.

తే॥ చెదరెఁ దొడవులు మొఁబ నూళ్లు♦చిందె రత్న,నమితిరాలెను తెగియెఁబూ♦సరములెల్ల
జెలుల నవ్వుల కాంతులు ♦ చెడియె వాఁడి, సుందరాననములు చెంగెఁ ♦ జందురునకు.

తే॥ నిష్కలంక పతివ్రతల్ ♦నృపతిసతులు, రాణు లడునది లేవురు ♦ రాము కడకు
వచ్చి పొంగు నుమ్మలిక మా ♦ పంగ లేక, వాడిడిచి గోల వెట్టిరి ♦ వార్ధి వోలె.

ఉ॥ రాముఁడు తక్కనేటొక తి ♦ రంబగు ప్రాణముఁబోలు పుత్త్రికున్
నోమని రామలా యడరు ♦ నొవ్వి సహింపక కేకి హంసికా
స్తోమము జెక్కలూడ నిల ♦ సోలుచు వ్రాలు విధంబునన్ మన
స్థైమము దక్కినేలఁబడి ♦ చిక్కిరి స్రుక్కిరి పొక్కి రొక్కటన్. ౪౩౩

సీ॥ ఆ రాజ కాంతల ♦ యమృతంబు కంటె నిం, పైన వాక్కులు మితి ♦ లేని చింతఁ
గడలేని యూర్పులఁ ♦ గ్రాఁగి గద్గదికతఁ, దెరలి వావిడిచి రో ♦ దించు కతన
సుషిర వాద్యములకు ♦ సొంపైన పిల్లనఁ, గ్రోవి మున్నగు వాని ♦ రావములకుఁ
దంత్రీయుతంబులై ♦ తనరిన శారంగ, వీణాది నిస్వన ♦ వితతి కొగ్గ

తే॥ వనులఁ జేరుద మని తన ♦ యునకు వగచు, చెలుల ముఖములచేఁ బ్రహా♦రులు గలట్టి
నగరుఁగొప్పెను చెందొవల్ ♦పగటి పూట,చెలఁగి వెలుఁగొందు నొక వన♦క్షేత్రమనఁగ

చ॥ కనులు కలంగి వెల్వడిన ♦ కాల్వలు కుంకుమ పంకమందు నం
దును మొగి వండ గాఁగ నిడి ♦ తోరపు హారములం బెనంగు చు
ట్టిన స్తనశైల శీర్షమున ♦ బిందు సరస్థితి జాఱి మేఖలా
గుణ కటి తీర వారిధిని ♦ గూఢ గతిం జని చొచ్చెఁ జెచ్చెరన్. ౪౩౪

తే॥ దరశఖేశ సతీముఖ ♦ తామరసము, లను దినేశులంతు గాంచె నా ♦ దినము నందు
నమర పత్రికైనఁ జెడువేళ ♦ యమరెనేని, యెట్టి దుర్దశ రాకుండు ♦ నెంచి చూడ?

తే॥ తల్లులును ప్రేమబంధులు ♦ తదితరులును,చుట్ట ప్రక్కంబులును నిప్పు ♦ సోకఁ బరి త
పించు కరణిఁ దపించుచు ♦ నెలుకఁ బాఱి, ముంగిళుల సందు లేకుండ♦మూఁగినారు.

తే॥ గోల పెట్టుచు వారాశి ♦ కూడవచ్చు, పగిది నడవ రాముఁడు వారిఁ♦బనుచు తెరువు
నెఱుఁగ కూఱడించెడి త్రోవ♦ యరయలేక, వడిగఁ దన మేడ వంకకు ♦ నడవసాగె.

తే॥ ఉన్నతంపుఁ గిరీటంబు ♦ నొగి ధరింప, రత్న మయమైన కాంచన ♦ రథము నందు
వెడలి నట్టి శ్రీరాముఁ డా ♦ వీథి నిపుడు, నారలం జుట్టి కాల్నడ ♦ నడవ సాగె. ౪౪౯

ఉ॥ నల్లని మేను గల్గు రఘు ♦ నాథున కిట్టి కడింది పాటు పా
టిల్లఁగఁ గాంచియుఁ బురిఁగి ♦ డిఁకని ప్రాణము గుండెకంటె మేల్
చెల్లరె! గట్టి దయ్యె నిఁకఁ ♦ జెప్పఁగ నేటికిఁ దొల్లి బాముఁనఁ
నల్లవో! చేయు నోము లని ♦ నంజునకంటెను బెట్టిదంబులో. ౪౫౦

ఉ॥ పట్టము మోమునఁ వెలయ ♦ వచ్చున యంచుఁ బ్రతీక్ష సేయు ని
ప్పట్టున నెండ లోక్క మిడి ♦ వాడఁగఁ జేయు వనంబు చేరు రా
పట్టిని చూచుటో? యొక య ♦ పాత్ర వినాశము సేయు దేశ మం
దిట్టులు కన్ను లొంది జని ♦ యించుట సైఁపము సైఁప మక్కటా!. ౪౫౧

ఉ॥ అందఱిలోనఁ బెద్దయయి ♦ యర్థ బలంబు గుణంబు గల్గు నీ
సుందర దేహుఁ డొప్పికొని ♦ చొచ్చుటయా బహు దుష్ట సత్త్వముల్
క్రందుగ నున్న కానలను? ♦ కానల కేగుటఁగాంచి మేనితో
నిందుల నిల్చుటో? నిలిచి ♦ యేడ్చుటయో? యిది మంచిప్రేమమే!. ౪౫౨

చ॥ బలము చెడంగ బుద్ధియును ♦ భ్రష్టత నొందిన రాజుకై మన
శ్చలనము నొంది ధర్మమును ♦ జాఱఁగ నిచ్చుట నిల్తుమేని రా
కొలము నశింపఁ జేయు పెను ♦ గొడ్డటి వాని నడంచు రాముఁ గా
నలకుఁ దొలంచి నట్టి కుల ♦ నాశిని కైకను పోలు వారమే. ౪౫౩

చ॥ మురువగు మేన వల్కలము ♦ పొందుగఁ దాల్చిన వాఁడు రాముకై
హరువుగఁ బంచ వాయువుల - నర్పణ సేయు ప్రతిజ్ఞ వాఁడు జో
డొరయని శోక దారుణత ♦ యుల్లమునం గలవాఁడు తమ్ముఁ డో
క్కరుఁడె యొకో రఘు ప్రవరు ♦ గాదిలి చుట్టము పట్టణంబునన్. ౪౫౪

సీ॥ పెను బండకంటెఁ గ ♦ ఠిన మైన మనసును, గదలతోఁ బగుల మో ♦ దుదమయుంచుఁ
బరుగులు వాఱి త్రో ♦ వనుబాష్ప పంకంబు, లం జాఱి పడుచుఁ గ ♦ లంగు వారు

ఉ॥ నీఁగెను వంటయిండ్లు పొగ ♦ నీఁగెను మేడలు ధూప ధూమముల్
నీఁగెను దేహళుల్ కళలు ♦ నీఁగెను ఖాణములన్ హారుల్ కరుల్
నీఁగెను కీరపోతములు ♦ నీటగు బంగరు పాలగిన్నెలన్
నీఁగెను మోదమున్ జనము ♦ నీఁగిరి తల్లులు తొట్ల కూనలన్. ౪౫౪

ఉ॥ వీడెను కాంతి ప్రాణముల ♦ వీడిన వానిని పోలి యాస్యముల్
వీడెను వర్ణముం గుఱియు ♦ వేడ్కన్ నీల పయోధ సంఘముల్
వీడెను వారువంబు లట ♦ విస్తృతమై తగు నశ్వశాలలన్
వీడెను దంతి రాజి తన ♦ విన్ మధువుం గొను తేంట్ల కై వడిన్. ౪౫౫

క॥ విడిచెను నీడల గొడుగులు, విడిచెను క్రొవ్వెదలు క్రొత్త - విరుల సరములన్
విడిచె మరుశరము వేడిమి, విడిచెను కటకముల మేటి - వీరుల పసముల్ ౪౫౬

క॥ వదలెను ధ్వనులను భేరులు, వదలెను కింకిణుల రొదలు - వార్వముల గముల్
వదలెను గీఁకల గజములు, వదలెను నేమీస్వనంబు - బంగరు రథముల్. ౪౫౭

చ॥ కలుగవు మంగళ ధ్వనులు - కల్గవు విప్రుల వేదనాదముల్
కలుగవు వీణారావములు - కల్గవు కాళుల నందుకధ్వనుల్
కలుగవు మేఖలాధ్వనులు - కల్గవు కోకిల శారికాధ్వనుల్
కలుగవు తేంట్ల శబ్దములు - గల్గవు పిట్టల శ్రావ్యగీతముల్. ౪౫౮

క॥ మఱచెను నీటిం బాలములు, మఱచెను లేబొట్టియలను ♦ మగువల కరముల్
మఱచెను నేతిని వహ్నులు, మఱచెను తత్త్వంబు జ్ఞాన - మాన్యుల మనముల్.

ఉ॥ కుందిరి గుంపు గుంపులుగఁ ♦ గూడుచు నాడుచు నుండు వారలున్
వందిరి శ్రావ్యగీతములఁ - బాడుచు నుండిన వార లట్టులే
పొందిరి కొందలంపు రొద - పొల్తుక లక్కలఁ గొన్న వారలున్
క్రుందిరి ప్రాణనాథులను - మానుగఁ బొందిన సుందరాంగులున్. ౪౬౦

ఉ॥ చాఁపవు తొండము ల్కరులు - చాఁపవు నోళ్లు మేఁతకున్ హారుల్
చూపవు పోతసంతతికి - నూటిగఁ బక్షులు తెచ్చు మేపులన్
దాపవు పాలు దూడలకు - దాయఁగ నీయవు ధేనుకా తతుల్
మేపవు గోవులం బిమక - మే కొనవున్ వగ గోష్ఠ వారముల్. ౪౬౧

క॥ మగల వెడందయురమ్ములు, మగువల కుచమర్దనంబు - మఱచెను తోడ్తో
మగల సొగసైన సిగలును, మగువల నిడుపైన జడలు - మఱచెను విరులన్. ౪౬౨

క॥ అందము నొల్లవు గజములు, పందెము నొల్లవును పరువు ♦ వలచిన మావుల్
గంధము నొల్లవు వీథులు, చందము నొల్లవు సువర్ణ ♦ సౌధ పతాకల్, ౪౬౩

చ॥ సమముగ సౌఖ్య దుఃఖముల ♦ సన్మతిఁ జూచెడు యోగులే మదిం
గుమిలిరి; తగ్గ చోటరసి ♦ కూడిన మష్కృత భాగ్యమంచుఁ దో
యుషుగఁ దలంచువారు నన ♦ సంచిత కర్మఫలంబు యంచు డెం
దములఁ దలంచువారు నగు ♦ లెక్కటి వారల చింత యెట్టిదో! ౪౬౪

ఉ॥ ఊహములెల్ల వేఁడియగు ♦ నూర్పులతో నుసుఱుల్ చలించి సం
దేహమునొంద నందమును ♦ దీప్తి చెడన్ మది గ్రుక్క నష్ట సం
దోహము తాఱుమాఱగుచు ♦ దుఃఖము నొందఁగ మేనులెల్ల రా
ద్దేహము వోలెఁ బ్రాణములు ♦ తీఱుగతిన్ బురిఁ దోఁచె నెల్లెడన్. ౪౬౫

రాముఁడు సీతయున్న మందిరమున కరుగుట.

ఉ॥ పౌరులు విహ్వలించుచొక ♦ ప్రక్కకె డెందము లెల్ల వ్రాలఁగాఁ
గాఱియనొంది కుంది వెను ♦ కంబడి రా గణియింపరాని యా
కారములొప్పు దేహులకు ♦ గాదిలి ప్రాణమొకండ నాఁగ నొ
ప్పారిన రాఘవుం డరిగె ♦ నయ్యెడ జానకి యున్న చోటికిన్. ౪౬౬

ఉ॥ తల్లులు ధారణీసురులు - తాపస వర్యులు సంగకంబులన్
బెల్లుగ ధూళినిండ దుర ♦ పిల్లుచు వచ్చుచునుండ రాజసం
బొల్లని నారఁ గట్టికొని ♦ యొప్పని తీరున వచ్చు నాథుఁ దా
నుల్లము వాడఁ గాంచి యొక ♦ యూఁకున లేచెను సీత కొంకుచున్. ౪౬౭

ఉ॥ ఆగతి లేచు ధారణిజ ♦ నత్తలు కాటుక కంటి నీటితోఁ
గాఁగిలిఁ జేర్చి తడ్పుచును ♦ గద్గదికంబున నొక్కపెట్టఁ దా
మాఁగక యేడ్వఁ గాంచి జన ♦ కాత్మజ వారలు దుఃఖముం గొనం
గాఁ గతమేదియో మదిని ♦ కానఁగఁ జాలక కాంచె రాఘవున్. ౪౬౮

తే॥ కాంచి మించుసంచునఁ జలి ♦ యించు మేను,గలుగు వైదేహి యిట్లనుఁ♦గాంతుతోడ
చక్రవర్తి కేదేనియు ♦ సంభవించె, నేమి పల్కుఁడు జాగు న ♦ హింప ననుడు. ౪౬౯

చ॥ అనదృశుఁడైన నాయనుజుఁ ♦ డక్కటికంబున ధర్మపద్ధతిన్
వసుమతినేలు వృద్ధజన ♦ వాంఛిత సిద్ధి జగంబు నెమ్మదిం
బసఁగొనఁ గారణంబయిన ♦ వారిదము ల్వసియించు కానకున్
వెనఁ జని పత్తు నీవు మది ♦ వేసట నొందక యుండు మిందనన్. ౪౭౦

ఉ॥ కాంతుఁడు క్రూరసత్త్వయుత ♦ కానన భూమికి నేగునంచు భూ
కాంతుఁ గాక ఘోరమైనని ♦ కష్టము నెంధక యింటనుండుమన్నా

వంతను వీడు వేగ చని ♦ వత్తు పటన్న సుతీక్ష్ణ వాక్కు లా
కాంతి మనంబు మిక్కిలిగఁ ♦ గాల్పఁదొడంగ వహించె వేదనన్. ౪౭౧

మ త్త॥ క్షీర సాగరమందు పేలగు ♦ శేష తల్పముపై రహిన్
చేరికల్ విడి ధర్మ ముద్ధృతి - సేయ భూస్థలిఁ బుట్టఁగా
వారిజాక్షియుఁ బుట్టి వీడక - వచ్చు తన్ను దొలంచు నా
దారుణార్థము వీనులఁ స్విసఁ - దన్వి కూఱట కూరునే? ౪౭౨

క॥ జననీ జనకుల యాజ్ఞం, దనయుఁడు తలఁదాల్చునేత ♦ తగవే యగు న
న్వనరఁగ నిచటనె యుండుమ, యనఁ గారణమేమి యనుచు ♦ నారట పడియెన్.

ఉ॥ రాముఁడు రామఁగాంచి యను ♦ రాక్షసరూపముఁబోలు కొండలున్
భీమములౌ విభావరుల ♦ వేఁడిమి తగ్గక యుండు ప్రస్తర
స్తోమము ముమ్మొనల్ గలిగి ♦ త్రోవల నిండుగనుండి కాళులన్
వేమఱు బాధపెట్టు నలి ♦ వేణి! మరల్పుము నీయభీష్టమున్.

చ॥ అని తను గూర్చి పల్కు తన ♦ యర్మిలి భర్తకు సీత యిట్లనున్
గనికర మింతలేక ♦ మది గాటపుఁ బ్రేమయు లేక వీడి పో
వనె తలపోసి నాఁడ విది ♦ పద్ధతియే? లయకాల భానుఁడున్
ఘనమగు నీవియోగమున ♦ కంటెను కాల్చునె? ప్రాణ వల్లభా! ౪౭౫

చ॥ నలువుగ రాముఁ డామె వచ ♦ నంబులు వింటయెకాక తన్మతిన్
దలకొను చింతయుం దెలిసి ♦ తక్కక బాష్ప పయోధి పొంగ నా
జలజ సుగంధిఁ బాయుటకు ♦ సమ్మతి లేని నదంత రంగుఁడై
నినిచెను కర్జమిద్ది యన ♦ నేరక నెవ్వగ నివ్వటిల్లఁగన్. ౪౭౬

ఉ॥ అత్తఱి సీత విస్తృత గృ ♦ హాంతర సీమకు నేగి డెంద మం
దత్తలపాటుతోడ మృదు ♦ లాంబరము ల్విడనాడి సాహసం
బొత్తఁగ నార చీర నను ♦ వొందఁగఁ దాలిచి వచ్చి రాము న
ద్వృత్త భుజంబు పట్టికొని ♦ యిమ్ముగ నిల్చెఁ బ్రయాణపాటుకై. ౪౭౭

మ॥ అబలా రత్నము గోల కోమలి యనూ ♦ ర్యం పశ్య గావించు చె
ద్ది బహుక్లేశముఁ గూర్పఁ జాలదగు పృ♦థ్విన్ బ్రాలియున్ గాలుఁడున్
గబళింపం డవు జీవితంపు దినముల్ ♦ గల్గన్ శిరోగ్రంబునన్
బ్రబలంబౌ నొక గుండు వైచినను చా ♦ వం బోవ దే ప్రాణియున్. ౪౭౮

తే॥ చెలులు దాదులు దాస దా♦సీ జనంబు, మంటలోఁ బడి తపియించు♦మాడ్కి నైరి
రామచంద్రుఁ డుత్తమ సతి♦రాజ వదన, యైన జానకిఁ గని యిట్టు♦లనియె మరల,

మ॥ సుదతీ! రాఁగల కష్టము ల్దలఁప వో ♦ సుంతైన నాతోడ రా
ముఁడ మొప్పారఁగ నుంటి హెచ్చుగ శ్రమం ♦ బుల్గూరు వచ్చెనన్
ముదమే కల్గును నన్ను వీడి చనఁగా ♦ ముఖ్యంబుగా నేన మీ
ముదముం బాపఁగ నుంటి నోటు! నిజమే ♦ హో! యంచుఁ గోపింపఁగన్.

తే॥ మనసు కలఁగి ప్రతిస్థల♦మునను జనులు, పడుచు లేచుచు దుర్దశఁ♦బడయుచుండు
రాచ వీథిని మెల్లఁగా ♦ రాము డేఁగుడు, జానకిం దోడు కొనుచుఁ గ♦ష్టమున నేగె.

తే॥ ముదిత వల్కలములు దాల్చి♦ముందు వోవ, విల్లుచేఁ బూని యనుజుండు♦వెనుకనడవ
నడుమ రాముఁడేగుట గాంచు ♦నాగరకుల, యకలు వర్ణింప నాభోటి♦కలవియగునె?.

తే॥ అశుభముగ వెన్క నెవ్వరు ♦ నడల లేమ, కలరు మదితోడఁ జుట్టి సీ ♦ తా హృదీశు
కంటె మున్నుగఁ బోదము ♦ కాన కనుచు, నడచి రెల్లరు వెనుగోల♦యడరు నట్లు.

క॥ ఇనకుల జలనిధి సోముఁడు, జనకు నగరు దాసి యంత ♦ జనులఁ గని యిం
దున యుండి తండ్రిఁ జేర్పుం, డన నారలు తల్లడిలిరి ♦ హాహా యనుచున్. ౪౮౪

క॥ నుడియుచు నాలుక తడఁబడ, వడఁకుచు నిలువెల్పులార! ప్రార్థింతుము కా
వుఁడు వీరల నని తనయులఁ, బుడుకుచు దీవించి సీతఁ ♦ బొగడిరి మిగులన్. ౪౮౫

తే॥ జనులను వీడి కులగురు♦చరణములకు, మ్రొక్కి రాముఁడు తన ప్రాణ♦ములను పోలు
తమ్ముతోడను సీతతోఁ ♦ దత్తకనక, రథముపై నెక్కి వెడలెఁ బు ♦ రంబె కలఁగ.

౫. తైలగుప్తి పటలము. (౮౭)

చ॥ నిలిచిరి ప్రాణులెల్ల ధర ♦ నెవరు నెప్పుడు వీడియుండమిన్
నిలిచెను భిత్తి చిత్రములు ♦ నెక్కొను ప్రాణము లేకపోవుటన్
దలఁపఁగ నెవ్వరింక నయ ♦ ధాముని రాముని వెంటఁ బోక య
న్నిలవున నిల్చినారలు గ ♦ ణించినచోఁ గలికాని కేనియున్? ౪౮౬

తే॥ కాంచన స్యందనంబు మా ♦ ర్గమున యందు, వేఁడికన్నీటి కాల్వలు♦వెల్లి విరియ
మెల్లఁగా నేగుచుండ నా♦మేటి వీరుఁ, డబ్ధి విహరించు నాది మ ♦ త్స్యంబుఁ బోలె.

క॥ వనముల కరిగెడి రాముని, గనఁ జాల నటంచు నినుఁడు ♦ కనికరమునఁ దా
వనరాశి దూఁకెనో యనఁ, జని క్రుంకెం బసియు మరలి ♦ చన మందలకున్. ౪౮౭

క॥ నెలవంకఁ గొని యజుండే, కలిగించిన జిగి నొసల్లు ♦ గల కలుకుల మో
ముల వలె సరసిజములు మో, ములు మోడిచె నశ్రు లురలి ♦ మురువుచెడంగన్.

క॥ మునిమాపున వేఁడిమి చెడ, ఘనమతి కైకేయి మదిని ♦ కటు మంథర బో
ధనమును విన మలమిన రీ, తిని తేటదనంబు వీడి ♦ తిమిరము క్రమ్మెన్. ౪౮౮

సీ॥ ఉడుపతిదీప్తి వెలుఁగ గగనము, కడఁకన్ గౌతముని శాప ♦ కారణమున గం
డ్లడరు వెయిగనుల వేలుపు, టోడయని దేహంబు నోలె•నొప్పెసలారెన్. ౪౯౨

కం॥ నగరి విడిచి రెండామడ, లేగిఁ జని కాకుత్థ్సవర్యుఁ ♦ డొక్కవనమునన్
దిగి యచటి ప్రియస్నేహితు, లగు తాపసవరులఁ గలిసి ♦ యలరి వసింపన్. ౪౯౩

చ॥ వినుత గుణాఢ్యు రామవిభు ♦ వీడఁగఁ జాలక వెంటనేగు నా
జన నికురుంబ మప్పుడము ♦ చక్కటి నామడ చుట్టి నూవు గిం
జను విడువం గలట్టి యెడ ♦ సైతము పొందని రీతి నిండ ప
వ్వాసి మొక కంచె కోటగల ♦ వైఖరిఁ గానఁగనయ్యె నయ్యెడన్. ౪౯౪

కం॥ ఎదియును నోటం బెట్టక, నిదురింపక పరితపించు ♦ నెంజిలిఁ దమసా
నది పులిన శాద్వలంబుల, నొదిఁగి పడిరి జనములెల్ల ♦ నోర్వని చింతన్. ౪౯౫

కం॥ క్రొవ్విరి తామరలఁ బను, నువ్వపు నయనములు గలుగు ♦ మడఁతులు పాలన్
నివ్వటిలు నురుగుఁ బోలిన, దువ్వలువలఁ బఱచికొని రొ ♦ దుంగఁగ నచటన్. ౪౯౬

తే॥ నిడుపు పగలెల్ల నిక్కిలి ♦ యడలి యడలి, పరితపించి మొగ్గచనులు ♦ కఱకుటలుఁగు
కనులు తీయని పలుకులు ♦ గలపడుచులు, పెంచుతల్లుల యొడుల ని ♦ ద్రించినారు.

ఉ॥ కాటుక మాపివిండెలకుఁ ♦ గల్గిన యట్లు రహించు కన్నులన్
మాటి మొగిడ్చి నిద్రిలిరి ♦ మానిను లందు కరేణులం బలెన్
మేటి కరాసిపీరులును ♦ మేదుర గంధగజంబులం బలెన్
బోటులకున్ సమీపమునఁ ♦ బొందిరి కూరుకులం గ్రమంబునన్. ౪౯౮

చ॥ అతిశయ ధర్మముం దపము ♦ నందుట నున్నతి నొంది వల్లభ
ప్రతతి కృపానురాగ రస ♦ భారలు కొందఱు లే మయూర సం
తతులు ముడింగి వ్రాలు క్రియ ♦ ధారుణిపైఁ బడి తీవ్రతాప సం
గతలయి వ్రాలినారు కను ♦ గందులు స్తన్యముఁ ద్రావుచుండఁగన్. ౪౯౯

ఉ॥ కొందఱు మాధవీ కుసుమ ♦ కుంజములన్ హరినీలవేదులం
జెంది మయూరవారముల ♦ చెన్నునఁ బండిరి సోలి వ్రాలుచున్
గొందఱు బంధుర క్రముక ♦ కూటములన్ హ్రద తీర సైకతం
బందు పరుండి కూర్కిరెల ♦ యంచల పిండుల మించు సంచునన్. ౫౦౦

కం॥ వనమతి చంపక వనములఁ, గుసుమ లతలు వాడు క్రియను ♦ కొందఱు గుములై
యిసుక పఱపుపైఁ గొందఱు, మసచెడి నిద్రిలిరి విద్రు ♦ మ లతల పగిదిన్. ౫౦౧

ఉ॥ కొందఱు కుంకుమంబు నెఱి ♦ గూడిన కొండను మంచు వ్రాలు పొ
ల్పొందఁగ బొమ్మలందు దవ ♦ యొప్పుఁ బరుండిరి నేల సోలుచున్

గొందలు దిండుగాఁగఁ దమ ♦ కోమల హస్తములం గదించి కూ
ర్కందిరి మోము లంగు చెడి♦ యంబుజము ల్ముకుళించు చాడ్పుగాన్. ౫౦౨
ఉ॥ కొందఱు బండలందు మఱి ♦ కొందఱు రాలిన యాకుకుప్పలన్
గొందఱు కొంగులం బఱచి ♦ కొందఱు పల్లవము ల్ఘటించుచున్
గొందఱు వట్టి నేలపయిఁ ♦ గొందఱు భర్తల పాదసన్నిధిన్
గొందల మంది డెందములు ♦ క్రుంగఁగ వ్రాలిరి సోలి నిద్రకున్. ౫౦౩
తే॥ ఇట్లు మైవ్రాల్చి నిదురింప ♦ నెల్లవారు, మైథిలీ భర్త యపుడు సు♦మంత్రుఁ బిలిచి
పావన గుణ వికాసి! నీ ♦ వలన మాకుఁ, గావలయు పని యొక్కటి ♦ కలదు వినుము.
మ॥ అధిక ప్రేమము గల్గు నీ జనులఁ బో ♦ నంపంగ లేనైతి ని
న్విధి వీరిం గొని పోవఁ జాలనయితిన్ ♦ వే త్రిప్పి కొంపోవు నీ
రథ మార్గంబును గాంచి వీరు పురమున్ ♦ రాముండు చేరెన్ మనో
రథముల్ దీరెనటంచుఁ గ్రమ్మఱఁ దు వా ♦ రల్ దీనిఁ గావింపుమా. ౫౦౪
మ॥ రథిక శ్రేష్ఠుఁడు రాముఁడిట్లు పలుకం ♦ బ్రార్థించుచున్ మేటి సా
రథి వాక్రుచ్చును నిన్ను వీడియును నా ♦ ప్రాణంబులన్ వీడ కీ
రథముం గొంచుఁ బురంబు చేరి కన నే ♦ రన్ గోడు, కాంచంగ దు
ష్పథముం బొందిన కైకకున్ విధికి నేఁ ♦ బై చేయియే యౌదుగా! ౫౦౬
ఉ॥ తమ్ముఁడు దేవియుం గడు ము ♦ దమ్మునఁ దోఁ జరు దేర రాము నం
దమ్ములు చిందు నాఁడన వ ♦ నమ్మున వీడితి నంచుఁ జెప్పనా?
యిమ్ముగఁ దోడి తెచ్చితి న ♦ హింపుఁడి చూడుఁడి యంచుఁ జెప్పనా?
యెమ్మెయి జాలిగుండె గొని ♦ యేమని చెప్పుదు వారి కచ్చటన్? ౫౦౭
తే॥ ప్రాంత మిత్రుఁడ నొక మచ్చ ♦ పడని వాఁడ, మృదుల పుష్ప ప్రకీర్ణ మా♦మేదినిపయిఁ
జెలఁగి నడవంగఁ దగిన యా ♦ సీత తోడఁ, దనయులం గాన నేఁగితి ♦ ననఁగఁగలనె?
తే॥ ప్రబలములగు నింద్రియములు ♦ రాతి గుండె, గలుగు నేను శరీరంబు ♦ కార్శ్య మొంద
మది కలఁగి పరిదేవించు ♦ మనుజ నాథు, కడకు యమ దూతవలెఁ బోవఁ♦గలనె చెప్పుమ
తే॥ నగరవాసులు నీపుత్రు ♦ నయముతోడఁ, బిలిచికొని వత్తురని శాంతి ♦ గొలుపుచుండ
నతని నిప్పుడు కట్టిడి♦యముని పోలి, కఠినవాక్కున గోలచేయఁ♦గలనె చెప్పుమ? ౫౧౦
తే॥ అరుదుగాఁ గన్న పుత్త్రి సిం ♦ హంబు లడవి, కేగెనని తెల్పఁ బోదునే? యా సునీతి
పలుకఁ బోలునే? యట్లైనఁ బార్థివునకుఁ, గైకయే మేలుచేయు నా ♦ కంటె నరయ
తే॥ వజ్రపాతంబునకు నుల్కి ♦ పడి విధమున, వెలవెలంబాఱి రామ భూ♦విభుని చరణ
సరసిజంబుల వ్రాలి యా ♦ సచివుఁ డిట్లు, పెక్కు విధములఁ బ్రార్థించె ♦ వీడ లేక.

క॥ జ్ఞానేంద్రియముల కందక, జ్ఞానమునకు నెఱుఁగనైన ♦ శాశ్వతుఁడు రమా
జాని సుమంత్రుని కరముల, తో నెత్తుచుఁ దడవి పేరు ♦ తుడుచుచు ననియెన్. ౫౧౩

క॥ పుట్టిన పిమ్మట రాఁదగు, పట్టి సంపూర్ణముగనె ♦ యొనసిన నివుఁ
గట్టిగ శ్రమ గల దనుచున్, బుట్టు ధర్మంబు నుడి ను ♦ బుద రామునిచే? ౫౧౪

తే॥ జగతి నుత్తమ ధర్మంబు ♦ జప నుతముగఁ, జలిపి మరణించినను నిల్చి ♦ స్వర్గమొసఁగు
నింపు గలదే చేయు చ♦నిష్ట మొనన, పీను వాఁడెట్టి ఘోరుఁడో ♦ చూడు మీవ.

తే॥ వాఁడికై మప్రభా ముక్తుఁ ♦ గాఁడ నోర్వఁ, గలుగు టెన్నంగ వీర ♦ లక్షణము గాదు
మరణ మప్పినంపన ♦ బ్రాక్రి పోవఁ, దగవు దప్ప కుండుము మగ ♦ తనము నువ్వొ ౫౧౬

తే॥ శత్రు జీవాపహారణ న ♦ ష్ట ప్రభావ, ఖడ్గహస్త! వరుల కేఁగ ♦ గష్టమునుచు
మరలితిన యేంది యుంటు ♦ చికయకంబు, గాంచ మా నాకెవది కలం ♦ కంబు గాదె?

తే॥ సత్కులా వర్మ పురుషుఁడు ♦ సత్యమునకుఁ, దన యు వరుల కంపు టతని ♦ తపము యుగము
అతని యాజ్ఞను తలఁదాల్చి ♦ యడవి కరుగు, టరయ నా మేటి తపము; నీ ♦ వడలు టేల?

తే॥ మొదటఁ గులగురువకు నామ ♦ మ్రొక్కు గాఁగ, వినయపూర్వకముగ ♦ మ్రొక్కి ♦ పిదప నతని
తోడ మాతండ్రిఁ గాంచి పు ♦ త్రుండు జోత, సలిపె నని చెప్పి యవల నా ♦ తలఁపు దెలుపు.

చ॥ కులగురు నాజ్ఞ నొదలను ♦ గూరిచి ధర్మ పథాను వర్తివై
సలుపుచు నుండుమా శుభమె ♦ సజ్జన పాళికి దేవతాళికిన్
వలవని నా వియోగమున ♦ వందురు తల్లులఁ దండ్రిఁ దేర్చి
తలఁగని సత్ప్రవృత్తి నని ♦ తమ్ముఁ డకుం దగ విన్నవింపుమా ౫౨౦

ఉ॥ క్రూరుఁడు తండ్రి యిట్లు చెడు ♦ గుల్ ఘటియించెన యంచు నీవు దు
ర్వారుణ రీతి నెంచకుము ♦ దంబున నామెకఁ జూపు నుల్లస
త్కారుణికత్వము వగు వి ♦ ధంబున మార్దవ భక్తి నాతఁడో
దారుపు చెందు నట్టులు ని ♦ దానముగా వినిపింప వేఁడెదన్. ౫౨౧

తే॥ గురు మహాదేవ్రకో నంతి ♦ పురికి నేగి, మొదటఁ దండ్రి దుఃఖము దీర్చి ♦ పిదప నతని
భరతుపై మీరు సాక కృ ♦ పన్ ఘటింప, వలయు నరము వేఁడితి నని ♦ పలుకు మయ్యా!

తే॥ అహర్పులం బడు రాలుగు ♦ హోముఁడములు, కడపి వచ్చి మీ చరణ పం ♦ కజముల కడఁ
జేరు నడల కుఁడుము న ♦ సిద్ధ కూఁడ, వలఁ దెప్పించి సాంత్వన ♦ పలుకు పుమతని. ౫౨౩

చ॥ ననుగని పెంచు తల్లులకు ♦ నానెటి దప్పని వందనంబులన్
వినతి మొయిం గడించి ♦ యను ♦ వెండియుఁ దండ్రి యలంత దీర్చి యా
తని మది నా వియోగమునఁ ♦ దాఱక యుండఁగ నూఱడించుచున్
బనవక పీడకుండుఁడని ♦ ప్రార్థన చేసితి నంచుఁ దెల్పుమా. ౫౨౪

ఉ॥ సేవకు కింకరత్వ మది ♦ చెందను మూర్ఖ సతం బటంచు సం
భావన జేసి యంతట సు ♦ మంత్రుఁడు రాముని భద్రపాద రా
జీవములం భజించి భువి ♦ జీవికిఁ దప్పని సౌఖ్య దుఃఖముల్
దైవ వశంబులంచు వని ♦ తా మణి సీతకు మ్రొక్కి నిల్చెడున్. ౫౨౫

ఆ॥ వందనముల్ వచించె నను ♦ వత్సలతం గను మామగారికిన్
జిందెడు ప్రేమతోడ ♦ నను చేరఁగఁ దీసెడు ముగ్ధ రత్తలన్
దెంద మెలర్ప మ్రొక్కెనను ♦ తేఁకువ ముద్దుల కీరి శారికన్
వందక పెంచఁ గోరెనని ♦ పల్కుము గాదిలి చెల్లి యంద్రకున్. ౫౨౬

ఉ॥ సీత వచించు వార్తవిని ♦ చింతయె కానని యీమె కానలన్
జేతము స్రుక్క నెంత వగ ♦ చెందునొ యంచుఁ దపించు మంత్ర వి
ఖ్యాతుని గాంచి రాముఁడనుఁ ♦ గష్టము వచ్చినఁ దీర్చు నేర్పరుల్
భూతల మందు గల్గుదురె? ♦ పోవఁగఁ జూచినఁ బోనె ప్రాణముల్?

తే॥ సుస్థిర ప్రేమచే మది ♦ స్రుక్కు మంత్రి, రాము వాక్కులఁ గొంత యూ ♦ అటనుపొంది
ముదల గొని మ్రొక్కి లక్ష్మణు ♦ మోముగాంచి, యేమిపల్కెద వన వచి ♦ యించెనతఁడు

ఉ॥ నామనమున్ సమస్త సుగు ♦ ణంబుల చేత జయించు రాఘవ
స్వామికి భూమి నిచ్చి యొక ♦ చాన కుబుద్ధికి లోఁగి పిమ్మటన్
రాముని కాన ♦ కంపి తన ♦ రాజ్యము స్త్రీకి నొసంగు సత్య వా
క్స్థముని రాజుగాఁ బలుఁచి ♦ చెప్పఁగ నొక్కటి యేని యొప్పునే? ౫౨౯

ఉ॥ కానల జ్యేష్ఠ పుత్త్రకుఁడు ♦ కాయలు దుంపలు దిన్చు నుండఁగాఁ
దాను సురేంద్ర భోగములఁ ♦ దప్పక పొందెడు సత్యశీలికిన్
దానికి మానికిన్ జత వి ♦ ధానికి జీవము తోడ నుండి యిం
కేని దివంబుఁ జేరఁ జలి ♦ యింపని స్థైర్యముఁ జాటి పల్కుమా. ౫౩౦

చ॥ అవనికి రాజు కాఁదగిన ♦ యాతని తోడను పుట్టలేదు నే
నవనికి నిప్పు డేలి కను ♦ నాతని తోడను పుట్టలేదు నా
కవరజుఁడున్ భువిం గలుగఁ ♦ దంబుజసంభవుచేత నాకు నేఁ
దవిలిన తోడుగాఁగ వసు ♦ ధన్ జనియించిన యే బలిష్ఠుఁడన్. ౫౩౧

తే॥ అనుచునిటు కోపమునఁ బల్కు ♦ ననుజుఁగాంచి, వత్స! యొప్పిదములుగాని ♦ పలుకులనకు
మనుచు నాశ్వాస మొనరింప ♦ మనసు కుమిలి, చాఁగి మ్రొక్కి తేరి కడకు ♦ సాగె మంత్రి

ఉ॥ తేరికిఁ బూన్చి యట్టి హయములఁ ♦ దేఁకువఁ జేకొనెఁ గోలఁగేల నా
దారి జనంబు లెల్ల ♦ దంబుగఁ గాంచెడు నట్లు చోదక

స్ఫార విచక్షణత్వమున ♦ సందడి యెక్కుడుగాక నిద్రకుం
గూరిన వారు మేలుకొనఁ ♦ గూడని తీరునఁ దేరు తోలుడున్. ౫౩౩

ఉ॥ సీత పతివ్రతాత్వఘను ♦ స్వీయ విశేష గుణంబులున్ లస
త్ఖ్యాతి యశంబు సత్వమును ♦ ధర్మపు విజ్ఞత కార్యకంబు సం
ప్రీతుఁడు తిప్పుచున్ దనకు ♦ వీడని తోడుగ నా నిశీథినిన్
శ్రీకరుఁడే మనోహరుఁడు ♦ చేరె వనంబులకున్ మనో ధృతిన్.

చ॥ కుటిల మనస్కులౌ దనుజ ♦ కుంజరులం దగఁ గూడి లోక సం
కటమగు కృత్యముల్ సలుపు ♦ కష్టుల కార్యము లడ్డుకో విశం
కట గతి నొప్పి యెల్లెడలఁ ♦ గాటుక రంగు వెలార్చు చుండు చీఁ
కటిఁ దొలఁగించు వెలుఁగుల ♦ కాగడ నా నుదయించెఁ జంద్రుఁడున్. ౫౩౫

ఉ॥ మర్మముఁ దాఁకు పాపముల ♦ మాయఁగఁ జేయ వలంతులైన స
ద్ధర్మములన్ వహించి మహి ♦ ధర్మము నిల్పు సహాయపక్ష యా
కర్మ ఫలంబు నెంచి కుతు ♦ కంబునఁ గానఁగ వచ్చినట్టి యా
యర్మిలి ధర్మదేవత ము ♦ ఖాబ్జ మనన్ శశి తాల్చెఁ దేజమున్. ౫౩౬

మ॥ భయదారణ్యములం జరించు నసి తా ♦ బ్దశ్యాము పే దర్మిఁగాం
చి మెదల్ నొవ్వ మొగంబు మోడ్చినటు దోఁ ♦ చెం గల్వలంభోజ సం
చయముల్ గప్పడె జక్కిపోతుల శిర ♦ శ్ఛాయన్ మనో వేదనన్
లయమై నోరులు మూసి కొన్నవని యే ♦ లా చెప్ప నన్యంబులన్. ౫౩౭

ఉ॥ అంజన శైల సుందరుఁడు ♦ నట్టెడ మేలి పసిండి చాయమై
రంజిలు వాఁడు వింటికొన ♦ రాణ నొసల్గల భూమి జాత మె
ల్లంజన వేసటం గొనని ♦ లాగున నేగుట కాను కూల్యమై
కంజ విరోధి వెన్నెలలు ♦ గాసెను మెత్తని దూది వైచెనా. ౫౩౮

తే॥ మిగుల లేఁగాను స్తన లక్ష్మి ♦ మెఱయు సీత, మృదు మృణాల పదంబుల ♦ మెల్ల మెల్ల
వెంబడించె విమలమైన ♦ ప్రేమ కంటె, గురు తరంబగు వస్తువు ♦ ధరణిఁ గలదె? ౫౩౯

చ॥ ఇనుఁ డుదయాచలంబు శిర ♦ మెక్కెడు మున్నె రఘూ ద్వహుండు ద
క్కినముగ యోజన ద్వయము ♦ కీడ్వడ కేగెను; మీఱి బాష్పముల్
కను గవ వీడఁగా మనసు ♦ కాతఱి తాపము నొంది కుందఁగా
మనికిత పాటు తోఁ జని సు ♦ మంత్రుఁడు చేరెఁ బురంబు చేరువన్. ౫౪౦

ఉ॥ చేరి దినేంద్ర వంశగురు ♦ శిష్టు వసిష్ఠుని గాంచి మ్రొక్కి కాం
తార్థము రాముఁ శోకఁ బరి ♦ తాపముతో వివరింప వానిని న్

ట్టూరుపు పుచ్చి కాఁగలది ♦ యుల్లమునం బరికించి యక్కటా!
భూరమణుండు తీఱెఁ బుర ♦ ముం గలగుండు వడెం గదా యనెన్. ౫౪౧

తే॥ రాజు నిందకు జంకి మ ♦ రల్పఁ డయ్యె, ధర్మమును నిల్ప నెంచిన ♦ దాశరథియు
వినఁడ యింతయు నామాట ♦ విధిని దాఁట, నగునె? యని యేగె సతనితో ♦నంతిపురికి

తే॥ దాశరథి వచ్చెననుచు ను ♦ త్కంఠమంత్రు, లరిగి పరిధి చంద్రుంబోలె ♦ నధిపుఁ జేరి
రాముఁగానక బాష్పవ ♦ ర్షంబు గురియు, నాసుమంత్రుని గని చాల♦నడలినారు. ౫౪౩

తే॥ తేరుమరలినదని యెల్ల ♦ వారు పలుక, రాముఁ డేతెంచెనని దశ ♦ రథుఁడు కనులు
తెఱచి నా జీవ జీవ ఖే ♦ తెంచెనె? యని, యడిగెఁ దనయెద యుబలాట♦పడుచు లేవ.

తే॥ బదులు చెప్పఁ జాలక మాని♦పరితపించెఁ, దపసి మొగమె భూపతికి ను♦త్తరమొసంగె
నెడఁద పగిలి భూమీశ్వరుఁ ♦డిలకు వ్రాలె,నొవరు చూడఁ జాలకమాని♦యవలికేగె.

ఉ॥ దగ్గఱ నుండెనే సుతుఁడు ♦ దవ్వుల నుండెనె యంచు మెల్లనన్
బ్రెగ్గడ నడ్గి యాతఁడు ద ♦ వీయ వనంబుల కేగెఁ దమ్మితో
సిగ్గరి సీతతో నని వ ♦ చించి వచింపక మున్నె భూవరుం
డగ్గలికంపుఁ బేర్మిఁ దన ♦ యా! యని హా!యని వీడెఁ బ్రాణముల్. ౫౪౬

చ॥ అపుడు పురందరాది సురు ♦ లందఱు మా ప్రభుతండ్రి వచ్చె నం
చుపగత మోద భావమున ♦ నొక్కటియై శశిబోలె శీతలా
తపము వెలార్చు తేరిపయి ♦ బాకొని పుట్టెడి తంటలెల్ల లే
క పొదలు పై జగంబునకుఁ ♦ గైకొని పోయిరి సమ్ముదంబునన్. ౫౪౭

మ॥ కని సందేహమునన్ సతీ తిలకమా ♦ కౌసల్య మైఁదాఁకి చ
ల్లనవైె యావియు నాడ కుండుటలు చూ ♦ లం జూచి నాథుండు బ్రమం
దెనకా నిశ్చయమంది గ్రీష్మరవి సం ♦ దీప్త ప్రతాపంబుచే
దనుకం జొచ్చిన యెమ్ములేని జని చం ♦ దం బందుచుం దూపిలెన్. ౫౪౮

సీ॥ కమల గర్భండాది ♦ గాఁగ సమస్త జ, గంబుల సృజియించి ♦ కాచు హారిని
తనయుఁగాఁ బడయు ను ♦ త్తమ తపం బొనరించి, నట్టియున్నలమిన్న ♦ యట్టికూలి
పీయూషమును జాఱ ♦ వీడి వందురు వాగి, వలె మది మిక్కిలి ♦ పరి తపించి
మణిఁగోలు పోయిన ♦ ఫణి విధంబున నల్ల, మల్లలాడఁగఁ బెల్లు ♦ తల్లడిల్లి

తే॥ మగవులుఁగుఁబాసి ♦ మనమున మఱుఁగునట్టి, కురరి భంగిని గద్గద ♦ స్వరముతోడ
నెన్నువలు పల్కి వినువారి♦యెదలు కరఁగి,ద్రవముగాఁ బ్రలాపించె రో♦దనముతోడ

చ॥ వినుత మహాశయుండు నృప ♦ వీరుఁడు ధన్వి యొకండు వ్యాధియై
జెనకక తానుగాఁగ మృతి ♦ జెందెనె మమ్ము విడ్చెనాఁగ దుఃఖ భా

జనముగఁ జేసి యంచు జల ♦ సద్మము నట్టఁ వసించు మత్స్యభా
తిని బలు తల్లడం గుడుచు ♦ దేహముతోఁ బృథివీస్థలిం బడెన్. ౫౫౦

సీ॥ ఈ దేశమును గాచు ♦ నృపతుల్లోకేరీతి, స్వర్గంబుఁ బాలించు ♦ వారెకాదె?
పొలుపుగా మనిన న ♦ పుత్త్రకులకు గతు, లొక్కెడనేని లే ♦ కుంట గలదె?
మత్సుతుఁడేతెంచి ♦ మదికి నూఱట గొల్పఁ, గిటు తండ్రి మృతికిఁ దా ♦ హేతువయ్యె
నను చింత యొక్కటె ♦ నన్నాటఁటంపెట్టెఁ, గైదువుపోటు రో ♦ గంబు లేక

తే॥ ప్రాణములు పీడుగతికిఁ బా - ల్పడియె నకట, కన్నకొడుకులచే నిట్టి-గతియుఁ దగునె?
వెదురు శుక్తియరఁటియెండ్రి-విధమెయయ్యె, నీమహీంద్రుఁ బ్రదుకుభరి-యింపఁదరమె?

తే॥ మతి బలిమిచేత విభుబుద్ధి - మాడ్చివైచి, బదులు పలుకపేయని రీతి - వరము గొంటి
మగనిఁ జంపుకొంటివి తృప్తి-నెగడుచుంటి, కైక! మిగిలియున్నదె చేయఁ-గలదియింక?

ఉ॥ దుర్జయుఁడైన శంబరుని - దోర్బల శక్తి నడంచు వీర! నీ
యూర్జిత శౌర్యసంపదనె - యోడక నెమ్మది నందుచున్న యా
నిర్జరపాళికే యిపుడు - నెమ్మి గడించిన విందవైతివే
వర్జన సేయఁగాఁ దగునె - పార్థివ! నమ్మిన మమ్ము దీనలన్? ౫౫౩

చ॥ ననుగొని వేల్మి వేల్చిన మ ♦ నః ప్రియ! యిప్పుడు నన్ను పీడి క్ర
న్నన నొకరుండ వే చనఁగ ♦ నాయమె తత్ఫలమున్ భుజింప? స
త్యనయ ఫలంబు నానుటయు ♦ ధర్మ ఫలానుభవంబ యేనియున్
జనునొకో సామి దేహమునఁ ♦ జక్కనగా ననుభూతి నొందుటల్? ౫౫౪

చ॥ గజ విభుఁ బాసి తాపమునఁ ♦ గ్రాఁగు కరేణువు పోల్కి కోసలా
త్మజ విభు తొమ్ముపై శిరము ♦ దారిచి యిట్లు విలాప మొంది సో
లి జగతి వ్రాల నంతిపురి ♦ లేమ లురమ్ముల బాఁది కొంచు దుః
ఖ జనిత బాష్ప తోయములఁ ♦ గ్రాఁగుచుఁ దోఁగుచు స్రుక్కి వెక్కుచున్.

చ॥ వినము భయంబుచేఁగుడిచి ♦ విహ్వల మందుచు వ్రాలు కైవడిన్
దెసచెడి నేలఁగూలుచుఁ బ ♦ తిన్ దివమందు భజింపఁ గోరి ని
ర్వ్యసన మనస్కలౌచుఁ బ్రతి ♦ మాకృతిఁ దాల్చిరి ప్రేమకంటె ని
వ్వసుమతి వేఱొకండు చెడు ♦ వస్తువు గల్గునె పోలఁ జూచినన్?. ౫౫౬

సీ॥ ఉప్పళంబుల తీర - మొప్పారు కడలిచే, బలసిన యీధరా - తలము నందు
దివమున యందుఁ బై - భువనము లందును, కల కులసతుల వీ - రలను బోలు
నకలంక హృదయ లెం - దైనఁ గల్గుదురేమి?, యనఁగనొప్పి యడవి - నడరు వాఁక
గిరిఁ జుట్టి కవియ సు ♦ స్థిరముగా నిలిచిన, కొండపై నెమిళుల - కొమరు దాల్చి

తే॥ కొడుకుఁ బాసి డెందము వ్రీలు♦నడువుచేతఁ, జచ్చియును మరణాంతంబు♦సత్యమందె
నిలుచు ప్రభునొడలిని వీడి-తొలఁగలేక, కిట్టి వలపించు చుండిరి-చుట్టు మూఁగి.

చ॥ మనుజుల బంధహేతువగు ♦ మాయ యనం జను చోఱ మీను చే
రిప జననాంబురాశిని త ♦ రింపఁగఁ దారకమంత్రరాజ నౌ
కను గొను వారి పోల్కిఁ బ్రభు ♦ కామిను లర్వదివేలమందియుఁ
మనమున దార్ఢ్యమూని యన ♦ మాన సునిశ్చలతన్ భజింపఁగన్. ౫౯౦

తే॥ రాము తల్లి లక్ష్మణు తల్లి♦వ్రాలి సోలి, మఱుఁగు చుండ నోరువని సు ♦ మంత్రుఁ డేగి
జరిగినది తెల్పఁగా రాజ ♦ గురుఁడు వచ్చి, ప్రభుని మరణంబునకుఁ జాలఁ-బరితపించె.

తే॥ వరము లొసఁగి కుమారుని-వనుల కంపి, సూర్యుఁడు గతించెనని మది - నడలి యడలి
యబ్ధిలో నావ వ్రీల నా-యకుఁడు చావ, ఱిచ్చవడు మాలిమిం బోలె- ఋషివరుండు

చ॥ జరుపఁగ దగ్గ సంస్క్రియలు - సల్పఁగఁ బుత్త్రులయందు చెంత నొ
క్కరుఁడును లేమికిం గురుఁ డొ - కానొక మార్గమునెంచి యంతటన్
భరతుఁడు వచ్చు పిమ్మటనె - పద్ధతిగా నొనరింప రాట్కళే
బరమును తైలరాశి నన ♦ పాయత గుప్తము చేసె నెవ్వడిన్. ౫౯౧

చ॥ పతి కిట సంస్కృతు ల్జరుప ♦ పట్టున మీరలు ధీరచిత్తులై
చితిఁ జొరవచ్చుఁ బొండనుచుఁ ♦ జెచ్చెర రాణుల సాగనంపి సం
గతముగ లేఖ వ్రాసి యిది ♦ కైకొని కైక కుమారు రాజు నా
నతి యని వేగ తోడు కొని ♦ నై పుణి రండని పంపె దూతలన్. ౫౯౨

తే॥ సర్వసైన్యాధి పతియును ♦ సారథియును, మంత్రిముఖ్యుండు నైన సు-మంత్రుఁబిలిచి
యవసరంబులొ రాజ కా♦ర్యంబులెల్ల, జరుపుచుండుమ యనుచు నా♦జ్ఞప్తి యొసఁగె

చ॥ తన కుల దీపకుండయిన ♦ ధారణి నాథుఁడు స్వర్గమేగఁ ద
త్తనయులు చెంతలేరు నృప ♦ ధర్మము నాశిల కంతఁ దాఁకఁ బృ
థ్విని తగఁగాతు నంచుఁ జను ♦ డెంచిన కైవడి భాస్కరుండు తూ
ర్పున నుదయించె నిర్జరులు ♦ పుణ్యులు మ్రొగ్గఁ బయోధి మ్రోఁగఁగన్.

సీ॥ చింతింపఁ గూడని-చెన్నుగఁ జెలింగు, చుండిన వారలు - నొడలు మఱచి
కూర్చున్న వారును - కోదండ పాణియు, నిటనె యున్నాఁడని - యెంచినారు
నగు జనంబులు లేచి - యంబుద శ్యాముని, గానక మనమున - గాసిచెంది
మాయని కన్నులు - మూసి మసల నిట్లు, చెఱుప నెంచిన వని - మఱిఁగి నారు

తే॥ ధరణిఁ బొరలిరి దెసలకుఁ-బరుగు లిడిరి, పడిరి లేచిరి కుందిరి - వందినారు
మనల దుఃఖ సాగరమున - మనుఁగ విడిచి, జాఱి పోయెను రఘురామ-చంద్రుఁడనిరి.

సీ॥ చెడుపని చేసె నా-మొఱఁడు తగునే యిది? దండక భూమిలోనె-యుండదేమి?
వెదకి చేరక యున్న - నెదలోన నూఱట, నందఁగాఁ గలమెర - వంత యేని?
అరదంపుఁ గందువ - యరయుదమా యని, చని కొంత దూరంబు - గని జనములు
మరలె నయోధ్యకే - మన రాము తేరని, పోయిన ప్రాణముల్ - పొందినట్లు

తే॥ తలఁచి తలరిచి మేఘముల్-జలధిఁ గలిసి, ఘోష మొనరించు తీరునఁ-గూడి యార్చి
త్రాఁచు కాటొంది పైనమ్ము - తంబు గోరకి, మరల జీవము ల్గాంచిన - కరణినొంది

ఉ॥ త్రోవ తొలంగ కుండఁ బురి - త్రోవనె స్యందన మేగుదెంచు నా
ప్రావను గాంచి మించిన య ♦ పార ముదాన లయంబునాఁడు లో
కావలిఁ గప్పి ముంచికొని ♦ యవ్వలఁ జెల్లెలికట్ట లోనికిన్
లోవు పయోధిఁ బోలి జను ♦ లుం దగఁ జేరిరి పట్టణస్థలిన్ ౫౬౭

ఉ॥ చేరి ప్రభుండు నాకమును ♦ చేరెన యంచును రాఘవుండు కాం
తారమె చేరెనంచు విని ♦ తద్దయు డెందము కుంది క్రుళ్ళ శా
రీరము కీఁచు వోవఁ దల ♦ రెన్ జాలనెన్ జనమెల్ల; గాలపున్
మేర తొలంగదేని మర ♦ ణించునె జీవి తపించుచుండినన్? ౫౬౮

సీ॥ ఉసులు వేఁగిన పతి ♦ కొదవని వారును, వనులకేగిన రాఘ ♦ వునకు నల్లె
దుఃఖమన్ చెఱియందు ♦ తూలి తపించెడి, వారలఁ గాంచి తా ♦ పసవరుండు
నేనును తలఁపంగ ♦ రాని వంతకుఁ జిక్కి, యే చావకీ గోడు ♦ చూచుచుంటి
నని సమాశ్వాసింప ♦ సమ్మని పల్కుల, నందఱు బడబాగ్ని ♦ కలికి వేల

తే॥ మీఱకుండు కడలివోలె ♦ నూఱడిల్లి, రట నుదారుఁడౌ భూదారు ♦ నాజ్ఞ యనెడి
నాకుల తపఃఫలంబున ♦ నట్టనడిమి, రేయి వెళ్లి నాతని విచా ♦ రింత మింక. ౫౬౯

౯. గంగాపటలము. (౩౭)

ఉ॥ కాటుక కొండయో? మరత ♦ కస్థిరమో? జలపూర్ణ మేఘమో?
నీటి సమూహమో? యనఁగ ♦ నిర్మల సుందర విగ్రహుండు ఘో
రాటవి త్రోవ మేని జిగి ♦ యశ్యమ కాంతిని గప్ప నేగె న
ప్పాటల గంధితో ననుజ ♦ వర్యునితోఁ జరితార్థభావుఁడై. ౫౭౦

ఉ॥ లేదన నొప్పు కౌను లవ ♦ లీ లలితాంగము నీలవేణి తీ
రోదధివెన్నఁ బోలిన మృ ♦ దూక్తులు నింపుతపంబు వంటి శు
ద్ధోదము వంటి శీలమతి ♦ నొప్పు మనోరమతోడ రాఘవుం
డాదటఁ గాంచె మత్తకల ♦ హంసము హంసియుఁ గూడి యాడుటల్. ౫౭౧

ఆ॥ కాము బాణములను ♦ రాము కోదండంబుఁ, గొలిచి గెలుచు కనులు ♦ గలుగు సీత
రాఘవేంద్రు చరణ ♦ రాజీవములు వాసి, యించు పంకజముల ♦ సంచుఁ గాంచె. ౫౭౨

సీ॥ మకరందమును పరి ♦ మళమును గుప్పెడు వేణి, నెలవంక బోలు నొసల్ ♦ గలుగుసుదతి
జానకితో రామ ♦ చంద్రుఁడు మేఘము, మెఱపుతో వచ్చెడు ♦ తెఱఁగు దాల్చి
నాగంబు పిడితోడ ♦ నడచు చందంబున, నడచుచు సుషిర ని ♦ నాద సరణి
తంత్రీ విరావామృ ♦ తంబు కరణిఁ దేనె, వలెను చక్కెరపాగు ♦ పగిదినమరి
తే॥ చెలువమైన పల్కులు గల ♦ చిలుకవంటి,సీత కన్నులఁబోలిన ♦ చెంగలువల
మళ్లలోఁ గల్వు తీసెడు ♦ మగువ ఋన్న, లూడ్చి సొప్పవై చుటగాంచె ♦ నొప్పుమీఱ
ఆ॥ మద మరాళ యాన ♦ హృదయంబు నందించు, కేళి గ్లాని యనుట ♦ యెఱుఁగ కుండ
విభునితోడఁ జనియె ♦ విహరణ లీలల, నించు గానుగలను ♦ కంచుఁద్రోవ. ౫౭౪

సీ॥ చిందమ్మలెక్కుడు ♦ చిందించు నాశము, త్యములు వెలుంగు ప ♦ ద్మాకరముల
హంసలు నిద్రింప ♦ ననువైన తోఁటల, సంకు పుష్పాలుగల ♦ సైకతముల
సుమము లొత్తుగరాలు ♦ సుందర వనముల, వర హేమమును వెలి ♦ వఱచు నదుల
వరివెన్నులను మేయు ♦ వనవంబు లందుకీ, రంబులు గార్చు హే ♦ రంబ సమితి
తే॥ తేనెఁ గ్రోలఁగ వ్రాలిన ♦ తేంట్లులేవ, వారి దుముకుచు లేచెడు ♦ వాలుగలను
హంస లట్లు చెలులు ముగ్గు ♦ ప్రాహ చయములఁ,గనుచుఁ గోసల దేశంబు ♦ గడచిచనిరి.

చ॥ పరిధి గలట్టి కాంతులను ♦ భాసిలు భూషణ భూష్యతోడ న ౫౭౫
ప్పురుషులు మేటి క్షేత్రముల ♦ పొల్పెస లారెడు కోసలంబు దాఁ
టి రయమెసంగ వేదము ప ♦ ఠించి మహాత్త్వము నొందు తాపసే
శ్వరులు వసించు తీరములు ♦ భాసిలు గంగను చేరి రంతటన్. ౫౭౬

తే॥ అచటవసియించుమునులునూ ♦ యఖిలవినుత, పాత్రమగుపరమార్థంబు ♦ వచ్చెననుచుఁ
గౌతుకంబున వచ్చి యు ♦ క్కమల నేత్రుఁ, గాంచు వేడుక మూఁగిరి ♦ కడఁకతోడ.

చ॥ మతిఁ దలఁపంగఁ బల్కనణు ♦ మాత్ర మడంగని ప్రేమరూపముఁ
శ్రుతులకు దాఁటి వెల్గు పరి ♦ శుద్ధ సుధామయ మూర్తి నమ్మని
ప్రతతులు చర్మ చక్షువుల ♦ బంధుర మోదముతోడఁ గాంచి రం
దితర గృహస్థులెయ్యెడల ♦ నేని వరాంగులఁ గాంచుకైవడిన్. ౫౭౮

తే॥ వంశ ధరులగు ముని వరుల్ ♦ పద్మనేత్రుఁ, బాలకడలి వెన్నను పోలెఁ ♦ బరిగణించి
కనులఁ ద్రావుచు నెమటను ♦ గంతు లిడుచు, నించు పాటలతోడ స్తు ♦ తించి నారు.
తే॥ ఇల్లు వీడిన కొడుకుల ♦ నెల్ల వేళఁ, దలఁచి తలరుచు వెదకుచోఁ ♦ దనయు లొక్కట
వచ్చిచేర నుత్కంఠమై ♦ వచ్చు తండ్రు, లం బలెక్ వచ్చి కనిరి ము ♦ దంబు గొనిరి.
తే॥ అతఁడు నడచు మార్గాయాస ♦ మఱ స్వనేత్ర, బాష్పశుద్ధ జలంబుతోఁ ♦ బరఁగనార్చి
మృదుమధుర వాక్య సుమములు ♦ నెద గదించి, చెడని ప్రేమామృతంబు భు ♦ జింపఁజేసి

తే॥ వనము లందుండి యేర్చి తె ♦ చ్చిన విశుద్ధ, కంద మూల ఫలంబులఁ ♦ గాన్క లిడుచు
విమలతేజ! కుజంగట ♦ వెలయు గంగ, యందు నీరాడి వేల్చి ర ♦ మ్యార్చగింప. ౫౮౨

చ॥ తగ నిటు ప్రేమ పూర్ణులగు ♦ తాపసు లాడఁగ రామ భద్రుఁడున్
మగువలలోన దీపమన ♦ మాన్యత గన్న విదేహ కన్యతోఁ
బాగడఁగ దేవ సంఘములు ♦ పూర్వము బ్రహ్మ కరంబుతోడ నిం
బుగఁ దన పాదముం గడుగు ♦ పూత జలంబుల మున్గె నత్తఱిన్. ౫౮౩

ఉ॥ గంగయుఁ గేలు మోడ్చి కడుఁ ♦ గ్రమ మృదూక్తుల నిట్లు వల్కె శ్రీ
రంగ దురస్థనిలా! ఘన త ♦ రంబగు పాపము గల్గు వార లా
రంగ మునింగి పాప్మ నిక ♦ రంబుల నాయెడ వీడువారు న
న్నుంగను తండ్రి! నీవిట ము ♦ నుంగ భజించితి నేఁ బవిత్రతన్. ౫౮౪

ఉ॥ నాగ కులేశ కంకణుఁడు ♦ నాక నదీ జటిలుండు శైల పు
న్నాగ తనూజయు న్నిలిచి ♦ నందన మందుచుఁ గాంచుచుండ, నా
భోగ మనుష్యతం దెలుపఁ ♦ బుట్టిన రాముఁడు మున్గి లేచు నా
బాగు రహించె గంగను క ♦ పర్దముపైఁ ధరియించు పోలికన్. ౫౮౫

చ॥ జనకజతోడ మున్గి నృప ♦ చంద్రుఁడు లేచుట చూడఁ దొల్లి శ్రీ
వనిత కరంబు వట్టికొని ♦ పన్నగ వెండిని పోలు పాల వె
ల్లి ని ఫణి తల్పమందు పవ ♦ ళింతను వీడి జగంబు గావ లే
చిన రహి దోఁచె బుణ్య జన ♦ సేవిత శైవలినీ జలంబులన్. ౫౮౬

సీ॥ కానును గాంచి తీఁ ♦ గలు పుయి లోడంగ, నసుఁగు నడక కోడి ♦ హంసలాడుఁగఁ
బదముల కెదవడి ♦ పద్మముల్ తేలంగఁ ♦ గనుల కలికి వాలు ♦ గలు తొలంగఁ
బారాణిచే నీరు ♦ వన్నియ మీఱంగ, మృదు పదయుగ యగు ♦ మెలఁత మిన్న
పతి భుజంబును కర ♦ పంకజమునఁ బట్టి, పూత తోయంబుల ♦ మునిఁగి లేవ

తే॥ శూలి జటలోని జల్లేడు ♦ రేలపూల, గంధముం బొంద నట్టి గం ♦ గా జలంబు
కుసుమవేణి క్రొవ్విదలోనఁ ♦ బొసఁగు పుష్ప, వాసనయుఁ గస్తురియుఁ గొని ♦ పరిమళించె

చ॥ తరఁగలు పై నురుంగులఁ గ ♦ దల్చుటచే నరవొందు వేణి కా
భరము గలట్టి పెద్ద మగు ♦ వం బలెఁ గానఁగ వచ్చు గంగ సం
బరమున సీతఁ దృష్టి పఱు ♦ పం గొని పెంపుడు తల్లి కైవడిన్
దరఁగ కరంబు చాఁచి ప్రమ ♦ దంబునఁ దీర్ఘము లార్చె నొయ్యనన్. ౫౮౮

తే॥ సీత జడయను జీమూత ♦ జాత మపుడు, విరిసి ప్రాలి నీటను మున్గు ♦ విధము దోఁచె
గంగ నడుమను బ్రవహించు ♦ కజ్జియమున, యుదకమందున్న పెనుసుడుల్ ♦ కదలానఁగ

తే॥ సుడులు వడుచు శబ్దించెడు ♦ సుర సరిత్తు, కనులఁ బోలిన పెనువాలు ♦ గలు చలించి
దుముకు వెల్లువలో సీత ♦ దోఁగి లేవఁ, బాల కడలి లేచిన లక్ష్మి ♦ పగిదిఁ దోఁచె.

చ॥ తొలి నొక పాదమే కడిగి ♦ దోషము వెల్లఁ దొలంచి కొంచు ని
ర్మలినతఁ జెంది పూర్ణ మహీ ♦ మంబు గడించిన గంగ యిప్డు డా
సలలిత దేహమెల్లఁ జెలు ♦ వక్ష స్పృశియింపఁగ నోచె నింక లో
కులు నరకంబుఁ బొందెదరొ ♦ కో! తనయందు మునుంగ భక్తిమై? ౫౯౧

తే॥ వార లీరీతి రేవున ♦ నీర మాడి, యాశ్రమము చేరి జ్ఞానగ ♦ మ్యంబు పరమ
వస్తువుఁదలంచిహుతవహు♦భక్తిఁ గొలిచి,మునులప్రేమంపుటాతిథ్య♦మునుగ్రహించి

ఉ॥ వేసట కోర్చి తాన యొద ♦ వించిన యయ్యమృతంబుఁ బ్రీతి స్వ
ర్వాసులకుఁ భుజింపుఁడని ♦ రాజుల నిచ్చిన మేటి యిప్డు సం
తోసము తోడ మానులిడు ♦ దుంపల నాకులఁ దృప్తిగాంచె; నౌ
వీసర వోవునే తనియు ♦ పెద్దల కొందఁగఁ జేయు కృత్యముల్? ౫౯౩

## గుహుఁడు రాముని గాన వచ్చుట

సీ॥ అంతఁ బేనావల ♦ కధికారి దివ్యాఘ, గా తీరవాసి వి ♦ ల్యాఖ్రుద మిన్న
పుధఁ భుజ యుగుండు ♦ కుక్కలు గలవాఁడు, తిమ్మటమును జోళ్లు ♦ దాల్చువాఁడు
చీకట్లు గుంపులై ♦ చేరెననఁగ నొప్పు, మెఱుఁగారు నల్లని ♦ మేని వాఁడు
తనవెంట సేన రా ♦ దట్టంపుఁ గార్మొగు, ళ్లొగి లేచి వచ్చెనా ♦ నొప్పువాఁడు

తే॥ కొడుపుఁ గజ్జతో దుందుభిఁ♦గొట్టువాఁడు, పంబ పంబ వాయించునై ♦ స్యంబుగలఁడు
తలిరుఁ బోలిన కెంపు తూ ♦ పులుగలాఁడు, గజఘటలవాటిచుట్టముల్ ♦ గలుగువాఁడు

తే॥ తొడల కందంపు టరలాగు ♦ దొడిఁగినాఁడు, చుట్టు పులితోలకలను బ్రేలఁ♦జుట్టినాఁడు
తెల్ల నామంబు నుదుటను ♦ దిద్దినాఁడు, భల్లుకాజ నోష్ణీషంబు♦పరఁగువాఁడు. ౫౯౪

సీ॥ పండ్లు కూర్చిన లీలఁ ♦ బరిఘ పిల్లెడు గవ్వ, లం గూర్చుహారము ♦ ల్దాల్చి నాఁడు
తాళ్లు కూర్చిన రీతి ♦ రవళించు నందెముల్, పోలుపుగాఁ గాళ్లకుఁ ♦ బూనినాఁడు
చీకట్లఁ గట్టి చే ♦ ర్చినయట్లు చెన్నారు, సిగయందు నరివెన్ను ♦ చెక్కినాఁడు.
నూనియఁ బ్రామిన♦ జానున నొప్పారు, నిరుల వన్నియ మేనఁ ♦ బొరసినాఁడు

తే॥ నిడుద కనుబొమల్ మిక్కిలి♦ వెడఁద యొమ్ము, గలుగువాఁడు కటువు తాళ♦కంటకముల
బోలు రోమముల్ మైఁజేతఁ♦బొంపువాఁడు, వజ్రమువుఁ బోలు మధ్యంబు♦వఱలువాఁడు

తే॥ పలుకు పొందిక లేకుండఁ ♦ బలుకు వాఁడు, చిలువ కంపెను క్రూర దృ♦ష్టులు గలాఁడు
నల్ల చిన్నెల దునెగల♦నడుము వాఁడు, జముఁడు నై తము వడఁకెడు♦స్వరమువాఁడు.

తే॥ బల మతిశయింప నెఱచి చేఁ ♦ పలు భుజించు, కంపుగలిగి పవ్వని నోరు♦గలుగువాఁడు
కినుక లేకున్న నిప్పులు ♦ కెరలునట్టి, కఱకు కోడిదంష్ట్రఁ జూపులు ♦ గలుగువాఁడు.

ఆ॥ గంగ దరిని నిలుచు ♦ శృంగి బేరంబను, నగరమున వసించు ♦ నాయకుండు
గుహుఁడు రాముఁ జూడఁ ♦గోరికొని తేనియల్, మీలు కానుకఁ గొనుచు♦లీలఁజేరె.

క॥ ముదమున బంధులకడఁ దన ♦ ప్రదరంబులు, విల్లు వాలు ♦ వదలి విమలవా
క్పదయుండు నెసరు నింపుగఁ ♦ బొదలు గుహుఁడు తపసి వాట ♦ పొంతను నిలిచెన్.

తే॥ వేఁటరుల నాయకుండైదఁ ♦ బ్రేమనిండ, సుక్కుఁ బోలిన నీసేవ ♦ కుండు వచ్చి
యాజ్ఞ నెఱవేర్ప నున్నవాఁ♦డనఘ చరిత!, కరుణ నేలు కొమ్మనుచు బి♦గ్గఱగఁబిలిచె

తే॥ పిలువ విని లక్ష్మణుండట ♦ వేగ వచ్చి, యెవఁడ వీవు వచ్చిన పని ♦ యేమి యనఁగఁ
గుర్కురము వంటి మీసేవ ♦ కుండు గుహుఁడు,పాద సందర్శనము చేయ♦వచ్చెననిన

చ॥ ఇచటనె యుండు మంచు వచి ♦ యించి పదంపడి లోని కేగి య
న్న చరణ పంకజంబులకు ♦ నర్మిలి మ్రొక్కి విశుద్ధ మానసుం
డుచితుఁడు తల్లికంటె నెన ♦ రొప్పిన వాఁడు గుహుండు న్యాయికా
నిచయము గల్గువాఁడు నిను ♦ నెమ్మిని చూడఁగ వచ్చి నాఁడనన్. ౬౦౩

ఉ॥ రాముఁడు సంతసించి కొని ♦ రమ్మన రమ్మని లక్ష్మణుండు ప్రే
మామృత మొల్కఁ బిల్వఁగ గు ♦ హాఖ్యుఁడు లోనికి వచ్చి యాన నా
కోమలికంబు గాంచి తన ♦ కుం గల కన్నులు ధన్యతంగొనన్
నేమము తోడ మ్రొక్కియట ♦ నిల్చెఁ గరంబున నోరు మూయుచున్. ౬౦౪

మ॥ ఇటఁ గూర్చుండుమ డాసి యంచు రఘు వం ♦ శేశుండు వాత్రుచ్చు నం
తటఁ గూర్చుండక యెల్ల మీకొఱకిన ప్రియాం ♦ త ర్భాత భావాఢ్యుఁడా
దట మీకోరెము దెచ్చినాఁడ మధు మ ♦ త్స్యంబుల్ గొనుండన్న మీఁ
దట రాముం డెల సవ్వుతో నను దయా♦ధన్యాత్ములం గాంచుచున్. ౬౦౫

ఉ॥ వీడని ప్రేమ పండి ప్రభ ♦ వించిన భక్తియె ముఖ్య హేతువై
నూడిదగాఁగఁ దెచ్చినవి ♦ చొప్పడు టెన్నఁగ దుర్లభంబులౌఁ
బోఁడిమి కూర్మిచేత నవి ♦ పూతములౌ సుధకంటె నింపులౌ
వేడుకతోఁ గొనం దగిన ♦ వే భుజియించినవారమే కదా! ౬౦౬

క॥ మాపిచట నుండిరేపట, రేపకడ సురాపగం ద ♦ రింపఁగ వలె నీ
వీపాట వెళ్లినావం, జేపడఁ గొని తెమ్ము సాహ్య ♦ చిత్తమునఁ జెలీ! ౬౦౭

ఉ॥ శ్యామల దేహుఁ డిట్టులు ప్రి ♦ యంబునఁ బల్క గుహాఖ్యుఁ డిట్లనున్
భూమిని సర్వ సంపదలు ♦ పొల్పుగ నీయవికావె? నీదు తీ

రీమెయిఁ గాంచు కన్నులఁ బ • హించిన కృత్రిమ వేషి నేను నీ
శాములఁ జూచి నిన్ను విడు - వం గలనే? యిట సేవ చేసెదన్. ౬౦౮

చ॥ విలుగల వీరులందు ఘన - విశ్రుతుఁ డాతని పల్కు-పించుఁ దో
య్యాలి జనకాత్మజం గని గు • ణాకరు తమ్ముని మోముఁ గాంచి యీ
బలియుఁడు మేరదాఁటి చను • భక్తిగలాఁడని పల్కు-చున్ దయా
విలసితనేత్రుఁ డాతనిని - పేరిమి మాకడ నుండుమా యనెన్. ౬౦౯

ఉ॥ నావుడు రామచంద్రునకు - సన్నుతి మ్రొక్కి- మునీంద్ర వాటికిన్
గావలియుంచి సైన్యమును - కార్ముకముం దగ నెక్కు-పెట్టి బా
ణావలి చేతఁబూని కటి - యం దడిదంబు ఘటించి యంబుదా
రావముఁ బోలు కంఠమున - రాఘవుఁ బ్రస్తుతిసేసి నిల్చుచున్. ౬౧౦

ఉ॥ రాజ్య సుఖంబు వీఁడి యిటు - రాఁ గతమేమన సర్వలోక సం
పూజ్యుని తమ్ముఁ డంతయును - పోలఁగఁ దెల్పఁగ నానిషాద సా
మ్రాజ్యవిభుండు చింతిలి ధ - రారమ పెద్ద తపించియున్ ఫల
ప్రాజ్యత నొందకుండెనని - వందురెఁ గన్నుల నీరు చిప్పిలన్. ౬౧౧

చ॥ పరవిన చీఁకులన్ పగఱఁ - బాఁఱఁగఁ దోలి దిశల్ జయించి యు
త్తరదిశ నిల్చి పాలన ము • దంచిత లీల నొనర్చి కీర్తి సం
భరితముచేసి సర్వజన • మాన్యత పెల్లుగడించి పెద్ద ని
ద్దురగొను నాజికై వడిని • తోయజ మిత్రుఁడు క్రుంకె వెన్వెనన్. ౬౧౨

చ॥ ఉరవడి సంజ కర్జముల • నొప్పుగఁ దీరిచి రాఘవేంద్రుఁడున్
సురసుధ వోలు సీతయు వ • సుంధర వర్ధిలు శాద్వలంబునం
బొరసిరి నిద్ర కార్ముకము • పూని సుమిత్ర సుతుండు తెల్లవా
ర్వాఱకును కన్ను మూయక క•రంబు మెలంకువ నిల్చెఁ గాపుగన్. ౬౧౩

ఉ॥ ఎండలు కాయు హేమగిరి - యింబు చెలన్ విలసిల్లు ప్రాజ్యరుక్
మండను లీను వజ్ర మయ - కాంచన భూషణుఁ డర్క-వంశ్య చం
ద్రుండు మృగేంద్ర సన్నిభ గ - తుండగు లక్ష్మణు నిద్రచేర నా
యండ కయోధ్యఁజేరు దిన - మందున రమ్మని పల్కె-నామెయున్. ౬౧౪

తే॥ వీరనిధి లక్ష్మణుని విధి - మీఱలేక, యతని పాదపద్మములకు - నతి యొనర్చి
యార్య! మీయాజ్ఞ తలఁ దాల్చి-యర్లైవత్తు, ననుచు వెడలె నిద్రాదేవి-యచటినుండి

చ॥ కమల నికేతనాంశయగు - కాంత విదేహ నృపాత్మజాతతో
విమలుఁడు రామచంద్రుఁ డట - విం బవళింపుటఁ గాంచి మెట్టి గా

కములను పొందు నంచితుఁడు - రక్కాస రీతి నిటం బరుండె హా!
యమవిధి యంచు లక్ష్మణుఁడు - వ్రేశులురాల్చుచు నిల్చె బొమ్మనాన్.

మ॥ పరికాసిం గిరియూథముల్ బలయు శే - వం జుట్టు చుట్టాలతో
శరముం గూర్చిన వింటితో గుహుఁడు స-జ్జన్ లక్ష్మణుం జూచి ని
ద్దుర గావించెదు రాముఁగాంచి మిగులన్ - దుఃఖించి కన్నీటితో
ఝరముల్ వెల్వడు శైల లీల నిలిచెన్ - సంతప్త సర్వాంగుఁడై. ౬౧౭

చ॥ జననము లేని భాస్కరుఁడు - స్వర్గ సుఖంబులు చావుపుట్టుకల్
దినగతి బోధసేసి కడ - తేఱు పథంబును తెల్పఁబూని భూ
జనముల మేలు కోల్పుటకుఁ - జయ్యన వచ్చిన వానిఁ బోలి తా
మనుపటి నాఁడడంగి మఱి - పుట్టెను పిమ్మట నాఁడు తూర్పునన్. ౬౧౮

తే॥ పంకజంబులు తేరిపైఁ - బరఁగు భాను, మండలముఁగాంచి వికసించె-మఱియునొక్క-
నల్ల సూర్యుఁడనందగు - నాథుఁ గాంచి, సీత మోముఁ దమ్మియు విక - సించె నపుడు

చ॥ పగఱకు భీకరం బయిన - బాహులకుం దగు కార్ముకంబు నొ
ప్పుగ ధరియించు రాఘవుఁడు - పొల్పుగఁ దీరిచి కాల్యకృత్యముల్
మొగసలఁ జేరి నావికుల - ముఖ్యు గుహుంగని గంగ దాఁటఁగాఁ
దగు కలమొండు దెమ్మని ము - దంబున నానతి సేయ నంతటన్. ౬౨౦

చ॥ మనమున పీడలేని ప్రియు - మండనుఁడైన గుహుండు భక్తిమై
జనకజకుం దమాల సుమ - సాగర నీరద నీలరత్నవ
ర్ణునకుఁ బ్రణామముల్ సలిపి - నొచ్చి కనుల్ వెసఁ గ్రుమ్మరించు వాః
కణములు వెల్లువై పఱవఁ - గైముకుళించి కడంక నిట్లనున్. ౬౨౧

సీ॥ వనమాలి! విను మాని - వాస మసత్య వ, ద్ధతిలేని శుద్ధ కాం - తార భూమి
అక్షీణ బలమున - నలరారుదుము మేము, భవదాజ్ఞ మిగుల న - ల్పంబ యైన
శిరసా వహించి చే - సెదము మమ్మెల్లర, నీ బంధువులు గాఁగ - నెమ్మి నెంచి
నీ వనవాసంబు ♦ మా వనంబునఁ గడ, పంగ నర్థింతు మా ♦ ప్రభుఁడ వగుచుఁ

తే॥ దేనె కొట్టులు దివ్య ల♦ర్థించు నెఱచి, కలవు తోడుగాఁ గుక్కల ♦ కరణి నున్న
యల్పమైన మా ప్రాణ చ♦యంబు గలదు, వనులు గలవు గంగయును దా♦పున నెగలదు

సీ॥ పట్టుఁ బోలిన చర్మ - పట్టముల్ గలవు భు, జింప నింపగు పండ్లు ♦ దుంపలుండు
నూఁగు లాడుటకు మే ♦ లుయ్యాలలంబోలు, కలముల పై భాగ ♦ ములును గలవు
పరుగెత్తఁదగు కాళ్లు ♦ బలువిండ్లు గలకేలు, గలవు దుస్సాధము♦ల్పులువు సేసి
నంబర వీథి ను ♦ న్నట్టి వస్తువునైన, గడియలోఁ దెచ్చి యీఁ ♦ గల్గము మేము

తే॥ విల్లుకాంౘ ద్రాఘ్ఞ నెఱవేర్చు ♦ వేఁటరులును, బలియుఁ రేఁబడి లక్షలు ♦ కలరు మీఱ
లొక్కఁడిసమేని మాపాపాకు ♦ టిక్కఁ యుందు, నిలిచి మము ధన్యులం జేయుఁ ♦ జెలిమితోడ

ఉ॥ ఆతని వేఁడికోలు విని ♦ హార్దముతోఁ జెలువవ్వతో హృద
బ్జాతము నిండు ప్రేమ రఘు ♦ వర్యుఁడు పల్కెను వీరశేఖరా!
పూతములైన యాపగల ♦ పుణ్య జలంబులఁ గ్రుంకి పెద్దలం
జేతము రంజిలన్ గొలువు ♦ చేసి యనంతర మిందు వచ్చెదన్. ౬౨౫

తే॥ అనుడు నింగితజ్ఞుండగు ♦ నాగుహుండు, వడివడిం జని యొక పెద్ద ♦ పడవఁ దెచ్చె
జలజనేత్రుండు మౌనుల ♦ సెలవుగొనుచుఁ, దమ్ముతోఁ జంద్రభాలతోఁ దరణి నెక్కె

ఉ॥ ప్రాణముఁ బోలు రాముఁ డుడు ♦ రంగిణిలో నడపింపు వే యనన్
నాణెముతో మరాళమటు ♦ నావ తరంగములందు పోవ ని
ష్ప్రాణ వహించి తాపసులు ♦ సంకటమున్ భజియించి చింతమై
బాణాలి నైచు శౌర్యముల ♦ ఖ్యాతిని వాడిరి రాము పోకకై. ౬౨౬

ఉ॥ పాలను గెల్చు పల్కుల నృ ♦ పాల తనూజయుఁ దమ్మి నెచ్చెలిం
బోలిన రాముఁడున్ నదిని ♦ పుణ్య జలంబుల మీలతోడుతన్
బోలఁగఁ గేల వారుకొని ♦ పొల్పుగఁ జల్లుఁచు నుండఁ దెడ్లతో
మాలిమి నడ్పు నావ పటి ♦ మం జనెఁ గర్కటమేగు కై వడిన్. ౬౨౭

ఉ॥ చందన సైకత స్తని ప్ర ♦ శస్త సురాపగ కాంతి పుంజముల్
చిందు మణుల్ తళత్తళలు ♦ చెంద సుగంధ జలేజ రోచు లె
త్తందన మొంది తేటగు త ♦ రంగములన్ కరముల్ ఘటించి తె
చ్చెం దన దక్షిణాంబుఁ దట ♦ సీమకుఁ బ్రేమ పయోధిఁ జేరుచున్

శా॥ ఆర్యుం డావలి తీర మెక్కి ప్రమదం ♦ బారంగ నచ్చో సుహృ
ద్వర్యుం గాంచుచుఁ జిత్ర కూటమునకున్ ♦ దారిన్ వెసం జూపి నీ
కార్యం బారయ నేగు మన్నఁ జెలిమిం ♦ గావంగఁ బ్రాణంబులున్
స్థైర్యం బొప్పఁగ సీయఁ దగ్గ గుహుఁడా ♦ సత్య స్థిరుం గాంచుచున్. ౬౨౮

ఉ॥ ఏనును వెంటవచ్చెదు న ♦ దృష్టము పొందుదునేని రాఘవా!
కాననమందు దారి నెఱుఁ ♦ గన్ వలఁతిన్ మఱి పండ్లు దుంపలున్
దేనెయు మీకు వేళకొగిఁ ♦ దెచ్చి యొసంగు పనిన్ సమర్థుఁడన్
జాను కుటీరముం జలుపఁ ♦ జాలిన ప్రోడను వెంట వచ్చెదన్. ౬౩౦

ఉ॥ దుష్ట మృగంబులన్ దిశలఁ ♦ దోలుదు శుద్ధ వనస్థలంబులన్
గష్టము లేక రోసి వెసఁ ♦ గాంతును కోరిన వస్తుజాలముల్

మ్రుష్టము గాఁగఁ దెత్తుఁ జని ♦ మేకొని చేయుదు రేయి వేళ ని
స్పష్టముగాఁ జరింతు నెడఁ ♦ బాయక యుండెద వెంట వచ్చెదన్. ౬౩౧

చ॥ పలువగ మంపలన్ శిఖరి ♦ పై లభియించిన గెల్లగించి తే
వలఁతిని చాలదవ్వు నడ ♦ వన్ జలమెచ్చట నున్నరోసి తేఁ
గలుగుదు విల్లుదాల్చి మిము ♦ గాతును కంటిని తెప్పవోలె నే
నలుకను దేనికిన్ శ్రమము ♦ నందను వీడక వెంట వచ్చెదన్. ౬౩౨

చ॥ మురువగు వక్షముం గలుగు ♦ మోహనరూప! యభీష్టమేని సం
బరమున నాబలంబుఁ గొని ♦ వచ్చెదఁ గాచెద నొక్కవేళ ము
మ్మరు లెవరేని శాత్రవము ♦ నల్పి పయింబడిరేని తోల్త నే
నిరవుగఁ దాఁకి ప్రాణముల ♦ నిచ్చెద వేడెద వెంటవచ్చెదన్. ౬౩౩

చ॥ అనుచు గుహుండు భక్తిమెయిఁ ♦ బ్రార్థన సేయఁగ రాముఁ డిట్లనున్
వినుము సుహృత్తమా! సుగుణ ♦ విశ్రుత! ప్రాణముఁబోలు వాఁడ వీ
యనుజుఁడు నీకుఁ దమ్ముఁడు ల ♦ తాంగి ధరాత్మజ నీకు మిత్రురా
లును భవదాజ్ఞఁ కేను మఱి ♦ లోఁగిన వాఁడ నొరుండ నౌదునే? ౬౩౪

చ॥ శ్రమముల నొందు నంతఁ గద ♦ సౌఖ్యము గల్గును జీవకోటికిన్
వెనుక సుఖంబుకై పడుమ ♦ వేధ వియోగము గూర్చెనంచు నీ
మనమున నెంచి చింతిలకు ♦ మానుగ నల్వుర ముంటి మయ్యె నె
క్కొను మనమొప్పు సోదరులు ♦ కూరిమి నైదుగు రైతి మియ్యెడన్.

ఉ॥ కాలవిపర్యయంబునను ♦ కల్గు నిలుంగు భరింపఁ దోడు కాఁ
జాలిన నీదు తమ్ముఁడు యు ♦ శస్కరుఁ డొక్కరుఁ డున్నవాఁడు నా
కేలలి నేరితో నయిన ♦ నేల పగల్ జనియించు? నీవు నీ
ప్రోలికిఁ బొమ్ము నే మరలి ♦ పోయెడు నాఁటికి నిన్ను గాంచెదన్. ౬౩౬

ఉ॥ అచ్చటి బాంధవ ప్రతతి ♦ నారయు నీ యనుజుండు గల్గె న
ట్లిచ్చటి చుట్టలం గరుణ ♦ నేలఁగ నేరు గిలారు పల్కుమా?
నచ్చిగ నీకు బంధువులు ♦ నాకును బంధులు గారొ? వారలున్
బెచ్చగు దుఃఖ మొందఁ దగ ♦ వే? మదనుజ్ఞను వారిఁ గావుమా. ౬౩౭

ఉ॥ ఆనతి మీఱలేక మది ♦ సంగిద వీడఁగలేక చూచు వా
రీ పరుఁడేదొ రోగపడె ♦ నేమొ యనం జను శృంగిబేర భూ
జానియు వీడుకోల్పడసె ♦ జానుగ భూమలు దాల్చు కేకిఁబోల్
జానకి లక్ష్మణుండు రఘు ♦ చంద్రుఁడు పట్టి రరణ్య మార్గమున్. ౬౩౮

## ౨. వన ప్రవేశ పటలము. (౪౭)

చ॥ వెడఁగులు పోఁడిమిన్ వలఁచు ♦ వేశ్యల డెందమువోలెఁ జెమ్మ యె
క్కుడయును కద్దొ లేదొ యని ♦ యేర్పడ శంక వహించు నట్టు ల
ప్పుడమియు నెండఁ బాఱు మిడి ♦ వొందుచు వేసఁగి వచ్చువేళ రా
ముఁడు చనుదేర మేఘములు ♦ మూఁగెడు జాడలు దోఁచె మింటిపై. ౬౩౯

చ॥ గ్రహపతి లేఁత వెన్నెలల ♦ కైవడిఁ గాయఁ దరూత్కరం బను
గ్రహమున నీడ లీన ఘన ♦ కాండము సోన వెలార్ప గంధ సం
గ్రహుఁ డనుకూలుఁడై వెలయఁ ♦ గ్రైపుస నెమ్మిళు లాడఁ జారు వి
గ్రహు లెదఁ దాపముం గొనక ♦ కాననవీథిఁ దరించి రిమ్మగిన్. ౬౪౦

మ॥ ధరణీజాతను గాంచి రాముఁడను డెం ♦ దం బింపు సొంపార నో
హరిణాక్షీ! యిటు చూడు మింపయిన వ ♦ స్త్రాళిన్ ఘటింపించు మే
ల్వెరవుం జూపెడు నింద్రగోపములు ను ♦ ర్విన్ జేలపూరాసులున్
ధరణీ దేవికి రత్నహార విధి ను ♦ ద్యత్కాంతులం జిమ్మెడున్. ౬౪౧

శా॥ రోలంబంబులు పాడ మద్దెల మొగుల్ ♦ మ్రోఁగింపఁ బింఛంబులన్
లీలన్ విప్పి నటించు నెమ్మిళులు నీ ♦ నెమ్మేనసంఖ్యాక నే
త్రాలం జూచుచు నీదు వేసలి క్రియన్ ♦ రాజిల్ల కుండంగఁ బే
రీలన్ బర్హము ముడ్చుకొన్న వయినం ♦ బింపారగాఁ జూచితే? ౬౪౨

చ॥ పరపిన కాంతు లుల్లసిలు ♦ పచ్చని మేనును రాగ వక్త్రముల్
బొరసిన కీర వారములు ♦ పోల శిరీష లతాంత రాజిపై
నిరవుగఁ గూరుచుంట గణి ♦ యించిన నీదు ప్రకోష్ఠమందు వ్రా
లు రహిఁ జెలంగుఁ గాంచితె వి ♦ లోల విశాల మృగాక్షీ! యియ్యెడన్.

తే॥ ఆమ్ర పల్లవ లలిత వ ♦ ర్ణాంగి! చూడు, నమలి పిల్లలు జింక కూ ♦ నలును నీదు
మేనివన్నియ చూపుల ♦ మేల్మిఁ గాంచి, తమకుఁ జుట్టంబనియె యెంచి ♦ దాయుచుండె.

తే॥ ప్రసవ రాశిలో నిద్రించి ♦ వచ్చు కేకి, పింఛమునఁ దావి యుండుట ♦ పెట్ట గాంచి
ప్రణయ కోపాన దానిఁజే ♦ రంగ నీక, తిరుగుచుండుట చూచితే ♦ తెలివ మిన్న!

తే॥ వికచ కంకేలి నెత్తని ♦ విరుల యందు, గండుఁదుమ్మెదల్ వ్రాల బం ♦ గారునూఁదు
బొగ్గులందున లేచు ని ♦ ప్పులను పోలి, వెలయుచుంట వీక్షించితే ♦ విధు నిభాస్య!

తే॥ నాగలింగ కలిక నొక ♦ నమ్మిఁ గాంచి, పాముని తలంచి నోటితోఁ ♦ బట్టి కొన్న
నరణిఁ గని విరి మొల్లలు ♦ నలుపు చుండు, మందహాసంబు గంటివే ♦ మధుర వాణి!

ఉ॥ కోనల సంచరించు పులి ♦ కూనలు చీఁకటి ముద్దలన్న చె
న్నూనిన హస్తి పోతములు ♦ నొద్దిక గొల్లల యింటి క్రేపులన్
బూనికఁ గూడి వైరమును ♦ పొందక వీడెడు నిచ్చలేక మే
లూనిక సంచరించి చెర ♦ లాడుచునుండుట గాంచితే చెలీ! ౭౪౮

చ॥ ముడువఁగఁ దగ్గ పూలు పరి ♦ పూర్తిగఁ బూచిన గుత్స సంతతుల్
దొడిగిన పెక్కుకొమ్మలు మ ♦ ఘ ప్రసవంబులఁ దాల్చు కొమ్మలో
క్కెడ దిగి నీరమూడు క్రియ ♦ నింపగు తెల్లని పట్టువల్వకై
వడిఁ దగి తావులం జిలుకు ♦ వారిని మున్గుట చూచితే సఖి! ౭౪౯

ఉ॥ నీటగు వింటి కొప్పు లలి ♦ నెన్నుదు రొప్పు వరాలకుప్ప! యీ
పాటలి మొగ్గలందు చొరఁ ♦ బాఱఁగ లే కెలదేంట్లు మిక్కిలిన్
వాటము గాఁగ విచ్చు ప్రస ♦ వంబుల పై కెగఁ ప్రాఁకి యుండుటల్
హాటకమందు నీల మణు ♦ లంటిన చందము దోఁచుఁ గాంచితే. ౭౫౦

చ॥ పరిమితి మీఱక ద్రాగు మధు ♦ పాయులు కన్నులు తెర్వలేక బ
మ్మెర గొని సొక్కి మార్గము గ ♦ మింపఁగఁ గానక తూల, నాఁడు బం
భరములు గాంచి ముందుగను ♦ పాటలు పాడుచుఁ బోవ వెన్కఁ జేఁ
కు రహిని నేగుచుండె నది ♦ గో కనుఁగొంటివె? యంబుజాననా!. ౭౫౧

చ॥ విరి కయిసేఁత కన్యకలు ♦ వే యులవాటొనరించు నట్లు బం
గరువు హారంగు రంగరువు ♦ గల్గిన వేఁగిస కొమ్మ లిందు నీ
వరసితె? నీదు ముంగురుల ♦ యందపు ఫాలము నంట సూటిగా
బెరయు వినూత్న పుష్పముల ♦ వేడుకఁ జిందఁగఁ జేయుచుండుటల్. ౭౫౨

ఉ॥ సుందరి! తార హారమును ♦ సొంపుగఁ దాల్చు పయోధరంబుపై
నందు హరిద్ర లేపము క్రి ♦ యన్ సుర తావులు వీవఁ బుప్పొడుల్
క్రిందుగ రాలపైఁ బడుచుఁ ♦ గప్పుట చేత హిరణ్య ఖండముల్
పొందుగ వానగా విరిసి ♦ భూస్థలిఁ బడ్డ విధానఁ గన్పడున్. ౭౫౩

ఉ॥ నీ పదకంజముల్ కరఁగు ♦ నే యని హర్మ్యఁ ద్రోవ నెల్లెడన్
మోపఁగ మెత్తనౌ కరణిఁ ♦ బూవుల రాల్చిన చెట్లఁ జూడు మీ
దాపలి పూవుఁ గొమ్మలు సు ♦ ధామయదేహ! యుడుక్కఁ బోలి మో
పోపని నీదు కౌనునకు ♦ నొప్పగ లేక చలించె నెల్లనై. ౭౫౪

సీ॥ నీరజంబులఁ బోలు ♦ నీ పాదముల నీదు, పాదంబులం బోలు ♦ పల్లవముల
ముసరిన తేఁటి గుం ♦ పులను గాంచెదె? చీఁక, టిం బోలు నీవేణి ♦ కీవి యొప్పు

మొగుళ్లుల(జూచెదే? భుజముల( బోలిన, యెల వెదుళ్ల గుములు ♦ లలిని గంటె?
ఈకోకిలలపాట ♦ లా కేకి గమియాట, లీజింక చూపుల ♦ హేల కంటె?

తే॥ కలికలును సూనములు నిండ(♦గలుగుకొమల(, బక్షులటనట(గూర్చుంట♦వర్ణ్ణి వ్రాయు
పలుతెగల పూల పత్తుల ♦ పెలసనంబు, వజలు తెర చీరలం బోలు ♦ వాని( గంటె.

చ॥ అనుగల మొందు జానకికి ♦ నర్యమ వంశ్యు( డిటుల్ వచించుచున్
దనియు విహార పద్ధతిని ♦ దాటిని చాల నతిక్రమించుచున్
దినమణి యస్తశైలమున( ♦ దేరును నిల్పుట గాంచి రాఘవుం
డెనసితి మంచు( బల్కెను ము ♦ నీశ్వర వాటము( జిత్రకూటమున్. ౬౭౬

రాముడు భరద్వాజు నాశ్రమము చేరుట

తే॥ మించు ప్రేమను మనసు పూ ♦ రించువాడు, చిరము తిరముగ సిద్ధికై ♦ చేయుతపము
ఫలము గనుటెఱింగిన భర ♦ ద్వాజ మౌని, ప్రాణి భవరోగ వైద్యుని ♦ గానవచ్చె.

క॥ గొడుగును దండము కుండిక, జడముడులును జింకతోలు ♦ సంధించి వెనన్
దడ(బడక త్రోవ(గాంచుచు, నడచి యెదురు వచ్చె యోగి ♦ నాథుం డటకున్. ౬౭౮

సీ॥ నాల్గు వేదములు ఘ ♦ న క్రమ పదరీతి, నటనంబు సలిపెడు ♦ నాల్కవాడు
పలువ సృజించు ప్రా ♦ ణులు సమస్తం బొక, రూపున( గాంచు కా ♦ రుణ్యమూర్తి
యెల్ల లోకమ్ముల ♦ సృష్టించు నేర్పున, హరినాభి( బుట్టిన ♦ యపర ధాత
మునినాథ నికరంబు ♦ ఘన శిరోమణి యగ్ని, పూజ తప్పక చేయు ♦ పుణ్యమూర్తి

తే॥ రాగ రాఘవేంద్రు(డునుమా♦ర్చనము చేసి, మునిపదములకు మున్మ్రొక్కు♦మ్రొక్కి లేవ
నతని గాఢ పరిష్వంగ ♦ మాచరించి, తపసి వేషంబు( గాంచి చిం ♦ తయు నహించె

క॥ చిరము ధరనేల(దగు నీ, తరుణంబున( దపసి రూపు ♦ దాలిచి వనులన్
జరియింప వచ్చు కారణ, మరయ( దగున యేని తెల్పు ♦ మా? యని యడుగన్

చ॥ జనగిన వృత్తి మాతనికి ♦ స్పష్టముగా వివరింప మౌని ని
ష్ఠురగొని యిట్టి చెద్దు ప్రభు ♦ నెంచునె యీ యుగమందు నక్కటా!
జరుగక తప్పునేమి విధి ♦ చక్కటి; గొప్ప తపంబు చేయదీ
ధరణి యటంచు( జాల( బరి ♦ తాపము నొందెను డెందమందునన్. ౬౮౦

ఉ॥ కోమల కమ్ర వాక్య వరి ♦ బింబ సమోష్ఠి విదేహ కన్యతో
శ్రీశనిభుండవౌ నను ము ♦ హీం బరిపాలన సేయు మంచు భూ
మీశుడు నాహితుండు వచి ♦ యించి యనంతర మిట్లు పంపి జీ
వాశ గడించువాడు భువి ♦ నాఱడి( బొందక యుండు( జెల్లరే ౬౮౧

చ॥ తొడరికి గాఁగ సౌఖ్యమును ♦ దుఃఖము వచ్చుట సాజమేకదా?
ప్రడమిని జేహి చేయు తన ♦ పుణ్యము పాపము చేత నవ్వియుం
బొడరును మిన్న కిక్కరణి ♦ దుఃఖము నొందిఫలంబె? యంచుఁ దాఁ
దడవుచు రాముదేహము ము ♦ దంబునఁ దోకొని యేగె నింటికిన్.

ఉ॥ పూతగుణుండు యోగికుల ♦ పుంగవుఁడాదటఁ దోడి తెచ్చి ప్ర
స్వీతఫలంబు చూపి గుణ ♦ పేశల వాక్కులనాతిథేయముల్
బ్రీతిగఁ జల్పి కాయలను ♦ పండ్లనొసంగి తనూజులం బలెన్
బ్రీతిగఁ జూడ రాఘవులు ♦ వేడుక నిల్చిరి రేయి యచ్చటన్. ౬౬౪

తే॥ ఇతనితో మనమిట వసి ♦ యించు కతన, సుగతి గలదని తలపోసి ♦ సుజనహితుని
రాముఁగని భరద్వాజుండు♦ప్రేమతోడఁ, గలదు వచనీయమని యిట్లు♦పలుకఁదొడఁగె

చ॥ కలపిట నిండుగా జలము ♦ కాయలు పూవులు పండ్లు దుంపలున్
గలిగిన చింతలుం దొలఁగుఁ ♦ గ్రచ్చుఱఁ బుణ్యము వృద్ధి నొందెడున్
గలుగద యింతకంటె మఱొ ♦ కండు ప్రశాంత సుఖస్థలంబు మీ
రలు మముగూడి యుండినఁ గ ♦ రంబు కృతార్థుల మౌదు మిమ్మహిన్.

శా॥ అంతర్వాహినియౌ సరస్వతియు సూ♦ర్యాత్మీయసంజాత యీ
ప్రాంతంబందె సురాపగం గలియు ది ♦ వ్యక్షేత్ర మీతావు వా
క్కాంతుండిందు వసింపఁగా నెడఁద ను ♦ త్కర్షించు మా బోటికిన్
చెంతంజేరఁగ దుర్ఘటంబు లభియిం ♦ చెం బూర్వపుణ్యంబునన్. ౬౬౭

చ॥ అనియిటు పల్కు మౌనిఁగని ♦ యంజలితో రఘురాముఁ డిట్లనున్
మునివర! కోసలంబునకుఁ ♦ బుణ్యతలంబిది దవ్వుగాదు మా
జనములు గుంపు గుంపులుగఁ ♦ జక్కన వచ్చి వసింతు రిందు మా
యునికి నెఱింగిరేని యది ♦ యొప్పుదు మీరు గ్రహింపఁ జాలరే? ౬౬౮

ఉ॥ నావుడుఁ దాపసేంద్రుఁడను ♦ నాయమ యిద్ది నిజంబ యొప్పితిన్
వారిరి నీవనంబుఁ గడ ♦ వన్ దశయోజన దూరమందునన్
దేవతలెల్ల బ్రాంజలి ను ♦ తింపఁగ నొప్పిన చిత్రకూటమే
నీవు వసింపఁ దగ్గ దది ♦ నిక్కము నాకముకంటె నింపగున్. ౬౬౯

తే॥ మరిపమున నిట్టులను యతి ♦ వరునకెఱఁగి, మువ్వురును చని పిల్లన ♦ గ్రోవులూఁదు
గొల్లపల్లె లుపత్యక ♦ లెల్లఁగడచి, యమునఁ గాంచిరి కడఁక మ♦ధ్యందినమున. ౬౭౦

శా॥ సారంగంబులు నీరుద్రావుటలు ఘా ♦ స్వద్వంశ సింహంబు లో
ప్పారం గాంచి పవిత్ర వాహినికి వా ♦ స్తాబ్జంబుల నొడ్డి వి

స్ఫారంబైన ధరా పరాగము విడన్ ♦ స్నానంబు గావించి కాం
తారాహారముఁ గొంచు నిల్చి రగ బృం♦దచ్ఛాయ విశ్రాంతికై. ౬౨౧

ఉ॥ అవ్వల వాహినిం గడుచు ♦ టారయుమా యన లక్ష్మణుండు తా
నవ్వనిఁ గల్గు వంశముల ♦ నంటఁగఁ గట్టి కలంబు చేసి పై
జవ్వనియున్ రఘూత్తముఁడు ♦ చయ్యన నెక్కఁగ రెండు చేతులన్
మవ్వపుఁ దెడ్లుగా ఝషము ♦మాక్కని త్రోచుచు దాఁటె నన్నదిన్ ౬౨౨

తే॥ రాము తమ్ముని భుజ మంద♦రంబు తిరుగ, నొక్క ప్రక్క నీరంబు తూ♦ర్పుదధిఁ జేరె
మిగులు జలములు పడమటి ♦ మేరఁ జేరెఁ, దెప్ప వైళంబ యావలి ♦ దిక్కుఁ జేరె. ౬23

ఉ॥ నారలు దాల్చియుం ద్రిభువ ♦ న ప్రతిమానులు దంతివైరి గం
భీరులు తీర మెక్కియట ♦ పిం బహుదూరము వోయి కొమ్మలున్
వేరులు మాఁడి ధారణియు ♦ వేఁడిమి నొంది కనంగఁ జిత్తమున్
నీరుగఁ జేయునట్టి యొక ♦ నిర్జల భూమిని గాంచి రయ్యెడన్ ౬౨౪

ఉ॥ జానకి యాభువిం గడవఁ ♦ జాలదయంచు విభుండు చింతిలన్
భానుఁడు శీతభాను చెలు ♦ వంబునఁ జందన శీతలత్వముం
బూనెను మాఁడి నల్లనగు ♦ ప్రోడులు వెంటనె పల్లవించె ఘో
రానల మంత నంబుజ వ ♦ నాకృతి నొందె మనోహరంబుగన్. ౬౨౫

ఉ॥ వేఁచిన విత్తులట్టి కటి ♦ వేంద్రపు రాళులు కోసి మెత్తగా
వైచిన పూలఁ బోలినవి ♦ వేఁగిన తీఁగలు నన్నెఁ గోటలం
బూఁచిన చిల్కువోయి సుధ ♦ వొంది భుజంగము లుండెఁ దృప్తిమైఁ
దోఁచిన మేఘముల్ గురిసెఁ ♦ దుంపురులన్ భువనంబు చల్లఁగాన్. ౬౨౬

తే॥ హింస్రకులగు వేటరులు ఋ♦షీంద్రులైరి, యాఁకలియె లేక పగవీడి♦యలరి తడవు
పులుల కడఁ జేరి సారంగ ♦ పోతకములు, పాలు ద్రావ సాగిన యవి♦ భయములేక

తే॥ కొండ చిలువలు క్రూరంపుఁ ♦ గోపమీఁగి, నీటదిగినవి వోలె శాం ♦ తిని వహించె
వంశములు చిటపెటమండు♦వరుసహాని, కుందరదనలబాహుల♦కొమరుదాల్చె. ౬౨౭

చ॥ కనవు పెరింగి పచ్చనగు - కంబళముం బఱపించి నట్టి సాం
పెనఁగె మయూరముల్ పురుల - నింబుగ విప్పుచు వేశ్యలంబలెన్
బొనఁగఁగ లాస్యముల్ సలిపెఁ - బోయెడు త్రోవల గండుఁ దుమ్మెదల్
దెనలను వైణికాళి బలెఁ - దృప్తిగ గానముసేసె నయ్యెడన్. ౬౨౮

చ॥ ఫలము లకాలమయ్యుఁ బరి - పక్వములై యిల వ్రాలుచుండెఁ దుం
ఫలు తమ వేళ్లతోడ వెలి - వాఱి కనంబడె భూమియెల్లఁ బూ

వ్రులఁ దరుజాలముల్ సొగసు - పూనిన చానలఁ బోలెఁ; బ్రేమ మ
గ్గలముగఁ గూర్చు శీలమున - కంటెఁ దపం బొకరుండు గల్గునే? ౬౮౧

తే॥ బోయ పల్లెయు మునిపల్లె - యాయెఁ గెంపు, వాలె నెడనెడ నారుద్ర-పురుగులొలసె
వృక్షములయందు చింతించు-పెంటులఁ గని, గండు కోయిలల్ ప్రియమున-గారవించె.

చ॥ వెనుకకు వచ్చువేళ విని ♦ పించిన నాథులఁగాంచి ప్రాణముల్
తనియఁగఁ గౌగిలించుకొని ♦ దాడికి నంపిన యావతంబు నె
మ్మనముల కై వడింగుముల ♦ మాఁడిన యమ్మరు భూమి, గెల్చి వ
చ్చిన ప్రియులం గనం జెలఁగు ♦ చేతములం బలె నయ్యెఁ జల్లనై. ౬౮౨

మ॥ మరుభూమిస్థలి దాఁటి ముప్పు రెల రే ♦ మన్నీఁడు గర్భంబునన్
మఱుఁగన్ గర్జిలు మేఘపాళిఁ గని సం ♦ భ్రాంతాంతరంగంబుతోఁ
గరిణీవారముగాఁ దలంచి గజముల్ ♦ కై సాఁచు నెత్తైన భూ
ధరముం గాంచిరి చిత్రకూటము మునీంద్ర ధ్యాన సంవాటమున్. ౬౮౩

## ౮ చిత్ర కూట పటలము. (౫౮)

చ॥ వినుత సురాళికిన్ మనకు - వేఱిమి నొందక యొక్కయాకృతిన్
మొనసి వినిశ్చలం బయిన - పుణ్య పథంబునఁ బోవు రాఘవుం
డనఘుఁడు సీతకా శిఖరి - యందలి సుందర దృశ్య వీక్షచేఁ
బొనరు పథిశ్రమంబు మఱు - వుచ్చుచు నిట్లను నిఁచుపల్కులన్. ౬౮౪

తే॥ అలరుఁబోఁడి! చూడుము యుప-త్యకతలముల, నేలకులతీవియలును త-మాలములును
నీరదములు వారణములు - వేఱుపఱచి, కాంచరానట్టి కరణిని - కాననయ్యె. ౬౮౫

తే॥ కువలయాక్షిరో! కాంచుము - కొండమీఁది, యురణములుమరకతరత్న - కిరణసమితి
బలయు భానుని పచ్చని - వారువములఁ, బోలి విలసిల్లు చున్నవి-పూతచరిత! ౬౮౬

తే॥ మదగజంబు లడఁగు పెద్ద-యుదరములను, దొరయు పాములపొరలు వె-దుళ్లయందు
దగులు కొని కదలుచు నయోధ్యా - పురమున, సౌధశిఖర ధ్వజము లనఁ-జాలెఁగంటె!

తే॥ పగడములు పొదిఁగినయట్లు-ప్రభలు వెడలు, శైల పార్శ్వంబు లందెల్లఁ-బాలఁబోలు
చమర వాలముల్ గదల వి - ద్రుమగిరీంద్ర, జనిత నిర్ఝరిణింబోలు - చాయ గంటె!

తే॥ కుపిత సింహా పాటిత గజ -కుంభములను, రాలుముత్తెముల్ మగువల-ప్రణయజనిత
కోపవేళను రాలు కుం ♦ కుమ విలిప్త, మౌక్తికములన నొప్పారు ♦ మగువ కంటె!

తే॥ శశికి విడిదిగా నెత్తిన ♦ చంద మొప్ప, గొనబు కెంపు సొంపులు నింపు♦కొండకొమ్ము
హార కపర్దము గాఁగ నం♦ దలరు ఝురము, లందు వసియించు గంగ నా♦నడరెఁగంటె

తే॥ తలల మానికములతోడఁ దరలు పన్న, గములు చూడఁగా మదకరీంద్రములు కెంపు
ముఖ పటంబులతోఁ బోవు మురువు దోఁచెఁ, గంటివే సుధామయి! కంటి కలువుదీఱ.

తే॥ రత్నఘటయుగళమును దారంబు మోచు, ననువుఁ బోలు కౌనొప్పు లతాంగి! కంటె
ననుచు చంపక వనములు శుభముఁ గప్ప, నందు చొచ్చి పోయెదు క్రియ నబ్జుఁడొప్పు

తే॥ ఆకు రెమ్మలఁ గొని మూఁగు - నళులఁ దోలి, ప్రేమయుం గొసరి కరిణికి - నానఁ గరము
చేత నందిచ్చు నెలవంకఁ జెనయు దంత, ములను గల హస్తిఁ గాంచితే - తలిరుబోణి!

చ॥ మనుపఁగఁ గర్తయైన హరి మాయను నడంగి కనంగ రాకయు
న్నను విజితాత్ములైన ముని నాథులకున్ జయులైన యట్టి భం
గిని తనయందు డాఁగి కొను కింపురుషావళిఁ గానిపించు హేం
తనము వహించెఁ గాంచుమివి త్రస్తకతా పటికంపు బండలన్. ౬౯౪

ఉ॥ ఆడెదు నెమ్మికం బొఁగడు చందనుఁ నొందిన కోకిల స్వరా!
మోడి యొడవంతోఁ బతుల మోములఁ గాంచక యల్కనూను నా
చేడెలు తామె వల్లభులఁ జేరఁ దపించుచు రోయునట్లుగాఁ
బాడెడి కిన్నరాంగనల పాటల వైఖరి వింటె? యుగ్మలీ! ౬౯౫

ఉ॥ ఎక్కడు విల్లువంటి నుదు రించుక వంచి కనుంగొనన్ వెదు
ళ్లక్కడ నక్కడన్ దగుల నారఁగఁ గాఱు మరంద బిందువుల్
మిక్కిలి, యందు వేఁటరులు మేగలి దుంపలఁ ద్రవ్వటించు ప
లిక్కల నింపెఁ జూచితె య హీన సతీత్వ మహిష్ఠ జీవమా! ౬౯౬

తే॥ ఎలమితోఁ గుతుకంబుతో - జలకమాడు, నాఁడు కోఁతి నిర్ఝర జలం - బలమి చల్ల
నెదుటి దరిఁజేరి గడ్డయి - యొసఁగు మొగులుఁ, గలఁచి చల్లులాడెడు మగ-కపిని కంటె!

తే॥ వత్తిలేనట్టి యమృత దీపంబు! యెండ, వంటి పరిధి కాంతులు స్థిర - త్వంబునొందు
కెంపు గుండులు వెవ్వేఱ-క్రిందికి దిగు, వెక్కురవి బింబములఁ బోలి - వెలిఁగెఁ గంటె!

తే॥ శీలమా యరుంధతికిని - చెప్పుజాణ! ఇమ్మహావని వేఁగిస - కొమ్మలెల్ల
స్వర్ణ పుష్పంబులం జల్లి - పావములకు, నెఱఁగి లేచు వారిని పోలు - తెఱఁగు కంటె!

తే॥ తలిర్చుఁ బోణి! యుష్ణకరుఁడు- తడవు నట్టి, శిఖరిపైఁ గొజ్జఁ చేల్గాచు -చెలువ లరసి
పిట్టలందోల నొడిసెల - విసరు మణులు, మింటఁ జుక్కల మాడ్కిని- మెఱయుఁ గంటె!

తే॥ ఎఱుకు లగురు కట్టెలఁ గాల్ప- నెగయు పొగయు, మునుల హోమకుండమ్ముల- మొనయు
గలిసి పెనుగిరి శిఖరంబు-కరణిఁ బర్వె, రాజవదన! కంటివె యంబ-రంబు దెసను. [పొగయుఁ

చ॥ గుమగుమ గుప్పు వాసనలఁ - గూడిన దీర్ఘ సునీల కేశ భా
రమునఁ జలించు కౌనుగల రామ! వియన్నదిలోన బుఋషు నం

ఘుము నటె మీాలు గాన వగు ♦ కై వడి నట్టిన నిర్ఝరంబులన్
గొమరుగ రత్నపఙ్క్తుల వెలసి ♦ కుప్పలుగాఁ గనిపించుఁ గాంచితే॥ ౨౦౨

తే॥ పలుపు కెంపు బండలలోన ♦ నిజము కోనుచుఁ, బచ్చబండలలోఁగానఁ♦బడుచునుండు
కినుక గొన్న విద్యాధరాం ♦ గనల యడుగు, లత్తుకల జాడఁగంటివే ♦ లలితవాక్య!

తే॥ జలకమాడు రంభాదుల ♦ జడలనుండి, విడిచివైచిన విన్నుమ్రాని ♦ విరులతోడ
జారలివచ్చు రత్నములతో♦మెఱపు వలపు,గలిగి పాఱుఝరులఁ గంటె? కలికిమిన్న!

తే॥ వేఁటరులు చేలఁగావంగఁ ♦ బెట్టినట్టి, పలక లెత్తి వాయించు కోఁ ♦ తులను గంటె!
అందికొని చేత నెలవంక♦కందుదుడుచు, గోలయగు కొఱవతఁ జూచి ♦ తే?లతాంగి!

తే॥ మాధవీ నికుంజములందు ♦ మగలఁబాసి, వేల్పు మగువలుండిన జాడఁ♦ దెల్పుచుండ
నల్లనై మాఁడినట్టి యా ♦ ననలతోడి, తల్పములఁ గాంచితే? నహా♦ధర్మచరిత! ౨౦౬

చ॥ తలఁచిన యట్టి దేవసుధ ♦ తప్పక యానిన వారి మాడ్కిఁ బే
రెలమిని పొందు జానకి! ర ♦ హింపఁగ నీపెనుమ్రాఁకులందు దీ
వలఁ దగిలించి యుయ్యెలల ♦ వారక యూఁగుచుఁ జెంచువాండ్ర చె
ల్వలు రహిఁ బాడఁగా నళున ♦ పక్షులు వచ్చుచునుంట గాంచితే!. ౨౦౭

తే॥ మేనకాదులు క్రీడించి ♦ తానమాడఁ, గలపమును కుంకుమముఁ గల్వ ♦ కంబు లించు
మంగళ ద్రవ్యములు గలి ♦ యంగ నీటి, తుంపురులు పరిమళముఁ♦బొందుటను గంటె!

తే॥ అద్దుకొని మూఁడు జాలకే ♦ యధికమైన, చల్లఁదనము పాం♦థులకు నొ♦సంగుచున్న
శిఖరరాజంబు సూర్యుండు ♦ చేరమేటి, ముకుటముం దాల్చు తీరునఁ♦బోలెచెఁగంటె

తే॥ మానికంపు బండల మీఁద♦మలసి నెదురు, పొదలు రాల్చిన ముత్తియ♦ములు వెలుంగ
సంజ మిన్నంటఁ బర్విన ♦ నక్షత్రసమితి, కరణిఁ గానంగ వచ్చుట♦గాంచుమబల! ౨౧౦

తే॥ విజిత వంశ వీణారావ ♦ విమల శుకమ! ప్రాచు మోదుగు లెడనెడఁ ♦బొలుచుచుండ
వనము మండుచు నుండెడు ♦ పగిదిఁ దోచెఁ, గాంచితే దూరభాగంబు ♦ కన్నులలర

ఉ॥ చెందొవలందు గాజులను ♦ చేర్చిన చెన్నునఁ గానవచ్చు కే
లొందిన జానకీ! కలభ ♦ యూథము శుండము తోలుసంచి గాఁ
బొంది జలంబు నించికొని ♦ పోయి తపస్సుల కుండికావళిం
గ్రందుగ నింపుచుండుటలు ♦ గాంచితె యచ్చటి చిత్రలీలలన్ ౨౧౧

తే॥ వంపుతోఁకలు కూర్మికి ♦ వంగు మనసు, గలుగు కోఁతులు వృద్ధులఁ ♦ గనులులేని
తాపసులఁ గఱ్ఱలంబట్టి ♦ దారిచూపు, చుండు వేడుక గాంచితే ♦ యుత్పలాక్షి!

తే॥ పురులు విప్పిమయూరముల్ ♦ మునులహోమ,కుండములనగ్ని వడిరాఁజు♦కొనఁగ విసరు

చుండుటలు చూచుచుం కొక్కె♦శోదరీ! ప్ర, శస్త్రయతుల మహిమనెన్న♦శక్యమగునె?

తే॥ చెట్లఫలముల రాల్చెడు ♦ చెడుగుణంబు! చెలఁగు కోఁతులు ప్రతిని ♦ చిక్కదీసి
పోగుచేసి జందెములకై ♦మునుల కొసఁగు,చుండుటలు కాంచుచుంటివే♦యువిదమిన్న!

తే॥ మావి పనస యరఁటిచెట్ల ♦ మంచిపండ్లఁ, దెచ్చి యిచ్చు కీశమ్ములఁ ♦ దెఱవ! కంటె
దుంపలం ద్రవ్వికొని భక్తి ♦ తోడఁ దెచ్చు, కిటుల నిటఁ గంటివే పైఁడి ♦ కీలుబొమ్మ!

తే॥ కొండవరి జొన్న రాగి కం ♦ కులును వెదురు, బియ్యమునుములు నీ నన♦చెయ్యివంటి
నోళ్లుగల కీరనికరమ్ము ♦ మళ్లనుండి, తెచ్చిమునుల కిచ్చుట గంటె ♦ మచ్చెకంటి!

తే॥ దంతములు తేజరిల్లు మ♦ దావళముల, నెత్తుకొని మ్రింగు భుజగంబు ♦ లుత్తమజన
భాతి వినతిమై జటిలులు ♦ పదములూని, త్రొక్కు మెట్లగు టరసితే ♦ నిక్కలాఁడి!

తే॥ చపలనేత్ర! యీకొండపైఁ ♦దపముచేసి♦ కన్నుల ముదశ్రువులు కుండ ♦ కరణిరాల్చు
వారలకు ముక్తినీయ దే♦వతలు వచ్చు, మింటి తేరు లెండలఁ బోలె ♦మెఱసెఁజూడు

చ॥ తపనుని మ్రింగి యాజ్యమును ♦ త్రావిన కుంతముఁ బోలి కాలుఁడుఁ
విపుల భయంబు నొందు కడు ♦ విప్పగు కాటుకకంటి! జానకీ!
ఉపగత సూతికాశ్రమము - నొర్వఁ గరేణువులన్ భరించి త
ద్ద్విపములు నొవ్వనీకొదవి ♦ తేటిచి పట్టుచునుంటఁ గాంచితే!. ౭౨౦

తే॥ నీను మైకాంతి మెఱుపని ♦ నిశ్చయించి, ఫణులు పుట్టలఁ దూఱుట♦పడఁతి! కంటె
జలద నాదంబు సింహగ ♦ ర్జనమయంచుఁ, గలఁగిపాఱు వారణములఁ♦గలికి! కంటె.

చ॥ అఱని గృహస్థ ధర్మమున ♦ యుండె తపంబును సత్యమున్ దిటం
పఱచిన యాజి పుత్త్రికుఁడు ♦ పైదలి కిట్టి వినోదముల్ ముదా
కరముగఁ జూపుచుం జని సు ♦ కర్మలు తాపసు లందు కానరా
నెఱఁగి మునీంద్రవర్యులకు ♦ నెచ్చగు విందయి యుండె నచ్చటన్. ౭౨౨

క॥ వెసఁగాల నేమి నాఁజను, నసురుని యసుఱుల హరించి - యరుణంబయి యా
కసముప వెలసెప చక్రము, పసదోఁచెం బశ్చిమాద్రి ♦ భానునితీరుల్ ౭౨౩

తే॥ చక్రదారిత దనుజవి ♦ స్తారదేహ, గళితరక్తంబు నా సంజ ♦ కావి పరవె
వానినోర విఱుగు కోఱ ♦ పల్లువోలె, నంద మొందెను మింటలేఁ ♦ జందమామ. ౭౨౪

క॥ సుదతులకు ముఖవికాసము ♦ పొదలించుచు నలిన పుష్ప ♦ ములు ముకుళించెన్
పదపడిగగనముఁ బోలిన, ప్రహ్లాదముల రిక్కలను పోలి ♦ యలరెం గలువల్ ౭౨౫

తే॥ ఆఁడు మగ కోఁతులటమాకు-లరయుచేరెఁ, బిడులుదంతులుసానువుల్-వెదక వెడలెఁ
గూన పిట్టలు నీడముల్ - గానఁ బోయె, జ్ఞాన వేద్యుఁడు సంజక - ర్జముల కరిగె ౭౨౬

తే॥ కొన్ని పువ్వులు ముడిఁగెను-గొన్ని విడిగె, రామునకు లక్ష్మణునకు సు - ధామయి యగు
జానకికి హస్తనేత్రకం - జంబు లపుడు, సిరజంబులకై వడి - నేముండింగె ౨౨౮

## లక్ష్మణుఁడు పర్ణశాల నిర్మించుట.

క॥ ఉత్తముఁడు సుమిత్రాసుతుఁ, డత్తటి తనుమధ్యతోడ ♦ ననఘుం డుండన్
జిత్తమున నెంచి యచ్చటఁ, దత్తఱమునఁ బర్ణశాల ♦ తగ నిర్మించెన్. ౨౨౯

సీ॥ పంగ కఱ్ఱల నాటి ♦ పైన నడ్డంబుగాఁ, బొడవైన వెదురులఁ ♦ బొందు పఱచి
నడుమ నిట్రాడుల ♦ నాటి పై వాసంబు, లమరించి పెండియ ♦ లణఁగఁగట్టి
శాక పర్ణంబుల ♦ జానుగాఁ గప్పిపై, బోద కసవు వైచి ♦ బొద్దుగాఁగఁ
బ్రక్కల వెదురుల ♦ బ్రద్దల నల్లి మ, ట్టిని మెత్తి మణిగాన ♦ మొనరఁజేసి

తే॥ జానకికి రామునకు వేఱు ♦ స్థలము లుంచి, వాస్తు శాస్త్రక్రమముగ నెల్ల ♦ పనులు తీర్చి
లోనఁ గుంకుమ పంకంబు ♦ తోన యలికి, గోడలకు నదీ రత్నముల్ ♦ కూర్చి యంత.

తే॥ బర్హిబర్హవితానంబు ♦ పరఁగఁగట్టి, కత్తిఁ గొని వ్రేలు ద్రచ్చులఁ ♦ గత్తిరించి
చుట్టు వెలుగు వెదుళ్లతోఁ ♦ గట్టి ననలఁ, బఱచి కొవ్విరుల్ చల్లి ♦ తల్పం బమర్చె.

ఉ॥ ఈవిధి లక్ష్మణుండు రచి ♦ యించిన యొప్పగు పర్ణశాలలో
దేవతలన్ భజించి జగ ♦ తీపతి యంబుజగర్భునందు న
జ్ఞావళి నన్ను బోఁటి జను ♦ లందుఁ జరాచర కోటియందు నొ
క్కవిధి నొప్పు వాఁడు తన ♦ యింతినిఁగూడి వసించె నచ్చటన్. 23౧

ఉ॥ మాయను నీఁగినట్టివగు ♦ మానసముల్ శ్రుతులున్ సుధాబ్ధియుం
బాయని తొల్లి కెంకియు న ♦ మస్తము నియ్యెడె యంచుఁ బల్కనా
చాయను లక్ష్మణుం డు కడు ♦ చాతురిఁగట్టు కుటీరమందు సీ
తాయుతుఁడై రఘుప్రభుఁ డె ♦ ధం బరితృప్తి వసించె నత్తఱిన్. 23౨

తే॥ జానకీ సుకోమల - చరణయుగళి, కటు శిలాతల మార్గంబు ♦ గడవ నడచెఁ
దమ్మ కరములు గుడిసె నొం - దంగఁ గట్టె, సాయమే లేని వారికీ ♦ జగతిగలదె? 233

క॥ అని చింతించుచుఁ దమ్ముని, గనుఁగొని యీపర్ణశాలఁ ♦ గట్టెడు పని యెం
దున నేర్చితి వని నిలువక, కను గొలుకుల నశ్రుపులను ♦ కార్చెను తోడ్తోన్. 23౪

చ॥ పొలుపగు సంపదన్ భరత ♦ పుత్త్రున కిచ్చిన తండ్రి యానతిన్
వెలలి వనంబు చేరి బహు ♦ విశ్రుత ధర్మముఁ గాచి భాస్కరుం
బలె వెలిఁగించు సన్నుతి ను ♦ పార్జన చేసితి నంటకంటె నా
కులతను నీకు మిక్కిలిగఁ ♦ గూర్చితి నంటయె యుక్తమౌఁ గదా?. 23౫

చ॥ అని యిటు రాఘవుం డనఁగ ♦ నంతటఁ దమ్ముఁడెడందఁ గుంది య
న్నను తగఁగాంచి యిట్టులను ♦ నాయక! యన్నకు సేవసేతకై
యనుజుఁడు గల్గు నిక్కమిది ♦ పూరియఁ గష్ట ముఖాంకురంబు నా
టనె యుదయించి కాటనె రు ♦ టంబుగ నిల్చుచెలుంగవే యనన్. ౨౩౬

ఉ॥ ఐన నటుండ నిమ్ము పరి ♦ హారము దీనికి లేమ ధర్మమున్
మానుట కూడదంచుఁ దన ♦ మానస మందు తలంచి సేవపైఁ
బూనికయుం గుతూహలము ♦ పూర్తిగఁ గల్గిన తమ్ము చింతయున్
లోన నెఱింగి వాని యెడ ♦ లుం దొలఁగింపఁగ నెంచి యిట్లనున్. ౨౩౭

తే॥ ఉర్వి సంపదలకుఁ దుది ♦ యొండు గలదు, భావి సద్గతి యనెడి లా♦భంబుతోడి
అతుల సమ్మోద మరయ శా♦శ్వతముగాన, దీనఁగొఱఁతయేమున్నది♦ తెలియుమయ్య

తే॥ తమ్ము రాఘవుఁ డిటు సమా ♦ ధానపఱచి, యమరులు నుతింప వ్రతముల♦నాచరించె
తబిసి యగు వసిష్ఠునియాజ్ఞఁ ♦ దరలిపట్టి, దూతలేమైరొ వారలఁ♦జూత మింక. ౨౩౯

౫. దహన పటలము. (౧౪౩)

తే॥ సత్య వాక్యులౌ దూతలు ♦ సరగ రేయిఁ, బవలు నిలువక నడచి యా♦భరతుఁడుండు
హర్మ్యముం గని తమరాక♦యతని కెఱుక, పఱుపుఁడని ద్వారిస్థితులతోడఁ♦బలికినారు.

తే॥ భరతు నానతిఁ గొనుచు లో♦పలికి వార, లరుగఁ గుతుకంబు మితిమీఱ♦నతఁడు కాంచి
రాజరత్న కిరీట నీ ♦ రాజితాంఘ్రి, యుగళుఁడగు తండ్రి సుఖుఁడయి♦యొప్పునె? యన

ఉ॥ రాజు సుఖుండనంగ యువ ♦ రాజును లక్ష్మణుఁడున్ సుఖాప్తికిన్
భాజనులే కదా? కుశల ♦ వర్తినులే జననుల్? తపోధను
డోజకు భద్రమే? యనుడు ♦ నుత్తర మిచ్చుచు దూతలెల్ల నా
రోజఁ జెలంగు వారనుచు ♦ నొంచిరి భూపతి శ్రీముఖం బటన్. ౨౪౦

తే॥ మఱియుఁ గల బంధువుల యనా♦మయము లడిగి, తండ్రి పంపిన లేఖ మ♦స్తమున నునిచి
ముద్రగల దానిఁద్వరగ వి ♦ ప్పుచు నె వారి, కిచ్చె నధికంబు గాఁగ న ♦ భీష్ట ధనము.

తే॥ మొగమునందునఁ జిఱునవ్వు ♦ మొలకలెత్తఁ, బులకములకు శరీరంబు ♦ కులకములుగ
నుబ్బి యగ్రజుఁగాంచనౌ ♦ నుత్సుకతను, నిరులవారిగాఁ జల్లెను♦భరతుఁడపుడు. ౨౪౪

తే॥ అరుగఁ బరివార పితతికి ♦ నాజ్ఞయొసఁగి, పెద్దలకు మ్రొక్కి వారి దీ ♦ వెనలఁ బొంది
యాయితంబైన తేరిపై ♦ ననుజుతోడ, నెగడి తిథివారముల గమ ♦ నింప కరిగె. ౨౪౫

సీ॥ ఏనుఁగుల్ ముందుగా ♦ నేగెను రాజ కు, మారులు బారులు ♦ తీరి చనిరి
సాయుధం బగు వీర - సైన్యము నాలుగు, ప్రక్కలఁ గ్రమముగా - బలసి వెడలె

క॥ వేఁడవు శిరసులు పూవుల, నాడవు చెలిగములు సీట ♦ నాట నెలవులన్
బాడవు పిల్లనఁ గ్రోవులు, కాఁడవు మాడువుల సుష్వి ♦ కర్ణ బిలములన్ ౨౦౯

తే॥ వెలయు మొగములు చిఱునవ్వు ♦ వీడియుండె, మాడుగులు తావి పోగలను ♦ మానియుండె
దీపములు ప్రకాశము లేక ♦ త్రిక్కియుండె, మదవతుల జడల్ సుమముల ♦ వదలియుండె

క॥ పెరిఁగినపచ్చని పైరులు, చెఱువుల నుదకములు రామిఁ ♦ జెడు లోభుల మం
దిరముల వాకిండ్ల కడన్, దిరిగెడు యాచకుల మోము ♦ తీరున వాడెన్

క॥ వేలుపులు దూరమేగఁగ, నాలుకతోఁ బలుకరాని ♦ నయమున సుక్షే
త్రాళులు పంటల వీడఁగ, నేలపాలుపుస్తకన్య సుసుఱు ♦ నీఁగు నొడలు నాన్. ౨౧౨

క॥ అటువంటి కోసలంబును, తటుకున భరతుండు చూచి ♦ తన మదిలోఁ జే
రటమట పడి చెడుగేదో, యిట నిన నగు నంచు నూర్పు ♦ లెచ్చుగఁ బుచ్చెన్.

క॥ మఱి యేగి సత్య భూషుఁడు, తఱిమెడు నరదంబు కంటెఁ ♦ దద్దయు వడిగా
నెఱుకఁ బనిచి యాలో మెఱు, పొఱయని సాకేతమును స ♦ ముత్కతఁ గాంచెన్.

తే॥ వేవెలుఁగుఁగని యిబ్బాళిమి ♦ వేల యెల్లఁ ♦ దిరిగి యలసితి నిలువుము ♦ తిందు రమ్ము
వెనుకఁ బోవచ్చునని నిక్కి ♦ పిలుచునట్లు, గాన నగు ధ్వజ పటములఁ ♦ గానఁడయ్యె.

తే॥ ధర్మ పద్ధతి నార్జించు ♦ ధనము నెల్లఁ, గోరు వారలు వచ్చి కై ♦ కొనుఁ డటంచుఁ
గీర్తికాములు పిలిచెడు ♦ కేకవంటి, మురజ నిస్వనములు మున్ను ♦ మొనయ వినఁడు

క॥ సధనుల నుండి యిభంబుల, నిధులను దొడ్డగొనువారి ♦ నెఱిఁ గానకలన్
బుధులును గాయకులును మా, గధులును కొనిపోవు టతఁడు ♦ గానఁడు నగరిన్.

క॥ ఆవుల మద వారణముల, మావులఁ బెన్నిధులఁ బడసి ♦ మన్ననతో భూ
దేవతలు నడచుచుండుట, భూవిభునందనుఁడు కనఁడు ♦ పుర వీథులలో.

క॥ పురమున గాయను లిండ్లన్, ద్విరేఫములు వీణియలును ♦ తీయని సప్త
స్వరములు వెలిపఱుపమి సుం, దరుల కురుల కరణి నొప్పెఁ ♦ దార రహితమై. ౨౧౯

క॥ కరులను పల్యంకికలను, హరులను రథములను బండ్ల ♦ నరిగెడు వారె
వ్వరు లేక నగరవీథులు, శర విరహిత సికత సహిత ♦ ఝరముం బోలెన్. ౨౨౦

క॥ ఉత్తమగుణియగు భరతుం, డత్తఱి నగరంబు కాంతి ♦ యందము చెడుటల్
చిత్తమునఁ దలఁచి యను జా!, యెత్తెఱఁగున నుండెఁ జూచి ♦ తే పురి? యనియెన్.

క॥ అరివీర భయద భుజబల!, పుర సంస్థితి చూడఁ జూడఁ ♦ బొలుపఱి దామో
దరు సతి వీడిన కలశాం, బు రాశి గతి నొప్పుచుండె ♦ బుధ నుత! కంటే, ౨౨౧

తే॥ రత్నభూషుండు సింహప ♦ రాక్రముండు, నైన శత్రుఘ్నుఁ డిరుగేల ♦ నంజలిగొని
యిప్పుడు గలిగిన వొక వొడ్డ ♦ యొకరు సతము, చెడని పురమును సిరిపిడు ♦ చెన్నుదోఁచె

## భరతుఁడు కైకగృహంబున కేగుట.

తే॥ అట్లు పలుకుచున్నంతలో - స్యందనంబు, నగరుచేర వేగ భరతుండు ♦ దిగి బిరబిరఁ
దండ్రివసియించు నట్టి సౌ ♦ ధంబుచేరె, మనమునందున శంకలు - మల్లడిగొన. ౨౨౪

తే॥ ఉద్ధతభుజుఁ డుత్కంఠతో ♦ నుర్వినాథుఁ, డెలమివాడుకవసియించు ♦ గృహముసొచ్చి
యచటఁ గానక యిది యల్ప ♦ హేతుకంబు, గాదటంచు శంకించె మి ♦ క్కుటముగాఁగ

తే॥ జనకు వెదకి విశుద్ధ హ ♦ స్తముల తోడ, వందనమునేయ నుంకించు ♦ భరతుఁగాంచి
యొక్కచేటిక మీతల్లి ♦ యుత్సుకతను, పిలుచు చుండెను రండని ♦ పిలుచునంత. ౨౨౬

తే॥ వచ్చి తల్లికి మ్రొక్కన ♦ వ్వనిత తనయు, మనసు తనివొందఁ దడవుచుఁ ♦ దనదుతల్లి
దండ్రి సేమంబులడుగ నా ♦ తఁడు వారు, భద్రయుతులని పలికి యా ♦ వలనుకాంచి

శా॥ తల్లీప్రేమము పెల్లగిల్లఁగను మా ♦ తండ్రిన్ వడిం గాంచ నా
యుల్లంబల్లల నాడుచున్నయది యెం ♦ దున్నాఁడో నానేత్రముల్
చల్లంగాఁ గనువాఁడఁ జెప్పఁ గదె ప్ర ♦ శ్నంబింకఁ జాలింపు మే
నొల్లం దండ్రిని కాంచు పిమ్మటనె నా ♦ కుత్సాహ మొప్పారెడున్. ౨౨౮

ఆ॥ అట్లు తనయుఁ డడుగ ♦ నావంత యుల్లమ్మునందు వంతలేని ♦ యతివ తెగువఁ
బలికె నసుర బలము ♦ నడఁచిన మీతండ్రి, సురలెలర్ప దివము చొచ్చె ♦ ననుచు. ౨౨౯

ఉ॥ భగ్గునఁ గాల్చునట్టి చెడు ♦ వార్త చెవింబడ నెత్తివెండ్రుకల్
దిగ్గన నగ్గిఁ గాలుగతి ♦ దిక్కఱి వజ్రముచేత రావి మ్రా
నగ్గతిఁ గూలు నగ్గతిని ♦ పృథ్విని గూలి చిరంబు శ్వాసముల్
మ్రొగ్గక తెల్విదప్పి శవ ♦ ముం బలె నుండె జనంబు జంకఁగన్. ౨౩౦

చ॥ మొగమున కాంతి మ్రగ్గ నర ♦ మోడ్చిన కన్నుల నశ్రుబిందువుల్
బుగులుకొనన్ వెనం గొఱవి ♦ పూర్తిగ వీనులఁ జొన్ప రీతి నీ
దగరము లాడ నిన్ను బలెఁ ♦ దక్కొరు లెవ్వరు డెందమందు ప
ల్కఁగఁ దలకొందురే? యిటులు ♦ కర్కశ మానస వెట్టులైతివో!. ౨౩౧

తే॥ గుహుని కంటె సుందరుండు స్రు ♦ క్కుచునులేచి, పరితపించుచు మఱినేల ♦ వ్రాలినగచి
వేఁడిగా నూర్చివేదన ♦ వెక్కసముగ, నేడ్చి యేడ్చి తుదిం గాంచ ♦ కిట్టు లనియె. ౨౩౨

తే॥ ధర్మ నిర్మూలనము చేసి ♦ దయనుచంపి, శీతలోన్నత కరుణకుఁ ♦ జెలువు చెఱచి
ఘరణ మొందితి ఘన నీతి ♦ మఱచి నాఁడ, వింతకంటె హెచ్చుగు దోష ♦ మెద్ది తండ్రి?

ఉ॥ కోపము ద్రోసి కామమును ♦ గోసి మెడందను లోభ సంహతిన్
లోపము చేసి యున్నతిని ♦ లోకము నేలు సుదార! నీప్రజన్
దాపము పాలుచేసి తగు ♦ దారిని నీకయి చూచుకొంటయున్
లోపము గాదె? యద్దియును ♦ లోభముగాక యుదారమార్గమే?. ౭౮౪

తే॥ ఇనుఁడు మొదలుగా నీకుల ♦ నృపుల చరిత, ములను క్రొత్తలు చేసిన ♦ పూతచరిత!
భర్గుమేర్వంశమగు నిల్లు ♦ భంగపఱచు, కుద్దుకొడుకు నెల్లెడఁ♦బాసిపోయి తిట్లు.

తే॥ ఆర్య! ధర్మచరిత్ర! యీ ♦ యవనియందు, ప్రముందు వార లేవంశమం ♦నందులేమి
స్వర్గమున మైత్రిగలవారు ♦ చాలఁగలరు, పోదమని యెంచి యేగితే ♦ భువనవంద్య!

తే॥ తడవు చల్లనై యున్న నీ ♦ గొడుగు నీడ, వఱలు పలు జీవ్రులిప్పుడు ♦ వాడి నిలువఁ
గల్పశీతల చ్ఛాయ నా♦ కాంక్షచేసి, వెడలి నాఁడవె నీవార♦ లిడుమఁ గుడువ? ౭౮౭

క॥ శంబరుఁ బోలిన దనుజులు, నెంబడి మఱిముట్టిరేమి ♦ విబుధులు కడగం
డ్లంబడి పరుగిడి నీచర, ణాంబుజములఁ బడిరె? దాన ♦ నరిగితె చెపుమా? ౭౮౮

ఉ॥ శాత్రవు లిచ్చినట్టి ధన ♦ సంపద విప్రులకిచ్చి దివ్యులన్
బాత్రముగా భజింపఁ దగు ♦ పద్ధతిఁ జేసితి వశ్వమేధముల్
పుత్రులఁ గంటి భక్తి శుచి ♦ పూజ లొనర్చితి వట్టి పుణ్యచా
రిత్రక! యిట్టి వెవ్వియు భ ♦ రింపని నాకముఁ జేరఁ గోరితే? ౭౮౯

తే॥ తండ్రి! రాముఁడు వట్టి హ ♦ స్తములతోడ, నున్నవాఁడని నీచేత ♦ నున్నప్రభుత
సతని కీయఁగఁ దలఁచి యే ♦ బ్రతికియుండ, సమ్మతింపఁ డనుచు నిట్లు♦జరిగితేమి?

చ॥ అరిది తపోబలంబు భువి ♦ నందమి రాముని కీవు మోద సం
భరితముగాఁ గులక్రమ స ♦ మార్జిత శీర్షకమున్ ధరింపఁ జే
సి రహిమహోత్సవంబు నిల ♦ సిల్లఁగ నీదు విశాలనేత్రముల్
గరువము నొందు భాగ్యమును ♦ కాంచవు గావలయున్ నృపోత్తమా!

క॥ భరియింపలేని చింతను, భరతుం డిటు పనవి పనవి ♦ బాష్పాకులిత
స్ఫురితేక్షణుఁడై యొకవై, కరిఁ దేవి వచించె నిట్లు ♦ కైకం గనుచున్. ౭౯౨

తే॥ తల్లియును తండ్రి గురువును ♦ దైవతంబు, జ్యేష్ఠుఁడును మేరమీఱిన ♦ శ్రేష్ఠగుణుఁడు
రాముఁడే కాన నతని పా ♦ దామలాబ్జ, ములకు మ్రొక్కెడి నామది ♦ యలఁత వోదు.

క॥ అనిన న్విని పిడుగుం బో, లిన పలుకుల నారి తేఱు ♦ లేమ కయిక నా
తనయా! జానకితోఁ ద, మ్మునితో రాఘవుఁడు వనికిఁ ♦ బోయె ననంగన్. ౭౯౪

క॥ అడవుల నున్నాఁడని తలి, నుడువఁగ శుచి మ్రింగు కరణి ♦ నొగిలి మఱియు నే
చేడుగులు నే వినఁదగినవి, కడమపడియెనో యటంచుఁ ♦ గంపము నొందెన్. ౭౯౫

చ॥ ఉలికి పడంకి ప్రసాను పడి ♦ యూర్చి లోలోమఱి రాఘవుండు కా
ల్చకు గమింప దోసము లా ♦ నర్చెనో? దైవము కోపగించెనో?
నుల విధి దార్చె నేమి? మఱి ♦ యూద తొలంగెనో? దేని చేతనో?
కలఁకె తొలంగఁ దెల్పుము క ♦ కావికలయ్యె మదంతరంగముస్. ౯౮

తే॥ చెడుపుచే రాముఁ డొక్కఁడుఁ ♦ జేయునేని, తల్లి కార్యంబు సోతె భ ♦ ద్రదమయగును
తండ్రి మరణించు పిదపనే ♦ దాశరథియు, వనుల కేగెనో? తెలుపవే ♦ యనుడుఁ గైక

చ॥ గురువులఁ దిట్టి కాదు మఱి ♦ కోపము చేతను కాదు దైవమున్
గొరయదు భానుఁ బోలి తన ♦ దొడ్డ కులంబునఁ బుట్టి నట్టి భూ
వరుఁడు సజీవ్రుఁడై వెలయు ♦ పట్టుననే యతఁడే గెఁ గానలన్
ధరణి తనూజతోడఁ దన ♦ తమ్మునితోఁ జరియింపఁ బుత్త్రకా! ౯౯

చ॥ అని తన తల్లి పల్కుటయు ♦ నాతఁడు దోసము లేద యేని యీ
సునఁ బగవారి కుట్రలును ♦ చోపవయేని విధి ప్రకారమున్
బొనరక తండ్రి యుండఁగనె ♦ పుత్త్రుఁ డరణ్యముఁ జేరుటేల? మా
జనకుఁడు పిమ్మటన్ పసివి ♦ చావఁగ నేల? వచింపవే వెసన్.

ఉ॥ అనుటయుఁ గైక యిట్టులను ♦ నయ్యొ వరంబుల నీయఁ గాంచి నే
వనులకు రాము నంపితిని ♦ వారక రాజ్యము నీకుఁ గూర్చితిన్
దనయ వియోగమున్ మదిని ♦ తాళఁగలేక విభుండు స్వర్గముం
జెనకెను నీవు నా కనులు ♦ శీతల మంద భువిం భరింపుమా. ౧౦౦

భరతుఁడు కైకను దూషించుట

ఉ॥ కైక కటూక్తి కర్ణముల - గాఁడక మున్నె శ్రవంబు మూసె ని
బ్భూకుటి దాల్చె నిగ్గువెలి - పుచ్చెను కన్నులఁ జిందె నెత్తురుల్
వాకొన మూనె రోమములు - వహ్ని కణంబులఁ గ్రక్కెఁ జెక్కులన్
సోఁకె వడంకు కాళుల వ - సుంధర వ్రయ్యఁగ మోఁదె నార్భటిన్.

ఉ॥ కాళుల నేల గ్రుద్దుటయుఁ - గంపము నొందె జగంబు మేరువున్
గాలికి వారిధిన్ సుడియు - గంధ గజంబుల నావకై వడిన్
వేలుపులెల్ల భీతిలిరి - వెక్కస మందిరి దైత్యులయ్యెడన్
గాలుఁడు కన్నులన్ మొగిచెఁ - గల్వల నూడను క్రుంకె జంకునన్

చ॥ కలఁగిన క్రూరకోపమున - గ్రాఁగిన యా భరతుండు పాప పం
కిలయగు నామె తల్లియని - గీల్కొను గౌరవముం దృజించి ని
ర్మలుఁడగు రామచంద్రుఁ డెద - మన్నన సేయుఁడ యంచుఁ జంపఁగాఁ
దలఁపక యీసడించుచుఁ బ - దంపడి యిట్లనియెం గటూక్తులన్. ౧౦౩

ఉ॥ రక్కసి వీవు నీ చెడువ ♦ రంబునఁ దండ్రి గతించె నన్నయుఁ
దక్కక కాననంబులకుఁ ♦ దారెఁ దపం బొనరింప నిట్టు నీ
చిక్కులఁగూర్చు జిహ్వికను ♦ చీల్పక నెమ్మది విన్న యే నిటన్
దక్కిన యంచు రాజ్యమును ♦ తాల్చెడు వాఁడన కానె? పాపినీ!. ౮౦౪

ఉ॥ ఇప్పను సిగ్గు లేకెదుట ♦ నే నిలుచుంటివి క్రూరరాక్షసీ!
నీవిటులాడ వా తెఱన ♦ నే ఘనరెకం గొని క్రుక్కుకుండితిన్
భూవలయంబుఁ గాచు పరి ♦ పూర్ణ గుణుండగు రాఘవుండు నన్
గావలుఁ డంచుఁ దిట్టు నని ♦ కాక క్షమింతును తల్లి యంచెదన్?. ౮౦౫

ఉ॥ క్రూర వచస్సుచేఁ బ్రభుని ♦ గూల్చితి వంపితి వన్నఁ గానకున్
గోరిక మీఱ రాజ్యమును ♦ కూర్చితి నాకయి మాయ లాఁడి! యీ
తీరొకి ధర్మమార్గమని ♦ తేర్చెదొ? యిట్లగు నేని ధర్మమున్
గోరకి యుండుఁ గాక! జను ♦ కూటము కోరఁగ నిచ్చగించునే? ౮౦౬

ఉ॥ వంచకురాలు తల్లి చెడు ♦ పద్ధతిచేత సనాతనంబుగాఁ
గాంచిన వంశగౌరవముఁ ♦ గాటికి ముంచె భరతుండు పంపినాఁ
డంచు జగంబు దూఱ విడి ♦ యంబున నా తలవంచి మానముం
ద్రెంచి చరించు కీనుఁగయి ♦ త్రిమ్మరు కంటె మరేమి గాంతునో!. ౮౦౭

తే॥ తగుఁ సతీత్వము ధర్మ ప ♦ ద్ధతిని వీడు, నిన్ను చేపట్టు పతిని ద్రుంచి ♦ దించి వరము గాంచు నీవొక పెనుభుజం♦గమవు కాక, కలికి నే?మఱి యెవ్వరిఁ ♦ గఱవ నుంటి? ౮౦౮

చ॥ పతి యసువుల్ హరించితివి - వ్యాధివొ? కావు పిసాచివీవు; జీ
వితము వహించు కంటె వడి - బిద్దుట మేలటు దోరు; నన్ను గాం
చితి స్తన మిచ్చి పెంచితివి - నింద దృఢంబుగఁ గూర్చితింక నే
వితమున నేమి గూర్చెదవొ? - ప్రేముడి తల్లివి మిన్న కుందువే? ౮౦౯

ఉ॥ సత్యము మీఱలేని జన - సన్నుతు నీవిభు నావిఁద్రావి యీ
నిత్య విలక్షణంబయిన - నిందను గాంచి ధరన్ హరించి సం
స్తుత్యముగా సుఖింతు మని - సాక్షి వాతఁడు వోవ ధేనుకా
సత్యము న్యాయముం జెనయు - పౌరులఁ గాంచియు బుద్ధిమాఱదో?౮౧౦

ఉ॥ ఇచ్చిన మాటకుం గొఱఁత - యెంచక తండ్రి గతించె రాజ్యముం
జెచ్చెర వీడుకే తగవు - సేయుట యంచుఁ త్యజించె రాఘవుం
డచ్చుగ వాని తమ్ముఁడగు - నాతఁడు తల్లి కుతంత్ర బుద్ధిచే
వచ్చిన రాజ్యమేలెనని - వాడెడు దూఱును నే భరింతునే? ౮౧౧

చ॥ జనకుఁడు విప్రయోగమునఁ - జచ్చుటెఱుంగక కైక డెందమి
యనుపుఁ మార్పు నొందఁగత ♦ మక్కట నేనని యెంచి నెమ్మదిన్
జన పరిపాలనంబు తెగఁ ♦ జల్పఁ గలాఁడని నమ్మి కానకుం
జనియెను గాక రొయ్యడయిఁ ♦ జల్పునె రాఘవుఁడిట్టి పద్ధతిన్. ౮౧౨

చ॥ తరణికులాబ్ధిచంద్రుఁడగు ♦ తండ్రి తలంపది యేదియైన నా
గురుత మహీయ సేవనము ♦ కోరి యొనర్చుచు నుండినట్టి యీ
భరతుఁడె లోపలన్ గుటిల ♦ భావము నూనెన యంచు రాఘవుం
డురవుగ నూహసేయు భవ ♦ దుగ్రవరం బొకటైనఁ జాలదే? ౮౧౩

చ॥ వనముల నగ్రజుండు కర ♦ భాజనుఁడై ఫలమూల సంతతుల్
దిన నిట నేను జీవములఁ ♦ దేఁకువ దాల్చి సువర్ణ పాత్ర మం
దున రుచులూరు నోగిరము ♦ తుష్టిగ మెక్కుట గాంచి లోన నే
మని జన మీసడించు? నది ♦ యర్హమె రామపదానుజన్మికిన్? ౮౧౪

చ॥ అడవులఁ జేరె రాముఁడను ♦ నంతనె తండ్రి గతించెఁ గీర్తితోఁ
గడలి వినంబు నా నడరు ♦ కైక వచించిన యా క్షణంబె నే
విడువక ప్రాణముల్ చెడుగు ♦ ప్రేల్పక కన్నుల నీరు గార్తుఁ బ్రే
ముడి గలవారి పోల్కి నిది ♦ బూటక మంచు జగంబు పల్కదే? ౮౧౫

చ॥ జగములు నమ్మతిం గొనునె? ♦ చావక యే నపనిందఁగాంతునే?
నగరము నందు లక్ష్మి చర ♦ ణం బిడి నిల్చునె? యేరి తోడ నీ
తగవు తలంచి చేసితివి? ♦ తప్పుడు త్రోవల నేరుచూపి రి
ట్లగడు గడించి పాడి మొద ♦ లంటఁగఁ ద్రుంచి యదేమి గొంటివే? ౮౧౬

ఉ॥ నీ కొల నోటిచే జనకు ♦ నిల్వనఁ జంపితి నింత మాత్రమా?
లోకము నాడి పోయఁ బెను ♦ లుబ్ధత నన్నను పాఱఁ దోలితిన్
లోకము లేల నిల్చితి వి ♦ లుంఠిత బుద్ధి రవంత దోసముల్
నీకడఁ గల్గునే? తెగడు ♦ నీఁగెడుమార్గము నాకుఁ గల్గునే? ౮౧౭

ఉ॥ ఏనొనరించు కార్యముల ♦ నింకను కొందఱు కన్నులారఁగాఁ
గానఁగ నిమ్ము; నాయెడఁద ♦ గానక లోకము ఱట్టుసేయు; నే
జానున నన్నమోము గనఁ ♦ జాలుదు? వంశ వినాశినీ! గరం
బానని వానిఁ జంప దను ♦ న్యాయము చెల్లెను నాదు మన్కికిన్. ౮౧౮

ఉ॥ పాపిని వైన నీనరక ♦ భాజనమా నుదరంబుఁ జేరి నేఁ
దోఁపఁగ నైన పాతకముఁ ♦ ద్రోచి మనోవ్యథ లెల్లఁ దీఱ నం

స్థాపిత ధర్మదేవతయె ♦ సాక్షిగ లోకము చూచి మెచ్చ నేఁ
దాపసి వేష మూని బెడి ♦ దంబగు కాననదపంబు పూనెదన్. ౮౧౯

ఉ॥ జ్ఞానులు పల్కు సీతి వచ ♦ నంబులె యాడితి నింతనైన నీ
ప్రాణము వీడితేని చెడు ♦ పద్ధతి యోచన సేయలేక యే
పూనిన దానవున్ వినుత ♦ పూత చరిత్రవు ధన్యురాలవున్
మానిని వౌదు దీని కీఁక ♦ మార్గము పాచిత మొందు గల్గునే? ౮౨౦

భరతుఁడు కౌసల్య గృహమున కేగుట.

చ॥ అని వచియించి యా భరతుఁ ♦ డంతట నీ చెడు క్రూర కర్మముల్
పనివడి పూని కాఁ జలుపు ♦ పాపిని యొద్ద వసింపఁ జాల నా
కొనరిన దుఃఖముల్ దొలఁగ ♦ నుత్తమ శీలయుఁ గోసలేశ నం
దనయగు తల్లి పాద నలి ♦ నంబుల వ్రాలెద నంచుఁ జయ్యనన్ ౮౨౧

ఆ॥ వెడలి యచట రెండు ♦ విధముల కౌసల్య, యడలుచుండ నామె ♦ యడుగుల కడ
పుడమి పగులు పగిదిఁ బడుచు నమ్మా! యని, యవలఁ బలుక లేక ♦ యడలెఁ బెలుచ.

ఉ॥ నాకులు సంతసింపఁ గరు ♦ ణంబుగ నేడ్చుచుఁ బల్కెఁ, దండ్రి యే
లోకముఁ జేరె? సద్గుణ వి ♦ లోలుభుఁ డగ్రజుఁ డెందు పోయె? నే
కాకినయైన యేను పడి ♦ గాఁ జను డెంచుట గోడు చూడనే?
వ్యాకులపాటు దీర్పఁ దగు ♦ వారలు మీరలు గాక యన్యులే? ౮౨౩

ఆ॥ ధూళి భుజములంట ♦ దొరలుచు మాయన్న, చరణ యుగళిఁ గాంచఁ ♦ జాలనైతి
రాఘవుండు రాజ్య ♦ రమ వీడఁ దగువాఁడె, వలదు నారు తప్పు ♦ సలిపినారు. ౮౨౪

తే॥ పాపు లెల్లరు కులమును ♦ పాడుసేయ, రేను తద్వాక్యముల నిశ్చ ♦ యింపలేదు
చెడుగు కడుపునఁ బుట్టిన ♦ చెనఁటి నోట, మదిని తాపంబు దీఱంగ ♦ మ్రందువాఁడ.

తే॥ చీఁకటులఁగొంగ మొదలుగాఁ-జెలఁగు శీల, వంశమున నొక్క-భరతుఁడు-ద్భవమునొంది
పూర్వగౌరవ మెల్లను - పాలియఁ జేసి, తార్చెనొక నింద నాచంద్ర - తారకముగ

ఆ॥ తండ్రి దివిని చేరఁ - దనయుండు వనిఁజొరఁ, గనులు లేని పగిదిఁ-గాంచి నాడు
ఘోర దుఃఖ జలధిఁ-గూలి తీరముగాన, కందె మునిఁగి మునిఁగి-యడలె ననుడు. ౮౨౭

తే॥ కులము నొర్పు సతీత్వంబు - కుదురుకొన్న, కరుణరూపిణి కౌసల్య - భరతుఁ గాంచి
రాజ్యముం గోరఁడితఁడు ని-ర్మలుఁడటంచు, నిశ్చయించి యిట్లనియెను-నెగులుతోడ

తే॥ కలుష మింతయు లేని ని-ష్కపటి వీవు, కైక వంచన మెఱుఁగవు - గాద! యన్నఁ
గట్టువడిన సింగము పోలె - గర్జజేసి, భరతుఁడిట్లను ధర్మదే-వతయు నులుక. ౮౨౯

## భరతుఁడు శపథములు సేయుట.

సీ॥ ధర్మంబు చెడఁ బ్రియ -త్నము సేయు వాఁడును, కరుణసుంతయులేని - కటికివాఁడు
పరుల వాకిటనిల్చి ♦ పరితపించెడు వాఁడు, పేదలపైనఁ గో ♦ పించు వాఁడు
ప్రాణిహింసను నొసర్చి ♦ బ్రదుకు దుష్టాత్ముండు, చామలఁ గత్తితో ♦ జంపువాఁడు
సన్యాసులకుఁ గీడు ♦ సాధించు వాఁడును, బవరాన వెన్నిచ్చి ♦ పాఱువాఁడు

తే॥ యాచనాధనమును గొన ♦ నడరువాఁడు, హరిని పరమాత్మ కాఁడను ♦ నవగుణుండు
పోవు గతులకు నేనును ♦ పోవువాఁడ, రామునకు నెగ్గుదలఁచు దు ♦ ర్మతిని యేని. ౮౩౦

సీ॥ తల్లి యాఁకలిగొని ♦ తపియింపఁ దన పాడు, కడుపు నించుకొనెడు ♦ కావరుండు
తన నాయకుఁడు రణ ♦ స్థలినుండఁ జేవిడి, వెనుకకుఁ బాఱిన ♦ పిఱికిపంద
చరణంబులంబడి ♦ శరణు వేఁడినవాని, శత్రుల కొప్పించు ♦ స్వార్థ పరుఁడు
యతి నిందకుఁడు ని ♦ యతి దూషకుండును, తెలిచుగా ధర్మంబు ♦ మఱచువాఁడు

తే॥ సభనుకూటసాక్ష్యమువల్కు-♦సాహసికుఁడు,నొచ్చువానినిమఱియుఁను♦నొంచువాఁడు
పోవు దుర్గతులకు నేను ♦ పోవువాఁడ, రామునకు నెగ్గుఁదలచు దు♦ర్మతిన యేని. ౮౩౧

తే॥ కలశ భీతిల్లి బ్రమాస్పడి - నిలుచువాఁడు, కొన్న శరణాంకమును లాగు- కొనెడువాఁడు
పోవు నరకంబులకు నేను-పోవువాఁడ, రామునకు నెగ్గు దలఁచు దు - ర్మతి నయేని.

సీ॥ అనఘుల యిండ్లకు ♦ నగ్గియిడెడు వాఁడు, నిసుఁగుల వధియించు ♦ నీచగుణుఁడు
ప్రాడ్వివాకుండయి ♦ పక్షపాతము పూను చెనఁటి, వేలుపు నింద ♦ సేయువాఁడు
క్రేపు కృశింపంగ ♦ క్షీరంబు గొనువాఁడు, నిల్లడ గొని హరి ♦ యించువాఁడు
తోడని వచ్చు పా ♦ లుకను దొంగలు బాధ, వెట్టఁ గాపాడక ♦ వీడువాఁడు

తే॥ తోడివారలాఁకొనఁదినఁ♦దొడఁగువాఁడు,కృతముమఱచినిందించుదు♦ష్కృతిపరుండు
పొందు పాపంబులేనును ♦ పొందువాఁడ,రాఘవున కెగ్గుదలచు దు ♦ ర్మతిన యేని.౮౩౩

సీ॥ ధర్మమార్గము తప్పి ♦ ధనహర్తయగుతేఁడు, నమ్మించి చెఱచు దు ♦ ర్ణయ పరుండు
తనకుల ధర్మంబు ♦ దప్పియేగెడు వాఁడు,చెల్లుననుచుఁ బీడ♦ సేయువాఁడు
శరణు చొచ్చిన తన ♦ జనమును బాధించి, పాఱిపోవఁగఁ జేయు ♦ పాలసుండు
కన్యకం జెఱచిన ♦ కడు కావరుండును, గురుపత్ని మోహించు ♦ క్రూరకర్మి

తే॥ తగుదునని రణమాలను ♦ తాల్చి శక్తి, కొలఁది పోరక పాఱు భూ♦తలవిభుండు
పోవుదుర్గతులకు నేను♦పోవువాఁడ,రామునకు నెగ్గుదలఁచు దు♦ర్మతినయేని. ౮౩౪

సీ॥ మంచి వంటక మొంటి - మెఁ గుక్కవలెఁ దన, కడుపుచూచు కొనంగ♦గతుకువాఁడు
క్లీబుఁడా!యన సిగ్గు - కొరలించి తనభృత్య, ములను తొల్లిటి యట్ల - నలుపువాఁడు

పెద్దల పలుకులఁ - బెడ చెవినిడువాఁడు, పరుల దోషమె వెలి - పఱచువాఁడు
నిర్దోషవంశంబు - దుర్దోషయుతమంచు, వ్యర్థకల్పన సేయ - నెఱరు వాఁడు

తే॥ కఱవునఁ బీదలన్నంబు - చెఱచువాఁడు, జనుల నోరూర భక్ష్యముల్ - దినెడువాఁడు
పొందు దుర్గతు లేనును - పొందువాఁడ, రామునకు నెగ్గుదలచు దు - ర్మతినయేని. ౭౩౯

తే॥ అస్త్రశస్త్ర కార్యంబుల - వ్యర్థపఱచి, క్షణ విశశ్య శరీర ర - క్షణము గోరి
ద్రయ దలఁచి యరులిచ్చు తు - ఛ్రంపుఁదిండి, తినెడు వాఁడొందు గతినాకు - నొనరుగాత

తే॥ ఈయనని పల్కి తపియింపఁ - జేయకుండ, నున్నదని యిత్తునని చెప్పి - యురక యొకని
పలుమఱుల్ ద్రిప్పి యలయించు - పాపిగతికిఁ, బోవు వాఁడ రామునకెగ్గు - పూనియున్న.

తే॥ పగఱ గెలుచు ఖడ్గము కేలఁ - బట్టివెళ్లి, నిత్య రోగాస్పదంబయి - నీచులూరు
నొడలిపై నాస సుదతులు - తొడరి నవ్వఁ, బగఱ కడఁగు దుర్గతులు నా - కగునుగాక

తే॥ పసములును గుళ్లు వరిమళ్లు - పఱపియుండు, తన విలాతిని పరరాజు - లనుభవింప
నంకెలల పాదముల తోడ - శత్రునెదుట, నిలుచు హీనగతులు నాకుఁ - గలుగుఁగాక

తే॥ ఆపిశాచ కార్యంబులే - నరసియున్నఁ, గుక్కనై రోఁత కూడాని - కుష్ఠువొంది
చదిసి చత్తునుగాక స - జ్జనుల కడరు, గూర్చువాని గతులు నాకుఁ - గొఱలుగాక. ౭౪౦

చ॥ ఇటు లకలంక మానస మ - హీన గతిం దెలిపించు వాక్యముల్
పటుతర రీతిఁ బల్క దన - పట్టి సుఖంబుల నీఁగి యేగి పి
మ్మటఁ జనుదేరఁ గాంచు గతి - మానిసి తృప్తి వహించి యాతనిన్
దటుకునఁ గౌఁగిలించెఁ బరి - తాపము గూర్చితి నంచుఁ బల్కుచున్

తే॥ పరమ పూత చేతస్కుఁడౌ - భరతుచెయిది, కైక క్రౌర్యంబు కౌసల్య - గనినయంత
స్తన యుగంబున దుగ్ధంబు - జాలువాఱ, శోక మోర్వక మోమూఁద - స్రుక్కియేడ్చె

తే॥ తలఁపఁ దలఁప మనసు క్రుంగి - తలరి కరఁగి, పనవు నాయమ యుత్తమ - పార్థివేంద్ర
మీకులంబున నినువంటి, మేటిగుణులు, పుట్టలేదని దీవించి - యట్టె తడవె. ౭౪౩

తే॥ చిన్నతమ్ముఁడు మఱిమఱి - చిఱిమి లేచు, శోకమున విక్లబుండయి - సురిఁగి తల్లి
చరణముల వ్రాలఁ గౌసల్య - సరగనెత్తి, వత్సలత మీఱ నూరార్చె - వానికుందు

క॥ అత్తఱి వసిష్ఠుఁడచటికిఁ, జొత్తేరఁగఁ గాంచి తండ్రిఁ - జూపంగదె యో
సత్తమ! యని పదములఁ బడఁ, జిత్తము తలరంగ భరతుఁ - జేర్చె నురమునన్ ౭౪౫

దశరథునకు శత్రుఘ్నుండు దహన సంస్కారాదులు సేయుట.

క॥ నాయన! మీనాయన చని, యీయెడ కీరేడుదినము - లేగెను పుత్త్రుల్
చేయంగఁ దగిన విధులం, జేయుదు గాకనుడుఁ దల్లి - చేయుమ యనియెన్. ౭౪౬

ఉ॥ ఆనతి యిచ్చు తల్లి చర - ణాబ్జములన్ శిరమందు చేర్చి య
మ్మానిని కులోద్ధరుండిటుల జన్ - మానుని ధర్మమూర్తి నా
జానకి సేయు క్షీర వివిధ - తంబు సనాతన ధర్మమూర్తి నా
జానకి చంద్రశేఖరుని ♦ జాలి దగుల్పడ గాంచె నొక్కచోన్. ౫౭౭

క॥ కని ధరం బడి పొరలుచు రో, దన మొనరిచి యంతఁ జిన్న ♦ దప్పుఁ జాయను పొం
దిన మేనిని కన్నిటన్, మును పసు న్నాడించి పూసి ♦ ముగఁ గావించెన్. ౫౭౮

క॥ వేద విదులు పెను చింతను, భూదారు కళేబరంబు ♦ పొలుపగు రవముల్
మేదుర మున ప్రోవఁగఁగొని, యాపట బంగరు విమాన ♦ మందుంచి రొగిన్.

క॥ భూరమణ సమూహంబొక, తీరమువలెఁ దోఁచి కుమిలి ♦ తెరలుచు నుండన్
బౌరులు జలనిధి ఘోషము, తీరున రోదించిచుట్టు ♦ తిరిరి గుమురై. ౫౮౦

క॥ సారథులు హితులు మంత్రులు, పేరులు సేనాధి పతులు ♦ పెరిగఁగ నుమలన్
నీరము గార్వ విమానము, వారణ పృష్ఠమున నుంచి ♦ పదిలించి రొగిన్. ౫౮౧

క॥ భేరీకాహళ మురజా, ద్యారవములు జాలి పుట్ట ♦ నడరుట చూడన్
బౌరాంగనాళి కన్నుల, వారిక మోదికొని యేడ్చు ♦ వైనము తోచెన్. ౫౮౨

క॥ హారులు కరులు తేరులు భూ, సురులు నృపులు నడవ రాజ ♦ సుదతులు వెనురా
నర విభుని ప్రేతముం గొని, నరయూ తీరంబు చేరె ♦ జన సంచయముల్. ౫౮౩

క॥ చేరి మహీసురులు తెలిపిన, తీరునఁ గార్యంబు లెల్లఁ ♦ దీరిచి భరతా!
రారమ్ము జనకునకు సంస్కారము లొనరింపు మనుడు- సంయమి యనియెన్. ౫౮౪

క॥ నీతండ్రి కై కవలనన్, చేతము రోయంగఁ గలఁకఁ ♦ జెంది ప్రతినమై
సీతోడి వాపి ద్రెంచెను, ప్రేతక్రియఁదీర్పఁ దగవు ♦ వీడుము వత్సా!. ౫౮౫

ఉ॥ నీవలనన్ గులానుగుణ - నీతి విపర్యయ మందె నన్న యా
భావము తెల్పునట్టి వహి - వామిని ద్రెంచెన యన్న తోడనే
తా వికలత్వ మొంది ధరఁ - దా క్రెను; రాజటు వల్కెనప్పు డీ
పావన చిత్తముం దెలిసి - పాల్పడునే యిపు డట్టి భానకున్? ౫౮౬

చ॥ ముని యటు పల్కు మాటవిని - మూర్ఛిలి కొండొక తేటి మేలు మే
లని కడు నూర్చి వెక్కి మది - నాఁపఁగఁబూనిన నాఁగకుండఁ బొం
గిన పెను వంతచేఁ గుమిలి - కీడ్పడి గద్గదిక స్వరంబుతోఁ
బనవుచు నెల్ల వారు వినఁ - బల్కెను రాలు కరంగు జాలితోన్. ౫౮౭

చ॥ తుదకిటఁ బ్రేత కృత్యములఁ - దూకొన నర్హుఁడఁగాని నీచుఁడన్
బదపడి రాజనై ధరణి - పాలన కర్హుఁడ నైతిఁ జెల్లరే!

పొదలిన సూర్యవంశ్యులగు - పూర్వులలో నొకరుండు నావలెన్
గొదరిన యిట్టి కీర్తిఁ గయి - కొన్న మహాత్ముఁడు కానవచ్చునే? ౮౫౮

ఆ॥ సారిది వచ్చు మావ ♦ సుంధరాధ్యులు తమ, విమల ధర్మమునను ♦ వేల్పులైరి
ఎన్న నేను పుట్టి ♦ పిన్న నాఁడే నడ, కేన్గు నైతిఁ దనువుఁ ♦ బెంచి చెడితి. ౮౫౯

ఆ॥ కాంచి పెంచు తల్లి ♦ గాదిలిఁగూర్చిన, మేలు బళిరె! యెట్టి ♦ మేల్మి గలది?
డిందు లేక గాచు ♦ బెంకాయ గెల గూబ, ద్రొక్కు కాయ రీతిఁ ♦ దోఁచినాఁడ.

తే॥ పలు విధంబుల నీరీతిఁ ♦ బలుకు చటులు, భరతు నూఱడఁ బల్కి తా ♦ ద్వంశ గురుఁడు
తదను జన్మని గొని చేయఁ ♦ దగిన కృత్య, ములను క్రమముగా జరపించి ♦ పూర్తిచేసె

చ॥ చలనము నొందు పూలతల ♦ చందము నొందిన రాణులెల్ల భూ
షలను తదంగముల్ మెఱయ ♦ శైల మయూర చయంబు పత్త్రిముల్
వెలయ నికుంజముల్ తుఱఁగ ♦ లించు వనంబుఁ జొచ్చు కైవడిన్
జ్వాలనము నందు చొచ్చిరి వె ♦ సన్ మనముల్ పరితృప్తిఁ జెందఁగన్

ఉ॥ తమ్ముల వైఖరిన్ శశి వి♦ధమ్మున రాణుల మోము లంద చం
దమ్ములు దోఁప పద్మియ ము♦దమ్మునఁ జందన శీలిగాఁగ డెం
దమ్ములఁ బృష్టిమోఁ బతి ప ♦ దమ్ములతోడ గమించు స్త్రీలు చే
తమ్ములు చల్లఁగాఁ గొను ప ♦ దమ్మును పొందిరి కాంతు తీరఁగన్. ౮౬౩

తే॥ వారలకుఁ జేయఁదగు క్రియల్ - వరుసఁ జేసి, యరుగుదెంచెను శత్రుఘ్నుఁ - డన్న కడకు
నాఱుదూఱను నాకుఱా - యాద ఱావ, భరతుఁడింటికి నేఁగెఁ బె - న్నవట మునిఁగి.

తే॥ భరత శత్రుఘ్ను లంతటఁ - బది దినములు, యుగములం ద్రోచినట్టుల - నొగిలి త్రోచి
పైతృకంబుల విధ్యుక్త - భంగిఁ గొఱఁత, వడక పూర్తి గావించిరి - కడఁక చెడక

చ॥ నియమిత పైతృకం బెదుట - నిల్చి యొనర్చు వసిష్ఠ మౌని య
వ్యయ గుణశాలులైన ముని - వర్గముతో భరతుం గనం జనెన్
నయ విదులైన మంత్రులును - నాథుఁడు లేని విలాతి దుఃఖ సం
ఘయములఁ బొందు సంచతని - గానఁగ వచ్చిరి వృద్ధపాళితోన్. ౮౬౬

## ౧౦ ప్రయాణ పటలము (౫౯)

క॥ కరుణాసుస్థిర చిత్తులు, వరమంత్రులు మౌని జన వి ♦ భావసుఁడు సభన్
బరఁగునని సంతసంబునఁ, బుర వృద్ధులతోడ వచ్చి ♦ మ్రొక్కి భరతునికిన్. ౮౬౭

క॥ సిద్ధులగు మునుల తోడఁ బ్ర, సిద్ధులు పండితులు నృపులు ♦ సేనాపతులున్
వృద్ధులు కవులును గాయకు, లిద్ధగుణుని భరతు బలసి ♦ యేర్పడ నుండన్, ౮౬౮

క॥ మతిమంతుఁడగు సుమంత్రుఁడు, హితమతి భరతునకుఁ దనదు ♦ కెలఁకుఁ బ్రకటదరహా
సితమగు ముఖ చిహ్నంబులఁ, బ్రతిభాశాలియగు గురుని ♦ వదనముఁ గాంచెన్.

తే॥ మంత్రి సంజ్ఞలను వసిష్ఠ ♦ మౌని నోటఁ, గాక సంజ్ఞలతో బాగు ♦ గా నెఱింగి
ధరణిఁ బాలింపు మిదిసీదు ♦ ధర్మమనుచుఁ, దెలియు నట్లుగ నిట్లని ♦ పలుకఁ దొడఁగె

చ॥ అరయుము నావచస్సు సుగు ♦ ణాకర! విప్రులు వృద్ధులున్ మునుల్
నరపతులాదిగాఁగల జ ♦ నంబులు నీకడ కేగుదెంచుటల్
తిరముగ నీతియున్ దగవు ♦ త్రేవ్వఁగ నెక్కొనఁ జేయుకోసమే
నెరిసెగఁ జెప్పనేల? యిది ♦ విశ్రుత పద్ధతి నీవెఱుంగవే?. ౮౭౧

చ॥ ధరణిని ధర్మమున్న యయఁ ♦ దాల్చుట క్షత్రియధర్మమంచు నీ
వరయవె? మనుజుల్? స ♦ మంజస రీతిగ నిజగంబున
బరమున సౌఖ్యమిచ్చు నిది ♦ పావన మానసులైన వారలే
జరపఁగఁ దగ్గ కార్యమగు ♦ సజ్జన సన్నుత సద్గుణాన్వితా!

తే॥ అరసి చూడంగ రాజు లేనట్టి భూమి, వలిసమిత్రుండు లేని దినంబు సరణి
కలువ చెలిలేని రాతిరి ♦ కరణి జీవ్రఁ, డెడలు నోడలి వడువునగు ♦ నృపసుమార!. ౮౭౩

తే॥ నాకలోకంబునను దైత్య ♦ లోకమందు, నింకను గల లోకములయందు ♦ నెన్నఁడేని
జీవులను గావ నొక్కఁడేఁడు ♦ చెలఁగఁడనుచు, వినఁగరాదింతదాఁకను ♦ విమలచరిత!

చ॥ క్రమముగ నిశ్చయించి మఱి ♦ కాంచిన బ్రహ్మ సృజించినట్టి స్వ
ర్గమునను భూమియందును సు ♦ ఖస్థితిఁ బొందిన జీవరాశియున్
సమస్తదు ప్రాణికోటియగు ♦ సర్వచరాచరముల్ విభుండు లే
కమరిక నుంట యే జనులు ♦ నారయ రప్పుడు నిప్పు డెప్పుడున్. ౮౭౫

మ॥ హరినాభీకమలోద్భవుండయిన బ్ర ♦ హ్మం బుట్టి పుణ్యాత్ములె
ల్లరు కీర్తించు యశంబుగాంచి సుజనో ♦ ల్లాసంబుగా నీ ధరా
తలమేలం జేకొని కాచిరింత దనుకన్ ♦ ధన్యాత్మ! యీనాఁడు కా
పరుల న్నిఁగి పయోధిలోఁ బగులు నా ♦ వంబోలె యల్లాడెడిన్. ౮౭౬

మ॥ తనయా! తండ్రి గతించె నన్నయును కాం ♦ తారంబులం జేరె ని
జనయిత్రీ వర సంగృహీత ధరణీ ♦ సామ్రాజ్య మిద్దాని నీ
వనుకంపన్ గుణసంపదన్ మనుపుమా ♦ యక్షీణ రక్షామతిన్
జనముల్ మంత్రులు మేము గోరిన యభీ ♦ ష్టం బిద్దియే నావుడున్

తే॥ కనులనిండ బాష్పమ్ములు ♦ గ్రమ్మనతఁడు, గరళముం దినుమంచు ని ♦ క్కచ్చిపలుప
వడఁకు వాని కంఠమును గొప్ప ♦ యడలుపూని, గడగడ వడంకి పుడమిని ♦ పడియె సురిఁగి

ఆ॥ వడఁకి వడఁకి నాల్క ♦ తడఁబడ నమాటనుల్, ముడుఁగ నాఁడువారి ♦ మొగిని వగచి
ప్రాణములును వాడఁ ♦ బడపడి తెలివొంది, విను తలంపు దెలియ ♦ ననియె నిట్లు. ౧౦౯

ఆ॥ మూఁడు లోకములకు ♦ మూల కారణమని, జ్యేష్ఠుఁడుండ నేను ♦ శీర్షకంబు
తొడువుటరయ గురులు ♦ నొడువు ధర్మంబయ్యెఁ, దల్లి కార్యమందు ♦ తప్పుగలదె?

ఆ॥ దుష్టరాలుకైక ♦ దొసఁగు సమర్థించి, యుత్తములకు మీరె ♦ యొదవి పలుక
నడుమ రెండు యుగము ♦ లెడలఁ దుదినువచ్చు, కలియె వచ్చెననుచుఁ ♦ దలఁతునిప్పుడు

ఆ॥ రాజసభను నిలుచు ♦ రాజిత గుణులార!, పలున మొదలు నేఁటి ♦ నరుల వఱకు
నన్నయుండఁ దమ్ముఁ ♦ డవని న్యాయంబుగ, నేలినాతఁ డుండె ♦ నేని చెప్పుఁడ. ౧౧౨

ఉ॥ నీతి తొలంగకుండు పను ♦ నేమ మిదేయని మాదలించిరే
భూతలముఁ భరించుటకుఁ ♦ బూని యొడంబడు వాఁడనే? మహీ
నేతగ రాముఁడే యిటకు ♦ నేఁ దోడి తెచ్చెద మత్కుల క్రమా
గత కిరీట మాతనికె ♦ నక్కట నిచ్చెదఁ జూడుఁ డిందఱున్. ౧౧౩

శా॥ నాచే నయ్యెది కాదయేని వనిక ♦ న్నంగూడి పద్మాలు గేం
ద్రా చందంబుగ నారలుఁ జడలునో ♦ య్యందాల్చి తృప్తిం దపః
శ్రీచెన్నారఁ జరింతు సద్గులు మణే ♦ రీతిం బ్రశంసించిరే
మీచెంతం ద్వ్యజయింతు జీవములఁ బం ♦ డీ యంచు వాక్రువ్వఁగన్. ౧౧౪

చ॥ భరతుని పల్కులన్ వినిన ♦ భాసములెల్ల సెబాసు! మేదినీ
వరుఁ డట మున్నె రాముసకుఁ ♦ బట్టముఁ గట్టఁగ సమ్మతించెఁ దం
డికి సుతభూమిఁ జేర వగ ♦ డించె ధరారమఁ ద్రోచివైచి తు
చ్ఛోర నిను వోలె మీకుల యు ♦ న ప్రవరుండొకరుండు గల్గనే?. ౧౧౫

తే॥ పుడమిఁ బాలించి ధర్మంబుఁ ♦ బ్రోచి జన్న, ములను కావించి పెంచంగ ♦ వలయునేమి?
ఈచతుర్దశ భువనంబు ♦ లెడలె చనిన, నీదుకీర్తి సుస్థిరమయి ♦ నెగడుఁ గాక. ౧౧౬

తే॥ అనుడు భరతుండు తనతమ్ము ♦ నప్పుడపిలిచి, రాజపదయోగ్యుఁడైన శ్రీ ♦ రాముఁదోడి
తేర నరిగెద మని చాటి ♦ భేరి మ్రోఁగఁ, జేసి సైన్యంబు పయనింపఁ ♦ జెప్పు మనియె.

క॥ శ్రీకరుఁడు భరతునాజ్ఞ గ, నాకర శత్రుఘ్నుఁ డంత ♦ నరయఁ జేయన్
శోకమునఁ బడిన ప్రజకా, వా కమృతముఁ బోల లేచెఁ ♦ బటు ఘోషంబుల్ ౧౧౮

ఉ॥ ఇంద్రియ నిగ్రహాత్ములు ము ♦ నీశ్వరు లాదిగ భూమిఁ గల్గు రా
జేంద్రులు పేరులున్ జనులు ♦ నెల్లరు రాముఁడు రాజటంచు ని
స్తంద్ర విఘోషణంబు విని ♦ తద్దయు నార్చిరి మోద సంభృతిన్
సాంద్ర నినాద మద్ది శ్రవ ♦ ణంబుల జుట్టు సురామృతం బొకో! ౧౧౯

మ॥ భరతుఁ డున్నను కేతనాంచల పటు ♦ ప్రాంచన్మహాభోగ సుం
దరమా పి స్ఫుటభేదనంబునకు మో ♦ దంబారఁ దోడ్తేరఁగాఁ
దురగ స్యందన దంతి వీర భట సం ♦ దోహంబు వే లెమ్మనన్
బురి పాథోనిధి కట్టి చాటు చెనసెం ♦ బూర్ణేందు జన్మంబు నాన్ ౮౯౦

ఉ॥ ఎన్న యుగాంత కాలమున ♦ నెత్తెఱ లేచు పయోధి సప్తకం
బన్న యటుల్ చమూ సమితి ♦ యానము సేయుచునుండఁ గాంచుడున్
మున్నుగఁ గైకి యాన చెడి ♦ మూలము ముట్టఁగఁ బెల్లగిల్లె; నా
మన్నని యందు పౌరులకు ♦ మక్కువ పొంగఁ దొలంగె సంగదల్. ౮౯౧

తే॥ కరులు తేరులు తురగముల్ - ధరణిఁ గప్పె, ఘన పతాకలు గగనంబుఁ - గప్పివైచె
వాహినీ పాద ఘట్టనన్ - వడిగ లేచు, రజము సరసిజాసనుని నే - త్రములఁ గప్పె

తే॥ రుద్రుఁ డీలోకములనెల్ల - రుత్త చేయు, దినమునం దోఁచుధ్వనికంటెఁ - దివిరె ప్రోఁత
రాముఁ గాంచు నుత్సాహంబు - ప్రబలమైన, యానకంటెను సైన్యమ - త్యధికమయ్యె

తే॥ రాజ్యమునఁ బీడినట్లు పు - రంబు వీడి, వృక్ష సంకీర్ణమగు మహా - విపినమునకు
చామయనుమించుతోఁ జను - రామమేఘు, మిదియ యనఁ గరేణువులతో - నేగెఁ గరులు

మ॥ అరవిందంబుల యందమున్ దెగడు స - మ్యక్స్వాదలైనట్టి సుం
దరులన్ మోచు కరేణు సంఘములు వే - దండంబులన్ వీడి యా
తరుణీ యాన విలాస సంపదలకుం - దథ్యంబుగా నోడి ముం
దరి పందెంబునకై వహించు కరణిన్ - దైవాఱె నప్పట్టునన్. ౮౯౫

తే॥ వేదనం గూర్చు భాస్కరు - వేఁడినార్ప, జలద శీకరంబుల వడిఁ - జల్లుచుఁ జను
తఱచు ధ్వజ పటావళులు కో - దండ పాణిఁ, గసక చింతించు కాంతల - గతిఁ జలించె

ఉ॥ ఉన్నత మూర్తియైన రవి - యొక్కటఁ జొక్కగు రూపు పొంది పైఁ
దెన్నగఁ బూర్ణచంద్రు లరు - దేరఁగఁ గంధర సంఘ మూర్విపైఁ
బ్రన్ననఁ బర్వి యొక్కమొగి ♦ బంధుర రీతిఁ జరించె నన్న యా
చెన్నున వెల్గినారు నృప ♦ శేఖరు లెల్ల మదేభపాళిపై ౮౯౭

మ॥ ఒక పాథోనిధి తేర్లపై వెడలె వేఱొ ♦ క్కం డిభశ్రేణిపై
నొక నీలాంబుధి వాజి సంచయముపై ♦ నొక్కబ్ధి యుద్ధాత్రిపై
నకలంక స్థితిఁ బోవఁ గాహళ మృదం ♦ గాది ప్రణాదంబు మూ
ర్ఛ కదంబంబునఁ బండితాళి కిరణిన్ ♦ రాణించె వానంబునన్. ౮౯౮

చ॥ సురుచిర లజ్జయున్ గుణము ♦ సొమ్ముగ సొమ్ములు దాల్చి పొంటె వే
సరి ధరియింపమిన్ సహజ ♦ చారుత నేలుపులున్ మరుల్గొనన్

బెరసిన మందయాన లట ♦ నిం గొను రాముని చూడఁ బోవు సం
బరమున నేగినారు కుసు ♦ మంబులు రాలిన వల్లులో యనన్ ౯౯

మ॥ చతురంభోధి పరీత భూతల మహా ♦ చక్రంబుఁ బాలించు భూ
పతి వంశాను గతాత్మ పుత్రిము సముద్ ♦ భాసిల్లమిం జేసి యా
పృతనా వారమునందు పిన్నగొడుగుల్ ♦ వే పర్వ నక్షత్ర సం
తతు లొప్పార వినుండు లేని నిసి నాఁ ♦ డాల్చెం బ్రభాహీనతన్ ౧౦౦

చ॥ చను నడచేత దిక్కులును ♦ చాలిన విస్మృతి లేనివంచుఁ దె
ల్పిన గురు సేవనే యచల ♦ లీల వహించిన దన్నుచోఁ జతు
ర్వననిధి వేష్టితం బగుచు - వర్తిలు ధారణి నొక్క చానయుం
చు నబల యంచుఁ బల్కు మనుజుల్ నిజమారయ సత్యవంతులే? ౧౦౧

తే॥ గంధ మగురువు కుంకుమ - కలపములును, తారహారములేక లే - తయును వలుద
యైన కుచములు వేఱు భూ-పాలిలేమి, నప్పు డెలనీరుకాయల-యంద మొందె. ౧౦౨

తే॥ తరుణి కుచలేపమైన చం - దనము చేత, నిరుల సరులచే మఱుఁగయి ♦ పరఁగకుంట
గుములు పొదలును లేనట్టి ♦ కొండలవలె, వీరుల బలిష్ఠ భుజములు- వెలసె నచట

ఉ॥ తావి పొగల్ గుబుల్కొనని ♦ తంబము నొంచెడు వేణులారు నే
ఁ విమలాత్ము లయ్యెడ న ♦ ణింప కలంకియలెల్ల మానఁగా
మేపిన యంజనం బధిగ ♦ మింపని కన్నులు, గెల్చి యావలన్
బోవిడఁ జాలలం గడుగఁ ♦ బొల్చు కుశారముఁ బోలి రాజిలెన్. ౧౦౪

తే॥ రణిత కింకిణీ విరహిత ♦ రథములట్లు, సఖుల పిఱుఁదుల మేఖలా ♦ స్వనము లేదు
మధుప రుతిలేని వికచ ప ♦ ద్మములరీతి, చివురు టడుగుల నందెల ♦ రవము లేదు.

తే॥ తాల్పఁదగిన హారాదులఁ ♦ దాల్పకుంటఁ, దలరు నడుము లూపిరి విడఁ ♦ దరుణమబ్బె
కైక పాడు వరంబు లీ ♦ కలువ కంట్ల, నడుములకు మాత్రమే మేలు ♦ తొడరఁబోలు

తే॥ రాఘవుఁడు వీడి చనుటచే ♦ రమణ చెడిన, సిరియుఁ దప మొనర్పఁగ దవ్వు ♦ చెందె ననఁగ
మరుఁడు దుస్తర దుఃఖాబ్ధి ♦ మణఁగె ననఁగ, లెక్క లేని సేన హారంగు ♦ దక్కియుండె

క॥ దివి భువి దిశలను మించఁగ, దవిలి యుబుకు నుదధి యుపమ ♦ దగునన నెల్లోఁ?
దివిరి నడచు చమువు స్వయం, భువు కనులను మనసు మించి ♦ పొలిచెన్ దారిన్.

క॥ కడలి జలముఁ ద్రావుటచేఁ, బుడమి తిరముగాఁగ నిలుపఁ ♦ బూనుటచే గ
ట్టుమఁచుటచే సైన్యము ద్రా, విడ భాషా స్రష్టఁబోలి ♦ విలసిల్లెఁ గడున్. ౧౦౯

తే॥ నెడలు నాబాల గోపాల-మడరు జనము, సిరియు పీడుటచే సొంపు-చెడి యయోధ్య
అల యగస్త్యుఁడు జలమెల్ల - నాని విడువ, సురిఁగి చేష్టడి యుండిన - శరధిఁ బోలె

క॥ వనముల సుక్షేత్రంబులఁ, జెను గ్రామంబుల నదుల గిరులఁ ♦ బృథివిం గనుచుం
జను సేన త్రోవ నెఱిసె, యని సాకేతంబు వీథి ♦ యనఁ దగి యుండెన్. ౯౧౧

క॥ ఘన గజముల మదజల వా, సనఁ దక్కఁగ విరులొ నరులొ - చందనమో మేల్
ఘనసారకస్తురియో కూ, ర్చిన కలపమొ తావి విరియఁ - జెందదు సేనన్. ౯౧౨

క॥ మనుజులు కలమెక్కి చనెడి, వననిధికంబైన విశాల - వాహిని యందా
వనితల మధ్యము దక్కన్, ఘన తాటంకాది కాంతి - గప్పదు కనులన్. ౯౧౩

తే॥ మురజ కాహళాదికములు ♦ మ్రోఁగకునికి, నరుగుచున్న చమూసమూ ♦ హమ్ము చూడఁ
బృథుల కుడ్యంబుపై నఁ జి ♦ త్రింపఁ బడిన, ప్రభు బలంబును బోలి య ♦ ప్పట్లనుండె.

చ॥ అడవుల రామచంద్రుఁడు దు - రంత మనఃక్లమ మొందె నంచుఁ బూల్
ముడువ కలంకృతుల్గొనని - ముగ్ధల కన్నులనుండి వాఁడిమిన్
విడిచిన యమ్ములా యువక - విస్తృత వక్షములందు గాఁడి నె
వ్వడి నుసుఱాన లేదు మఱి - వజ్ర తనుత్రము లయ్యె వారికిన్. ౯౧౪

చ॥ మదనుని పంచ బాణముల - మానక మున్ను తపించు డెందముల్
సుదతుల చన్ను దోయి పయి - నూటిగ వ్రాలి రమింప వయ్యెడన్
హృదయములందు కైక యెడ - హెచ్చిరు కోప దవాగ్ని మండఁగా
మదమఱి యవ్వి మాఁడునని - మానెను కావలయున్ నిజంబుగన్. ౯౧౫

తే॥ ఇట్లు పెను సేన నడవఁగా - నిద్ధ గుణుఁడు, భరతుఁడును నారలు ధరించి-ప్రక్కవచ్చు
తమ్ము తోడ శతాంగంబుఁ - దఱిసి యెక్కి, పాదవు కొన్న నెవ్వగ తోడఁ-బోవుచుండె

తే॥ తల్లులును తపోధనులును -తండ్రిఁబోలు, మంత్రులును బందుగులును సా-మంతవరులు
బ్రాహ్మణులు తోడరిక గాఁగ - బలసి రాఁగ, నగరి పెద్ద వాకిలి దాఁటి-నడచెనతఁడు

తే॥ మంథర యనుమృత్యువ్రజనుల్-మలయుచుండఁ, ద్రోసికొని పోవుచుంట శ ♦ త్రుఘ్నుఁడు
మండి పరుగిడి గర్జించి - మగువఁబట్టి, త్రొక్కి నింగికెగుర వేయఁ ♦ దొడఁగునంత [గని

చ॥ భరతుఁడు చేయి పట్టికొని - పావన! పూర్వ నృపాల పద్ధతుల్
వఱదను గల్పి యిట్టి చెడు - పాప మొనర్చిన కైక దేహమున్
నఱికియె యుందుఁ గిక్కయఱ - నజ్జుగ నజ్జుగఁ గాని, రాముఁడీ
కఱకుఁదనంబు సైఁపఁడని - కాక తలంతునె తల్లి యంచెదన్? ౯౨౦

తే॥ కాన నీతిజ్ఞ! యంతము - లేని చింత, మనకు నెల్ల రకును కూర్చు - మంథర పయి
నలుక పూనంగఁ దగదన్న! - యన్న కినియు, ననుచు నూరార్చి తోడ్కొని-యరిగె నవల

క॥ జనములు సేనయుఁ గ్రమముగఁ, జని చెంతనె చుట్టి నిలిచి - సంద్రము చంద
మ్మున నుండ, రాఘవుఁడు తొలి, దినమున దిగు వనము నందె - దిగియె నతండున్.

శా॥ ఆ రేయంతయు నిద్రలేక నయనా - నంతాశ్రుపూరంబు నం
దారం దోఁగి వనంబులం దొరకు కా - యల్ కూరలన్ మెక్కి యా
శ్రీరాముండు పరుండినట్టి పృథులో - ర్విన్ బర్ణ తల్పంబుపైఁ
జేరెం దమ్ముఁడు చెంతనుండి తెరలన్ - జింతాకుల స్వాంతుఁడై

తే॥ రాముఁడట నుండి సన్న మా - ర్గమున నడచె, నని శతాంగ తురంగ సా - రంగములను
వెంట రాఁబంచి భరతుండు - విసుఁగు లేక, కాలి నడకతోఁ జనియె నా - కారు టడవి.

## ౧౧. గుహ పటలము. (౭౩)

క॥ కావేరీ తీరావని, కైవడిఁ గేదార ఫలము - ఘన కోసలమున్
వేవే కడచి చని చర, స్థావరములు నగవ గంగ - దరిఁ దారసిలెన్. ప.౨౫

తే॥ విరివియై జలపూర్ణమై - వెలయునదిని, కరి మదాంబుపూరంబులు - గలియు కతన
నళులకుందక్కఁ ద్రావను - జలక మాడ, నొదవదయ్యె న త్తఱిని గం - గోదకంబు

తే॥ తురగ ఖుర ఘట్ట నోద్ధూత - ధూళి పరసి, దివిజ శీర్ఘము లలముట - దెలియరాదు
కాని, జలమాను టేఁదుట - కడఁకఁబొరలు, ఔచటఁ గాంచినఁ గానరై - యేపుమీఱె

క॥ గంగా వాహిని యమృతప్రు, రంగసఁ దొలియట్లు తోయ - రాశిఁ గలియఁ జే
రం గాంచ దచట దగ యా, అంగం ద్రావినవి తత్త ♦ అంబున సేనల్. ప.౨౭

క॥ కానల కేగిన రాముని, గాన భరతు వెంటఁ జనిన - క్రందగు జనముల్
సేనలు లెక్కించినచో, నానిక నార్బుదుల వేల ♦ యక్షౌహిణులౌ. ప.౨౯

క॥ జనములు గంగాతీరము, ననువుగఁ జేరుటను కాంచి ♦ యంబుధి జలమున్
గొను మొగులుఁ బోలు శ్రీరా, ముని మీఁదికి వచ్చెననుచు♦ మొగిఁ గుపితుండై.

తే॥ కాలకల్పుండు ధీవర ♦ పాలకుండు, గుహుఁడు కనులెఱ్ఱఁజేసి భ్రూ♦కుటి ముడించి
నాసికారంధ్రముల పొగల్♦ధూనరిల్ల, నట్టహాసమ్ముచేసి వి♦ల్లమ్ములు గొని. ప.౩౧

సీ॥ కెరలిపాపులఁ జంపఁ♦గేలఁ శూలము గొన్న, రుద్రమూర్తియె పెక్కు♦రూపులొందె
ననఁ బ్రాణి భీకర ♦ మైయొప్పు సైన్యంబు, గలవాఁడు బలువిల్లు♦గలుగు వాఁడు
సురియఁ జెరిపి యాడు - గఱచుచుఁ బరుసుతోఁ, గ్రుద్ధనేత్రముల మి - ద్గుఱులు రాల
నలుకతోఁ గాంచి నేఁ♦డాలంబు గలిగెన, కాయని భుజముల♦గ్గలికఁ బొంగ

తే॥ మొగిసి యరుదెంచు నీ చమూ♦మూషికములఁ, గాలభుజగమనై యావి♦గాలిమ్రింగి
కాడుగాఁ జేయు వాఁడ నీ♦ కదనతలము, ననుచుఁ గటు వీర వాక్యంబు♦లాడికొనుచు

తే॥ పంచ నఖముల కైవడిఁ ♦ బరఁగుసేన, విలయ కాలాబ్ద నిర్ఘాత ♦ విధుల నార్చి
సప్త జలధులు పొంగిన ♦ సరణిలేచి, తన్ను బలసి రా నది వల ♦ దరినిచేరి ప.౩౩

క॥ సైన్యముఁ గని భరతునితో, జన్యం బొనరించి సేనఁ ♦ జంపి శమన రా
జన్యు పురి కంపి రాజ్యము, మాన్యత రామునకు నొసఁగఁ ♦ మది గుఱిగొంటిన్. ౯౩౪

క॥ మీరలును సమ్మతింపుఁడు, ధీరులు మొనయింపుఁ డరులు ♦ వెడలక యుండన్
దారులు రేవులు చెఱుపుఁడు, తీరపు నావలను నట ♦ దింపకుఁ డెసఁగన్. ౯౩౫

ఉ॥ ప్రాణహితుండు రాఘవుఁడు ♦ ప్రాయిఁడిగా భువినేల నీక ని
స్త్రాణునిగా నొనర్చి మహి ♦ సంపద వంచనఁ గొన్న భూపుఁ డ
క్షీణ బలంబుతో వనులఁ ♦ జేరిన యన్నను నొంప వచ్చె మ
ద్బాణ పరంపరన్ రిపుల ♦ భగ్నము చేసెదఁ జింతనూడ్చెదన్. ౯౩౬

ఉ॥ వీరలఁ గూల్పనేని పృథి ♦ వీరలమే నను గేలి చేయదే?
వీరలు గంగ దాఁటుదురె? ♦ భీతిఁ జలింతునె వీరి ధాటికిన్?
గూరిమి తమ్ముఁడంచు నను ♦ గొప్పఁగఁ జూచిన రాఘవేంద్రుకై
పోరిని జీవము ల్విడువఁ ♦ బోలదె? యింతకు నేను చాలనే? ౯౩౭

ఉ॥ అగ్రజుఁడంచు నుంత హృద ♦ యంబున నెంచఁడు వేఁగివంటి స
త్యాగ్రహుఁడైన తమ్ముఁడొకఁ ♦ డంచు గలాఁడని లెక్క సేయఁ డ
వ్యగ్ర హితాత్ముఁడై గుహుఁడ ♦ వక్ర పరాక్రమశాలి మల్ల భూ
పాగ్ర సరుండు గల్గునని ♦ యైన మదిం దలపోయఁ డేలొకో? ౯౩౮

ఉ॥ దోసము కాదుగా నడరు ♦ దూఱును మిత్రులు వీరు శత్రు ప్రీ
వేసమువారలంచుఁ బృథి ♦ వీ పతులెందును చర్చ సేయరో?
చేసిననేమి? చేయమిని ♦ చేసెడిదేమి? గుహుండు జీవముల్
పాసిన పిమ్మటం గద నృ ♦ పాలుఁడు రామునిపైకిఁ బోవుటల్? ౯౩౯

ఉ॥ రాముఁడు నాఁడు పోవిడి య ♦ రణ్యములం దపియించుచుండ నీ
ప్రామిడి రాజ్యమేలుటయొ? ♦ ప్రాణము నాకు సుధాసనంబొకో?
నేమహిఁ గీర్తి నిల్పి మర ♦ ణింపఁగ లేనె? యనుంగుతో వనీ
భూమికి నేగకుండుటయుఁ ♦ బోలెను నానెఱి నేఁడె తీర్చెదన్ ౯౪౦

మ॥ మదమాతంగ తురంగ సద్భట కదం ♦ బంబుల్ నదిం దాఁటుచోఁ
బెదపం జూతము మీఁది కార్య మిపుడే ♦ వే పోయి నౌకాతతిన్
నదిలో నిల్పక తెందు పొందు సమరా ♦ నందంబు డెందంబులం
బొదలం జేయుఁడు మిత్రుకంటె నసువుల్ ♦ ముఖ్యోడఁగా నొప్పదే? ౯౪౧

మ॥ మన వీరావలి కొక్కనాఁటి యనికై ♦ మాఱొడ్డఁగా లేని యీ
మొన మీరేల సురాలి త్రాఁకినను నా ♦ పొల్పారు ♦ కైనున్న యీ

ఘన కోదండ ఘనాఘన ప్రసృత ని ♦ ర్ఘ్రాంత ప్రభా పూర్ణమా
ర్గణ వర్షంబునఁ బ్రేతభూమిగ నొన ♦ ర్పంజాలనే వ్రేల్మిడిన్? ౯౪౨

మ॥ పరమోదారుఁడు రామభూవిభునకుం ♦ బట్టాభిషేకార్హవే
ళ రహిన్ వల్కలముల్ ధరింప నిడు కా ♦ లవ్యాళ సంకాశకున్
వర పుత్త్రిండగు పీని సైన్యముల మ ♦ ద్బాణ ప్రఘాతంబులన్
మురియన్ సేయ శవంబులన్ జలనిధిన్ ♦ ముయ్యేఱు చొప్పింపదే? ౯౪౩

చ॥ రణమున వీరులం దుసిమి ♦ రాముఁడు ప్రాకట ధర్మమూర్తి ధా
రణిఁ దగనేలనిచ్చి యమ ♦ రంబగు కీర్తి వహింపఁ డీరు స
ద్గుణుఁయి రాజ్యమున్ దనకుఁ ♦ గొంకక వీడిన యామహాత్ము దు
ర్గుణుఁడయి కాన నుండుటకుఁ ♦ గూడ సహింపక యెత్తెఁ జెల్లరే! ౯౪౪

చ॥ యతులకుఁ జుట్టమై యడవు ♦ లందు వసించు మదగ్రజుండు స
న్మతి మది నొచ్చునో యనుచు ♦ నాయెద జంకెడిఁ గాని లేనిచో
శిత విశిఖాగ్నిచే నివురఁ ♦ జేయనె సైన్యసముద్ర సప్తకం
బితవగు లేత పైరు పసి ♦ కిమ్ముగ నప్పన చంద మేర్పడన్? ౯౪౫

తే॥ జెట్టివిలుకాఁడు రాముని ♦ చెలిమికాఁడు, గుహుఁడు మూఁకతో నిట్లువా ♦ క్రుచ్చుచుండఁ
గని సుమంత్రుండు సింహాసం ♦ హనను భరతుఁ, జేరి మెల్లన నిట్లని ♦ చెప్పఁదొడఁగె.

సీ॥ ఈగంగ యిరుదరు ♦ లెలమి నేలెడివాఁడు, మగ యేనుఁగుం బోలు ♦ మాబలుండు
లెక్కయిడఁగ రాని ♦ పెక్కునావలవాఁడు, రామచంద్రున కతి ♦ ప్రాణహితుఁడు
సాయుధ వాహినీ ♦ జలరాశిగలవాఁడు, గుహుఁడను విఖ్యాతి ♦ కుదురువాఁడు
శైలబలుఁడు కరు ♦ ణాళుండు చీఁకటి, ముద్దఁ బోలినమేని ♦ ముదువువాఁడు

తే॥ నీవు చనుదారి కెదురయి ♦ నిలిచినాఁడు, నిన్ను జూడఁ దలఁచినాఁడు ♦ నిర్మలాత్మ!
బలము నందెల్లఁ గాంచిన ♦ బాహువులును, నీలనీరద తనుకాంతి ♦ నెగడు సుభగ!

తే॥ పితృసముని సుమంత్రుని పల్కు ♦ విన్నయంత, నలరి యనఘుండు రాముని ♦ యంతరంగ
హితుఁడ యగునేని ననుచూడ ♦ నేగుదెంచు, మును పె నేఁ బోయి కాంచెద ♦ ననుచు లేచి

తే॥ తమ్మితో మది నుబుకు ప్రే ♦ మమ్ముతోడ, వెలలి సురనది దరిఁ జేరి ♦ నిలుచు భరతు
గుహుఁడు గని వానివేషంబు ♦ గూడఁ గాంచి, చెన్ను చెడిన మోమరసి ని ♦ శ్చేష్టుఁడయ్యె

ఉ॥ నారలఁ గాంచి మేనిపయి ♦ నం గడు నిండిన ధూళిఁ గాంచి పైఁ
జారు తరాస్య బింబము కృ ♦ శత్వమునన్ జిగి పోక గాంచి యా
తీరు నిజంబుగాఁ గరుణ ♦ దేవత రూపును బోలఁ గాంచి పెం
పారిన విల్లు జాఱి పడ ♦ నట్టులె నిల్చెను ఱాతి బొమ్మనాన్. ౯౫౦

చ॥ పురుష వరేణ్యుఁడా భరతు ♦ భూవిభుఁడుల్ రఘురాముఁ బోలికన్
బరఁగుచునున్న వాఁడతని ♦ ప్రక్కనె నిల్చెను తమ్ము లక్ష్మణుం
డొరసిన వాఁడు నెక్కసపు ♦ దుఃఖ భరంబున కంతులేదు శ్రీ
ధరనిజభర్త తమ్ములును ♦ తప్పు గొనర్పఁ దలంపఁ బోదురే?

ఉ॥ తాపము నొందువాఁడు మదిఁ ♦ దాఁ అని ప్రేమగలాఁడు రాముఁ బో
ల్పాపసి వేషముం దనరఁ ♦ దాల్చిన వాఁడగు కైక పుత్త్రు ను
ద్దీపిత భావమెల్ల మఱి ♦ తేట పడఁ గని వత్తు నుండుఁడీ
యోపికఁ ద్రోవఁ గాచి యని ♦ యోధుల కాజ్ఞయొసంగి యంతటన్.

చ॥ కలమొకఁ డెక్కి వచ్చి రఘు ♦ కాంతుని దిక్కు నమస్కరించు నా
యలఘుని చేరి మ్రొక్క నన ♦ ఘాత్ముల శీర్షహృదంతరంబులం
జెలఁగు యశస్కుఁడుల్ విధియుఁ ♦ జేతులు మోడ్చఁగఁ దగ్గ దాతఁడుల్
దలిరిచి కౌఁగిలించికొనెఁ ♦ దండ్రికి మించిన కూర్మి తోడుతన్. ౧౫౩

తే॥ భరతుఁ గాంచి గుహుండు నీ♦వచ్చు హేతు, వేమి? యనఁ నతండను మామ♦హీశధర్మ
మందు నుండి తొలంగె మా♦యయ్య దానిఁ, బాప రాముఁ దోడ్కొనిపోవ♦వత్తు ననుడు

తే॥ ఒనరునవ్వార్త వినిగుహుం♦డూర్పుపుచ్చి, యుత్సుకతఁ బొంగఁ బూరించి♦యుర్వి వ్రాలి
మరల భరతుని యడుగు దా♦మరలఁ దనదు, హస్తములఁ బట్టియిట్లని♦ప్రస్తుతించె.

చ॥ విమల యశోవిశాల! తలి ♦ వేడఁగఁ దండ్రి యొసంగఁ బాపకా
ర్యము వలె రాజ్యముల్ విడిచి ♦ యానమందున దైన్యమంది యా
క్రమమున రాముఁ దోడుకొని ♦ క్రమ్మఱ నేగఁగ వచ్చు నీదు శీ
లము గన వేయి రాములు తొ♦లంకిన నీ సము లౌదురే మహిన్? ౧౫౪

ఉ॥ ఉత్తమశీలమే భుజ బ ♦ లోన్నతి గాఁగల ధీర! నీమహా
చిత్తవిశుద్ధి బోయ తెగఁ ♦ జెందిన నే వినుతింప నౌనె? రా
ట్సత్తమ సంస్తుతంబగు ప్ర ♦ శస్త దినేశ కులేశ కీర్తు లో
క్కెత్తున మ్రింగి నాఁడవు గ్ర ♦ హేనుఁడు తక్కటి కాంతులం బలెన్. ౧౫౫

మ॥ అని పల్కాడి గుహుండు కైకసుతుపై ♦ నత్యంత సౌహార్దముం
గొనియెన్ భారణి నెవ్వరాతని యెడం ♦ గూర్మిం బ్రమోదించి యుం
చని వారల్? మది నూహకే యరిది యా ♦ సచ్ఛీలమే హేతువై
చనుఁగాదా? యట రాముపై గుహునకున్ ♦ సంగాతముల్ వర్ధిలెన్. ౧౫౬

మ॥ కరుణాశీలుఁడు కైకపట్టి యతనిన్ ♦ గౌరవ్య భావంబుతో
నిరవారం గని యున్న యీస్థలము నం ♦ దెచ్చోట నాఁడుండె నే

కరణిన్ నిల్చి వచింపుమా? యనుడు నో ♦ కాకుత్స్థ వర్యా! యిదే
యరయన్ రమ్మని తోడి తెచ్చె గుహుం డ ♦ త్యంత ప్రమోదంబునన్. ౯౫౯

మ॥ భరతుం డయ్యెడఁ బండపై నఁ దృణ త ♦ ల్పంబంది యారేయి భా
స్కరవంశాంబుధి చంద్రముండు నిదురం ♦ గావించుటం గాంచి దు
ర్భర దుఃఖంబునఁ దత్తళించి ధరపై ♦ వ్రాలెన్ మహా భూజ ము
ద్ధుర వాతాహతిఁ గూలు చందమున నం ♦ దోదూయ మానాంగుఁడై. ౯౬౦

శా॥ ఈపాపాత్ముఁడు పుట్టు హేతువున నీ ♦ కీపాటు కై కేయిచే
నాపాదిల్లిన దంచు నెన్నఁపుడు కా ♦ యల్ మూలముల్ మెక్కిని
శ్చాపల్యంబున నింద కూరుకుట లేఁ ♦ చం గాంచుచో నిప్పుడున్
దీక్షా ప్రాణము నిడకుంటి నెంకఁ బ్ర ♦ థ్వీ భారముం దాల్పనో? ౯౬౧

తే॥ తమ్ముఁడా! అన్న నిద్రించు ♦ తలమిదైనఁ, గూర్మిచే భోగ భాగ్యము ♦ ల్గూలఁ ద్రోచి
వెంట వచ్చిన యూర్మిళా ♦ విభుఁడు రాత్రి, గడపె నెచ్చటఁ గాన్పింపఁ ♦ గదవెయనుడు.

తే॥ సీతయును రాముఁడిచట వ ♦ సించి నిద్ర, సేయ నచ్చట విలు దాల్చి ♦ చేతితోడ
వేఁడినిట్టూర్పుతో ఱెప్ప ♦ వేయకుండ, నిలిచి తెలవాఱు దాఁకఁ దా ♦ నలఁగుచుండె

చ॥ అన విని మాండవీ పతి గు ♦ హాఖ్యున కిట్లను తమ్ములంచుఁ బు
ట్టిన ముగురందు నొక్కఁడ ఘ ♦ టించితి నంతము లేని నేగి నా
యనుజుఁడు దాసెఁ దీర్ఘ శ్వాసు ♦ ఖావలి వీడుచు నెంటనేగె భూ
మిని కడుఁ బ్రేమకుం గలదె ♦ మేరయు? నాబ్రదు కేల కాల్పనే? ౯౬౪

చ॥ అని యట నాఁడు ధూళివడు ♦ సంగముఁ జేర్చి పుళిందరాజ! ది
వ్యనదిని దాఁటఁ జేసిన వ ♦ నంత నిరంతర చింత దీర్చి రా
ముని కడఁ జేర్చి యాపదను ♦ వృత్తిగఁ బాపిన పుణ్యమూర్తివౌ
దని భరతుండు కోరుటయు ♦ నాతఁడు సమ్మతిఁ జూపి యంతటన్. ౯౬౫

చ॥ సరియని బోయఱేఁడు తన ♦ సంగడికాండ్రను చేరఁ జీరి మీ
రురవడి నేగి యోడల మ ♦ హోన్నతి నాయిత పర్చి తెండనన్
హారు రజతాద్రి రామ విభు ♦ హస్త విభంజిత మేరు శైలమున్
నర తురగేంద్రు పుష్పకము ♦ నాఁ బలు రూపుల నొప్పు నావలున్. ౯౬౬

చ॥ ఆవలి వారి నీవలికి ♦ నావలి కీవలి వారిఁ జేర్చుటన్
దేవ మహీతలంబులకుఁ ♦ దేఁకువ జీవులఁ జేర్చు పుణ్యపా
పావలి నాఁగఁ జెల్వెల వౌ ♦ సూరపు యూసముఁ బోలి యొత్తుగా
నావలు చేరె నందముగ ♦ నాకనదీ జలనెల్ల నాడుచున్. ౯౬౭

క॥ భరతుని కని గుహుఁ డిట్లను, నరవర! తెక్కెకును మీఁకు ♦ నౌకలు వచ్చెన్
బరికింపఁ డక్కు నరుఁడును, త్వరనెక్కింపుఁడని తన ప్ర ♦ ధానికిఁ దెలుపన్. ౯౬౮

ఉ॥ ఏనుఁగు నాజ్ఞ నౌకల వ ♦ హించి సుమంత్రుఁడు గుంపు గుంపుగా
నోపిన పద్ధతిన్ జలిపి ♦ యోడలఁ జేర్చ రథాశ్వ దంతి సే
నా పరివారముల్ మనుజ ♦ నాథులు బంధులు నెల్లవారు నీ
పే పరివాటి రత్నములు ♦ చిందు సురాపగ దాఁటి రయ్యెడన్. ౯౬౯

మ॥ ఇల వారాశంబునన్ మేఘముల్ గదియఁగా ♦ వేశేచి గర్జాళితో
జలముల్ పూర్తిగఁ బ్రావఁ దోయధిని బ్రా ♦ ల్చుఁనాఁబునం బొందికన్
గలమున్ పెందెర కంబము ల్పొనర శ్రీ ♦ ఘుంబేగు సంగంబునన్
గెలఘంబుల్ పయికెత్తి హస్తముల గం ♦ గా వారి నీఁదె న్వడిన్. ౯౭౦

ఉ॥ సామజముల్ జలంబులను ♦ చప్పుడు సేసంగఁగ నీఁదుచుండ, ము
క్కామణులున్ దరంబులు ను ♦ దగ్ర ఝషంబులు లేవఁ ద్రోవఁ బ్రో
ద్భ్రమ మహాబ్ధి తోయమును ♦ దివ్య నదింజొర, దేవ గంగయున్
రాముని చూచు కౌతుక భ ♦ రంబుననో వడి దాఁటెఁ గూలమున్. ౯౭౧

చ॥ ఘనమగు తేరులందలి యు - గంధర చక్ర యుగానుకర్షముల్
పనివడి యక్ష మాదిగ న - వస్కరముల్ విడఁదీసి వానికిం
బనుపడఁ బూన్చు గుజ్జములఁ - బట్టుగ నావలఁ బంపినారు చ
చ్చిన పిదపన్ శరీరములఁ ♦ జేర్చెడు కర్మములం బలె న్వడిన్. ౯౭౨

తే॥ పాలముద్ద శరీరముల్, భయము ముద్ద, మనసు, కరువలి ముద్ద కా ♦ ళ్లును గలట్టి
పవన జవన తురంగముల్ - బయలు దేఱ, నడకఁ జొఱ ముద్ద నాఁదగు ♦ నావలందు

తే॥ కలుకు లెమ లెమ రయి యొత్తు - గాఁగఁ జేరి, కానవచ్చుటచే భద్ర ♦ గజ చయంబు
లొండొకటిఁ బ్రోమ్మ నిలువఁగా ♦ నొప్పుమీఁఱు, దంతములభంగిను బ్బైబన ♦ స్తనములొప్ప

తే॥ ఉత్తరీయములం బోలి ♦ యొత్తుగాఁగ, నలలు లేవ దిగిన మద ♦ హస్తి నికర
శిరములం గుంభ నరములు ♦ చెలఁగెఁ జూడ, జాహ్నవీ స్తనములఁ బోలి ♦ జానుమీఱి

చ॥ ఉరవడి నావలేగు నెడ ♦ నొక్కటి నొక్కటి దాఁకఁ గోమలుల్
కెరము మనః కలంకమునఁ ♦ గాతరలై యిరువంకఁ జూడ, దు
ర్ఘరమగు విభ్రమంబున, శ ♦ రంబులు ద్రోవఁ జలించి భీతిమై
నులుకుచుఁ బ్రమ్ముల్లు వాలుగల - యొప్పు వహించెను వారి చూపుకుల్

చ చెరచెర రెండు ప్రక్కలను ♦ చేరికఁ దెడ్లఁ గదల్చ లేచు తుం
పరలు పరాంగనా మృదుల ♦ వస్త్రములం దడుపంగఁ దోరపుం

బిఱుఁదుల కాంతు లుట్టిపడి ♦ వెల్వడ, జెండములందు కుంది ము
చ్చిరి తల వ్రాల్చు వీరులకుఁ - జింత రవంత తొలంగె నత్తఱిన్

శా॥ ఈ తీరంబునఁ గల్గు వాహినులఁ బై ♦ నెక్కించి కొంపోయి వే
ఱా తీరంబున డించి క్రమ్మఱఁ జేలు శరా ♦ స్యంబైన నౌకావళుల్
దాతృత్వం బెఱవోక యిచ్చి మఱియున్ ♦ దానంబు సేయంగ సం
ప్రీతిన్ రత్న నివాసుఁ జేరెడి ఘన ♦ శ్రేణిన్ విడంబించెడిన్.

ఉ॥ నమ్మిలి యీఁకలందనరి ♦ నల్లని ధూపము వోలె నాడు పొం
కమ్మగు కాఁడ లయ్యెడలఁ ♦ గంబములం బలె నిల్వ నాఁజె ము
త్యమ్ముల జంపు లుల్లసిల ♦ నల్లల నాడెడి నల్ల కొక్కెముల్
క్రమ్మిన చాపలంబలె వి ♦ రాజిల నావలు వోయె నల్లనన్. ౯౭౯

సీ॥ గంగ యాకాశంబు ♦ గాఁగఁ జిందిన ముత్తె, ములు విరాజిలు బుడు ♦ ములుగ నొప్ప
జెండమ్ములం బోలు ♦ సందంపు మోముల, మించు చుంబోఁడులు పయ ♦ నించు నావ
లెలమి జలము లాడి ♦ బృందారకాంగనల్, గమనించు సుర విమా ♦ నములఁ బోలె
తుంపురుల్ లేవఁగాఁ - ద్రోచు తెడ్లడుగుల, వలెఁ గానరాఁ జెల్వ ♦ లలరు నౌక

తే॥ వారి పాదంబులును వెలి ♦ వచ్చి తోఁప, ప్రాణములు పొంది నడచెడు ♦ పగిది నొప్పె
సేనలును పౌరవరులును ♦ చేడియలును, గంగ వెనుకఁ బడఁగ నట్లు ♦ కడచినారు. ౯౮౦

ఉ॥ తక్కువ జాతిచేత ఘటి ♦ తంబయి త్రోవఁగఁ బూను నావపై
నెక్కక కామ వేగమున ♦ నేపున మిన్నున మునివర్గముల్
చక్కన నేగె, నిక్కముగ ♦ సత్ఫల మిచ్చెడు కృత్య మొక్కఁడే
నెక్కడ నేనియుం గలదె ♦ యిద్ధ తపంబున కంటె నిద్ధరన్? ౯౮౧

చ॥ సుడులు గలట్టి వెల్లువలఁ ♦ జొప్పిలు గంగను దాఁటి యెల్లరున్
వొడరికఁ దీరముం గదియ ♦ దుర్ధన వాంఛలు నంచనంబులున్
విడిచి ప్రభుత్వముం జరపు ♦ వీరుల కీర్తులఁ గ్రిందు చేసి యీ
పుడమి మహోన్నత స్థితిని ♦ పొందిన యా భరతుండు చెచ్చెరన్.

తే॥ అనుపమగుణశత్రుఘ్నుఁడు ♦ జననులునును, మంత్రుఁడు నుగుహుఁడెక్కఁగా ♦ మాన్యుఁ
భరతుఁ డెక్కిన యంతనా ♦ పడవ నడవ, సాగఁ దెడ్లను కాళ్లతో ♦ సత్వరమున. [డైన

సీ॥ బాంధవుల్ దేవతల్ ♦ ప్రణతులై సేవించు ♦ కోసలేంద్రాత్మజున్ ♦ గుహుఁడు గాంచి
యీమె యెవ్వరి తల్లి ♦ యెఱింగింపఁ దగునన, భరతుఁ డిట్లను వేని ♦ వాకిలికడ
రాజులు మనవికై ♦ రహిఁ గాచి యుందురా, దశరథేశ్వరు జ్యేష్ఠ ♦ దార యీమె
కమలజు నాభిని ♦ గన్న మహాత్ముని, ఘన తనుఁ గడుపారఁ ♦ గన్న తల్లి

తే॥ భువన తారకమగు రామ ♦ భూమిపాలము, కడకు జగముల కొసంగిన ♦ కల్పతరువు
   జరసిం కనులచే నొందు భా♦గ్యంబు నెల్ల, నేను జనియించుకతమున ♦ నేఁగిగోనియె. ౯౮౪
తే॥ అనిశము ... రాముఁ యడుగు ♦ నడచెడఁగ, వత్సనుఁ బాయు గోవునా ♦ వనరు దేవి
యీతఁడెవఁడన నాయమ్మ ♦ హితుఁడు మహాకు, గుహుఁడని భరతుఁడా ♦ యమకుఁ దెలుప
ఉ॥ నాయనలార! మునుపు ♦ ఇంపుడు సత్య పరాక్రముండు భో ౯౮౫
గాయతనంబు రాజ్యరమ ♦ నందక కానకు నేగు పెన్న మే
తే మొనరం గతంబయిన ♦ దింక మహామతిఁ గూడి యెవ్వర
త్యాయుల భూమిం నేలు కొనఁ ♦ డర్మిలి నొద్దికఁ జాలకాలముల్. ౯౮౬
ఉ॥ అనుడు సుమిత్రఁగాంచి గుహుఁ ♦ డల్లన నిట్లనుఁ బ్రేమపూర్ణ యీ
జనని నిఁగూర్చి పల్కుమనఁ ♦ జక్కటి పీడని చక్రవర్తి కొ
ప్పిన కడగొట్టు భార్య రఘు ♦ వీరుని సన్నిధి పాయకుండు నా
యనుజుని కన్నతల్లి సుగు ♦ ణాలయ యంచు నతండు దెల్పఁగన్. ౯౮౭
చ॥ తనపతిఁ గాటికంపి కుప ♦ థంబునఁ బుత్రుఁడు దుఃఖ వార్ధిలో
మునుఁగఁగ రాఘవుండు వన ♦ ముం జొర విష్ణువు గొల్చు లోకముల్
తనమది నున్న క్రౌర్యమునఁ ♦ దక్కఁగ గొల్చిన కైకఁ జూపి యీ
జననిని గూర్చి పల్కుమనఁ ♦ జయ్యన నా భరత ప్రభుం డనుక్. ౯౮౮
ఉ॥ దొడ్డగు నెంజిలిక్ భువికిఁ ♦ దుందుడు కొప్పఁగ గూర్చి నిందయుక్
బిడ్డను పెంచుతల్లి పృథ ♦ వీస్థలి ప్రాణములేని బొమ్మఁ బె
రెడ్డఁ దపించుచుండ లవ ♦ మేని యలందురు చిన్నె లేని యీ
వెడ్డరి యెవ్వరో యెఱుఁగ ♦ వే? ననుగన్న మహాత్మురాలగుక్. ౯౮౯
చ॥ అనియతఁడాడు పల్కువిని ♦ యగ్గుహుఁడంతట వారికిం గ్రమం
బునఁ దనమేల్మి కేల్మొగిచి ♦ మ్రొక్కెను హంసి యొకండు తెక్కలక్
గొనక జలంబు నీఁది దరి ♦ గొన్న వితంబున ద్రోణియుం దరిక్
గొనకొని చేరె జాహ్నవికిఁ ♦ గూరిమిఁ జేతులు మోడ్చి రందఱుక్ ౯౯౦
తే॥ దిగిన జనులు ముప్పూరు ♦ తీరమందు, పల్లకీ లెక్కుచునఁగ నా ♦ భరతుఁడపుడు
క్రొత్త కస్సిటివెల్వలఁ ♦ జిత్తభార, మడఁగఁ గాల్నడ గుహునితో ♦ నడచి నడచి
తే॥ కర్మ భరము జ్ఞానాగ్నిచేఁ ♦ గాల్చివైచు, వరబలుండగు మునిభర ♦ ద్వాజువనము
చేరె నమ్మునివారల ♦ తీరుగాంచి, వృద్ధయతులతో నక్కడ ♦ కెదురు వచ్చె. ౯౯౧

౧౨ పాటికా పటలము. (౧౪౧)

క॥ అరుదెంచిన యతివరుఁగని, భరతుఁడు తండ్రివలె నెంచి ♦ ప్రణతియొనర్పక్
హరుఁ బోలిన యమ్మునియును, భరతుని దీవించెఁ బుత్రు ♦ వాత్సల్యమునన్. ౯౯౨

క॥ భరతా! నీకుం జేరిన, ధరణీం గిరీటము ధరించి ♦ తాత్పర్యమునన్
భరియింపక నారలు జడ, లిరవుగ ధరియించి రాఁగ ♦ నేమి కతంబో?. ౯౯౪

క॥ అనుడు మన మెరియఁగినుకను, మునివరుఁగని ప్రాఙ్జతిలక! మొట్టమొదట ని
ల్లనువగు పనియొనరుపలే, దనుటయు మీము బోఁటివారి ♦ కర్హామె చెప్పుఁడీ!. ౯౯౫

మ॥ శ్రుతి శీర్షప్రతిపాదితాంఘ్రియుగుఁడై ♦ శోభిల్లు శ్రీరామ భూ
పతికిం దమ్ముఁడనై నెటీన్ విడిచి భూ ♦ భారంబుఁ గై కొందునే?
యతఁడే వెన్కకు వచ్చి రాజ్యము ప్రియం ♦ బారం గొనండేని ని
శ్చిత బుద్ధిన్ వనులంద యున్నకడ ని ♦ శ్చింతం బ్రవర్తించెదన్. ౯౯౬

క॥ ఆపలుకు భరతుఁ డాడఁగఁ, దాపస వరతనువు లుబ్బెఁ ♦ దన్మానసముల్
ప్రాసిత హరిచందన కృత, లేపమ్ముఁ బోలె మోద ♦ లీలలఁ దేలెన్. ౯౯౭

క॥ మునుకొను నెనరున భరతుని, తన శుద్ధకుటీరమునకుఁ ♦ దతమతిఁ గొని య
మ్మునిని నేనకు విందులు పం, బిన వేడ్కన్ నొనర్తు ననుచు ♦ వేలిమి చేసెన్. ౯౯౮

క॥ తలఁచిన యంతన దివియును, లలిత గతి న్నిలిచె జనము ♦ లకు వేఱొక పు
ట్టాలసిన గతి తమ ముందటి, నెలవు మఱవ సుఖ జలధి ము ♦ నింగిరి వారల్. ౯౯౯

తే॥ చెడని ధర్మ ఫలంబులఁ ♦ బడయువార, లంచు రంభాదు లెదు రేగు♦ డెంచి పొగడి
యిందు మండలములఁ బోలి♦మెసకమెసఁగు, సౌధములకుఁ గొంపోయిరి♦సకలజనుల

తే॥ గందవొడి మేనఁగూర్మి న ♦ లందినారు, విన్నువాఁకలో మున్కగా ♦ వించినారు
శిరములం గల్ప సుమములఁ ♦ జెరివినారు, సుమములంబోలు వల్వలఁ ♦ జుట్టినారు

తే॥ కుసుమ లత కూనలం బలెఁ♦గుసిని నిలిచి, సుందరాంగులు నగలిచ్చి ♦ సొగసుచేసి
యొనర దేవ రాజాను పీ♦ యూష కల్ప, మైన యోగిరములు వెట్టి ♦ యలరఁజేసి

తే॥ హంస కేకి తూలిక లెత్తు ♦ నైన పత్తి, తెల్లదూది బూరుగదూది ♦ తీర్చిచేయు
పట్టుసెజ్జల హరిణుల ♦ పగిది దేవ, వనితలు పరుండ నెల్లరు ♦ కునికినారు. ౧౦౦౩

తే॥ పలికలు మొదలుగఁ బల్ల ♦ కీలు మోచు, వారివఱకుఁ గ్రమంబుగా ♦ గారవమున
మహిమ నొందిన విబుధుల ♦ మాడ్కినుపచ, రించి వారి యెడఁద లల ♦రించినారు

తే॥ అటులు రంభాదులైన బిం ♦ బాధరలును, వారియాజ్ఞల దాసుల ♦ వలె నొనర్ప
భరతుతోవచ్చుకాంతలు♦ భవ్యమైన, దివ్య భోగంబులంది సం♦తృప్తిఁ గొనిరి.౧౦౦౫

తే॥ నందనవన నవ ప్రసూ ♦ నములతావి, గొనుచు నంధులు కేలూఁత ♦ గొని చరించు
కరణి నచ్చటి పిల్లతె ♦ మ్మెరలు పొలసె, సకలజనముల మనములు ♦ సంతసింప.

తే॥ క్షౌద్రమెక్కువ కలిపిన ♦ కబళములను, లేఁత వరియూరురాసి గ ♦ ల్పించి కల్ప
కభబు లొనఁగ భుజించెను♦గజచయంబు,మదజలముద్రావిమధుపము♦ల్మదముగొనఁగ

చ॥ ఇహపరసౌఖ్యముల్ విడిన ♦ యీ భరతోద్ధుర బాహుశక్తియుక్
సహచరసైన్య సత్వమును ♦ సత్యపరాక్రమ! నీదు తమ్మునిన్
త్సహాన మహాసహాయ జల ♦ సంపదయుక్ పదమారఁ జూడు దు
స్సహతర కష్టము ల్దొలఁగి ♦ సంతసమందెదు నేఁడు రాఘవా! ౧౦౧౯

ఉ॥ పీనుఁగు పెంట చేసి యిటఁ ♦ జొచ్చిన తుంగ మతంగజంబులన్
జాను తొలంగి పడ్డ రథ ♦ సంఘముఁ గ్రొవ్వులు చిందు కూలు నీ
సేనల నడ్డగించ్చి తెగి ♦ చిందఱ వందఱ యైన తేజులన్
మానను రక్తవాహినుల ♦ మానక చూచెదు గాక రాఘవా! ౧౦౨౦

చ॥ తెగతెగ లొప్పు తూపులఁబడి ♦ దంటల చేతుల బొందడంబులం
దగమగు తొమ్మ్రులం బోలిచి ♦ దద్దఱు ప్రాణము తోడ వీఁపునం
గళచెడ దుస్సిర క్తము ను ♦ ఖంబుల నొప్పఁగ వెల్లదిక్కరుల్
కళవళ మంద నేచులను ♦ గాంచెదు గాక ప్రసన్నరాఘవా! ౧౦౨౧

చ॥ జవన తురంగముల్ కెరల - స్యందన హాటక శృంగ పంక్తులం
దపరత్వమై పిశాచములు - హుంకృతి నార్చుచు ప్రీలు కేడెముల్
దవిలి ధరించి హస్తములు ♦ దట్టుచుఁ బాటలు పాడు చాడుచున్
జవి గొన పల్లఁ ద్రాక కడు - జంపునఁ ద్రేన్చుట చూడు రాఘవా! ౧౦౨౨

తే॥ భరతు సేనా మహీజంబు - పాదు తోడఁ, ద్రుటిని పేరు లేకుండఁగఁ - ద్రుంచి వైవ
స్వర్గ పృష్ఠంబు పెఱుగ స్వభాస మీరఁగ, ధాత్రి యూటట గొనుటయుఁ-దవిలి కనుము

చ॥ ఎగసిన రక్తవాహినుల - నీఁదుటచే నొడలెఱ్ఱనైన శా
కినులును ప్రేత భూత తతి ♦ గిట్టి కబంధములున్ సమస్త ప
ట్టనములు నీ కరంబుల న ♦ శంగిన వంచు సురావళిం బలెన్
గని మనమందు సంతసిలి ♦ గంతులు గాంచెదు గాక రాఘవా!, ౧౦౨౪

క॥ కరులు హరులు బలియురు తెగ, నురవడిఁ బ్రవహించు రక్త ♦ మదధిం గలియన్
శరధులు రక్తశరధులై, మొరయుటగని మనమునందు ♦ మోదింతు నృపా. ౧౦౨౫

చ॥ విఱుగ శతాంగముల్ రథిక ♦ వీరులు చావఁగఁ గైదువుల్ చెడన్
దటుకఁగిన దంతి వాజి భట ♦ తండ శిరమ్ములు నంగ్రఘు లూరువుల్
బరులు కరంబు లొండొకటిఁ ♦ బాసి రణస్థలి ఘోరభూమిగాఁ
బఱపు మదీయ బాణముల ♦ పద్ధతి గాంచెదుగాక రాఘవా!, ౧౦౨౬

చ॥ మురువగు టెక్కలున్ గనక ♦ పుంఖములుం గల మచ్చరంబుల
య్యురువుర తొమ్ములం బొలిచి ♦ యిచ్చమెయిన్ గగన స్థలంబునన్

భరతుఁడు రాముని డాయ వచ్చుట.

తే॥ రాముఁడిట్టులు తమ్ముని ♦ రార్చుచుండ, భరతుఁడచ్చట సేనన ♦ వ్వలనె నిలిపి
తన్ను వీడని యనుజుతో ♦ దగ్గఱించి, యన్నస్థితిఁ గాంచె నుమ్మలు♦మధికరింప. ౧౦౩౭

ఉ॥ దోయిలి గూర్చు హ స్తముల ♦ తో వసివాడి కృశించు మేనితోఁ
బాయని దుఃఖవేధ జిగి ♦ వాసిన కన్నులతో జటాలితో
వ్రాయఁగ రాని దుఃఖమయ ♦ భావముతో నొక నారచీరతో
డాయఁగ వచ్చు నా భరతుఁ ♦ దప్పక రాముఁడు కాంచెఁ బూర్తిగన్. ౧౦౩౮

తే॥ లక్ష్మణా! యిటు రమ్ము బ♦లంబు గలుగు,భరతు నంగర యోగ్య రూ♦పంబుఁ గంటె!
యనుడుఁ దమ్ముఁడు నాతని ♦ నట్టె చూచి, ప్రమానుపడి నిల్చెఁ గన్నీటి ♦వానతోడ.

తే॥ తాను నిందించు పలుకులు♦తనదు కినుక, నెంచి సిగ్గిలి డెందంబు ♦ నంచలింప
వింటితో వేడి బాష్పముల్ ♦పృథివిఁదొరఁగ,వాడిన మొగంబుతో తెచ్చ♦వడుచునిలిచె

ఉ॥ న్యూనతి లేకయుండఁ దప ♦ మున్నతిఁ జేసి ఫలంబు పొందుచో-
భాను కులేశుఁడా మగనిఁ ♦ బాసి శుభంబులఁ బాసి శోకముం
బూని కృశించు రాజ్యరమ ♦ పూనిక నంపిన దూతవోలె మో
డ్పూనిన కేలుతో భరతుఁ ♦ డుత్కట దుఃఖము తోడ డగ్గఱెన్. ౧౦౪౧

తే॥ తలఁచి మరణించు తండిరి ♦ నరసినట్లు, కాంచి తగవు దలంపక ♦ కరుణ వీడి
నీతి మానితి వనుచు మై ♦ నెలవు తప్పి,పాదములఁబడె హా!యను♦రోదనమున.౧౦౪౨

తే॥ ఉసురు లున్నవో లేవో యం!చూహ సేయఁ, దగినతీరునఁగృశియించు♦తమ్ముఁగాంచి
నేత్ర కంజముల్ విడుచు క ♦ న్నీరు భరతు, జడల నించి పొరలి కాలు ♦ జడిమ నిలిచె

తే॥ ఆదిదేవుఁడు ధర్మంబు ♦ నలము పగిది, నెల్ల నీతుల కిల్లయి ♦ యెనఁగు రామ
వరుఁడు నిట్టూర్పుపుచ్చి బా♦ష్పములు వీఁపు,నం బడఁగఁ దమ్మునాలింగ♦నంబొనర్చె

క॥ అలమికొని యతని వేషము, పలుమఱు గమనించి యరసి ♦ వత్సా! జనకుం
డెలమిని సుఖముం బొందునె? యిల నేలునె? దుఃఖ మొంద ♦ నేలా? యనుడున్.

తే॥ అన్న! నీవియోగ వ్యాధి ♦ యలము కొనఁగఁ, గన్నకైక వరంబను ♦ కాలువలనఁ
దనకుఁ దగిన సత్యంబును ♦ ధరణి నిలిపి, స్వర్గలోకంబు చేరెను ♦జనకుఁ డనఁగ.౧౦౪౬

మ॥ పరలోకంబునఁ జేరె నన్న పలుకుల్ ♦ బల్లెంబుఁ గాయంబులో
జొర దూటించిన యట్టులై చెవులలోఁ ♦ జొత్తెంచు మున్నే వెసన్
సురలోకోపరిలోక మేలఁదగు సు ♦ శ్లోకుండు వ్యాన్నేత్రముల్
సురుఁగం గాలిపటంబు చుట్టు కరణిం ♦ జుట్టెన్ ధరన్ వ్రాలుచున్.౧౦౪౭

తే॥ మొదలు నహుషేశ పూజ్యుఁడు ♦ ప్రథమ ద్రావాలు, సరగోఁ బడి పిడుగున కల్కు ♦ సర్పమువలె
తెలిసి వచ్చి యొకింతకు ♦ దేజ యూర్పు, పుచ్చి తపియించి మాటాడక ♦ పొగిలెనొగిలె

సీ॥ ఆజని భాను కు ♦ లాలయ దీపమా! నిర్వ్యాజ గురు ధర్మ ♦ నిలయ! తండ్రి!
అరిమద గజసింహ ♦ మా! దయాలోల! యిం, కెవ్వరు సత్యంబు ♦ నేలు వారు?
మాకు దిక్కెవ్వరు? ♦ మఱి తేర్చువారెరు? మరణించితే యిట్లు ♦ మమ్మువాసి
యెవ్వరి నింకఁ దం ♦ డ్రీ! యని పిల్తుము, తగునె యిందఱ వీడి ♦ తరల నీకు

తే॥ మేటి ఋష్యశృంగునిచేత ♦ మేల్మి వేల్మి, యొనరఁ గావించి ననుగాంచి ♦ యుర్వియందు
కన్న గొప్ప ఫలంబేది? కడకు మమ్ము, వీడి యింపైన ప్రాణముల్ ♦ వీడుటొక్కొ?

తే॥ ప్రాణులకు మేలుసేయు దా ♦ ర్ఢ్యంబు గలుగు, భూమి భారము నేఁ బాల్పఁ ♦ బోడమువిఘ్న
హేతు విదియొక్కో? నీయాన ♦ యెగురఁగొట్టు, కాలుఁడై పుట్టితినె జగ ♦ మేలుకొఱకు?

తే॥ శంబరుం జంపి వజ్రికి ♦ స్వర్గమిచ్చు, పార్థివేంద్ర! పాలనము మా ♦ వశము చేసి
యింద్రియములు స్వవశముగా ♦ నెనఁగఁజేసి, తపము చేసిన విధమిదే ♦ తండ్రినీవు?.

ఉ॥ కోరఁగఁ దగ్గ పాలనము ♦ కోరిక నెల్లను వేఁడఁ బూని యీ
ధారుణి కెల్ల దుఃఖమును ♦ దార్చిన యప్పుడె నైతి మృత్యువుం
గోరుట దక్కఁ బ్రాణములఁ ♦ గూరిమి వీడని మేను వెంచి యే
నేరి మొగంబు గాంచుటకు ♦ నింకను మేదిని నుండఁ గోరుటల్?

తే॥ కోసలము వీడి యడవి నీ ♦ కొడుకు చేరె, ననుచు విన్నంతనే దివి ♦ కరిగితి వట
తండ్రి! నీమృతి వినియును ♦ తలరి తలరి, బ్రతికియే యున్న వాఁడను ♦ బ్రదుకుగోరి

ఉ॥ జానుగఁ బూర్ణ చంద్రమునకుఁ ♦ జల్లఁదనంబు నొసంగు లోకిన
మ్మానసితాతపత్త్రినృప! మానము దివ్యుల కేని మాన్పఁగా
రాని బలం బుదారత తి ♦ రంబగు సత్యము నీతి ధర్మముల్
దోన యడంచు కొంచు నిటు ♦ తూఱితె యెల్లర వీడి స్వర్గముల్?. ౧౦౫౮

తే॥ ఇట్లు పలువిధముల నెలు ♦ గెత్తి యేడ్చు, రామచంద్రుని తమ్ముల ♦ రాజవరులు
చేరి లేపి పట్టుకొనవ ♦ సిష్ఠుఁ డంత, హితమితోక్తుల నోదార్ప ♦ నెంచుటయును.

తే॥ తాపస శ్రేష్ఠులగు భర ♦ ద్వాజుఁ డాది, మునులు నేడు దీవుల లోని ♦ మనుజవరులు
మంత్రులును సైన్యపతులు రా ♦ మ విభుఁ జేర, వచ్చిరి మనంబులారట ♦ పడుచునుండ

తే॥ మఱియు రాఁదగు నెల్లరు ♦ మలసి వచ్చి, నిలువఁ బరితపించుచునున్న ♦ నృపకుమారు
మోముఁగని బ్రహ్మసముఁడగు ♦ మునివరుండు, వాక్యకోవిదుఁ డీరీతి ♦ పలుకఁదొడఁగె.

చ॥ తతమతి సన్న్యసించుటయు ♦ ధర్మమొనర్చుట దక్క నెమ్మదిన్
బ్రతుకఁగ గోరు పుణ్యులకుఁ ♦ బ్రాపగు సాయమొకండు గల్గునే?

మృతియును పుట్టువుం సహ ♦ జమే కద! ప్రాణుల కెల్ల భూమిపై
శ్రుతి హితపారగుండవు వి ♦ శుద్ధ చరిత్రుండవుం స్మరింపవే? ౧౦౫౮

తే॥ స్థిరములేని జన్మంబులు - దెలుపనేల? క్రోట్లకొలందియూనవి కామ - కోపమోహ
దుఃఖసౌఖ్యములొందునీ-తోయమెఱింగి, యముండుదాక్షిణ్యయుతుండని-యనఁగదగునె

ఉ॥ పుట్టక మున్నె జీవములు ♦ పోవ జనించుట చూచుచుండమే?
పట్టగు విద్యకల్మి భువి ♦ భారము సర్వదివేల యేఁడు లి
ట్టట్టు చలింప క్రోర్చి నెల ♦ వారిన ధర్మము కీర్తి నించి యే
దిట్ట గతింప నిట్లు వగఁ ♦ దీల్పడఁ బాడియె? రాజనందనా! ౧౦౬౦

తే॥ శీలమును ధర్మమును భువిఁ ♦ జెడక నిలిపి, శూలమును చక్రమును వాణి ♦ లీలఁ దాల్చి
మూల పురుషులై వెలయుము ♦ మ్మూర్తులకును, కాలమను వలఁబడకుండఁ ♦ గావశంబె?

తే॥ ఇంద్రియంబుల కెఱుకయై ♦ యిలను వెలయు, నన్నిటికిని మూలంబులై ♦ యమరుపంచ
భూతములు నొక్కయప్పుడు ♦ పొలియు నవియె, యనఁగదీనికిఁ జింతింప ♦ నగునె చెపుమ?

తే॥ పూజ్యమగు పుణ్యమను నేయి ♦ పోసి కాల, మనెడి వత్తిడి నిధియను ♦ నగ్గిచేత
జీవితమను దీపము నుద్దీ ♦ పించి నిలుపఁ, గారణములు రెండును తీఱ ♦ నాఱు టరుదె?

తే॥ ఈజగంబున దుఃఖమం ♦ దేమునింగి, యాజగంబున నరకంబు ♦ నందె మునిఁగి
మరల జన్మించి చిక్కుల ♦ మలఁగుచుండు, పెక్కు వగల జీవుల లెక్క ♦ పెట్టనగునె?

తే॥ వినుత సద్గుణాకర! తండ్రి ♦ యనెడు కతన, సృష్టికర్తయౌ బ్రహ్మకుం ♦ జెందరాని
విష్ణులోకంబు నందున ♦ వెలుఁగు చుండె, నతనికీవు గావించు సా ♦ యంబిఁకేది? ౧౦౬౫

ఉ॥ ఆతని పోకకై మదిర ♦ వంతయుఁ జింత యొనర్పరాదు పై
నాతని కింతకంటె నర ♦ యం గడ తేఱు పథంబు లేదు నీ
వాతని కింకఁ జేయఁదగు ♦ నయ్యవి యున్నవి శ్రద్ధతోడ నీ
చేతులతో నొనర్పు మది ♦ చిత్తము శాంతిలఁ గారణంబగుం. ౧౦౬౬

ఉ॥ వాన పడంగ నీటిపడి ♦ భాసిలు బుద్బుద పంక్తిబోలు నీ
మేనులఁ గూర్చిచింత మది ♦ మీఱుట వేఱేఁడి లక్షణంబగుం
మానక బాష్పముల్విడిచి ♦ మానిసి గాంచు ఫలంబు గానముం
గాన జలాంజలి న్విడుము ♦ గాదిలి తండ్రికి జానకీశ్వరా!. ౧౦౬౭

తే॥ అనుచు శ్రీరాముఁడును చింత ♦ నవలఁద్రోచి, యాచతుర్వేద వేదిమ ♦ హాతపస్వి
యగు వసిష్ఠుతో గంగకు నరుగు దెంచి, చేయఁదగు కృత్యముల భక్తిఁ ♦ జేయఁబూనె

తే॥ సకల జీవాత్మలకు నొకే ♦ చంద మొప్పి, యెఱుక నొసఁగు మహాత్ముఁడ ♦ య్యేటమునిఁగి
గురుఁడు తెలిపిన విధులెల్లఁ ♦ గొఱఁతలేక, సలిపి మమ్మాఱు తర్పణ ♦ జలము వదలె.

తే॥ చేయఁదగు క్రియలనుప్రాప్తి-చేసి యవల, మాన్యులగుమంత్రులునునృపుల్-మానివరులు
తక్కువారలు తను చుట్టి - తరలి రాఁగ, జానకి వసించు నప్పర్ణ - శాలఁ జేరె. ౧౦౭౦

తే॥ చేరునంతలో భరతుండు ♦ సీతయున్న, పర్ణశాలను గని యొంటిఁ ♦ బరఁగుచుంట
గని కరంబులతో మోఁది ♦ కొనుచుఁ గనుల, రోదనముతోడఁ బడె నామె ♦ పాదములను

తే॥ ఇంద్రియములలో జలనిధు ♦ లేడునున్న, వనఁగ నెఱ్ఱనౌ కన్నులఁ ♦ బనవి పనవి
వెక్కి వెక్కి బాష్పాంబువుల్ ♦ వెల్లువలుగ, నేడుచుచుండెను భరతభూ ♦ విభుఁడు వెలికి

క॥ పెను దుఃఖంబున మునిఁగిన, యనుజుని తన పాదవ్రుచేతు ♦ లమరిచి రాముం
డనువుగ నెత్తుచు సీతను, గని జనకుఁడు మనలవీడి ♦ కడచనె ననుచున్. ౧౦౭౩

క॥ వడఁకూను నెడఁదతోడన్, బుడమింబడి యడలి యడలి ♦ పొక్కుచుఁ బెలుచన్
గడలికవ యనఁగఁ గనుఁగవ, యెడపక బాష్పములు విడిచె ♦ నెన్నువతోడన్. ౧౦౭౪

క॥ కలకంఠంబున వనరెడు, జలజాక్షికి భర్తవెంటఁ ♦ జనిన యడవియున్
విలసిల్లెఁ బ్రోలుగా నిపు, డలరాణ్మృతి దుఃఖ జలధి ♦ నడుగుల నిలిపెన్. ౧౦౭౫

క॥ ముని పత్నులు తల్లుల వలె, జనక సుతను డాసి హస్త - సరసిజములతోఁ
గొని విమల జలములందున, మునిచి యడలు పోవఁ బలికి - మోదించి రొగిన్. ౧౦౭౬

క॥ నలువురు రాజ కుమారులఁ, బొలుపుగఁ గను పూజ్యురాండ్రు ♦ ముప్పురతో వృ
ద్ధుల తోడ సుమంత్రుండు డిన, కుల జలనిధి విధుని కడకుఁ ♦ గుములుచు వచ్చెన్. ౧౦౭౭

తే॥ మొదటి వాఁడగు నలువకు ♦ మొదటివాఁడు, తండ్రి వీడి వచ్చితిరె యో ♦ తల్లులార!
యనుచుఁ దచ్చరణాబ్జ చ ♦ యంబు లందు, వ్రాలి కన్నీటి కాల్వలోఁ ♦ బరితపించె.

క॥ వారలు నొక్కట రాముని, వారక కౌఁగిలిని చేర్చి ♦ వనట యుబుకఁగా
బోరున రోదించిరి యం, గారమ్ము న నేయి కరఁగు ♦ కరణిఁ గరఁగుచున్. ౧౦౭౯

తే॥ అవల నవ్వీరులంగన్న ♦ యవ్వలచటి, తీయని యెడంద గలుగువై ♦ దేహిఁ జేరి
చెలువకబ్బిన యప్పటి ♦ స్థితిని గాంచి, కడుపు మండి కట్టుకొని పెల్లడలినారు. ౧౦౮౦

తే॥ యోధవరు లయోధ్యంగల - యోగ్యజనము, రాజబంధువుల్ తక్కిన-ప్రజయువచ్చి
క్లిశిత మానసములతోడఁ ♦ గిట్టిరాము, వేషమును స్థితిగని చాల ♦ వెగచినారు. ౧౦౮౧

చ॥ పడగల నీడఁ బాఁప దణి - పాన్పునఁ బండుట మాని ధాత్రిపైఁ
బొడమిన లోక నాయకుఁడు - పొందిన తక్కుల నాథుఁ డౌటచే
నడరిన యంటు వోమునిఁగి - యర్హ విధు ల్పొనరింప నేగె నాఁ
బడమటి వార్ధిలో మునిఁగె - భాస్కరుఁ డంతట లోక శాంతికై. ౧౦౮౨

## భరతుఁడు రాముఁ బ్రార్థించుట

సీ॥ ఆనాఁడు కడవఁగా - నవనీపతులు రాజ, బాంధవుల్ మునులును - బలసియుండ
శ్రీరామ చంద్రుండు - చెంతనెయున్న భరతుఁ గాంచి వత్స! యీ - హితమునీనుము
జనకుఁ డవ్యయ పదం - బునకేగె నతనియా, జ్ఞానుసారముగ రా - జ్యంబు నీదె
మకుటంబు ధరియించి - మహిఁ నేలఁ కీలీలఁ, దపసి వేసము నూనఁ - దగునె? యనుడు

తే॥ నీవు కాఱడవులఁ జేరి ♦ యిట్టులుండ, ధర్మమూర్తు లెవ్వరు? పురి ♦ ధర్మమేది?
పాడి నీకంటె మున్నె యీ ♦ వనము చేరె, దాసిఁబడసి కొంపోవంగఁ ♦ బూనినాఁడ.

తే॥ మనసు సమ్మతింపని వర ♦ మఁ:ననెనిన్న, తగని స్థితి నిల్పియంతట ♦ మగనిఁ జంపి
నట్టి కైకేయి కన్నట్టి ♦ పట్టిగాన, నాకు నీవేషముచిత మ ♦ న్యంబు తగునె?. ౧౦౮౪

చ॥ జగములు సంతపింప బలు ♦ జాలిని గూర్చిన దుష్టురాలి కిం
బుగ జనియించు పాపగుణ ♦ పూర్ణుఁడఁ గావున నాకుఁ జావఁగాఁ
దెగువయుఁ గల్గ లే దొడలి ♦ తీపియుఁ బోదు తపంబు సేయఁగన్
దెగడికనుండి తప్పి కడ ♦ తేఱెద నింత యనుగ్రహింపవే. ౧౦౮౫

తే॥ కొలముపాడి వీడిన నతి ♦ గుణము, నోర్పు, పరఁగకుండు తపంబును, కరుణవిడిన
ధర్మమును, పూర్వ వంశ ప ♦ ద్ధతులు నీఁగు, పాలనము కంటె మేలయి ♦ క్రాలునేమి?

చ॥ జననము తోడ నీకుఁగల ♦ స్వామ్యము, వీడఁగ రానిదా సనా
తన కులధర్మమా పదవిఁ ♦ దప్పఁగఁ ద్రోసి తపంబు పూనె దీ
వనునెడఁ బట్టుపట్టి నయ ♦ మాఱిచు ధర్మముఁ ద్రెంచి బ్రింగువా
రిని బలె రాజ్యపాలన వ ♦ రించి చరింతునె నీకుఁ దమ్ముఁడన్? ౧౦౮౬

ఉ॥ మేర యిడంగరాని పెను ♦ మేలిమి కూరిమితండ్రి చావఁగాఁ
గారడపిం జరించుచును ♦ కాయలు మెక్కుచు నీవు వోవఁగా
వేఱిమితోడ వంచనము ♦ వెంచి ధరాస్థలిఁ గవ్వికొంటకున్
జేరిమి క్రుంగి యున్న తఱిఁ ♦ జేరిచి నాఁచుకొనంగ వైరినే? ౧౦౮౭

మ॥ భువనాధీశ్వర! తండ్రి చేయు పారపున్ ♦ బోరామి లోకాలకున్
దవులం జేసిన కైక కీడు భువిఁజెం ♦ దన్ రాక రక్షింపఁ బ్రా
భవ సామ్రాజ్యము నేల రమ్ము జగముల్ ♦ భవ్యంబులం బొంద మా
భవ బంధంబులు డింద నంచు నిటు వి ♦ స్పష్టంబుగా నాడఁగన్. ౧౦౮౮

తే॥ భరతు పల్కులు విని వాని - భావమెఱిఁగి, చింతనము చేసియతని నీ - క్షించి వత్స!
నాదు పలుకొందు కల్లదు వి - నంగఁదగును, చాల ఘోచింప ధర్మసూ - క్ష్మంబు దెలియు

ఉ॥ శీలము సత్యముం దగవు ♦ చెల్మియు నీతియు వాంఛనీయమౌ
మేలిమి ముఖ్యగోత్రములు ♦ మెచ్చగు సత్పథవృత్తులెల్ల భూ
పాలుర శాసనంబులకు ♦ బద్ధములై భువి నిల్చుచుండు నీ
ప్రేమ మహంబు రాము డని ♦ లెంచి తలంపుము సద్గుణాకరా! ౧౮౧

ఉ॥ ఉత్తమ శాస్త్రముల్ వినుట ♦ యుత్తమ బుద్ధి గడించు చుండుటల్
ఉత్తమశీలముం గొనుట ♦ యుత్తమవృత్తుల నభ్యసించుటల్
చిత్తము దేవుపై నిడుట ♦ చింతన సేయఁగఁ బెద్దవారె కా
సత్తమ మార్గ దర్శకులు ♦ సత్యము నీవుఁ దలంచి చూడుమా. ౧౮౨

తే॥ ఆమహాత్ము లెవ్వారని ♦ యడుగ వలతె?, యెల్లవిధముల మనసున ♦ నెంచిచూడ
తల్లిదండ్రులు దక్కఁగ ♦ ధరణియందు, వేఱెవరు లేరు నిక్కంబు ♦ విమలచరిత!

మ॥ జను లభ్యాసము సేయు శాస్త్రములవై ♦ శారద్యముం గొన్నపా
వన చారిత్రక! తండ్రి యాజ్ఞ గొని సం ♦ భావ్యాన్వయౌచిత్యభా
వనతో దానిని సమ్మతించితిని నీ ♦ ప్రార్థించుటం జేసి వీ
డినచో సత్యాది సద్గుణం బగునె? పా ♦ టింపంగ లేవే మదిన్?. ౧౮౪

క॥ తనయులు తలిదండ్రులకున్, ఘన కీర్తిని కూర్చుటకొ? య ♦ ఘంబగు నిందం
బెనుచుటకొ నీవచెపుమా? జనియించిన ఫలము సుజన ♦ సన్నుత చరితా! ౧౮౫

ఉ॥ ఏను దురాశచే జనకు ♦ నీభవమందునఁ గల్ల రీసిగాఁ
బూనిచి రౌరవంబున గు ♦ భుల్లునఁ ద్రోచి వినోదసౌఖ్యసం
ధానక రాజ్య భోగములఁ ♦ దాల్మిని పొంది రహింపనేర్తునే?
మానవుఁడైన వాని కిహ - మాత్ర సుఖంబులు సుస్థిరంబులే?

చ॥ ధరణి నొసంగి సత్యమునఁ - దప్పక నిల్చిన తండ్రి పల్కుచే
భరత! ధరిత్రి నీదెయగు - ♦ బాలన సేయఁగఁ దగ్గ సత్త్వముం
బొరసిన నీదెయౌ మహిఁ బ్ర ♦ భుత్వపు టర్హత నీకెయున్న దిం
కరమర లేల? యేలుకొను ♦ మయ్య జనంబులు సంతసిల్లఁగన్. ౧౮౬

తే॥ అనుడు భరతుఁ డిట్లను జ్యేష్ఠుఁ ♦ డగుచుఁ బుట్టి, మూఁడులోకంబులను సాటి ♦ మొనయకుండు
నీవ నాదిరాజ్యంబని ♦ యెంచితేని, నీక యొసఁగితి రమ్ము మ ♦ న్నించి మమ్ము. ౧౮౭

ఉ॥ భూమి సమస్తముం గలఁగి ♦ మ్రుచ్చిరు చుండఁగఁ జూచి చూచి పై
నీమనమందు దోఁచు లలి ♦ నే యొనరింతె? కలంక దేఱఁగాఁ
బ్రేముడి వచ్చి మమ్ము కయి ♦ వీడక ప్రోవుమ యంచు దీనతన్
రామ పదాంబుజంబులు క ♦ రంబులఁ బాయక పట్టెఁ బట్టుదల్. ౧౮౮

తే॥ నెనరు మనసున సేయిచ్చ ♦ నేర్చినట్లు, నేల యిచ్చుట కొనుటలు ♦ నీతియగునె?
నిందకై జంకి జనకుండు ♦ ...కునొసఁగ, నాఁడు సమ్మతించిన యేండ్లు♦నేఁడె చనెనె?

తే॥ సత్యమొక్కటి దక్క యీ♦జగమున వేఱు, ప్రాతిగుణమున్నదని చెప్పఁ♦బూనునేమి?
సత్యమున నుండి జాఱ దుః♦ఖ్యాతృత్యమయగుఁ,గాని వేఱొండగునె నీవ♦కాంచుమయ్య

క॥ ముదమున జనకుని యానతిఁ, ...మనా గ్లేండ్లేను వనుల ♦ వసియింపంగా
సదమలమతివై యంతకు, వ...లకె నాయాజ్ఞ నీవు ♦ వసుధం గొనుమా. ౧౧౦౦

తే॥ తండ్రి యపుడె కిరీటంబుఁ♦జాల్పు మనఁగ, నతని యాజ్ఞ మీఱఁగ జంకి♦యనుమతించి
నాఁడె నదియెంచి నావచ♦నం...దాఁటఁ, దగునె? పని ఏనుఖుంకఁ జిం♦తనమువలదు.

వసిష్ఠుఁడు ...ము నయోధ్యకు రమ్మని కోరుట

ఉ॥ తేజిత సత్త్వశాలి ... ♦ ధీరుఁడు రాఘవుఁ డిట్లు వల్క వి
భ్రాజిత కీర్తిశాలి ప్రతి ♦ భన్ భరతుండు వచింపఁ బూన నం
భోజభవాత్మజుం డనియెఁ ♦ బూర్వ నిరూఢ పరాక్రమాఢ్యులౌ
రాజుల సచ్చరిత్రములు ♦ శ్రద్ధను విన్మరియాంట దీఱఁగన్. ౧౧౦౪

ఉ॥ తొల్లి వరాహమూర్తియయి ♦ తోయజ నేత్రుఁడు కోఱ పంట జా
బిల్లి కలంక మట్లు కి...పింప ధరన్ జలరాశి నుండి యు
త్ఫుల్ల మనంబుతోడ జన ♦ ముల్ పరితోషమునొంద నెత్తి నాఁ
డల్ల సిత ప్రకాశమున ♦ నొప్పుచు నెప్పటియట్ల యుండఁగన్. ౧౧౦౫

మ॥ విల యాంతంబునఁ బంచ భూతములు ని - ర్వీర్యంబులై తేజముల్
గాలియున్ దత్త్వము లెల్ల లీనమగుడున్ ♦భూతేశుఁడౌ విష్ణు వీ
జలరాశిన్ సృజియించి యందు బహు వి ♦ శ్రాతిం గనంగోరి ని
ర్మలమౌ మేటి వెలుఁగు రూపమున ని ♦ ద్రం జెందె మత్తాకుపై. ౧౧౦౬

తే॥ ఉన్నతులగు వేల్పులకుఁ బీ ♦ యూష మొసఁగు, కడలి వంటి నల్లని మేను♦గలుగువాని
నాభియందు పుట్టిన నలి ♦ నంబు నుండి, యఖిల జగముల సృజియింప ♦ నజుఁడుపుట్టె

తే॥ అవ్విరించి జగంబుల ♦ నివ్వటిల్లఁ, జేయుచోఁ గల్గెఁ దొలుత ని - శిష్టమైన
మీ మహాన్వయ మందలి ♦ మేదినీశ, వరులు నెఱి దప్పవారలీ ♦ వఱకు లేరు

తే॥ శ్రుతులుశాస్త్రములిహపర♦సుఖములొందఁగఁజపుగురుఁడెపోఘనుఁడుజ♦గంబులందు
తండ్రు లైదుగురం దని ♦ తద్జ్ఞు లండ్రు, నిక్క మిదియుఁ గుమారక! నీవెఱుఁగవె?

తే॥ సదమలాత్మక! యేను శాస్త్రములు పెక్కు, లెలమి నేర్చిన ఫలము నా♦కెనయునట్లు
నాదు పనుపు గాదనక వె ♦ న్కకును వచ్చి, రాజ్య భారంబు పూనుము ♦ రామభద్ర!

తే॥ అట్లు పలికిన కులగురు ♦ నరసి రాము, చంద్రుఁడీరీతిఁ బల్కె నం ♦ జలి ఘటించి
సర్వ శాస్త్రార్థ వేత్తలు ♦ సద్గుణులరు, కలవె మీ రెఱుంగని ధర్మ ♦ గతులు ధరణి?

చ॥ అగుదురు గాక సద్గురువు ♦ రాదురు గాక విధాత్ర సూనులే
యగుదురుగాక దైవతము ♦ లౌదురు గాక యుఁ దల్లి దండ్రులే
యగుదురు గాక సత్యసుతు ♦ లాడి తొలంగని కష్టులాడుటల్
తగునొకొ? మిమ్ముఁబోఁటి గుణ ♦ ధన్యులకుం దలపోసి చూచినన్?

ఉ॥ తల్లి విధించెఁ జేయుమని ♦ తండ్రియు నుత్తరు విచ్చియయ్యెఁ బైఁ
జెల్లుదునంచు నియ్యకొని ♦ శీర్షమునన్ వహియింప కేగు నా
ప్రల్లదు పుట్టుకంటెఁ బడు ♦ పాటుల మంచియుఁ జెడ్డ గాన కే
పొల్లగు లంపటన్ దిరుగు ♦ ప్రముక్కడి కుక్క భవంబు మేలెకా?. ౧౧౧౩

చ॥ ఎదుట విధించు పెద్దల య ♦ భీప్సితముల్ నెఱవేర్తు నంచు బెం
పొదవఁగ సమ్మతించితి స ♦ మున్నత మానస మందు మీరలా
పదపడి యిట్టు లాజ్ఞ యిడు ♦ వారలు! నేనది చేయు టొప్పగున్
త్రిదశ మునీంద్రవంద్య! యుప ♦ దేశము సేయుఁడి ధర్మ సమ్మతిన్. ౧౧౧౪

చ॥ అనుఁడు వసిష్ఠ మౌని యిఁక ♦ నాడఁగ నెయ్యది లేదయంచు శం
కను గొని యూరకుండె నటఁ ♦ గైక సుతుండను స్పష్టులైన మే
దిని పరిపాలనం బలుపు ♦ దిష్టము చిత్తమం గల్గు వారలే
గొనకొని యేలనీ; యితనిఁ ♦ గూడి వనంబులనే చరించెదన్. ౧౧౧౫

తే॥ అనఁగ నత్తఱి వేలుపు ♦ లది యెఱింగి, గుంపులై తమ్ముఁడన్నను ♦ కొంచుఁ బోవ
మన తలంపులు సఫలమ్ము ♦ నెనయఁజాల, వనుచుఁ జింతించి యిట్లని ♦ రందఱు విన.

చ॥ వినుత గుణాఢ్యుఁడైన రఘు ♦ వీరుఁడు శీరతఁ దండ్రి యాజ్ఞమై
వనులఁ జతుర్దశాబ్దము ల ♦ వారణ రీతిగ నుండువాఁడు స
ద్మనమునఁ గైక పుత్త్రుఁడు జ ♦ నంబులఁ బ్రోచుచు రాజ్యమేలువాఁ
డినకుల వార్ధి సోములకు ♦ నియ్యది యుత్తమ ధర్మమై తగున్. ౧౧౧౬

ఉ॥ దేవత లిట్లు పల్క జగ ♦ తీ తనయా వరుఁ డంత నానుడుల్
త్రోవఁగ రాని వయ్య మది ♦ దొడ్డగ యోచన సేయ నయ్య నే
నీవని నుండు కాల మది ♦ యెంత? పదంపడి వత్తు నయ్య ని
న్నీవిధి వేఁడికొందు నని ♦ యిచ్చ గ్రహించెను తమ్ము హస్తముల్. ౧౧౧౭

చ॥ ఇటులను నన్నకయ్యనుజుఁ ♦ డిట్లను నేమసవాఁడ నిందుపై
నటులె చతుర్దశాబ్దముల ♦ యమ్మఱునాఁడె పురంబు చేరఁగాఁ
దటుకున రమ్ము రాకయటు ♦ తప్పిన నీపదమాన సుమ్ము ప్రో
త్కటతర వహ్నిఁ జొచ్చి కడ ♦ గాంచెద నాఁడె సురల్ నుతింపఁగన్

తే॥ అట్లు శపథంబు చేసి హృ ♦ దబ్జమందు, నెగులు విడిచెను భరతుండు ♦ పొగడుగుడిచె
నడరు సత్కీర్తి తనకంటెఁ ♦ బొడవుగాఁగఁ, గాంచు రామచంద్రుఁడు సమ్మ♦తించెనంత

చ॥ భరతుఁడు వేఱొకండరుదు ♦ భావన చేసి మహాత్మ! పాదుకల్
స్థిరమతినిమ్ము తత్ప్రతిని ♦ ధిత్వము పూని ధరిత్రిఁ గాచి నీ
కరుణ గడింతు నన్నుఁ బద ♦ కంజములం ధరియించు వానిని
ర్జరులకు నొందరాని స్థిర ♦ సౌఖ్యము లిచ్చెదు వాని నిచ్చినన్. ౧౧౨౧

ఉ॥ వారక బాష్పధార లొద ♦ వంగల కన్నులతోడ ధూళి యె
ప్పారిన మేనితోడ నమ ♦ రాది సమస్త జనాళి దుఃఖ ని
స్తారక రామ పాదుకల ♦ సమ్మతి రత్న కిరీట లీలఁ జో
క్కారముగా ధరించి రఘు ♦ కాంతుని వీడ్కొని యంతఁ గ్రమ్మఱన్.

క॥ జనములు బంధులు పెద్దలు, మునులును సచివులును పౌర ♦ ముఖ్యులు తక్కం
జనములు భరతుని వెంటనె, చనియెం జన లేక రామ ♦ చంద్రు నెడయుచున్.

తే॥ ధర్మశాస్త్ర వీరుఁడు భర♦ద్వాజుఁ డేగె, మరలె సింగిని కూడిన ♦ సురగణంబు
కూర్మి మిత్రుండు గుహుఁడు వీ ♦ డ్కోలువడసి, భరతు వెంట నెచనె దుఃఖ♦భరితుఁడగుచు

సీ॥ ఈపాదములె కదా ♦ యింద్రాది సురల కా, పదవేళ నొదవెడు ♦ పట్టుగొమలు
ఈ యంఘ్రులే కదా ♦ శ్రేయంబు లొనఁ గూర్చు, పావనగంగకుఁ♦ బ్రభవ గృహము
ఈచరణములెకా ♦ యింద్రియ జేతలౌ, యతివర హృదయ గే ♦ హముల దివెలు
ఈపదములె కదా ♦ యింతి యహల్య పా, పంబుల మాన్చిన ♦ పరుసవేది

తే॥ అనుచు భరతుండు తనసింప ♦ కాముకొనిన, పాదుకల మస్తకంబున ♦ భక్తిఁ దాల్చి
గంగదాఁటి పాడై చెడు ♦ కాడుఁబోలు, పురము సాకేతమును చొర ♦ బుద్ధిగొనక.

శా॥ నందిగ్రామమునందు పాదుకల నం - దం బొప్పఁ దాపించె తా
ముందుం బోలెను రామసన్నిభ సుఖం ♦ బుంబొంది రాజ్యంబు రా
జేందుల్ భక్తిని గొల్వ మోదమున శ్రో ♦ కేశుల్ ప్రశంసింప స
ద్బృందంబుల్ సుఖయింప నేలె భువన ♦ శ్రేయంబు గేయంబుగాన్. ౧౧౨౬

ఉ॥ రాముఁడు చిత్రకూట శిఖ ♦ రంబున నుండెడిఁ జూత మం చయో
ధ్యామనుజుల్ ప్రియంబు మెయిఁ ♦ దప్పక వచ్చుచు నెమ్మనంబు డో
లామతి సేయువారని త ♦ లంచుచు నచ్చటు వీడి దక్షిణా
శాముఖుఁడై యతండు చనె - జానకితో ననుజన్ముతోడుతన్. ౧౧౨౭

అయోధ్యా కాండము సంపూర్ణము.

శ్రీ రామచంద్రార్పణ మస్తు.

ఓమ్. తత్. సత్.

శ్రీ

# కంబరామాయణము - అరణ్యకాండము

## ౧. విరాధ వధ పటలము. (౭౨)

చ॥ ద్విజవిభుండు సత్త్వగుణ ♦ మాన్యుఁడు జీవహృదంతరాత్ముఁడై
మననము సేయఁ జేయ మహి ♦ మం బొనఁగూర్చెడు వేదముల్ విరిం
చనఁడుఁ దపంబునేసి కనఁ ♦ జాలని సర్వజగత్ప్రభుండు మా
మనమున కందువాఁడె? పలు ♦ మార్గములన్ గమనించి చూచినన్.

ఉ॥ ముత్తియముల్ కుదించి నటు ♦ ముచ్చటఁ గూర్చు స్మితంబు మోమునన్
హత్తిన సీతతో యువకు ♦ లాదటఁ జిత్ర శరాసనంబులన్
జొత్తిలఁ దాల్చి పత్రఫల ♦ శోభితవాటి భవాబ్ధి పారగుం
డుత్తముఁడైన యత్రి వన ♦ మొప్పుగఁ గాంచిరి వారుముందటన్. ౨

చ॥ గొనకొని భూమి భారము క ♦ కుప్పల నిల్చి వహించు మత్తవా
రణములఁ బోలె వారు ముని ♦ రాజు వనంబునఁ జొచ్చి ముప్పగన్
దునిమి ప్రశాంతిమైఁ దపము ♦ తోట్టఁగఁ జేయు మునీంద్రుఁ గాంచి వం
దన మొనరించి నిల్వఁ బ్రమ ♦ దంబును పొందె నతండు పొంగుచున్. ౩

ఉ॥ బందుగులెల్ల గేమునకు ♦ వచ్చినచో గృహమేధి సంతసం
బందు విధాన నత్రి ముద ♦ మంది కుమారకులార! మీర లి
ట్లొందఁగ దర్శనం బొసఁగ ♦ నొక్కట దేవతలున్ జగంబులున్
బొంపుగ వచ్చి నట్లడరెఁ ♦ బుణ్యుఁడనైతి నటంచు మోదిలెన్. ౪

ఉ॥ ఆతనితోడ నాఁడచట ♦ నర్మిలిమై వసియించి సాధ్వియున్
బూత చరిత్ర యత్రిముని ♦ పుంగవు దేవ్యనసూయ సీతకుం
బ్రీతి నొసంగు గంధ ఫల ♦ వస్త్ర సుభూషణరాజిఁ గొంచు రా
మాతిలకంబు రా విబుధ ♦ మాన్యులు దండకఁ జేరి రంతటన్. ౫

సీ॥ మదవారణంబులు - పదునాలు సంతరెం, డంతల సంఖ్య పం - చాననములు
పదునాలు శరభముల్ - గుదిగాఁగఁ గూర్చిన, ముమ్మొన వాలు చేఁ ♦ బూన్చి పట్టి
జుంజాలు జేగులు - జొంపంపుఁ దలవాఁడు, విషగిరి నడచె నా - వెలయువాఁడు
క్రొమ్మొగుల్ వసియించు♦కొండలు కాలఁద్రొ,క్కుడు దూదివలె లేవ-నడచువాఁడు

తే॥ వ్రణము లట్లు ప్రకాశించు-కనుల నుండి,మిడుఁగుఱులురాల రవిక్రమంగ-మిన్ను వడఁక
నవనియును దద్దఱిల్ల మహాబలిష్ఠుఁ, డైన యముని చేవయును కా-ర్శ్యంబు నొంద.

సీ॥ సింహాసంఘము ప్రవే - శించి గర్జించెడు, శ్రవణ కందరముల - ప్రక్కలందు
నెల్లదిశల విల - సిల్లెడు మేరు శి, ఖరములు పోఁగుల - నొరయు చుండ
మొగుళులసందునఁ - బొడసూపు నెత్తుని, యాకసమోయన - నతిశయిల్లి
నల్లచేఁ దడిసిన - నల్లని కాయంబు, చందన సిక్తపూ - చంద మొప్ప

తే॥ వీరులను తురంగమముల - వారణముల, నరదములను సింగంబుల - వ్యాఘ్రములను
చిక్కవాని నెల్లను కొండ - చిలువలందు, గూర్చు దండలు కుత్తుకఁ-గొమరుమిగుల

ఉ॥ కొండలఁ బోలె శూలమునఁ - గ్రుచ్చిన యేనుఁగులం గరంబు లోం
డొండుగ నంది యాయఁగ మ - హోన్నత పర్వత కందరంబు నా
నుండెడి వాకినోట నొక - యొరను ముడ్చి మెదించి మ్రింగుచుం
మెండగు నాఁకటం దనివి - మేకొనకుండెడు బొట్టపొట్టతో. ౮

ఉ॥ పన్నగరాజ రత్నముల - బంధురలీలఁ బొదింగి వానితోఁ
బ్రన్నన రాహు పాశమునఁ - బట్టి దిగీశ విమాన పంక్తులం
గ్రన్ననఁ గూర్చి ఋక్షములఁ - గట్టిన మాలికలోన గాములం
మన్ననఁ జేర్చి తాల్చు జయ - మాలిక వక్షమునం రహింపఁగం. ౯

ఉ॥ సంజను వహ్నిఁ బోలి పరు - సం బయి యెఱ్ఱఁ దనంబు మీఱు నా
జుంజురు వెంద్రుకల్ విరియ - శోభన వారణ కుంభ మట్టు లు
బ్బంజను భాలభాగమున - వాసవ సామజ భాల పట్టముం
రంజిలు పొన్ను పొన్ను రద - నంబులు చొక్కముగా వెలుంగఁగన్. ౧౦

తే॥ నలుపు మీఱంగఁ గ్రూర గు-ణంబు పొంగ, నలుకఁ దగియున్న కొడెమెవి-పొగ్గులట్లు
పొలయఁ దామసమను నిరుల్-పూఁతగాఁగఁ, బూసికొనివచ్చు కలికాల-మోయనంగ.

ఉ॥ చంపిన వేఁగిచర్మములె - సన్నని వల్వగ దంతి చర్మముల్
జంపగు నుత్తరీయముగఁ - జాలగు దిగ్గజ మస్త ముక్తముల్
పెంపగు నందుకంబులుగఁ - బెన్చిన లావగు కొండ చిల్వతే
సొంపగు కాసెగాఁ గయిఁద్రి - శూలము దాల్చి హరుండు నాఁదగన్. ౧౨

తే॥ ఫణి ఫణామణి ఖచిత కం ♦ కణము లొప్పు. చేతులందున వలమురి ♦ చింద మమరఁ
జేయు కడియంబులును దాల్చి ♦జీబులైన, మీసములఁ గిల్లువాసన♦మిగులఁ గొలుప.

శా॥ కైలాసంబును మేరు భూధరము ను - గ్రస్ఫూర్తిఁ జెంప్లంబలెం
దూలందన్ను బలిష్ఠ పాదములతో - దుర్వార వేగంబుతో
వేలావేష్టిత భూతలంబు తనతో - వెన్నంటి రా నాదితే
యాలోకంబుల నంతరంగముల న - ల్లాడించు రౌద్రంబుతో. ౧౪

ఉ॥ స్థూలములైన భూజములు - చొక్కముగా నొక రూపమందెసన్
గ్రాలెడి వాడు మేఘరవ - మొంద పలికించు నెలుంగు వాడు గీ
ర్వాణుల జీవ్వుసిచ్చు నొక - లక్షయు పిర్వదియైనవేల నా
గాలి బలంబు గల్గిన య - జాండ భయంకర దుష్టకర్ముడున్. ౧౫

చ॥ కెసిదనములైన గుంపు మగ - పిక్కలఁ బోలిన క్రూరకృత్యముల్
సడపెడువాఁడు కూళుఁడు చె - నంటి విరాధుఁడు డాసి వృక్షముల్
జెడఁదయుచుఁ జెల్లగిల్లఁ బృథి ♦ వీ ధరముల్ వడి ప్రేల రేఁగి మం
దమదకు దొడ్డ పెండ్లుగల - దోర్బలవీరులఁ గాంచి కేరుచున్. ౧౬

ఉ॥ కోఱలఁ జూపుచున్ బఱపు ♦ కొండ గుహంబలె నోరువిప్పుచున్
మీఱి యదల్చి నిల్చినుచు ♦ క్రిందగెడు పోలిక వచ్చి తెప్ప ల
ల్లాఱుచు సంతలోన వీక ♦ చాంబుజ మందు వసించు హంసి నా
సారు వహించు సీతఁ గొని ♦ చయ్యన వ్యోమ పదంబు ముట్టఁగన్. ౧౭

మ॥ పురుషశ్రేష్ఠులు వానిఁ గాంచి మిగులం ♦ బొల్చారు కోపంబుతో
శరముల్ పింజలను గూర్చి వెంటఁ జనుచున్ ♦ జా వేఁడి యుల్లోల రా
జరుగం జూచెను రాక్షసాధమ! యిటే ♦ చందాన సీవేగిసన్
బరియల్ సేయక పీడఁ బోము నిలుమా ♦ పందా! యనన్ దైత్యుఁడున్.

మ॥ తొలి వేల్పిచ్చు వరంబుచేత నసువుల్ ♦ త్రుంగింపలేరెవ్వరున్
బలిమిన్ ముజ్జగ మొక్కటై యెదిరి నన్ ♦ భంగింపఁగా లేదు నే
నిల నేకైదువు లేకయే యెసఁగి మా ♦ యింతున్ సమస్తంబు మీ
కెలమిం బెట్టితిఁ బ్రాణ భిక్ష చనుఁడెం ♦ దే నీ చెలిన్వీడుచున్. ౧౯

మ॥ అన శ్రీరాముఁడు దంత కాంతు లొలయన్ ♦ హాసంబు గావించి యా
దనుజుం డెన్నఁడు పోరెఱుంగఁడు భుజో ♦ త్సాహంబు దర్పంబు నొ
క్క నిమేషంబున నూఱడిల్లి సమయుం ♦ గాకంచు లోనెంచి ని
స్వన పూర్ణంబుగ నారి లాగుచు ధను ♦ ష్టంకారముం జేయఁగన్. ౨౦

విరాధయుద్ధము

తే॥ విరిసి యాధ్వని సాగర ♦ వేష్టితంబు, కుధర భరితంబునైన యీ ♦ కువలయంబు
నమర నాగాది లోకంబు ♦ లధిగమించి, యశనిపాతంబు చందాన ♦ నతిశయిల్లె. ౨౧

తే॥ వంచక బిడాల వదన గ ♦ హ్వరము నందు, చిక్కి తపియించు చిల్కనాఁ ♦ జెలఁగుసీత
నిలను వదలి దైత్యుఁడు సుంత ♦ చలితుఁ డగుచు, నంజనాద్రిఁ బోలినరాము ♦ నదరి తాఁకి

శా॥ బేతాళాదుల యాఁకలిం దనుప వి ♦ ద్విడ్బృంద కీలాలముల్
జేతః ప్రీతి నొసంగి వారి వినుతుల్ ♦ చేకొంచు నాదిత్య హృ
ద్భీతిం గూర్చుచు బాడబానల శిఖా ♦ దీవ్యత్ప్రభాయుక్తమై
చేతం దాల్చిన శూలముల్ విసరె నా ♦ శ్రీరాముపై నుద్ధతిన్. ౨౩

ఉ॥ దిక్కులు దిక్పతుల్ సురలు ♦ దిక్కరులున్ భువనంబు సర్వమున్
దిక్కఱి వెక్కసంపడ ను ♦ దీర్ణ హలాహల మట్టురాగ, స
మ్యక్కులశైలమట్లు కన ♦ కాచల మట్లు వెలుంగు చాప మం
దొక్క యలుంగు గూర్చి చెవి ♦ యొందఁగ లాగుచు రాముఁ డేయఁగన్.

తే॥ అసుర కుల మెల్ల నేఁడె పోం ♦ గాఱె ననఁగఁ, బట్ట పగలునక్షత్రముల్ ♦ పడియెననఁగఁ
దుండ్లు తుండ్లయి శూలంపుఁ ♦ దుంట లెల్లఁ, జువ్వలట్టులఁ బఱచుచుఁ ♦ జొచ్చె దిశల.

చ॥ సురలకు మృత్యు హేతువగు ♦ శూలము త్రుంగుటఁ జూచి రక్కసుం
డురవడిఁ జేతులన్ మలల ♦ నూడ్చి రఘూత్తముపైన వైవ న
గ్గిరులను వజ్ర సన్నిభ ని ♦ కృంతన భల్లము లేసి త్రుంప నా
పరియలు వానిపై మరలఁ ♦ బాఱి శరీరము నొవ్వఁ జేయఁగన్. ౨౮

తే॥ దైత్యుఁ డంతట నొక మహా ♦ తరువు పెఱికి, విజ్ఞు లెవ్వని తత్త్వంబు ♦ వేడ్కఁ గాంత్రు
ధర్మ ముద్ధరింపఁగ నేఁడు ♦ ధరకు దిగియె, ప్రణవ మంత్రార్థ మెవ్వఁడా ♦ రామునేసె.

క॥ వీరుఁడు రాముఁడు నాలుగు, నారసములఁ దానిఁ ద్రుంచి ♦ నాటించెను నా
ఱాలు శిత శరము లసురుని, పేరురమున బాహువులను ♦ భీకర లీలన్.

తే॥ కంటకములు వేధింప ముం ♦ గాళ్ల తోడఁ, దీయనెంచి సంకటపడి ♦ దేహమును వి
దిర్చికొను నేదువలెఁ దన్ను ♦ దివిరినొంచు, ములుకులూడ మేనినివాఁడు ♦ ముడిచివిడ్చె.

ఉ॥ నిప్పుల వంటి ముల్కు లవ ♦ నీవిభుఁ డేయఁగ నవ్వి మేనిపైఁ
గప్పక దూఱి దూయుటయుఁ ♦ గష్ట విచేష్టితుఁడైన కూళయున్
గుప్పున మేనినుండి వడి ♦ గ్రొచ్చిన గంటుల రక్త ధారలన్
దొప్పఁగఁ దోఁగి సత్త్వమును ♦ త్రుంగఁగఁ దెల్వి నశించి నిల్వఁగన్. ౩౦

చ॥ పిడికిటి పోరునందు బహు ♦ విశ్రుతవీరులు రామలక్ష్మణుల్
చెడని వరంబు గొన్న బల - శీలి యితండు శరాళిచేతఁ జా
వఁడు మరలన్ రణంబునకు ♦ వచ్చు నటంచు నరాసి దూసి కే
లెడయఁగఁ ద్రుంతమంచు ♦ ననురేశు భుజంబుల నెక్కనాతఁడున్. ౩౧

తే॥ పొంగిపాఱెడు శోణిత ♦ పూర మొప్ప, నుంత దెలిసి భుజంబుల ♦ శూరవరుల
నొక్క నడక పదింతలు ♦ మిక్కుటముగ, గగన వీథిని పఱచెన ♦ గ్గలిక మెఱయ. ౩౨

తే॥ కనకగిరిఁ జుట్టు చంద్రభా ♦ స్కరులఁబోలి,యిరుప్రక్కల నసురయం♦ బరము నంటు
రక్తకాయంబు తోడను ♦ ర్వి నిగిడి, దిగి గిరగిర శరధి మం ♦ దరము మాడ్కి.

ఉ॥ బంగరు చాయ వాఁడసిత ♦ వారిద వర్ణము వాఁడు బాహుల
రంగరుచుండ మింటికిఁ దన్నుకొ ♦ నేయంజనుఁ బోకు చూడఁగా
సంగడి నన్నలం గొనుచుఁ ♦ జయ్యన మింటికి నేగు పాడి రూ
పుంగొని యొప్పు పక్షికుల ♦ పుంగవుఁ దార్క్ష్యుని బోలె నత్తరిన్. ౩౪

క॥ కరుణాకరుఁడగు తనపతి సురరిపుచేఁ బడఁగ సీత ♦ ♦ సురిపడి హాంసన్
బొరఁగిన హంసింబలె వా, డొరసిన సుమవల్లి బోలె ♦ నుర్వర వ్రాలెన్. ౩౫

తే॥ పవముపడి లేచి వేఁగొండు ♦ పలుకఁ బోఁప, కునికి నడు మసియాడ నా ♦ దనుజునంటి
చనుచుఁ వల్లి బోలిక దయా ♦ గుణుల వీడి, తన్ను భక్షింపుమని సీత ♦ ధరణిఁగూలె.

తే॥ పనవి పలుకులు తడఁబడఁ - బ్రాణములును, వాడఁ జేష్ట దక్కిన సీత - పగిది యెఱిఁగి
యన్నఁ గనుఁగొని లక్ష్మణుఁ - డార్య! దేవి, పరితపింప నిట్లుండుట - పాడియె? యన.

చ॥ జరుగఁగఁ దగ్గ త్రోవ యిటు - సాగుట మేలె యటంచు నెంచితిన్
దొరకొని వీనిఁ జంపుటది - దొడ్డయె? యంచు హసించి రాఘవుం
డురుతర పాదఘాతమున - నుర్వరఁ గూలఁగఁ దాఁప వాఁడు పెం
దరువు ప్రభంజనాహతికి - ధారిణిఁ గూలిన పోల్కిఁ గూలుచున్. ౩౬

చ॥ ధరఁబడి రోఁజుచుండఁ గని - దైత్యుని రాజకుమారు లిద్ద ఱు
ద్ధురతర బాహుమూలములఁ - ద్రుంచుచుఁ దూఁకె విరాధుఁ డుగ్రుఁడై
యురవడి సూర్యచంద్రుల న - ముద్ధతి మ్రింగఁగ వచ్చు రాహు వ
ట్లిరవుగ రామలక్ష్మణుల - నెత్తుగడం గబళింప వచ్చుచున్ ౩౭

చ॥ వ్రణముల నుండి యోడిగిలు - రక్తము పైపయి వృద్ధినొంద దు
ర్గుణుఁడగు దైత్యు ప్రాణములు . క్రుంగమి రాముఁ డెడంద నెంచి ల
క్ష్మణుఁగని గుంట ద్రవ్వుము ని - శాచరుఁ బూడ్చుట యుక్తమన్న స
ద్గుణయుతుఁ డొక్క పల్లమును - క్రొచ్చెను బాణబలంబునన్ వడిన్

చ॥ నదుల జలంబునందు జత - నంబున దోషిని పాచితంబుకై
వదలక ముంచునట్లు రఘు - వర్యుఁడు త్రోవఁగరాని దొడ్డ యం
గదలఁ దొలంచు భక్త జన - కామదమైన పదంబు తోడ నా
మదయుతుఁడైన రక్కసుఁడు - మ్రంగఁగ బల్లమునందు త్రోవఁగన్

చ॥ తొలుతను బ్రహ్మయై నెగడి ♦ దొడ్డ యజాండము సృష్టిచేసి యం
దుల వడిఁ దానొకఘుంగను ♦ త్రోఁచిన రాముని కాలి తాఁకుచే

నలఘుండు సోఁకు పూర్వ మల ♦ కాధిపుఁ డిచ్చిన శాపశక్తిచేఁ
గలిగిన ఘోరరూపమును ♦ గ్రక్కున వీడి గమించె మింటికిన్. ౪౨

తే॥ ఎగిరి గంధర్వుఁడై నిల్చి ♦ యింద్రియముల, విషయములకు వశంబయి ♦ వీఁగుబుద్ధి
మాఱ సుజ్ఞానియై భక్తి ♦ మనసు నందు, గలుగ రాఘవు వినుతించె ♦ గౌరవమున. ౪౩

విరాధుఁడు రాముని వినుతించుట.

చ॥ శ్రుతులు నుతించు నీదగు వి ♦ శుద్ధ పదంబులు సర్వలోక సం
గతములు గాఁగ వ్యాప్తిగొనఁ ♦ గాఁ గడ మంగము లెట్టి వ్యాప్తివో?
రతనపుఁ డెంకి యందమునఁ ది ♦ రంబుగఁ గాక యొకండొకంటితో
నతుకని పంచ భూతముల ♦ యందును నిల్చిన నిన్ భరించునే? ౪౪

మ॥ గజనాథుండు జలగ్రహ గ్రహణ దుః ♦ ఖంబంది కేలెత్తి యో
త్రిజగద్వంద్య! ముకుంద! దేవ! శరణా ♦ ర్థింజూడవే ప్రోవవే
భుజగాధీశ్వర తల్ప! యంచుఁ బిలువం ♦ బూర్ణాను కంపామతిన్
నిజ సంశీలత దంతిఁ గాచితివి ని ♦ ర్ణిద్రాప్ర మేయాకృతీ! ౪౫

తే॥ ఇహపరంబులు గన నడు ♦ నెడను నిలిచి, స్థిర కృపాకటాక్షంపు వీ ♦ చికలఁబరపు
దేవ! నీవోకో! ధర్మను ♦ స్థితిని మనుప, నొంటరిగ గాలిపడగ నా ♦ నొలయుచుంటి. ౪౬

ఉ॥ పుట్టుట గిట్టు టాటలుగఁ ♦ బూన్చిన దేవ! విరాగ పూరుషుల్
పుట్టిన వారి పూర్వగతి ♦ వోవునె? తక్కినవారికై వడిన్
బుట్టుదు రేమి? తొల్లి తమ ♦ పొందిన సంస్థితిఁ బొందు టబ్రమే?
యిట్టులమైన నద్భుతము ♦ నెల్లెడ నించిన రాఘవేశ్వరా! ౪౭

చ॥ భయమును కూర్చునట్టి భవ ♦ వారిధి దాటఁగ నాశ్రయంబుగా
నయగతిఁ బూను సర్వమత ♦ నాయకులట్టి మతాధిదేవతల్
నియమిత తత్త్వరూపివయి ♦ నీవు జగంబుల నుల్ల సిల్ల నే
జయ మహిమంబు లొందుదురు? ♦ నల్పున నెయ్యది? రాఘవేశ్వరా! ౪౮

తే॥ బ్రహ్మ మొదలుగ నెల్ల ని ♦ ర్జర వరులకుఁ, దక్కు ప్రాణులకు మొదలి ♦ తండ్రివీవ
యైనచో లోక ధర్మంబు ♦ ననుసరించి, కాంచి పెంచెడు తల్లిగాఁ ♦ గ్రాలు టెవరో? ౪౯

ఉ॥ నీవె పరాపరంబు, గతి ♦ నీవె, సమస్త మహాండ జాలముల్
నీవె, చరాచరంబులును ♦ నీవె, విచారణ చేయఁ దేఁటుటల్
నీవె, మతంబు లన్నియును ♦ నీచరణావధులే, యిటేల మా
మావిధిఁ గ్రీడసేయ వల ♦ పా? ఘటిదొంగ నిథంబు లేల్కొకో! ౫౦

ఉ॥ రాగరుడై నవాసిక్రియఁ ♦ గ్రాలుచు వచ్చు మహేశ! ధేనువుం
గానని దూడ వత్సమును ♦ కానని గోవును లేవు; లోకజా
లానకుఁ దల్లి నీవయిన ♦ లాలిత రీతి నెఱుంగు దెల్లయు క్కా
గానఁగఁ జాల నీ జగము ♦ గాంచిన తల్లి నిదేమి మాయయో? ౫౧

చ॥ జనములు పెక్కు దైవముల - సన్నుతి సేయఁగ నిచ్చగింతురై
నను నినుగాక యన్యముగ - నాయకదైవము గల్గునట న
జ్ఞనుల కిసర్వమా; కమల - జ త్రిపురాంతక నిర్జరావళుల్
వినుతి యొనర్తు నిన్నెయని - విజ్ఞ సమూహ మెఱుంగ కున్నదే? ౫౨

తే॥ శ్రీనివాస! రమేశ! నిద్రిద! జగతిఁ, బలుమతముల దైవములు ద్వంద్వములఁదగులు
వారివలెఁ దపించు; ని - ర్ద్వంద్వుఁడైన, యీవు నిద్రింప కీవేమ - మేలకొంటి?. ౫౩

తే॥ మోయుచున్నాఁడ వహీవయి, భూవరాంగి, నెత్తుచుంటివి పోత్రివై - మొలమితోడ
గ్రుక్కగొందు వాక్కొక్కపరి-గొలుచుచుందు, నద్ది శ్రీదేవి యెఱుఁగిన-నెరియకున్న?.

తే॥ నీవు పుట్టించు జీవులు - నిజము నెఱుఁగి, కొఱల దానిచే నీకింత - కొదువ పడునె?
శర్వునకు నిచ్చు భిక్షచే - శంకపడిన, వారు మర్త్యు లమర్త్యులి - ప్పటికిఁ గలరు. ౫౫

మ॥ భువనోద్ధారణ! హంసవై నిగమముల్ - బోధించి తా బ్రహ్మకే
య్యావి నీ కెవ్వరు మున్ను నేర్పి? రలవా - రంతెంబు పాటించిరే?
భువి జీవాత్మల వేఱయై యొకటియై-పొంకంబుగానుండు నం
భవ మవ్వానిని వీడియో? విడకయో? - భావింప నేమాయయో?. ౫౬

చ॥ అనదృశేమూర్తి! నీవు తొలి - నాదటఁ బండిన పాలవెల్లిఁ బా
ప నకిన మంచము న్విడిచి - పాపుని దాసుని గాచుకై కృపా
రసము వహించి వచ్చి తమ - రక్ష భవసాగర మీఁదఁగంటి నిం
పొనఁగు భవత్పదాబ్జ మహి - మోన్నతి నేమని సంస్తుతింతునో? ౫౭

తే॥ ఇట్లు వినుతించు నతని నీ-తేశుఁడరసి, యిట్టిజన్మంబు రాఁగత - మేమి తెలుపు
మనుడు నాతఁడసత్య జీ - వనము తొలఁగ, జ్ఞానమొసఁగు పదాంక! నా-చరిత వినుదె?

తే॥ అలకవాసిని తుంబురుఁ - డనెడు వాఁడ, రంభ నాట్యగానంబు లా - రంగఁ గాంచి
వలచి కలియుటచే శ్రీదు-వలన నాకు, నిట్టిజన్మంబు సిద్ధించె - నేమి సెప్ప? ౫౯

తే॥ తొడఁగి జ్ఞానంబు మొదలంటఁ-మడిచివైచు, కామరుజనన్ను వెన్నంటఁ-గలుగుకతన
కరుణ మాని కుబేరుండు - కఠిన దైత్య, రూపి వగుమని తిట్ట నీ - రూపువచ్చె ౬౦

క॥ ఈశాప ముక్తి తెలుపఁగ, దే శంకరమిత్ర! యంచునే - వేఁడ భవత్
పేశల పద తాడనమున, నీశాపము దీఱునంచు - నెఱిఁగించె దయన్. ౬౧

క॥ స్వర్గపదం బెల్లెడల న, నర్గళ గతిఁ దిరిగి వేఁచు - నరహంతకుఁడై
దుర్గముఁడై దానవకుల, మార్గుఁడగు కిలింజుసకుఁ గు - మారుఁడ నైతిఁ. ౧౨

క॥ మంచియుఁ జెడుగు నెఱింగెడు, సంచిత మతిలేక చెడుగె - యార్జించితిఁ గా
న్పించిన ప్రాణుల పీడక, వంచి ఏఱిచి పొట్టఁబెట్టు - వంచనకతనన్. ౧

తే॥ నన్ను సద్గతికిం ద్రిప్ప - నున్ననాడు, పూర్వకృతపుణ్యమున నిట్లు - పొగడఁదగిన
నిగమ నిశ్రేణిగల పద - నీరజములఁ, బొంది తేజీతి నెప్పటి - పొలుపు గొంటి. ౧౪

తే॥ నన్ను క్రుంగించు పాప గ - ణంబులడఁచు, నిన్ను వెడఁగనై నేచేయు - నేరములను
మన్నన యొనర్చి ప్రోవు స-న్మాన్య! యనుచుఁ, గ్రన్న నెలవంది దిచ్చు వెు-గంబునొందె.

తే॥ సాధువుల బాధ సేయు వి ♦ రాధుఁ డిట్లె, వసుచు నలరిన విమలాంగి ♦ జనకజాతఁ
గూడి వేడుక వనములఁ ♦ బాడుచుండు, పక్షి రుతముల వినుచు న ♦ వ్వారుచనిరి. ౧౬

తే॥ కాలుఁ బోలు శరంబులు♦కరములందు, గలుగు రామ లక్ష్మణులు నాఁ♦డెలమి మిగుల
వేదములె రూపునొందిన ♦ విధని వెలయు, మునుల వనముల మసలిరి ♦ ముదితతోడ.

౨. శరభంగ ముక్తి పటలము. (౪౪)

క॥ ఆరాతి వికచ సుమలత, సొరుగల మహీజ తోడ - సౌఖ్యంబుగ న
య్యారామమందు కడపి శు, భారంభకులు శరభంగు - నరయఁగఁ జనుడున్. ౧౭

క॥ సునిశిత శరసంపన్నులు, ఘను లచటికిఁ జేరునంతఁ - గలునల దొర పు
ట్టిన ముడుఁగని తమ్ములఁ బో, ల్కను లోకవెయి గలుగు ప్రోడ - గానఁగనయ్యెఁ.

క॥ తెలిపిట్ట నడకగల వే, ల్పుల చెలువలు దాల్చినట్టి ♦ భూషణకాంతుల్
మిలమిల మని మిన్నన మెఱుపులు మెఱయఁగ వాని నడుమఁ♦బొలుపుగొలుపుచుఁ

చ॥ పెలుచగు నీలదేహమున ♦ వేల్పు పడంతుల యాస్య పద్మ కో
మల వన చారులొనయన ♦ మంజుల భృంగ సహస్రకంబుతో
గలహ సుఖాశిచే మహతి ♦ క్రమ నినాద మధుద్రవంబు ని
మ్ముల్ఁ జవిచూచుచుండు శ్రుతి ♦ పుష్పలిహంబులతో ముదంబుతో.

తే॥ శాస్త్ర సమ్మతముగఁ గ్రతు - శత మొనర్చి, నట్టి మేటరి; మూర్తిత్ర- యంబుదక్క
దక్కు వేల్పుల మకుటము.ల్దాఁకు నట్టి, గండ పెండరములు కాళ్లఁ - గలుగు వాఁడు.

తే॥ జలజవాసినిఁ బోలిన - శచిని గూడి, ముమ్మదంబుల చౌదంతి - నెమ్మినెక్కి
వెండికొండపై నగజతో - వేడ్కనుండు, లోకనాథుని శంభుని - జోక నెనసి. 23

తే॥ ఏను కలిగి వ్యర్థంబని - యెంచి విధుఁడు, బిడియ పడి కాంతి హీనుఁడై - వెల్లఁ బాఱ
స్వర్గమే గొడుగయి తన - పైన నిలుచు, డంబు పంబు శ్వేతాతప - త్రంబుతోడ. 24

తే॥ దిక్కరుల మదమును బడకేఁ - జిక్కఁ జుట్టి, జవరముల యందు ధృతిచెడి - జడలి పాఱు
సురవరుల కీర్తులఁ బట్టి - యంటఁగట్టె, నట్టులున్న వింజామర - లండ బెరయ. ౭౫

తే॥ అరుణ కిరణుండు నిల్చిన - యట్టులున్న, మేటి బొమ్మ డేకిము తల - మెఱయువాఁడు
కౌస్తుభంబు కైవడిని బ్రక - కాశ మమరు, రత్న హారంబు అొమ్ముననఁ - గ్రాలువాఁడు

తే॥ భాను సంకాశ రంజిత ♦ వజ్రఖచిత, కవచ మవయవంబుల మీఁద ♦ గలుగువాఁడు
విజయలక్ష్మి మందస్మిత ♦ విధము దోఁచు, హార కేయూర భుజములో ♦ ప్పారువాఁడు

తే॥ లెక్కలేక రత్నంబులు ♦ చెక్కినట్టి, నగల జిగియెల్ల నొక్కటై ♦ నెగడి చిత్ర
శక్తి వెలుఁగఁ గనిం(డ్ర)చా ♦ పంబుతోడి, మొగులుకుప్పనాఁదగి డాలు ♦ మునుమువాఁడు.

తే॥ సకలజగములఁ జరవు వా ♦ ననలు గలుగు, మధువు చిందెడు క్రొవ్విరి ♦ మాలవాఁడు
మీాల గెలిచిన వేలుపు మెఱుఁగుఁ బోండ్ల, కనులఁ బోలిన ఖడ్గంబు ♦ గలుగువాఁడు. ౭౯

తే॥ భువన కంటకుఁడగు పది ♦ మోము లతని, మీఁద వైవఁగ వరిముక్క ♦ మేరయేని
మొక్కవోవక కాంతియుఁ ♦ బొలియకుండు, పవిని చేపట్టు నింద్రుండు ♦ పజ్జనిలిచె.

తే॥ ఉరు తపోధనుఁ డెదురేగి ♦ యుపచరించి, వచ్చుపనియేమి యనుచ వజ్రి ♦ పలికెనిట్లు
నీతపంబును మెచ్చి య ♦ బ్జాతభవుఁడు, తోడి తెమ్మన వచ్చితిఁ ♦ దోడరమ్ము. ౮౧

తే॥ (ప్రస్తు మీకిచ్చె నాతని ♦ సత్యలోక, మీారు వేంచేయ ధాతయు ♦ నెదురువచ్చు
శ్రేష్ఠ లోకంబనుచు దానిఁ జెప్పవలెనె?, యీార లెఱుఁగరే యన నాతఁ ♦ డిట్టులనియె.

తే॥ కదలఁజాలని బొమ్మల ♦ కరణినుండి, చెడెడు సత్యలోకంబు నేఁ ♦ జేరఁగలనె?
బాధ తపమూని పెక్కు క ♦ ల్పములు గడచె, నీవెఱుంగవె? యల్పంబు ♦ నిచ్చగింప.

తే॥ ఇట్టివార్త సేవ్యను వచి ♦ యింపఁ దగునె?, బ్రహ్మలోకంబు పడసియు ♦ ఫలముగలదె
బహుళ భోమలఁ కేల? త ♦ పః ఫలమ్ము, వొందు కాలంబు డగ్గఱె ♦ భువనవంద్య! ౮౪

తే॥ సుస్థిరంబయి నిలుకడ ♦ చొప్పు చెడక, పెరుఁగక నశింపక గుణము ♦ వేఱుపడక
సకల భూతముల్ నశియింప ♦ సమయకుండు, మోక్ష పదవిని నేనిపు ♦ పొందువాఁడ.

## రామలక్ష్మణులు శరభంగుని చూడవచ్చుట

తే॥ ఇట్లు శరభంగ ముని వచి ♦ యించునెడను, దృఢధనుర్ధరులటవచ్చి ♦ యెదుటఁగలుగు
కలకలంబును విని యేమి ♦ కతమొయనుచుఁ, దమ మనంబుల యోచించి ♦ దాసి కొంచి

తే॥ బలితమై వజ్రఖచిత సం ♦ బములు వెలయు, నాల్గు రదనముల్ గల సిత ♦ నాగముఁ గని
యింద్రుఁ డిమ్మునింద్రుని గన ♦ నేగుదెంచి, యుండునని మదిఁ దలపోసి ♦ యుత్సహించి

క॥ హరిణాక్షిని లమ్ముని ముని, వరు నాశ్రమ వనముబయట ♦ వదలి యొకండై
హరివలె వృషభమువలె రఘు, వరుఁ డట కరుదెంచె వర త ♦ పస్విం గాంచన్

క॥ సురలోక నాయకుండే, ధరనాలుగు వేదములకుఁ - దథ్య ఫలంబౌ
వరమూర్తి రామభాస్కరుఁ, బరుఁగాంచె సహస్రనయన పద్మములలరన్ ౯౧

తే॥ కాంచి మదినొచ్చుకొని తన్ను ♦ గాచుకతన, బ్రహ్మాదివ్వరులకు నధి ♦ పతియునైన
రాము సతతంబు మ్రొక్కు కేంరంబుతోడ, భుజములను వంచి సాష్టాంగ♦ముగ నెఱింగె.

సీ॥ జయకేతనంబెత్తి ♦ శత్రులఁ బరిమార్చి, వేదార్థముల నేర్పి ♦ విశద ఫణితి
సద్ధర్మమును సదా ♦ సన్మార్గముఁ ద్రిప్పి, సంపదనొసఁగి మో ♦ క్షంబు నిచ్చి
శరణాగతులకు వ ♦ జ్ర కవచ మయ్యును, ప్రాణంబులయ్యుఁ ♦ దపంబు నయ్యు
నయనంబులయ్యు సు ♦ జ్ఞానంబు నయ్యు నే, ప్పుడు రక్షించు శ్రీ♦రాముఁ జూచి

తే॥ యధిక సమ్మోద భరమున♦నవశుఁడగుచు, మనసు కరఁగఁ బజ్జనునిల్చి ♦మఘవుఁ డంత
నేమి తెలియని కరణిఁ దా♦నెఱిఁగినంత, తెలియఁ బలుకుచు నిట్లు స్తు♦తింపఁదొడఁగె

## ఇంద్రుఁడు శ్రీరాముని స్తుతించుట.

సీ॥ ఎల్లవస్తువులందు ♦ నేకరూపంబంది, యఁటి యంటకయుండు ♦ నాత్మరూప!
నిన్నంగ నియత ము ♦ నిప్రవరాధార! వేదాంత విద్యాని ♦ వేక వేద్య!
కరుణాసముద్ర! ర ♦ క్షణకార్య నిర్నిద్ర!, తల్లియు నీవ మా ♦ తండ్రి వీవ
దాసులమగు మేము ♦ దైత్యులచేఁ బడ, రాని పాటులు పడి ♦ దీనులమయి

తే॥ త్వత్పదంబులఁజేరి కా ♦ పాడవేఁడ, నాఁడెసంగిన యభయంబు ♦ నేడుపూర్తి
నేయ నిట్టులేతెంచిన ♦ చిన్మయుఁడవు, నీపదాబ్జాములు భువి ♦ నీతినొందె. ౯౨

సీ॥ క్షీరసాగర శయ ♦ నా! రమాలోల! నీ, కెవరు మిత్రులు? శత్రు ♦ లెవరు? రేయి
యెయ్యది? పగలెది? ♦ యెందు గలవు బాల్య, కారుణ్యవార్ధక్య ♦ దశలు నీకు
నెదియాది? యెదిమధ్య? ♦ యెదియంత, మగుఁగాంచ? లింగవచన నామ ♦ లీలగలదె?
ముందేది? వెనుకేది? ♦ సందేది? యెడమేది? ♦ పొందేది? యెడయేది? చందమేది?

తే॥ అట్టి నీవిట్లు పురుషమై ♦ హానుఁడనగుచుఁ, జేతఁ గోదండమూని మా♦చేతములను
నొవ్వ నడవకుండిన నీకు ♦ నెవ్వగలదె?, చిత్తరంజన! మఱుమేలు ♦ చెందఁగలదె? ౯౩

సీ॥ నీనాభిఁబొడమిన ♦ నీరజోద్భవుఁడు ని, లయ కాలముల నెల్ల ♦ లలితరీతిఁ
గొలత కట్టఁగఁజేసి ♦ పలుకల్పకాలముల్, గొలిచినఁదఱుఁగని ♦ గుణగణాఢ్య!
మున్ను మేదినికుంభ ♦ ముగ నీరుపెరుఁగుగా, మందరగిరి తరి ♦ ద్రిమానుగాఁగ
నీహస్త పద్మంబు ♦ లోహటింపక నొవ్వఁ, జిలికి పీయూషంబు ♦ చిక్కదనుక

తే॥ దాని మాకు మాత్రమొసంగి ♦ దైత్యవరుల, మోసగించితి వఁపతక్ష ♦ మాసఁజేసి
దాసులము మేము వారు శా ♦ త్రవులె నీకు?, ధర్మవైరంబు నడఁగించు♦తలఁపుగాక

తే॥ నిన్న మాపున వేల్పు మ ♦ స్నిఁడు వచ్చి, బ్రహ్మమీకిచ్చెఁ దన సత్య♦పదము రండ
నంగఁ బరమపదంబు నొం♦దంగఁ గోరి, యచటి కేగక నిలిచితి♦నయ్య! యనుచు.

చ॥ మనసునకుఁ వచస్సులకు ♦ మానిత నైగమ శాస్త్రపాళికిఁ
దనరఁగ నందకుండు పర ♦ తత్త్వముఁ గాంచిన మానిచంద్రుఁ డిం
పునఁ గరుణింపుమంచుఁదన ♦ పొల్తుకతో ననలంబుఁజొచ్చి తా
ననుపమ మోక్షభాగ్యరమ ♦ నందె జనంబు వెఱఁగు పొందఁగన్. ౧౦౭

ఉ॥ భావియెఱుంగు పంకజ భ ♦ వ ప్రభృతి త్రిదశాలిచేత వి
జ్ఞావలిచే మమత్వము న ♦ హంకృతి పూర్తిగ నుజ్జగించి ద్వం
ద్వావధి వీడి చేరఁదగు ♦ నట్టి మహాపదముఁ భజించె న
ప్పావని తత్త్వవేత్త శర ♦ భంగుఁడు పెన్నిధి రాము సన్నిధిన్. ౧౦౮

మ॥ ఒకచోనాడిన యాటవస్తువులఁ దా ♦ నుత్సంగ మందుంచు బా
లికపోల్కిన్ సకలాండ జాలముల నో ♦ లిం గర్భముం జేర్చు న
య్యకలంకేశుని నామ సంస్మరణ పు ♦ ణ్యంబెన్నఁగాదన్న, నా
యకు శ్రీరాముని గాంచువారు కను భా ♦ గ్యంబద్ది సామాన్యమే? ౧౦౯

## 3. అగస్త్య పటలము. (౫౯)

తే॥ అట్లు శరభంగుఁడంతంబు ♦ నందఁగాంచు, కతన వ్యాకులతఁ బొంది ♦ ఘనగభీరు
లతని యాశ్రమస్థలి వీడి ♦ యవలి కేగి, రవనిజం గూడి విసుఁగుతో♦నాదతోడ. ౧౧౦

క॥ వనములు వృక్షంబులు నదు, లును గిరులును కొండచఱియ ♦ లును మనమలరన్
గనుచుఁ గుసిగుంపు వడయక, చని రమ్మువ్వురును దాఁటి ♦ సమ్మదలీలన్. ౧౧౧

తే॥ నలువమనుమలు వాలఖి♦ల్యులునుమాన,యుతులు బోడలుజటిలులు♦యతివరులును
దండకారణ్య వాసు లొ ♦ తపసులెల్ల, ముదమునంది రాముని గన♦నెదురుకొనిరి.

క॥ క్రూరగుణుల రాకాసుల, పోరుపడఁగ లేక క్రుంగి ♦ పొనుఁగు పడిన యు
ద్వారలు రాముఁగనిరి జల, ధారలఁ గనినట్టి మ్లాన ♦ తరువులఁ బోలెన్. ౧౧౩

క॥ పెలుకుఱి రాకాసుల పే, రులు తడఁబడఁ బలికి దుఃఖ ♦ రోగులయిన మా
నులు మిండు నడవి వెలువడి, తలిఁ గను క్రేపుల విధానఁ♦ దనిసి రెడఁదలన్. ౧౧౪

క॥ రాక్షసులు సేయు బాధల, మోక్షము గనలేక కుందు ♦ మునివరు లబ్ధిన్
రక్షింప నొక రా నువ, లక్షించిన పగిదిఁ గని తొ♦లంచిరి కలఁకన్. ౧౧౫

క॥ తమ తపమే పండయి గా, రమున నెదురు వచ్చు పగిది ♦ రాముఁడు రా మో
దమున మునులు భవ కారా, విముక్తి గను యోగులట్లు ♦ విలసిల్లి రటన్. ౧౧౬

క॥ కోరిన వారికిఁ గోరిన, కోరికలిడు తపము నూని ♦ గురుశాంతులునౌ
కారణమున రాకాసుల, బోరుపడగ లేక కష్ట ♦ ముల కొడి రోర్మిన్. ౧౧౭

క॥ లేచిరి వచ్చిరి మేఘుడు, ప్రాచిన సీనంబోలు రాఘు ♦ వృపి జూసి రతం
డేచిన భక్తిని మ్రొక్కన, నోచిన ఫలమొండ వరున ♦ నొసిపిరి జయముల్

తే॥ వారిఁ గొనిపోయి చక్కని ♦ పర్ణశాల, యొసఁగి యాతిథ్య మిడి తమ ♦ యునికి కేగి
యవల సోకులవలన సంభవములైన, తొందరల సంతరలఁ దెల్పఁ ♦ దొడరి చనిరి

ఆ॥ వచ్చు మునులఁ గాంచి ♦ చెచ్చెరఁ గూర్చుండఁ, జనిచి యాజ్ఞయడుగి ♦ వారుతనిసి
చక్రవర్తి తనయ! సమకుజీనట్టి మా, నొగులు వినుమ యనుచు ♦ నుడివిరిట్లు. ౧౨౦

చ॥ నిసికర చింతలేని మది గల్గిన రక్కసిమూక పాప వ
ర్తనమునఁ గష్టపెట్టి చెడు ♦ దారులఁ దీసితిపంబు పాడుగా
నొనరిచి చేయరాని కెడు ♦నొప్పములం బొనరింప మాతపో
ఘనపథ ముజ్జగించి కడ ♦ గండ్లను పొందుచు నుంటి మిచ్చటన్. ౧౨౧

తే॥ పులులవనమున జింకల ♦పోల్కి మేము, రేయింబవలు సిగ్గొలొంది ♦ కృశతనంది
చితికి ధర్మపథంబు పీ ♦ డితిమి మాకుఁ, దలఁప ముక్తి యొఁగలదె కో♦దండపాణి!

ఉ॥ కాము తపోనియుక్తులము ♦ కాము శ్రుతుల్ చదివించు వారమున్
గాము పఠించువారమును ♦ కాము మఖంబులు వేల్చువారమున్
గాము పరార్థ చింతకులు ♦ కాము నియామక కార్యనిష్ఠులున్
గాము గురుత్వవర్తనులు ♦ కామిఁక బ్రాహ్మణులున్ రఘూత్తమా! ౧౨౩

తే॥ ఇంద్రుఁడో దానవుల యాజ్ఞ ♦యెడఁదయందు, శిరమునందును తాలిచి ♦ చెలఁగువాఁడు
కాన మాతండ్రి! మాకడ ♦ గండ్లఁ దీర్చు, వారులేరు మాభాగ్యాన ♦ వచ్చితీవు.

తే॥ రాజరాజ సుతుండవు ♦ రాత్రివంటి, దుఃఖమున నేమి యెఱుఁగక ♦ దొరలుచుండఁ
దివిరి రవివోలె నీవరు ♦ దెంచితయ్య, అభయమంటిమి కరుణామ♦యాత్మ! కావు.

శ్రీరాముఁడు మునుల కభయ మిచ్చుట.

తే॥ జనకజాజాని యిట్లను ♦ దను జవరులు, నన్ను శరణొందలేని యెం ♦ దున్న నేమి?
మచ్చరాసన నిర్ముక్త ♦ మార్గణముల, నేలఁ గూలు వారలు దుఃఖ♦మేలఖిూకు?

ఉ॥ తండ్రి నాకమేగఁ, జన ♦ తల్లి వరంబులు గోర, నాదు త
మ్ముండును నిందకై యడల ♦ భూరిగుణాఢ్యులు పౌరులేడ్వఁ, గో
దండము నూని సీతయును ♦ తమ్ముడుఁ దోనరుదేర, నిట్లు నే
దండకఁ జేరుటెన్న మదు ♦ దాత్త చిరంతన దిష్టమే సుమీ. ౧౨౭

ఉ॥ ధర్మకథానువర్తుల యు ♦ దార మహాత్ము మెఱుంగలేని యా
దుర్మతులన్ వధించి మహిం ♦ దోరపు ధర్మము నిల్పనేని నే
గార్ముకమున్ ధరించి పృథ ♦ గాడె జగంబున సంచరించుటల్?
నిర్మల భాగ్యమున్న నొకం ♦ డెక్కడనున్నె యితరంబు నాకిలన్? ౧౨౮

తే॥ ఘన తపస్వివరగు మీరు - గష్టులైన, రక్కసుల నిబంధనములు న♦ ర్తనము సేయ
ధనువుమోసిన నాబాహు - దండములును, దగిన విశ్రాంతి గాంచుత - ధరణియందు.

తే॥ గోవులను విప్రులను జీవ - కోటి నరణ, చొచ్చువారి రక్షణముకై - చచ్చువారె
వేలుపులు గూడ నుతియించ - జాలినట్టి, దేవతాశ్రేష్ఠులగుదురు - దివమునందు. ౧౩౦

తే॥ తారకారి త్రిపురవైరి - దానజవైరి, వచ్చి కాచిన, నసురు లిం - పృథులు వారి
వారివారిని తుదముట్టి - ప్రవచ్చినాడ. పంకమాసి సుఖంబుండు - డింకమీరు. ౧౩౧

క॥ అనిన విని మునిని వుదమం, దా వారు త్రిదండకములను త్రిప్పుచుఁ బన్నా
లను పఠియించుచు నర్తన, మొనరించుచు నిట్టులనిరి - ప్రోత్సాహమునన్. ౧౩౨

క॥ లోకేశ! నీవు కనియుం, డ్రా లోకంబులం బోలు కోటి - లోకము లెదురై
తాఁకిన నేమగు? నిక్కప్పు, సాకిరు లీ శ్రుతులు తపము - జ్ఞానము తగవున్. ౧౩౩

క॥ కావున నీగమనముగు నేం, డ్లీ నామున నిలిచి మాయ - శ్రీష్టార్థంబుల్
కావింపు మనఁగ రాఘవ, భూభుజుం డందుండ మోద - మున నీకొనియెన్. ౧౩౪

ఆ॥ వారలటం ద్రదేండ్లు ♦ వసియించి యుండిరి, మునులు పిదప దీర్ఘ ♦ ముగఁ దలంచి
యుద్ధసేయుం డగస్త్యుఁ ♦ డెలమి వసించు న, వ్వానముఁ జేరుఁడన్న ♦ వారలేగి. ౧౩౫

సీతారామలక్ష్మణులు సుతీక్ష్ణుని గాంచుట

ఆ॥ బీఁటలైన చోట్లు ♦ నెపళులు గలచోట్లు, పొదలు దట్టమైన ♦ పదములందు
చనుచు వడి సుతీక్ష్ణుఁ ♦ డను బ్రహ్మతేజస్వి, తపమొనర్చుచున్న ♦ తలము గనిరి. ౧౩౬

ఆ॥ గర్వరహితులైన ♦ కాకుత్స్థవర్యుల, మునికి మ్రొక్క నతఁడు ♦ ముదముతోడ
నిట వసింపుఁ డనుచు ♦ హితమతిఁ బల్కవా, సిత సుగంధ వని వ♦సించినారు. ౧౩౭

క॥ శ్రీరాముఁనకుం దగు నుప, చారమ్ములు చేసి వత్స! సమ్మద మారన్
మీరిట కరుదేరఁగ నే, పారిన నాతప మదెంత ♦ యతిశాయి యొకో!. ౧౩౮

క॥ అనవుడు రాఘవుఁ డిట్లను, మునివర! బ్రహ్మన్వయమునఁ ♦ బొడమిన ఋషులన్
మునుకొని మీవలె ఘనతప, మొనరించిన వార లెవ్వ ♦ రుత్తమ చరితా!. ౧౩౯

క॥ సాధుజన దర్శనంబున, నేధన్యుఁడనైతి నన ము ♦ ని ప్రవరుఁడు ప్రే
మాధికత నింద వగుచుఁ ద, పోధన మఖిలంబు గొనుము ♦ పూత చరిత్రా!. ౧౪౦

క॥ అను మునికి రామ భూవిభుఁ, డనుఁ బ్రాకృత తపము కంటె ♦ నధికమయినన్
మనమున నగస్త్య ఋషివరుఁ, గనినంచితి నదియ కోరుదు ♦ గాంచెఁబ్రందనన్. ౧౪౧

క॥ రామా నేనే తలఁచితి, నేమే ముందే యదియ తెలుప ♦ నిచ్ఛించితి నీ
వా మహాత్ముం గాంచుము, క్షేమంబులు నీకు నెల్ల ♦ జేకుఱు నచటన్. ౧౪౨

క॥ అతఁడును నీరాకకు న, మ్మతిని బ్రతీక్షించుచుండు ♦ మాను గ నటఁజే
రితివేని జనకతనూ దే, వతలకు శ్రేయంబులగుఁ గృ ♦ పాపర! యనుచున్.

క॥ ఆదారి చూపి యాశీ, ర్వాదమ్ములు నేసి యనుప ♦ రఘురాముఁడు న
మ్మోదముతోఁ దేనె వాఁకల, పాదులుగల యయ్యగస్త్యు ♦ వనముంజేరెన్. ౧౪౪

శ్రీరాముఁ డగస్త్యుఁ డెదుట వచ్చుట.

చ॥ ధరణిఁ ద్రివిక్రముం బలెను ♦ ద్రావిడ భాషను గొల్చినట్టి స
ద్గురు వరుఁడౌ నగస్త్యుఁడు, క ♦ కుత్స్థకులేశులు రామలక్ష్మణుల్
హరువుగఁ గాంచవచ్చు నడి ♦ యారసి పైపయి నుబ్బు మోద సా
గరమున జగంబునిండఁ బడ ♦ కంజము లాతఁడు గొల్వఁగాఁజనెన్

ఉ॥ మున్నొకవేళ రక్కసులు ; మున్గిన వారిధిఁ జూపి వీరలన్
మన్నిగొనంగ వేలుపుఁడు ♦ మార్గము లేదు కృపన్ వహింపవే
యన్న సురాళి కూయిడని ♦ యంబుధి తోయములెల్ల నొక్కచే
తన్నిటీనుంచి ద్రావి వశ ♦ దంబుగ నుమ్మినవాఁడు పిమ్మటన్ ౧౪౬

తే॥ వంచకుండగు వాతాపి ♦ నంచితముగ, మెసవి జీర్ణించికొని వాని ♦ యుసుఱు దీసి
వానియనుజు నిల్వలుచేసి ♦ ప్రాణికోటి, నెటిని గాచిన ధీరుండు ♦ కుఱుచవాఁడు.

ఉ॥ యోగులు విభ్రమం బొరసి ♦ యుత్కట సంకట మొంది వేఁడ ను
ద్యోగిత సూర్య చంద్రులను ♦ వ్యోమము నంటి పెరింగి యడ్డు విం
ధ్యాగముఁ గాలనూని భుజ ♦ గాధిపలోకము దాఁకఁద్రొక్కి పు
న్నాగము నెక్కి పోల్కి జత ♦ నంబున నెక్కిన యట్టి జాణఁడున్. ౧౪౮

ఉ॥ పార్వతి పెండ్లి వేళఁ ద్రిభు ♦ వంబులప్రాణులు చేరు హేతువై
యుర్వర క్రుంగి యోరగిల ♦ నొయ్యన దక్షిణ మేగు మంచు నా
శర్వుఁడు కోర దక్షిణ ది ♦ శంగల శైలము నెక్కి ధారిణిన్
సర్వసమంబుగా నిలుపఁ ♦ జాలిన తత్త్వ మహత్త్వ సత్త్వుఁడున్. ౧౪౯

తే॥ తనియ ముక్కంటి యొసఁగిన ♦ ద్రవిడ భాష, నినియె నేర్చెదు శ్రుతికంటె ♦ వేగటంచు
ఘనుల వాడుకఁ బట్టియుఁ ♦ గవితఁబట్టి, చింతనము చేసి వెల్లడిం ♦ చిన ఘనుండు.

తే॥ స్వర్గ మర్త్య నాగములందు ♦ సకల జీవ, రాశి మొదలు బుక్కులఁ ♦ గ్రాలు నాతఁ
డితఁడ యని యెల్లరు తలంచు ♦ ధ్యేయవస్తు, తత్త్వమగు రాముఁ గాంచును ♦ త్కంఠ వాఁడు

చ॥ వినుతగుణంబుల న్నిగడ - వేదములుం బఠియించి పెంచు జ్ఞా
న నికషమందు రాచి జత - నంబునఁ దోయజగర్భుఁడుం దుదిం
గనుఁగొనలేని తత్త్వమని - గారము రామునిపైనఁ జేర్చి యా
తనిఁగని పల్కు భాగ్య మది - దక్కుటకున్ ముదమందు నాతఁడున్.

తే॥ అనఘదైత్య బలంబను ♦ వినము పేరు, తొట్టె మాయించు మంచి వై ♦ ద్యుండు వచ్చె
బ్రదికి రమరులు మునులు జీ ♦ వములఁ గనిరి, ధర్మవర్తనులైనారు ♦ తక్కు జనులు

తే॥ ఇతర జీవులఁదిన హరియిం - చు దైత్య, భయద నిర్ఘాత సంఘాత - పాత సదృశ
కోపవహ్నిఁ జల్లార్ప ర - ఘు ప్రవీరుఁ, డంచి తాంబుదమూర్తి యే - తెంచెననుచు.

ఉ॥ తీరుగ సర్వలోకములు - దిక్కులు దుర్గతి నీఁగి సద్గతిం
జేర నుదారతన్ బహు వి - శిష్ట తపఃఫల జాతమైన కా
వేరిని కుండికం గొనుచు - వేడుకఁ దెచ్చు నగస్త్యమౌని యా
శ్రీరఘు వీరుఁగాంచి విల - సిల్లి ముదశ్రులు రాల్చ నిల్చినన్. ౧౫౭

తే॥ మస్కరీంద్రుని గనుచు న-మస్కరించి, సీతయును రామలక్ష్మణుల్ - చెలఁగి నిలువ
ద్రవిడ భాషాప్రసిద్ధుండు - తనిసి యలమి, స్వాగతము వచియించె స-ద్భాషణముల.

తే॥ యతివరులు పసపలు వల్కు-యతనిఁ జుట్టి, తమ కమండలు జలము మ - స్తమునఁ జిలికి
విరులు సల్ల నగస్త్యుండు - విశదమైన, తన ప్రశాంత వనమునకుఁ-గొనుచు నేగె. ౧౫౮

తే॥ వీరుఁడాతని పర్ణశా - టీరమందు, విందు ప్రేమతోఁ గొని హర్ష - మందియుండ
ఘనతపము సేయు మా తపో - వనము చేరె, తపము పూర్తిగావించి తు - దాత్తచరిత!.

చ॥ అని వచియించు మౌనిఁ గని ♦ యాతఁడు పల్కు సమస్తదేవతల్
మునులును వృద్ధులున్ నృపతి ♦ ముఖ్యులు నావలె మీ కృపన్ భరిం
చిన ఘనులేరు లేరు పలు ♦ శ్రేయము లొందితి సప్తలోకముల్
మునుమిడి గెల్చినాఁడఁ బోలు ♦ పున్ గడియించితి జన్మధన్యతన్. ౧౫౯

చ॥ శశిధరసన్నిభుండయిన ♦ సన్ముని రాముని గాంచి యిట్లనున్
వశమయి * యష్టమంగళ గు ♦ ణంబు లెసంగిన రామభద్ర! స
ద్యశము గడించి తండ్రిని య ♦ థార్థ వచస్కు నొనర్చి దండకా
దిశ కరుదెంచు నాఁడె యరు ♦ దేరుదు విట్టొడ కంచు నెంచితిన్. ౧౬౦

*అపహత పాప్మత్వము. విజరత్వము, విమృత్యుత్వము, విశోకత్వము, విజగత్సత్త్వము, అభి ఘాసత్వము, సత్యకామత్వము, సత్యసంకల్పత్వము, అనునవి అష్టమంగళములు.

తే॥ ఇంద నీవుండు మిట వసి ♦ యించియున్న, మాతపంబు లభీష్టముల్ ♦ పూంతువుపాచు
క్రూరులగు రక్కసులు వచ్చి ♦ కొడిమెసేయ, వారి వధియించి మాయెద ♦ వసటదీర్తు.

ఉ॥ పాలనమర్ హాలంబు గొని ♦ పాడియె పంటయొనర్చు రాట్సుతా!
శీలసునీతియుక్ శ్రుతులు ♦ చెల్వగు ధర్మము వృద్ధి నొందెడున్
మేలు గడింత్రు వేలుపులు ♦ మృత్యువు గొంద్రు నిశాచరుల్ సదా
యోలల నాడు సమ్మద ప ♦ యోధి జగంబు నిజంబు నిల్వుమా. ౧౬౨

ఉ॥ అమ్మునిని యట్లు పల్కి నిసి ♦ యాయతబాహుండు రాముండిట్లనున్
సమ్మతి మీయనుజ్ఞ గొని ♦ చంపెద సోకుల దిమ్మ్మమాల్చెదన్
నెమ్మది గూర్తు మీకు నిది ♦ నిక్కము నమ్ముండు యాతుధాన సం
ఘమ్ము చరించు దిక్కునకే ♦ కేగ మునుపేగుట యుత్తమాననన్. ౧౬౩

అగస్త్యుండు రామునకు వైష్ణవ ధనువు నొసంగుట.

ఉ॥ మంచిది పోయిరమ్మనుచు ♦ మౌనివరుండు రమా హృదీశ్వరుం
డంచిత రీతిందాల్చు జగ ♦ దప్రతిమాన శరాసనంబు పూ
జించుచు నుంటి నక్షయ వి ♦ శిష్ట నిషంగము తోడ నిత్తు దు
ర్వంచకులైన వారి సమ ♦ రంబునం ద్రుంపుమ యంచు నిచ్చుచున్. ౧౬౪

తే॥ ఈజగములెల్ల నొకతల ♦ యిద్ది యొక్క, తల యనంగ నొప్పు క్షత్రియు ♦ దర్పకారి
నగ ధనువుగొని పురదహ ♦ నంబు సేయు, ననదృశంబగు విశిఖంబు ♦ నమరనిచ్చి.

చ॥ కుజములు సైకతంబులును ♦ కొండలు నెత్తుగంగల్గి ప్రక్కలన్
సజలములైన వాహినులు ♦ చల్లగనొప్పి ప్రశాంతభూమియై
సుజన మనోభిరామమయి ♦ సూన గుళుచ్ఛ వికాస భాగ్యమై
యజిర వినోదమై పరంగు ♦ నట్టిది పంచవటీ స్థలంబగున్.

తే॥ అచటం దోంక వడ్లును తేనె ♦ యరంటి పండ్లు, గలవు కావేరివంటి యే ♦ ఖులునుకలవు
జానకిం గూడి యాడ హం ♦ సలును కలవు, అందు వసియింపం దగుదు వీ ♦ వార్యవినుత!

తే॥ అనుడు నీలమేఘ శ్యాముం ♦ డతని కెఱంగి, యాజ్ఞ గైకొని పికవాణి ♦ యైన సీత
యనుజుండగు లక్ష్మణుండు వె ♦ న్నంటి రాంగ, నమ్మునీంద్రు మనస్సుతో ♦ నచటికరిగె.

౪. జటాయు దర్శన పటలము. (౪౮)

ఉ॥ చేరికగల్గి నట్టివియుం ♦ జేరక వేఱుగనుండు భూమిభృ
ద్వారము గాంచి యెక్కుచును ♦ దాంటుచు వేగయుతంబులైన వాః
పూరము లందు తెప్పపయిం ♦ బోవుచు దవ్వు తరించి కాంచి ర
వ్వారలు ప్రేమ వేగ ఘనే ♦ భాపితవాయువు నజ్జటాయువున్. ౧౬౫

తే॥ కరఁచినట్టి బంగారంబు♦కరణి నుదయు, గిరి శిఖరముపైఁ జేరు భా♦స్కరుఁడు దిశలు
వెలయఁ గిరణపక్షంబుల ♦ విరియఁజేసి, యున్న మాడ్కి ను త్తేజుఁడై ♦యున్నవాని.

తే॥ నీలగిరిఁ బోలు కచ్ఛప ♦ నేత పైని, క్షీరవార్ధిలో శశికాంతి ♦ చేరియుండ
నిర్జరులు మథియింపంగ ♦ నిలిపినట్టి, మందరాగంబు కైవడి ♦మలయు వాని. ౧౪౧

క॥ నీలాకాశ వికాసము, మూలంబడ రక్తకాంతి ♦ మొనయు పదములన్
నీలగిరి మీఁదఁ బొడవు ప్రప, వాళ లతలు పరవ వెరవు ♦ పరవిన వానిన్. ౧౪౨

ఉ॥ లోపము లేనివాఁడు గుణ ♦ లోలుఁడు సత్యయుతుండు శీలి సం
తాపము లేనివాఁడు నెఱి ♦ ధర్మపథంబు లెఱుంగు ధీరుఁడున్
గోపము లేనివాఁడు పను ♦ కూరిమివాఁడు కుశాగ్రబుద్ధి దు
ర్లాపము లేనివాఁడు సుక ♦ లావిదుఁ డార్యుఁడు దూరదర్శియున్. ౧౪౩

తే॥ అనిశ మింద్రు నంకుశధార♦నెనయుచంచు, పుటముతోఁ గ్రూరరాక్షస♦ఘటములను వి
దారణముచేసి యమునకుఁ ♦ బారణమ్ము, చేసి పిదప గాత్రములు భు ♦ జించు వాని.

తే॥ గ్రహచయము నేలు ధ్రువచక్ర♦గతిఁదనర్చు, రత్నఖచితహారము మెడఁ♦ గ్రాలువాని
మేరు గిరి మీఁద వెలుఁగొందు ♦ మిహిరుఁబోలు,ఘనకిరీటంబుశిరమునఁ♦గలుగువాని

తే॥ వర్ణనాతీతమగు కీర్తి ♦ వఱలువాని, నిరులు నశియింప నుదయించు ♦ నరుణు తనయుఁ
గల్పకాలముల్ త్వరలోనఁ ♦ గడపునట్టి, దినము లట్టులఁ జూచిన ♦ తెఱఁగు వాని.

తే॥ శైలమున నిల్చి యది మోవఁ ♦ జాల కిలకుఁ, గ్రుంగి నట్లుండు తోఁపిక♦కొఱలువానిఁ
గాంచి రామలక్ష్మణులు శం ♦ కా విలగ్న, హృదయు లగుచు నాతని దరి ♦ కేగి నారు.

క॥ తన ముఁగియిక తాన వెదకి, కొని వచ్చిన రక్కసిని ♦ కుహనారూపం
బనియును బలియుఁడు గరుడుం, డనియును తలపోసి చూచి ♦ రలుకన్వానిన్. ౧౪౪

తే॥ దృఢ ధనుష్మంతులును వీర ♦ తేజులైన, రాకుమారులఁగని జటా ♦ రాజియున్నఁ
దాపసులు గారు వేడ్కకై ♦ ధరకు దిగిన,సురలొయని జటాయువువారి♦నరసిచూచె

ఉ॥ కాంచితి వాసవున్ సురలఁ ♦ గాంచుచునుందు నతఁబు భక్తిమైఁ
గాంచితి మాధవున్ గనక ♦ గర్భుని శంకరు నిట్టివారలం
గాంచను మారుఁడేనియును ♦ కాంచిన సిగ్గిలి మూలదాఁగువాఁ
డంచితులైన వీరి చర ♦ ణాబ్జ పరాగము నేని పోలునే?. ౧౫౦

చ॥ గొనకొని మూఁడులోకములు ♦ కూడ ♦ భరింపఁగఁ జాలు భద్ర ల
క్షణముల దేహముల్వెలయు ♦ కార్ముకవీరులు లక్ష్మిఁబోలు ని
వ్వనజదళాక్షితో వారల ♦ వైనమునం జరియింపనేల? నా
మనమును కూఱగొన్నగుణ ♦ మాన్యు లదెవ్వరి పుత్త్రులో కదే? ౧౫౧

ఉ॥ ఒక్కఁడు చూడ నీలగిరి ♦ యొక్కరుఁడో యరుణాచలంబు పే
రకపు నిమ్మకీన్ను ట్ర ♦ లందప్పుఁ గన్నులో పద్మపత్త్రిముల్
చెకి లద్దనుల్ మఱియుఁ ♦ జెన్ను గు మొక్కటులెల్లఁ జూడ నా
మక్కనకాఁడు కోసల ర ♦ మాపతి పోలికలే కనంబడున్. ౧౫౭

తే॥ ఇట్లు యోచించుచున్నంత ♦ నెకుతేను, లతని జూసి రంత జటాయు ♦ వాదరమున
ధనువులం వాచ్చి మునులచం♦నమునవచ్చు,వీరులార! మీరెవ్వారు♦వినుచుఁడనుడు.

తే॥ సత్యమే తెక్కనేటు కాం ♦ చని కుమార, వరులు ధారణి నేకాత ♦ పత్త్రిముగను
దిజ్వైరుల నడినరుల్ ♦ విస్తరనట, వాలనము సేయు దశరథ♦ప్రజలమనిరి. ౧౫౮

జటాయువు దశరథ మరణము విని శోకించుట.

తే॥ అనుడు నానంద వనధి ♦ మునిఁగి లేచి, ప్రీతి వారలఁజేర్చి ప ♦ రిష్వజించి
జనకు దీర్ఘ ప్రాణాలు బలి ♦ ష్ఠ ముతె చెప్పు, డింపుమై నన నవ్వార ♦ లిట్టు లనిరి.

క॥ అనుమాటను మతే తప్పుట, యనుచితమని జనకుఁ డేగ ♦ నమరపురికి నం
చను నంత నాజటాయువు, వనటన్ భరియింపలేక ♦ ప్రాలెన్ ధరణిన్. ౧౫౯

క॥ ఇరువురు కరములఁ బట్టి, శ్వాసు లేవఁగనెత్తి బాష్ప ♦ జలముల మొగమున్
బరిమార్జన మొనరింపఁగ, మరలఁ దెలివి నొంది యతఁడు ♦ మఱుఁగుచు వంతన్

ఉ॥ త్యాగము ఛత్రమున్ శమము ♦ దాల్చిన నిన్ గని సిగ్గునొందు క
ల్పాగము చంద్రుఁడున్ భువియు ♦ నందఁగరాని ప్రమోదమంద, యా
న్నాగుణపాళి ధర్మమును ♦ నన్నును దుఃఖపయోధి ముంచి మా
కేగతి చూపి పోయితివి? నృ ♦ పేంద్ర! యశస్కర! సత్యభూషణా! ౧౬౦

చ॥ జగముల కెల్ల నీడనిడు ♦ ఛత్రము దాల్చిన చక్రవర్తి! యీ
జగములఁ గాచు కార్యమొకె ♦ చక్కని వీడి మదీయ మైత్రి నీ
వగఁ బరికింప నేగితివో? పాపపుఁ బుంజమనైన యేను గ్ర
ద్దగ జనియించి ధర్మములఁ ♦ దప్పి యడంగక యుంటి నిచ్చటన్ ౧౬౧

ఉ॥ శంబరుఁద్రుంచు కాలమున ♦ సర్వ జగంబు తెఱుంగ నీవు ప్రా
ణంబులు నేను దేహమని ♦ నమ్మఁగఁబల్కుట తప్పవే కదా?
నెంబరయా కృతాంతుఁ డవి ♦ వేకముచేత ననూత్కరంబు భూ
మింబడ దేహముంగొని భ్ర ♦ మించి దివంబున కేగె నేమొకో? ౧౬౨

తే॥ కీర్తి వ్యాపింపఁగా నగ్ని ♦ కీలలఁబడి, మాఁడవలయునుగాక యి ♦ మ్మాడ్కి నబల
యట్లు దుఃఖింపఁ దగునే? యం♦చతఁడు లేచి, వత్సలార! వినుండని♦పల్కె నిట్లు. ౧౬౩

సీ॥ దక్ష ప్రజాపతి ♦ తనయులఁ గాంచె నేఁ, బంద్రెం డ్వారల నొక్క ♦ పగిదినున్న
పదుమువ్వురను కశ్య ♦ పప్రజాపతికిచ్చె, వారిలోఁ దిలకమై ♦ వఱలు నదితి
ముప్పదిమూఁడు కో ♦ ట్లొప్పు సురలఁగాంచె, దితియను సతి పూర్వ ♦ దేవతాళి
నఱువది యాఱుకో ♦ ట్లడరంగఁ గనియెను, దనువను చెలిగనె ♦ దానవులను

తే॥ మనుజతతిఁ గాంచె మతియను ♦ మఱఁతి, సురభి, కాంత కామధేనువుతురం ♦ గంబులాది
మృగములం గాంచె, సింహాక్ర ♦ మేల గార్ద, భాదులను క్రోధవశయను ♦ సతివపడసె.

సీ॥ వినతా వనితగాంచెఁ ♦ బిడుగుల మెఱపుల, నరుణుని గరుడు ది ♦ వాంధములను
కంకంబు లాదిగాఁ గల పెనుపక్షులఁ, దామ్రయన్ పడఁతి యొం ♦ దంగఁగనియెఁ
బిచ్చుకల్ పూరేళ్లు ♦ బెళవలు కౌఁజులు, మున్నగు పినపిన్న ♦ పులుఁగు తెగలఁ,
గళయను నామె తీఁ ♦ గలు చెట్లుగుల్మముల్, మొదలగు నుద్భిజ్జ ♦ ములను పడసె

తే॥ భయద ఫణములుగల యహి ♦ ప్రతతిఁగాంచెఁ, గద్రువయను వెలఁదినా ♦ గములుతక్కు
వానిఁ గనె సుతయనునది ♦ తానరిష్ట, యుడుము లుడుతలు తొండలు ♦ పడసెఁ బుడమి

సీ॥ జలచరంబులఁ గాంచె ♦ నిఱయను నెలనాఁగ, యట్టులా చెలులు చ ♦ రాచరముల
విరివిగాఁ బడసిరి ♦ వినతా సుతులలోన, నరుణుండు రంభ యం ♦ దమరఁ గాంచె
మమ్ము, మాయన్న సం ♦ పాతి నన్ను జటాయు, వంద్రు దివౌకసు ♦ లందు నుండి
తక్కుజాతుల వేఱు ♦ లెక్కించు కాలాన, జనియించి నాఁడ మీ ♦ జనకుహితుఁడ

తే॥ నరుణుఁ డెందెందు వర్తించు ♦ నందు నందుఁ, దిరుగనేర్తు నెదురులేక ♦ దివ్య తేజు
లార! మిము గంటి మీతండ్రి ♦ నారఁ గాంచి, నట్టులయ్యె మనంబున ♦ నలరు మిగిలె

తే॥ ఆతఁడిటు వల్క రాఘవు ♦ లంజలి గొని, యుబుకు వంతచే బాష్పంబు ♦ లురలఁ గీర్తి
నిచటనిల్పి నాకంబున ♦ కేగుతండ్రి, మరలి రాఁజూచు కైవడి ♦ మనలినారు. ౧౯౫

ఉ॥ అత్తఱి రామలక్ష్మణుల ♦ నర్మిలిఁ బక్షములందు చేర్చి రా
జోత్తములార! నాకుఁదగ ♦ నుత్తరకార్యములెల్ల మీరలే
యిత్తఱిఁ జేయఁగావలయు ♦ నిద్దఱు మూర్తులకొక్క జీవమై
హత్తిన మిత్రుఁడేగ భర ♦ మైకను దేహము నగ్ని నీఁగెదన్. ౧౯౬

క॥ అను పక్షిరాజు పలుకుల, ఘనులగు రాఘవులు వినుచుఁ ♦ గై మోడ్చి వెనన్
గనులను ముత్తెంబుల యను, వున బాష్పము లురల ననిరి ♦ పొక్కుచు వనటన్.

తే॥ కడఁక మాజీవిత సహాయ ♦ కారివైన, తండ్రి సత్యవాక్యంబుకై ♦ తరలె దివికి
నిప్పుడీవును మము డించి ♦ యేగునెడల, మాకు దిక్కెవ్వరింక నీ ♦ లోకమందు?

ఉ॥ [illegible] ప్రేమపద ♦ విశ్రుత రూపులఁ దల్లిదండ్రులన్
[illegible] మాప్తబంధువుల ♦ [illegible] ముద్ధతమా నయోధ్యయున్

పిడితి మెల్లనంపదలు ♦ పిడని కానలలోని కష్టముల్
పిడితి మేను మీవలన ♦ పిదుట పాసిరె మీరు నిచ్చటన్? ౧౯౯

తే॥ అని తపించుచు వెల్చిన♦ యనఘులం గని, యిప్పుడు నేను దేహము విడు♦టింపు గాక
యున్న మీరయోధ్యకుం జేరు ♦ క్రన్ననిలిచి, దశరథుం జేరు వాఁడనో♦తనయులార!

మ॥ జనకుం డెక్కడ నేకగం బూజ్యమగు రా ♦ జ్యంబెరు పాలింప కి
ప్పనికిన్ రాఁగతినేమి? యేమి జరిగెన్ ♦ బల్కుండు దూపిల్లు నా
మనమున్ నిర్జరదైత్య పన్నగ రిపు ♦ త్సైనాథు ప్రేరేని నే
నిఁక గావించినఁ జిక్కె మీకు సభిషే ♦ కింతున్ మహోగ్రమ్మెటన్. ౨౦౦

తే॥ జనకుఁడైన జటాయు వి ♦ నరణిఁ బలుక, నన్న తమ్ముని గ్రేఁగింట ♦ నరయునంత
నతఁడు పినతల్లియగు కైక ♦ కతన జరగు, వృత్తమెల్ల స్పష్టంబుగా ♦ విన్నవించె.

తే॥ తండ్రి సత్యవంతుం జేసి ♦ తల్లి నలుక, తలను దాల్చి రాజ్యమ్మును ♦తమ్మునకు నొ
సంగు త్యాగమూర్తి! తండ్రి! సంతసగను, నీ పనుల్ మతి యేరిచే ♦ నెగడు? ననుచు.

తే॥ కమలనేత్రుని పెగియూరఁ ♦ గౌఁగిలించి, శిరము మూర్కొని యశ్రువు♦లురలఁగాంచి
యోనమర్థ కుమార! నీ ♦ విసరణిని, పితరునకు నాకు యశము ♦ గావించి తనుచు.

తే॥ గాజులం దాల్చు నొక హంసి ♦ కరణి నున్న, జనకజం గాంచి యీతన్వి♦చందమేమి?
కుసుమకోమలి మీతోడఁ♦గూడిరాఁగఁ,గారణం బేమి?యనుడు ల♦క్ష్మణుఁడు పలికె

చ॥ తమిఁగమిఁ బోలి భక్తోలుపు - తాటకఁ జంపుట గోలె శంభు ధ
ర్మమునొని తుండ్లు సేయుటయు - మైథిలి పెండ్లియుఁ బట్ట భంగమున్
తమ పెపినాగమంబు పితృ - తర్పణముం బొనరించు దాఁక స్ప
ష్టముగ వచించెఁ బక్షికుల - చంద్రముఁ డెల్ల నెఱుంగునట్లుగన్. ౨౦౧

క॥ భోగకర రాజ్యమెల్లను, భోగి కుబుసమూడ్చు పోల్కిఁ - బోవిడిచిన వై
రాగులు మీరీవనమున, నాఁగుఁడు రక్షించుచుండు - ననవరతంబున్

చ॥ అని విహగేంద్రుఁడాడ విని - యార్యుఁడు రాముఁ డగస్త్యమౌని చె
ప్పిన దగు గౌతమీ తట వి - విక్త తలంబున నుందుమన్న న
య్యనఘుఁడు లెస్సయయ్యెఁ దగ ♦ నాస్థలమందె తపంబుసేయుఁ డ
వ్వానిఁ గనిపింతు రండనుచుఁ - బక్షము సీడనె కొంచుఁ బోవుచున్. ౨౦౨

తే॥అమలహృదయుండు గుణనిధి♦యగుజటాయు,వెదుట నున్న పంచవటి న♦య్యిద్ధగుణుల
కెఱుక పఱచి చనిన యంత ♦ నినకులేశు, లవ్వనంబునఁ జేరి ర ♦ త్యాదరమున. ౨౦౩

ఉ॥ అచ్చటనున్న రాక్షసుల ♦ యాశ్రయ సత్త్వములెల్లఁ జక్కఁగా
నిచ్చ నెఱింగినట్టి విహ ♦ గేంద్రుఁడు క్రొత్తడియైన జానకిన్

మచ్చికఁ నక్కుమారులను ♦ మాటికి మాటికి వచ్చి పిల్లలన్
మెచ్చుటఁ గాంచు నండజము ♦ వోలెఁ గనుంగొనుచుండె నంతటన్. ౨౧౦

౫ శూర్పణఖాపటలము ౧౪౩)

ఉ॥ వీరులు రాఘవుల్ గనిరి ♦ పృథ్వి కలంకృతియై సమస్త సం
భారము లిచ్చి పార్శ్వములఁ♦*పంచ విధంబుల నంట భూములన్
దారిత పాతకంబులగు ♦ దారుల రంజిలి యాత్తలక్షణో
దార కపిత్థ పద్ధతిని ♦ హారి వినిర్మలయైన గౌతమిన్. ౨౧౧

చ॥ కమల ముఖంబులన్ గలువ ♦ కన్నులఁ గాంచి తరంగహస్తముల్
క్రమముగఁ జాఁచి పుష్పములు ♦ క్రమమగ వారలపై విసర్చుచున్
భ్రమద విహంగ రావములు ♦ స్వాగతపద్యము లల్లుచుండె గౌ
తమి యతిథుల్ రఘూత్తములు ♦ తన్న రయంబునఁ జేరఁ గాంచుచోన్.

ఉ॥ మిక్కిలి ప్రేమ సువ్రతులు ♦ మేదిని నాయక పుత్త్రరత్నముల్
చక్కటికై వనంబులకు ♦ సాగిన కష్టముఁగాంచి యోర్వలే
కక్కటికంబుచేఁ దరఁగ ♦ లన్ కరముల్ గొని మోఁదుకొంచుఁ జే
రక్కలినొంది యుత్పల క ♦ టాక్షములన్ వడిఁగార్చె బాష్పముల్. ౨౧౩

సీతారాముల గౌతమీ తీర విహారము

ఉ॥ నాథయుతంబులైన నలి ♦ నంబులపై వెసఁ జక్రవాకముల్
ప్రాలుట గాంచి రాఘవుఁడు ♦ వారికి సీత కుచంబులం గనున్
ఆ లలితాంగియున్ విభుని ♦ యంగద బాహుల సౌరు గాంచి ర
త్నాల మెఱుంగు లీను గిరి ♦ నాయకముం గనుచుండు లీలమై. ౨౧౪

తే॥ హంసి యటఁదొలఁగుట గని ♦ హంసకులుఁడు, సీత నడకను గాంచి హ♦సింప నామె
నీరు ద్రావి నివర్తిలు ♦ గౌరు నడక, గాంచి రాము నడక చూచి ♦ కడఁక నవ్వె. ౨౧౫

తే॥ తీవియలు కదలుట గని ♦ తీవఁబోఁడి, నడుము గాంచె రాముఁడు, సీత ♦ నాథుతనువు
నల్ల కలువల నడిమి యుత్ఫుల్ల వనజ, యుగము నెగడిగ నిట్టట్టు♦లారసి చూచె. ౨౧౬

ఉ॥ అట్టి వినోద దాయక మ ♦ హానది గౌతమి చెంతఁ గొండలం
బుట్టిన నిర్ఝరంబులును ♦ ముచ్చట గూర్చు శకుంత రావముల్
పట్టుగ మ్రోఁగు పంచవటి ♦ బంధుర లీలల లక్ష్మణుఁ డెడం
గట్టిన గట్టి పర్ణకుటిఁ ♦ గాంచి వసించిరి వారలంతటన్. ౨౧౭

* (1) కటిరంబు=కొండయు, కొండక్రింది నేలయు. (2) ముల్లై=అడవియు, అడవిప్రక్క నేలయు (3) నెయ్దల్=కడలియు, తీరభూమియు. (4) మరుదం=మాగాని. (5) పాలై=మరుభూమి.

ఉ॥ ఏమి యొనర్ప నెంచి యితఁ ♦ డిట్టి మనోహర రూపమొందె? సీ
కోమలికంబు పాడుగ నొ ♦ కొండు తపంబిటు లేల సేయు? దై
త్యామర సిద్ధసాధ్య మను ♦ జావళి లోఁగొనఁ జాలు ధీరుఁ డి
ట్లీ మహిలోఁ దపింపఁ దఁ ♦ మే తపముం బొనరించెనేమొకో!. ౨౨౮

తే॥ ఏణలోచన గిరికుచ ♦ యిభ్యయాన, సైకతశ్రోణి ఘనవేణి ♦ జలజపాణి
వనధిచేల భూదేవి యీ ♦ వరుని పదము,లంటి శాద్వల రోమాంచ ♦ యగుచునుండె

తే॥ ఈ సుభగు కాంతి దినకరుఁ ♦ డెఱుఁగఁడేమొ?భువనమందుస్వల్పంబగు♦పొల్పునించి
బిడియ మొందక నభమున♦ నడచువాఁడు, తానె యసమ తేజస్విగాఁ♦దలఁచినాఁడు?

తే॥ దాఁట సరుదైన గిరులను ♦ సాటిగొనని, యున్నత భుజంబు లొప్పు నీ ♦ వన్నెకాని
యధరమునకుఁ బ్రవాళ సా ♦ మ్యంబు వలుక,జను లిపీయనమటియేది♦నవతుగలదు?

క॥ చక్కని నిండు కళలతో, నిక్కు నిశానాథుఁ డెగను ♦ నీటరి కటిపైఁ
జెక్కిన వల్కలముం బలెఁ, బెక్కువ తపియింప వేమొ ♦ పీతాంబరముల్?. ౨౩౨

తే॥ మొగులు దొంతుల కరణిని ♦ మొనలు దిరిగి, దట్టమై నల్లనై యున్న ♦ జుట్టు విడిచి
జడలఁ బూనఁడయేని చం ♦ చలములగుచుఁ, జెలుల మూస ధనంబులు♦చెడకయున్నె?

తే॥ తారహారముల్ మల్లికా ♦ దామ వితతి, నితఁడు దాల్చిన జిగియున్నె ♦ యింతకంటె
ఘనతరోజ్జ్వల మాణిక్య గౌరవంబు, వేఱు రత్నంబుచే నభి ♦ వృద్ధియగునె? ౨౩౪

ఉ॥ భద్రగుణాలి యెల్ల బహు ♦భంగుల నేర్చి విరించనుండు సా
ముద్రిక లక్షణంబుల న ♦ మున్నతిఁ జూపు నిమిత్త మిట్లు ని
ర్నిద్రత వీనిఁజేసియును ♦ నిందను పొందె సమస్తలోక సం
పద్రతి వజ్రి యొందెఁ దన♦ పాద రజంబును పోలకుండియున్.

ఉ॥ వెల్లువలున్ సముద్రములుఁ ♦ బిన్నవిగాఁ గనుపట్ట డెందమం
దల్లిన మోహమున్ జలధి ♦ యామెను ముంప, దరిద్ర దూషణల్
పెల్లుగ నోర్చి యెంత విల ♦ పించిన నొక్క తృణంబయేని యీ
నొల్లని లోభికీర్తివలె ♦ నుంకెడు శీలము గల్గు దైత్యయున్. ౨౩౬

చ॥ వడలి తపించి కుంది రఘు ♦ వర్యుని యున్నత దోర్యుగంబుపైఁ
బడఁ దన చూపుల న్నిలిపి ♦ వాని మరల్పఁగ లేక శిల్పి నే
ర్పడర లిఖించు బొమ్మయన ♦ నట్టె చలింపక నిల్చి యేదియున్
దోడఁగఁగఁ బాలుపోక మది ♦ తుంపెనలాడఁగ దైత్యయవ్వలన్. ౨౩౭

ఉ॥ వీని విశాలవక్షమును ♦బిగ్గ గవుంగిలిఁజిక్కఁగొందుఁ గా
దే నమృతంబు నిచ్చిన క్షు ♦ యించుట నిక్కము మిన్న కేఁగఁగా

లేను మఱియు దిష్టము ఫ ♦ లింపఁగ నీ నవమూరు సన్నిధిన్
మానుగఁ జేరు బెట్లనుచు ♦ మంతన మొందఁగఁ జేసి యంతటన్. ౭౩౮

చ॥ కటిల కరాళ దంత, జటాలు ♦ కోటుల జీవుల వై చికొన్న యు
త్కట కుహరోష మోదర, య ♦ తర్కణ మిట్లు దలంచి యాతఁడీ
కటుతర రూపముఁ మదిని ♦ కై కొనఁ డంచు నెమిష్లు కోకిలల్
పటుమతి వెంటనంటఁ దగు ♦ భవ్య తరాకృతి గాంచ నెంచుచున్. ౭౩౯

శూర్పణఖ కామరూపిణియై రాముకడ కరుగుట

తే॥ సిరిజాలయు నెడఁద ధ్యా - నించి తనకు, సిద్ధియై యున్న మంత్ర మా-చెలి జపింప
నబ్జుఁ డెనఁబు మొగము తోడ - నంగకాంతి, దెసలఁ బర్వ సుందరియయి-తేజరిల్లె

తే॥ ఎఱ్ఱ ప్రత్తియుఁ జిగురాకు-నీల గొనఁగఁ, దగ్గ చరణాబ్జములు గల్గి - తనివి నసఁగ
మాటలాడు మయూరి నా - మానసౌక, మనఁగ లేఁదీఁగ యన విన-మనఁగ వచ్చె

తే॥ లక్ష్మియందంబునీలోత్ప-లములసొబగు,గెలుగునయనకుంతంబులు-వెలుఁగు మొగము
నలలయువతిరూపముఁగొన్న-వాత్రు మొండు,మెఱపుతోఁగాకమింటితో-నెఱఁగెనసఁగ

తే॥ కల్పకముగన్న యెలదీవ ♦ కై పుగలిగి, కామదంబగు మధుర వా ♦ క్యములుగలిగి
యందగత్తియై భీత ♦ మృగాక్షియగుచు, నమిలి నడచిన కయివడి ♦ నడచివచ్చె. ౭౪౩

తే॥ రశనయును నూపురములు వ♦ స్త్రమును కురుల, విరుల బంభరముల రొద♦వి స్తరింప
నింతి యొకతె వచ్చెడు నని ♦ యెంచి రాముఁ,డా దెసను దృష్టిసారించి♦యరయసాగె.

తే॥ ఒక్క యమృతంబు నాకస♦మొసఁగె నసఁగ,గుచభరంబున మధ్యంబు♦కునియరాఁగఁ
దలఁపు నిచ్చియజ్ఞానంబు ♦ తలఁగఁద్రోచి,జ్ఞానదృష్టి నిచ్చెడువాఁడు♦సకియఁగనియె.

మ॥ సురలోకంబున నాగలోకమున నీ ♦క్షోణిన్ గనన్ రాని యా
వరరూపంబును కాంచి రాఘవుఁడు భా ♦ వంబంద యూహించె నె
ల్లర సౌష్ఠవ్యము లీమె యంద యడఁగెన్ ♦ లక్షించి వీక్షించినన్
సరిపోల్పందగు చామలుంగలరె యీ ♦ సౌందర్యవారాశికిన్? ౭౪౬

చ॥ తనమది రాఘవున్ వలచు ♦ దైత్యయు నాతని సుందరంపు మో
మును తలపోయుచుం జరణ ♦ ముల్ తన హస్తములన్ మొగిడ్చి మ్రొ
క్కినిడుపుగ్రేవ చూడ్కిఁ దిల ♦ కించియుఁ జూడని యట్లు సుంత ల
జ్జను గొని యేణి యట్టులొక ♦ చక్కిఁదొలంగి మలంగి నిల్వఁగన్. ౭౪౭

ఉ॥ ఆగతయైన శూర్పణఖ ♦ నాగమ వేద్యుఁడు కాంచి పల్కు దూ
రాగత పద్మగంధిరొ! శు ♦ భానన యెయ్యదిఁ నీదురాక నీ

కీగతి నిందు రాఁ గత మ ♦ దెయ్యది? యెయ్యది వాసభూమి? నీ
బాగు వచింపు నామమెది? బంధువులెరు? వినంగఁ గోరెదన్. ౨౬౮

తే॥ అనుడు నయ్యది యిట్లను ♦ నబ్జగర్భు, పౌత్రు పుత్త్రిని త్రిపురారి ♦ మిత్త్రుఁడగుచు
దిక్కరులగెల్చి తారాద్రిఁ ♦ దిరిరి యెత్తు, ఘనుని చెల్లెల నాపేరు ♦ కామవల్లి

తే॥ అనిన రాముఁడు సందేహ ♦ మంది దీని, నడత చెడ్డది యగునైన ♦ నరయుదమని
రావణుని చెల్లెలైన నా ♦ రజపు రూపు,గలిగె నవ్విధిఁ దెలియంగ ♦ బలుకు మనఁగ

చ॥ తడఁబడకుండు వాక్యముల ♦ దానవి యిట్లను రామచంద్ర! మ్రు
క్కడులును మోసగాండ్రు నగు ♦ కర్బుర సంఘము తోడి జీవితం
బెడయఁగ రోసి నా యెడఁద ♦ నింతవివేకము గల్గ ధర్మము
న్నడపుచుఁ బాపమూడ్చి సుమ ♦ నస్కులచేఁ దగఁ గొంటి నీయెడన్. ౨౭౧

ఉ॥ ఆ పలు కాలకించి సుగు ♦ ణాఢ్యుఁడు రాముఁ డనుక మహేంద్రుఁడుక
బ్రేఁపఱ లొంగి సేవలొద ♦ వింపఁ ద్రిలోకము లేలు వానికిక
జాపలనేత్ర! చెల్లెలయి ♦ సంగడు లెవ్వరు లేక యొంటివై
నీవగిదిక వనంబులకు ♦ నీ వరుదేరఁ గతంబు తెల్పుమా. ౨౭౨

తే॥ అనిన రాముని ప్రశ్నకు ♦ నన్నృతవాది, ని యగు నాపె యిట్లను రాజ! నీచదైత్య
సంగతిని మాని దేవప ♦ క్షంబు నూని, వచ్చితిని కార్యమొండు నీ ♦ వలనఁ గలుగ

తే॥ అనుడు స్త్రీలమానసములు ♦ గనఁగఁ దివుట, యోగ్యములుకావనుచు నెంచి ♦ యువతి! యే
పని గలదు తెల్పు మయ్యది ♦ భావ్యమేని, తప్పకయొనర్తు నని పల్కఁ ♦ జప్పనాతి. [మి

తే॥ తాముపొందిన వలవంత ♦ తామె తెలుప, మానినులకుఁ దగనిదైన ♦ మాఱు దిక్కు
లేకయుంటి మన్మథుఁ డద ♦ లించి సేయు, సిలుగుఁ లంద్రోచి నన్ను ర ♦ క్షింపు మనిన.

క॥ వాలికలై కన్నులు పెను, పోలికలై తిరుగుచున్న ♦ పొలఁతి తలంపుల్
చీలికలై సిగ్గటి వల, పేలికలై చెడిన వనుచు ♦ నెంచుచు నుండక. ౨౭౬

తే॥ తేంట్లు పోరాడు వేణి నొం ♦ దిన వెలంది, మానసమున నున్న రాముని ♦ మనము నెఱుఁగ
లేక ప్రేమించి నన్ను పా ♦ లించు నొక్కొ, కాదనునొ యంచుఁగలఁగియా ♦ కరణిఁ బలికె.

ఉ॥ రామ! యలేఖ్య సుందర! న ♦ రాగముతో నిట కీవు వచ్చుటల్
నే మును కానకే మునుల ♦ నేమకముల్ పొసరించుచుంటి నా
కామవకామినీత్వపుసు ♦ గారపు యౌవన మింత కాలముక
గోముది కానఁ గాయు క్రియఁ ♦ గానట బీసట యయ్యెఁ గాంచితే? ౨౭౮

ఉ॥ నిందితురాలు దైత్యసతి ♦ నీతిని మాలి యిటుల్ వచింప రా
జేందుఁ డు వేఱుకార్యమున ♦ కిట్టులు వచ్చిన దంచు నెంచి యో

సుందరి! బ్రహ్మవంశమున ♦ జొచ్చి ప్రసిద్ధి వహించితి నతనిబట్ట నీ
వొందిన వర్ణధర్మములు ♦ బూదిని గల్పుట యుక్తమా? యనన్ ౨౪౯

ఉ॥ శ్రీంపెఱి! బ్రహ్మవంశజుఁడు ♦ తల్లి యరుంధతిఁ బోలు నామె దై
త్యుఁడు సుమాలి కూఁతురగు ♦ దోషము లేమి వృథా వివాదముల్
మొందుగఁ బల్కి యిట్లు కడ ♦ మీఁటుము వేని భరింపఁ జాల నీ
వండనె ప్రాణము ల్విడుతుఁ ♦ దప్పదు పాపము నీకు సుందరా! ౨౫౦

చ॥ వలపెవ నగ్గలంబగుడు ♦ వారక రావణు చెల్లె లీగతిం
బలుకఁగ సుస్మితంబను ప్ర ♦ భా తరళంబగు మించుతోడి దా
జలదము భాతి శోభిలు ప్ర ♦ జాహిత చిత్తుఁడు ఖేలనారతిన్
జెలువ సురారి కన్యకను ♦ చేకొన మర్త్యున కొప్పునే? యనన్. ౨౫౧

చ॥ తలఁపఁగఁదగ్గ శ్రద్ధ ప్రమ ♦ దంబగు భక్తి ఫలంబు పెద్దగాఁ
దలఁపక తొందరం దవిలి ♦ దైత్య వరాంగిని పంక్తికంఠు చె
ల్లెల వని పల్కెడి తెలివి ♦ లేకుగ నెద్దఁ దలంచి గొప్ప వే
ల్పుల వరశక్తి దైత్యతను ♦ పూర్తిగ నీఁగితి నంచుఁ బల్కఁగాన్. ౨౫౨

చ॥ ఇనకుల చంద్రుఁ డిట్లు వచి - యించు సుభాసిని! నీదు సోదరుల్
ఘను లొకరుండు వీరత జ - గంబుల నేలెడి ధీరుఁ డొక్కఁడో
ధనదుఁడు వారు నిన్ను ప్రమ - దంబున నిచ్చినఁ గేలు పట్టుటల్
పనియగుఁ గాక యన్యమగు - పద్ధతి యుక్తము కాదుచుమ్మనన్. ౨౫౩

తే॥ మరునిచే నైక్యమెయున్న - మనసులొప్ప, స్త్రీలకును మగలకు శాస్త్ర-సిద్ధమగుచు
వఱలు గాంధర్వవిధి యట్లు - జరుగు పిదప, నన్నలును సమ్మతింతురు - వన్నె కాఁడ!

చ॥ ఋషులపయిన్ విరోధము వ - హించు సురారులు నిన్నుగాంచి వి
ద్విషుఁడని వైరమూనరు మ - దిం దలపోయ నొకండ వుంటి వీ
విషయమె వంశమైత్రికొక - వేడుక వారధి గాఁగనొప్పు న్వ
ర్ద్విషయము నీయధీన మొన - రింతురు మిక్కిలి మేలు గూర్తురున్. ౨౫౫

చ॥ అనవుడు రామచంద్రుఁడను - నంగన! నీ సుఖమందితిన్ బలా
శనుల కృపం గడించితిని - సంపద నొందితి మేలుపొందితిన్
జనపదముం ద్యజించి విపి - నంబునఁ జేయు మహాతపంబు గాం
చిన ఫలమొక్కఁడో? యనుచుఁ - జిర్నగవుం బొనరించు నంతలో ౨౫౬

## శూర్పణఖ సీతను కాంచుట.

సీ॥ త్రిభువనవాసుల - దృష్టిభూషలచేత, వెలయుచు వాసనల్ - వీచుచుండు
నాకు గీమున నుండి - యున్నల మిన్న ని, ర్జరుల్గు పొందిన పుష్ప - పరిమళము ఫలన

భూమిలో రత్నంబు - పోలిక నుద్భవిం, చిన సీత యచటికిఁ - జేరరాఁగఁ
గాలెదు మాంసంబు - గతికి పొక్కిన యూస్య, మొప్పిన మతిహీన - చుప్పనాక
తే॥ కాయమున వెల్వడిన సూర్య-కాంతివంటి, కాంతి యొక్కండు ప్రక్కనఁ- గ్రాలనరసి
ధరను నింగిని నిండిన-కృంచరాట, వులను కాల్చు పతివ్రతా - నలముఁగాంచె. ౧౬౭

ఉ॥ తావి కురుల్ గలట్టి వసి ♦ తామణి సీతఁడు తోడఁగొంచు ని
ట్లీ వని కేగుదేరఁడు మ ♦ హీతలమం దిటువంటి సుందర
శ్రీ విలసిల్లు కామినులు ♦ చెందరు లక్ష్మియె సద్మమైన రా
జీవము వీడి భూస్థలిని ♦ చెన్నగు కాళులు తేయ వచ్చెనో? ౧౬౮

చ॥ అని భ్రమియించి చూచి కమ ♦ లాసను సృష్టి మతింపు మీఱు సం
చున నొక హద్దులేని బలు ♦ సోయగముం గలదంచు నెంచి క్ర
న్నన నొక యాఁడుదాన నగు ♦ నాకె కనుల్ మనముల్ మరల్పఁగాఁ
బనుపడకుండె నింక మగ ♦ వారలు గాంచిన నేమి యాదురో?. ౧౬౯

ఉ॥ రాముని చూచి చూచి మఱి ♦ రామను తప్పక చూచి చూచి యా
తామరపాసనుండె యొక ♦ తావునఁ గాంచఁగఁ దగ్గ యట్లు చే
తో ముద మొందఁగాఁ దలఁచి ♦ తోన యజాండమునందు గల్గు న
క్కోమలికంబు లొక్కయెడఁ ♦ గూరిచి చేసెను వీరి నిద్దఱన్. ౧౭౦

ఉ॥ కుందనముం బలెం బురుడు ♦ గూడని నీలపయోద గాత్రుఁ డీ
సుందరమూర్తి యీతనికి ♦ జోడగు నేమిది నన్నువోలె? నీ
చందవగంధి నావలెనె ♦ చయ్యన మధ్యనె వచ్చెఁగాదె? దీ
నిం దొలఁగించి త్రోవ నిత ♦ నిం బురికొల్పెద నంచు రాముతో ౧౭౧

చ॥ సుగుణగణాఢ్య! యీచెలువ ♦ చూడఁగ రక్కసి మాయలాఁడి దీ
ని గుణ మెఱుంగరానిది గ ♦ ణింపఁగనేల? పలాశి దీని సో
యగమును నమ్మఁ బోకు నిజ ♦ మైనది కాదిది నీకు హాని గూ
ర్పఁగఁ దఱి వేచియున్నది త్వ ♦ రన్ దొలఁగింపుము మేలు కోరినన్. ౧౭౨

చ॥ అనవుడు రాముఁ డిట్టులను ♦ నాసురికిన్ దరలాక్షి! మేలు! నీ
సునిశిత బుద్ధి మెచ్చితిని ♦ సూక్ష్మమతి న్నిను గెల్చువారు భూ
మిని కలరేమి? నీ పలుకు ♦ మేలున నీ హృదయం బెఱింగితిన్
గనుపడ దీనిదైత్యయని ♦ కాంచెదు గాకని నవ్వె నల్లనన్. ౧౭౩

చ॥ మధుము వసిష్ఠు చావయును ♦ జోడనఁదగ్గ వరాంగి సీత రా
మ ధరణిపాలు దగ్గఱఁగ ♦ ముంచెదు నిప్పులఁ బోలు కన్నులన్

గువలయాప్తుండు తన్ను సం♦ కోచ పఱుప, మాని తాపంబుచేఁజాల♦మాఁడుచుండె

తే॥ విరులు పొడియగు నట్టు లీ ♦ పృథివి గలుగు, వనములనుధ్వంస మొనరింప♦వాంఛచేసి
జక్కవలు కవగూడిన ♦ చంద మరసి, వాని ధ్వని విని మది క్రుంగ ♦ వడఁకు చుండె

తే॥ కడఁగి శశి క్రమింగ నొక భుజం ♦ గంబుఁ దెత్తు, ననుచుఁ గోపించి చను దోయి♦నంటిచల్ల
గాలి సోఁక సంకటపడి ♦ కడఁకమాను, రాముపైఁగల వలపున ♦ఱంపె లాఁడి. ౨౮౬

తే॥ ఉడుకు చనుదోయిపై మంచు♦నుంచు కొనియెఁ, గామశరవహ్ని మేన మి ♦క్కుటము
వేఁడి బండపై నుంచిన♦వెన్నముద్ద, మాడ్కిఁ గరఁగి నీరయ్యె న♦మ్మగువకదియు. [గాఁగ

చ॥ జలనిధిఁ గ్రూరుఁడౌ కుసుమ ♦ సాయకు దాఁచి యడంప యోగ్యమా
స్థలమెది యంచు నెంచి యసు ♦ సంచయ మూఁగుచునుండు దుస్థితిఁ
గలిగి స్మరాగ్నికిన్ జడిసి ♦ కంధిని ముగ్గ మునింగి నట్టి యా
జలమును వేఁడియాటఁగని ♦ చామ బిడెంబును పొందె నత్తఱిన్. ౨౮౭

తే॥ చెమ్మగల నెలఱాలు ను ♦ ష్ణమ్ము నొంద, మదిఁ దపించు దైత్యాంగన ♦మరులుసోఁకి
కారు మొగుళులు నీలంపుఁ ♦గంబములును, కానవచ్చినఁ గేల్మోడ్చుఁ ♦గళవళించు.

తే॥ మారుతమ్ము దోషాకర ♦ మన్మథులును, తన్ను చూడకుండఁగ భయ♦ దంపుదంష్ట్ర
లుండు సర్పముల్ వసియించు♦చుండునట్టి, కొండ గుహాలోనఁ జేరె ర ♦క్షోమృగాక్షి

క॥ అట వీచు మారుతము మును, పటికంబెన్ మించి వేఁడి ♦ పాఱి చనులు గా
లుటచేతఁ గర్జమెఱుఁగక, తటమట పడి చిగురుటాకు ♦ తల్పమునఁ బడెన్. ౨౯౧

క॥ రాముని రూపము గనఁబడఁ, జామయు నుత్కంఠనొందు ♦ సంకోచించున్
సోము గొని సోలు సిగ్గిలు, రాముఁడు మఱుఁగైన మరుని ♦ రాయిడి మఱుఁగున్.

ఆ॥ కారు మొగులుఁ గాంచి♦కాకుత్స్థుఁడని యెంచి, చనుల నాన నలమి ♦సంతసించు
వేఁడిచేత నదియు ♦ విరియంగఁ జాఱిన, నడలు, దానియలఁత ♦ కంతు గలదె? ౨౯౩

క॥ విలయాగ్నిం బోలు స్మరా, నలమునఁ గ్రాఁగియును శూర్ప ♦ణఖ రాముని మే
నలమి మనునాస జీవం, బుల విడువఁగ లేదు వలపు ♦ పోలు పెట్టిదియో? ౨౯౪

క॥ అంజన గిరిసన్నిభ! యిటు, నెంజిలిగొను నాయెడంద ♦ నిలిచి కరుణతో
రంజిలు మంజిలి యిడెయని, నంజు గొనినదాని పోల్కి ♦ నడుఁకు నడలునన్. ౨౯౫

ఉ॥ ప్రాణము పోయినన్ మరులు ♦ పాయని మాయిని చప్పనాతి సం
త్రాణము లేదటంచుఁ గోల ♦ దాఁకిన కైవడి సంతపించు న
య్యేణ విలోలనేత్ర భువి ♦ నిందిర కంటెను సుందరాంగి గీ
ర్వాణ నుతుండు ధాని విధి ♦ పాపిని నన్ను పరిగ్రహించునే?, ౨౯౬

ఉ॥ ఇచ్చటనున్న సుందరియు ♦ నిందిరయేయగు; నాకుఁగల్గు నే
మచ్చికవానికింగలదె? ♦ మారుఁడు చూపెను పక్షపాత మం
చెచ్చిన బాళిఁగుందునెడ ♦ సీతఁడు రాక్షసలోక తామసీ
గ్రచ్ఛఅఖ్రమింగు భాస్కరుఁడె♦కా! యని చూపఁగఁ బుట్టెభానుఁడున్. ౨౯౭

శూర్పణఖ సీతను పట్టఁబోవ లక్ష్మణుఁడు దాని ముక్కు చెవులు గోయుట

మ॥ ఉదయం బందుట గాంచి శూర్పణఖ లో ♦ నుత్సాహముం బొంది యి
మ్ముదితారత్నము చెంతనుండు వఱకు ♦ నోర్మిదింపఁ డీతండు నా
చదురుల్, దీనిని దాఁచియుంచి యితనిన్ ♦ సంతృప్తిమైఁ బొందినన్
బ్రమకింగల్గుదనంచుఁ బొంచి చనియెన్ ♦ రామామణిం బట్టఁగన్. ౨౯౮

ఉ॥ అంగన, రాముఁడొక్కసర - మం దుదయాదిక కృత్యముల్ పొన
ర్పంగను పోయియుండుటలు - బాగుగఁ జూచెను పర్ణశాలచెం
తం గనిపెట్టి లక్ష్మణుఁ డ - తంద్రతఁ జీఁకటియైన తోఁట నుం
టంగనలేక సీతను క - డంక గ్రహింపఁగఁ బోయె నెవ్వడిన్. ౨౯౯

ఉ॥ ఒంటరియై లతాంగి యిట - నున్నది నాతలఁపుల్ ఫలించె నీ
దంటను పట్టి దాఁచెద న - తండు నిజంబుగ నాకు లొంగు నా
కంటను పడ్డ యిక్కలువ - కంటియుఁ జిక్కక పోనె? యంచు వె
న్నంటెను లక్ష్మణుండు నను - రాంగన వచ్చుట గాంచి యుగ్రుఁడై. 300

శా॥ ఓసీ! యెచ్చటి కేగె దింక నిలు నీ - యుద్యోగముల్ చాలు రా
కాసీ! యంచుఁ దురీలునం బఱచి త - త్కాంతాత్వముం గాంచి బా
ణాసం బూనక కీలఁబోలు కురులన్ - హ స్తంబునం బట్టి బ
ల్రోసం బారఁగ వ స్త్రిఁదన్ని కరవా - లుం బూని యుగ్రాత్ముఁడై. ౩౦౧

శా॥ ఉత్సాహంబునఁ దన్ను మోచి కొనుచున్ ♦ వ్యోమంబునం జేర ను
ద్యత్సంరంభము నొందు దానివడిఁ గ్రిం ♦ దం ద్రోచి కోపాన దు
ర్మాత్సర్యంబులు మానుమంచుఁ జెవులున్ ♦ రంగారు ముక్కుం జనుల్
తత్సౌందర్యము వోవఁగోసి విడిచెన్ ♦ దైత్యాంగనం దిట్టుచున్ ౩౦౨

తే॥ అప్పుడా దైత్య వాయెత్తి - యఱచు నఱపు, దిశలనిండి దివ్యుల చెవిఁ - దివిరిసొచ్చెఁ
గాఱునెత్తుట భువి నాని - కరఁగఁజొచ్చె, ననఁగ దాని పడిన పాటు - నరయవశమె? 303

తే॥ చంపఁ బుయిలోడి రక్కసి - చనులు ముక్కు, నాన గోసిన కార్యమె - న్నఁగ దశాస్యు
రత్నముకుటమ స్తకభూధ - రములఁ ద్రెంప, వరముహూ ర్తంబుగుఱుతించు - కరణినొప్పె.

తే॥ పృథివి యదరఁగఁబడి కాళ్లు - విదిరిచికొని, యఱచురక్కసి ఖరవధ - కొఱకు లేచి
రక్తవర్షము గురియు నీ - రదము వోలెఁ, బెరిఁగి గోసంబు నవమతి - పెనఁగొనంగ, ౩౦౪

ఉ॥ ఎన్నఁడు జంకు గొంకు వెత - లించుక యొందని పూర్వదేవ సం
పన్నఁ కులంబునం బొడము - పైదలి మింటికి లేచు ధారణిం
దన్నఁదపించుఁ జూకురు స-ద్ధైర్యమునందుఁ జలించు వందఁగే
ల న్నలఁచుక్ విదుర్చు వెత- లం బడు నుత్తలమందు సిగ్గిలున్. ౩౦౬

ఉ॥ ముక్కును చేతనద్ది తడు♦ముం గొలిమిం గల వంట కై వడిన్
మిక్కిలి యూర్చుఁ గేలఁ బుడ♦మిం గడు మోఁదుఁ గుచంబు లంటుచున్
దిక్కట మక్కటంపడుచు ♦ దిక్కులు సూచుఁ జెమర్చు వెక్కు వే
చొక్కును పండ్లు గీటు నఱ ♦ చున్ బఱచున్ వెఱచున్ దలారుచున్

చ॥ జొట జొటఁ గొండ యూటవలె ♦ జొబ్బిలు రక్తము చేతనైన యు
త్కటతర పంకమందు తడ ♦ కట్టుగఁ జుట్టుచుఁ జుప్పనాతి సం
కటపడి వేల్పులున్ జముఁడుఁ ♦ గాతర సెందఁగఁ దగ్గ రాక్షసో
ద్భటులను పేరుకొంచుఁ బలు ♦ వార్తలఁ బల్కుచుఁ బిల్వ మేకొనెన్.

చ॥ అనలము చేతఁబట్టు నిట ♦ లాక్షుని శైలము నెత్తిపట్టి యో
దనుజవరేణ్య! నీవు ప్రమ ♦ దంబున మేదిని నుండ మానులున్
ధనువులఁ దాల్చి క్రుమ్మరుట ♦ తక్కువకాదె? విరోధి వర్గముల్
మునుకొని నవ్వ నీకు మొగ ♦ ముం గనిపించుట యెట్లు? కానవో? ౩౦౯

చ॥ విలయము వేళనైనఁ దగ ♦ వేసట నొందని బ్రహ్మవిష్ణు శం
భులకును నిర్జరాళికిని ♦భోగుల దైత్యుల కంటె మేటి దో
ర్బల! పులి యుండఁగా నిసుఁగుఁ ♦ బట్టఁగ నౌనె? యటంచు లోకులన్
పలుకులు నేఁడు నాయెడ న ♦ బద్ధము యయ్యె నిఁకేమి చెప్పుదున్? ౩౧౦

మ॥ అమరానీకము చుట్టిరా ముదముతో ♦ నైరావతం బెక్కి యు
ద్ధము గావించిన యింద్రు నోర్చిన బలో ♦ ద్యద్డంబరున్ శంబరున్
సమయం జేసిన యాజి నాజిఁ బఱవం - జాఁగించు నో రావణా!
యమరెన్ నీకపకీర్తి దొడ్డదిగ ర - మ్మా కాంతు గా కిచ్చుటన్. ౩౧౧

మ॥ భవుచే ఖడ్గము గాంచు వీర! వరుణున్ - వైవస్వతున్ బావకున్
దివిజౌఘంబు నవగ్రహంబుల జగ - ద్విఖ్యాతిగా సేవకుం
దవులం జేసిన విక్రమం బిపుడు చెం - దం గల్గెఁ బెన్నింద మా
నవులన్ వీరి నెదుర్పఁ జాలమిని న - న్న్యాయసుల్ పిసాళింపఁగన్ ౩౧౨

మ॥ మద దిగ్వారణ దంతరాజి విఱుగన్ - మాఱాటముం జేసి దు
ర్మదులన్ కొండలు పిండిసేయు బలవీ - రా! రూప సౌందర్య సం

పదలక మన్మథు మీఱు వారయిన సం - యదమ్యాభిమి నీ కాలి చె
ప్పొదవం బోలని యీ నరాధములపైఁ - బూనింపవో కోపముల్. ౩౧౩

తే॥ సురల దెసలకుఁ దోలిన-యరిది బలము, వఱలు రావణునకును సో - దరుల కిపుడు
చేగ సమసెనా? దనుజుల . కోగిరంబ, మైన యిమ్మానవుల కడ - నడఁగెనేమి?

మ॥ భవుఁడో ధాతయొ వెన్నుఁడో యని తలం ♦ పం దగ్గ తేజమ్ము సం
స్తవ రీతిం బొలుపారుచుండు ఖర! కాం - తారమ్ములం దాఁగుచుల్
యవలక మెక్కుడు వగ్గు తాపసుల వీ - ర్యంబో ? మనుష్యాద దా
నవ హంవీరుల యోటయో? యెఱుఁగవే - నన్నిట్లు వీరేఁచుటల్?

మ॥ దివిషన్నాథుఁడు బ్రహ్మయుల్ విబుధు ల - ర్థిం గొల్వ నింద్రాణి గా
రవ చిహ్నంబులఁ బాడ సప్త జగముల్ - ప్రాగల్భ్య మగ్గింపఁ బ్రా
భవ మొప్పన్ ధవళాతపత్త్రము పయిన్ - భాసిల్లఁ గొల్వున్న నీ
కవురా చూపఁగఁ గూడునేమి? వికృతా - స్యంబుల్ జను ల్నవ్వఁగన్

చ॥ ఇది ఖరుఁడున్న కాన మఱి - యిచ్చట నిట్టి పరాభవంబు నా
కొదవఁగ మీకుఁగాదొ? బల - మొగ్గఁగ నన్ను ధరాస్థలిం బడన్
జదుపుచు ముక్కు గోసిన భు - జంబుల నిక్కునఁ జూచికొంచు దు
ర్మదుఁడయి మానవాధముఁడు - రాజిల మీ భుజశక్తి గాల్పనే? ౩౧౭

ఉ॥ దిగ్గజ వేగముల్ తఱుఁగ - దీకొని పోరి తదీయ దంతముల్
నుగ్గుగఁ జేసి సద్యశము - నూల్కొన నుబ్బిన బాహుసత్త్వ! నే
డ్రొగ్గిన యొక్క యాసగొని - ముక్కును నీగతి రట్టు నొందితిన్
సిగ్గఁడి నైతి దీననగు - చిన్నతనంబును నీది కాదొకో? ౩౧౫

చ॥ త్రిదశుల గెల్చి దేవవిభు ♦ శృంఖలలన్ దగిలించి నొంచి యొ
ప్పిదమగు సేవలం గొనిన ♦ విశ్రుత మల్లుఁడ! యల్లుఁడా! వనిన్
మదమున నిక్కి గ్రుమ్మఱుచు ♦ మానవు లిద్దఱు నన్ను త్రోచి సి
గ్గొదవఁగఁ జేయ నేఁ గుమిలి ♦ యూరక చచ్చుట నీకుఁ దృప్తియే! ౩౧౬

తే॥ అఖిల భువనముల్ గడగడ♦లాడ నన్ని,దిశల నోర్చి యింద్రుని గెల్చి♦తివురు మేఘ
నాద! యీమానవుల చేవ♦నఱుము రమ్ము, వీరిఁ గూల్పక నీకీర్తి ♦వ్యర్థమె చుమ్ము.

ఉ॥ కొండలు పిండిసేయు రణ ♦ కోవిదులార! ఖరా! త్రిశీర్ష! దో
ర్దండ పరాక్రమాఢ్యులయి ♦ రాజిలు సేనలఁ గూడి కుంభక
ర్ణుండును బోలె నిద్రగొని ♦ బ్రుంగుచు నుంటిరొ? నేను బోలుటల్
కొండొకయంతఁగాని మీ చెవులు ♦ సోక వినరాదొకో! యింతే చాలమే? ౩౨౧

తే॥ ఇట్లు పలువిధంబులఁ బల్కి ♦ యీసుగొన్న, చుప్పనాతి భూమింబడి ♦ గ్రుక్కుచుండ
నరవరేణ్యుండు గౌతమీ ♦ నదిని నియత, కృత్యములఁ దీర్చికొని యట ♦ కేగుదెంచె

చుప్పనాతి మరల రాముని బతిమాలుట

ఉ॥ వచ్చిన రాముఁ గాంచి దశ ♦ వక్త్రుని చెల్లెలు కడ్పునల్పుచున్
బెచ్చుగ బాష్పధారలను ♦ భీకర శోణిత ధారతో భువిన్
రొచ్చుగఁ జేయుచున్ నృప శి ♦ రోగ్రణి నీసొగసైన రూపమున్
మచ్చిగఁ గోరి యీగతిని ♦ గ్రుందితిఁ జూడుమ యంచుఁ జూపఁగన్.

ఉ॥ వ్రీలఁగ వ్రేలు వెంద్రుకల ♦ వెక్కురు రక్కసి క్రూరచేష్ట యే
దో లలిఁ జేసి యుండు నని ♦ యున్ దన తమ్ముఁడె చేసియుండు నం
చో లిఁ దలంచి నీవెవతె ♦ వాయ్యన నిర్యోడ కేల వచ్చి తీ
లీల నొనర్చి రెవ్వరు చె ♦ లీ! వివరింపుమ యంచు వేఁడనన్. ౩౨౪

ఉ॥ రక్కసి పల్కు నన్నెఱుఁగ ♦ రా! పగవారను పేరె యెక్కుడున్
నెక్కొనసేకొనర్చు రజ ♦ నీచరనాథుని చెల్లెలన్న, నీ
యిక్కల రక్కసు ల్వదల ♦ నిచ్చట మేము తపించుచున్న యీ
చక్కటి కేల వచ్చితివి? ♦ సంఘటనం బిది యేలొకో యనన్. ౩౨౫

చ॥ కుమిలెదు వేఁడి కామ రు జ ♦ కుం దగు మందగు రామ! నిన్ననే
సుమశరు బారి గ్రుగ్గి వడ ♦ గ్రుక్కుచు వచ్చుట విస్మరించితే
కమలదళాక్ష! యన్న రఘు ♦ కాంతుఁడు జేగుఱు రేఖలొప్ప మీా
నముల క్రియం జలించు నయ ♦ నంబులతో నరుదెంచు టేలొకో? ౩౨౬

తే॥ అనుడుఁ జెవ్వులు ముక్కును పోవ ♦ నంగు చెడ దేని యనుచు రక్కసి పల్కు, నోయఘ! యాత్ర
పడి యిటేల చేసితి వని ♦ పలుకు నన్నఁ, గాంచి కేల్మోడ్చి నుడివె ల ♦ క్ష్మణుఁడు మెల్ల

చ॥ పలుచవు లూరఁగా నమలి ♦ పారణ సేయుటకో? మఱేమొ? కా
వలి గల రక్కసుల్ కలిపి ♦ పంపిరొ? కానఁగరాదు గాని ని
ప్పులు గురియంగ మావదినెఁ ♦ బొంచుచుఁ బట్టఁగఁ బోయె నన్న ప
ల్కులు విని యంతకున్ మరులు ♦ గ్రుంగక రక్కసి పల్కు నీగతిన్. ౩౨౭

తే॥ ఆఁడునత్త మండూకము ♦ నంద నుండఁ, గాంచి చూలైన మండూకి ♦ కలఁతపడుచు
పుష్కరిణి గల కోసల ♦ భూప! సవతిఁ, గన్నపుడు మదిలో నల్క ♦ గలుగకున్నె?

చ॥ పొలఁతికి రాముఁడిట్లను న ♦ పుంసకు లట్లు మఱుంగు నుండి పో
రులు పొనరించు రాక్షసుల ♦ రూపడఁగింపఁ బ్రతిజ్ఞపూని యి

వ్వాలనికి వచ్చినార మిటు ♦ వ్యర్థవచస్సులు పల్కి యూరకే
పోలియక వేగ పొమ్మనుడు ♦ పోవక మూర్ఖతఁ బల్కితిరేని శిక్ష౯. ౩౩౦

చ॥ ముదిమియుఁ జావులేని యజ ♦ ముఖ్యసురాళి దశాస్యుఁ గాంచఁగాఁ
గొదుకుచుఁ గాన్కలిచ్చి పడి ♦ కొల్తురు వాని యనుగ్రహంబుకై
మదిగొన కిట్లు మీరు మతి ♦ మాలి యొనర్చితి రిట్టి చేతల౯
బ్రదుకఁ దలంతురేని యొక ♦ పల్కు వినుండది మీకు లగ్గగున్. 33౧

చ॥ చెలియలి ముక్కుకోసెనని ♦ చెప్పెడి వారల నాల్కఁ గోయు దో
ర్బలునకు మేరలేని తల ♦ వంపుగ నాదగు ముక్కుఁగోసి నా
చెలువము గడ్డఁ జిందఁగను ♦ చేసి భవత్కుల రూపసాహసల్
పొలియఁగఁ గోసికొంటి రికఁ ♦ బోవునె యెట్టులుఁ బట్టి బాధఁగఁగ౯. 33౨

ఉ॥ నాకముఁ గాచువారలును ♦ నాగముఁ గాచెడు వారు భూమిన
స్తోకమతి౯ భరించు బల ♦ శూరులునేని త్వదీయ శీర్షముల్
కాకులు గ్రుచ్చుచుండ నిటఁ ♦ గాచు సమర్థులు కారు మీరు వ
న్నీకొని కాతురేని మిము ♦ నేనును కాచెదఁ బ్రాణమిచ్చియే౯. 333

మ॥ తమ మానంబును తామె గాచికొను కాం♦తల్ పల్కఁగా నేర్తురే
తమయుత్కర్షము? నైన నేనె దెలుప౯ ♦ దక్కొంటి మీమీఁది ప్రే
మముచే నిర్వ్యాది నిర్జరీగళ చల ♦ న్మాంగల్యవిచ్ఛేది దై
త్యమహీశాసుని చెల్లెలంచుఁ దెలుపం ♦ దార్కొమ్ము సీతమ్ముతో. 33౪

సీ॥ పెనుపోరులందు కా ♦ తును మోచికొని మింటఁ, జనుదు నెచ్చటికేని ♦ క్షణములోన
మాంసమ్మువంటి క♦మ్మని ఫలములఁ దెచ్చి, యిత్తును కోరిన ♦ దీయఁగలను
రక్షించువారిఁ ది♦రస్కరించుట మేలె? కోమలి సీతచేఁ ♦ గూడునేమి?
వలఁతుల రైనచోఁ ♦ బలుకుఁడీ జగమున, స్వర్గంబునందున్న ♦ సతులలోన

తే॥ జాతియందుఁ గోరిన దిచ్చు ♦ నీతియందు, నేర్పునందును గుణముల ♦ పేర్పునందుఁ
బలుకులందు సుఖమునందుఁ♦గులుకులందు, యౌవనమునందు నాసాటి♦యరయఁగలరె?

ఉ॥ ముక్కును కోసినైన చితిరి ♦ మూర్ఖత నైనను లోపమేమి? న౯
మక్కువఁ గొందురేని క్షణ ♦ మాత్రములో మఱుముక్కు గొందు మే
ల్చక్కఁదనంబునొందుదును ♦ సత్కృప గల్గినఁ జాలుఁ దక్కువే
ముక్కిఁడి స్త్రీత్వసంపదకు? ♦ మూరెడు ముక్కు వికారమేకదా? 33౬

చ॥ మనసు కవింపకున్నఁ గద ♦ మానినిఁ గోరఁగ రాదటంద్రు మీ
మనమున నేను కోరఁబడ ♦ మానము ప్రాణము మీఁది కాదె? కా౦.

చిన జనులెల్లఁ గోరఁదగు ♦ చెల్వపుఁ గాడ విషంబగాఁగదా?
కొనియెద నీవు సమ్మతిలు ♦ కోమలికం బవలం గ్రహింపవో? ౩౩౯

చ॥ మృడుఁడును పద్మగర్భుఁడు ర ♦ మేశుఁడు వజ్రియు ధాత్రిఁ గొక్కలై
పొడమిన యట్టులున్న రూపు ♦ పుణ్ మెఱుపుల్ గల వన్నెకాఁడ! దీ
టడరని పుష్పబాణముల ♦ నంకము జంపెడు మన్మథుండు త.
మ్ముఁడె యగునేమి? లక్ష్మణుని ♦ పోలిక నిర్దయుఁ డయ్యె నాయెడన్. ౩౩౮

సీ॥ ఈరూపమున నిది ♦ యిచ్చటనేయుండు, నెచటికి నేగలఁ బో ♦ దెనరుఁ గొంరు
అనియెంచియే యిట్టు ♦ లానరించి నారలు, కానిచో కి వేఱు ♦ కతము కలదె?
యీరు తప్పొనరింప ♦ రేనది యెఱుఁగియే, రెట్టింపు ప్రీతిఁ జే ♦ రితిని తెలివి
లేనిదానన? యుగ్రు ♦ లా రాము లెఱింగి, కోపించ జగమెల్లఁ ♦ గూలిపోవుఁ

తే॥ దగు కులీనులు ధర్మంబుఁ ♦ దలఁచువారు, లోకనాశకార్యములకు ♦ లోనుగారు
అరసి నన్నేలి మీకగు ♦ నగడు ద్రోచి, కూడి సుఖయింపుఁడని వేఁడి ♦ కొనుచునిలిచె.

ఉ॥ ప్రల్లద మిట్లు పల్కెడు ♦ రక్కసిఁ గన్గొని రాఘవుండు నీ
తల్లికిఁ దల్లివంటిదగు ♦ తాటకఁ గూల్చిన బాణముల్ దే
నుల్లమునం దపంబె కడు ♦ నూఁకువఁగాఁ గొని రాక్షసావళిన్
ద్రెళ్ళఁగఁ జేయవచ్చితిని ♦ దెప్పరమౌ జము చేష్టచేసినన్. ౩౪౦

చ॥ అసదృశుఁడైన కోసల ధ ♦ రాధిపు పుత్త్రులమేము తల్లియా
జ్ఞ సకల సంపద ల్విడిచి ♦ చయ్యనఁ గానకు వచ్చి చేరి తా
పసు లిట నర్థిమెఁగొనర ♦ వాసము చేయుచునుండి క్రూర రా
క్షస కులమెల్లఁ జక్కడఁచు ♦ క్రమ్మఱు నా రము మా పురానకున్. ౩౪౧

చ॥ చెఱవడినారు దేవతలు ♦ చిక్కి సురారుల కోడి పిరలి
ద్దఱు నరులంచు లెక్కిడక ♦ దంటవయేని క్రుధానమేతులుం
గఱకరులున్ బలాఢ్యులగు ♦ కర్బుర సంఘము యక్షకోటి స
క్కఱగొని తోడితెమ్ము వెసఁ ♦ గ్రచ్చఱఁ జంపెద నీము ముందఱన్. ౩౪౨

సీ॥ అని రాఘవుఁడు పల్క ♦ నానురి యనుఁ బైపె, దవి ప్రీలిపండ్లెల్ల ♦ దంతురముగఁ
గనఁబడు వాగల ♦ కామిని యని తలం, పక నన్ను నెమ్మిచి ♦ వలఁతువేని
సోఁకులఁ జంప వ ♦ చ్చును వారి మాయల, నెఱుఁగంగ వచ్చు జ ♦ యింపవచ్చు
నన్నియు సాధ్యంబు ♦ లా సీత వదలవ, యేని నేనుంటయు ♦ నెక్కువగునె?

మాయులగు రక్కసులు మీకు ♦ మఱుఁగు నుండి, పఱపుమాయలఁ దోలఁగింతుఁ ♦ బాము
ప్రాణ్మై యెఱుఁగు నక సామెత ♦ ప్రభుఁడ వినవొ, నన్ను చేకొను నీకిది నయముసుమ్ము [కాల్లు

ఉ॥ నెమ్మది నాపయిం జొరఁగ ♦ సీయక జానకి యున్న దక్కుచో
నుమ్మరమైన యుద్ధమున ♦ ముష్కరముం దలపడ్డ దైత్యశే
ర్షమ్ములఁ ద్రుంపవచ్చు నిది ♦ చక్కటియంచు నెఱుంగలేని మీ
తమ్ములకిం దగం జలికి ♦ తార్పుము రావణు లెక్కకుం గొనన్. ౩౮౪

ఉ॥ మీరలు కోసలంబునకు ♦ మేలుగ నేగెడువేళ నేను మీ
కోరిన రూపునై కొనెదఁ ♦ గోపి సుమిత్ర సుతుండు పక్కిఁడిన్
జేరఁగఁ దీయఁ జాలనని ♦ చెప్పిన మధ్యము లేని సీతతో
నారకయుండఁగాదె? యని ♦ పల్కుచు నీ వసుచుండు నంతలో. ౩౮౫

ఉ॥ రక్కసిఁ జంపఁగా నొకశ ♦ రంబును లక్ష్మణుఁ డోరకంటితోఁ
ద్రిక్కనఁ గాంచి యార్య! యడఁ ♦ గించెద దీనిని చంపకున్నచో
నెక్కలి పీడసేయునన ♦ మేచకదేహుఁడు పోవకుండుచోఁ
ద్రొక్కన వచ్చు నన్నుఁ గను ♦ ద్రిప్పుచు దానిఁ లేచి యుగ్రయై.

ఉ చక్కని ముక్కు వీనులును ♦ చన్నులు వోయియు మిమ్ము గూడి నే
నిక్కడ నుండ నొక్క క్షణ ♦ మేని సహింతునె? మీగుణంబు ల
మ్మక్క! గ్రహింపఁగోరి యిటు ♦ లాడితి వాయువు నగ్ని మీఱు నా
మొక్కలి మీ యమున్ ఖరుని ♦ పోఁడిమిఁ దెచ్చెద నంచు వే చనెన్. ౩౮౬

## ౬. ఖరవధ పటలము (౧౯-౨)

ఉ॥ పూని చలంబు శూర్పణఖ ♦ భూరి జవంబునఁ బాఱి యా జన
స్థానమునన్ వసించు ఖర ♦ దానవు పాదములందు వ్రాలె జా
లూనిన నెత్తుతో ముఱికి ♦ యూడ్చెడు కాలువఁ బోలు ముక్కుతో
వేసవి పీడ సంజ జిగి ♦ పేర్చిన విప్పగు మబ్బుకైవడిన్. ౩౮౭

తే॥ విలయ మిదియని జముని సం ♦ ప్రేరణమున, మ్రోఁగు భేరినాఁ రోదన ♦ ముంబొనర్చి
పిడుగుచేఁ గాలి సంకట ♦ పడెడు త్రాఁచు, పోల్కి నేలపైఁ బడి వడిఁ ♦ బొరలి యేడ్చె.

తే॥ మాటతోఁ గూడఁ బాగలేవ ♦ మండి ఖరుఁడు, నిన్ను చూచి భీతిల్లక ♦ నిబ్బరమున
నిట్లు చేసినదెవఁడో వాఁ ♦ డెఱుఁగఁ బలుకు, యమునితలఁ దన్ని శివునెత్తి ♦ నుమియువాఁడు

చ॥ అనవుడు దైత్య యిట్టులను ♦ నన్న! మనుష్యులు మౌనివేషులై
ధనువులఁ దాల్చి క్రాలుదురు ♦ దర్పక సుందరు లాజి పుత్త్రికుల్
ఘనభుజు లున్నతాంగులును ♦ కయ్యము సేయఁగ దానవావళిన్
వనముల రోయుచున్ దిరుగు ♦ వారలు సింహపరాక్రముల్ బలుల్.

ఉ॥ ధర్మమునం జరింతురఁట! ♦ దానిని నొక్కనఁ గూర్తురంట! వే
దుర్మదులైన రక్కసుల ♦ దోర్బలయుక్తిని ద్రుంతురంట! మీ

వర్మకృపాణ బాణ ఘన ♦ బాహు బలోద్ధతిఁ గీటు పుచ్చు స
త్కర్మఠులంట! వారి బల ♦ గర్వములన్ వివరింప శక్యమే? ౩౫౨

చ॥ ఇరువురతోడ నొక్క చెలి ♦ యిందును వేల్పుల నెందు నేరికిన్
దొరకని నూత్న సుందరత ♦ తో విలసిల్లు మదీయ చక్షువుల్
పొరసి తరింప లేక యటుఁ ♦ బొర్లుచు నుండె వచింప శక్యమే
తరుణి విలాస సంపదలు ♦ ధాతకు నాతని తాతకేనియున్? ౩౫౩

తే॥ ఇంతిఁగాంచి లంకాపతి ♦ కిత్తుదీని, నని చలించిన బుద్ధితో ♦ నచటి కేగఁ
గోపమున వారు నాముక్కు♦గోసినారు, చూడుమా యన ఖరుఁడుచి♦చ్చువలెమండి

చ॥ ఎదురుగఁ జూచు వారల ద ♦ హించెడు తీరున గ్రుడ్ల నార్చుచుం
బదరుచు ముంజెలూడ్చు పిడ ♦ పంగల తాళఫలంబు తోడ్త ల
ట్లదరక ముక్కు గోసిన దు ♦ రాత్ములఁ జూపుము చీల్చుఁగూల్చుఁ జం
పుదు నణుమాడుదుం బొడుతుఁ ♦ బుల్లని పచ్చడిచేసి మ్రింగుదున్. ౩౫౪

చ॥ నిలిచి సమస్త లోకముల ♦ నీరుగఁ జేయఁగఁ జాలు కంటి ని
ప్పులు చెదరంగ మండిపడి ♦ ముద్దుల సోదరిఁ గాంచి యా దురా
త్ములు మనుజాధముల్ మతి వి ♦ దూరులు నావలన న్నశించిరన్
జెలియరొ! యీకలంకము న ♦ శించునె మేదిని యున్న యంతకున్?. ౩౫౫

ఖర సేనాపతులు పదునల్వురు రాముచే మడియుట

సీ॥ రథముఁ దెమ్మనిన మా ♦ త్రన మహాస్త్రముల తోడి, నీలాద్రులం బోలి ♦ నిలుచువారు
పృథివి నొక్కొక్క చేతఁ ♦ బెకలింపఁగలవారు, మమ్మంపుఁడని చుట్టుఁ ♦ గ్రమ్మువారు
పరశు పట్టిస శూల ♦ పాశ గదా తోమ, రాది సాధనముల ♦ నలరువారు
చతురబ్ధి వేష్టిత ♦ జగతీతలంబెల్ల, వడఁకించు హుంకృతి ♦ వఱలువారు

తే॥ హాలహలమె రూపొందిన ♦ యట్టివారు, చెలఁగి సేవ ధన్యముగ నీ ♦ క్షింపు మధిప!
యనుచుఁ బదునాల్గు వెల్వాల ♦ కధిపులైన, వారు ఖరు నధిక్షేపించి♦పలుకుటయును.

ఉ॥ లెస్స వచించినారు కడు ♦ లేబర మాఁగద స్వచ్ఛకీర్తి యా
తుస్సులతోడ నే రణము ♦ తూకొనుచో విబుధుల్ హసింత్రు రం
హస్సున మీఱలేగి మను ♦ జాధములన్ వధియించి వారి యం
హస్సమయంబు లాఁచెచి త ♦ దంగనతోఁ జనుదెందు పొండనన్. ౩౫౬

తే॥ ఖరుని యాజ్ఞ సేనాపతుల్ ♦ కడఁక ద్రొక్కి, సిగ్గిడియుబలముదూతనాఁ ♦ జెలఁగుచుప్ప
నాతి ముందేగ శుభశకునాచ ♦ నముగ వార, లినకులేశ్వరు లున్న తా ♦ వునకుఁ జనిరి,

తే॥ విమల శశ్వత్సహస్ర నా ♦ మములు గలిగి, క్షీరసాగర శాయియై ♦ శ్రీముకుంద
పాదపద్మముల్ స్మరియించు ♦ పద్మనేత్రుఁ, జూపెఁ జేసన్న వారికిఁ♦జుప్పనాక.
తే॥ వీనిఁబట్టి నింగికెగుర ♦ వేయవలయుఁ, జేతనందు కోవలయును ♦ చీల్పవలయుఁ
గట్టవలెఁ గొందవలెఁ గడి ♦ కండలుగను, రండు రండని రక్కసుల్ ♦ రాముఁగదియ.
తే॥ లక్ష్మణుని గాంచి యార్యేఁడీ♦లలనఁ గాచి,యుండుమనికల్పకము ప్రాచి♦యున్నపగిది
నొప్పుకరమున గొనయమె♦క్కించినట్టి,కార్ముకంబందికొనె నిషం♦గములతోడ. ౩౧౨
తే॥ తోయజాక్షుఁడా వింటినం ♦ దుకొని తూణ, ములను తాల్చి పర్ణకుటి య♦వ్వలకునేగి
యిచ్చటికి రండనును వారి♦నెల్లఁ బిలిచి, తొడఁగె యాతుధానులతోడ♦దురముసేయ
తే॥ ప్రళయ కాలాగ్నిఁ బోలిన ♦ వారిపాశ, బాణ శూలాదికములఁ గం ♦ బములవంటి
యిరువదెనిమిది భుజముల ♦ నటికి వైవ, ప్రమోదులం బోలువారలు♦మోహరించి.
తే॥ వారిశస్త్రాస్త్రములతోడ♦బాహువులును, తునుఁగనురములబలిమిచే♦దురముసేయు
రక్కసులతలల్ సునిశితా♦స్త్రములఁద్రుంచి,పాఱఁజూడ ముక్కిఁడియును♦పాఱిపోయె
తే॥ కనలు సింహంబుచేఁ గరి ♦ ఘటలుగూల, హస్తమును నెత్తిపై కెత్తి ♦ యడలిపఱచు
కరిణిఁ బోలి శూర్పణఖ యా ♦ ఖరునికడకుఁ,బోయి జరిగిన వృత్తాంత♦మునువచించె.
క॥ వృషవాహునకు నరుదగు, విషమనఁదగు ఖరుఁడు దనుజ ♦ వితతి మడిసెనే?
విషధరుఁడు గరుడు ద్రిమింగెనే?, విషమించెనె? యనుచుఁ గనుల ♦విషముంగ్రక్కెన్.
తే॥ సింగములును ఖీతిల్ల గ ♦ ర్జించి ఖరుఁడు, రథముఁ దెండుసైన్యంబుల ♦ రండనుండు
త్వరగ వాయింపరేమి ప్ర ♦ స్థానభేరి, లెండులెండని వడిఁ గద ♦ లించె సేన. ౩౧౮
తే॥ స్వర్గపాతాళములు వడ ♦ వడ వడంక, భేరిమ్రోఁగ లెక్కిఁడరాని ♦ వారిదములు
కెరలు కరణి యుయుత్సుజి ♦ గీషువులగు, రథికులెల్లరు గుంపులై ♦ ప్రబ్బినారు. ౩౧౯
తే॥ గురుతరాభీల భాంకృతుల్♦ఘోషములుగ, వీఁగు భుజములె యలలుగా♦విలయవేళ
పెద్దకడలి ప్రభంజన ♦ ప్రేరణమున, రేఁగినట్లు విజృంభించెఁ ♦ బృథులసేన. ౩౨౦

ఉ॥ ఆఁకలి యింకదీఱునని ♦ హర్షముతోఁ దిరుగాడు శాకినీ
డాకినులట్లు దట్టమయి ♦ డంబుగ మిన్ను మఱుంగుచేసి య
స్తోకగతిన్ వెలుంగు కడుఁ ♦ దోరపుఁ డెక్కెము లోలిఁ బర్వఁగా
నాకులు భీతినొందఁ గద ♦ నంబునకుం జనె సైన్యసంఘముల్. ౩౨౧

తే॥బంధములఁద్రెంచికొనిస్వేచ్ఛ♦బరుగువాఱు, రెండుతొండముల్ గలుగువే♦దండములనఁ
గ్రాలు దానవకరముల ♦ ఖడ్గనికర, ఘర్షణమున నగ్నులు పుట్టి ♦ కాన యెరియ. ౩౨౨
క॥ పంబల రొదతో నేమీ, శంబరవము గలియ నిరుల ♦ సంఘాతంబుల్
పంబి కమలాప్తుతో సమ, రం బొనరుప వచ్చునటుఁగఁ ♦ గ్రాలెన్ సేనల్. ౩౨౩

క॥ అహిరాజు మేను గదలినడ, మహి నిలుకడ దప్పి క్రుంగ ♦ మాతాోడ్డి మహా
మహి ధరము ప్రక్క వరుస ని, వహముగ రఘురామునిపైకి ♦ వచ్చినవనఁగన్. ౩౭౪

తే॥ పులుల గుంపులో? వారిద ♦ పుంజమొక్కొ?, వారణాళియో? పర్వత ♦ పంక్తియేమొ?
కాదు కాదు వారక్కతి ని ♦ కాయమునఁగ, సాయుధీచయ ఖచరుల సైన్య ♦ చయములరిగె.

సీ॥ అరికట్టరానట్టి ♦ యమునిపోలిన యనే, క సహస్ర నిశితులో ♦ కాల్బలములు
శరనిధియో యనఁ ♦ బొరలి వచ్చునప్పుడు, శరభ సింహ గజ భీ ♦ కర లులాయ
శార్దూల జంబుక ♦ శ్వాన భూత పిశాచ, గంధర్వ కిటి వృష ♦ గార్దభములు
కట్టంగఁ బడినని ♦ కంటికందిన యంత, దప్పగాంచెడు గృధ్ర ♦ తండయుతము

తే॥ లగుచు జయశంఖ నినదంబు ♦ లడరుచుండు, రథచయంబులు సూక్ష్మనే ♦ త్రములురక్త
వదనములు గల వారణ ♦ వ్రజము వాయు, గమనమొప్పుతురంగముల్ ♦ గములుగట్టె.

సీ॥ పరశువుల్ శక్తులు ♦ వజ్రఖడ్గంబులు, ముసల తోమర శూల ♦ ముద్గరములు
దండముల్ వంకెర ♦ దండముల్ పాశముల్, వక్రకుఠారంబులు ♦ వజ్రములును
చక్రముల్ కుంతముల్ ♦ శంఖముల్ బాణ బా, ణాసనాంకుశ గదా ♦ ద్యాయుధములు
భానుఁడగ్నియు సిగ్గు ♦ పడనొప్పు కాంతులు, రక్తమాంసములతోఁ ♦ గ్రాలునవియు

తే॥ వేలుపుల కెల్లబాధ గ ♦ ల్పించినవియు, విజయ చిహ్నంబులంగూడి ♦ వెలయునవియు
నైన హేతి సందోహంబు ♦ లన్నియెడలఁ, గిలుకఁ బళబళమనుచుఁ గ్రి ♦ క్కిరిసి మెఱసె.

సీ॥ బయలు దేఱినసైన్య ♦ పతులనొక్కొక్కరు, వేయి గౌరుల చేవ ♦ వెలయువారు
భూమండలము నొక ♦ ముద్దగాఁ గొనువారు, క్రూరాగ్ని వంటి క ♦ న్గ్రొల్లవారు
పదునలువ్వురు వారి ♦ బలమొక్క రొకరికి, నలువది లక్షలు ♦ పఱఁగుచుండు
పలువురు చతురంగ ♦ బలమెనిమిది కోట్లు, నలువది లక్షలు ♦ గలుగుననియు

తే॥ ఒక్కొకని దళమొక కోటి ♦ లెక్కయనియు, పదునలువ్వురు నాయకులకుఁ ♦ బదియునాల్గు
కోట్లసైన్యంబులనియుఁ బె ♦ క్కురువచింతు, రమితమై లెక్కయిడరాని ♦ దదినిజంబు.

సీ॥ బలయుతుల్ పిడుగుల ♦ వలె బొబ్బలిడువారు, విసరు కైదువు కేల ♦ వెలయువారు
బ్రహ్మచే వరములఁ ♦ బడసిన వారలు, మొగుళులు గిరులనఁ ♦ దగినవారు
దురహంకృతులు తమ ♦ దోర్బలశక్తికిఁ, దగువారు లేరని ♦ నెగయువారు
ఆకాశమును గొల్వ ♦ నగు నొడల్గలవారు, కఠిన విశాల వ ♦ క్షములవారు

తే॥ ధరణిఁ గొల్వంగఁ దగిన పా ♦ దముల వారు, విబుధులుమతింపు సేయఁ గా ♦ వించు సమర
మిదియటంచు వీరావేశ ♦ మెనయు వారు, మొగి నహంపూర్వికగ నని ♦ మొనయువారు

సీ॥ అమరులు వైచిన ♦ యాయుధముల నుగ్గు, గావించు దృఢ దోర్ధ్య ♦ గముల వారు
యముఁడును సేవించి ♦ యడఁగి యుండఁగఁ జేయు, చండశాసనములఁ ♦ బఱపువారు

ల్లిదమై ధూళి వియత్తలంబు పరవన్ ♦ లీలన్ జగద్బంధు ప
చ్ఛాదనంబందిన గుఱ్ఱముల్ రథము న ♦ చ్చంబయ్యె వీక్షింపఁగన్. 3౮౭

ఉ॥ సాగర ముల్బణంబయిన ♦ చందమునన్ మితిమీఱి కాల్బలం
బాగతి సాగఁ బాఱఁగ వ ♦ నాంతరమెల్లను దుక్కియయ్యె శై
లాగములందు మింటఁగల ♦ నబ్బములన్నియు నెండెఁ; బూఁడెఁబో
సాగరమన్న రాత్రిచర ♦ సైన్యరజంబు వచింప నెట్లగున్?. 3౮౮

ఉ॥ కొండలమీఁద వేఱు పెను ♦ కొండలు వింతగ నెక్కురీతి వే
దండ శిరంబులందు సెగ ♦ దాఁకు విసంబును బోలి హింస లు
ద్దండతఁ జేయు రక్కసులు ♦ దాఁటుచు మీటుచు హుంకరించుచున్
దండితనంబుఁ జూపుచు ము ♦ దంబున నేగిరి కొండ లుద్ధతిన్. 3౮౯

శా॥ మాయాబంధము పూరిగాఁ దొలఁచు న - న్మాన్యాళికిం ద్రోవ నే
చాయన్ శక్యముగాక తోడనె నివా - సంబంది ప్రాణంబులం
బై యామ్యేశున కందియిచ్చు రుజతో - వన్ సైనికాగ్రంబునం
దాయుర్వర్ధన సూచకంబుగఁ జనెఁ - బ్రావేశమై విగ్రయున్. 3౯౦

ఉ॥ భేరి రవంబుచే గగన-వీథిఁ బయోదము లోట నొందఁగా
జ్యారతికిం గడుంజడిసి - ప్రాంతదినులుం బయిలోడి పాఱఁగాఁ
జేరులివ్రుల్ వినంబడఁగ - వెన్నుని యింకియు లజ్జనూనఁగా
వీరవరేణ్యులున్న యట - వీథులిఁ జేరె సురారిసైన్యముల్. 3౯౧

చ॥ పరవిన సేనఁగాంచి మృగ - పక్షులు చూపులు దిగ్భ్రమింపఁ, ద
త్తఱపడి నోరులెండఁగ, రు - తంబులు గీడ్పడ, మేలుసోల, దె
ప్పరిలుచు రోఁజుచుం బఱచెఁ - బార్థివ పుంగవు తోడ శత్రు భీ
కర ఖరసేనరాక వడి - గా మును దెల్పెడు వేగులో యనన్. 3౯౨

## శ్రీరాముఁడు యుద్ధసన్నద్ధుఁ డగుట.

చ॥ ఘనులగు రామలక్ష్మణులు - క్రన్నన ధూళిదివంబు గప్పుటల్
దనుజుల పాదఘట్టనఁ బో - దల్లు మహీజము లుక్కికూలు ని
స్వనములు భీతిఁబాఱు మృగ - పక్షుల గందరగోళ పాటు చూ
చిన తఱి దైత్యసైన్యములు - చెచ్చెర వచ్చెనకాఁ దలంచుచున్. 3౯3

శా॥ తూణీరంబులు పూని ఖడ్గకవచా ♦ దుల్దాల్చి హస్తంబునన్
బాణాసంబు ధరించి లక్ష్మణుఁడు కో ♦ పస్ఫాంతుఁడై రాము గీ
ర్వాణ ప్రార్థిత జన్ముఁగాంచి నను సం ♦ గ్రామార్థి నంపుండి యీరా
యేణీలోచన తోడ నిందలరి నా ♦ యేపుం బరీక్షింపుఁడీ. 3౯౪

మ॥ అనుచున్ రాముఁడు తమ్ముఁ గాంచి వినుమ ♦ న్నా! మున్ను సన్నద్ధులై
మునిసంతానము ఘోర రాక్షస బలం ♦ బు న్నేనె మాయింతుఁగా
కని పంతంబును బూనియుంటిని మదీ ♦ యంబైన పల్కుల్ వృథా
చన కుండం బరిమార్తుఁ గావు మిట భూ ♦ జాతన్ మది న్నెమ్మదిన్. ౩౯౫

మ॥ అని తమ్ముం గడు బుజ్జగించుచు నర ♦ ణ్యాంతెల్ల నాశంబుగా
నని సేయం జనుదెంచు నద్ది ఖర సై ♦ న్యంబంచు నూహించి క్ర
న్నన గోదండ తనుత్ర తూణములు పో ♦ దం దాల్చి సన్నద్ధుఁడై
యనుజుం గ్రమ్మఱఁ గాంచి యిట్లను ఘన ♦ శ్యాముండు రాముం డొగిన్.

శా॥ అన్నా! క్రమ్మఱు టక్కజంబయిన యీ ♦ యాయోధనం బందు వర్
గ్రన్నం దాఁకిన దైత్యమర్త్య సుర సం ♦ ఘంబుల్ బలంబేది యా
పన్నత్వంబునఁ గ్రుంగి క్రుంమనని చె ♦ ప్పన్ లేదు దోస్సత్త్వ సం
పన్నత్వంబున బ్రాలుమాలికఁ దొలం ♦ పం బంపుమా వేఁడెదన్. ౩౯౬

ఉ॥ నావుడు లక్ష్మణుండు రఘు ♦ నాథు పరాక్రమ సత్త్వసంపదల్
వావిరిఁ గాంచు వాఁడగుట ♦ భ్రాతృ నిదేశము మీఱకుండ సం
భావనసేయు వాఁడగుట ♦ మాఱు వచింపఁగ లేక మ్రొక్కి బా
ష్పావిల నేత్రుఁడైన జన ♦ కాత్మజ చెంగట నిల్చె భక్తిమై. ౩౯౭

శా॥ తాటంకంబులఁ దాల్చు పూర్ణశశి నొం ♦ దం బూచు ప్రాఁ గొమ్మకున్
సాటిం జెందిన సీత సోలిపడ ని ♦ ష్పాపంబు తోడన్నిరా
ఘాటం బొప్ప మహాగుహన్ వెడలు సిం ♦ గం బట్లు రాముండు దో
ష్పాటుల్ గర్జిల వీడెఁ బర్ణకుటి నిం ♦ ద్రాదుల్ ప్రహర్షింపఁగన్. ౩౯౮

చ॥ నిడుపు వెదుళ్లఁ బుట్టు చెడు ♦ నిప్పడవిం దమ వంశ సంతతిన్
బొడవడఁ జేసి తీలుపడు ♦ పోలిక నొప్పిన చుప్పనాతి త
ల్లడపడి రాముఁ గాంచి మన ♦ లం బరిమార్పఁ బ్రతిజ్ఞఁ గొన్న యా
దుడుకఁ డితండె యంచుఁ దన ♦ తోయము వారికిఁ జూపె నాతనిన్. ౪౦౦

ఉ॥ నింగిని రశ్మిఁ గ్రుంచి రవి ♦ నిల్వ విమానములన్ చరించు వే
ల్పుం గమి నోర్చి కీర్తి పొలు ♦ పుం గడియించు ఖరుండు భూమిభృ
త్పుంగవుఁ గాంచి రాక్షసుల ♦ తోడ వచించు మనుష్యు సీతనిన్
భ్రమంగఁగఁ జేసి నే విజయ ♦ మాల ధరించెదఁ జూచుచుండుఁడీ. ౪౦౧

చ॥ దుడుకఁ డొకండు వీఁడు! మన ♦ దుర్దమ సైన్యములెల్ల నిల్వ నీ
ధుడ్డవియె చాలకున్నది! న ♦ యంబున నేఁ గొనుగెల్పు గొప్పదే

యడరునె? యల్పకార్యమిది ♦ యందఱుఁ జూచుచు నుండుఁడేనె యొ
క్కఁడుపున వీనిఁబట్టికొని ♦ ప్రాణము తోడుత మ్రింగివైచెదన్. ౮౦౨

చ॥ ఖరుఁడిటు పల్కుచుండఁగ న ♦ కంపనుఁడన్ బుధతల్లజుండు సం
బరమున నడ్డువచ్చి విను ♦ మా యొకవాక్యము దైత్యనాథ! సం
గరమున మిక్కిలింగినుక ♦ గాంచుట మంచిదె కాని నేఁడు దు
స్తరతర దుర్నిమిత్తములు ♦ తార్కొనెఁ గాంచుమ యంచు నిట్లనున్. ౮౦౩.

అకంపనుఁడు ఖరునకు దుర్నిమిత్తములఁ దెలుపుట.

తే॥ తోయదములు గర్జించి నె ♦ త్తురులు గురిసె, నర్కబింబంబు పరివేష ♦ మమరెఁ జూడు
నీధ్వజముమీఁదఁ గాకముల్ ♦ నెగడిపోరి, పడుచుఁ బడవ్రచుఁ బొరలాడు ♦ పగిదిఁగనుము

తే॥ ఖడ్గధారలపై మక్షి ♦ కములు ముసరె, నెడమ కనులు బాహులు వీఁగె ♦ నెక్కటులకుఁ
నుదిరలెల్ల నిల్వనె తూఁ ♦ గుచును పడియె, నూళవెట్టెఁ గుక్కలు నక్క ♦ లొక్కటగుచు

తే॥ మదజలముగార్చెఁ గరిణులు ♦ మదకరులకు, విఱిగెఁ గొమ్ములుమహితూలఁ ♦ బిడుగులురలె
దెసలు మండె శిరంబులఁ ♦ గుసుమచయము, పొలసువాసన వీచె నీ ♦ పొలముగనుము.

తే॥ ఇట్లగుట వీని నరుఁడని ♦ యెన్నఁ దగదు, వీనిఁ జూడఁ దోఁచునవి యొ ♦ న్నెని గలవు
వన్ను మన మాయ లిచ్చటఁ ♦ బనికిరావు, మీఁదు కీనియక నన్నుశు ♦ మింపవయ్య.

చ॥ అనుడు జగంబు లొక్కపరి ♦ యల్లల నాడఁగ నవ్వె నా ఖరుం
డను విబుధావళుల్ మెదుగ ♦ నాజిని నూఱఁగ నన్నెపాత్రముం
జెనసిన మద్భుజాగ్రములు ♦ చెచ్చెర మిక్కిలి బూరటిల్లె నా
వినుత పరాక్రమ స్ఫురిత ♦ వృత్తి మనుష్యుల కంత చుల్కయే? ౮౦౯

క॥ అనుచుండ సింహామును గవి, సిన సామజములను పోలి ♦ శ్రీరాముని దై
త్యునిసైన్యము దట్టముగాఁ, జెనసె నుడిసె నార్చెఁ బేర్చెఁ ♦ జిడిముడి పడుచున్.

ఉ॥ విండులు వంచినా రసుర ♦ వీరులు పిమ్మట రాఘవుండు కో
దండము వంచి బాణములు ♦ దట్టముగాఁ బఱపంగ ధారలై
దుండిగ వారువంబులకుఁ ♦ దున్గెఁ బదంబులు పిడ్గుపాటుచేఁ
గొండలఁ బోలెఁ దొండములు ♦ కోల్పడి కూలె మతంగజంబులున్. ౮౧౦

తే॥ విఱిగె శూలముల్ ఖడ్గముల్ ♦ మురిసెగదలు, తెగియె భిందిపాలంబులు ♦ ద్రెవ్వె విండ్లు
తునిగెఁ జక్రముల్ దండముల్ ♦ తుంగెఁ దోమ, రములునుగ్గయ్యెఁ గేడెముల్ ♦ వ్రయ్యెఁ

క॥ చెడియెం గరుల పదంబులు, పడియెం గంకణము లొరయ ♦ భల్లకరంబుల్ [బడియె
మిడిసెం దళ్లుళ్ళ మలలు మఱి, బెడిసె శతాంగములు భిన్న ♦ భిన్నాంగములై. ౮౧౨

చ॥ ఖరపుత్రుల మన్నిఁ యుండఁగ ♦ గంధగజంబుల మన్నివే చిగం
శిరముల ద్రొచ్చు రాఘవుని ♦ వాగి శాల శరాళిచేత ని
ష్కరముగ పేరలక్ష్మికి ని ♦ వాసముతో వనిజాళి వక్షముల్
చినను శీర్షముల్ తెగియె ♦ వెల్లువలై ప్రవహించె రక్తముల్. ४०३

తే॥ కంజనేత్రుని యస్త్రము ♦ క్కాలు నూర్లు, వేలు లక్షలు కోట్లులై ♦ పెరిగి గిరులో గిరుల శిఖరములో యనఁ ♦ బరఁగు నొకలు, మూఁకలఁ గూల్చి వీనుల♦ప్రోగుచేసె.

ఉ॥ ప్రమూఁకలు కారుటగ్గి బలి ♦ ప్రమాలుచున్న తెఱంగునం దలల్
ప్రేకన తుంగ మొండెములు ♦ ద్రెళ్లెను రక్తమయంబు తోచఁ బై
నాకసమంను పాఱు కమ ♦ లాక్షు శరావళి వారి ప్రాణముల్
పీకుచు ప్రేంగ వెంటఁబడు ♦ పీడక యేగిన చందమై తగెన్. ४०४

ఉ॥ స్త్రీల కనుంగవం బలెనె ♦ దీర్ఘములై జెడిదంబులైన శ్రీ
లోలుని వాఁడి తూపు లరి ♦ లోకము ఖడ్గ కరంబు లుర్లఁగం
గాలి తెగగా జిరాలు చిరి ♦ యొంగఁ బదంబులు త్రెవ్వఁ జూపఱుల్
సోలఁ జెదర్చి దిక్కులకు ♦ నొకుల నింతగు శీర్షరాసులన్. ४०६

మ॥ క్షితిభృద్వీర మహేంద్ర చాప శరవృ ♦ ష్టిన్ జాఱు కీలాల నం
హతిచై తేయ కబంధబంధవృతి యే ♦ పారన్ మహాఘంబులై
తత విస్ఫార వనాశయాళిగ వనాం♦తం బెల్లఁ దత్పూర్వ నం
స్థితి మార్పం బడి యెప్ప టట్ల వెలసెన్ ♦ జిత్రంబుగాఁ జూచుచోన్. ४०౭

క॥ ఆ రక్త సాగరంబున, శూర శిరో బాహుదండ ♦ శూల పతాకా
వారణ రథగజ ఘోటక, వారంబులు దేలియాడెఁ ♦ బరిపరి విధులన్. ४०౮

క॥ అప్పుడు బలియురు కొందఱు, నిప్పులు గ్రక్కుచును చూచి ♦ నిగుడుచుఁ గొండం
గప్పిన జీమూతము లనఁ, గప్పిరి శరవృష్టి తోడఁ ♦ గాకుత్స్థవరున్. ४०౯

క॥ వారల బాణాసారము, వారక యాతఁడు హరించి ♦ పఱపి దెసలకున్
ధారణి నడుము విఱుగఁ గాం, తారము నిండంగ నఱికె ♦ దైత్యుల శిరముల్.

తే॥ అట్టలాడెఁ గ్రొన్నెత్తుట హరులు కరులు, మునిఁగెదైత్యవరుల క్రొవ్వు♦ముక్కు వఱకు
మెసవి క్రక్కుచు భూతముల్ ♦ మేలుమోవ, లేక మెలమెల్లఁ గాల్గద ♦ లింపసాగె.

తే॥ కల్లు మత్తు వంచనమును ♦ గలుగు నసుర, వరుల నేత్ర రత్నంబులఁ♦గిరట చయము
కొల్లగొనె; ధర్మ సత్త్వము ♦ కుంఠితంబు; దుష్టులకుఁజేటుమూఁడుట♦కష్ట తరమె?

చ॥ ఇరులఁ దోలంచు భాను క్రియ ♦ నేచిన రాఘవు మీఁద నీడ్చెలం
దొరసిన రోష దృక్కులను ♦ దొండడి నేసి యుగాంత కాల భీ

కర జలదంబు లొగ్గి వడ ♦ గండ్లు వెలార్చిన లీల యామినీ
చర నికరంబు లొక్కమొగిఁ ♦ జల్లె వెసన్ సకలాయుధంబులన్. ౮౨౩

సీ॥ వీరువైచినవారు ♦ వీరు వేచినవారు, వీరు వేయఁ దలంచు ♦ వారలనియు
వీరు నేర్చినవారు ♦ వీరునేరనివారు, వీర లెక్కటి పోరు ♦ వారలనక
నిలిచిన వారల ♦ నలిగిన వారలఁ, గాందిశీకులఁ దిట్టి ♦ కటువువారి
రేఁగెడు వారల ♦ రేఁపు వారల నెది, రించు వారల వాఁక ♦ రించు వారిఁ

తే॥ గసి మసఁగి త్రుంపఁగా మ ♦ స్తకములుకొన్ని, మేఘమండలమునఁగొన్ని ♦మిథునరాశి
గొన్ని ఋక్ష మండల మునఁ ♦ గొన్ని గిరులఁ, గానలోఁ గొన్ని కొన్ని ది♦క్కరులఁజేరె

చ॥ తరఁగల తోడి శోణిత న ♦ దంబులఁగూర్ప సురారి శైలకం
దరములఁ దొల్చు రామవిభు ♦ దారుణ శాత శరాళి భూమిపై
గిరుల పయిం బయోదములఁ ♦ గీల్కొనెఁ గొన్ని పయోధిఁగొన్ని క
ర్బురుల తను వ్రణంబులను ♦ గ్రుచ్చుచుఁ గొన్ని వెలర్చె నెల్లెడన్. ౮౨౪

ఉ॥ హారయుతుల్ మహోజ్జ్వల దృ ♦ గంచితు లాయుధ హస్తు లుత్కట
స్ఫార శరీరులౌ మగలు ♦ భానుకులేశు శితాస్త్ర పాళి చే
సురలి తునింగి నుగ్గయి శ ♦ రోద్ధత ఘోర సమీరణంబునన్
శరధిని చేర నిర్జరులు ♦ సంతస మందిరి నింగి నార్చుచున్ ౮౨౫

చ॥ ప్రబల తురంగ సంహతి త ♦ రంగ వితానము గాఁగ రక్తమున్
కబరజలాన గుండెలను ♦ కంజ వనంబు రహింప వారణా
లుబికిన నక్ర బృందముగ ♦ నూడిన ప్రేవులు శైవలంబుగా
గబగబ భూతరాజి దుము ♦ కన్ విలసిల్లె రణోర్వి సంద్రమై. ౮౨౬

ఉ॥ కొందఱు కుయ్యివెట్టి రొక ♦ కొందఱు సోలిరి కొందఱేల్గఁగాఁ
గొందఱు పొట్ట వ్రీల మఱి ♦ కొందఱు కాళులు చీల ఱోలుచుం
గొందఱు దొర్ల నెత్తురునఁ ♦ గొందఱు మున్గుచుఁ జచ్చి తేలఁగాఁ
గొందఱు పాఱఁ గొందఱటఁ ♦ గుందిరి రాముని బాణవృష్టిచే. ౮౨౭

ఉ॥ వంతల భీతిఁ బాఱు సుర ♦ వైరులఁ గాంచుచుఁ దిట్టి నవ్వి కా
లాంతకుఁ బోలు రాక్షస గ ♦ ణాధిపతుల్ పదునల్వు రొక్కటన్
ద్రుంతము క్రుంతమంచు ఘన ♦ దోర్బల గర్వమునన్ మహేశ దు
ర్దాంత విమంబు నా నడరి ♦ దండడిఁ జుట్టిరి రామచంద్రమున్. ౮౨౮

తే॥ శివుని కవిసిన త్రిపుర దా ♦ నవుల కరణి, రాముఁ గవిసి మతింపక ♦ రాఁజు కనలుఁ
గనుల జూపుచు మేఘంబు ♦ నేనయు ధనువు, కేలఁ గొన్న మాత్రనిగ్గొట్టఁ♦గిట్టినార్లు

చ॥ ఒకరుఁడు ఖడ్గముఁ గొనయిచె ♦ నొక్కఁడు చక్రముఁ ద్రిప్పి వైచె వే
ఱొకరుఁడు పాశముం విసరె ♦ నొక్కఁడు తోమరమేసెఁ జేన నిం
కొకరుఁడు కొండలం బఱపె ♦ నొక్కఁడు దండము వీచె నుగ్రుఁడై
యొకరుఁడు కేరి తిట్టె మఱి ♦ యొక్కఁ డదల్చె నొకండు హుమ్మనెన్.

చ॥ నెలువడు రామ శాత శర ♦ బృందముచే రథ రథ్య వర్గముల్
వ్రాలిసె మతంగజంబులును ♦ భూమికిఁ ద్రొగ్గెఁ దురంగ సంఘముల్
తలలను గోలుపోయె నవి ♦ తామరసాప్తుని చుట్టి గుల్లు నాఁ
బొలఁగిన సోఁకుమూఁకయును ♦ పోరె రణస్థలి పీన్గు కుప్పగాన్. ౪౩౨

ఉ॥ సోలిన దైత్య దేహముల ♦ శోణితముల్ వ్రణరంధ్రముల్ వెడన్
జాలుగఁ జిమ్ముచ న్నెగసి ♦ తమ్మతలమెల్లను కప్పివైవ దే
వాలియుఁ గేల మూసి కొనె ♦ నక్షియుగంబుఁ గృతాంత దూతలుం
గాళులు నొవ్వఁ గాఁపడము ♦ కాఁచుచు మోచిరి ప్రాణబృందముల్. ౪౩౩

ఉ॥ ఓలి పిశాచము ల్దిరుగు ♦ యుద్ధము నుస్మద వృత్తిఁ గోరు దై
త్యాళుల వక్త్రగహ్వరము ♦ లందు శునీతతిచొచ్చెఁ దచ్ఛరః
పాళుల నక్కలెక్కఁ దమ ♦ వాత శరంబులు గ్రువ్వ వారి ము
గ్జాలముఁ జేరు కర్బుర ని ♦ కాయము ప్రోదినులట్లు గ్రమ్మఱెన్. ౪౩౪

చ॥ తలలురలెన్ గనుల్చెదరెఁ ♦ తన్నయనంబుల నిప్పుకల్ వడెన్
మలలుగ నేల దొర్లె నవి ♦ మత్త గజంబులు దిక్సమూహ మ
ల్గుల పడెఁ గొల్మినట్లు మిడుఁ ♦ గుల్లెగసెన్ నమసెన్ వరూధినుల్
లలిత నృపావతంసు కర ♦ లాఘవ మెట్లు వచింప శక్యమా? ౪౩౫

తే॥ స్యందనములతో నాయుధ ♦ చయముతోడ, దళపతులు పదునల్వురు ♦ తక్కవారి
సైనికనికాయ మెల్లను ♦ నమసి పొలసు,కంపుగలరక్త జలధిలోఁ ♦ గలిసిపోయె.౪౩౬

ఉ॥ వారలు సంగరాంగణము ♦ వారకచూచి శిరంబుతోడి వా
కేరును లేమి రాముపయి ♦ నేపునమండుచుఁ బండ్లు గీటుచున్
మోరలు నిక్కఁగా నరద ♦ ముల్ రఘువర్యుని క్రేవఁద్రోలుచున్
ధీరత హుంకరించుచు మ ♦ దించుచు గర్వపు మాటలాడుచున్.

ఉ॥ వచ్చినఁగాంచి రాఘవుఁడు - వాఁడిశరంబులు నాఁటనేసె యొ
క్కచ్చునఁ దచ్ఛతాంగముల - నర్వొదుసేయ గుఱాలు సారథుల్
విచ్చిన నేము లచ్చులును - వ్రీలిన చక్రములున్ యుగాంత మం
దెచ్చిరు గాలిచే నెగసి - యేగెడు పోలిక దోఁచె మింటిపై. ౪౩౭

తే॥ స్యందనము లట్లు సమయఁ బ్ర - చండ భంగి, నవ్వుచుగఱచుచు భూమియు-నగలునట్లు
క్రిందికిం దూఁకి ధనువులు ♦ కేలఁదాల్చి, పిడుగులం బోలు శరములు ♦ విడిచినారు.

తే॥ దిశల భేదింపఁ జాలిన ♦ నిశిత విశిఖ, తతుల నడుమన ఖండించి ♦ దాశరథియు
వారి బాణాసనంబుల - వరుస పెట్టి, విఱిచి మానిచె వారల - వింటిపోరు. ౪౪౦

క॥ కోపమున వారు కొండల, నేపున పెకలించి కొని ది - నేశుని తేజం
బ్రేపు చెడ ♦ నెత్తి పయికా, టోపంబున వైచి రుగ్రుఁ ♦ డుకా దిగులూనన్. ౪౪౧

క॥ గొనయముతోఁ గను బొమ్మలు, నినకులునకు వంగె వాహి ♦ నీశుల తలలున్
ఘన గిరులతోడఁ బడె మే, దినిపయిఁ గరలాఘవంబు ♦ దివ్యులు పొగడన్. ౪౪౨

క॥ ఈలాగు వారు గూలఁగ, మూలబలము గదిసి రాము ♦ ముట్టెం బెలుచన్
బోలఁగ దివి భువి బెనలని, తేలికఁ దెలుపంగరాక ♦ తికమక పడఁగన్. ౪౪౩

తే॥ దుందుభులతోడ నేనుఁగుల్-క్రందుసలిపె,గటుగుణధ్వనితోడ శంఖములు మొరసె
తురగహేషలతో రణ - దోహలులగు, రక్కసుల పేరెలుంగులు -పిక్కటిల్లె. ౪౪౪

ఉ॥ అంబర వీథి నిండె నసు - రావలి కైదువు లెల్ల వాని మ
ధ్యంబునఁదూఱి రామవిభు - దారుణ మార్గణరాజి నుగ్గునూ
చంబుగఁ ద్రుంపఁగాఁ బెటిలి - చయ్యనమింటికి నేగ నిర్ఘరా
ఘంబులు పాఱె దిక్కరులు - కన్నులనార్చి జగంబు బెగ్గిలెన్. ౪౪౫

## త్రిశిరుని సంగరము.

మ॥ బలవంతుండు పసిండి బొమ్మికము లు ♦ ద్భ్రాజిల్లు వాఁడుం గడున్
దళము ల్గలిగినవాఁడు మూఁడు తల లు ♦ ద్యద్దీప్తి రాజిల్లు సోఁ
కులమున్నేఁడు ఖరానుజుండు గిరిశ ♦ క్రూర త్రిశూలంబు నాఁ
జెలఁగెన్ రాక్షసనేనమధ్య శరవృ ♦ ష్టింగూర్చు చాపంబుతో. ౪౪౬

మ॥ లయకాలాంబుధిరీతి యనంగ జగముల్ ♦ మార్మ్రోఁగఁ శబ్దించుచున్
భయద ప్రోద్ధతిఁ దన్ను చుట్టికొనఁ జా ♦ పశ్రేష్ఠ మాత్రంబు తో
డయి యొక్కండుగ నిల్చు రాఘవ విభుం ♦ డవ్వేళ నొప్పెం దమో
మయ రంగస్థలి వెల్గు దీపమున స ♦ మ్యగ్రీతి యుద్ధావనిన్. ౪౪౭

మ॥ శరఖడ్గాదులతోడ భీకర ధను ♦ ష్టంకార హుంకార ని
ర్భరరావంబులతోడఁ గ్రూర నయన ♦ వ్యాపారుడై రాముఁడా
ఖరుతమ్ముంగని వానిసేనను కృప ♦ త్క్రూర కాఠిన్యమున్
వరదోశ్శౌర్యము గానిపించె సమతన్ ♦ భాగళ్య మేపారఁగన్. ౪౪౮

తే॥ తెగను కాళ్లును జేతులును ♦ తెగను కేలు, తెగను తొడలును వదనములు ♦ తెగను వ్రేళ్లు
తెగను మోకాళ్లు వాడమ్ముల్ ♦ తెగ గొడుగులు, తెగను చాశాలికంబులు ♦ తెగరణోర్వి.

తే॥ అరదములు బహుకేతువుల ♦ రథ్యములతోడఁ, బ్రమాగిష్ఠమనిపడియెమం ♦ దుభులతోడఁ
దుంభములు తెగి మత్త దే ♦ వంతవయము, పిడుగుచేఁ గూలుగిరులట్లు ♦ జెదిసిపడియె.

క॥ తలలు తెగినవారు తెగుబట్టు, తెలియక శరవృష్టి గురిసి ♦ తీఱుమ రిలపైఁ
దలదెగిన వారు లేఁగుచు, వలనము క్రియఁగురియుచుంద్రమ ♦ శరవర్షంబున్.　　౪౫౧

చ॥ శిరములఁ గేడెము ల్లనరఁ ♦ గాటుకకొండలవంటి కరుద్రో
త్కరాసుర కబంధములుల్, కనక ♦ కంకణ నూపురముల్ ధ్వనింపఁగా
మురిపుచు నాడు చేలుపుల ♦ బోటులు జన్నపు రోవెలంములుఁ
వెలుఁగు పతంగ నాట్యములు ♦ పెక్కువిధంబులఁ జల్పె నయ్యెడన్.　　౪౫౨

చ॥ గొడుగులు చామరాలు నరు ♦ గుల్ కరులుఁ దెగు బాహువర్గముల్
పడములుగఁ జెక్కులుముల్ పడవ ♦ సోలుపులై తగ రక్తవాహినుల్
కడలిని చేర నుప్పనయి ♦ క్రందుగనున్న సముద్రశీలముఁ
విడువఁగఁజేసి నూత్నమగు ♦ పేరిమి గూర్చె రణప్రకారముల్.　　౪౫౩

తే॥ రామశరములచే శరీ ♦ రములు విడిచి, వక్రదంతులు రక్కసుల్ ♦ స్వర్గవాటి
నమరనారులతోఁ గూడి ♦ తమ కబంధ, ములు నటించు నాటకము లి ♦ మ్ముగను గనిరి.

ఉ॥ వేలుపు టింతులం గలిసి ♦ వేడుకఁగా నసిఁ జూచు పూర్వదే
వాలి ధరఁ రఘూత్తము శ ♦ రావళిఁ ద్రెవ్వెన స్వీయ బాహులఁ
వాలి పిశాచపాళి యొక ♦ వంకకు శ్వానము లొక్కవంకకుఁ
గ్రోలుచుఁ బోరి లాగుటలు ♦ గోరికఁ గాంచుచు నవ్వి రయ్యెడన్.　　౪౫౪

శా॥ జ్ఞానాస్త్రంబులు సోకఁ జీలిన హృద ♦ బ్జాతంబులఁ దైత్యుల
జ్ఞానావస్థఁ దరించి పాపముల నో ♦ జం గోసి దివ్యాత్ములై
ధ్యానాసక్తత నద్వితీయుఁడయి యం ♦ ద్ధంబాడు శ్రీజానకీ
ప్రాణేశుంగని రద్వితీయ పరత ♦ త్త్వంబుఁ జొచ్చుఁ జిత్తంబులన్.　　౪౫౫

ఉ॥ తుండ యుగంబుతోడి కరి ♦ తోయము నొందిన రామచంద్రు కో
దండ ధనుర్విముక్త నిశి ♦ త ప్రదరంబులు మూాల ముట్టుగాఁ
దుండము లొనర్చి నొంచినవి ♦ దుష్టులఁ గాంచిన వారి నెల్లకన్
జండి యశాంతిమై నమృత ♦ సాక్ష్యము వల్కిన వాక్కులంబలెఁ.　　౪౫౬

ఉ॥ రాజులు జెక్కులొప్ప భ్రమ ♦ రంబు లభించిన కీటకంబు ను
ద్వేజిత రీతిఁ గాంచి తన ♦ శీరు నొసంగిన భాతి పూత భా

త్రిజ మనోహరుండు తన ♦ తీవ్ర శిలీముఖ రాజిచేత ర
క్షోజన కీటకంబులను ♦ శోభిలఁ జేసెను ఖేచరాళిగన్. ౮౫౮

చ॥ కడు బెడిదంపు టాముని నొ ♦ కానొక మానిసి సాహసించి యు
క్కడమున దైత్య సంఘములఁ ♦ గాడుగ బీడుగఁ జేసె నంచు ను
గ్గడువునఁ బంక్తికంఠునకుఁ ♦ గార్యము చెప్ప ననంగ నచ్చటం
దుడిచిన దానవాంగముల ♦ తోఁ జనె లంకకు రక్తవాహినుల్. ౮౫౯

చ॥ బలసిన మోహరంబుగల ♦ వాహిని రాఘవు నస్త్రరాజిఁ బో
ర్కలనునఁ ద్రుంగఁ గాంచి త్రిశి ♦ రస్కుఁడు మీఱిన కోప మానినై
కలసిన రక్తమందు మునుఁ ♦ గంబడు తేరును త్రోలు మంచు ని
ట్టలముగ నార్చి యాజికిఁ గ ♦ డంగెను దున్నహతేజుఁడై వెసన్. ౮౬౦

తే॥ సత్యమునకు నెల్లరకును ♦ సాక్షియైన, రామచంద్రునిపై ముఖ ♦ రంబులైన
శాత సాయక ములు గుప్పి ♦ చంద్రసూర్యు, లకును రాఘవుఁ గనరాని ♦ లలినొనర్చె

తే॥ త్రిశిరుఁ డేసిన తూపులఁ ♦ ద్రెంచివైచి, మరలరాముఁడు పదునాల్గు ♦ మార్గణములఁ
గనక రథము ధ్వంసము చేసి ♦ కడఁగి యొక్క, భల్లమున సారథి శిరంబు♦డుల్ల నేసె.

తే॥ మఱియు దేవత లార్వంగ ♦మనుజవిభుఁడు, స్వర్ణపుంఖబాణమునరా♦క్షసునిమీఁదు
తలల నొక్కటి ఖండించి ♦ ధరణిఁ బడగ, మునుపె రెండవ తలగూడఁ♦దునియనేసె.

తే॥ రథము విరుదల వోఁ ద్రిశి ♦ రస్కుఁడనెడు, పేరు చెడినను బలిమియు ♦ బిగువు చెడక
గగనమున నిల్చి తన కార్ము ♦ కంబు వంచి, వశిఖ వర్షంబు గురిసె భూ ♦విభునిమీఁద

తే॥ భ్రుకుటి వికటంబుగాఁ జూచి♦భూవరుఁడు, కారుమేఘంబుమెఱుపుతోఁ ♦గానఁబడఁగ
గాలిఁ జెల్లాచెదరులైన ♦ కరణి వాని, యంప వానను తూలించె ♦ నాశుగముల.

చ॥ మఱియును దొడ్డ సాయకము ♦ మాటి త్రిశీర్షుని విల్లుద్రుంపఁగా
వెఱవఁడు మోము కాంతియును ♦వీడఁడు బాహుల సత్త్వ సంపదం
దొఱఁగఁడు కోప దృష్టులను ♦ దోర్పఁడు కొండలువైచు పోఁడిమిన్
దఱలఁడు వీరవాక్కుల వ ♦ దల్పఁడు వాని కడంక యెట్టిదో? ౮౬౬

ఉ॥ మాయలు వన్ని యొక్కఁడై సు ♦ మాళమునన్ బలుమంది పోలికన్
జేయుచు సింహగర్జనలఁ ♦ జేయుచుఁ గ్రూరతఁ బోరుచుండు దై
తేయుని రెండు పాదములఁ ♦ ద్రెంచుచు రెంటను రెంటఁ జేతులన్
మాయఁగఁ జేయ నంతటను ♦ ద్రమాలక రాముని బిట్టదల్చుచున్. ౮౬౭

ఉ॥ కాళ్లను గేలు పోయినను ♦ కర్బుర వీరుఁడు విక్రమంబునన్
ద్రుళ్లుచు శీలభానుపయి ♦ దూఁకెడు రాఘవు పోల్కి నెత్తిపై

స్న్లను కోటలుండు గుహా • చొప్పనఁగన్నడు బాకి నోటితో
మళ్లకి వచ్చునాని షము • మాలి వధించెను రాముఁ డత్తఱి. ౪౬౮

చ॥ త్రిశిరసుఁడట్టి మహీధరము - దివ్య రఘుప్రవరాఖ్యగోత్ర భి
న్నిశిత శరాశనిం బెగుడు - నిల్వక దూషణుఁ డగ్గలించినన్
వశమటి క త్తవాహనుల - వారక తూలుచుఁ గాలి పంటెముల్
పిశితము ప్రేవులుం దరలి - వెక్కస పెట్టఁగఁ బాజి సంపతుల్. ౪౬౯

ఉ॥ కొందఱు దేవతా తతి - గొల్లున నవ్వఁగ భూమిఁ ద్రెల్లగుచుం
బొందఁగ దూఁటి పాటి యటఁ - బూఁడిన క్రొవ్వునఁ గాళ్లు జాఱఁగా
నందె మునింగినారు చది - యంబడు పీన్గుల నెక్కి జాఱఁగా
సందుల క్రమ్ముచుం దొరలి - చావక కొందఱు తక్షి రక్తోద్గతన్. ౪౭౦

ఉ॥ కొందఱు మధ్యబాణములు - గ్రుచ్చి పదంబులఁ ద్రెంచి క్రుంచఁగాఁ
గుందుచుఁ గూలినారు మఱి - కొందఱు నెత్తురు టేళ్లు మున్ని క్రొ
వ్వొందిన పంకమందు దిగి - యోపిక లేవఁగలేక కొందఱున్
దందడి ర క్త పూరముల - దాఁటఁగలేకయి యీల్గి రెందఱో ౪౭౧

చ॥ నఖములనుండి జాఱి చర - ణంబుల పైఁబడి త్రెంచుచున్న పే
రడిదములం గణింపక భ - యం బురు వానిన రీతి బుద్ధియుం
జెడి పరుగెత్తు రక్కసులు - చెచ్చెర రాఘవుఁడేయు సంపతుల్
విడువక వక్షము ల్దొలువ - వీఁకను రాక తొలంగి రా పథిన్. ౪౭౨

చ॥ పరుగిడుచున్న రక్కసులు - ప్రస్సి గుహాంతర సీమ కై వడిం
బరఁగిన వారణోదర ని - వాసములం భజియించి సన్నిధిన్
దొరసిన మొండియమ్ముల నొ - దుంగుచుఁ గాంచి వయస్య! వీరలన్
దురమునఁ జూడలేదను ఖి - దో కయివారము లందు రొంటునన్. ౪౭౩

దూషణుఁడు దురమునఁ బాఱు సేనలఁ బ్రేరేఁచుట.

ఉ॥ దూషణుఁడందు నిల్చి తమ - దోర్బల శక్తులు గ్రుంగఁ బాఱుచున్
రోషము దక్కు రాక్షసుల • రూక్ష దృశం బరికించి తాపస
ప్రేషిత మానవాధముని - బీరము నోపఁగ లేక పాఱు నో
యోషితలార! నావచన - మొందు వినుం డిది వీరధర్మమే? ౪౭౪

చ॥ పిఱికి మనుష్యులం గనుచు - భీతిలి పాఱుచు నిందమోచు న
మ్మొఱకులఁ గాంచి గాజులను - మోదముతో ధరియించు కాంతలున్
వెఱవరు నిబ్బరంబనెడి - పేరణియే పదిలంబు గాంచు పె
న్నుఱవు; భయంబు ప్రాణముల - కొప్పిన తోడగునే? వచింపుఁడీ; ౪౭౫

తే॥ జిష్ణుతోఁ ద్రిమూర్తులతోడఁ - జెనకి చేయు,యుద్ధమున నిశాచరు లెవ్వ - రోడినారు?
వీటికి తనమును మీకోడి - వెలిచిపాఱు, వేలుపులయొద్దఁ గొంటిరే - వెడఁగులార!.

చ॥ సుకమును గాంచి యెల్లప్డుఁ ♦ జొక్కిన రక్కసులార! యిందు మీ
రొక నరుచేత నోటువడి ♦ యొక్కరి నొక్కరు ద్రోచి కొంచుఁ బాం
దికగఁ బురంబు చేరఁగ ము ♦ దిం దలపెట్టితి రేమి? యందు మీ
సకుల పయోధరంబులను ♦ చయ్యనఁ గౌఁగిలిఁ గాంచఁ గందురే? ౪౭౭

ఉ॥ జేగుఱు మాపు వెల్లనఁగఁ ♦ జేకొని పాఱెదు పందలార!మీ
రాగిణులైన కాంతల క ♦ రణ్యములం జనువేళ వీఁపులం
దోఁగిన కజ్జ గీట్లు రణ ♦ దోహలతం గను పోటు లందురో?
మేఁగిన వక్షముల్ తొడరి ♦ గ్రుంగిన తూపులఁ జూపికొందురో? ౪౭౮

చ॥ జగములు కూడి మార్కొనఁగ ♦ సాధ్యముకాని భవత్కులోత్తముం
డగు దశకంఠు చెల్లెలికి ♦ నంగము వోయిన నింద చాలకీ
వగ ననిఁ బాటి మోములను ♦ వంతురె పెద్దల మ్రోల? మర్త్యుఁడే
మగఁడయి పోరునల్పె నవ ♦ మానము వేఱొకఁ డింతకుఁడు నే? ౪౭౯

శా॥ వీరావేశము తోడ యుద్ధముల వి ♦ ద్విడ్వ్రాతముం గూల్చి త
త్క్రూరాస్త్రింబులఁ బుచ్చికొన్న విలస ♦ ద్దోర్వీర్యు లారా! యిఁకన్
మీరల్ ముత్తెము లమ్మ వర్తకములై ♦ మేకొందురో? లేక భూ
దారప్రక్రియ కాయుధంబుల నొగిం ♦ దట్టింతురో కట్టుగన్? ౪౮౦

ఉ॥ మీరలు నా ధనుర్బలము ♦ మిన్నక చూచుచునుండుఁ డాతనిన్
మాఱుతు నేన యంచు జన ♦ మాన్యుని మార్కొనియెన్ భయంకరా
కారుని దూషణున్ సురలు ♦ గాంచి యెడందలయందు దిగ్భ్రమం
దారిరి కాచుకొమ్మని యు ♦ దగ్రుఁడు రాముఁడు నిల్చె ముంగలన్.

రాముఁడు దూషణుని వధించుట

చ॥ దురమున నాయుధంబులును ♦ తుండములున్ రదనంబులున్ గరుల్
బఱియలుగాఁగఁ ద్రుంగె రథ ♦ వర్గము కేతనముల్ శిరోగ్రముల్
పరివరి ద్రోవలయ్యె వరి ♦ పైరుల కోఁతలఁ బోలెఁ గుత్తుకల్
దఱుగఁ దురంగ సంఘములు ♦ దట్టముగాఁ బఱపై ధరం బడెన్. ౪౮౧

సీ॥ రామధనుర్ముక్త ♦ భీమ సాయకములు, ప్రాణంబు లున్నట్టి ♦ పట్లువెదకి
వాటియాయుధములు ♦ బంధుర కవచముల్, చెండుచుఁ గొండల ♦ నుండి పాఱు
నదులకై వడి రక్త ♦ నదులుబ్బి పాఱంగ, డాలుల యందు మై ♦ చాలులందు
తూఱుచు వచ్చుచుఁ ♦ ద్రుంచుచుఁ దజ్జీవ, ములతోడ నచ్చట్లఁ ♦ గలిసెఁ గొన్ని

తే॥ అనుజుతలఁదెగుటయు రాము♦నంపవాన, మునుఁగుసైన్యంబు గని కడుఁ♦గినిసి ఖరుఁడు
కొమ్ములం గల్గు దిక్కరి ♦ కొమరువిల్లు, నాయుధమ్ములు దాల్చిన ♦ హస్తమెత్తి.

## ఖరుని యుద్ధము.

క॥ యముఁడును భీతిల్ల దనుజ, చమూ జలధి తోడఁ రేఁగి ♦ చందురుని మొగుల్
గము లలము లలిని కోదం, డముఁ దాల్చిన రాముపైన ♦ దరి వేష్టించెన్. ౪౯౫
క॥ అక్షీణ పాప కర్మలు, రాక్షస వరు లొక్కపెట్ట ♦ రథ గజ హయులన్
దక్షత ఫణిరాజ ఫణము, లక్షమముగ నఱియ నడపి ♦ రతి రభసమునన్. ౪౯౬

శా॥ శ్రీరామ ప్రభు శాత సాయక హతిం ♦ జీకాకులై యేనుఁగుల్
తీఱన్ నేలకు వ్రాలె వారువములున్ ♦ దేరుల్ రజంబయ్యెఁ గే
యూరాంచద్భుజముల్ తునింగె మకుట ♦ ప్రోద్యత్స్ఫురచ్ఛీర్షముల్
చేరెం ధారిణిఁ గాళ్లు త్రుంగె గుదులై ♦ జీరాడె నాంత్ర చ్ఛటల్ ౪౯౭

క॥ మీటిన ఖడ్గాటవి శూ, లాటవి ధనురటవి తోమ ♦ రాటవి గురుబా
హాటవి మున్నగు దను వం, శాటవి శ్రీరామ శర ద ♦ వాటవి నడఁగెన్. ౪౯౮

క॥ తగవే రూపొందిన గతిఁ, దగు రామ శరౌఘ మపుడు ♦ తారాపథమున్
దగ దూసి చనియె నన మృదు, వగు తనువులఁజొచ్చి డుస్సి ♦ యరుగుటయరుదే?

క॥ చుట్టును ముట్టిన మూఁకలు, తెట్టెలుగాఁ గూల నేగు ♦ దివ్యాస్త్రంబుల్
నెట్టన న్యాయసభను కడు, దిట్టలు కపటమునఁ బలుకఁ ♦ దిగుచుటఁ బోలెన్
క॥ ఖరుఁడను క్రూరాభిఖ్యుఁడు, ఖర గుణులగు నసురలెల్లఁ ♦ గడతేఱుటచే
గురు కోపి యగుచు శోణిత, శరధిని మందరము వోలెఁ ♦ జక్కన నిలిచెన్

తే॥ నల్ల కడలిని చనునొక ♦ నావయనఁగ, నొప్పు నరదంబుపై నెక్కి ♦ యుగ్రదృష్టి
మిడుఁగుఱులు రాలఁజూచుచు ♦ మింటసూర్యు, కరణివెలుఁగుచు రాముని♦కడకువచ్చె

చ॥ భువనము లెల్ల నొక్కపరి ♦ బూది యొనర్పఁగ లేచు నగ్నినా
నెవడి సుతీక్ష్ణుఁడై ఖరుఁడు ♦ నిల్చిన యంత సుమేరు చాపమున్
దివిరి భువింబడంగ వడిఁ ♦ ద్రెంచిన దోర్బల వీర్యశాలి రా
ఘవుఁడు నిశాత మార్గణ ని♦కాయము లేర్చి ధరించి నిల్చినన్. ౫౦౩

క॥ అనల జ్వాలలఁ గురిసెడు, ననిల జవము గలుగు వాఁడి ♦ యమ్ములు వేయన్
జనవరుపైఁ బఱపఁగ నా, ఘనుఁడును నట్టివియు విడిచి ♦ ఖండించి వెసన్. ౫౦౪
క॥ లోకైక నాయకుండగు, కాకుత్స్థుఁడు తొమ్మిదింట ♦ గర్బురు నేయన్
వీకున వాఁడును నథుమనె, తేఁకువ ఖండించి నవ్వె ♦ దిక్కులు వడఁకన్ ౫౦౫

శా॥ దుష్టుండంతటఁ బోక మాత్రుఁ డసా ♦ ధ్యుం డంచు మాయా విధా
వష్టంభుండయి మీఱి దానవుఁడు స ♦ త్త్వస్ఫూర్తి శోభిల్ల ను
త్కృష్టోగ్ర మేఘమునన్ శరంబులను వ ♦ ర్షింపంగ నిర్ణిద్రతా
ధృష్టుం డామ్యుఁడు కిన్కఁ బూని ధనురా ♦ కృష్టిం బ్రకృష్టంబుగన్. ౫౦౬

మ॥ ఒక బాణమ్మున వాని యాలము మఁగిం - పొందింతు నంచున్ వెసన్
బ్రకచస్ఫూర్తి శరంబు దొడ్డిగొన మా - కర్ణంబుగా లాగఁ గా
ర్ముకమున్ ఘల్లన బ్రీలె నిర్జరులు మా - పూర్ణాశలున్ గర్వమున్
వికటంబయ్యెనె యంచుఁ జింతిలిరి వి - ల్వౌఖండటన్ లేమికిన్. ౫౦౭

తే॥ ధనువు విఱుఁగుట కొంటిమైఁ - దనరుటకును, కలఁత నొందక రాముఁడు - క్షత్త్రధర్మ
విధిని తన దీర్ఘ బాహుల - వెనుక నంకెఁ, జాఁచి నిల్చిన వరుణుఁ డా - సడి యెఱింగి

ఆ॥ చెంత కేగుదెంచి - చింత వలవదంచుఁ, దొలుత జామదగ్న్య - గెలిచినపుడు
కొనుచు విల్లడగను - తనయొద్ద నునిచిన, వింటి నంది యిచ్చె - విబుధు లలర. ౫౦౯

ఆ॥ విల్లు నందికొనుచు ♦ వినతిమైఁ గేల్మోడ్చి, వంచి యెడమ చేతఁ ♦ బట్టి నంత
ధర్మదూరులైన ♦ దానవావళికెల్ల, నెడమ కనులు భుజము - లెగయ నదరె

ఆ॥ త్రుటిని నారిఁగూర్చి - మరమున యమువంటి, వారు మెచ్చ నొడ్డి - పోరు నలిపి
ఖరుని రథము నూఱు - కఱకుటమ్ములచేతఁ, దుత్తునియలు గాఁగఁ - ద్రుంచివైచె

తే॥ అరద మట్టులు చెడ ఖరుఁ - డార్భటించి, చలము వీడక యంబర - స్థలికి నెగసి
రాము భుజగిరుల్ మునుఁగనా - రాచవృష్టి, మొగులుకై వడిఁగురియించె - బ్రమోఁతతోడ.

తే॥ తగ్గుచున్న తూణము నుండి - యగ్గివంటి, శరములం గురియించెడు - ఖరుని చేయి
యక్షయ నిషంగమందుండి - యందుకొనిన, యొక్క యిషువునరాఘవుఁ - డుర్విఁగూల్చె.

తే॥ కుడికరము పడిపోవఁగ - నెడమ చేత, నొక్క యినుప రోఁకలి గొని - యుక్కుమీఱ
వైచినంతనె జానకీ - వరుఁడు దాని, నడుమఁ దుండ్లుగా నొక కోల - నఱికివైచె. ౫౧౪

తే॥ తాఁకరాని విసముగల ♦ దంష్ట్రిలూడు, పాము బుసపెట్టి నట్టులా ♦ బలియుఁడూర్చి
వృక్షమొక్కండు గొనిరాము ♦ వేయునంత, మొగి నొకేశరమున దాని ♦ నెగురఁగొట్టె.

మ॥ వరగర్వంబున మాయలం బలిసి స ♦ ప్తద్వీపముల్ సప్తబం
ధురలోకంబుల బాధసేసిన మహా ♦ దోషంబులం బొందఁగా
ఖరుహా స్తంబును పోలె వాని తలయున్ ♦ ఖండించి శ్రీరామ భూ
వరుఁ డొప్పారెను మంచువో నలరు భా ♦ స్వన్మండలంబో యనన్. ౫౧౫

తే॥ ఖరుఁడు పడుటను గని సుర ♦ వరులుగూడి, యాడిపాడి యానందించి ♦ యడరిపొగడి
పారిజాత సుమంబులా ♦ పంకజాక్షు, మీఁద నొత్తుగఁగురియించు ♦ మిడిసినారు. ౫౧౬

తే॥ ఋషులుచేరరా లక్ష్మణా♦గ్రిముఁడుముదము, నందెఘోరయుద్ధమునకుఁ ♦ బ్రాణ మొండె
వెడల నొంటివైమెు నున్నట్టి ♦ యొడలి వంటి, క్షోణిజాత యొసరఁ జూచు ♦ చోటికరిగ

ఉ॥ మింటికి నేగి డాఁగు మిడి ♦ మేలవు సోఁకుల మేని నెత్తురు దు
మ్మంటిన యంఘ్రియుగ్మము మ ♦ దశ్రుల ధావనచేసెఁ దమ్ము, డా
యొంటికి నంటు ధూళియుఁ బ్ర ♦ ణోత్థిత వేదనవోవ నిమ్మళం
బొంటఁ గవుంగిలించె నను ♦ వొందఁగ జక్కవచంటి సీతయున్. ౫౦౯

తే॥ ఒక ముహూర్తమాత్రంబున ♦ నుక్కడఁగిన, యసుర రక్తవాహినులు ది ♦ గంతములకు
నడరెఁ గడలి ఘోషంబు నా ♦ నమరులార్చి, పొగడ రాముఁడు సంతోష ♦ మును భజించె

తే॥ రావణుని చెల్లెలైన శూ ♦ ర్పణఖ చూచి, చేతఁ గడుపు మోదికొని ని ♦ శ్చేష్టఁ గుడిచి
ఖరునిపైఁ బడి నెత్తురు ♦ వఱదఁ బొరలి, రోదనము చేసెఁ గనుల న ♦ శ్రువులు దొరఁగ.

చ॥ మనసున నాస నుంచితిని ♦ మానవుపై నది ముక్కు దీసె సి
గ్గున మదిలోఁ దపించి మృతిఁ ♦ గోరన కోరక యిమ్మురేఁపి మీ
తనువుల మంటఁ గల్పితిని ♦ దారుణ కర్మము నాచరించితిన్
బనుకుచు నింక నేపనికిఁ ♦ బొల్పుడు దాననొ యంచు నేడ్చుచున్. ౫౧౦

మ॥ జయమాలల్గొను నాయుధంబులను హ ♦ స్తంబందు సంధించు దు
ర్జయు లౌ రక్కసులుం దదీయ కులముల్ ♦ అంపిల్లు పాపంబులున్
క్షయముం జేయఁగఁ బూని శూర్పణఖ ఝుం ♦ ఝామారుతంబట్లు వా
త్యయుఁ బోలెన్ మది తత్తఱింపఁ జనియెన్ ♦ ద్రాఁచుం బలెన్ లంకకున్. ౫౧౧

౭ మారీచ వధపటలము. (౫౫౨)

మ॥ బలవంతుల్ చనిపోక శూర్పణఖ భా ♦ వంబందు చింతింపకే
జలదశ్యాముని మేనిసౌరు మదిలోఁ ♦ సంధించి లంకేశుఁడా
కలికిన్ రాఘవు దేవిఁ గైకొను వహిం ♦ గావింతునేనిన్ మను
వ్యాలలాముల్ దగఁ బొందవచ్చు నను నూ ♦ హం జేరెఁ దా లంకకున్. ౫౧౪

సీ॥ నశ్వరంబగు భువ ♦ నంబును సచరాచ, రముఁగ సృష్టించిన ♦ బ్రహ్మకైన
నరుదయి విజ్ఞాన ♦ పరమార్గమునను శ్రే, ష్ఠుం బొంది చేయుధ ♦ ర్మంబుపగిది
మయుని నైపుణ్యాక ♦ ర్మంబు పూర్తిగఁ దెల్పు, రత్నఖచిత సభా ♦ రంగమందు
దిగ్దంతిదంత వి ♦ దీర్ణ భుజాంతర, సీమ పూర్వాద్రినాఁ ♦ జెలఁగుచుండ

తే॥ ద్వాదశార్క బింబమ్ము లి ♦ ర్వదిగ నగుచు, వెలయు కరణిని కర్ణకుం ♦ డలము లలర
బాహుపురి మణుల్ ఇంశతి ♦ బాహుపులందు, వహ్ని పర్వత శిఖరాల ♦ పగిది వెలుఁగ. ౫౧౫

సీ॥ వ్యాఘ్రాజినుండు పీ ♦ తాంబరుఁడును పంక, జాసనుండేనొక ♦ పీఠ మేని
శంకరుఁ బాలర ♦ నంగఁ జప్పుడి వేల్పు, లోకాలక్కఁ దేవుని ♦ యొదిఁగి నిల్చువ

సన్నని నడుములు ♦ స్తనహేమకుంభమ్ము, లెఱ్ఱని రేఖలు ♦ నెసఁగు కనులు
చెలువారు చెలువలు ♦ చేయు నల్కారమున వం, గని కిరీటాంచిత ♦ మణులు వెలుఁగ

తే॥ శేషమణి ఫణావళి యట్లు ♦ చెలఁగు భుజము, పగరఁ జిక్కులన్నియుఁ జుట్టి ♦ యలరుచుండ
గ్రహములను బట్టియుంచిన ♦ కారవోలె, నిండురత్నహారంబులు ♦ నిటుగులుక. ౫౨౯

తే॥ సాటిలేని పరాక్రమ ♦ శాలులైన, రాక్షసుల రత్నమకుటముల్ ♦ రాయు కతన
నఱిగి యక్షీణ మహిమ పొంది ♦ యమరులంపు, రత్నకటకముల్ మిక్కిలి ♦ రవ మొనర్ప

తే॥ మూఁడులోకంబులందును ♦ ముఖ్యులైన, పెద్దలొసఁగు నుపాయన ♦ బృందమనఁగ
దేవతలు రాక్షసులు భక్తి ♦ దిక్కులందు, చల్లిన సుగంధ పుష్పసం ♦ చయము వెలయ

తే॥ ఇచట నీవెఱుఁగనటని ♦ యొఱఁగి శిరము, లంపు చేతులు జోడించి ♦ వందనములు
చేసి వరుసలు వరుసలై ♦ చేరి నిలిచి, కొలుచు విద్యాధరులు చుట్టి ♦ నిలిచియుండ

తే॥ చెప్పినది స్త్రీల విషయమై ♦ చెలఁగుచున్నఁ, దమ్ముఁ గూర్చియే యనియెంచి ♦ తలరి మ్రొక్కు
వారు భయభక్తులును గల ♦ వారునైన, సిద్ధవరులు సింహము లట్లు ♦ చేరినిలువ.

చ॥ సచివులఁ గాంచి పల్కిన వ ♦ చస్సులు తమ్ముఁ గుఱించి యంచు న
డ్డుకుచు ముదలన్ గ్రహింప మదిఁ ♦ గొంకుచు నిల్చి భజించు కిన్నరుల్
విచలితులై పరేతవిభు ♦ వీక్షణ గాంచిన జీవులం బలెన్
ప్రచురవికంపన స్థితిఁ ♦ బొల్పడు నాగులు చుట్టి నిల్వఁగన్ ౫౩౦

తే॥ దిక్కరుల గెల్చి భవ్యుఁడు ♦ తెగడు పొందఁ, వెండిమలనెత్తి స్వర్గంబు ♦ బెండువడఁగ
నింద్రుని జయించు భుజముల ♦ రుంద్రకీర్తి, తుంబురుఁడు పాడి ప్రభుని సం ♦ తుష్టిఁ బఱుప.

తే॥ వినెడి వారల కరములు ♦ వివశతి మెయి, తాళములు వేయ నారద ♦ తాపసేంద్రుఁ
డొప్పు మీఱఁగ మహతి చే ♦ నూని వాణి, విధిని వాయించి చెవులకు ♦ విందుచేయ.

ఉ॥ వారిధి నేత కల్పవిట ♦ పంబులఁ బూచిన క్రొత్తపూవులన్
దీరగు పొన్నపూలఁ గల ♦ తేనియతోడఁ బరీమళించు ప
న్నీరు గ్రహించి సుందరుల ♦ నెమ్మెయి సోఁకునోయన్న భీతితో
వారిధరాఖ్యఁ జెన్నెసఁగు ♦ భస్త్రికలం జిలికించుచుండఁగన్. ౫౩౧

చ॥ రకముగ బొమ్మిడీకములు ♦ రాచుకొనం బడు మౌక్తికావళుల్
వికసిత సూన మాలికల ♦ ప్రీలు లతాంత నికాయముల్ భువిన్
చకచక రాలు మున్నె భయ ♦ సంభ్రమముల్ మది నూల్కొనంగ జా
రుకొని సభాంతరంబును మ ♦ రుత్తుఁడు శుభ్ర మొనర్చుచుండఁగన్. ౫౩౨

తే॥ కంచుకులు పైఁడి బెత్తముల్ ♦ గలుగువారు, పలువు రందందు నిల్చిన ♦ పార్థివులకు
క్రమముగా వెండి బంగారు ♦ గద్దెలిచ్చి, శీఘ్రగతి గౌరవంబులు ♦ సేయుచుండ ౫౩౩

తే॥ రోమయుత చర్మ దుందుభి♦మ్రోఁగునపుడు, యముఁడు శూలదండాదుల♦నవలవీడి
కేల నోరుమూసికొనుచుఁ గ్రేవనొదిఁగి, నిలిచి ప్రశ్నించు కాలంబు ♦ దెలుపుచుండ.

తే॥ తావినేయి కప్పురము మ♦ర్దన మొనర్చి, సన్న ప్రత్తితో ముట్టించి♦సరసులందుఁ
దామరలు పూచినట్టి ప♦ద్ధతిగఁ జెలులు, మించి దీపపంక్తులను వె♦ల్గించుచుండ. ౫౩౭

తే॥ కల్పతరులు చింతామణి ♦ కామగవియు, నవనిధులు కోరినవి యెల్ల ♦ నవ్యములుగ
నిచ్చుచుండఁగఁ బ్రభునకు ♦ నీయఁదగిన, వేళ యెఱిఁగి సురారు ల♦ర్పించుచుండ.

తే॥ కుండలములు మున్నగు నేటి♦మండపములు, దట్టమగు కాంతు లొలయఁగాఁ♦బట్టపగలె
కాక రేయియుఁ గలదెయో♦లోకమందు, చూడుఁడనుచు సభ్యులు వా♦ర్తలాడుచుండ

తే॥ గంగ కావేరి మున్నగు ♦ సంగనాళ్లి, స్తన భరంబునఁ గౌనులు ♦ సంచలింప
నడచి కెంగేల ఋక్షుగ ♦ ణంబుఁ బోలు, కుసుమ లాజాక్షతంబులు ♦ కోరిచల్ల.

తే॥ భావరాగ తాళంబులు ♦ పరిఢవిల్లఁ, జూపరుల హృదయంబులు♦ చూఱఁ గొనుచుఁ.
గారు మొగుళులఁ గన్నమ ♦యూరమట్లు, మించి యూర్వశి సభను న♦టించుచుండ

తే॥ దుర్భర తపంబుచేతను ♦ దోర్బలమునఁ, ద్రిజగముల జయించిన దశ♦గ్రీవుఁడొప్పెఁ
గలువకనుఁలు ధనుఃవ్రుకటి♦కన్నుబొమలు, గలుగు చెలువల చూపుల♦గములయందు.

శూర్పణఖంగాంచి రక్కసులు వాపోవుట.

తే॥ తలను కేలుంచుకొని ర క్త♦ధార వలన, నిండు చనులతో ముక్కుతోఁ♦గుండలములు
లేని చెవులతోఁ గార్మొగు♦లెన్నగడియుఱుము, చొప్పునగఁ బోలు నోటితోఁ♦జుప్పనాక

ఉ॥ డాలులు చుట్టఁ బర్వ మను ♦ టంబులు మిక్కిలి రాయ రాజు లు
ద్వేలముగాఁగఁ గ్రిక్కిఱియు ♦ దీపిత కన్మ్మఖశాలఁ జేరి క
ల్లోల పయోధికై వడి వి ♦ లూన కుచశ్రవనాస యుగ్రతన్
బోలుచుఁ జేరవచ్చెను పి ♦ ఱుందన దైత్యులుగాంచి దూపిలన్. ౫౪౧

తే॥ లంకయందలి రాక్షస ♦ లలనలెల్లఁ, ముజ్జగంబుల జేనికి ♦ ముద్దు చెలెలు
ముక్కు వోఁగొట్టుకొనఁ దాల్మి♦మొనయఁగలరె?, యెదురఁగడుపుమోఁదికొనుచు♦నేడ్చి

ఉ॥ అక్కజమంది కాంచి యను ♦ రావళి మాయమతోడఁ బల్కఁగా [నాథు.
ముక్కుయుఁ దోఁపకుండుటను ♦ మూతులు జేగుఱువాఱ నూర్పుచుఁ
గక్కన మందుచుఁ మెఱయు ♦ కన్నుల నిప్పులు గ్రక్కుచీగతిఁ
అక్కిన వాఁడెవండొ గద ♦ రా? యని చేతులు నల్పుచుండఁగన్. ౫౪౨

ఉ॥ ఈగతిఁ జేసి యీల్గుటకు ♦ నెంచినవాఁడు సురేంద్రుఁడో మహా
భోగుఁడు బ్రహ్మయో హరియొ♦భర్గుఁడొ యెవ్వఁడొ యంచుఁ గొందఱుఁ

బాగుపడక మదింపలఁచు • వారలు నార్చిరు శాస్త్రవుల్ జగ
త్త్యాగము నందు లేక యిది • పోలునె యేరికి? యంచుఁ గొందఱున్. ౫౪౯

ఉ॥ రావణు చెల్లెలంచు విన • రంబుగఁ జెప్పెనె? తల్లి! మోర్వుమెం
గ్రోవము యంచుఁ బాదముల • ముట్టుట మారి యిటుట్ఁ గొనర్తురే?
యేవగ నెవ్వఁడేని యిల • నిట్టు లొనర్పఁగ సాహసించునే?
కావరమంది చేసికొనెఁ • గావలెఁ దానె యటంచుఁ గొందఱున్. ౫౪౯

ఉ॥ పాక విరోధి పేరుచెడఁ • బాదము లొత్తుచు నున్న వాఁడు ల
క్ష్మీకలితుండు దేవచెడి • క్షీరపయోధిని పవ్వళించె గా
రీకమునందు తారక గి • రిం భజియించె నిటులొనర్పవాఁ
డే కలుషాత్ముఁడో? తనకు • నెంత దిటంబొకొ? యంచుఁ గొందఱున్. ౫౫౦

ఉ॥ ఊరును పేరులేని యొక • యుక్కివుఁ డిట్టులు చేసెఁ దెంపుమెం
బేరుగలట్టి వారు పిఱు • వీఁగకొనర్తురె? అంపులాంఛి యీ
స్వైరిణి వంశకీర్తి చెడఁ • బాపిన దంచు ఖరుండె యుక్కితో
సారు చెడంగఁ గోసి యిటు•సాగఁగ నంపెనొ? యంచుఁ గొందఱున్. ౫౫౧

తే॥ తాపమునఁ గ్రుంగి పోలు త్రి • దశుల పోల్కి, దెబ్బ దినని వారలు మతి• తెరలువారు
మూఁడు జగములు నశియించు • ముప్పొనర్పఁ, దలఁచినారనికొందఱు•తలఁచినారు

ఉ॥ నూతన కల్పమింక భువి • నూల్కొను నంచుఁ దలంచికాక యీ
పాతకముం బొనర్ప మగ • వారలు పాల్పడ శక్తిమంతులే?
యాతత నిష్ఠమె వనుల • యందు తపంబొనరించు తాపస
వ్రాతము పొందు కోప దవ • భారతరస్థితి యంచుఁ గొందఱున్. ౫౫౩

## పౌరస్త్రీలు చుప్పనాకంగాంచి పలవించుట

చ॥ పలుకుచు నుండ లంకఁగల • భామలు గాజులు మ్రోయఁ బల్లవం
బులఁ దలపించు హస్తములు • పొక్కఁగ నల్పుచుఁ జేమిరిడ్డ పా
ల లలిని నిల్పు లేమిని ప్ర • లాపము లాడుచుఁ బాఱు తెంచుచున్
బెలుకుఱఁ గాంచి రే మనుభ • వించితె? యంచుఁ గవుంగిలించుచున్. ౫౫౪

తే॥ పటహ వీణా మృదంగాది • బహుళ రవము, తక్క వేఱు నినాద మెం• త్తతిని లేక
విభవముల నొప్పు లంకలో • వెక్కు గోల, నాఁడు మొదలయ్యె నాచుప్ప•నాతి కతన.

ఉ॥ మద్యము లొప్పు గిన్నియల • మధ్యమునం దిరుగాడు తుమ్మెదల్
మద్యముమీఁది డెందమొక • మార్గము పట్టఁగ దైత్యనారులా

యుద్యమముల్ త్యజించి నెఱ ♦ యోడికలంబలె నీరుగార్చి వి
ద్యుద్యుత వారిదప్రతతి ♦ యోజ నలందఱి రొక్క పెట్టునన్. ౫౫౬

తే॥ విభులపైఁ బొలయల్కలు ♦ వీడకుండు, కఠిన నెఱ్ఱఁ బాఱిన కసల్ ♦ కలఁకఁజెంది
మఱియు నెఱ్ఱనై కన్నీటి ♦ వఱద లొప్ప, శూర్పణఖ పాదములఁ బడి ♦ స్రుక్కినారు

తే॥ తమ శిఖల యందు పచ్చలు ♦ దాల్చుకరణిఁ, బోఁకమ్రాకులశిఖరముల్ ♦ పొలుచుచుండ
మణుల గొలుసుల యుయ్యెలల్ ♦ మఱలయనఁగ, చెలులు విసిగి వీథికివచ్చి ♦ చేరినారు

తే॥ ఒలయఁ బెనఁచిన విభుల బా ♦ హువుల వీడి, మీసములఁ బోలుకన్నుల ♦ మిట్టిపడెడి
ముత్తెములఁబోలు బాష్పము ♦ లొప్పరలుచుండఁ, గొందఱాయమఁగనిలోనఁ ♦ గుమిలినారు

తే॥ వైరిభీకరాయుధముల ♦ వఱలువాఁడు, భువనవిజయుండు దైత్యవి ♦ భుండు దీని
నెఱిఁగనేని జగములెల్ల ♦ నేమి యగునొ?, యనుచు నేల దొరలి చాలఁ ♦ బనవినారు.

తే॥ మధుమదంబును బోలిన ♦ మగువలెల్ల, మగల వలని సౌఖ్యంబులు ♦ మఱచి కేశ
బంధములు వ్రీల నీవులు ♦ వదల జనులు, త్రుళ్ళ నడచుచు నేడ్చిరి ♦ దొరలిరచట. ౫౬౧

తే॥ తారగిరి లీలనెత్తిన ♦ దైత్యు చెల్లె, లిట్టి గతి నొందెనే యని ♦ యేడ్చి కేశ
పాశములు వీడఁ గెంగేల ♦ వలుఁద చనుల, మీఁద మోఁదికొనిరి వంత ♦ మీటుచుండ.

ఉ॥ రావణ పాలితం బయిన ♦ రాజ్యమునందు మృగంబులేని ము
న్నెవగఁ జింత నొంద విటు ♦ లేర్పడె నేఁడిఁక నేమి యబ్బునో?
పైఁబడి పోయెఁ గీరుతులు ♦ బాధలు నొందఁగ నుంటి మంచు నే
త్రావిల బాష్ప పూర్ణలయి ♦ యంగదలం బడి నొచ్చుచుండఁగన్. ౫౬౩

శూర్పణఖ రావణుతో మొఱయిడుట

తే॥ పలువిధంబుల లంకలోఁ ♦ బౌరు లడల, సభను నిల్చిన వారును ♦ జాఱఁ దలఁపఁ
గొండక్రిందఁ జేరిన కాఱ్మొ ♦ గులు విధమున, నంగనాచి రావణు చర ♦ ణముల వ్రాలె.

కం॥ కులగిరులు గదలె శేషుఁడు, తలలను వంచెను తమంబు ♦ దశదిశ లలమెన్
దలఁకుచు రవియుం బఱచెను, తలరేన్ దిక్కరులు తలలు ♦ దాఁచి రమరులున్. ౫౬౫

ఉ॥ అంగదముల్ చెలంగెడి భు ♦ జార్గళముల్ వడిబూరటిల్లఁ బై
నంగడి జ్వాలలం గురియు ♦ చక్షుల చెంగట వక్రదంష్ట్రముల్
వంగి రహింపఁగా భ్రుకుటి ♦ ఫాలము దాఁకఁగఁ జూచు రావణున్
ముంగలఁగాంచి సేవల న ♦ మున్నతిఁ జేయఁగ జంకిరెల్లరున్ ౫౬౬

చ॥ పితృపతితోడ వేలుపులు ♦ భీకరవృత్తినిగాంచి నేఁడు దు
ర్గతి మనకో ఘటిల్లెనొ ♦ యంగద యుంచుఁ దపించి జీవనం

తతులను నేహాలల్ విలుక ♦ వచ్చినదంకనుమనంద భూజనుల్
మతిచెడి యేమిదో తెన్నుఁ బరిణమించునొకో యని తూలుచుండఁగన్. ౫౬౭

ఉ॥ మూసిన మానసాంబరల ♦ మమ్మునరమై నోగ్రమ్మ రోమనుల్
వీనములంగ నగుచుప్పగోన ♦ వెక్కలి యూర్చుచు నొడునొక్కి వెఱ
రోసముతోడ నందరును ♦ రోచులు పెక్కులంచుమాఱ మేఘుగ
స్థానము వాక్యులంగోసి ♦ రావణుఁ డెవ్వరి చేష్టయిద్దినాన్. ౫౬౮

చ॥ అవనిని గాచువారు కసు ♦ మూసునిని పోలినవారు భూమిపై
దివసము నాగలోకముల ♦ దేహముఁగల్గిన వారిలోన నీ
డెవరును లేనివారలు న ♦ రేంద్రులు కానరు వచ్చి క త్తితోఁ
దివ్రచుచు నెన్నికాము భవ ♦ దీయ యశంబును గోసి రుద్ధతిన్. ౫౬౯

చ॥ సహజులోనర్చిరం చనుర ♦ మూనిని పల్కఁగ విట్టునవ్వి యే
మని వచియించితే యని వ ♦ శాస్యుఁడు కన్నుల నిప్పులుర్లఁగా
ఘనగిగనుంగొంచు నల్పులగు ♦ మేదినివారలఁగూర్చి నీవు ప
ల్కనవెటులాలా? యసంగతము ♦ గ్రొచ్చక సత్యమునే వచింపుమా! ౫౭౦

చ॥ అని దనుజేంద్రుఁడాడఁ జెలి ♦ యాల్ వచియించును మూరుఁబోలువా
రును పృథబాహునత్త్వముగఁ ♦ గ్రుంగగ మేరువు నూడ్వఁజాలువా
రని పలుకంగనేల? విలు ♦ నమ్ములచే క్షణమాత్రలోన నీ
వనజ భవాండమెల్ల సుల ♦ భంబున బూదియొనర్ప నేర్పరుల్ ౫౭౧

చ॥ మునుల యెడఁగ విధేయులు ప్ర ♦ పూర్ణనిశాకరు వంటి కాంతి మం
డన ముఖు లుల్లసిల్లు నలి ♦ నంబులఁబోలిన నేత్రయుగ్మముం
దనరినవారు కోమల ప ♦ దంబులు చేతులు గల్గువారు న
న్మని జనులందు వారికి స ♦ ముల్ గలరే త్రిజగంబు లారయన్? ౫౭౨

ఉ॥ నారలు దాల్చినారు చర ♦ ణంబులఁ బెండరముల్గలారు వి
ల్వీరులు జన్నిదంబు దగి ♦ లించినవారలు సత్యవాక్యులుగ
శూరులు సీకు లోఁబడరు ♦ చూడ నినుం దృణలీలనెంచు వా
ర్ధీరులు శాస్త్రమట్లు తుది ♦ తేలని యక్షయ తూణధారులున్. ౫౭౩

ఉ॥ వారలఁ జేరి మౌని జన ♦ వర్యులు రాక్షసబాధమున్గి యు
న్నారము ధీంద్రియ ప్రకట ♦ నంబగు జ్ఞానములేనివారమై
నారము కావరే యనుడు ♦ నాకసిరోధులఁద్రుంచి భూమి ను
ద్ధారణ సేయువారమని ♦ దారుణమైన ప్రతిజ్ఞ చేసిరిగ. ౫౭౪

మ॥ ఒకచో నిద్దఱు మారులీ భువనమం ♦ దున్నారు సత్యంబు వా
రికి విల్విద్దెను మించు వారలు గలా ♦ రే యన్నిలోకాల? వా
రికి నీడై తగు వారలుం గలుగరీ ♦ పృథ్వీతలంబందు వా
రొకరొక్కం డె త్రిమూర్తి సన్నిభు లహో ♦ యుద్ధక్రియా పారగుల్.

తే॥ ధరణి యెల్ల నేకచ్ఛత్ర ♦ సరణినేలు, ధర్మపరతంత్రు దశరథు ♦ తనయులైన
వారు నిర్లోపులగు వారు ♦ ప్రభునియాజ్ఞ, గాన నున్నారు రామ ల ♦ క్ష్మణులనంగ.

చ॥ చెలియలి నాసికన్ దునియఁ ♦ జేసిన వారు నరుల్ సజీవులై
వెలయుచు నున్న వార లట ♦ విన్ మఱియేటికి నేను గల్గియా
తులువలు తెంపుమై వనులఁ ♦ దోఁచుచునుండఁగ సిగ్గువీడి యి
య్యల మనినాఁడ నంచు దను ♦ జేంద్రుఁడు మండె మనంబులోపలన్. ౫౮౮

చ॥ పెలుకుఱ లోకముల్ గెలిచి ♦ భీకర తేజుఁడనై సమస్తముల్
బొలుపుగ నేలు నాకుఁ దుదిఁ ♦ బొందిక నబ్బె నపాఖ్య కీర్తికిం
జెలువగు స్తోత్రపాఠములు ♦ చిచ్చున మాడ్చితి లోకమంతటన్
గలిగినవీ కులం దునిమి ♦ కాల్చిన నీ యపకీర్తి మాయునే? ౫౮౯

ఉ॥ శాశ్వతనింద నా కునుపఁ జాలిన మానవు లుండిరంట! నా
కీశ్వరుఁడిచ్చు కైదు వొక ♦ టిచ్చినదంట! నరుల్ సజీవులై
నశ్వర మొంద కుండిరఁట! ♦ నాకును వింశతిబాహులుండె నీ
విశ్వమునందు నేను నను ♦ బృందముతోడుత నుంటిఁ జెల్లరే!

మ॥ మనసా! మాయని క్రొత్తనింద మన వం ♦ శంబందుఁ బ్రాప్తించెనే
యని లజ్జంబడి కుందు టేల? యవదూ ♦ అత్యంతముల్ మోవఁజా
లిన కేలుం దల లిర్వదిం బదియు నో ♦ లిం దార్ఢ్యస త్త్వంబుతో
డనె యొప్పారెడిఁ గ్లేశమందకుము హ్రా ♦ ష్టస్థైర్యముల్ పొందుమా. ౫౯౦

చ॥ అని వికటంబుగా నగి న ♦ హాయబలంబులు లేని యిద్దఱి
ట్లనువుగఁ గానయందె నడ ♦ యాడ ఖరాదులు శౌర్యమానవ
ద్దనుజులు వారిఁబట్టికొని ♦ దారుణభంగిని చీల్చిమ్రింగ కి
ట్లనువు పడంగ వీడిరొకో? ♦ యన్నఁదదగ్రజుఁ గాంచి ఖిన్నయై. ౫౯౧

తే॥ కనుల బాష్పప్రవాహముల్ ♦ గ్రార్చునదియు, వక్షముం బాఁదుకొనునది ♦ వసుధఁబొరలు
నదియు నగు శూర్పణఖ నెత్తి ♦ యందుచేతు, లుగుచుకొని వారలేద్వ వం ♦ చించెనిట్లు.

ఉ॥ నాయవమానముల్ దనుజ ♦ నాయకు లెల్లరుఁ గాంచి క్రుద్ధులై
ఘోయయనీకులం ధనుమ ♦ నప్పుడ సాయుధులై ఖరాది నం

స్థేయులు వచ్చిచుట్టి సర ♦ సీజదశాక్షుని యొంటి వింటిచే
నాయమరావతిఁ గదిసి ♦ రక్కట! యొక్కముహూర్తవేళలోన్. ౫౨౩

ఉ॥ వ్యూహబలంబుచే నడరి ♦ యుర్వరఁగెల్చిన దైత్యసైన్యసం
దోహముతోడ నాఖరుఁడు ♦ దూషణుఁడుర్వ త్రిశిరుండు దోస్సమి
ద్ద్రోహులు లోకకంటకులు ♦ దోర్మలసంపదచే నశించి ర
య్యాహవమంద యన్న విను ♦ యంబునకైదుడుపుం జెమర్పఁగన్. ౫౨౪

చ॥ కలిగిన కోపచింతలు వి ♦ కావిక సేయుచు వహ్నివర్ధిలన్
జలికినసేయిపోలెఁగడుఁ ♦ జేఁదలఁ వృద్ధియొనర్ప వార లి
ట్లలుకను నీదు ముక్కుమొద ♦ లంటఁగఁ గోయఁగ నీవు వారికిన్
జలిపిన నేరమేమి? యది ♦ చయ్యనఁ దెల్పుమ యన్న నామెయున్. ౫౨౫

శూర్పణఖ సీత చెలువమును ప్రశంసించుట.

మత్త॥ వేరిచేతను వ్రాసి చూపఁగ ♦ వీలుకాని వరాంగుతో
సారసంబును వీడి వచ్చుచు ♦ శంపనుండియొ కౌను బం
గారు నుండి శరీరముం బథ ♦ కంబుగా గ్రహియించి యా
కారు కానను చేరు కామిని ♦ కై జనించెను నావుడున్. ౫౨౬

మత్త॥ రామ యెవ్వరి కాంత యంచును ♦ రావణుం డను నంతలో
నామె యిట్లనుఁ బల్కుమాటల ♦ నార నారసి చూచు కో
మ్మామనోహరి గబ్బిగుబ్బలు ♦ హాటకోఖలు పాదముల్
భూమి నోచిన భాగధేయము ♦ ముగ్ధనామము సీతయా ౫౨౭

చ॥ భ్రమరుల గీతముల్ తెలిమ ♦ రందముఁ బోలిన తీయనైన వా
క్యములు సుగంధకేశములు ♦ గల్గి సురాదులు సంస్తుతించు చం
దముగల లక్ష్మియుం దన యు ♦ దాత్తతకుం దగు చేటి కాదనన్
బ్రమదమనోజ్ఞకత్వములు ♦ పల్కెడ నంటయు మాధ్యమే యగున్. ౫౨౮

సీ॥ వ్రాలిన కేశముల్ ♦ వర్షధారలఁబోలు, మృదు పదంబులు ప్రత్తి ♦ క్రియనుపోలు
వ్రేళులు మేలైన ♦ విద్రుమంబులఁబోలు, సొగసైన వాక్కులు ♦ సుధనుపోలు
వదనం బలోపమా ♦ పద్మంబుఁ బోలును, కడలికంఠెను మించి ♦ కనులు వెలయు
కందర్పుఁ డామెను ♦ కాంచి తపించి ని, క్కచ్చిగా మాటాడఁ ♦ గడఁగియె చుమి

తే॥ దీర్ఘరోగవ్యథను పొంది ♦ దినదినమ్ముఁ, గార్శ్యముంబొంది సఫలతఁ ♦ గాంచలేనికి
మాఁడి మసియయి తుది రూపు ♦ మాసెఁగాక, హరునికంటిమంటనశించె ♦ ననుటకల్ల.

చ॥ పగఱు వసించు స్వర్గమును ♦ బాగుగాఁ జూడు ఫణామణిచ్ఛటల్
జిగిగల నాగలోకమును ♦ చేరికఁ గాంచుము కంధి మేఖలా
జగముఁ బరీక్ష సేయు మెటఁ ♦ జక్కనఁ గన్నను గాంచలేవ య
మ్మగువ ధరిత్రిలోనిదె సు ♦ మా నిరీక్షింప నశక్యమే యగున్. ౫౯౦

చ॥ భుజములఁ గూర్చి పల్కుదున? ♦ మోమును కన్నులఁ బల్కరింతునా?
నిజముగ సారె గుబ్బలన ♦ నీటగు చన్నులనే వచింతునా?
గుజగుజ నాడు కొట్టుకొని ♦ కొంకుచు నూరక యుంటగాక ప
ల్కఁ జనదు రేపె కాంచెదవు ♦ గాని మఱొక్కటి విన్మ పల్కెదన్. ౫౯౧

సీ॥ బొమలు శరాసన ♦ మ్మును పోలు నన్నను, కనులు కుంతంబుల ♦ నెనయు ననిన
దంతముల్ ముత్యాల ♦ బంతిఁ జెనయు నన్న, విద్రుమంబుల నేలుఁ ♦ బెదవులనినఁ
దొడ లంటి కంబాల ♦ దొరయున వన్నను, కమఠంబువంటి మీఁ ♦ గాళ్ళులనిన
ముక్కుచందము నువ్వుఁ ♦ బువు సరి యాననఁ, గంఠంబు సొగసైన ♦ కంబువన్న
తే॥ పలుకు సరిపోలుఁగాని త ♦ ద్వస్తుతత్త్వ, మెన్న సరిపోవునే? వరి ♦ తృణముఁ బోలు
ననుట పొసఁగునె? యుపమ♦లయ్యనుపమాంగి, కెచటదొరకును దైత్యక♦లేశ చెపుమ

తే॥ ఇంద్రుఁ డింద్రాణిఁ బడసె మ♦హేశుఁ డుమను,పడసెహరియు రమాసతిఁ♦బడసె సీత
నీవుఁబడసితి వారికి - నేడ సుఖము,నీకసుఖము నిజంబుగ♦ నిర్జరారి! ౫౯౩

తే॥ ఒకఁడుసామేననుంచెవే♦ఱొకఁడురమున, నుంచె మఱొకఁడాస్యంబున♦నుంచుకొనియె
నీవు సౌందర్య♦సదనయా♦నెలఁతఁగొన్న, నెచట నుంచి సుఖింతువో♦యెఱుఁగరాదు.

చ॥ తరుణిని నీవు గాంచిన ప ♦ దంపడి నేలను నిల్వఁబోవు నీ
యురవగు నెల్ల సంపదల ♦ నుగ్మలికై విడువంగలాఁడ వె
ల్లర కగు మేలు నీకమర ♦ లాభము నేఁగలిగింతుఁగాని నీ
గరితలకున్ సుదుఃఖ తతి ♦ గల్గఁగఁజేయుదుఁగాదె చూడఁగన్. ౫౯౪

ఉ॥ వేలుపు లోకమందు పృథి ♦ వీ తలమందును కల్గుస్త్రీల గ
ర్భాల జనించినట్టి జవ ♦ రాలదిగాదు సురాసురుల్ మహా
భీలముగాఁగఁ జిల్కుతఱి - ద్వీపవతీపతి పంకజాసనున్
శ్రీలఁగఁ జక్కిచ్చెనని ♦ భూమియు దీని నొసంగె స్పర్ధమై. ౫౯౫

ఉ॥ అంబుధి మేఖలా జనము ♦ లౌననఁ దుమ్మెదలాడు క్రొమ్ముడిం
డంబుగఁ గల్గు రాఘవు ప ♦ డంతుక యున్ హరిణంబుతోడ నీ
వింబుగ నాడు మేను కసి ♦ యేదగ నాడఁగ నీదు ఖడ్గ స
త్త్వంబు జగంబెఱుంగ నిన ♦ వంశ్యుని నాకు నొసంగుమా రహిన్. ౫౯౬

చ॥ తపసులు చేసియున్ విధిని ♦ దాటఁగ లేరు లభించు వేళ ల
భ్య పడు సమస్తమున్ దొరకు ♦ నవ్వి లభింపని వేళలందు ల
భ్యపడవు చేతు లిర్వదియు ♦ నాస్యములున్ బడి హీనపూరుషం
బు పడసినట్టి భాగ్యమును ♦ పొందుట నీ వికమీఁదనే సుమీ. ౫౮

ఉ॥ సీతను గొంచు నీకడను ♦ చేర్పఁ దలంచియె పట్టఁబోవ దు
ర్జాతుఁడు లక్ష్మణుం డకట! సంభ్రమ మందుచు నడ్డువచ్చి వే
వే తొలి ముక్కుఁగోసె మను ♦ వే చెడిపోయెను నీకుఁ దెల్పి త
ర్వాతనె ప్రాణము ల్వదల ♦ భావన చేసితి నన్న! నావుడున్. ౫౯

రావణుఁడు సీతచందమువిని విరాళిచేఁ బరితపించుట.

సీ॥ కోపంబు వీర్యంబు ♦ గురుతరమానంబు, బలిసిన నెంజిలి - బలమువలనఁ
బాపంబు పండు తా ♦ వలమున సంపదల్, తొలఁగిన కరణిని ♦ తొలఁగిపోయె
దీపంబు మఱియొక ♦ దీపంబుతోఁ జేరు, నపుడుండు రీతిగా ♦ నాదలోని
తాపంబు కామంబు ♦ తనరనొక్కటియయి, ప్రాణంబునంద యై ♦ ప్వారఁ గలిసె
తే॥ ధరణిజాతను మఱవని దైత్యరాజు, ఖరుని మఱచెఁ జెల్లెలి ముక్కు ♦ తఱఁగినట్టి
నృపుల బలమును మఱచెను♦నింపమఱచెఁ, బ్రసవశరునిచేఁ పూర్వశా♦పమునుమఱచె

చ॥ జనకజ నామమున్ మనముఁ ♦ జక్కన నొక్కటియై లయించు నా
వెనుక నొకం డొకళ్లు విడి ♦ వేఱొక దానిఁ దలంప వేఱుగా
మనమొకఁడుండునే? మఱచు ♦ మార్గమిఁకెయ్యది? పండితాళికేన్
మనము నడంచు జ్ఞానమది ♦ మ్రాఁడగఁ గాము జయింప శక్యమే? ౬౧

క॥ లంకాధిపతి మయూర వి, శంకట గమనన్ మహీజ ♦ సాధింపక పు
న్నంకిలి పడు నెడఁదఁ గడున్, సంకట పడి యెండ వెన్న ♦ చందంబందెన్. ౬౨

చ॥ తనవిధి బల్మిచే జరుగఁ ♦ దగ్గ పరిస్థితిచేత లంకకుం
బనుపడు చేటుచే మతి య ♦ వారణ సంభ్రమ మొందుచుంటచేఁ
జెఁకీన దొడ్డ కామ రుజ ♦ చెల్లఁబఱింపని మూర్ఖుఁ డజ్ఞతం
బొనరుచు చెట్ట కై వడినె ♦ పూవులు పండులు గాఁగ వర్ధిలెన్. ౬౩

ఉ॥ బంగరుబొమ్మ సీతఁ దన ♦ భావమునం జొరనిచ్చు త్రోవచే
బంగిని ద్రావు వానిక్రియ ♦ భ్రాంతిని మై వివశత్వ మొందుటన్
రంగుగఁ గాంచి మారుఁడు శ ♦ రంబుల నొంప సమర్థుఁడయ్యె వా
నిం గొను కామభావనవె ♦ నిల్చె బలంబు కుదించు శక్తియున్. ౬౪

చ॥ కొలువును వీడె రావణుఁడు ♦ కూరిమి దీవనలిచ్చినారు పె
ద్దలు చెల్లువల్ సుమంబులను ♦ దండడెఁ జల్లిరి శంఖ దుందుభుల్

చెలఁగె సభాసదుల్ చనిరి ♦ చెడ్డ మనంబు తపించి తొందరం
జలుపఁగ హేమరత్నమయ ♦ సౌధముఁ జేరె సురారి చింతమై. ౬౦౫

మ॥ సుమతల్పంబులఁ జేరకే సతులపైఁ ♦ జూడ్కిం బ్రసారింపకే
ప్రమదారత్నము లుల్లసిల్లి పలుకం - బల్కింపకే యొంటిమైఁ
దమి నొండొక్కట నిల్చి సీతపయిఁ జి ♦ త్తంబుంచి తా విన్నత
ద్రమణీయాంగములన్ స్మరించె మది సం ♦ తాపంబు పెంపొందఁగన్.

మ॥ తొలఁగింపఁగ నశక్యమా తమి మదిం ♦ ద్రొక్కాడి యుబ్బూఁతగాఁ
గలఁగింపఁగఁ బరిమళ ప్రసవ సం ♦ ఘాత ప్రకీర్ణస్ఫుర
త్తలిమం బందలి పూలువాడి యొసలుం ♦ దప్తంబుగాఁ జిత్తమున్
మలఁగం బ్రాణము తల్లడిల్ల మఱిఁగెన్ ♦ మారప్రహారంబులన్. ౬౦౭

ఉ॥ చల్లని గందముం గినల ♦ సౌరభ పుష్పములన్ వెలందుకల్
మెల్లనఁ గొంచుఁ దేర నవి ♦ మించిన నిప్పగు మందుచే నొడల్
తల్లడ మందు రీతిఁ గడుఁ ♦ దాపముఁ గూర్పఁగఁ గొల్మిగుంట రా
జిల్లెడు నగ్నినా మిడుఁగు ♦ చిందఁగ నూర్చుచు నుమ్మలించుచున్. ౬౦౮

చ॥ మునుపు మనంబు నెమ్మదిని ♦ పొందిన రావణుఁడిప్పు పాపమున్
దనికెడు నిందయుం బగయుఁ ♦ దా మది నెంచక యబ్ధికుంత మా
ర్గణ వారిణోత్పలంబుల ఘరా ♦ రంగు జయించిన కన్నులొప్పు నా
జనకజఁ గాంచఁ గోరి తమిఁ ♦ జాలఁ దపించె మనోజవేదనన్. ౬౦౯

తే॥ దిగ్గజంబుల నొంచిన ♦ ధీరుఁడపుడు, తరువులం దొలిచెడు బెండు ♦ పురువులీలఁ గంతు తూఁపులు తనదు వ ♦ క్షంబుఁ దొలువఁ, గుంది సోలి కుమారిలి ♦ క్రుంగి కూలె.

తే॥ ప్రసవముల తోడి లేఁగొమ్మ ♦ వంటిదొకతె, వచ్చిమదిఁ జేరెనని భ్రమ ♦ పడెడియసుర వరుఁడు మరు నమ్ముపలె నెద ♦ వ్రయ్యసోఁకు, మలయ పవనునిపైఁ జాల ♦ మండిపడును.

తే॥ పొక్కిపొరలి కర్తవ్యతా ♦ మూఢుఁడైన, రావణుఁడు లేచి వడిఁ బలు ♦ రకములైన వీణలను కేరు పలుకుల ♦ వెలఁదులెదుర, దీపికలు గొని రా నొక ♦ తోఁపుఁ జేరె. ౬౧౨

సీ॥ మావిచెట్లకు హీర ♦ మణులు పనసలకు, మాణిక్యములు పోక ♦ మ్రాఁకులకును
నీలముల్ కురువింద ♦ మోవి సాలములకు, గోఁగుల కరవింద ♦ రాగమణులు
నరఁటి కంబములకు ♦ మరకత రత్నంబు, లేపి భూజములకు ♦ హేమరాశి
పాటల తరులకుఁ ♦ బగడముల్ పున్నాగ, ములకును శశికాంత ♦ ములును నారి

తే॥ కేళములకు వెండిని పోల్పఁ ♦ దేలుఫలము, గల చెలిమిన్నంటఁ బెరిఁగి పూ ♦ వులకు బ్రక్క రిక్కలక్కు వేల్మి గనరాక ♦ నిక్కియున్న, వనముపం దొక శయ్యపై ♦ వంతఁ జేరె. ౬౧౩

## రావణుని విరహతాపము.

మ॥ ఫల పుష్పంబులనుండి వచ్చు మధువుల్ ♦ పాటంబుగాఁ ద్రావు చె
ల్వలు పైకంబులు ఝంకరంబులును చి ♦ ల్కల్ పిచ్చుకల్ శారికల్
పలుకుల్ రజ్జులు మాని దానవ జగ ♦ త్ప్రఖ్యాత వీరప్రభుం
డలుకం బూనునో యంచు మూఁగల క్రియన్ ♦ వ్యాపారముల్ సేయఁగన్.

చ॥ శిశిరముచేత గాలియును ♦ జిల్లను మంచును గూడి మెల్లఁ బం
చశరుని తూపులుచ్చి యెడ ♦ సందులఁదూఱఁగఁ గాలుసేతులుం
బ్రశమన మింతలేక సభు ♦ వం దొడఁగన్ 'ఋతునెద్దిరా' యనన్
శిశిరము వోయె భీతిమెయిఁ ♦ జెచ్చెర వేసవి వచ్చెఁ జిచ్చునాన్. ౬౧౫

ఉ॥ లావగు పెద్ద మ్రాఁకులు శి ♦ లాతలముల్ గిరులున్ హిమస్థలుల్
ప్రోవుగ మండిపోయెననఁ ♦ బోడిమి వేసఁగి వేడి యిట్టిదం
చేవిధిఁ బల్కఁ శక్యమగు? ♦ నిట్టలపు న్వలపన్విషంబునే
త్రావిన మందులుం గలవె? ♦ తాఁకె నెడంద సుఖంబు దుఃఖముల్. ౬౧౬

చ॥ అతని మదిం జనించిన స్మ ♦ రాగ్ని దిగంతము దాఁకఁ గాల్పఁగా
వెతల భజించి యెండయును ♦ వేదన గూర్చెను దీనిఁ దోలి మున్
ఋతువునె దెండియన్న నది ♦ యే డ్తెఱ రా నోడలుం దపింప నీ
ఋతువును కాల్చుచున్నదిది ♦ యెప్పటిదే యని చీఁపటంగొనన్. ౬౧౭

తే॥ దైత్యచంద్ర! మీయాజ్ఞను ♦ తప్పినడవ, ఋతువులెల్లను భయపడి ♦కొంతుకుననుడు
ఋతువులెవ్వియుఁ బనికిరా ♦ విచటనాకుఁ, దఱిమి వేయుఁడీభటులార! త్వరగననియె.

చ॥ వలదను నంతలోనె ఋతు ♦ వర్గము ధర్మములెల్లఁ దప్పి యో
గులవలె సర్వసంగములు ♦ గొబ్బున వీడెను దేశమంతయున్
బలుపగు రోగముల్ జనన ♦ బంధము వీడి తపస్వి పొందునాఁ
కలియును దప్పిలేని దివి ♦ కై వడి దోఁచె మనంబులోపలన్. ౬౧౯

చ॥ ధరణిని వేఁడియుం జలియుఁ ♦ దగ్గ దశాస్యు శరీరమెల్ల దు
ర్భరముగ నేయిలేక ప్రఖ ♦ రంబుగ మండెడు వహ్నిభంగి నో
త్తరముగ మండెఁ గాలమది ♦ తార్చునదొక్కటియా? స్మరాగ్ని ము
మ్మరమగు మంట జ్ఞానమున ♦ మాయును గాకొక దానసానా కో?

ఉ॥ ప్రశ్చిన మబ్బు నాఁ దసరు ♦ రావణుఁ డప్డు బిసంబులన్ రసం
బబ్బిన పూలమాలల హి ♦ మాంబువు చల్లిన లేజివ్రళ్లతో
జొబ్బిలు చందనంబు నిడి ♦ చూచియు నోర్వక మేలు గోరువా
రుబ్బున గొబ్బునం బఱచి ♦ యోషధి నాథుని పట్టితెండనన్, ౬౨౧

చ॥ అలుకయొ శీలమై తగు ద ♦ శాస్యు పురంబు పయిన్ భయంబునం
బొలయక యవ్వలం దొలఁగి ♦ పోవు నిశాకరుఁ గాంచి రక్కసుల్
పిలుచుచు నున్నవాఁ డసుర ♦ వీర వరేణ్యుఁడు రావణుండు నీ
వలుకక రమ్ము లెమ్మన హృ ♦ దబ్జము ఝల్లన లేచె మెల్లనన్. ౬౨౨

శా॥ శంకం బొందుచు వెన్నెలల్ పరవ నా ♦ సంద్రంబుపై నిల్చి తా
సంకోచించుచు గుంద్రఁడనన్ వదలి మున్ ♦ శాత్రవ్యుచే నొచ్చువాఁ
డంకాపాంకముతోడఁ దగ్గ యదనఁ ♦ దంకించు చందాన నే
ణాంకుం డప్పుడు దోఁచె రావణునకున్ ♦ యామ్యేశు తోయంబునన్. ౬౨౩

ఉ॥ అంబరవీథి వచ్చి కిర ♦ ణావళి పర్వఁగఁ జంద్రుఁడొప్పె మో
హాంబుధి మున్గ నాతఁడు శ ♦ శాంకుని దూషణసేయుచుండ శ్రీ
రాంబుధిఁ బవ్వళించిన ము ♦ రారి తటిం బరికించి దైత్యరా
డ్డంబర జీవము ల్గొనఁ గ ♦ డంగి విధించు సుదర్శనం బనన్. ౬౨౪

మ॥ తన పుట్టింటనె చెంతనుండు సుధ మో ♦ దం బారఁగాఁ ద్రావి చ
ల్లన వ్యాపించిన చంద్రువెన్నెలలు, క ♦ ల్కం బాఱి రక్తాక్షుఁడై
జనిత భ్రూకుటి ఫాలభాగుఁడగు దో ♦ షాచార భూజానికిన్
దనరెన్ వహ్నిఁ గరంగు వెండిఁబయిఁ జిం ♦ దం బోయు చందంబునన్.

శా॥ భూరిప్రాభవమై రమాలలితమై ♦ పుణ్యంబు నిండారు క్షే
దార శ్రీమిథిలేశు నల్లుఁడగు సీ ♦ తానాథు సౌందర్య పా
థోరాశిన్ వినినంతనే కడచె సం ♦ తోషంబు మాఁడించె ర
క్షోరాట్చ్చంద్రము నద్ది మానితు రిపు ♦ శ్లోకంబు చందంబునన్. ౬౨౬

ఉ॥ శూరులు ధర్మరాజు మది ♦ స్రుక్కఁ దపింపఁగఁ జేయు రావణుం
డారభటించి నా తెలఁపు ♦ నారసి చల్లని చంద్రుఁ డెమ్మనన్
గ్రూరవిషంబు గ్రక్కు పెను ♦ కోఱలఁ గల్గిన త్రాఁచువంటి యీ
సూరుని దోడితెచ్చిన ప ♦ సుల్ బలుశుంఠలు వారలేరనన్. ౬౨౭

ఉ॥ సేవకు లంగముల్ ప్రిదిలి ♦ శీర్ణతనొంద వడంకుచుం బ్రభూ!
దేవరయాజ్ఞ లేని యొకరుఁ ♦ డెచ్చట పల్కఁగఁ బోలునేమి? రా
జీవ హితుండు తేరిపయిఁ ♦ జెందక రాఁడిటు క్రూరచేష్టలన్
మైవడి నేఁచు నాతఁడు వి ♦ మానయుతుండగు చంద్రుఁడే యనన్. ౬౨౮

చ॥ పరిణతి నీరసంబయిన - భామలపొందున కిచ్చగించి సం
బరపడు కోడెకాండ్రు వల ♦ వంతల నొందు మనోగదంబు నె

స్ఫురదుగ్ర గానఁట్టి సుర ♦ వైరి కులేశుఁడు కాల్చుచుండు నై
ఖరికి గ్రహించి శీతకరుఁ ♦ గాంచి దశాస్యమతి తోఁప నిట్లనున్. ౬౨౯

శా॥ నక్షత్రేశ! కృశించితేమి? కడు నె ♦ వ్వం బోయి యున్నాఁడ వీ
పక్షీణవ్యథ వొందెదే? మఱిఁగెదే? ♦ యంగంబు కందయ్యె మీ
నాక్షిన్ సీతను నన్ను బోలె గని యు ♦ ట్లాదన్ మదిం బొందితే?
యాకాంక్షింపక నన్ను గావ నెవర ♦ య్యా! యున్నవా రీయిలన్?. ౬౩౦

మ॥ విరహాంబోధిని బుద్ధిచే నణఁచు న ♦ ద్విద్వాంసులుం గల్గరే?
కోరరయ న్నాదగు జీవహాళికిని మృ ♦ త్యుప్రాయమై యున్న యా
కరుణాకై రవయుక్త పద్మమునకుం ♦ దక్ష్యంబుగా నోడి యి
స్థిరమున్ బొంది కృశింప గెల్పు గొనదే ♦ యీమీఁద? జైవాతృకా! ౬౩౧

తే॥ అనుచు నలఁతనుఁ బొంది రే♦యి నెరశాంకుఁ, బోలఁచి పగలును ప్రొద్దును♦కలుగుఁ గాక
యనిన యంత నె రేయియుఁ♦ హారియుఁ బోలఁగె, పగలు సూర్యుండుఁ దోఁచిర♦ప్పట్టునందు

మ॥ క్రతుకుండంబునఁ బోయు నేయివలె బం ♦ గారంపుఁదీవల్వలెన్
తత ఖద్యోత మయూఖము ల్పురవఁ బ ♦ ద్మంబుల్ ప్రకాశించెఁ ద
త్క్రతుకుండాగ్నిని పోలి కల్వలు మహా ♦ ద్రవ్యంబులం బొందియు
ద్ధతిఁ గొన్నాళ్ల కెరిక్తుఁడై వెడఁగు చం ♦ దంబం దె నప్పట్టునన్. ౬౩౩

చ॥ ప్రతత మయూఖ భూషణుఁడు ♦ పద్మహితుండొక ప్రక్క లేవఁగా
మతి బిడియంబు నూని జిగి ♦ మాసి వడంకుచుఁ గ్రుంకె యామినీ
పతి యొకవంక యామినియుఁ ♦ బజ్జనె యేగెను సార్వభౌము నా
నతిఁ జరియించు చిన్న నర ♦ నాథుని చందము నొందియయ్యెడన్. ౬౩౪

తే॥ రాక్షస స్త్రీలు రేయి భ ♦ ర్తలను చేరి, పొలయలుక వీడి పువ్వు శ♦య్యలఁ బరుండి
కలల యందును కౌఁగిలి ♦ కడపకుండి, త్వరితగతి రేయి పోవుట ♦ యెఱుఁగరైరి.

తే॥ తెల్లవాఱిన నడురేయి ♦ వల్లభులును, తొలఁగిచనఁ దృప్తినొందని ♦ చెలువలపుడు
విరియు కలువలు తేనెను ♦ వెలుచు రీతి, బాష్పములు గార్చిరా రేయి♦పగ లెఱుగుట.

క॥ కొందఱు శయ్యలపైఁ దరు, బృందముఁ జుట్టిన ప్రవాళ ♦ వీరుధములన్
గ్రొందలిరు చేతులన్ మగ, లం దగిలిచికొంచు నిద్ర ♦ లం బడి రచటన్। ౬౩౫

తే॥ కల్లు కడవల మూఁగిన♦గండుఁదేంట్లు, నడికి రేయి వింతగఁ బ్రొద్దు♦ పొడుచు టెఱుఁగ
కుండ నిద్రించె మత్తవే♦ దండచయము, త్రాగుఁబోతుల కరణి ని♦ద్రాళులయ్యె.

తే॥ కలఁగుచుండు ప్రోషిత భర్తృ♦కల మొగంబు, వోలె దీపంబు లన్నియు♦నోలిమండు
చుండి తైలంబు కొఱఁతలే♦ కుండియు జిగి, తగ్గి వెలవెల వాఱుచుఁ♦ గగ్గుచుండె.

తే॥ వేకువను వికసించెడు ♦ విరిదళములు, ప్రొద్దు పుట్టియు విప్పను - పొందకుండె
సెజ్జలందు నిద్రించెడు - చెలుల నేత్ర, పద్మములు వికాసములేక - పరఁగు పగిది. ౬౪౦

తే॥ పవటియందును నిద్రింపఁ - దివురువారు, కనులఁ దెఱవరు గావునఁ - గళుకుఁగనులు
విచ్చుమిడని లోభుల యింటి-వీదితలుపు, లెపుడుమూయఁ బడెడు తీరు-నెనసియుండె

తే॥ ఒక్క రేయి యెల్ల వియోగ-మోర్వరాక, వంత గుందు జక్కవలు రా-వణుని కరుణ
నంతరమున సుఖించు భా-గ్యంబు నొంది, చెఱను విడివడు నరులట్లు - చెలఁగుచుండె

తే॥ నడుమనేర్పడు నాజ్ఞచే - నాఁడు విధుఁడు, తొలఁగ వికసింప కుండెడు-తొగలఁజేరి
యళులు గౌరవకార్యముల్-సలుపకుండు, ధనులఁ జేరు గాయకు లట్లు-దైన్యమొందె

తే॥ అర్క కిరణముల్ రత్న గ♦వాక్షములను,తూఱి మేల్కొల్ప నిద్రచేఁ ♦దూఁగి లేచు
చెలులు జ్ఞానంబుచే నిజ ♦ స్థితి నెఱుఁగక, కలఁచు నజ్ఞులవలె మూర్ఖ♦గరిమ నుండ్రి

తే॥ అసురనేత్ర నాజ్ఞాబల ♦ మరయలేక, దినఫలంబులఁ దెలుపు జ్యో ♦ తిష్కసమితి
జాములం దెల్పుకోళ్లు న♦ జ్ఞానదశను,మలఁగి తమకార్యములఁ దాఱు♦మాఱుగుడిచె.

తే॥ ఇట్లులోక విపర్యయ ♦ మెనయుచుండ, దైత్యవిభుఁడు రవింగని ♦ తనమనంబు
నిప్పుచేఁ గాల్చుచున్న యీ♦నిష్కరుణుఁడు, చంద్రుఁడే యగునని పల్క♦సరసవారు.

తే॥ చంద్రుఁడీతండు గాఁడు ప ♦ చ్చని గుత్తాల, తేరుగల వేఁడివెలుఁగగుఁ♦దివిరియితఁడు
కాల్చునేగాని చల్లని ♦ కైరవాప్తు, కరణిఁ జల్లదనంబును ♦ కాంచఁడనిరి. ౬౪౭

తే॥ కొమ్మలంగల్గు కాటుక♦కొండఁబోలు,దైత్యవిభుఁడు క్రూరుని సూరుఁ♦దఱిమివైచి
సాగరధ్వనిఁ దొలఁగించి ♦ సంజవేళ, వెలయులేఁజందురుని వేగ ♦ పిలువుఁ డనియె.

తే॥ అశనివంటి పల్కువిని షో ♦ డశకళాప్త, పూర్ణుఁడగు చంద్రుఁడప్పుడే ♦ శీర్ణుఁడగుచు
విదియ జాబిల్లియై మింట ♦ వెలసె; దుష్ట, శాసనంబన నిట్టిదే ♦ జగతియందు. ౬౪౯

తే॥ అసురపతి కాంచియిదిబడ♦బాగ్ని యేమొ?,ధరణిమోచు శేషుని విష♦దంష్ట్రయేమొ?
కాళ నాపైన దొడ్డయ ♦ ల్కను వహించి, సంజయే కత్తిగొని యిట్టు♦ జరుగఁబోలు.

తే॥ పాలకడలి మధ్యమున నీ ♦ పద్మవైరి, మొలచినట్టి వేళనె హాలా ♦ హాలము కంఠ
మందుధరియించుహరుఁడుపీఁ♦డంతకంటెఁ,గ్రూరవిషమనియేయుంచు♦కొనియెఁదలను

తే॥ అతికరాళ విషంబున్న♦ యహులయందు, పెద్దదని పిన్నదని రూప ♦ భేదమేల?
పెద్దచంద్రుఁడేపిన్నయై♦పిడుగువోలె,మిడుకు క్రింగునప్పటికంటెఁ♦జెడఁగలేదు. ౬౫౨

తే॥ చాలుమానిసి నన్నిట్లు ♦చంపువాఁడు, లోకములఁ గాల్పఁడంచుఁబ♦ల్కుటలుతగునె?
ధ్యానమేశ్వేషమేలు వీనిని ♦ త్రోవఁడింక, గుబులుకొను నిరులిప్డు క ♦ న్గొంద మనియె.

తే॥ అపుడు సర్వాంతకమంబయి ♦యంధతమము, నురుదులను గొనివనువుల్ ♦చూడ నగుచు

హార్యములననంఖ్యాక దీ♦పాళులొప్ప, గాఢముగఁ గ్రమ్మె జెనలెల్లఁ ♦ గానఁబడక.

ఉ॥ అక్షయవస్తు తత్త్వమది ♦ యార్యులచేఁ దగనాలకించి య
జ్ఞక్షయమొంది జ్ఞానమను ♦ చక్షువువిప్పని గ్రుడ్డివాని దు
ర్లక్షణ నిష్కృపా హృదయ ♦ రంగముకంటె మహాంధకారమే
పక్షమునందు తక్కువని ♦ పర్కఁగఁ గ్రమ్మె ధరా తలంబునన్. ౯౫౫

ఉ॥ చీఁకటియన్ జముండదటు ♦ చెంది జగంబులు నిండి యందుపై
నాకస మంటఁగాఁ బెరిఁగి ♦ యంతట సత్కృపవీడి మ్రింగ నీ
లోకములెల్ల వ్యర్థముగ ♦ లొగ్గడియై నశియించునంచు లోఁ
గై కొనకిట్లు తోడుగొనఁ - గంత విమంబు హరుండు క్రక్కెనో? ౯౫౬

చ॥ హరుఁడు గ్రసించినట్టి హాల - హాలము నందిది ప్రాంగియుండునే?
ధరణిని స్వర్గమున్ రననఁ - దాఁకుచు లేహనముం బొనర్చు భీ
కర విలయాగ్ని మెంపుకొని - కర్కశ రీతి నెదుర్చు చండ దు
ర్గరళము మ్రింగి నల్లనయి - క్రాలినదీ తిమిరంబు చెల్లరే!. ౯౫౭

చ॥ శరములు నగ్నియుంజొరఁగఁ - జాలని సాంద్రతమంబు లోన నొం
టరినయి కుందు నా కుఱఁగ - టన్ బయిమేఘముఁ బొప్ప సాటికం
బొరయని విద్రుమంపు లత - పొందిక లే యెడనీరుకాయలం
దిరముగఁ దాల్చి చంద్రుఁగొని - దీపము నా వెలుఁగొందెఁ జూచితే. ౯౫౮

చ॥ చతురతఁ బూని చూపుఁ జొరఁ - జాలని చీఁకటిలోనఁ గుండలాల్
వితముగఁదాల్చి నల్లనగు - వేణికతో నొక చంద్రబింబ మీ
తతిఁ గనవచ్చుచున్నదిది - తన్మయరీతిని గల్గుభ్రాంతియో?
సుతనుఁడు క్రొత్తచందురుఁడో? - సుందర మీ నవ దృశ్యమేదియో? ౯౫౯

చ॥ ఉరమును పూర్తిగా నలమి - యుబ్బు పయోధరముల్ పిఱుందులున్
మురువగు బంధురంబు నడు - ముం గనరావు నిజంబు తక్కునుం
దర తరుణాంగముల్ గని ము - దంబు గడించితి నిద్దిమెల్లఁగా
గరగరికైన కాంతయయి - గట్టిగ నామది నున్న దే చుమీ. ౯౬౦

చ॥ మునుపె సమస్త లోకముల ♦ ముగ్ధలఁ గాంచితి నిట్టి రూపముం
గనివిని యుండలేదు మఱి ♦ గల్గునె యిట్టిది వేఱొకండు? క
ల్గిన దని చూపువారెవరు ♦ లేరిట నాచెలియల్ వచించు మా
రుని తురగం బప్పుమగు ♦ రోపము నిక్కువ మామె యామెయే. ౯౬౧

ఉ॥ ఏఁ గొను కామవేదన న ♦ ణంపదు దీనిని రోసి తెచ్చె న
న్నిఁగని చెల్లె శూర్పణఖ ♦ యింపొక భేదము సేయఁ బూనునే?

వేఁగుచు నున్న నాకడకు ♦ వే చనుదెంచిన సుందరాంగి మున్
దాఁ గనినట్టిదేమొ? విశ ♦ దంబుగఁ దెల్పున కాఁ దలంచుచున్. ౬౬౨

తే॥ పిలుచుకొని రండనుచుఁ ద్వార ♦ విభుఁడు పలుక, నసుర లేగిపిల్చిన యంత ♦ నతనికులము
దుంపతోఁ ద్రెంపఁ బుట్టిన ♦ ధూర్తురాలు, మరునికాఁకతో నచటికిఁ ♦ దెరలి వచ్చె.

ఉ॥ కల్లలు నిండు మానసము ♦ కంటె భయంకర రీతిఁ గ్రాలు నా
చెల్లెలిఁ గాంచి దైత్యకుల ♦ శేఖరుఁ డీఁటెలఁ బోలి కాటుకన్
సల్లలితంబుగా నిడిన ♦ చక్షులతోడ మయూరి పోల్కి శ్రీ
తల్లజ కానవచ్చునది ♦ ధారణి జాతయె? యన్న దైత్యయున్. ౬౬౪

శా॥ చెందమ్మిన్ హసియించు నేత్రములతోఁ ♦ జెల్వొంపుఁ గెమ్మోవితో
నందంబై తగు దీర్ఘబాహువులతో ♦ హారాసైన కంఠంబుతోఁ
బొందంగోరు విశాలమా నురముతోఁ ♦ బొల్పైన నీలాద్రి యన్
చందం బొందిన ధన్వి యాతఁడె ఘన ♦ శ్యాముండు రాముండనన్. ౬౬౫

మ॥ తరుణీ రూపము నాకుఁ గానఁబడఁగాఁ ♦ దన్వంగి! నీ కేదియో
పురుషాకారము గానవచ్చె ననుచుం ♦ బొంకాడుచున్నావె? య
చ్చెరువయ్యెన్ మనయొద్దనే మనుజు లీ ♦ జిత్తుల్ ప్రసారింతురే?
యురగశ్రేష్ఠుని యొద్దనే యెలుక మా ♦ యోపాయముల్ సాగునే? ౬౬౬

చ॥ అనవుడు నుల్కి యామెయును ♦ నన్న! మహీజ పయిం హృదబ్జముం
జొనిపితి నంత మోహమతిఁ ♦ జొక్కితి కావున నెద్ది గాంచినన్
వనితగ నీకుఁ గానఁబడు ♦ వైఖరి నైజము నీమనంబునం
బనుపడు కాంతయే యిపుడు ♦ భ్రాంతిని యెల్లెడఁ దోఁచు నావుడున్.

చ॥ చెలియల! ముమ్మరంపు వల ♦ చే నని పల్కితి వొప్పుకొంటి నీ
వల రఘువల్లభున్ గనెడు ♦ నగ్గలపుం బనియేమి? యన్న నా
పొలఁతియు వాఁడు నాకు నుడి ♦ వోవని దుఃఖము గల్గఁ జేయుటన్
మలఁగుదు నాఁటనుండి యవ ♦ మానము నోర్వమిచేఁ గదా యనెన్.

చ॥ నిజమె కదా! యటంచు రజ ♦ నీచర నాథుఁడు చూచి నామనో
రుజ కిఁక నేదిమందు? నను ♦ క్రూరుఁడు మారుఁడు వేఁచుచున్న వాఁ
డజితుఁడె యన్న శూర్పణఖ ♦ యన్న! కుమారిల నేల? పోయి భూ
మిజఁ గొని తెచ్చుకొమ్మిటు భ్ర ♦ మింపఁగ నేటికి నంచుఁ బల్కుచున్.

తే॥ వెడల రావణుఁ డొడలెల్ల ♦ నుడికి తెలివి, నందకుండ మూర్ఛను పొంద ♦ నచటివారు
వడఁకి రింకను మనుగడ ♦ వఱలుకతన, మరణమందఁడు నిర్జర ♦ మర్దనుండు. ౬౭౦

రావణుఁడు శశికాంత శిలామంటపంబు చేరుట.

తే॥ వచ్చివాఁడంత బ్రదికిన ♦ వాఁడ నైతి, తెలిసినంత నే యందున్నదై ♦ తీయఁగని
పితుకు పొల్లులు నీరు బ్ర ♦ వించునట్టి, చంద్రకాంతమండప మొండు ♦ సలుపఁ దలఁచె.

తే॥ మయుఁడు మనసు దెంచి యేలి సీతా♦ముఖాంబుజమ సిగ్గు, పడఁగ నూహించి శిల్పంబు♦పరిఢవిల్ల
వేయి కంబములు సడుమను♦ వెలయునట్లు, మేటి రత్నమండపము ని♦ర్మించె నపుడు.

తే॥ కాలమున కనఁబడి చంద్ర♦కాంతి లేక, చెమ్మ గ్రమ్మెడు నెలజాల ♦ చేత మీఁదఁ
గ్రిందఁ గప్పి తెమ్మెర కిటి♦కీల నుంచి, యీపి ప్రమాఁదుల యుద్యాన♦మేర్పఱిచె. ౭౭౯

తే॥ స్వర్ణమణిమయ కాంతుల ♦ జాలువాఱు, దీపములు చీఁకటులఁ దోల ♦ దేవసతుల
నగల కాంతులు ప్రక్కల ♦ సొగసునింప, వచ్చె నసురేంద్రుఁ డమ్మండ♦పంబుచూడ.

తే॥ పెక్కు కోట్ల చీఁకట్లాగిఁ ♦ బేర్చినట్లు, గలిగియున్నను చెలువల ♦ చలువ గలుగు
బహుళ తారాస్యసుధాంశు బిం♦బంబు లచట, వెలయు కతన నా చీఁకట్లు♦ విరిసిపోయె.

తే॥ క్షోణి సల్పిన నల్పక ♦ జ్యోతి రంగ, తరుమహాద్యుతిఁ గేసు ర ♦ త్నముల శోభ
వలనఁ జీఁకటి మాసె ది ♦ వాకరుండు, పోయియును రేయి కాదయ్యె ♦ భూరికాంతి.

తే॥ అవయవంబులు వివశత్వ♦మంది తన్నె, యటకుఁ గొనివచ్చు చేష్టల ♦ నరయ లేక
పూర్వభవ వాంఛ తజ్జన్మ♦మునను పడయు, రహిని నూత్నస్థితిం బొందె♦ రావణుండు.

తే॥ జగముఁ జల్లఁజేయఁగఁగోరి♦జలధికీదిగు, మొగులుగములపోల్కి నం దెట్లు♦ముసరుచున్న
పసిఁడి తరువుల చివుళులఁ♦బ్రసవములను, పఱచు పానుపుపైఁ జేరెఁ♦బంక్తిముఖుఁడు

తే॥ అందు మదనుండు తనకు ద♦శాస్యుఁ బట్టి, విందుగాఁబెట్ట నమృతంబు ♦ విధిని వెడలి
యనువు లోనఁగు నేరుపరి యు♦దానిలుండు, కోమల కొప్పుల విరితావిఁ♦గూడివచ్చె

ఆ॥ కాపురించు నింటఁ♦గాల సర్పము చేరు, పగిది వచ్చు మంద ♦ పవనుఁ గాంచి
కోప చండరక్త ♦ ఘూర్ణనేత్రుండయి, సేవకులను పిలిచి ♦ చీఁదఱిగొని. ౭౮౦

ఆ॥ పొంగి కూప జలము ♦ భువనంబులను ముంచి, నట్లు నన్ను పవనుఁ ♦ డలఁచె నిటకు
నేలవచ్చె నాజ్ఞ ♦ నెనయక? వానిని, పట్టి తెండటంచుఁ ♦ బదరి పలికె. ౭౮౧

తే॥ వారు వాయుదేవుని గొని♦వచ్చునంతఁ, బండ్లు గొఱుకు చుటేమి మంద♦పవనమునకు
మేలి గుణమేల యీవన ♦ మీరలిట్టి, తగవు నొంది దానిని తిట్టఁ ♦ దగనె? యనుడు.

తే॥ వాయుదేవుని కోపించి ♦ ఫలములేదు, సీతకృప నొందనేని ప ♦ రేతరాజు
చేరఁ గానఁ గష్టవిముక్తి ♦ చెప్పఁ గలుగు, ననుఁగుమంత్రులఁబిలుఁడని♦ యాజ్ఞచేసె.

క॥ వారలు పిలిచిన వెంటనె, వారణములఁ బల్లకీల ♦ వాహనములఁ బెం
డేరుల నెక్కి భుజింపవి, వారలు శంకింప వచ్చి ♦ వ్రాలిరి పెలుచన్. ౭౮౨

## రావణుఁడు మారీచుఁ గాన నేగుట

క॥ వచ్చిన మంత్రులతోఁ దగఁ, జెచ్చెర యోచించి తెలివి ♦ చెడి మారీచుం
డచ్చుగఁ దప మొనరించెడు, నచ్చటికి దశాస్యుఁ డరిగి ♦ యతనిం గాంచెన్. ౬౮౭

తే॥ పంక్తి వదనుఁడు రాఁగాంచి ♦ భయము వలన, వడఁకి కొంకుచు నెదురేగి ♦ వానిఁదోడి
తెచ్చి మర్యాద గావించి ♦ తెలచి యతని, వదనమునఁ జూడ్కి నిల్పి తాఁ ♦ బలికెనిట్లు

తే॥ కల్ప వృక్షంబు నీడను ♦ కాంక్షఁ దిరుగు, నింద్రునకు యమునకు నోట ♦ యెదుగునట్లు
పాలనము సేయు దేవ! యీ ♦ వనికిఁ బేద, కరణి నరుదుగ వచ్చిన ♦ కార్యమేది? ౬౮౮

చ॥ అనవుడు రాగఁ దగ్గ యవి ♦ యైనవి ప్రాణముతోడ నుండియుం
బనవెడఁ గీర్తితోఁ బరువు ♦ మాసెను వేల్పులఁగాంచి యింక సి
గ్గునఁ దల వంపఁగా వలసె ♦ ఘోరతరంబగు నింద నేఁటికిన్
మనుజులవల్ల వచ్చె నిఁక ♦ మానము వోనది యెట్లు చెప్పుదున్? ౬౮౯

చ॥ బలయుతులైన మానవులు ♦ బాహుమదంబున ఖడ్గమూని యు
ష్మల్లుచెలు నీదు కోడలికి ♦ ముక్కు సెవుల్ మొదలంటఁ గోసి రి
ట్లలమిన నిందకంటె ఘన ♦ మా నపదూఱు మఱొండు గల్గునే?
యిలను ప్రసిద్ధమైన మన ♦ యిద్దఱ యన్వయ శీలముల్ చెడన్. ౬౯౦

చ॥ ఒక మనుజుండు చేత ధను ♦ వూని రుషా విపరీత చిత్తుఁడై
యకట! నిశాచరావళుల ♦ యాయువు ద్రింగి ఖరాదులన్ సుర
ప్రకర జయేందిరా కచభ ♦ రంబు గ్రహించిన యానరాదులన్
గకవిక చేసి చంపె ననఁ ♦ గా మన జన్మము లేల కాల్పనే?

ఉ॥ కాఁక యడంప లేక మది ♦ గాసిలి దూపిలుచున్న నేను నా
కాఁక యడంగ నీచులను ♦ గ్రచ్చుఱఁ జంపఁగ సాటికామి య
ట్లూఁకువ సేయకుంటిఁ దమ ♦ యొద్ద వసించు మడంతి మిన్నఁ గొం
చాఁక నడంచి నిందను న ♦ యంబునఁ ద్రోవఁ దలంచి వచ్చితిన్. ౬౯౧

చ॥ అని దనుజేంద్రుఁడాడఁ గొడు ♦ పగ్గిని గాల్చి దిటన్ శ్రవంబులం
జొనిపిన యట్లుగాఁగ మది ♦ స్రుక్కి యిసీ యని యాశ ద్రొడ్డదే
యని విలయంబు తప్పదని ♦ హావడిరా యని యోటలేక యి
ట్లని వచియించె నాతఁడు న ♦ యంబున మేను మనంబు కంపిలన్. ౬౯౨

ఉ॥ ఆయువు నొల్లవేమి? మతి ♦ సక్కట పంకము నందు ద్రొక్కితే?
యీ యపమార్గ మిట్లు వడి ♦ నెవ్వరు నీకనుకూలశత్రులై
తీయని పల్కులం గఱపి ♦ తీర్చిరి? నీ తలవ్రాఁతయే చుమీ
వేయున నేల? యేను బలు ♦ వీఱేఁడి నైనను మేలు సెప్పెదన్. ౬౯౩

ఉ॥ త్రెంచిన చేతులం దలలఁ ♦ ద్రిక్కటి చేతుల నందికొంచు హో
మాంచిత కుండమందిడి య ♦ మాధిపుఁగూర్చి యనేకవత్సరాల్
కొంచక నిద్ర యోగిరము ♦ గోరక చేసి తపంబు సంపదం
గాంచితి లోకనింద గొని ♦ కాంచఁగ శక్యమె యిట్టి సంపదల్? ౯౪

ఉ॥ పాపగుణంబుచేన? మఱి ♦ పావనమైన గుణంబుచేతనా?
యీపగిదిం దపంబు ఫలి ♦ యింప సు సంపద నీవు పొందుటల్?
కోపము మాని పల్కు మిది ♦ క్రూరగుణంబున నొందెనేని? యి
ట్లేపునఁ గీడు చేసికొని ♦ యెల్ల నశింపఁ దలంపు గొంటివే!. ౯౫

చ॥ దుడుకున మిత్రరాజ్యమును ♦ దొద్ద యొనర్చిన, ధర్మ మార్గముల్
చెడ వలపక్షమూని సభ ♦ చేసిన, మోసముతో గృహస్థులన్
గొడవల నొంచి తత్కుసుమ ♦ కోమలులం జెఱ గొన్న, ధర్మమే
మడియఁగఁ జేయు; నెవ్వరిల ♦ మాఁడకనిల్చిరి దుష్ట వర్తనుల్? ౯౬

ఉ॥ నాక విభుం డహల్య వల ♦ నం జడరాని యనస్య దేహముం
జేకొనె నింద్రుఁ బోలిన ప్ర ♦ సిద్ధు లికెందఱో కామపీడచేఁ
గైకొనినారు చేటులు ని ♦ కంబుగ లక్ష్మిని పోలి యెందఱో
నీకు సతుల్ గలారు వగ ♦ నెక్కన నీ మతి మాని నేమనన్?. ౯౭

ఉ॥ కాదని పూనితేని చెడు ♦ కావలమున్ గడు దూఱు గాక వే
ఱేదియుఁ గాంచలేవ యెల ♦ యించి ఫలంబును పొందితేనియున్
సాదుల శాప సన్నిభ పృ ♦ షత్కములన్ రఘురామ భూవరుం
డే దమియించు నీదయిన ♦ యుద్ధ బలంబు కులంబు సర్వమున్. ౯౮

ఉ॥ నీదగు సేనకంటెఁ గడు ♦ నేర్పున లావున మేటి యంచు సం
పాదితకీర్తి మోచిన య ♦ వారణ సైన్యము తోడ నా ఖరున్
మేదినిఁగూల్చె నొక్కఁడె ని ♦ మేషము లోన, సమస్త దైత్యులన్
మోదముతో వధింప మదిఁ ♦ బూనిన వాఁడది నీ వెఱుంగవో?. ౯౯

ఉ॥ రావణ! నీయనుంగుల వి ♦ రాధునకంటెను శూరుఁడున్నె? వాఁ
డేవగ రామ బాణ హతి ♦ నీల్గె నెఱుంగవె? యింక నే విధిం
బోవఁగ వచ్చు నంచు మదిఁ ♦ బ్రుంగుచు నుండుఁ జెడంగ నేల? నే
నే విధముల్ వచించినను ♦ వీనుల కెక్క దిదేమి తెల్విరో? ౨౦౦

చ॥ మడిసిరి నిన్ను మించిన న ♦ మానులు దైత్యులు చావఁగోరి చే
సెడి పనిచేయఁ బూనకుము ♦ చేసిన నాయువు మాయు టబ్రమే?

పుడమి మఱెందఱెందఱో ప్ర ♦ పూర్ణ బలంబున నేలినారు పెక్
కుడుకులు చేసి భూస్థలిని ♦ ద్రుంగని వారలఁ బల్కు మొక్కరిన్. ౨౦౧

శా॥ తమ్ముండైన సుబాహువున్ జనని దో ♦ ర్దండ ప్రభావుండు నా
కమ్ముం గూర్చినదాది దైత్యబలముల్ ♦ గగ్గోలుగా వారి నా
మమ్ముల్ విన్నపుడెల్ల నామనము కం ♦ పంబొందుఁ గాఁబట్టి యే
నిమ్మార్గంబునఁ గుందుచుందు దనుజా ♦ ధీశా! పరీక్షించితే? ౨౦౨

తే॥ భువిఁ జరాచరములు నిల్క ♦ పొందవనుచు, నిజము దెలిసితి మసురేంద్ర! నీవు దుష్ట
చేష్టలను మాని యున్నట్టి ♦ శ్రేష్ఠమైన, సంపదలఁ బొందు నామాట ♦ చక్క వినుము

మ॥ అన దైత్యేంద్రుఁడు శంభుఁ దారగిరి లీ ♦ లాంకంబుగా నొక్కచే
మొనయం దాల్చిన నాబలంబు చులుకం ♦ బోనాడుచున్ మర్త్యు నొ
క్కని నాముందఱ నొప్పవాఁడనుచు వీఁ ♦ కం బల్కుచున్నాఁడవా?
యనుచున్ భ్రూకుటి భీకరంబుగను మా ♦ యావిన్ విలోకించుచున్.

చ॥ నడచిన కార్యమింతయు మ ♦ నంబున నెంచవు నామనస్స్థితిన్
బెడిసి పడంగఁ దిట్టితివి ♦ వీకునఁ జెల్లెలి ముక్కుగోయు నా
దుడుకరుల న్నుతించితివి ♦ దోసము నొందని వారలంచు నీ
బుడి బుడి మాటలన్ సయిఁపఁ ♦ బోలునొకో మఱినీవ చెప్పుమా?

## మారీచుఁడు రావణునకు నీతి కఱపుట

ఉ॥ అని లంకేశుఁడు కోపియై పలుకు ప ♦ ల్కాలించి మారీచుఁ డిం
కను తాఁబల్కిన మండి దూఁకునని య ♦ ల్కంబోక తానిట్లనున్
నను కోపింపఁగ లేదు నిన్నును భవ ♦ న్నందన్ భవద్వంశమున్
ఘన కోపంబునఁ బ్రుంగఁ జూచితి వహా ♦ ఖ్యం దాల్తువే నీతలన్?. ౨౦౬

ఉ॥ ఎక్కడుమన్న భార్గవుని ♦ యేడ్తెఱఁ గ్రుంగఁగఁ జంచుశైలముం
బెక్కువ రాట్నభర్ విఱిచి ♦ పేర్చిన శైలము నెంచి చూడ నీ
వెక్కటి నెత్తినట్టి పర ♦ మేశ్వరు శైలమొ? మేరు శైలమే?
మిక్కిలి యాకసం బొరయు ♦ మీఁటిన వింధ్యమొ? నీవ చెప్పుమా?. ౨౦౭

ఉ॥ కానవు రాముసత్త్వమును ♦ కాంచి వచించిన నా సయోక్తులన్
వీనులఁ జొన్పవున్ జెడెదు ♦ వీరవరేణ్యుఁడు కేలఁ జాపమున్
బూనక మున్నె ప్రాణములు ♦ పోవుట నిక్కము మూర్ఖబుద్ధిచే
జానకిఁ గాంతఁగాఁ దలఁతు ♦ జానుగ రాక్షస పాప రూపమా. ౨౦౮

ఉ॥ చుట్టలతోడ సంయమనిఁ ♦ జొచ్చుట నిక్కువమంచుఁ దప్పెటం
గొట్టిన రీతి గుండియలు ♦ గోడుగఁ బాడుగఁ గొట్టుకొంట నీ

పట్టునఁ గానవేమి? విష ♦ పానముచేసెదు వారిఁ గాంచి యు
త్కృష్టపు నున్న వారపియు ♦ భాగ్యమెయంచు వచింపఁ బోలునే? ౧౯౯

ఉ॥ భూపకుమారకుం బ్రియము ♦ పొందుపఁ గౌశిక మౌని మెచ్చి నా
గోపమమైన దివ్యవిశి ♦ ఖోత్కర మిచ్చెఁ దదస్త్రజాలముల్
లోపము లేని కోపమున ♦ లోఁగొనఁ జాలు క్షణంబులోన స
ప్తోపరిలోకపముల్ మహిమ ♦ నున్నతి నొందిన యా త్రిమూర్తులన్. ౨౦౦

చ॥ అమిత బలంబునం జయము ♦ నందిన యర్జును వేయి చేతులన్
సమితిని ద్రుంచి కూలిచిన ♦ క్షత్రియ భీకరు జామదగ్న్యు చా
పమును జగంబు జేయఁగ ♦ వంచిన రాము నమోఘబాహు స
త్త్వము మన చేతులం గలదె? ♦ తత్త్వమెఱుంగక మాటలాడెదే? ౨౦౧

ఉ॥ కామవిషంబు దేహమును - గాసిలఁజేయఁగ బుద్ధిమాలి నీ
వేమెయి దుష్టవాక్కువచి - యించితి చేటును దెచ్చు నాయనా!
మామను నీకులంబునకు - మాన్యతఁ గూర్చెదువాఁడ నీతలం
పోమక యడ్డు పల్కుచని - యుగ్రత నొందక వీడు మీ పనిన్. ౨౦౨

ఉ॥ నీచపథంబు మాను రఘు - నేతృబలంబు దలంపుమన్న మా
రీచుఁ దిరస్కరించి వల - రేకొను రావణుఁ డిట్లు పల్కు నో
యీ! చతురాగ్రగణ్య! జన ♦ యిత్రి వధించిన మానినీనికిన్
శోచితరీతి జంకు నిను - సూరుఁడవంచుఁ దలంపఁ జెల్లునే? ౨౦౩

ఉ॥ దిక్కరు లొగ్గి డాఁగికొన - దివ్యులు నిల్కడఁ దక్కి పాఱి లో
స్రుక్కఁగ ధూమధామముగఁ - జుమ్మలు చుట్ట దివంబుఁ గాల్చి పే
రుక్కున ముజ్జగంబుల మ - హోన్నతి నాజ్ఞలఁ జెల్లనిచ్చు నే
నెక్కడ? తుచ్ఛులౌ మనుజు - లెక్కడ? నన్ను జయించు టెడనో? ౨౦౪

చ॥ త్రిజగము లందు నన్నెదురు - ధీరులు లేరటు గల్గిరేని నా
భుజముల తీఁటవో నడుతు - మోదము దీనికి మించి కల్గునే?
గుజగుజ పోక నాముదలఁ - గూర్చెదు మంత్రుల ధర్మపద్ధతుల్
నిజముగ దాఁటిపోవుటయు - నీతియె? చెప్పిన యట్లు చేయవో? ౨౦౫

ఉ॥ త్రోసి తొలంగి పోయినను ♦ ద్రోవక నీశిర ముత్తరించి నా
యాసను నేనె పూర్తిగ ర ♦ యంబునఁ గాంచెదఁ గాక మౌన మ
న్నాన వహించితేని బదు ♦ లాడక ప్రాణము గోలుపోక యు
ల్లాసముతోడ నాదగు త ♦ లంపు ఫలింపఁగ నిల్వుమా యనన్: ౨౦౬

చ॥ కరఁగిన రాగిపైఁ జిలుకు ♦ కంబుకణంబన క్రుక్కి క్రుంగి ట
క్కరియగు తాటకేయుఁ డెద ♦ గర్వము నిండిన వారు నాశముం
బొరయుట నిక్కవంబు తమ ♦ పొందఁగఁ గోరిన కార్యమెల్ల నా
గరువము చేతనే ఫలము ♦ గాంచెద మంచుఁ దలంతు రిమ్మగన్. ౭౦౭

ఉ॥ నీపని చూచి యే నిచట - నిక్కపు సంస్థితి చెప్పఁ బూనితిన్
నాపని గాంచి యే భయము - నం బడి పల్కఁగ లేదు నాశమే
చేపడువేళ మంచియును - చెడ్డఁగఁ దోఁచుట నిక్కమల్ప బు
ద్ధీ! పనియేమి సత్వరము - తెల్పుమ యంచు వచింప నుబ్బునన్. ౭౦౮

చ॥ కవుఁగిలి గొంచు రావణుఁడు - కాఁక తొలంగఁగ నోయి మామ! నేఁ
డివిరి యనంగు నస్త్రముసఁ - దెట్లటకంటెను రాము తూపుచే
భువిఁ బడుటెన్న భావ్యమని - పూనితి మందసమీర వైరమున్
దవిలిచి నట్టి సీతను ము - దంబుగ నాకు నొసంగుమా యనన్. ౭౦౯

తే॥ సిగ్గు చెడఁగఁ దపోవనిఁ - జేరి మున్ను, రామ దివ్యాస్త్రవితతిచే - రాక్షసులును
సోదరుఁడు చావ భయమున-నురిఁగి పాఱి, వచ్చినట్టి నేనిప్పుడే-పని యొనర్తు? ౭౧౦

చ॥ అని మరణంబు నోటమియు ♦ నప్పుడ పొందిన యట్లు తాటకా
తనయుఁడు పల్క రావణుఁడు ♦ తత్తఱ నిట్లనుఁ జింతయేల? నీ
జననిని చంపు దుర్జనుని ♦ చంపఁగ నాయిత మైతి మేటి వం
చనమున సీతఁగై కొనుటె ♦ సమ్మత మిప్పటి కార్యమా ననన్. ౭౧౧

చ॥ వెనుకను పోవుటేమి? బల ♦ వీరుని రాముని సుందరిం దురం
బున విజయంబు నంది కొను ♦ పోఁడిమి మెచ్చుగుఁ గాక వంచనన్
గొనుటది యెల్లి దంబుగద ♦ ఘోరరణంబున నీ పరాక్రమం
బును వెలయింపుమా యశము ♦ భూమిని నింపుమ యన్న నవ్వుచున్.

తే॥ వారల జయింప నేనలు - వలయునేమి?, ప్రణుతచంద్రహాసముచాలు-వారుమడియఁ
దెలివయునుచచ్చుఁగాన నా-తెఱఁగువీడి, మాయఁగై కొందమనిదైత్య-మల్లుఁడనుడు

మ॥ ఇనవంశోత్తము దారఁ దాఁకుటకు ము - న్నే వీని మూర్ధంబు లా
తని బాణంబులఁ ద్రెవ్వకున్నె? యనునా - తత్వంబు యోచింప నా
కును తద్భూమికి నేగి క్రమ్మఱెడు ల - గ్నం గల్గునో? కల్గదో?
ఘనమా నావిధి యెట్టిదో? యనుచుఁదాఁ - గర్తవ్య మూహించుచున్.

మారీచుండు మాయా కురంగమై చనుట

తే॥ అజ్ఞ యేమని మారీచుఁ - డడుగ దైత్య, విభుఁడు బంగారు జింకవై - వెడలి సీత
యాన పడఁ జేయుమని పల్క - నతఁడు వోయ్యెవింశతిభుజుండు వెడలెను-వేఱుత్రోవ.

తే॥ మునుపు రామబాణబలంబు-గనుటవలనఁ, దానుగాఁగాక ప్రభునిప్రోత్సాహమునను
జింకరూపొంది పోవఁ ద-చ్చిత్తవృత్తి, యెట్టులున్నొకొయూహించియు-నెఱుఁగుటరిది.

క॥ కల బంధువులను చావం, గల పేరులఁ దలఁచి కొంకి కళవళపడుచుం
బిలు విషజలములఁ దెరలెడు, పలిఁదెరలుచు మేనువడఁక లావఱ క్రుంగున్. ౭౭౭

తే॥ మునిముఖంబును చెఱుపంగఁ-బోవునాఁటి, నుండిశోకించి నిలుకడ-నొందలేక
మూఁడవ తడవ మరణించఁ-బూనిరాముఁ, జేరె సింగంపుగుహ దంతి-చేరునట్లు. ౭౭౮

క॥ మెఱుపులు భువిదివిఁ దోఁపఁగఁ, బొరి నభిమానంబులేని-భూరిమయంబౌ
హరిణాకృతిఁ గొనిసీతా, హరిణాక్షి చరించుతావు-నరయుచుఁబోయెన్. ౭౭౯

తే॥ జింకలను గన్నవారలు-జింకకంటి, నరయుబంగరు జింకసొ-గరసి యెడఁద
లఁటులేని వేశ్యల చూపు-లనెడివలలఁ, బడిపవడువునఁబడ జింక-వచ్చె నటకు. ౭౩౦

తే॥ అసదులేనదు మల్లల-నాడుచుండ, శ్రమను నడచుచు మృదులహ-స్తంబులనెడు
కోయఁబడనిపుష్పములతోఁ-గుసుమచయము,గోయుచుండెజానకియటఁ-గూర్మితోడ

తే॥ తలఁపఁ దరమయ్యెఁగాని చం-దంపురూపు, చెన్నఁటులుని ద్రలోఁగాంచి-రన్నపగిదిఁ
నెన్నరాని దుఃఖములొంద-నున్న సీత, గాంచె నచ్చెరువందిబం-గారు జింక.

మ॥ దశకంఠుండును వాని జీవితము ను-ద్యద్భోగ భాగ్యంబులుం
నశియింపం దటియాట ధర్మము ప్రస-న్నత్వంబు కానుండుటం
విశదప్రేక్షణ సీత మున్నెపుడుఁ బ్రొ-ద్దోఁ గాన కున్నట్టి రూ
పశరీరంబుల నొప్పు జింకను మదిం-వాంఛించెఁ దా వేలమై.

క॥ తరళాక్షి ముదురు టానను, హరిణంబును పట్టి యీయ-నడిగెద ననుచుం
ద్వరపడి పూవులు చిందఁగఁ, బరువున రాఘవుని కడకు-వచ్చి నయముమై. ౭౩౪

తే॥ కాళ్లు చెవులును మాణిక్య-కాంతి గలిగి, మేను బంగరు చాయయై-మెఱుఁగుచేత
గగనము వెలుంగఁ జేసెడి-సొగసు గులుకు, లేడిగలదు కాంతురు రండు-లీలననఁగ.

క॥ సీత యిటుపలుక నదియే, జాతిది యటువంటిలేడి-జగమునఁ గలదే?
భ్రాంతి యని తలఁపకెంతయు, నేతేరఁ దలంచె రాముఁ-డింతి పిఱుందన్ ౭౩౬

ఆ॥ సీతయాస గొనిన-చేష్టచే నాజింక, యెల్లబోఁటి గామి-యెఱుఁగకుండ
వెడలఁ దలఁచుచున్న-విమలాత్ము రాముని, లక్షణంబుగాంచి-లక్ష్మణుండు. ౭౩౭

## లక్ష్మణుఁ డది రాక్షస మాయ యనుట

క॥ కరచరణంబులు వాలము, నరుదగు రత్నములఁబోలి-హైమాంగంబౌ
హరిణంబు గలదె ధరణిని, సురవైరుల మాయయనుచుఁ-జూచెద ననుచున్. ౭౩౮

క॥ రాముండిట్లను లక్ష్మణ!, భూమిని పలుకోట్లు రూప - ములు పలుతీరుల్
నేమమున సకలమెఱుఁగఁగ, లేమిటు లనసేల? వింత ♦ లేదసఁదగునే?. ౨౩౯

తే॥ ఏమితలఁచి తోఁకేరీతి ♦ నెనయుచుండు, నవయవంబుల సూటిగా♦నరయుదేని
సూక్ష్మభేదముల్ దెలియుట♦చూడలేవె?, యేదుపైఁడిహంసలుపుట్టు♦ఁ దెఱుఁగవేమి?

తే॥ లెక్కలేని ప్రాణులలోన ♦ నొక్కతీరు, నొక్క యంతంబు లేదను ♦ చుండు నంత
మీరు మాటాడుచుండ బం♦గారు జింక, దూరమేగునో యని సీత ♦ తొట్రుపడియె.

చ॥ అటువలెఁ దత్తటిల్లు జన ♦ కాత్మజ చిత్తమెఱింగి రాముఁ డం
తటఁ గుటిలాలకా! పడము ♦ తక్కక కాంతమ యంచు నేగ సం
కటమున లక్ష్మణుండు వెను ♦ కం జన దాఁటఁగ రాని దయ్యమై
తటుకున వచ్చి దొట్టెదుట ♦ దంభముతోఁ గనుపట్టె లేటియై. ౨౪౨

ఉ॥ తమ్ముని కాంచు జింకఁ గని ♦ తామరసాక్షిరో! దీనిఁ జూడఁ జి
త్తమ్మున నేమియుం బలుక ♦ దాకొన దియ్యది మంచిదే యనెన్
వమ్మగు నేమి? దేవతల ♦ ప్రార్థనముల్ సుకృతమ్ము శేషత
ల్పమ్మును వీడి యీధరణి ♦ భారము దీర్పఁ దలంచి వచ్చుటల్. ౨౪౩

ఉ॥ దీనిని చూడు వత్స! యిది ♦ దేనిని పోలును? ధాత్రి సాటియే
గానము ముత్తెమట్లు రద ♦ కాంతులు గ్రమ్మను శాడ్వలంబుపై
నానెడు నాల్క మించు దొర ♦ యం దగు దేహము మేలి హేమముఁ
బోనిది మచ్చలెన్నఁ గవి ♦ పుత్త్రిని జోతి నధఃకరించెడిన్. ౨౪౪

ఉ॥ ఈ హరిణంబుఁ దేఱి కను ♦ నింతులకున్ మగవారి కింత సం
దేహము లేక డెందములు ♦ దీనిపయిం జొరఁ బాఱకుండునే?
యీహలు లేచుచున్ మిడుత ♦ లేపుస దీపముఁ జేరు పోలికన్
దోహలమందుచున్ వడిగ ♦ దొర్లుచుఁ బోవుచునుంటఁ జూచితే? ౨౪౫

ఆ॥ అన్న యట్లు పలుక ♦ నాజింకఁ గని యిది, మంచి గాదటంచు ♦ మదినెఱింగి
తమ్ముఁడనియె దీనఁ ♦ దనరు ఫలంబేమి?, మరలి చనుట యింక ♦ మంచిదనుచు.

ఉ॥ లక్ష్మణుఁ డిట్లు పల్క శుభ ♦ లక్షణ లక్షిత సీత, యీ లస
ల్లక్ష్మము లొప్పు లేడిఁ బది ♦ లంబుగఁ బట్టి యొసంగఁ జూప జి
తృక్ష్మలులైన సోదరుల ♦ భావము లూర నయోధ్య కేగి యో
సూక్ష్మమతీ! విరామముల ♦ సొంపుగ నాడుకొనంగ నిమ్మగున్. ౨౪౬

చ॥ అనవుడు నట్లె తెత్తు నను ♦ నంత విచక్షణ దక్షుఁడైన ల
క్ష్మణుఁడు వచించు నార్య! యది ♦ కర్బుర మాయ దురాత్ములైన యా

వనచరులు ధర్మపద్ధతిని ♦ లెక్కసేయక చరింతురు వారి మాయలం
దునః చిక్కినవా డెక్కుడే ననుచుం ♦ దుట్టతుదం దెలియంగలారనన్. ౨౪౮

ఉ॥ తమ్ముని కిట్లు ముద్దియ వచించెను ♦ దైత్యుల మాయయేయైన మేలె యీ
చక్కని కొమ్మునం గూర్చి వచ్చెదనే ♦ యమ్ముగ బట్టిన ధర్మముల్ ఫలం
బిమ్ముగఁ గాంచుచు నిక్కముగు ♦ నేనమయోని గ్రహించి తెత్తు రెం
డమ్మున కేమియుం జెడుగు ♦ డాయము నీవ తలంపుమా యనన్. ౨౪౯

ఉ॥ దీనిని మున్నుగాం జూచితి ♦ దీని పిఱుందన నిల్చువారలే
వైనము వారలో? మఱియు ♦ వారల మోసములెట్టివో? యిటుల్
దీనికి పంప నేలొకో? మ ♦ దిం దలపోయ నశక్యమయ్యె దు
ర్మానులు రోయు వేఁట కొల ♦ మాత్రము కాదగచాల్ల నిచ్చునాన్. ౨౫౦

చ॥ దనుజులు వైరులంచు బహు ♦ ధర్మవిదూరులె యంచు మాయలం
బనుపడు వారలంచుఁ దగఁ ♦ బల్కుచుఁ బూను వ్రతంబు వీడఁగా
జనములు నవ్వరేమి! యిటు ♦ జంకుట త్వాదృశుల ధర్మమేమి? యి
ట్లును బలు మంచిదే యగు వి ♦ లోలత యేలని రాముఁ డాడఁగన్. ౨౫౧

ఉ॥ డాసిన కార్యముల్ తగ నె ♦ డంద విచారణచేసి చేత యు
ద్భాసిత రీతిఁ గాలు రఘు ♦ వర్య! మృగంబు పిఱుంద నెట్టి రా
కాసులు నున్న మచ్చర వి ♦ ఘూర్ణ వారల యుక్కడంతు నా
శ్వాసము చెందుఁ డీరది ని ♦ జంబగు లేడియయేని తెచ్చెదన్. ౨౫౨

మ॥ అని సౌమిత్రి వచించుచుండ నమృతం ♦ బంగారఁగా నొల్కు ప
ల్కున ముద్దై తగు చిల్కవోలె వదరెం ♦ గొంచించుచున్ సీత యి
ట్లనుమానించుచుఁ బట్టి యీయరు గదా ♦ యంచున్ విమోదంబుతోఁ
గనులన్ ముత్తెము లట్లు బాష్పకణముల్ ♦ గ్రమ్మన్ వెసన్ గ్రమ్మఱెన్.

రాముఁడు మాయా హరిణము వెంట నంటుట.

చ॥ చసవు మెయిం గనల్గొనుచు ♦ సాగిన జానకిఁ గాంచి రాఘవుం
డను ననుజా! కురంగమిపు ♦ డయ్యలివేణికి నేన నెవ్వడిం
గొని చనుదెంతు నిచ్చటనె ♦ కూరిమితో సతిఁ గాచియుండు మం
చు నిశిత బాణముల్ ధనువు ♦ సొంపుగఁ దాల్చిచనెన్ వడిన్ వడిన్. ౨౫౪

తే॥ మున్ను వేల్మిఁ జెఱుపవచ్చు ♦ మువ్వురంపు, తప్పిపోయిన ♦ వాఁడని తలఁతుఁ వీని
మొగిని గమనింపు మని కేలు ♦ మోడ్చి పలికి, లక్ష్మణుఁడు పర్ణశాల వెలుపలనె నిల్చె.

తే॥ అరసి లక్ష్మణుఁ డనుమాట ♦ నాదరమునఁ, గొనక జానకి కై కొన్న ♦ కోపమునకు
మందహాసంబు గొని మఱు ♦ మాయజింక, వెంబడించెను సుందర ♦ వీరవరుఁడు.

ఉ॥ నేలను నిల్చుఁ జింక మెడ ♦ నిక్కఁ జివుక్కున దాఁటు నింగికిన్
లీలను నేలఁ ద్రవ్వు ఖుర ♦ ళించిన తీరున దూఁకు డాయుఁ బెన్
గాలి మనంబు వేగిరము ♦ గాఁ జను రీతికిఁ గ్రొత్తమార్గమ
వ్వేళను నేర్పఁ బాదములు ♦ పేరురముం దగులంగఁ బర్విడున్. ౭౫౮

ఉ॥ చాఁచుచు నెత్తి యీభువన ♦ జాలముఁ గొల్చిన పాదసత్త్వమున్
బూఁచి వచింప వేఱొక య - పూర్వ భగోళము గల్గునేమి? తా
నేఁచఁగ నేగినంత వడి - నేగెను జింకయు నింతమాత్రమే
తోఁచును నాఁటి వేగమున - తోరము దెల్ప నశక్యమేరికిన్. ౭౫౯

తే॥ కొండలెక్క మేఘంబులఁ - గ్రుంకువెంటఁ, జేర దూరమేగును తామ - సింప డాయు
నిలిచి యున్నట్టు కనఁబడి - తొలఁగిపోవు, పైఁడి యీన వేశ్యల మది - పాఱు నట్లు.

చ॥ తొడఁగిన దొక్కచోట్ల తుదిని - దోఁచిన దొక్కటి యయ్యె మున్నె త
మ్ముఁడు తలపోసినట్టి తలఁ-పుల్ తగ నామదిఁ దోఁచియున్న ని
క్కడ కిటురాను వట్టిశ్రమఁ - గర్బుర మాయలఁ జిక్కిపొందితిన్
దడయఁగ నేలొకో సడమ - దం బొనరించుట మేలు చూడఁగన్. ౭౬౦

తే॥ వీఁడు మాయావి చేపడు ♦ వాఁడు కాఁడు, చెండుటే కార్యమనుచు సం♦సిద్ధుఁడైన
రాము మది నెఱిఁగిన వాఁడు♦రయముమీఱ,మాయ నెగిరెను నింగిని♦మఱుఁగుపడఁగ

తే॥ రాముఁడాక్షణమందె చ ♦క్రంబు రహిన, మోఘశర మొండు సంధించి♦మోసగాఁడు
పోవుచోటికి వెంటాడి ♦ పొరిగొనుమని, నారి తెగ దీసి పఱపె న ♦ న్నారసంబు. ౭౬౧

తే॥ ఆ శరంబు మాయావి ఱొ ♦ మ్మంటఁ దాఁకెఁ, దాఁకి నంత నోరు దెఱచి♦దశదశలను
దాఁటిచన లక్ష్మణా! యంచుఁ♦దద్ద యఱచి, ప్రాణములువీడి మారీచుఁ♦డవనిఁగూలె

తే॥ నిక్కవపు రూపమునసోఁకు♦నీల్గఁగాంచి, తమ్ముఁదలఁచియాతఁడు జాణ♦తారకముగ
వెంట వచ్చునతఁడు ప్రోడ♦వేయునేల, ప్రాణసముఁడు నేర్పరి యని♦హర్ష మొందె.

తే॥ దిక్కులదరంగ నఱచుచుఁ ♦ దీఱె కూలు, నీచ దేహంబు నచ్చట ♦ నిలిచిచూచి
మున్ను కౌశిక యాగంబు ♦ పూనిచెఱుప, నరుగుదెంచు మారీచుఁడే♦యని యెఱింగె

తే॥ శరము ఱొమ్మున నాటఁగ ♦ శ్రమమునొంది, మఱియు నోర్చి దైత్యుఁడొనరించు ♦మాయ
నాదు కంఠంబుతో లక్ష్మ♦ణాయటంచుఁ,బిలిచె నదివిని మైథిలి♦కలఁగునేమొ?.[యందు

చ॥ పిలుపు నిజంబు కాదనుచు ♦ పీఱెఁడి దైత్యుఁడు పల్కెనంచు నున్
దెలిసిని నాకు హెచ్చరిక ♦ దెల్పిన తమ్ముఁడెఱింగి తెల్పఁగా

నలమట వీడి సీత హృద ♦ యంబున నూఱట చెంద సంతసఁ దాఁ
దెలిసి యొకింత నెమ్మది గ ♦ దించె మఱి రఘురాముఁ డయ్యెడన్. ౨౧౮

ఉ॥ చావఁ దలంచి వచ్చిన ని ♦ శాచరుఁ డీతఁడు గాఁడు మద్గళా
రావము వోలెఁ గూసిన ని ♦ రావము నందు తలంచి మూఢ న
త్రావహ మొందఁ గల్గునని ♦ యారటపెట్టక మున్నె వెన్కకుం
బోవుట మంచిదంచుఁ దల ♦ పోసి బిరానఁ జనంగఁ గ్రమ్మఱెన్. ౨౧౯

## ౭. జటాయు మోక్షణ పటలము. (౨-౨౩)

తే॥ రాముఁ డట్లు మారీచుని ♦ నామ మడఁచి, వడిగ వచ్చుచు నుండెంగఁ ♦ బర్ణశాల
నున్న సీత యా క్రందంపు ♦ టులివు విన్న, యంత దిగులునఁ గళవళ ♦ మందె మదిని.

తే॥ పరభృతంబు వృక్షము నుండి ♦ పదరి జాఱి, పడిన వడువునఁ బుడమిని ♦ పడుచు లేచి
కడుపు చెయివెట్టి కలఁచిన ♦ కరణిఁగాఁగ, విభ్రమము నొంది పిలపించె ♦ వివిధగతుల

తే॥ ఏల యజ్ఞానమునఁ బట్టి ♦ యిమ్మటంచుఁ, గోరి యీజీవితము చెడఁ ♦ గొట్టికొంటి
నేదిగతి? ముందు వెన్కల ♦ నెఱుఁగనైతి, యేమి చేదుగుల దుర్విధి ♦ యోచఁగలదొ?

### లక్ష్మణుఁడు సీతకు ధైర్యవాక్యము లాడుట.

తే॥ వత్స! లక్ష్మణా! సద్గుణ ♦ వార్ధియైన, యన్న రాక్షసమాయచే ♦ నలుగుల పడి
పృథివిఁ దూలె ననుచు నీవు ♦ వినియు నింక, నిచటనే నిలుచుంటివా ♦ యెడఁదఁ గొనక

తే॥ అనుడు లక్ష్మణుఁ డిట్లను ♦ నమ్మ! యీ జ, గమున రాముని కంపెను ♦ కడిమియందు
మించు శూరు లున్నారని ♦ యెంచఁదగునె?, ఆఁడుఁదనమున నరయ కి ♦ ట్లంటి గాక.

క॥ జలధులు నిఖల జగంబులు, కులశైలము లొక్కటగుచు ♦ ఘోరరణంబుల్
జలిపిన రాఘవు బలముం, జలియింపం జేయఁ గలవె? చింతింపు మెదన్. ౨౨౦

క॥ పుడమియు జలమును వహ్నియుఁ, గడలును రాఘవుఁడు కినిసి ♦ కాంచనయేనిన్
పాడియె నీత్రై పోవవె? తడఁబడి యెవ్వనిగ నతనిఁ ♦ దలఁచితొ తెలియన్. ౨౨౧

తే॥ రక్కసున కోడి కష్టించి ♦ రామదేవుఁ, డిట్లు పిలుచునె? పిలిచెనే ♦ నెల్ల జగము
లట్టె నిలువునఁ గూలవె? యఖిల జీవు, లింతకే మండి మాఁడి ల ♦ యింప కున్నె?

క॥ పలుమాట లేల? దివి భువిఁ, గలవారు నుతించు గరళ ♦ కంఠు ధనువు ము
క్కలుగా విఱిచిన శ్యామల, జలద నిభు నెదుర్చువారు ♦ జగములఁ గలరే? ౨౨౨

క॥ పతియే నొవ్వియుఁ బొరయఁడు, హతుఁడగుటా? త్రిభువనంబు ♦ లడఁగవు రవియున్
గతిదప్పఁ డుదధి యింకదు, మతిమాలిన చింత నొంది ♦ మఱుఁగం దగునే? ౨౨౩

తే|| ధర్మమున్నది దివ్యులు ♦ తనియఁగలరు, వచ్చు రాముఁడు వైళంబ ♦ వంత వలదు
చచ్చునపుడు రక్కసుఁడట్లు ♦ చావుకేక, వైచె నదివిని విభ్రాంతి ♦ పడకు తల్లి!

తే|| అనుడు మిక్కిలి కోపంబు ♦ నడలు మనము, చంపి నంతటి వేదన ♦ చండ దృష్టి
గలుగు సీత నీ విచ్చట ♦ నిలిచి యుంట, నీతిమంతము గాదని ♦ నెట్టనాడి. ౭౯౦

చ|| ఒకపరి మైత్రి గూర్చికొను ♦ నుత్తము లక్కట ప్రాణమైన దాఁ
పక యిడువారు చేవచెడి ♦ ప్రార్థన చేసిన యన్న కోరికం
గకవిక చేయు తమ్ముఁడిఁకఁ ♦ గల్గునె నీవలె? దిక్కు లేదు నా
యకుని తలంచుచుఁ విడుతు ♦ నగ్నిని జీవము లిప్పుడే వడిన్. ౭౯౧

మ|| అని చెందమ్మి వనమ్ముకై వెదకు చ ♦ క్రాంగిం బలెం గిన్కమై
ఘన ధూమావృత దావ వహ్ని వెదకం ♦ గాంతారముం గూర్చి యే
గిన వైదేహికి నడ్డు వచ్చి వినతిం ♦ గేల్మోడ్చి యో తల్లిరో!
నను మన్నింపు చలంబు వీడుమని దై ♦న్యం బంది తా నిట్లనుఁ ౭౯౨

లక్ష్మణుఁడు రాముని కడ కేగుట

చ|| మరణము నొందనేల? యను ♦ మాసము మానుము నీప్రతిజ్ఞఁ గుఁ
వెఱతు మఱేమియుం బలుక ♦ వెక్కసముం ద్యజియించి యుండె యే
మఱక వసింపుమమ్మ బలు ♦ మాయవిధిం గెలువం గలారమే?
యిరవున నిల్మ సేవకుఁడ ♦ నేగుచునుంటిఁ గలంక వీడుమా. ౭౯౩

తే|| అదను గని యాపదలు వచ్చు ♦ నమ్మ! మీరు, ప్రభునియాజ్ఞ నాక్షేపించి ♦ పలుకుచుండ
వెనుక నాయి ముందుగ గోయి ♦ విధమునొంది, మదిఁ దపించెదనని యేగె ♦ ముదలనొంది.

చ|| నిలిచితి నేని యీయమయు ♦ నిప్పున దూఁకక మానదంచు నే
వెలలితినేని రక్షణము ♦ వీడ మహాపద చెందు నంచుఁ జం
చలుఁ డయి కార్యమేది యని ♦ చానల పల్కుల కుల్కి యిట్లు రాఁ
డలఁచుట పాడియే యనఁ బ ♦ దంపడి యేమని యందు నన్నఁ గుఁ. ౭౯౪

ఉ|| పాడి దలంతు నేని యది ♦ భావ్యము భవ్యము గాని, యీమె యె
గ్గాడి మరించు దీనిఁ గను ♦ లారఁగఁ గాంచుట కంటెఁ గర్మచే
నాడికిఁ బుట్టి కొందలము ♦ నందెడు వెంగలి యే మఱేమియుం
జూడక యిచ్చటుఁ వదలి ♦ నూటిగ నేగుట చాల యుక్తమా

ఉ|| ఏసిదె పోవుచుంటి నెది ♦ యేని యవాంత్రము వచ్చునేని స
మ్మానిత రీతి నెల్లపుడు ♦ మమ్ము భరించు జటాయు వున్న వాఁ
డానిక వచ్చి త్రోవఁగలఁ ♦ డంచును పల్మఱు వెన్కఁ జూచుచుఁ
గానలు వొంధుచుం జనెను ♦ పర్వాల పుణ్యము పండు పండఁగన్, ౭౯౬

## రావణుఁడు తాపసియై సీత కడకు వచ్చుట

తే॥ అదను గని పొంచియున్న ద ♦ శాస్యుఁ డంత, వంచనము సేయ మది నెంచి ♦ వాటముగఁ ద్రి
దండమును దాలిచి జడల్ ♦ దాల్చి జనము, గౌరవించు తాపసి రూపు ♦ కడఁక నందె.

తే॥ కార్శ్యమును మేని బడలిక ♦ గానఁబడఁగఁ, బాట గతికష్టకు నటించు ♦ వాని మాఱ్కి-
వీణవంటి కంఠోక్తులు ♦ వేదములను, స్వరము చెడక పల్కుచు ఘన ♦ సరణి తోఁప.

చ॥ మెలఁకువఁ బూలు విచ్చుగతి ♦ మెల్లన నేగెడు వాఁడు భూమిఁ జి
క్కులపడిన చోటఁ గాలిడిన ♦ యంగము తోడ తెంచు వాఁడు న
గ్గలముగ దేహదుర్బలము ♦ కాళ్లు కరంబులు గల్గువాఁడు ని
య్యల జరయుక్ వరించుటకు ♦ నేవపడం దగునట్టి వృద్ధతన్. ౭౯౦

చ॥ నలినముఁ బోలు కేల నయ ♦ నమ్ములు కచ్ఛపలీల నింద్రియ
మ్ముల యడకమ్ము గూనియును ♦ పొల్పగు జన్నిదమొప్ప నొక్క-ని
శ్చల ముని వోలె దైత్యకుల ♦ జాల్మఁ డరుంధతిఁ బోలు జానకీ
నిలయము చేరె దిక్కు-లను ♦ నిక్కి- కనుంగొని మాటిమాటికిన్. ౭౯౧

క॥ త్రిదశులును భ్రమయునట్లుగఁ, ద్రిదండి యయి రావణుఁడు వి ♦ దేహతనయ యు
న్న దెసంగని వాతెఱఁబడఁ, గదిసి యెవరు మీరలనుచుఁ ♦ గడఁకం బలుకన్. ౭౯౨

క॥ సాదగు యోగి యితండని, మోదంబున జనకరాజ ♦ పుత్త్రి యతని న
త్యాదరమునఁ గాంచుచు సుమ్ము, దూదార వచోభిరామ ♦ యెుద్దకు వచ్చెన్. ౭౯౩

తే॥ మదజలముగాఱునట్టుచె ♦ మ్మటలు గ్రమ్మఁ, దొలఁకువలపు నదైత్యుండు ♦ తోడవ్రతోడవ
ప్రణుతి పాత్ర పతివ్రతా ♦ రత్నమైన, సీత సుషిమ సుషమ కనుల్ ♦ చెలఁగఁగాంచె.

తే॥ వ్యసనమున వాడియున్నయా ♦ వామ ముఖము, సురసతీ ముఖంబులకంటె ♦ సొబగు మెఱసె
తన్ముఖమ్మును చూచి సం ♦ తన సురారి, రెట్టలుప్పొంగి కృశియించె ♦ హృదికలంగ

ఉ॥ వాని కనుంగవల్ విరిసి ♦ పార్థివ పుత్త్రి మనోజ్ఞకంబునం
దాని ప్రసూన మాత్మికము ♦ నాని మదంబునఁ గ్రాలుపువ్వలి
ట్ఛ్రేణివలెన్ బ్రమోదమును ♦ చెందిన వంచు వచింపనేల? య
వ్వాని మనంబువోలె ముద ♦ పాన్నిధి మున్గి తరింప పక్షముల్. ౭౯౪

మ॥ వనజావాసము వీడి భూస్థలికి దీ ♦ వ్యద్రత్న సంకాశమా
తను వల్లిం గొని వచ్చినట్టి చెలి సౌం ♦ దర్యంబు వీక్షింప నా
కను లొక్కి-ర్వది చాలునే? తలఁపఁ బా ♦ క ద్వేషి చందాన నా
కనిమేషస్థితి నొందు నేత్రములు వే ♦ యైనం గనంజాలునే? ౭౯౫

క॥ ఈరమణి తోడి సుఖ మను, వారిధి దాఁటంగఁ దపము - ఫలముగ నజుచేఁ
గూరిన యాయువు చాలునె, సొరగు మూఁడు నఱ కోటి - సంవత్సరముల్? ౯౮

చ॥ దివిజులు దిక్పమీశులు త - దీయసతుల్ రజనీ చరావళుల్
తవిలి భయంబునం గొలువఁ - దక్కక యీ భువన త్రయంబు ని
య్యవనితిమె యేల నేనును స - యోక్తుల నీయమ కాలఁ జూప గా
రవమునఁ జేయఁ బూనుదు శి - రంబున జీవితమే తరింపఁగన్. ౯౯

ఉ॥ వేదన తోడి క్లేశమున ♦ వెల్వెఁ యైన ముఖస్థ శోభ యే
యీాదివి భూమి గెల్చునన - నించు స్మితంబునఁ గూడియున్నచోఁ
బైదలి మోము గోము గరు - వం బది యెంతగ నొప్పనోకదా?
సోదగ నీచెలిం దెలుపు - సోదరి కిత్తు సమస్త రాజ్యమున్. ౧౦౦

తే॥ ఇట్టు లవనీతుఁడై మది ♦ నెంచుచున్న, కపటమునిఁగాంచినంతనే ♦ కనులవారిఁ
జేఁదుడిచికొనుచు దయ ♦ సేయుఁడనుచు, సీత యుపచారవాక్కు వ ♦ చించియంత.

తే॥ డాసినం గని యామె వే ♦ త్రాసనంబు, చూపికూర్చుండుఁడన మాయ ♦ తాపసుండు
జింకతోలు త్రిదండంబు ♦ చెంతనునిచి, కొంచుఁ గేశవాయంచును ♦ గూరుచుండె. ౧౦౨

క॥ వృక్షములు గిరులు మృగములు, పక్షులు భయమంది వడఁకి ♦ పాఱె దెసల కా
రాక్షస వరుఁగాంచి హరిణు, లక్షమమునఁ జెదరి కొదరి ♦ యదరుచుఁ దొలఁగెన్. ౧౦౩

తే॥ ఎవరిదీపర్ణశాల? మీా ♦ రెవ్వ? రిందు, గలుగు మునిరెవ్వఁడనిదశ ♦ కంఠుఁ డడుగ
నితఁడు వెరవిఁడి యని సీత ♦ యెదఁదలంచి, పలుకఁదొడఁగె మహోదర ♦ భావమెసఁగ.

తే॥ ఓమహాత్మక! కోసల ♦ భూమిపాలు, దశరథేశసుతుఁడు పిన ♦ తల్లికోర్కి
వెలయఁదమ్ము తో సీయట ♦ విస్థలమునఁ, గొలుచున్నాఁడతని నెఱుం ♦ గుదురె? యనిన.

తే॥ బొనవును వినియున్నాఁడ ♦ నరయ లేదు, గంగ ప్రవహించు కోసలఁ ♦ గంటి నొకట
నరిదియగు కాల మడవిలో ♦ జరపుచున్న, వారు మీారేరి తనయులో ♦ పలుక వలతుర. ౧౦౪

చ॥ అనుకపటంపు మౌనికి ధ ♦ రాత్మజ యిట్లను మానిచంద్రమా!
అనఘులు సచ్చరిత్రులు మ ♦ హాత్ములు మీావలెనున్న పుణ్యులౌ
మునులయెడన్ మహోదరము ♦ పూను విదేహ ధరాతలేంద్రుఁడౌ
జనకుని ప్రేమపుత్త్రి నను ♦ జానకియందురు రామునేహినిన్ ౧౦౫

తే॥ కఠినపథముల నడచి వి ♦ క్లమమునొంది, నారు వృద్ధులు ద్వంద్వముల్ ♦ పాఱఁదోలఁ
దలఁచినారలు మీారలే ♦ స్థలమునుండి, వచ్చినారన నిట్లురా ♦ వణుఁడుపలికె ౧౦౬

సీ॥ వ్రాయసలవికాని ♦ వరతనుభాసితుఁ, డింద్రునకింద్రుండు ♦ సాంద్రయశుఁడు
బ్రహ్మవంశజుఁడును ♦ స్వర్గమ్ముతోడ న, మస్తలోకములేలు ♦ మహితగుణుఁడు

వేదవేది రజత ♦ పృథ్వీధరము లీలఁ, బెల్లగించిన భుజ ♦ భీమ బలుఁడు
చౌదంతి కొమ్ముల వ ♦ క్షమునకుఁ దొడవుగాఁ, బొసఁగఁ జల్పిన లోక ♦ వీరవరుఁడు

తే॥ అతనివీథి వాకిట నిల్చు ♦ నట్టివారు, వేలుపులె సుమ్మి యారామ♦వీథులందు
తరువులెల్లను కల్పక ♦ తరువులెయగుఁ, గాపురంబా ప్రభునిది లం ♦ కాపురంబు. ౮౯

సీ॥ పాదంబులొత్తుట ♦ పాదరక్షలుమోచు, పనులు రంభాదుల ♦ పనులె ముగుద!
అడపకత్తెలు పాడ ♦ పడఁతుకల్ కాళంజి, గొనువారు గంధర్వ ♦ వనజముఖులు
తన చండశాసన ♦ మున భానుచంద్రముల్, శీలముల్ మార్పడఁ ♦ జెలఁగువారు
ఇంద్రాది దేవత ♦ లెల్లరు తనయింటి, కావలివాండ్రయి ♦ క్రాలువారు

తే॥ నాకమునయందు భూమిని ♦ నాగమందు,గల యపూర్వ వస్తువులెల్లఁ♦గడమలేక
యుండునాతని నగరాన♦యువతి!యేమి,చెప్పనేర్తును? విభవ మే♦చ్చెంబులేదు. ౯౦

తే॥ అజుఁడొసంగిన యమితాయు♦వందువాఁడు,భవునిచేఁ జంద్రహాసంబు♦ వడసినాఁడు
గ్రహములంబట్టి చెఱలోనఁ♦గట్టినాఁడు,సకలసద్గుణవంతుండు♦సన్నుతాంగి!. ౯౧

తే॥ మంచినడవడి గలవాఁడు - మహితధర్మ, శాస్త్రవేత్త కందర్పుఁడై - శ్వర్యపడఁగఁ
దగిన పరువంబుగలవాఁడు - తప్పులెన్ని, యజహరాదుల గౌరవ - మడఁచువాఁడు.

తే॥ సకలలోకంబు లందున్న - సన్నుతాంగు, లెందఱోవాని వయగోరి - యెలయువారు
వారికోర్కులఁదాఁ ద్రోచి-వైచి యొక్క, కాంతఁ బ్రేమించి యామెకై -కాచినాఁడు.

తే॥ అతఁడు పాలించు లంకయం - దాసమెయిని, కొంతకాలంబు వసియింపఁ-గోరి చాల
కాలముండి క్రమ్మతినాఁడ-లోలనేత్ర!,యచుచుఁ బల్కి యాయమ తలం-పరయఁదలఁచె

తే॥ తనువె భారమంచుఁదలంచు - తాపసేంద్ర!, తపసు లార్యులు కోరంగఁ -దగనిహింస
సేయు నసురల నగర వ- సించుచుండ, వలసినంతి కారణమేమి - వచ్చెమీకు?. ౯౪

చ॥ వనముల నిష్ఠమైఁదపము - వారకచేసెడివారి చెంతలన్
మునిసి వసింప కార్యజన - పూజ్యులు రాజులు గల్గు చోటులన్
దనివి వహించియుండకిటు - దర్పితులై బహు దుష్టకార్యముల్
పొనరుచు క్రూరదానవ స - సమూహములోఁ బనియేమినిల్వఁగన్?. ౯౫

చ॥ అనివచియించు సీతఁగని - యంతటఁగ్రై తవమాని యిట్లు ప
ల్కును మృగనేత్ర! యీరసము - క్రూరపథంబునఁ బోక హింసయుక్
జనుజుల యొద్దనుండుసని - తప్పుగ నెంచితి నిర్జరాళికిం
గొను దనుజుల్ దురాత్ములకొ-ఉందిగ యోగ్యులు మమ్ముబోంట్లకున్. ౯౬

ఉ॥ రావణుఁడిట్లు పల్కు- రఘు ♦ రాముని దేవి తపోధికుల్ సదా
పావనులైన వారు చెడు ♦ పాపులఁ జేరఁగ రాదయంచు మా

యావులు రక్కసుల్ దలఁచి ♦ నట్టి స్వరూపము దాల్చువారలన్
భావన లేని దాట నటు ♦ పల్కఁగ నించుక వాఁడు కొంకుచున్. ౮౧౮

ఉ॥ ఈయమ శంకనొందెనని ♦ యెంచుచు దానిని కప్పి పుచ్చఁగాఁ
దోయము మార్చి యిట్టులనుఁ ♦ దోయజనేత్ర! బలిష్ఠులైన దై
తేయులు వారికిం బరులు ♦ దెప్పరముల్ ఘొనరింపకున్నచో
న్యాయము దప్పి లోకముల ♦ కాపద గూర్పరు వారలెన్నఁడున్. ౮౧౯

ఉ॥ ఆమె మనస్థిరత్వము సు ♦ రారి యెఱుంగఁగఁ గోరి యిట్లనన్
భూమిజ యిట్లు పల్కు రఘు ♦ ముఖ్యుఁడు కానల నున్న యప్పుడే
యా మనుజాశనావళుల ♦ నందఱఁ బట్టి వధించుఁ బిమ్మటన్
క్షేమము చిత్తశాంతి ముని ♦ సింహులు చెందెద రెల్లకాలమున్. ౮౨౦

ఉ॥ నావుడు రావణుండు సుమ ♦ నస్విని! మర్త్యులు రాక్షసాళికిన్
హావడి గూర్చి కూల్తురన ♦ నౌర! శశంబు గజంబుఁ జంపదే?
వావిరి జింక చంపదె య ♦ వారణ ధీరత వారణ ద్విషున్
జీవచెడన్ ఖగాధిపుని ♦ జిహ్మగముల్ వధియింపవే యనన్. ౮౨౧

తే॥ క్రూర ఖర దూషణాదుల ♦ బారి సమరు, టీరు వినియుండ లేదొ ము ♦ నీంద్ర! యనియె
నాఁడు రామునకైన బ ♦ న్నంబు దలఁచి, వెడలు దుఃఖాశ్రుకణములఁ ♦ దుడిచికొనుచు.

ఉ॥ పుణ్యచరిత్ర! శూరులయి ♦ పొల్చు దినేశ కులేశ ధర్మనై
పుణ్యముచేత లంకఁగల ♦ పుణ్యజనుల్ నశియింప నక్షజి
ద్గణ్యులు సజ్జనుల్ శ్రమలు ♦ దక్కి సుఖించుట నేఁట రేపటన్
నాణ్యము గాఁగ జూచెదరు ♦ న్యాయ మధర్మ తతిన్ జయింపదే?. ౮౨౩

తే॥ చక్కెరయుఁ దేనె యమృతంబు - చిక్కఁగలిపి, నట్లు సీత పల్కఁగ ముద - మందుచున్న
యసుర మనుజులు గెలిచెద - రన్నమాట, విన సహింపక గరువంపుఁ - గినుకఁ దాల్చి.

చ॥ కినియుచు నొక్క మానవుని - కిన్ సరిగాక సమర్థులైన య
ద్దనుజులు గూలిరందువ గ - దా? దశకంధరు బాహు మారుతం
బున నరుఁడొక్క యూఁపునను - బూరుగ దూదియుఁ బోలెఁ దూలి యే
వననిధిఁ గూలువాఁడొ కన - వచ్చును రేపె వరాంగనామణీ! ౮౨౫

చ॥ చదురులు పల్కుచున్న వన - జాత ముఖీ! దశకంఠు వేనిగా
నెదఁ దలపోసి యిట్లు వచి - యించితి మేరువు నెత్తఁ గోరినన్
త్రిదివము గూలఁద్రోయఁగ స - రిత్పతి సంక్షుభితంబుసేయ నా
ర్వదహను నార్పివేయఁగ ధ - రం దలక్రిందుగఁ జేయ నర్హుఁడా. ౮౨౬

ఉ॥ ఈ కరణిన్ వచించు దను ♦ జేశ్వరుతో నృపపుత్రి పల్కె నా
నాకశిరోధిఁ బట్టి చర ♦ ణంబులఁ గట్టి యడంచి పంపిలో
నూకిన కార్తవీర్యుని యు ♦ దూన భుజంబులు వేయి, నొక్క రెం
డే కరముల్ గలట్టి మను ♦ జేంద్ర విరోధివియె త్రుంచివేయఁడే?

రావణుఁడు కోపముతో నిజరూపము చూపుట.

ఉ॥ జానకి యిట్లు పల్కఁగ ని ♦ శాచరు కన్నుల విస్ఫులింగముల్
వానగఁ జిందె పెక్కులకుఁ ♦ బర్వ భుజంబు లొకళ్లొకళ్లతో
నూనిక మోఁదె బొమ్మికము ♦ లుప్పరమంటెఁ బయోధిరావ మ
ట్లానికిఁ బడ్లుగీఁటు ముని ♦ యాకృతిపోయెఁ జలంబు పెంపుకన్. ౨౨౮

చ॥ ఇతఁడు తపస్వి గాఁడనుచు ♦ నెంచి కలంక వహించి యెవ్వఁడీ
మతకరియంచు లోన లవ ♦ మాత్రమెఱుంగ నశక్యమైన దు
స్థితి గొనుచుట్లు క్రూర విష ♦ జిహ్మగ మల్క ఫణంబు విప్పి వి
భ్రమగతిఁ బైఁబడం బోడరు ♦ తోఁపిక నొప్పెద శాస్యుఁడయ్యెడన్. ౨౨౯

మ॥ అనిరోధుండు యమునుంచుపట్టుకొన స ♦ హ్యాంబెంతయుఁ లేని జీ
వునిచందంబునఁ గంపమొంది సురిఁగెన్ ♦ భూపుత్రి ప్రియచ్ఛోభయం
బును పోకార్చఁగ నేఁడు పెల్చు? నుడువం ♦ బోనేమి గల్గున్? వెసం
బొనరింపంగ మహేషియుండును? తలం ♦ పుంబోవ దేత్రోవనున్ ౨౩౦

మ॥ అమరేంద్రాదులు సేవలంజలుపు బా ♦ హాశక్తిసామర్థ్యముల్
తమినీక్షింపుమ యంచు రావణుఁడు దై ♦ త్యశ్రేణి నిందించెదే
ప్రమదారత్నము గాన మానితిఁ గృపా ♦ భావంబునం గానిచో
దెమలం బట్టి కటిక్కునం గొటికి యోఁ ♦ డింపన్ రుషాశాంతికిన్. ౨౩౧

మ॥ జలజాతేక్షణ! వరగ కెచ్చిరిలు శీ ♦ ర్షశ్రేణిపై శీర్షకం
బుల చందంబున భక్తిపూర్వకముగాఁ ♦ బొంకంబుగాఁ దాల్తు వే
ల్పుల చెల్వార్ భవదీయ పాదరజముల్ ♦ పోకార్చి సేవింప రం
జిలి పద్నాలుగు లోకముల్ సుఖముమైఁ ♦ జెన్నారఁ బాలింపుమా!. ౨౩౨

సీత రావణుం బదరుట.

శా॥ ఆమాట ల్విని శ్రోత్రయుగ్మకముఁ దా ♦ హస్తంబులన్ మూసి కాం
తామతల్లిక సీత, కుర్కురము పూ ♦ తంబౌ హవిర్భాగముం
బ్రేమం గోరిన రీతిఁ బుణ్యచరితన్ ♦ శ్రీరాము నత్పత్ని న
న్నేమన్నావుర దుష్ట! బాలిశ! నరా ♦ శీ! ద్రోహి! పోఁగాల్పమే?. ౨౩౩

చ॥ తృణమున నిల్చి కంకణము - తీరగు ప్రాణము కోసమానసమై
గుణవతులైన వారు కుల - కోమల ధర్మములం త్యజింతురే?
ఫణులను బోలు రాఘవుని - బాణకదంబము నీ శిరంబులం
గణకను త్రుంచుమున్నె పడు - కం దలఁతేని తొలంగి పొమ్మురా?. ౮౩౪

తే॥ అనుడు రావణుఁడనుఁ గరు.బ్బ స్త్రిరదన,కిణము లొప్పు వక్షమున నీ-యినుఁడు వైచు
విశిఖములు కొండపైఁ బడు ♦ విరుల కరణి, వ్యర్థములు గాక యేమేని♦ఫలముగనునె?

ఉ॥ ఓ వరవర్ణినీ! మదనుఁ ♦ డుత్కటబాధలఁ బెట్టుచుండె నా
యాయవి కృశింపసాగె నిఁకఁ ♦ బ్రాణము నీయడుచేత నిల్చె న
న్నేపథినైనఁ గావు మమ ♦ రేశ్వర కాంతలకున్ దురాసదం
బై విలసిల్లు భోగముల ♦ నందుమ యంచుఁ బదంబులం బడెన్. ౮౩౬

తే॥ కత్తిపోటుచేఁ బ్రాణము ♦ ల్గలఁగినట్లు, తనువునుండి జీవంబులు ♦ తరలినట్టు
లార్తినొంది జానకి లక్ష్మ♦ణా! యటంచు, నార్యా! యంచు నాక్రందింప♦నయ్యదనున

రావణుఁడు సీతం గొనిపోవుట.

తే॥ తొంటి శాపంబుఁ దలఁచి యా♦ దుష్టదైత్యుఁ, డురుభుజంబుల నానేల♦నొక్కపెట్టఁ
బెల్లగించి సీతను దాఁటి ♦ వెడల నీక, చేతులంజుట్టి రథమునఁ ♦ జేర్చిపెట్టె

తే॥ ఉరముపై భయమునఁజేతు♦లుంచుకొనిన, చెలువతనప్రాణములఁగూడఁ♦దెలియదయ్యె
మట్టితో నామె మెఱుపులో ♦ మణిఁగిపోయె, రావణుం డాకసంబున ♦ రథముఁదోలె.

తే॥ అనలమునఁబడ్డపూఁగొమ్మ♦యట్లుసీత, వాడుఁదపియించుదొరలును ♦ వనలఁగుందుఁ
ద్రుళ్లిపడి లేచుఁగాలుసే♦తులు విదుర్చు, దిక్కులం జూచు వెఱగొందు♦దిక్కుమాలి

సీ॥ ధర్మమా! యీ యాప ♦ దను తొలఁగింపవే, యిదిగదా రక్షింప ♦ నదను నీకుఁ
బావనివమ్మ గో ♦ దావరీ దేవి! నీ, వేని దెల్పఁగదె యి ♦ య్యెడరు పతికి
వనదేవతములార! వందనములు మీకు, నాస్థితిఁదెల్పరే ♦ నావిభునకు
శైలంబులార! వృ ♦ క్షములార! పిక మయూ, రములార! మృగ నిక ♦ రంబులార!

తే॥ మొగుళులార! మీకును దయ ♦ పుట్టదేమి?, ఓదినేశ! భవత్కులా♦మోదకరుఁడు
రామునకు నీవు చెప్పఁగా ♦ రాదె? నీకు, లమున కియ్యది యొక్క క♦లంకు కాదె?

శా॥ అన్నా! లక్ష్మణ! యాపదల్ తలఁగ రా ♦ వన్నా! గురు జ్ఞాన సం
పన్నా! నిన్నవినీతిమైఁ బనిపితిన్ ♦ మన్నించి వేరమ్ము యా
పన్నన్ రక్షణ సేయుభారమది నీ ♦ పై నుండెఁగాదే? దురా
త్మున్నీచుం బరిమార్పరే భరత శ ♦ త్రుఘ్నుల్ కృపాపూర్ణులై. ౮౪౦

మ॥ భ్రమఁ గొన్నావు కలంగినావు సుడియన్ ♦ వత్సంబు గోల్పోయి దుః
ఖమునం గుందెడు ధేనువట్లు మిగులం ♦ గ్రందిల్లు చున్నావు గా
తమి! నీ నెంజలి చూడఁగా నెఱుఁగ మ ♦ త్ప్రాణేశుతో నీదు ప్ర
ణ్యాయముం బెంపారఁగ గొబ్బునం దెలుపవే ♦ నామప్త కర్మస్థితిన్. ౮౪౩

తే॥ ఎదురుపడు వారలార! మృ♦గేంద్రములార!, పక్షులార! యీభూమిలో ♦ బ్రవచ్చినన్ను
పట్టి నిరువది చేతులు ♦ పది శిరములు, బ్రుంగి ధరణిఁ బడఁ గాంచిన ♦ వ్యాదువు గాక.

మ॥ ఉరుదుఃఖంబున సీత యిట్టులన నా ♦ యుష్కాలముం గోలుపో
వు రహిం బూనిన రావణుండు తటుకే! ప్రాణేశ! సింగారి! చ
క్కెర బొమ్మా! నను మాఁవుల్ గదిసి యా ♦ క్షేపించి గొల్పొంది నీన్
వెరవారన్ నిరసించు వారె? యని న ♦ న్నెం జేతులం దట్టుచున్. ౮౪౫

ఉ॥ రావణు పల్కులన్ వినిన ♦ రాముని దేవి దురాత్మ! నీచ! మా
యావి మృగంబుఁ బంపి భవ ♦ దంతకు రాఘవు దవ్వుచేసి యే
యావల నన్ను పట్టితి కు ♦ లాపశవా! యనినేయు తెంపు నీ
కావిధి నున్నదోలకు శ ♦ తాంగము నిల్పుము మాటలేటికిన్?. ౮౪౬

ఉ॥ వీరుఁడవై తివేని పెను ♦ ఖ్షితిని వొంగినేల? పంద! నీ
వారలు రోషమూనఁగ భ ♦ వత్సహజాతను ముక్కుఁగోసి యా
తీరున వారిఁ జంపు రణ ♦ ధీరులు కానన వీథియందె యు
న్నారని గాక కుర్కుర గు ♦ ణంబున వచ్చితివేల? బాలిశా! ౮౪౭

చ॥ అనుటయు దైత్యుఁ డిట్టులను ♦ నబ్జముఖీ! విను నన్ను బోఁటికిన్
మనుజులతోడ సాహవము ♦ మానక చేసిన నిందరాదె? రు
ద్రుని ఘనశైలమెత్తిన యు ♦ దూఢ భుజంబులు దొడ్డ న్యాయతం
జెనయవె? వంచనమ్మె తగు ♦ చెద్దుము మానవపాళి పట్టుటన్. ౮౪౮

చ॥ అది విని సీత నిర్దయత ♦ నావడి చేసెడి క్రూర దైత్య దు
ర్మదులకు శత్రుసమ్ముఖము ♦ క్రాలుట లోపము వారితోడ బె
ట్టిదపు దురంబు సేఁతయు బి ♦ డెంబగు సాధ్వుల మోసగించు టొ
ప్పిద మగు నిట్టిపాపులకు ♦ వీర్యము మాన మనంగ నున్నదే? ౮౪౯

జటాయువు రావణు నడ్డగించుట.

సీ॥ అనునంత దుష్టాత్మ! యరిగెద వెచటికి?, నిలుమంచుఁ గాలాబ్ద - నినద లీల
గర్జించి నిప్పులు - గ్రక్కుకన్నులతోడఁ, బిడుగులఁ బోలిన - నుడులతోడ
మేరుగిరియె లేచి - మింటఁ దిరుగుచున్న, దాయన నొప్పు కా - యంబుతోడ
శంపాభమౌ బలి - ష్ఠంపుఁ జంచువు తోడఁ, గొండ కొండయు ధాఁకి - పిండిగాఁగ

తే॥ జలధి చెలరేఁగి భూమితోఁ - గలసిపోవ, ప్రలయవాయువ్రకై వడి - వీచుచున్న
పక్షమారుతమునఁదరు-వ్రజము విఱుగ, గరుడుఁడని పుట్టలనుభుజం-గములుదూఱఁగ

క॥ ఱెక్కలఁ బుట్టిన కరువలి, నక్కజముగఁ బైకి నెగసి ♦ యాకసమందుం
గ్రిక్కిఱిసి తూలు మృగములు, మక్కెక్కఁగ మిన్ను మిగుల ♦ మాఱుపు చెందన్

క॥ అరదమున ధరణిజం గొని, యురవడి నెటకేగు వాఁడ ♦ వుండు నిలుము నీ
గరువం బడఁచెద నీచా!, తెరువు గలదె నీకుఁ బోవఁ ♦ దే:కువ? ననుచున్. ౮౫౩

తే॥ ద్రోహిరావణుఁ దలలతోఁ ♦ ద్రుంపనెంచి, యెఱ్ఱకాళ్ళులు మస్తక ♦ మెఱ్ఱకుతిక
తోడఁగైలాసగిరి వోలె ♦ దొడ్డ తెల్ల, తనువుతోడ జటాయు వ ♦ త్తఱిని వచ్చె.

క॥ బిడ్డా! భయపడకు మనుచు, నడ్డముగా నిలిచి యసుర ♦ నదలించుచు వీఁ
డెడ్డెతనమూని తాఁకం, దొడ్డాడెన యనుచు నుంత ♦ యూఱట పడుచున్. ౮౫౫

చ॥ చెడితివి నీవు బంధులకుఁ ♦ జేటొనరించితి దైత్యనాథ! యీ
పుడమి కుమారి సీత నిటు ♦ మోఱకు బుద్ధిని పట్టి తెచ్చితే?
విడువుము వీడవే నను వ ♦ వీడుట నిక్కము జీవితంబు గో
రెడు జనులెవ్వరేనియుఁ జ ♦ రింతురె యిట్టి కుమార్గ వర్తనన్?. ౮౫౬

క॥ ఖరదూషణాది వీరుల, దురమునఁ బొలియించి పితర ♦ వోరకుఁ దనియ విం
దురవుగఁ బెట్టఁగ నాతఁడు, నరసముతోఁ గొనుట యెఱుఁగ ♦ వా? యవివేకీ!

తే॥ కోప ఘూర్ణిత మదకరి ♦ కొప్పరింప, శిలలు వైవఁ దలంచితే? చెనఁటి! పక్షి
యేడ? నను చంపుటేడని ♦ యెంచితేమి? విసము మ్రింగియు బ్రదుకును ♦ విశ్వసింతే?

క॥ హరిణములు పులులఁ గాంచిన, కరణిని దిక్పతులు జనులు ♦ కాలుండును దా
శరథులఁ జూచుచు నుందురు, వెరవేఁకివి నీవు బ్రతుకు ♦ వెంటయుఁ గలదే?

క॥ సుతసోదర సహితముగా, హతమాటకు నింతకంటె ♦ నధికమగు దురా
గతమును కలదే? కుగతికిఁ, గతమిది, యే జన్మమునకుఁ ♦ గలుగవు శుభముల్. ౮౫౯

క॥ ఈ నరవరులు త్రిమూర్తుల, లో నగ్రియు లాత్మలగుట ♦ లోకములో నె
వ్వానికిఁ బోల్పఁగ నగు? నిది, మానుగఁ దెలియంగలేక ♦ మత్తుఁడవైతే? ౮౬౦

క॥ అమరులఁ గాచిన నరవరు, కొమరుఁడు కోదండ ధరుఁడు ♦ కోత్తలల నడరన్
సమయింపఁ దప్పదీ వీ, యుమ విడి పరుగిడుము నేనె ♦ యతనిం జేర్తున్. ౮౬౧

తే॥ బ్రహ్మయిచ్చినయాయువు♦ భర్గుఁడొసఁగు,ఖడ్గమునుమాయమంత్రముల్ ♦కడఁకలెల్ల
సత్యవంతుఁడౌ రాఘవు ♦ సాయకములు,బయలు వెడలు సంతవఱకె♦ బలయుతములు

తే॥ అనిన వినిదైత్యవల్లభుఁ ♦ డొడు గఱచి, కనుల నిప్పు లురలఁ జూచి ♦ గ్రద్ధ! నీవు

క్త్తోయధి నుండి తెల్లనగు ♦ తోయదమొండు ద్రవంబు గొంచు నా
ప్యాయముగా జడిం గురియు ♦ వైనము దోఁచె నభస్థ్సలంబునన్. ౮౭౨

ఉ॥ ఊరుపు పుచ్చి కోపమున ♦ నుగ్రముఖుండయి పక్షిఱేఁడు దే
వారి భుజంబు లిర్వదిన ♦ ఖావళి ఱక్కుచు దూఁటి ముక్కుతో
వారక ఱెక్కలం జఱచి ♦ వాని మహోజ్జ్వల తారహార యు
క్స్ఫార విశాల వక్షమునఁ ♦ బ్రబ్బిన కంకట మంటఁ జించఁగన్. ౮౭౩

చ॥ ఎరియుచు రావణుండు కశి ♦ నేషు శతంబునఁ బక్షిఱేని పే
రురమును గాఁడ నేసిన ముహూర్తము లోననె చింతనొందు ని
ర్జరులును మోదిలం బులుఁగు ♦ రాయఁడు దైత్యుని వింటినారి ని
బ్బరమునఁ బట్టి లాగెఁ దన ♦ బంధుర చంచువుతో బలంబునన్. ౮౭౪

తే॥ ఈశుతోఁడఁ గైలాసంబు ♦ నెత్తినట్టి, యావరి శరాసనము నోట ♦ లాగి కొంచు
నింద్ర ధనువుతోఁ దెల్లని ♦ సాంద్రమేఘ, మట్లు వెలసె; నాతని బల♦మరయ వశమె?

మ॥ వెను చూపింపని వక్షముం బొరయు నా ♦ వేగంటెఁ బాఱంగఁ జే
సిన దైత్యేంద్రుని విల్లు శూలిధనువుం ♦ జెండాడు శ్రీరామ చం
ద్రున కుం దండ్రిగ నొప్పి యాజికి సుమి ♦ త్రింజైన పక్షీంద్రుఁ డు
క్కున నోటంగొని కాళ్లతో విఱిచె ది ♦ క్కుల్ చూచి మేల్మేలనన్. ౮౭౫

తే॥ లోక కంటకుఁడైన యా ♦ నాకవైరి, విల్లు విఱుగుట గని కోప ♦ వివశుఁడగుచుఁ
ద్రిపుర సంహారకారకో ♦ ద్దీప్తమైన, శరమువంటి శూలమువైచె ♦ జగము వడఁక.

ఉ॥ శూలము తన్ను చంపునని ♦ స్రుక్కక నీడజ రాజు కాంచి నా
మేలిమిఁ జూడుమంచుఁ గడు - మేకొని వక్షముతోడఁ దాఁకఁగా
వేలుపు లిద్ది సాహసము ♦ విస్మయ మంచు వచించి చేతులన్
బోలఁగఁ దట్టి కేఁకలిడి ♦ బోరన నార్చిరి మెచ్చులాడుచున్

చ॥ వెల చెలియింటికిం జనిన ♦ పేదను పోలె, సతీమతల్లి వ
ర్త్రిలని గృహంబునం దతిథి ♦ బృందముపోలెఁ, బరేశు చింతయే
చెలువము గాఁగ నొప్పు ముని ♦ సింహునిగాంచిన యొప్పులాఁడి చూ
పుల వలెఁ, గ్రమ్మఱిల్లె వ ♦ డిఁ బోయిన రావణు శూలమ త్తఱిన్. ౮౭౬

చ॥ కినుకను వేఱుకై దువును ♦ కేలఁ గొనం గమకించు నంతలో
నన రథచోదకుం జదిపి ♦ నాలుక వెల్వడ మూర్ఛ మూడ్చి రా
వణుఁడు కలంగి ఖిందురఁగ ♦ వాని ముఖంబులు రక్తసిక్తమై
మునుఁగఁగ లక్ష్యముంచి తగు ♦ పోఁడిమితోఁ బయివైచె నాతలన్, ౮౭౭

తే॥ విసరికొట్టిన తలఁగాంచి ♦ వెక్కసమగు, బిఱియమున కత్తిఁ సంబును ♦ బెనఁగొనంగ
రావణుఁడు దండమునఁ బక్షి ♦ రాజుఁ గొట్టె, బర్వతమునఁ దెఘనపఁ బడెఁ ♦ బక్షిరాజు.

తే॥ అంతఁ దిక్షదృష్టియును వెన్నంటఁ జాల, నట్టె వేగంబుతోఁ జని ♦ స్యందనంబు
నడపుకొని పోయె దానవ ♦ నాయకుండు, సీత పుంటిపై నిప్పొంచు ♦ చెన్నొంద.

ఉ॥ ముక్కడి దైత్యుఁ డేగుటయు ♦ భూమిజ దుఃఖముఁ గాంచి చెచ్చెరన్
నిక్కి మహోద్ధతిన్ మెఱవ ♦ నించుచు శోకము నొందకమ్మ! యీ
టక్కరిఁ గూల్తు నేనని జ ♦ టాయువు దివ్యుల సంతసంబుతో
నెక్కడఁ గేగెదంచు దను ♦ జేంద్రు శతాంగము నడ్డగించుచున్. ౧౧౩

చ॥ బలమున వాని దండమును ♦ పట్టి తటాలున లాగివైచి వా
జులఁ దన శాత చంచువున ♦ జొత్తిలఁ బొడ్చి వధించె జీవితం
బులు గొను మృత్యుదేవతయు ♦ భూరిభయంబునఁ గెలుదోయి కం
పిలఁ గొనియున్ రథం బవల ♦ భిన్నము చేసెఁ దదున్నతుల్ సెడన్. ౧౧౪

చ॥ అరదము నుగ్గుచేసి భుజ ♦ హంకృతి మాపి శరాసనంబులన్
గరముల నూడ్చివైచి రణ ♦ కర్మము సాగక చేసి లోభులం
బొరసిన ద్రవ్యరాశి క్రియఁ ♦ బొల్చు నిషంగములన్ సరాలునన్
గెరలిపడంగ లాగికొని ♦ కీడ్పడఁ జేసె జటాయు వాలనిన్. ౧౧౫

చ॥ చలమున వాని శీర్షములఁ ♦ జక్కఁగ మోఁది శ్రమంబు గూర్చి బా
హులపయి ఱొమ్ముపై శితన ♦ ఖోత్కర శక్తిని ఱక్కముక్కతో
నలిగులిసేయ దైత్యకుల ♦ నాథుఁడు స్రుక్కుచు నివ్వలించుచున్
నిలిచినఁ గాంచి నీ బలము ♦ నేరుపు నింతయె యంచుఁ గేరఁగన్.

క॥ ఉగ్రుఁడయి దైత్యనాథుఁ డు, దగ్రత హరుఁడిచ్చు చంద్ర ♦ హాసము పెలుచన్
వ్యగ్రమతిఁ బూని వానిని, నిగ్రహమున నేసె విబుధ ♦ నివహము బెదరన్. ౧౧౭

చ॥ అపజయ మెట్టిదో యెఱుఁగ ♦ నట్టి జటాయువు వృద్ధుఁడోట మో
క్షపదము చేరువాఁడగుటఁ ♦ గ్రవ్య భుగీశ్వర చంద్రహాస నం
తపన మహోగ్రతన్ బలము ♦ దక్కి సురేంద్రుని వజ్రధారచే
విపుల గరుచ్ఛిదం బయిన ♦ పృథ్వీ ధరం బనఁ గూలె నేలపై. ౧౧౮

చ॥ ఎఱకలు త్రుంగి మేదిని ప ♦ యింబడె గృధ్రవిభుండు దేవతల్
పరుగులు వాఱి రెచ్చటికొ ♦ పార్థివనంధన దిక్కులేనిదై
సురిఁగె నటంచుఁ జిత్తముల ♦ శోకము నందిరి తాపసేంద్రు ల
త్తఱిని సువర్ణ పుష్పములు ♦ దండడి రాలెను కంఠరాజుపై. ౧౧౯

ఉ॥ రావణుఁడార్చె వాగుర ♦ నొఱంగి దగుల్కొను లేడివోలె భూ
దేవి తనూజ నివ్వాలత ♦ దీల్పడె నూర్చె వడంకె నొచ్చె దుః
ఖావిల తప్తచిత్తయయి ♦ యాదరువా కోమ త్రుంగిపోవఁగాఁ
దీవియవోలె నేలఁబడి ♦ తేఱక మిక్కిలి కుంది దూపిలెన్. ౨౯౦

తే॥ నన్ను కాపాడ వచ్చిన ♦ నయగుణుండు, గృధ్రరాజు గతించె ది ♦ క్కెవ్వరింక
ననుచు జానకి మిక్కిలి ♦ యంగలార్చె, నాదరువుపోవ వెల్లువ ♦ నలయుభంగి. ౨౯౧

చ॥ తెలివి యొకింత లేక గుణ ♦ ధీయుతు లక్ష్మణు పల్కులన్నిరా
కలనము చేసి కోపమునఁ ♦ గాఱులు పల్కితి సాగనంపి త
త్ఫల మిపు డొందితిం దవిలి ♦ బాసటమైన జటాయు వీల్గెఁ గా
వల మది యెట్టి కష్టముల ♦ పాల్పడఁ జేయునొ! యేమి చేయుదుఁ? ౨౯౨

చ॥ శరణ మొసంగి రక్షణము ♦ సల్పఁగ వచ్చిన యాతఁ డీల్గుటా?
నరకమునొందఁగాఁ దగిన ♦ సంజుడుదిండి జయంబు నొందుటా?
కరకరిపాపమే జయము ♦ గాంచునె? ధర్మమె యోడిపోవునే?
ధరఁగల సర్వశాస్త్రములు ♦ దబ్బఱలే? సుకృతంబు వ్యర్థమే? ౨౯౩

ఉ॥ కొంకక యేను బేలనయి ♦ కోరుటఁ బట్టియె దూరమేగు వీ
రాంకవరేణ్యులార! తగు ♦ న్యాయపథంబున నేగువారికిం
బొంకపు మార్గదర్శియగు ♦ పూతచరిత్రుఁడు తండ్రికంటె ని
ర్వంకలఁ బ్రీతిశాలి యగు ♦ పక్షివరేణ్యుని చూడ రండిటన్ ౨౯౪

తే॥ క్రొత్తడి తనంబు చెడఁగొట్టు ♦ కొనకయుంట, నాప్రయత్న మేమైన, వి ♦ న్న నువు సెందు
రాముకోదండమునకు నే ♦ రాణఁ జొచ్చు, వంశమునకబ్బె నాచేటు ♦ వలనఁ బబ్బు. ౨౯౫

తే॥ కొడుకుకై ప్రాణములువీడు ♦ కోసలేంద్ర!, మైత్రికై ప్రాణములువీడు ♦ మానసీయు
నజ్జటాయువు దివిఁజేరి ♦ స్వంగసుఖము, గొనఁగఁబిలిచితే? తా నిన్ను ♦ గూడవచ్చె.

తే॥ ఒఱలుచిటులుండు జానకి ♦ నెఱకలు తెగి, పడు జటాయువుఁగని తేరి ♦ పయిని మట్టి
పెళ్లతో నంసమున నామెఁ ♦ బెట్టికొనుచు, గగనవీథిని పఱచె నా ♦ క్రవ్యభుజుఁడు ౨౯౭

తే॥ చెనఁటి యాకాశ వీథిని ♦ శీఘ్రగతిని, జరుగఁ గన్నులు మనసును ♦ గిరగిరమని
తిరుగ ధృతిచెడి ♦ దిక్కులు ♦ తెలియకుండ, తన్ను మఱచి జానకిచేష్ట ♦ దప్పియుండె. ౨౯౮

తే॥ పిడపనిసుమంత, తెప్పితి ♦ విహగ విభుఁడు, మింటిపెసఁగాంచి దైత్యుండు ♦ మిగులవేగ
మునను జనకనందిని గొని ♦ పోవుటరసి, మనసు తపియింపఁగుంది యి ♦ ట్లని యెఁ దుదకు.

క॥ లేరై రి తనయు లిచ్చట, రారై రి ధరాత్మజాత ♦ రావడి యుడుపం
గ్రూరాత్ముల రాకాసుల, నేరితిం గూల్చు వారో? ♦ యెయ్యది తెరువో?. ౩౦౦

కం॥ రాకాసులఁ బరిమార్పఁగ, నాకుత్స్థులు జోడివడ్డ ♦ కంకణులగుచో
నీకరణి నెన్ని సీతకు, నాకేయి కెడంక వెంచి ♦ గాసించెఁ మదిన్?. ౯౦౧

కం॥ పరమాత్ముఁడై రాఘవుఁడై, పరఁగ నసురవధముసేయఁ ♦ బాపాత్ముఁడు కా
వరమున వెటువంచించెను, పురుషోత్తము నెదుట నిలువఁ బోలియకయున్నె?. ౯౦౨

కం॥ నాముద్దుల తనయుఁడు శ్రీ, రాముఁడు రక్కసులనెల్లఁ - ద్రెచ్చుఱఁజంపున్
దామరస జన్మశాపము, చే మానిని దాఁకి వెఱచుఁ ♦ జెనటి యసురయున్. ౯౦౩

కం॥ జనకజ రక్కసిచెఱఁబడె, ననిసేయఁగఁ దగినతెక్క ♦ లఱువ్వ లైనన్
వనితారత్న సతీత్వం, బను నెఱికలు త్రుంగవనుచు ♦ నారట మడిగెన్. ౯౦౪

ఉ॥ సత్తువ తగ్గి రెక్కలును ♦ జాఱఁగ సీత చెఱన్ వదల్పలే
కత్తిన సిగ్గు రాఘవుల ♦ యందలి ప్రేమయు మానసంబులోఁ
గ్రొత్తలువాఱ నిద్రగొను ♦ కొంప్పునఁ గన్నులు మూసియుండె లో
ను త్తలపాటుతోఁ దెలిపి ♦ యొయ్యనఁ దప్పకయుండె ధీరతన్. ౯౦౫

తే॥ త్వరగఁ బసిలంబుగాఁగ రావణుఁడు జనక,తనయఁగొనిపోయియామెను-తాఁకవెఱచి
విసమువంటి రాకాసుల - పిండుపడుమఁ, బందిసెంచె నశోకికా - వనమునందు. ౯౦౬

## లక్ష్మణుఁడు రాముఁ గానఁ బోవుట

తే॥ అచట హేమకురంగంబు - నంటిపోవు, ఘనఘురాఘవు క్షేమంబు - నరసిరాఁగ
సీతయంపిన సౌమిత్రి - చెలువుపింక, నరయఁబోదము వారల - మఱవనగునె? ౯౦౭

కం॥ జానకి నొంటిగ విడుచుట, చే నేమగునో యటన్న - చింతను సీతా
జాని విడఁ గాంతి మాసిన, యాననము పిసు - భరతు నంగముతోడన్. ౯౦౮

కం॥ సాగరమున నౌకంబలె, వేగిరమున నడచి రాము - వీక్షించి మన
స్సాగరము నడఁచి పరిము, త్సాగరమున మునిఁగిఁగనులు - తనివింబొందెన్. ౯౦౯

కం॥ తడఁబడి ఖేతిం బొరయఁగ, నెడమగు మారీచురవము - నెఱుఁగమి వలనన్
బుడమి తనయ బెగడెదునని,యెడఁదఁదలఁచు రాముఁడతని-నెలమింగనుచున్. ౯౧౦

ఉ॥ దేహముతోడ మానసముఁ ♦ దీఱవి చిత్తమమంది వచ్చె సం
దేహముతోడ మానసము ♦ వీఱని చిక్కమమంచు నాకడన్
మోహముతోడ మానసము ♦ మూర్ఛిలఁ దొందఱ వెట్టి పంపవై
దేహియె కారణంబగు ని ♦ ధిం దొలఁగింప జనుల్ సమర్థులే? ౯౧౧

చ॥ అని తలపోయుచున్న ఘన ♦ యన్నను జూసి నమస్కరింపఁగా
ననుజుని కౌఁగిలించుకొని ♦ యుత్తరపాటున వచ్చుటేలనన్

వినుటకు వింతయైన ధ్వని ♦ వీనులఁ జేరఁగ నుమ్మలించి మ
జ్జనని భయంబు నొందెఁ బలు ♦ చందములన్ దగవ్రూఁది పల్కెనన్.

ఉ॥ నీవరశక్తి ధైర్యముల ♦ నేనెఱిఁగింప వినంగ నొల్లకే
పోవక యుందువేని పడి ♦ పోయెదఁ జిచ్చున నంచుఁ గానలో
దావముఁ గూర్చి పోవ నెడ ♦ ధర్మము కాదని యందు నిల్వలే
కీవగ నామెఁగావ మది - నెంచితి నంచనుజుండు పల్కఁగన్. ౬౧౩

ఉ॥ చావఁగనున్నఁదప్పునొకొ? - సంకటముల్ దొలఁగంగ నూఁకు నే
ర్పేవిధి లేని దక్కటా! వి ♦ హీనమతిం బదరెన్నిజంబుగాఁ
గావలి లేనిచో నెడరు ♦ గల్గును వచ్చిన యాపదావళుల్
పోవవు వేఱుసేయుటకుఁ ♦ బూనిన సోఁకుల తంత్ర మియ్యదా. ౬౧౪

ఉ॥ నీయెడఁ దప్పులేదు గుణ ♦ నీరధి! ధీ రహితాత్మ సీత నీ
వాయెడఁ బల్కు పల్కుల న ♦ నాదృతి చేసెను నేఁదలంచి న
ల్లీయది పూని నన్ జెఱచె ♦ నే యని యెన్నఁడు నేని డెంద మ
త్యాయతమై కలంకమతి ♦ నందని రాముఁడు కుందె నెమ్మదిన్. ౬౧౫

ఉ॥ కాలము త్రోవఁగా ఫలము ♦ గల్గదు జానకిఁ గాంచు పిమ్మటన్
దూలును చింత వేఁకొకట ♦ దోరదయంచు వచించి క్రంచరన్
జాలగ దవ్వు నారసము ♦ చందమున న్నడతెంచి లోల వ
క్రాలక సీతయుండిన మ ♦ హావనమున్ దరిసించి యయ్యెడన్. ౬౧౬

## శ్రీ రాముఁడు సీతలేమికిఁ జింతిలుట.

ఉ॥ శ్రీరఘువీర శేఖరుఁడు ♦ చింతను పర్ణకుటీరమందు కాం
తారమునందు నెచ్చటను ♦ ధారణి కన్యక జాడ గానక
ట్లూరక మ్రాన్పడ న్నిలిచె ♦ నొత్తిలి కాయము జీవువీడి ని
స్సారత నొంది పిమ్మటను ♦ సంకట మందుచు రోయు కైవడిన్. ౬౧౭

ఉ॥ జీవితవాంఛపై విసుగు ♦ చెందిన రాఘవ సార్వభౌముఁడ
ద్దేవిని కానమి న్నిలిచె ♦ దివ్యనిధిం దనకంచు డాఁపఁగాఁ
జేవిడఁ జోరుఁడొక్కరుఁడు ♦ చేరి ధరాస్థలిఁ గల్లగించి కొం
పోవెతనొంది దిగ్భ్రమము ♦ పొంది యలంగెడు దీను కైవడిన్. ౬౧౮

చ॥ తిరుగఁగఁ జొచ్చె భూమియు న ♦ దీనదముల్ కడు సంచలించె సా
గరములు ఘూర్ణిలెన్ గిరులు ♦ క్రక్కదలెన్ దొలివేల్పు కన్నులుం
దిరిగెను సూర్యచంద్రులును ♦ దిక్కటి త్రోవలఁ దప్పినారు శ్రీ
వరుఁడు తపింప నెయ్యది ధ్రు ♦ వంబుగ నిల్వఁగఁ జాలుఁ జెప్పుమా?:

శా॥ కోపంబూనునొ పాడిపైఁ? దనవపుం ♦ గోపించునో? నాకముం
గోపంబారఁగఁ జూచునో? త్రిదశులం ♦ గోపించునో? నానలం
గోపస్ఫూర్తిని కాంచునో? శ్రుతులపైఁ ♦ గోపించునో? వేదపై
గోపంబూనునొ? యేమిసేయునొ? యనుచుం ♦ గుందెన్ జగజ్జాలముల్.

చ॥ సకలము డిందె లోకవిభు - చక్కని గర్భము సొచ్చువేళలోఁ
గకవికచెందె లోకములు - క్రన్న విపర్యయ మొందుకై నరీన్
సకల జగచ్ఛరణ్య గుణ - జాలుని రాము మనంబు వేగఁగా
మెకములు కొండలుం జనము - మేదిని నాకము నొందె దుఃఖముల్. ౯౨౧

ఉ॥ కాంచుము తేరి చక్రము ది - గంబడి పోయినదారి యిద్యోడన్
గాంచుము దేవిఁ దాఁకె భయ - కంపితుఁడై భువిఁ గొల్లగించుటల్
కాంచఁగరాదు కార్యమిటఁ - గాడ్పడి యజ్జులపోల్కి నిల్చినన్
కాంచఁగ నౌను వారు దవ్వు - గాఁ జను ముందని లక్ష్మణుండనన్. ౯౨౨

రామలక్ష్మణులు సీతను వెదకుచుఁబోవుట.

చ॥ సరియని రామచంద్రుఁడును - చయ్యన నాయుధముల్ ధరించి పెం
డెరువును పట్టి ప్రమాఁకు లవ - నీ ధరము ల్నలఁగంగ వేగమై
నరదము భూమిమీఁదఁ జని - నంతకు దుర్గమ కాననస్థలిన్
దరియుచు దాఁటుచుం గడఁక - తక్కక యేగె ననుంగుఁదమ్మునితో. ౯౨౩

చ॥ ధరణి శతాంగ చక్రముల - దారియు గుర్తులు తేలిపోయి యం
బరమున నేగినట్లు నడి - పాఱుటచే వ్రణమందు నీఁకె పో
టొరసిన లీలఁ దోఁపఁ గన - నోపుట కెయ్యది మార్గమంచు నం
బురుహవిలోచనుం డనఁ బ్ర - పూర్ణ గుణాంబుధి లక్ష్మణుండనున్. ౯౨౪

శా॥ అన్నా! చూడుము తేరు దక్షిణదిశా - ప్రాంతానకుం బోయిన
ట్లెన్నంగాఁదగు నీశరంబు పొడవే - యీవ్యోమ మార్గంబు నీ
కన్నుల్ బాష్పము గార్చుచుండ నెదియుం - గాన్పించునే? పోదమీ
తెన్నుంబట్టి యుదంతముల్ తెలియనౌఁ - దెల్లంబుగా మీఁదటన్.

చ॥ అన నది యుక్తమంచు వసు - ధాధిప వర్యుఁడు తమ్మునితోడ యో
జనములు రెండు దాఁటిచని - చక్కటి నొక్కనగేంద్రమే ప్రభం
జనహతిఁ దల్లడిల్లుచు - జాఱినకై వడి వీణెటెక్కె మెం
డనువుగ ధారణిం బడుట - యల్లనఁ గాంచెను సంశయించుచున్. ౯౨౬

చ॥ కని జనకాత్మజాతకయి - కయ్యము గల్గిన దియ్యోడన్ భరం
బున దనుజాళితో విబుధ - ముఖ్యులకంచుఁ దలంచి తుండ మ

ర్ధనమునడాలు ప్రీలఁగని - తద్దయుఁ గన్నుల బాష్పబిందువుల్
తోనఁకఁగ లక్ష్మణుఁగని సు - దుఃఖముతో రఘురాముఁ డిట్లనుౘ్. ౨౭

చ॥ అరయుము లక్ష్మణా! జనకుఁ - డైన జటాయు కరాళ తుండ దు
ర్భరహతిచేతఁ ద్రుంగినది - రాజిత సత్త్వముచే నెదుర్చు న
ప్పరమగుణాబ్ధి కేమిగతి - పాటిలెనో? యొకరుండు దేహముౘ్
వరలెను వార్ధకానఁ బలు - వత్సరముల్ కడద్రోచె నావుడుౘ్. ౨౮

ఉ॥ మంచిదె తండ్రి చాల మతి - మంతుఁడు వృద్ధుఁడు సత్త్వశాలియుౘ్
గ్రంచరనేగి యాతనిని - కాంతము వారల నడ్డగించుచుౘ్
మించి నిశాటులం దునిమి - మేలుగ సీతచెఱౘ్ వదల్చ యో
చించుచు నిట్టులుంట సాగ-సే యని తమ్ముఁడు పల్క రాముఁడుౘ్. ౨౯

ఉ॥ జాలమొనర్ప కేగుటయె ♦ చక్కటియంచుఁ దలంచి భూమిపై
గాలివలెం జరించుచును ♦ గాలిపటంబు క్రియౘ్ భజించి జం
ఘాలురు రామలక్ష్మణులు ♦ కార్ముక మొక్కటి యింద్రచాపముం
బోలెఁ బయోధి వీచికయుఁ ♦ బోలెఁ దునుంగుట గాంచి రచ్చటన్. ౩౦

ఉ॥ తమ్ముఁడ! కాంచితే ధనువు ♦ ధారణిఁబడ్డది దేవదానవుల్
క్రమ్మి పయోనిధిం జిలుకు ♦ కవ్వపుఁగొండను బోలు సత్త్వఁడుం
దమ్ములపొందుఁ బోలిన ప్ర ♦ తాపము గల్గిన యజ్జటాయువే
యమ్మెయిఁ ద్రుంచెనంచు నమ ♦ రావనిఁజూచుచుఁ బోయిరిద్దఱున్. ౩౧

తే॥ మఱియుఁగొంతదూరముపోయి♦మరలఁగనిరి,శూలమొక్కండునారాచ♦జాలమున్న
తూణములు రెండు కొండల ♦ తుండులట్లు, పడి విరాజిలు టాశ్చర్య ♦ భరితులగుచు.

తే॥మఱియుఁగొంతదూరముపోయి♦వెఱఁగుగొలుప,సూర్యచంద్రులురిక్కలు♦సారిదిఁజేరు
కరణినున్న బొందడమును ♦ కానయెల్లఁ, గ్రమ్మకొనఁ జీల్చివై చుట♦గాంచిరచటౘ్ ౩౩

తే॥ పవన జవన తురంగముల్ ♦ పడినచోటు, సారథియుఁ దలదెగిపడి ♦ చచ్చుతావు
వానియనుచరుల్ కెడసిన ♦ తానములును, పంక్తికంఠుఁడు సోలిన ♦ పట్టుగనిరి. ౩౪

తే॥ ప్రళయవేళను భానుబిం ♦ బములు పెక్కు, లుర్విఁగూలిన కరణిఁ ♦ త్రోవ్వి జ్వలత్ప్ర
శస్తకుండలములు విభూ ♦ షణచయంబు, తెరలుటంగని కేలువి ♦ దిర్చికొనిరి. ౩౫

తే॥ అంగదములు కుండలములు ♦ హారరత్న, మకుటములు పెక్కులున్నవి♦మనజనకుఁడు
వృద్ధుతోఁ బోర నిల్చిన♦వీరవరులు,శరభఘుఁలఁ బోలుపెక్కండ్ర♦జాడ దోఁచె. ౩౬

తే॥ శ్రీశుఁడిట్లన లక్ష్మణ ♦ సింహమువిని, తలలుచేతులు పెక్కులై ♦ తనరుకతన
తండ్రితో సనిసేసిన ♦ దైత్యవరుఁడు, దశముఖుండని నామదిఁ ♦ దలఁతు ననిఘె

తే॥ పలువితంబుల నృపుఁడిట్లు - పనవిచిత్త, వికలతం జెందె; సౌమిత్రి - వెగడుపడిచె;
నపుడు సుంత తెలివినొంది - యుండజేంద్రుఁ, డూర్పుపుచ్చుచు నిర్వార - నొగినిగాంచె.

తే॥ రాఘవులఁగని సమ్మద - స్రవములుగురియ, తెగిన ఱెక్కలు ప్రాణంబు - తివిరిన ప్త
భువనములఁ బొందుపోలికఁ - బొంగినింద - పాపివై చితినవియల్లఁ - బలుకఁదొడఁగె. ౯౪౭

## జటాయువు రామలక్ష్మణులకుఁ గర్మప్రభావము దెలుపుట.

ఉ॥ పుణ్యచరిత్రులార! పాలి ♦ వోవు శరీరము వీడ నుంటి నా
పుణ్యవశంబునం దెలియం ♦ బొందితి మిమ్మని చేరఁ బిల్చి యా
పుణ్య జనేశు శీర్షములఁ ♦ బొడ్చిన ముక్కున భానువంశ రా
డ్గణ్యుల మస్తకంబుల రు ♦ టంబుగ మూర్కొని వెండి యిట్లనున్. ౯౪౮

ఉ॥ వంచనచేత జానకికి ♦ వచ్చె దొసంగని మున్నె యెంచితిన్
జంచలనేత్ర నొంటి నుట ♦ జంబున వీడితిరేల? యన్న ధ
ర్మాంచిత మూర్తి లక్ష్మణుఁడు ♦ హావడి కారణమెల్లఁ దేటగా
వించి వచింప నాతఁడును ♦ వీనులు క్రుంగ వినంగ లేమికిన్. ౯౪౯

తే॥ వెండి మోమును గన రామ♦విభుఁ డెఱింగి, తెలుపఁ జెవికడ సౌమిత్రి♦ తెలియఁ బలుక
విని గ్రహించి కుమారులు♦ వెగడు పడక, యుండునట్లు పల్కఁగ నెంచి♦యొయ్యననియె

తే॥ క్రొత్తగా నొక్కరెద్దియుఁ♦గూర్పలేరు, జన్మ సుఖ దుఃఖములు కర్మ♦సంచయమునఁ
గలుగు నని యెఱుంగక యున్నఁ ♦ గర్మములను, బుద్ధిచే జయించుట యెట్లు♦పొసఁగు

చ॥ విధి కృతమంచు నెంచఁదగు ♦ పీడలు గల్గినవేళ మానసం [జెపుఁడ? ౯౫౦
బధికముగాఁగ నొవ్వఁ దన ♦ యక్కఱ మానుట ధీరధర్మమే?
బుధనుతమైన లోకమును ♦ పోఁడిమి సృష్టి యొనర్చి నట్టి యా
విధికిని మస్తకం బొకటి ♦ వీడఁగఁ జేసిన కర్మ మల్పమే?. ౯౫౧

మ॥ సుఖదుఃఖంబులు గల్గువేళ తొలఁగం ♦ జూడంగ నొనట్టిదే?
మఖ విద్వేషి కపాలియై తిరియఁగా ♦ మార్పించె రాహు గ్రహ
ప్రఖరాళీ గ్రసితుల్ రవీందులు, చెడున్ ♦ వర్ధిల్లు శుభ్రాంశుఁడీ
నిఖిలాండంబులు కర్మచేతఁ బొడమున్ ♦ నిల్చున్ నశించున్ దుదిన్.

క॥ చెడుగులు వచ్చుట తీఱుట, పుడమి జనుని పూర్వ కర్మ ♦ మున నగు నిక్కం
బిడుమల నింద్రుఁడు పెక్కులు, కుడువఁడె తొలి? మీరు వినరె♦గురుశాపమునన్?.

ఆ॥ సాటిలేని తోడ్ధ ♦ శంబరాసురునిచే, నిర్జరాధిపుండు ♦ నింద నొంద
నపుడు వానిఁ గూల్చె ♦ నజు పట్టి మీతండ్రి, కర్మవునన యున్ని ♦ గలుగుఁ జూవె.

ఉ॥ వీరవతంస! జానకిని ♦ వీడుటయుఁ దనుజాళి ధర్మపున్
మీఱి చరించి త్రెంచుటయు ♦ నిక్కలి ఖేదము సంఘటించెఁ ద
ధారుణి సజ్జనావళికి ♦ దానిఁ దొలంపుము క్రూరదైత్యులన్
వీరత సంహరింపుము త ♦ దింపుము కీర్తిని నిల్పు ధర్మమున్. ౫౫౬

ఉ॥ భూమిఁ బెకల్చి యెత్తికొని ♦ భూమిజఁ గైకొని పోవుదైత్యు నా
స్థేమముఁ జూచి పోరితిఁ జ ♦ దిన్ దనుజేంద్రుఁడు శంభుఁ డిచ్చు ప్రో
ద్దామ కరాసిచే జతను ♦ పేసరపోవఁగ నిట్లు చేసె నా
కీ మరణార్తి గల్గెనది ♦ యిప్పుడె రాజకులావతంసమా! ౫౫౭

శ్రీరాముఁడు దివిజులపైఁ గినుకఁ గొనుట.

క॥ ఆమాటలు చెవిఁబడ శ్రీ, రాముని కనుదోయి రక్త ♦ ధారలఁ గురిసెన్
భీమముగ భ్రుకుటి ముడివడె, ధూమముతో నగ్ని లేచెఁ ♦ దొట్రిలె జగముల్. ౫౫౮

చ॥ నిలుకడ దప్పె ధాత్రి ధర ♦ ణీధరముల్ పెటిలెన్ దినేశ చం
ద్రులు గ్రహముల్ గతుల్ బెడిసెఁ ♦ దోయజగర్భుఁడు లెక్కడెన్ జగ
ద్విలయము నాకము న్వడఁకె ♦ దిగ్గజముల్ బెదరెన్ సమస్తమున్
దెలిసికొనెన్ రఘుప్రవరు ♦ దీపిత సత్త్వపరాక్రమ స్థితుల్. ౫౫౯

తే॥ ఎవరిపై వ్రాలునొక్కొ యీ ♦ యీర్ష్యయనుచు, జగములెల్లను జగడొంది ♦ సంచలింపఁ
బొగయు నిప్పును వెలువడ ♦ భూరి భీక, రముగ నట్టహాసంబుతో ♦ రాముఁ డనియె.

చ॥ తెలివి యొకింతలేని యొక ♦ తెక్కలి దైత్యుఁడు నాసతీమణిన్
బలమునఁ గొంచుఁ బోవ నొక ♦ పాటిగ మీఱిటు గాఁగ నుంత భీ
తిలని దిశావృతంబు జగ ♦ తీ తలముం గని యూరకున్న ది
వ్యులఁ బరిమార్తు నిప్డె కని ♦ యూఱట నందుమ తండ్రి! యీవెడన్.

ఉ॥ రిక్కలు రాల సూర్యుఁడును ♦ ప్రేల సభస్థలి నిప్పుగ్రమ్మఁగా
నొక్కటఁ బంచ భూతములు ♦ నుర్వి చరాచర జీవ కోటులున్
స్రుక్క సమస్తలోకములు ♦ చూర్ణముగా దిశలుం బగుల్లగా
నుక్కటి బ్రుంగుచుండఁగ న ♦ ముత్సుకతన్ గను తండ్రి! యిత్తఱిన్.

చ॥ అని రఘుపుంగవుం డదర ♦ నంబుజ మిత్త్రుఁడు మేఘ మండలం
బున నడఁగారె దిక్కరులు ♦ పొక్కుచుఁ బాఱె జగంబులెల్ల జం
కెనయును విమ్మటిం గొనిన ♦ ఖేదము చెప్పఁగ నేల? దిట్టల
క్ష్మణుఁడును జంకెనన్న నుడి ♦ చాలదొ? తక్కటి యేల పల్కఁగన్?. ౫౬౩

జటాయువు రామునకుఁ గర్తవ్యము దెలిపి ముక్తుఁడగుట.

ఉ॥ రాఘవు కోప జృంభణ భ ♦ రంబు జటాయువు గాంచి యిట్లనున్
నీ ఘనకోపమున్ విడుము ♦ నిర్జరులున్ ముని చంద్రులున్ వరా
మోఘ భవద్బలంబునన ♦ మోఱకు సోఁకుల పోరునీఁగి దుః
ఖౌఘములం ద్యజింతురు దు ♦ రాత్ముల వేఱొక రీతి దోర్తురే?. ౯౬౪
చ॥ అజుని వరంబుచే మదము ♦ నంది దురాత్ముఁడు చేయు చేఁత ల
క్ష్యజముగ నాయెడం దెలిసెఁ ♦ గాదె? మఱొక్కటి యేల చూపఁగన్?
భుజగులు వేల్పులు న్నరులు ♦ పూజ్యుఁడు బ్రహ్మయు వానిసేవలన్
గుజగుజపోవ, ధర్మవును ♦ కోరి చరించెడు వారలుందురే?. ౯౬౫
ఉ॥ వైరులయొద్ద సేవకుల ♦ వైఖరి స్త్రీలవలెం జరించుచున్
భూరి సుఖంబుల న్విడిచి ♦ పొక్కుచుఁజావక వేల్పులెల్ల మున్
శ్రీరమణుండు పాల్కడలిఁ ♦ జిక్కిన వేళ ననుగ్రహించి దే
వారుల నేమఱించుచు ద ♦ యన్ సుధ యీయఁగ నుండి రింతకున్.
ఉ॥ బాహు బలాఢ్యులార! వర ♦ వర్ణనిఁ గానల నొంటి డించి మా
యా హరిణంబు వెంటఁ జని ♦ యచ్చపు మీకులగౌరవంబు సం
దాహ మొనర్చినార లది ♦ తప్పక మీదగు తప్పుగాక సం
దేహములేల? మానవులు - దెప్పిన వారల నేరమౌనొకో? ౯౬౭
ఉ॥ కావునఁ గోప మందకుము - కాంత యరుంధతి వంటి సీత దుః
ఖావలిఁ బాపి వేలుపుల ♦ యంగద క్రుంగఁగఁ బాడి వర్ధిలన్
రావణుఁ గూల్చి లోకముల - రక్షణసేయుమ యంచుఁబల్కి తా
పావిల మానసుండయి ద ♦ యాళు జటాయువు మూసెఁగన్నులన్. ౯౬౮
మ॥ విహగశ్రేష్ఠు వినీతి సంభృత వచో ♦ విన్యాసమున్ మూర్ధమం
దహరేశాన్వయుఁడూనె నాత్మ పితృవా ♦ క్యాళింబలెన్; ధర్మ సం
గ్రహమున్ దైత్య వధంబు ముఖ్యమగు నా ♦ కర్తవ్య మిచ్చోఁ గ్రుధా
బహుళ వ్యాహృతులేల యంచు నుడిగెన్ ♦ బ్రజ్ఞాయుతుండై వెసన్.
మ॥ శ్రమగొన్నారలు బాధ నొందితిరి ఏ ♦ శ్రాంతిం గొనుం డేను పోఁ
డిమి మీయాజ్ఞ శిరమ్మునం దునుచు కం ♦ టెన్ వేఱు నాకేది మో
దము గల్గించును? సీత నెచ్చటికి నా ♦ దైత్యుండు కొంపోయెఁ? ద
త్క్రమముం దెల్పుఁడు నా జటాయు వలసెన్ ♦ దప్పెన్ స్మృతిన్ మీఁదటన్.
మ॥ అరవిందాసన శంకరాదులును సర్వా ♦ మ్నాయముల్ వేని పా
ద రజంబుం గనుఁగొంటకై శ్రమములన్ ♦ దైవాఱఁగా నోర్చియున్

బొరయం జాలవొ యట్టి రాము చరణాం ♦ బుల్ గాంచి ధన్యాత్ముఁడై
వొరసెన్ శాశ్వతమోక్ష లక్ష్మి విహగేం ♦ ద్రుం డాత్మ సాక్షాత్కృతిన్.

మ॥ అటఁ బక్షీంద్రుఁడు ముక్తినొందఁగ నిలిం ♦ పాదుల్ రఘుశ్రేష్ఠు లు
త్కటశోకాకులచిత్తులై రి యల కాం ♦ తార ప్రదేశంబు సం
కట పాటొందె మృగాళితోఁ దరులతో ♦ తామ్ర భృత్సమూహంబుతో
బటు దుఃఖంబున శీర్షమందు కరముల్ ♦ బంధించె లోకావళుల్. ౯౨౨

మ॥ శ్రమలం బొందితి దుష్టరాక్షసునిచే ♦ శౌర్యంబు గోల్పోయితిన్
దమినై ఘోర తపంబు సేయుదున? దై ♦ త్యశ్రేణి మర్దింతునా?
యమినై ప్రాణములం ద్యజింతున? మహా ♦ యం బెయ్యదో తెల్పు శ్రే
యములం గూర్చెడు తండ్రిఁ గోలుపడి యె ♦ ట్లంకింతు జీవంబులన్? ౯౨౩

మ॥ అను నన్నంగని తమ్ముఁడిట్లను మహా ♦ త్మా! నిత్య తేజా! పురా
తన కర్మంబుల నింద సేయఁ దగునే? దాయంబు రెచ్చైనఁ జిం
తను పొందన్ ఫలమున్నె? రక్కసులఁ గ్రో ♦ ధం బాజిఁ జక్కాడి యా
వెనుకన్ దుఃఖము నొందఁగాఁదగు మదిన్ ♦ వీక్షింపుమా తత్త్వమున్.

శా॥ అన్నా! మీరు మదిం గలంగి కడు దై ♦ న్యంబూని విభ్రాంతి నా
పన్నన్ మావదినెన్ విడన్ దలఁతురే ♦ బందీకృతన్? బుద్ధి సం
పన్నుండా మనతండ్రి గీటడఁచు క్ర ♦ వ్యాదున్ వడిం జంపకి
ల్లెన్నన్ శోక పయోధిఁ గ్రుంకెచుఁ దపం ♦ బీ కొంటయుం బోలునే?

మ॥ అనుజశ్రేష్ఠుని వాక్కులొప్ప విని ♦ దైన్యంబున్ విసర్జించి యా
దనుజశ్రేణి వధించుటే తగవుగాఁ ♦ దర్కించి సౌమిత్రితో
మనుజాధీశుఁడు పల్కె నీతనికి సం ♦ స్కారంబు గావింతమా
తనుజన్ముల్వలె నౌర్ధ్వదైహికములం ♦ దాత్పర్యమే పారఁగన్. ౯౨౬

తే॥ అని యగురు చందనేంధనా ♦ లరసి తెచ్చి, పేర్చి దర్భలు పఱచి పై ♦ విరులు సల్లి
యరణి మథియించి యనలంబు ♦ నెరియఁ జేసి, విమల జలమున స్నానాది ♦ విధులుదీర్చి

చ॥ కరములఁ బట్టి యెత్తి తగఁ ♦ గాష్ఠము పేర్పునఁ జేర్చి వేదవి
ద్వరుఁడు రఘూద్వహుండు శ్రుతి ♦ పద్ధతిఁ దక్కకచేసి యవ్వలన్
శిరము కెలంకునం గొఱవిఁ ♦ జేర్చి దహించి కొలంకులోనఁ గ్రుం
కి రహిని తర్పణాదులను ♦ గీష్పడ కుండఁగఁ జేసి నెమ్మదిన్. ౯౨౮

తే॥ పితరులకు నెల్లఁ దర్పణ ♦ విధులు తీర్చి, యించుక జలంబు తాఁ ద్రావి ♦ తృప్తిఁ గాంచి
బ్రహ్మ మొదలుగ నెల్ల జీ ♦ వప్రతాన, మునుసు సంతృప్తి వహింపఁ జేసె ♦ [illegible]

మ॥ జయ శీలుండగు రామ భూవరుఁడు శా ♦ స్త్ర ప్రక్రియల్ దీర్చి సం
శయముల్ మాని నిశాట మర్దన మహా ♦ సక్తిం బ్రకాశింప ని
శ్చయ సంతోషమునఁ దలిర్చెఁ గ్రతు భు ♦ క్సంఘంబు, భానుండుఁ ద
త్క్రియఁ దానుం బొనరింప నేగెననఁ గ్రుం ♦ కెం బశ్చిమాంభోనిధిన్. ౯౮౦

## ౯ అయోముఖి పటలము (౧౦౧)

చ॥ సరగున రామ లక్ష్మణులు ♦ సంజను తత్స్థలి వీడి కారు చి
చ్చు రవులు వెల్గుచేఁ దెరువు ♦ చొప్పు గనంబడ నొక్క నల్లనౌ
గిరివరమందు చేరి రటఁ ♦ గీల్కొనె నిద్రమ జయించి రేఁగు రే
దిరుగుడు మూఁకలట్లు కడుఁ ♦ దెట్టియలై యిరు లగ్గలించుచున్. ౯౮౧

ఉ॥ అయ్యెడ కానలున్ గిరులు ♦ నన్నియుఁ దేనియ చింది వాఁగులన్
గ్రయ్యఁగ మక్షికౌఘ మొందు క్రియఁ ♦ గానఁగ నయ్యెను వారి చింతతో
నెయ్యు జటాయుపాతమును ♦ నిండిన కోపము నాన తెల్వియున్
డయ్యుటయుం బెనంగొని యె ♦ డందల మిక్కిలి నొంచి మారిచెన్. ౯౮౨

మ॥ ఘన విజ్ఞానము లేని మూఢుఁడు తగం ♦ గర్మంబుచే నొందు సం
జననంబుంబలె రేయియున్, ఘృతము నో ♦ జం బోయ వగ్ధిల్లు న
గ్నిని పోలం గడు వేఁడి యూర్పులు పెరిం ♦ గెన్, నిద్రరాదయ్యె రా
మునకు న్నిందిత రీతి దార జనకుల్ ♦ పోరాములం బొందుటన్. ౯౮౩

### రాముఁడు సీతం దలంచికొని పరితపించుట.

తే॥ రాము నేత్రపద్మంబులు ♦ రాత్రులందు, ముడుఁగకుండుట సీతయన్ ♦ జడధి కన్య
వీడి యుంటకో? తన్ముఖ ♦ విధుని చూడ, కుంటవలననో? మది తన ♦ యొద్దలేదొ?

తరల॥ అతని కన్నుల ద్రోఁచి గన్పడి ♦ నట్టులున్న వసుంధరా
సుత వరాకృతి కప్పు కుప్పలు ♦ శోషిలం బొలుపారెఁ దా
మతిని నిబ్బరమంది లక్ష్మణు ♦ మాడ్కి చెప్పలు వ్రాల్ప క
ట్లతివ రూపు నిమేషణ స్థితి ♦ నంది కాంచుచు నుండఁగన్. ౯౮౪

తే॥ మైథిలాత్మజా శోభాయ ♦ మానమైన, మోము గాంచితి నని తాను ♦ మురియునట్లు
మలయపవనసర్పముప్రాఁకు ♦ మలచక్షియను, కాంతిగల చంద్రబింబంబు ♦ కానఁబడియె.

చ॥ అతనుఁడు పొంచియున్న తెర ♦ నవ్వలఁ ద్రోచి జగంబు తెల్లనౌ
యతమతిఁ గాంచు నట్టులు ర ♦ యంబునఁ జేసిన చంద్రకాంతు లు
ద్ధతి భుజగంబు ఘోరవిష ♦ దంష్ట్రిలతోడ వియోగ బాధిత
ప్రతతిని కాటువైచి పలు ♦ వంతలు గూర్చెడు నట్టు లేసరేన్. ౯౮౫

చ॥ జనకజ లేని చింతయు వి ♦ సంబును చల్లెను చంద్రమపీడయుఁ
బెనఁగొన నేమిదోఁచక వి ♦ భిన్నతనొంది ఫణేంద్రమవంటి ప్ర
స్ఫుని మృదురోమరాజి నలి ♦ నస్మను మించిన మోము పోలఁ బో
లిన పలుకుల్ గలట్టి లవ ♦ లీ లలితాంగిఁ దలంచి కుందుచున్. ౯౮౮

క॥ పెదవులఁ గఱచుచు నిట్టూ, ర్పొదవ భుజము లదర నిన కు ♦ లోత్తముఁడు మదిన్
మదగజము విజృంభించి వెడఁగఁ, గుదివడు లేఁ గొమ్మవంటి ♦ కోమలిఁ దలఁచున్. ౯౮౯

ఉ॥ వంచిన వింటితో నడిగ ♦ వచ్చును వచ్చునటంచు దిక్కులం
కించుచుఁ జూచె నేమొ కిల ♦ కించితవర్తన నంచు లోఁగ భా
వించుచు వార్ధిపై నిరియు ♦ వీచికలం బలె నెచ్చుతగ్గు నా
పించెడు నూర్పుతోడఁ బల ♦ వించె మదిం బయ లుబ్బకుండఁగన్. ౯౯౦

తరల॥ మెఱుపుఁ బోలిన వక్రదంష్ట్రలు ♦ మీఱ భీకరరూపుఁడై
వెఱపు పుట్టఁగ నిల్మునిల్మని ♦ వెక్కసించుచుఁ బంక్తికం
ధరుఁడు డాసినవేళ జానకి ♦ తత్తఱించెనొ? సోలెనో?
విరవిరం గొని విహ్వలించెనొ? ♦ భీతి నన్ను దలంచెనో? ౯౯౧

తరల॥ విషధరంబు గ్రసించుచుండఁగ ♦ విన్ననౌ విధువైఖరిన్
విషమ సంస్థితినొందు మైథిలి ♦ వీరుఁడేలొకొ రాఁడు నా
విషయమే యిఁక విస్మరించునొ? - విశ్రవస్సుతు ధాటికిన్
విషధరాభ శరీరుఁ డల్కయె ♦ వీడెనంచుఁ దలంచెనో? ౯౯౨

తే॥ అనుచుఁ బరువును ప్రేమంబుఁ ♦ దనకు జ్ఞప్తి, పఱుపఁ గష్టమునొందిజీ ♦ వములుకలఁగ
దైన్యమందిన శ్రీరామ ♦ ధాత్రివరుఁడు, తలరి నాకింక విల్లు కా ♦ వలెనె? యనుచు
తే॥ ధనువు నెగ దిగఁ జూచి మం ♦ దస్మితంబు, సేయు భుజగిరులం గాంచి ♦ చిన్నవోవుఁ
జెలువఁ గాపాడలేమికి ♦ సిగ్గునొందుఁ, గడకు రాఁగల నిందకుఁ ♦ గలఁగి జంకు. ౯౯౪

తే॥ మంద పవనునిచే మేను ♦ మలయుచుండ, నావరారోహ కులసతి ♦ నన్ను వాసి
పరితపించెనొ ప్రాణముల్ ♦ పాసె నేమొ, యనుచు నిట్టూర్పులొనరించు ♦ నటమటించు

క॥ జగములఁ గావఁగఁ బూనితి, మగువ నొకతెఁ గావలేక ♦ మఱుఁగుచు నుంటిన్
జగజెట్టి గానె యేనని, నగు సిగ్గిలు నలఁతనొందు ♦ నవయుం గుములున్. ౯౯౫

క॥ నుసలును తమ్ముఁడు పఱచిన, కిసలయములు మాఁడిపోవఁ ♦ గెడపును నూత్న
వ్యసనము వర్ధిల్లఁగ మా, నసముం దపియింప భ్రమయు ♦ నలఁకువ నెందున్. ౯౯౬

ఆ॥ కమలములను బోలు - కనుల తెప్పలు వ్రాల్చి, కల్పకాలములను - కడపు నతఁడు
నిసి ముగింపు గనఁడు - నెలఁత లేమియొ? యభి, ఘానమునను? కళవము - [illegible]

క॥ అన్నాలక్ష్మణ! దివసము, లన్నియు ముసు సమసు లగుట - యరయుదు గద నే
డిన్నియమమ్మున నిన్నటి, కన్నను నిసి దీర్ఘమైన కత - మెయ్యదియో? ౯౯౯

క॥ చెలి మోము సాటి నెనయుమి, నలఁగుదు సిగ్గునను దిన ది - నంబు మలయుచున్
నెలఱేఁడా! నాసతి ముఖ, జలజము మఱుఁగగుడు నేఁ డె - నంగెదు కడిమిన్. ౧౦౦౦

క॥ గగనమున నుండి సూర్యుఁడు, పొగడొందిన తనకులంబు - పొలుపు నమసి నేఁ
డగడొందె ననుచుఁ జింతను, జగతీస్థలి దాఁటి యవలఁ - జని మరలండో? ౧౦౦౧

ఆ॥ ఇనుఁడు పుట్టకుండె ♦ నేల? ఓవస్వంతు, సుబ్బిములను రథముఁ ♦ గూడఁబట్టి
కట్టి రావణుండు ♦ కారాగృహంబున, నుంచెఁబోలుఁ గాక ♦ యున్నరాఁడె? ౧౦౦౨

ఆ॥ ఉడుకఁబోలుఁ మధ్య ♦ మొప్పారు జానకి, కానకుండు పొడవు ♦ గలుగు రాత్రి
తోడ లోకలయము ♦ తోఁతెంచు జాడలే, యెఱుఁగనయ్యె మదికి ♦ నింతనిజము. ౧౦౦౩

తే॥ తాపసులకుఁ గ్లేశముఁ గూర్చి ♦ ధాత్రియందు, ప్రాణులంజంపి తిను దైత్య ♦ వరులు బ్రతికి
యుందురేనియు ధర్మవు ♦ నూఁదియున్న, వారు నిల్తురే? తగవున ♦ వఱలునేది? ౧౦౦౪

ఆ॥ చెఱకు వింటఁ దేంట్ల ♦ శింజిని నెక్కించి, విరి శరములఁ బూని ♦ వేయఁ దొడఁగె
మారుఁ డంబరంబు ♦ మఱుఁగుననిల్చిరా, ఘవుని మనసు తలరి ♦ కలఁగిమలఁగ. ౧౦౦౫

ఉ॥ వీడిన దానిఁ గ్రొన్నఁగ ♦ వీ లిసుమంత లభించునేని యా
వీడినదానికై జతను ♦ వేకొను మానవుపోల్కి రాముమై
పోఁడిమిఁ గాంచి మానసము ♦ పొక్కఁగ మారుఁడు కుందె మున్ను తా
నాడిక రుద్రుకంటి సెగఁ ♦ దాఁకిన మేనిఁ దలంచి పొందఁగన్. ౧౦౦౬

తే॥ నీలనీరదశ్యాముని ♦ నెమ్మనమునఁ, దూఱె యారాత్రి శూలమై ♦ దూసిపోవఁ
గమల గర్భుని కల్పాంత ♦ కాలమట్లు, కడచెఁ జీఁకట్లు కొండల ♦ గవుల కేగ ౧౦౦౭

ఉ॥ క్షీరపయోధిఁ దా వలచు ♦ శేషుని శయ్యను నిద్రవీడి సీ
తారమణీ మణీ విరహ ♦ దాహ రసాంబుధి మున్గుచున్న యా
వీరుఁడు నీడజాది వన ♦ విశ్రుత నాదము తోడఁ దన్నిషం
గారవమొప్ప లేచెఁ నటు ♦ గల్గక జీవులకున్నె నిల్కడల్? ౧౦౦౮

చ॥ నెమిళులు జింకలున్ గరులు ♦ నెమ్మది జంటలుగాఁ జరించుటల్
తమకుచుఁ గాంచు రామునకు ♦ ధైర్యము నిల్చునె? తేనె కోకిలం
బమృతము వీణ వేణువు వ ♦ రాంగ రసాలముఁ గేరు క్రమ వా
క్యములు గలట్టి మైథిలిని ♦ కానలఁ గోల్పడి కుందకుండునే? ౧౦౦౯

చ॥ ఇల తెలవాఱఁ గాంచియును ♦ తేఁకువ జానకి యుంచు పల్కులన్
నెలియని రామచంద్రునకు ♦ నిన్నుజలేజముపై వసించు హం

సి లలి వహించు నమ్మహావ ♦ సీత విరంబుగ నేడు లేమి ని
చ్చలముగ జూపురీతిఁ బోలె ♦ చక్కని బాలుడు వుట్టె నమ్యోర్క ౧౦౧౦

చ॥ అడవుల గాంచి యందు తిరు ♦ గాడెడు పక్కి వజంటఁగాంచి నె
న్నడగల కేకులం గని వ ♦ నంబుల హంసల బూలగుత్తులన్
జెడఁగగు నేణులం గని ని ♦ క్షితమృగాక్షి వరాంగవాళిఁ దా
నెడఁదఁ దలంచి చింతిలుచు ♦ నిచ్చలు నచ్చట నిల్చు నార్తిమై ౧౦౧౧

చ॥ ఇటులు తపించు నన్నగని ♦ రొండ్ల కలంగి సుమిత్రపట్టి నం
కిలుపడి లో నలంపురి పి ♦ కారము వెల్వలఁ దోఁపనీక మీ
రిట వెతచెంది మానవిన ♦ నేర్పడ రోయక నిల్వఁ బాడి గా
దట మనతోడ్రి పల్కు దను ♦ జాఘన్ను తావుసు కాన లెండనన్ ౧౦౧౨

తే॥ సరి యనఁగ నిర్వురును కొండ ♦ సంకులంపు, తూఱిపెక్కు వనంబులు ♦ బొడ్డగిరులు
నదులు దాఁటుచుఁ జనిచని ♦ నాఁడు ప్రాత్రి, నడచి పమ నెన్మి దామడల్ ♦ కడచినారు.

తే॥ వసుమతీ తపఃఫల సంభ ♦ వంబు జాన, కీసతిం గానఁ జాలముఁ ♦ గిన్క యడర
నిశ్వసించుచు వారలు ♦ నీడజాత, నాప సేమిర మైన వ ♦ నంబుఁ జేర ౧౦౧౪

తే॥ తనకు లేశుల హృదయ చిం ♦ తనము లెఱఁగి, యన్ని చోటుల జానకి ♦ నరసి యరసి
కనక మేరువు నపరభా ♦ గమున వెదకఁ, జనిన తెఱఁగున భానుఁడ ♦ స్తమయ మందె

ఆ॥ జ్ఞానశక్తి నెఱుఁగఁ ♦ జాలని మూఢుల, మనసుకంటె మించి ♦ కనులు గాన
రాని రీతిఁ జెలఁగి ♦ రాముని తనుకాంతి, గెలువనేమొ దిశల ♦ నలమె నిరులు ౧౦౧౬

తే॥ వీణతంత్రులకును పాటవు ♦ నలయనేర్పు, శారికలు చిల్కలకు బడి ♦ చదువునేర్పు
వనమునం జంద్రమండల ♦ శక్తినున్న, పటిక జా ♦ మండపమున ని ♦ ల్వఁగఁ దలంచి

ఆ॥ కూరుచుండి రామ - ధారణీనాథుండు, తమ్ముఁగాంచి యిచట - దాపునందు
నీరు గలుగునేని - నెమకి తెమ్మన లక్ష్మ, ణాఖ్యుఁడరిగె విల్లు - నమ్ములూని ౧౦౧౮

నీరు తేఁబోయిన లక్ష్మణుని అయోముఖికాంచి కామించుట

ఆ॥ జలము వెదకి వెదకి - తెలియక సౌమిత్రి, యొంటరిగ మృగేంద్రు - నొప్పుఁజను
నచట నెలవుకొన్న - యది యయోముఖియను, కాంత గాంచె నతనిఁ - గాముకియయి

తే॥ మంత్రమునకు లొంగని పాము ♦ మాడ్కి వెంట, నంటియసుర యా సౌమిత్రి ♦ నరసినంత
గర్వకోపమ్ములను ద్రోచి ♦ కడఁకనితఁడు, మరుఁడె నన్నిందు వెదకుచు ♦ మనలువాఁడు.

క॥ అనియంధకార మందున, ఘనతర మోహాంధకార ♦ కలిత హృదయయై
మనసిజుని కవయఁ గౌఁగిలి, గొనుటొప్పనుగాని ద్రిమ్మఁగఁ ♦ గూడునె యనుచున్ [illegible]

ఆ॥ వేఁడుదాన వీఁడు ♦ వినఁడేని కడుదవ్వు, గొనుచుఁబోయి యచటఁ ♦ గుదురుపఱచి
యలమి యెడఁదఁగలుగు ♦ నలమట నెడలింతు, ననుచు నెదుట నిలిచె ♦ నసురవనిత.

సీ॥ నిట్టూర్పులందుడి ♦ నిప్పులు చల్లుచు, పెనుపండ్ల నిభముల ♦ విఱిచి నమలి
మ్రింగనుబ్బిన పొట్ట ♦ మీఁదఁజుట్టిన కొండ, చిలువల చనుకట్టు ♦ గలయఁజూచి
శరభ సింహముల దా ♦ సరి పాములంగట్టి, కాళుల నందెలు♦గా ధరించి
యన్ని వస్తువులఁగ ♦ ల్పాంత మందున మ్రింగు, మిత్తిఁబోలిన మోము ♦ నెత్తి పైకి

తే॥ కడలి నీటినెల్లను ముంచు ♦ గిరిఁకెపగిది, వెలయు నోటితో బడబాగ్ని ♦ విధమునొంది
విరిసియున్న వెంౖడుకలతోఁ♦బృథివిపిరిపిఁగొలుచునట్టిపాదములతోఁ♦ దలమువిూఱి

సీ॥ రక్తమాంస క్రియల్ ♦ క్రమ్మి చాలుగఁ జిందు, ఘనకటి శవముల ♦ కాంచి యొప్పఁ
బ్రళయ కాలానల ♦ ప్రభనొప్పి మిడుఁగుఱుల్, చిటపట కన్నులఁ ♦ జెదరుచుండఁ
బాద సంఘట్టన ♦ మేదిని వణఁకుచు; జానయా యిదియని ♦ సంశయింప
వననిధి మోఁకాటి ♦ బంటిగాఁ గొండలు, తిప్పలై దొరలుచుఁ ♦ దెరలిపడఁగ

తే॥ పాఁప కడియముల్ ముంగేలఁ ♦ బరిఢవిల్లఁ, బులుఁ దండ లష్టాపద ♦ ముల మినుకులు
సింహముల కుండలమ్ములు ♦ చెలఁగుచుండ, నడచె లక్ష్మణు నెదుటికి ♦ బెడిదురాలు.

తే॥ నిలిచి వలపున నానంద ♦ జలకణంబు, లెత్తి చిన్నకన్నులనుండి ♦ వఱ్ఱువాఱఁ
జూచెఁ దద్దంష్ట్రికాకాంతిఁ♦జొప్పడంగఁ,గాంచె లక్ష్మణుండును దాని♦కాయసుషమ.

తే॥ మునుపు ముక్కంటఁ దెగిన శూ♦ర్పణఖగుణము,తోడఁ దాటక గుణమును♦కూడినట్టి
యీచెడిపె దుష్టరాక్షస ♦ బృందమందు, తిరుగునొక కరాళికయని ♦ తెలిసె నతఁడు.

ఉ॥ వీరలు పాపవర్తనలు ♦ వీఱిఁడులుగ్ బలుపాఱు స్వైరిణుల్
కారణమొండె నూకడకుఁ ♦ గ్రచ్చఱ వచ్చుటకంచు లక్ష్మణుం
డారసి ఘోరకాననము ♦ నందు నిసిం జనుదెంచి తేలకీసీ
వేరి పడంతివౌదు వచి ♦ యింపుమ వైళమ యన్న వెంబడిన్. ౧౦౨౭

తే॥ బిడెము లేనిది చలియించు ♦ నెడఁదగలది, యగు నయోముఖి యిట్లను ♦ నానతోడఁ
జాలకాలంబు నీయొద్దఁ ♦ జనవులేని, దాననై నను కాంచితిఁ ♦ దమి వహించి. ౧౦౨౮

క॥ సుందరవీరా! మున్నెవ, రుం దాఁకని నాసఖిత్వ ♦ రుక్మము నీకుం
జెందఁగఁ జేసితి సుఖముల,నొందుము తొలఁగింపు మరుని♦యాగాత్యంబుల్. ౧౦౨౯

క॥ ఉపశమమున రక్కసి యిటు, లుపకంఠమునన్ వచింప ♦ నుడుకుచుఁ గినుకన్
జపలిని! యేకనిట నిలిచినఁ, గృపమాలిన నాశరములు ♦ గీటడఁచు నినున్. ౧౦౩౦

క॥ తొలఁగుము యనిలక్ష్మణుఁడన, నలుగక రాకాసి యను న ♦ నంగ సుభగ! జో
ళలు నేసెద స్వాపాణం, బుల నిలుపుము చెడుగు లేదు ♦ పుణ్యమె గలుగున్, ౧౦౩౧

క॥ అభయం బిచ్చితి నీకుచో, రభసంబున గంగ పుష్ప ♦ రమె తెచ్చెద నో
యిభజిద్విక్రమ! నిన్నును, సభయముగ గొనిపోదు తలంపు ♦ నం గొనుదెడకర్. ౧౦౩౩

క॥ అనుచలుకుల మన్నింపక, కినలున సౌమిత్రి నీదు ♦ కర్ణంబులతో
డను నాసిక గోయక, ముసుపే, తొలంగుట శుభంబు ♦ పొమ్మన నదియున్.

క॥ నే వీని గొని నాగుహ, లో వైచిన పిదప నాకు ♦ లొంగును సౌఖ్యం
బావహిల నిచ్చు దలంచుచుం, ద్రోవ పిడిచి యొక్క ♦ క్రేవ ♦ తొలంగుచు నిలిచెన్

క॥ మొదటన్ మోహానమంత్రము, కొదుకుచు లక్ష్మణుని వారు ♦ కొని గగనమునం
దెదగందు తోడ జను తో, యద మనం బఱచెన్ మనోజ్ఞ ♦ నంగదవలనన్.

చ॥ కరతలమందు పెట్టుకొని ♦ కన్నుల నద్దుచు బొమ్మ చేర్పంగా
నరుగు తొలంగి లక్ష్మణుడు ♦ జోటిక మూపున నిల్వ, నద్ధ మం
దర మటు లుండె నింద్రుని మద ♦ దంతిని పోలుచుం గుంత హస్తుడై
హారసుతుం డెక్కి కేకివలె ♦ నయ్యెను నక్కసి లేమ యయ్యెడన్. ౧౦౩౬

తే॥ దాని కేలను బొమ్మన ♦ దలను మెడను, నిలిచి సౌమిత్రి గజ చర్మ ♦ కలితుడభవుం
డైన లయకాల రుద్రు మ ♦ హానటేశు, కొమరు మిలసిల్లె జంకును ♦ కొంకు లేక.

లక్ష్మణుడు హాపికిం జింతిల్లి రాముడు వెదకబోవుట

ఆ॥ అటులు దైత్యకాంత ♦ యనుజుని గొనిపోవ, నిచట విరహ బాధ ♦ నెనయు చున్న
యిన కులుండు నీరు ♦ కొని తేరం బోయిన, తమ్ముం గుఱ్ఱ రామిం ♦ దత్తఱించె. ౧౦౩౭

శా॥ నీరంబుల్ లభియింపవో? తెరువునన్ ♦ విఘ్నంబు లేపారెనో?
నారామామణిం గొన్న వార లెదురై ♦ నారో? మరంబయ్యెనో?
క్రూరాత్ముండగు పంక్తి కంఠు డితనిం ♦ గొంపోయెనో? యేమొకో?
మేరన్ మీఱడు వేగవచ్చు నతండ ♦ మ్మేధావి రాడేలొకో?. ౧౦౩౮

శా॥ నాజీవంబును పోలు లక్ష్మణుని వి ♦ జ్ఞాన ప్రబోధంబులన్
రాజద్రీతి గణింపకే జనకజన్ ♦ రామామణిన్ మానమున్
దేజఃకాంతులు కోలుపోయి వనటన్ ♦ దీల్పాటు నొందంగం దా
నోజం గానంగలేక ప్రాణములనే ♦ యుజ్ఝింపంగాం బూనెనో?. ౧౦౪౦

శా॥ దట్టంబయ్యెం దమంబు దిగ్గతి పదా ♦ ర్థంబుల్ గనన్ రావు నే
నెట్టీ చీకటి నెందు రోయుదు మనః ♦ స్నే పుండుగా బాధ యాం
కట్టెన్ దోఁప దికేమియున్ జెడితి నా ♦ కాయంబు భారంబుగాం
దట్టెన్ జీవితమేల నాకు నను జా ♦ తా! నీవు లేకుండగన్?. ౧౦౪౧

చ॥ ఎడఁ దెగకుండు యుద్ధముల ♦ నేపునఁ బూనిన నాకుఁ బ్రాణమై
యడరిన నీవుఁ గూడ మఱుఁ ♦ గైతివె? తమ్ముఁడ! అన్న! నాయనా!
విడిచెదఁ బ్రాణముల్ ధరణి ♦ వీడెడినై బ్రదుకంగ నేరునే?
కడుఁ జెడుగే యొనర్చి ... ♦ గావు నీవని యొప్పు నేరికిన్?. ౧౦౪౨

చ॥ తొలఁగని డెప్పరంబులను ♦ ద్రోపుడు సేయఁగఁ జాలు తమ్ముఁడా!
తలఁగని చింత నాయదికిఁ ♦ దాపము గూర్చితి బాహుశౌర్య వి
స్ఖలిత మహారివీర! యెద ♦ చంపి యిటుల్ నను వీడ న్యాయమే?
వెలుపల నింత కాల మిటు ♦ వీడి వసించుట నీకు నొప్పునే?. ౧౦౪౩

చ॥ ననుగను తల్లిదండ్రులను ♦ నర్మిలి సీతను వీడి జీవినై
చనుటయు నిన్ను పాయ మది ♦ చాలమిచేఁ గద! జానకీ వియో
గ నిభృత తాప కర్శితుని ♦ గ్రమ్మఱ నీవును వీడి నిన్ను రో
యను పని గూర్చి రెండవ మ ♦ హార్తిని నాకిట సంఘటించితే? ౧౦౪౪

ఉ॥ తమ్ముఁడ నీవు క్రమ్మఱిలు ♦ దారి వచించెడు వారు లేరు న
న్నిమ్ముగఁ జేరవేసి త్యజి ♦ యించెద జీవము నిక్కువంబు న
న్నమ్మిన సీతయుం జెడును ♦ నాకము దప్పును తండ్రి కింకఁ బ
ట్టమ్మున నెల్ల రీల్గుదురు ♦ డబ్బఱ యింతకుఁ గూర్పఁ బోలునే? ౧౦౪౫

శా॥ మాంధాత్రాది మహీశ వంశమున సా ♦ మ్రాజ్యంబు నైకోక స
ద్బంధు ప్రేమను వీడి వచ్చి నను ని ♦ ర్బంధంబుతో నెల్ల స
ద్బంధుల్ వల్దన సర్వసౌఖ్యములు మ ♦ త్కైంకర్య సంసిద్ధికై
సంధర్షించు ప్రియానుజన్మ! యిట నీ ♦ చక్కిన్ నిడం బాడియే?. ౧౦౪౬

తే॥ అనుచు లేచును ధరఁబడు ♦ నలయుఁ సొలయు, మలయుఁ దెలియఁడు మెలు పైన ♦ మెలయు
నిట్టి చీఁకటు లబమె నిం ♦ కెట్టు లనును, నడచుఁ బిలుచును బమ్మెర ♦ పడలు బడలు గ్రుండు

తే॥ సీతతోడ నా ప్రాణంబు ♦ చెలఁగి కావ, నిద్రనై తను వీడిన ♦ నిశ్చలుండు
రామికిం గలమేమి? భా ♦ రమగు పాప, కర్మి కాలనిఁగను నోము ♦ గలదె? యనును.

తే॥ ధర్మ మనునది జగమునఁ ♦ దనరు నేని, మాఱు జన్మంబునందు న ♦ మ్మాన్యుఁడగుచు
నన్నుఁ దమ్ముఁ గాక యతఁడు నా ♦ కనుచుఁ గత్తి, దూసి ప్రాణముల్ పోకార్పఁ ♦ దొడఁగు నంత

తే॥ మాయనుండి మేల్కన్న ల ♦ క్ష్మణుఁడు జాని, ముక్కుగోయఁగ నొచ్చిన ♦ మొఱకుటసుర
వై చెడబొబ్బ యదివిని ♦ పద్మనయనుఁ. డక్కజంపాటుతోఁ దమ్ము ♦ నిక్క వరసె

తే॥ గులకొండల యడవియందు ♦ గూడి దైత్య, సమితి లక్ష్మణుతో నని ♦ సలుపుచుండె
నాఁడు ముక్కుఁ బోయెనచుప్ప ♦ నాతి యే మొ, నేఁడు పేరెలుంగున గూసె ♦ నిక్క మనుచు

కం॥ నీలాభ్రనిభుండు జ్వాలా, మాలాకీలంబులెలుగు ♦ మార్గణమును గ్రొం
గేలం గీలించె దమో, జాలంబులు తూలఁగ పగలు ♦ చండం బయ్యెన్. ౧౦౫౨

కం॥ కొండలు నలఁగఁగ ప్రాఁకులు, తుండెములుగ విఱుగ ధరణి ♦ తూలఁగ బడ వాతో
ద్దండ గతి నడచె విశిఖము, దండ ధరుండు వడల వడఁగ ♦ దమ్ముని దెసకున్. ౧౦౫౩

ఆ॥ నిలయకాల కాల ♦ జలధి భూస్థలి మీఁదఁ, గెరలివచ్చు కరణి ♦ శరవరుండు
సరగ రాఁగఁ జూచి ♦ సౌమిత్రి కష్టంబు, నలదు వలదటంచుఁ ♦ బలుకరించె. ౧౦౫౪

కం॥ మీకృపచే మీ భృత్యుఁడు, మీ కడ కేతెంచె ననుచు ♦ మిక్కిలి భక్తిం
బైకొని మ్రొక్కుచుఁ గనఁబడె, శోకాశిన చూడ్కి మరల ♦ బొందు పగిది గాన్.

కం॥ కన్నీరు వారఁగ నిల్చిన, యన్నయుఁ గనలేఁగ వెదకి ♦ యలయుచుఁ జేవ్రం
గొన్న పసి కరణి లక్ష్మణు, పెన్నొడలిం దడవి తడవి ♦ విరవిర మానెన్. ౧౦౫౬

చ॥ వలుమఱు దేహము న్నిమిరి ♦ బాఢముగాఁగఁ బరిష్వజించి య
శ్రులు నను జన్మమైరజము ♦ చొక్కముగాఁ దొలఁగించి తమ్ముఁడా!
తొలఁగితి వంచు నెంతయును ♦ దుఃఖము నొందితి నింతసేపు కా
నల నిటు రేయి తామసిల ♦ నామన మెట్లగునయ్య నాయనా! ౧౦౫౭

ఉ॥ కూరిన దేమి తెల్పుమనఁ ♦ గూరిమి నన్నకుఁ దమ్ముఁ డయ్యెడన్
దారిగఁ దెల్ప రాఘవుఁడు ♦ తాపము మోదము నంది యిట్లనున్
దోరపు జన్మకారఁబడి ♦ దుఃఖములం గనోయింపఁబోలునే?
వారిధిఁబడ్డ వాఁడలల ♦ పాటునకుం జడియంగఁబోలునే?. ౧౦౫౮

తే॥ మూఁడు జగము బొక్కుమ్మడి ♦ ముప్మరించి, చెనకినను లెక్కసేయక ♦ చీల్చివైతు
నొక్కఁడవు నీవు నాయొద్ద ♦ నుండు వేని, చాలు; వేఱు రక్షణము నా ♦ కేల చెప్పుమ?

కం॥ పోయెడి వెల్లను పోనీ, వేయాపదలైన వచ్చి ♦ విరియ విరియ నీ
నాయమ్మా! నీవున్నం, బాయును గా కడచి నన్ను ♦ పఱుపంగలవే? ౧౦౬౦

కం॥ రాకాసిముక్కు గోసితి, నీకడకున్ మగిడితినని ♦ నిగదించితి వా
పోఁకును చంపవు గద కరు, ణాకర! యను రాఘవునకు ♦ నతఁ డిట్లనియెన్. ౧౦౬౧

కం॥ చను కట్టుతోడఁ జనుగవ, దోనయుం బలె నున్న ముక్కు ♦ దొడ్డ మొరిఁ బెలన్
జెనసెడు చెవుల నసింగొని, తునుమఁగ నేక్చినది యనుచుఁ ♦ దుది నవ్వుటయున్.

కం॥ మను వంశ సంభవా! కిను, కను నిను వెన్నంటు నసురఁ ♦ గనలి వయిం ద్రె
క్కొనక దయ తలఁచి విడిచితె, యని రాముఁడు తమ్ము నలమి ♦ యశ్రులు రాల్చెన్

కం॥ అంగదలు తొలఁగ వారలు - గంగాధరు వరుణుఁ దలఁచి ♦ కట్టియఁ బుడమిన్
రంగారఁ దోలిచి యంత, ర్గంగం గొని త్రాగి యచటఁ ♦ గడపిరి రేయిన్. ౧౦౬౪

క॥ అడవులఁ జివురులు పూవులు, తొడరిక గా లక్ష్మణుఁడు వి ♦ ద్రుచు మృదు శయ్యం
బడి రామవిభుఁడు తమ్ముం, డడుగుల నొత్తంగ రాత్రి ♦ యట శయనించెన్. ౧౦౬౫

క॥ జానకి చెఱ వడు పిమ్మట, మానము వేధించుచుండ ♦ మలఁగి యొక ఫలం
బేని భుజింపని రాఘవుఁ, డానిక నిద్రింప కలఁగి ♦ యలయుచు నూర్చెన్. ౧౦౬౬

క॥ కన్నఁ బెను కాన జానకి, కన్నులకుం గట్టినట్లు ♦ కానం బడుటల్
మన్నీఁడు మఱవమినో? లే, కున్నన్ రాక్షసుల మాయ ♦ యో? తెలియముగా! ౧౦౬౭

క॥ జనకజ చెంతం దోఁపఁగఁ, దనుకుచు బయలలమి లజ్జఁ ♦ దలరును నన్నీ
వనితామణి డాయఁను మఱి, వెనుదీయును తనదు నడుము ♦ విధమున మఱుఁగున్ ౧౦౬౮

క॥ జానా వదనాంబుజమునఁ, దేనియఁ గల దొండపండు ♦ తీరగు నధరం
బానితి నిప్పుడు కనులం, బూనికఁ దెఱవంగ డాఁగుఁ ♦ బో! నిదికలయో? ౧౦౬౯

తే॥ తలఁపుకంటెను పంచభూ ♦ తములకంఁటె, బెద్దదగు దుఃఖ మీరాత్రి ♦ పీడసేసె
చలువ తావియు నలుపును ♦ వెలయు కురులు, గలుగు కలికి కన్నులకంటె ♦ ఘనమె రేయి

చ॥ జలకణ కీర్ణ కారక వి ♦ సార విరాజిత వారిరాశిపై
నలమి విధుండు పుట్టి బడ ♦ బాగ్ని కరార్చులఁ జిమ్ముచుండ నా
ష్మలత భజించి యాకసము ♦ మై సకలంబును బొబ్బలెక్కెని
ట్టులముగ నన్న తీరుసఁ గ ♦ డల్కొనెఁ జుక్కలు మిక్కుటంబుగన్ ౧౦౭౦

తే॥ పలువిధంబుల నీరీతిఁ ♦ బలవరించి, కార్శ్యమొంది రాముఁడు మదిఁ ♦ గలఁతఁజెందఁ
గాంచి లోక బంధుఁడు కని ♦ కరముతోడ, వెలుఁగు తగ్గించి కొనె నన ♦ మొలచి వచ్చె

౧౦ కబంధ పటలము (౫౮)

తే॥ ఉర్వికంటెను మిక్కిలి ♦ యోర్పుతోడి, క్రొత్తడితనంబు గల సీత ♦ కొఱకు వెదకఁ
బక్షులును పలవించిన ♦ పగిదిఁ గూయు, వేకువను రాఘవులు లేచి ♦ వెడలినారు ౧౦౭౩

తే॥ చాలదూరంబు రామల ♦ క్ష్మణులు నడచి, తమ్మినెచ్చెలి గగన మ ♦ ధ్యంబు చేరఁ
జేతులను చాఁచి ప్రాణులఁ ♦ జేర్చి మ్రింగి, బ్రతుకుచుండు కబంధుని ♦ వనము చొరఁగ

తే॥ ఆపిపీలికానేకప ♦ మైన జీవ, వితతి పరుగెత్తి యలసెను ♦ బెదరుచూపు
లోలయ జంకుచు నుండెను ♦ వలను దగులు, కొన్న రీతిని విలవిల ♦ కొనుచునుండె. ౧౦౭౫

సీ॥ ప్రజల కులాచార ♦ పద్ధతుల్ నెలకొల్ప, లేనివాఁడును కావ ♦ లేనివాఁడు
బలహీనుఁడగు నొక ♦ ప్రభు దేశమున జన, ప్రతతికై వడి భయ ♦ పడెడు నవియు
చెదరునవియు గుంపు ♦ చేరునవియుఁ బఱ, చునవియు విభ్రాంతి ♦ నెనయునవియు
పర్వతక్రియ దొర్లి ♦ వచ్చెడు భూజముల్, పెల్లగిల్లిన యేటి ♦ వెల్లువలును

మ॥ చతురంభోధి పరీతమైన జగతీ ♦ చక్రంబు సర్వంబు సం
గతమై తూఱఁగఁ దగ్గ నోరుగని యా ♦ త్మా భృద్గుహాద్వార ము
ద్ధత రక్షః పుర సాల మార్గమగు స ♦ త్యంబంచు సీతేశుఁ డు
ద్ధృతినుండం గని లక్ష్మణుండు కడు సం♦దేహంబుతోఁ గాంచుచున్. ౧౦౮౬

ఉ॥ క్రూర కరాళ భూతమిది ♦ ఘోరకరంబుల కబ్బు జీవులన్
వారి కుదించి నోటఁబడ ♦ వైచెడు నట్టిది దీని చేతులం
దారితి మింకఁ దప్పు కొను ♦ దారి గనంబడదన్న! చేయఁగాఁ
గారియ మేదియున్న దనఁ♦గా రఘువర్యుఁడు పల్కెఁ దమ్ముతోన్. ౧౦౮౭

చ॥ కుతలము నుద్ధరించు వర ♦ ఘోణిని పోలిన లక్ష్మణా! వెనన్
గతుకఁగఁ జూచె భూతము; జ ♦ గంబున దీనికి నిల్వఁ దానమున్
వెతకిన లేదు దొడ్డ దిది ♦ పృథ్వి సమస్తము చుట్టివచ్చు దీ
ర్ఘతమ కరంబు లొప్పినది♦కాఁగల దెయ్యది యింకఁ దమ్ముఁడా!. ౧౦౮౮

తే॥ ధరణిజాతఁ గోల్పోయితిఁ ♦ దండ్రిపోయె, నిందమోచితి బ్రతుకంగ ♦ నేర నేను
దీని నోటను పడియెదఁ♦ దృప్తితోడ, నీవుతప్పించు కొనిపొమ్ము♦నియతచరిత! ౧౦౮౯

ఉ॥ తల్లులు చింతమైఁ దలరఁ ♦ దమ్ములు వంతలనొంద వృద్ధులున్
దల్లడమంద లోకములు ♦ తప్పక దెప్పెడు జీవితంబు నే
నొల్లను సీత రాకసుని ♦ యొద్దఁ ద్యజించితి నంచు భూమిభృ
త్తల్లజుఁడైన యాజనక ♦ ధారణినాథు మొగంబుఁ గాంతునే?. ౧౦౯౦

క॥ సీతను కావఁగఁ జాలని, భూతలపతి లక్ష్మణుండు ♦ పొలుపుగఁ గావన్
బ్రీతిం బ్రతికెడు వాఁడన, నాతరమా యసువు నిలుప ♦ నయగుణ వర్యా!. ౧౦౯౧

ఉ॥ బమ్మెర రాముఁడీ కరణిఁ ♦ బల్కఁగఁ దమ్ముఁడు కాంచి యిట్లనున్
నెమ్మిని మీకు దాసుఁడయి ♦ నేఁజనుదెంచిన పిమ్మటం గదా
యిమ్ములు దప్పుచున్నయవి ♦ యే మరణింపక తప్పునేని వ్య
ర్థమ్మగుఁగాక యూడెము కృ♦తార్థత నొందునె యెన్నిభంగులన్?. ౧౦౯౨

కబంధుచేఁ జిక్కినరామునకు లక్ష్మణుఁడు ధైర్యవాక్కులు పలుకుట

ఉ॥ వచ్చిన యాపదన్ గెలుచు ♦ వారలె శూరులు యుద్ధభూమిలోఁ
జచ్చెడు వారిఁ జంపుటలు ♦ సాహసకార్యము కాదు చూడఁగా
నచ్చుగఁ దల్లిదండ్రులకు ♦ నన్నలకున్ సిలుగొందు వేళఁ దాఁ
జచ్చినఁగాదె మున్ను తన ♦ జన్మము సార్థకమౌ ధరాస్థలిన్. ౧౦౯౩

మ॥ తరళాక్షిన్ జనకాత్మజన్ గొని మహో - దారుండు రాముండు డె
ప్పరమౌ కానల నుండఁగా నిదురయున్ - వర్జించి రక్షించె న

స్ఫురమోహాకారుఁడు లక్ష్మణుం డసియయా - భవ్యాత్ముఁడే పీఁచు మఃః
ఘ్కారుఁ డత్యుగ్ర వదనేన వ్యాజించె నెకఁ - ల్కాన్ సైఁపఁగా నేర్తునే?

మ॥ భవదీయాగ్రజ నాజ్ఞకున్ వశుఁడనై - భద్రంబులం గూర్చి నీ
సవ్య మఃఖంబుల లెక్క వెట్టకుము నే - ప్రాణంబులన్ జానకీ
కవ్యక్తై ఁపేఁగఁ గూడఁజేసి యది మో - దంబారఁ గావింపు మం
చవధానంబుగఁ బల్కు తెల్లిపలుకుల్ - వ్యర్థంబు గావింతునే?.　　౧౦౯౫

మ॥ నను గన్నట్టి సుమిత్ర యేనును భవ ♦ న్మాతన్ నినున్ గొల్చుచో
జనముల్ మెచ్చుచు సంస్తుతింపఁగ మన ♦ స్సంబంధముల్ మార్చులన్
గొ కీర్తిన్ విధాల కష్టములు మా ♦ కుం గల్గినన్ మీకునై
తృణ కల్పంబుగఁ బ్రాణముల్ విడుతు ము ♦ ర్వీం గీర్తి సంలబ్ధికై

మ॥ ధర నామ్నాయములున్ సురేశ్వరులు నం ♦ తంబొందినన్ నాశమున్
బొరయంబోవని నీవు, సంతి నిచయం ♦ బుం దిన్చు నీ కానలో
గురువు ల్వాఁడు భూత మొండు బలముం ♦ గ్రుంగించి హింసింపఁగా
నటుటల్ నమ్మఁగఁబోలునే? వినుజనుల్ ♦ హాస్యంబు గావింపరే?

తే॥ సీత విడిపించి కీర్తిని ♦ చెందలేక, బవరముం జేయఁ జాలక ♦ భయము నొంది
ప్రాణములఁ బాసెనని లోకు ♦ లందు రేని, దాని కంటె నపఖ్యాతి ♦ ధరణిఁ గలదె?

తే॥ లోకనాయక! యిది లెక్క ♦ లోని దగునె?, మనల లాగు నీచేతులఁ ♦ దునుకలుగను
ఖండనం బొనరించెదఁ ♦ గాంచు మిప్పు, డనుచు ననుజుండు ముందున ♦ కరుగునంత

తే॥ తమ్ము దాఁటి ముందునకేగె ♦ దాశరథియు, నతని వారించి సౌమిత్రి ♦ యరిగెమున్న
అన్యు లెవ్వారు లేరు వా ♦ దాట దీర్ప, ననుచుఁ గనిన సురలు చింత ♦ నందినారు.

చ॥ ఒకమొగ మందు కన్నుదుగ ♦ యొప్పున నిర్వురు డాయునంతనే
మెకమెక పాటుతోఁ గినుక ♦ మీఱి కబంధుఁడు యుద్ధ వీర నా
యకులగు మీర లెవ్వరన ♦ నల్కయుఁ జింతయుఁ గల్గి జెప్ప వా
ల్పక నిలుచున్న వారిఁ గని ♦ లక్ష్యము చేయర యంచు నాతఁడున్.　　౧౧౦౦

ఉ॥ రోష రుహాగ్నిచే నొడలి ♦ రోమము లెల్లను మాఁడుచుండ వి
ద్వేషము వెంచి వాఁడు కసి ♦ దీఱ గ్రసించి మెసంగువాఁడ భూ
రీషణతోడ నంచు గ్రహిం ♦ యింపఁగ వాని భుజంబులన్ మహా
భీషణ ఖడ్గ ధారలను ♦ పీచ మడంగఁగఁ ద్రుంచి రొక్కటన్.　　౧౧౦౧

తే॥ కేలు తెగి యొడలున నిరు ♦ క్రేవలందు, చిట్టుచిట్టున రక్తంబు ♦ చిమ్ముచుండ
పొడవు పెదుళులు తెగిపడఁ ♦ బొలుపు చెడిన, పర్వతంబుచందమునఁగ ♦ బంధుఁడుండె

## కబంధుఁడు శాపముక్తుఁడై రాముని వినుతించుట

మ॥ తన హస్తంబును రాముఁ డంటు కతనన్ ♦ దత్పూర్వ శాపంబుతో
ఘన పాపంబులు దీఱిపోవ దనువన్ ♦ గంధర్వ వర్యుండు తోం
టి నిజాకారము దాల్చి పక్షివలె మిం ♦ టిం జేరి శ్రీరామ ల
క్ష్మణులం గాంచి భయంబు భక్తియు మదిన్ ♦ సంధిల్లఁ గేల్మోడ్చుచున్

శా॥ పుణ్యాత్ముండు గడించి యత్యధిక స ♦ మ్మోదంబు డెందంబునన్
గణ్యుం డీతఁ డజామరాధిపులకున్ ♦ గప్పింప విజ్ఞాన సై
పుణ్య ప్రక్రియఁ గానవచ్చెడు తపః ♦ పుణ్య స్వరూపంబు లా
వణ్య వ్యూహ మటంచు భక్తి వినుతిం ♦ పం జొచ్చె నుత్సాహియై.

శా॥ శ్రీకాంతా! బహు పాప సంచయముచేఁ ♦ జింతించుచున్నట్టి నా
యీ కాలుష్యముతోడ శాపమును బో ♦ యె న్నిన్ను గన్నంతనే
లోకేశుండవు ధర్మసాక్షి వికఁ జా ♦ లుం జాలు నీరూపమే
లా కైకొంటివి మమ్ము బోఁటులకు నె ♦ ల్లం దెల్పఁ గానేకదా!. ౧౧౦౬

ఉ॥ మూలములేని నీవు జగ ♦ ముల్ దగవృనఁగఁ జేయ వేయు వే
సాల నెఱుంగ నెవ్వనికి ♦ శక్యము? నీదగు లీలలెన్న నేఁ
జాలుదునయ్య! నీవు వట ♦ సాలమొ? పత్రమొ? యందు పండు సం
శీలుఁడవో? ముకుందుఁడవో? శ్రీదుఁడవో? తెలియంగఁ బల్కవే. ౧౧౦౭

ఉ॥ కాంచెడు వాఁడవున్ దెలియ ♦ కాంచనమున్ గను కన్నులుం గనం
గాంచిన శక్తి నీవ యొడి ♦ కంబున దేనిని తాఁకకుండు నీ
వంచనయేల? యీభువన ♦ వర్గము గర్భమునం ధరించి వె
ళ్లించెడు నీవు పూరుషుఁడో? లేమవో? రెండునుగావో? తెల్పవే. ౧౧౦౮

ఉ॥ ఈవ విరించియున్ హరుఁడ ♦ నీవ జగంబులు నీవ వస్తువుల్
నీవ శ్రుతుల్ తదర్థమును ♦ నీవ యనంతుఁడ నీవ సర్వరూ
పావలి కావలన్ వెలుఁగు ♦ నాదిమ తత్త్వమునీవ సర్వము
న్నీవ యటన్న తక్కుఁగల ♦ నిర్జరు లల్క వహింపనేర్తురే?. ౧౧౦౯

చ॥ ఎనిమిది దిక్కులే బిగివ ♦ హించిన గోడలు గాఁగ లోకముల్
పెనుగదులై రహించు ఘన ♦ వేశ్మమునందున మూఁడు త్రోవలం
బనుపడు చోట నిచ్చ విరి ♦ వాఱని సారస కర్ణికాంతరం
బున వసియించు జ్యోతిమయ ♦ మూర్తివి నిన్నెఱుఁగంగ శక్యమే?

ఉ॥ ఎల్ల యెఱుంగ లేని దెస ♦ లెన్మిది లోపలనున్న భూమిపై
మొల్లముగా దివౌకసులు ♦ మోదము నంద నొనర్చువేల్మలం

జెల్ల హానిన్నుఁ జేవ భుజ ♦ యింతువు దిప్ప్యజటత్తు రెండు నీ
యుల్లసితంపు వేస్క్రలని ♦ యుల్లముగం గనువార లెవ్వరో?. ౧౧౧౧

ఉ॥ ఓయి సనాతనా! జలధి ♦ యుబ్బుచుఁ దన్గుచు నుండునట్లు తి
త్వాప్రియిక బుద్బుద ప్రకిరి ♦ భంగి జగంబులు పుట్టి పొల్చుచుఁ
నీయుదరంబునం దడఁగు ♦ నీదగు లీల లెఱుంగలేము నీ
మాయను దాటి నిన్నుగన ♦ మాటలొకో యది మమ్ము బోంట్లకున్?

ఉ॥ నీదగు లీలలం దెలియ ♦ నిర్జర వర్యులు నేర్చినారలో?
వేదము లట్లు పల్కినవొ? ♦ విప్పుగ మేమెఱుఁగంగలేము బ్ర
హ్మాదులు వొందఁగా నరిది ♦ యైన మహోదయ మొందినాఁడ నా
మాదిరి భాగ్యమెవ్వరు స ♦ మంచిత రీతి భజింప రెయ్యెడన్. ౧౧౧౩

చ॥ సిలుగుల కాలవాలముగఁ ♦ జిక్కిన జన్మ పరంపరల్ తెగం
దొలఁచితి దుష్టదేహమును ♦ దోర్చితి సుందర దేహమిచ్చి బు
ద్ధి లవము గూర్చి మోద జల ♦ ధిన్ మునిఁగించితి మోహ దుఃఖముల్
తొలఁగిన వెట్టి సత్కృతులు ♦ తూకొని చేసితి నిట్టి సిద్ధికై ?. ౧౧౧౪

ఉ॥ అంతయు నీ యపార కరు ♦ ణాకర తత్త్వముఁ గాంచి పొందితిం
జింతలు దక్కినాఁడ నని ♦ చింతన సేయుచు వీరి పుట్టువుల్
సుంత వచించినన్ సుమన ♦ సుల్ తలపోసిన వెంట కెగ్గు యో
చింతుఁ గదా యటంచుఁ బసి ♦ చెంగటి శేగ నిధాన నిల్వఁగన్. ౧౧౧౫

ఉ॥ శ్రీరఘురామచంద్రముఁడు ♦ చిత్తము రంజిలఁగాంచి లక్ష్మణా!
తా రజనీచరత్వమును ♦ తక్కి మహోజ్జ్వల దేహమంది పెం
పారఁగ నిల్చినాఁడితని ♦ నారసితే యన లక్ష్మణాఖ్యుఁడున్
గారవ మారఁ గాంచి యడు ♦ గన్ దను విట్లని పల్కె వారికిన్. ౧౧౧౬

కబంధుఁడు కర్తవ్యము దెలుపుట

సీ॥ దనువను పేరి గం ♦ ధర్వుండ వర తపో, బలమునఁ గామ రూ ♦ పంబు వడసి
యొక్క రక్కసిరూపు ♦ నొంది వేడుకస్థూల, కేశుఁడన్ మునిఁజేరి ♦ కేరినంత
నాతఁడీ రూపె నీ ♦ కగుఁగాక యన వేఁడి, శాపమోక్షము తీరు ♦ చక్క నెఱిఁగి
యింద్రునితోఁ బోరి ♦ యిట్టిరూపము గొంటి, మీహ స్తములు దాఁక ♦ మేలుగంటి

తే॥ లోకరక్షణ వినుత సు ♦ శ్లోకులీరు, మిమ్ము పొడగంటి సుఖముల ♦ మీఱుచుంటిఁ
దంద్రులకుఁదంద్రులగు మిమ్ము ♦ ధాత్రిఁగాచు, వారలైన నాకూర్చు ♦ పల్కు వినుఁడు

తే॥ తరణిలేని వారికి సము ♦ ద్రంబు దాఁట, నరిదియగు పగిదిని సీత ♦ నరయు కొఱకుఁ
దోడులేనట్టి మీకు శ ♦ త్రువుల గెలువ, దుష్కరం బగుఁ గావునఁ ♦ దోడుగొనుఁడు.

ఉ॥ లోపము లేని మీస్థితిని ♦ లోఁకువ యెంచు వచింపఁ జాల మీ
చాప శరంబులే గెలువఁ ♦ జాలు జగత్త్రియ, మైన లోక సం
తాపము గూర్చువేళ నగ-ధన్వి వెసం బ్రమథాళిఁ గూడియే
యేపు వహించుఁ గాదె యటు ♦ లే యిపు డీరును కొందు బాసటన్.

చ॥ కుజనుల మైత్రి గొన్నఁ దమ ♦ కుం గడగండ్లు లభించు టబ్రమే?
సుజనుల గూడువారలకు ♦ శోభనముల్ పురణించుచుండు న
క్కజముగ జీవరాసులను ♦ గాదిలి తల్లి నిపోలెఁ గాంచు చా
రజమున మిమ్ము గాంచు రహి ♦ రాజిలు నాశబరిం గనుండొగిన్. ౧౧౨౦

ఉ॥ ఆవల సూర్యపుత్త్రుఁడు మ ♦ హాగుణశాలి కపీంద్రుఁడైన సు
గ్రీవుని ఋశ్యమూకమున ♦ క్షీరజలంబులఁ బోలెఁ గూడి మీ
దేవిని గాంచు యత్నమును ♦ తేర్చుట మేలని పల్కి మ్రొక్కి సు
శ్రీ విలసిల్ల వీడుకొని ♦ చెచ్చెర నేగె వియత్పథంబునన్. ౧౧౨౧

తే॥ దనువు పల్కిన మార్గానఁ ♦ జనుచు వారు, శైలకాననముల దాఁటి ♦ సంజవేళ
రెండు మాతంగములు చేరు ♦ క్రియ మతంగ, మౌని యాశ్రమస్థలికి స ♦ మ్మతిని చనిరి.

౧౧ శబరీ మోక్షణ పటలము (౯)

ఉ॥ కోరిన వారి కోరికలఁ ♦ గొంచక యిచ్చెడు కల్పశాఖులన్
తీరున నందఱుం గొనఁగఁ ♦ దియ్యని పండ్లను తావి పూవులన్
మీఱి యొసంగు నాశ్రమము ♦ మేదిని వారల స్వర్గ భూమియన్
సౌరున ధర్మయుక్తులకు ♦ సమ్మద మోక్షమనంగ నొప్పఁగన్. ౧౧౨౩

చ॥ కనీ ముదమంది రాఘవుఁడు ♦ కల్గు పథిశ్రమమెల్లఁ ద్రోచి నె
మ్మనమునఁ దన్ను తాఁ దలఁచి ♦ మాన్యతపం బొనరించుచున్న వృ
ద్ధను శబరిన్ సమంచిత ము ♦ దంబునఁ గాంచి మహాత్మురాల! యో
జనని! యనామయంబె? యన ♦ సంభ్రమ హర్షము లుల్లసిల్లఁగన్. ౧౧౨౪

ఉ॥ రామ! రమాభిరామ! జయ ♦ రామ! శుభావహనామ! సద్గుణ
స్తోమ! యవిద్య మాసె మన ♦ సుం దపసుం బరిపక్వమందె నా
జామ కృతార్థమయ్యెను కృ ♦ పామయ! నీవిట కేగుదేరఁగా
నీముఖ పంకజంబు గని ♦ నేఁదనువందు ఫలంబు గాంచితిన్. ౧౧౨౫

ఉ॥ ఆఁకలి గొంటివయ్య నన ♦ నారసి ప్రేమము వహించితయ్య నే
నేకొని నీకుగా ఫలము ♦ లేఱిచి యుంచితి నాయనయ్య నీ
యాఁకలి దీఱ భోజ్యములు ♦ హాస్యము నందవె యంచు ముద్దుగా
మేకొని పండ్లు ప్రేమంచి చే ♦ నిక్కులు వాని నొసంగె భ్రాంతియై. ౧౧౨౬

ఉ॥ ఆతఁడు ప్రేమమైఁ గొని ♦ యారగించుచునుండ నింద్రుఁడుం
ధాతయు శంభుఁడున్ సురలు ♦ దిక్పతులై చనుదెంచి యెవ్వని
ఖ్యాత తపంబు నత్ఫలము ♦ నందెను వేగ సమీపమయ్యె నీ
తా తరుణీపతిం గలసి ♦ తక్కక మాయెడఁ జేరుమా యనన్. ౧౧౨౭

ఉ. నీయెట కేగుదెంతువని ♦ నిర్మల భక్తిని యున్ననాళ్లుగా
భావమునందు నిన్నె జపా ♦ భంగుల సంస్తుతి సేయుచుంటిఁ బ్రా
ణావలి నిల్పియుంటి ఫల ♦ మందెను పుణ్యచయంబు తండ్రి! నేఁ
డీవహినన్ను, వారు జన ♦ యిత్రి! శుభంబుల నొందుమా యనన్. ౧౧౨౮

ఉ॥ నీవలనన్ శ్రమంబులను ♦ నేఁగితి యమ్మ! దుఃఖ సంతతుల్
ద్రోవఁగఁ గంటి మిందు తలి ♦ తోఁపఁగఁ బుత్తులకున్న యెల్ల క్లే
శాలిల పంకముల్ దొలఁగ ♦ నాఁటయుసి యచ్చట నిల్చిరానిసిన్
వేచిన ఋశ్యమూక పద ♦ మిం దగఁ జూపె నిషాది ప్రీతియై. ౧౧౨౯

ఉ॥ మోక్షము చేరఁదగ్గ పథ ♦ ముం గనిపెంచెడు జ్ఞానికై వడిన్
శిక్షితరీతి నాశబరి ♦ చెప్పిన పల్కులు శాస్త్రరీతులన్
సుక్షములైనవారు విని ♦ సూటిగ జ్ఞాన సుధం గ్రహించి ప్ర
త్యక్షిత తత్త్వులై యలరు ♦ నందమునన్ విని రా రఘుప్రభుల్ ౧౧౩౦

తే॥ శబరి యవ్వలఁ దన యోగ ♦ శక్తివలన, శాశ్వతంబగు ముక్తిక ♦ శాశ్వతంపు
తనువు విడువఁగఁ గని చోద్య ♦ మనుభవించి, నామె తెలిపిన త్రోవనే♦యరిగినారు.

తే॥ వనులు కొండలు నదులును♦వెనుకఁ బడఁగ,నడచు జనులెల్లఁ జేయు స్నా♦నంబుకతనఁ
బాపమను నగ్ని చల్లాఱ్ ♦ పాడి కరఁగి, పరఁగె నట్లున్న పంపను ♦ బట్టిసినారు. ౧౧౩౨

అరణ్యకాండము సంపూర్ణము.

శ్రీ రామచంద్రార్పణమస్తు.

ఓమ్ తత్ సత్.

---

శ్రీరామ.

# కంబ రామాయణము. ❀ కిష్కింధా కాండము.

## ౧ పంపా పటలము. (౪౨)

మ॥ సుజన ధ్యేయ విధానమై శుభదమై ♦ సుజ్ఞేయమై మూలతో
యజమై వ్యక్త గుణాత్మకంబునయి జ్ఞా ♦ నానంద తత్త్వంబునై
త్రిజగత్కారణమై చరాచర సుహృ ♦ త్పీరస్థ హంసంబునై
యజముఖ్యార్థిత జన్మమై వెలయు బ్ర ♦ హ్మంబండ్రు సీతావిభున్. ౧

మ॥ మకరందంబులఁ జిందు తామరలచే ♦ మాన్యంబయై మత్తదం
తి కదంబంబులు స్నానమాడఁదగి, నీ ♦ తిం బోలె లోఁతై, సితో
దక పూర్ణంబయి వార్ధినా, మెఱుపు ల ♦ బ్దంబుల్ పురాణింప ద్యో
తకమా నంబరమట్లు, పంప వెలసెన్ ♦ దద్జ్ఞుల్ ప్రశంసింపఁగన్ ౨

చ॥ మలిచిన నిద్దపుం బటికి ♦ మాడికి నొప్పెడు స్వచ్ఛ పుష్కరం
బులు తెర లుప్పతిల్లఁ బోలు ♦ పుం గొను వన్నెల తాల మెట్లకుం
దలకొని పెక్కు రంగులను ♦ దాల్చి, బహుశ్రుతుఁడయ్యుఁ దత్త్వముం
దెలియని యజ్ఞు మానసము ♦ తీరునఁ గానఁగవచ్చె నయ్యెడన్. ౩

ఉ॥ ముత్తెపుఁ గుప్ప లెల్లెడలఁ ♦ బొల్చు తటాకము విద్రుమప్రభో
ద్యత్తతిఁ బోలు పాదరుచి ♦ యందిన హంసము హంసమూఁకతోఁ
జిత్తము రంజిలం దిరుగు ♦ చెన్ను రహించెను ఋక్షసంతతుల్
మొత్తము చుట్టి రా నడుమఁ ♦ బూర్ణ శశాంకుఁడు క్రాలు మిన్నునన్. ౪

చ॥ అసమ తపస్వి గాధిసుతుఁ ♦ డబ్ధి పరీత మహీతలంబు జీ
వ సమితి వేద పారగుల ♦ బ్రహ్మకు మాఱుగ సృష్టిసేయఁగా
నసమునఁ బూను కాలమున ♦ నంబుధి మాఱుగ శుద్ధ తోయధిన్
వెన సృజియించె నొక్కొ యనఁ ♦ బెంపయి యొప్పెఁ దటాక మయ్యెడన్.

చ॥ రవి నెదిరించు తేజమునఁ ♦ గ్రాలు ఫణామణు లొప్పు పన్నగుల్
తవిలి వసించు లోకమిది ♦ తక్కక చూడుఁడి యంచుఁ జూపు లోఁ
తు వఱలి యుండియున్ వెలసె ♦ దోష విహీన విభాసి సత్కవి
ప్రవరుని కావ్య భావ రస ♦ పద్ధతిఁ బ్రస్ఫుటమై ప్రపేయమై. ౬

చ॥ జల విహంగంబులందు ♦ పలు ♦ చందములన్ విహరించు చీకలా
వలకను పాటు పస్పుట ర ♦ వంబులు సేయుచునుంట పెక్కు భా
షలు గల పెక్కు జాతులు ♦ జానపదావళి యొక్క పట్టన
స్థలి నొక పీఠిలోఁ దిరుగు ♦ చాప్పు వహించె వినోద పద్ధతిన్. ౭

చ॥ సరసున రక్త తామరస ♦ షండమునన్ వసియించు హంస లా
సరసిజవాసినిన్ ధరణి ♦ జాతను గూర్చి పచింపలేరు ము
చ్చిరుచును తాము నెమ్మొగము ♦ చేరికఁ జూడఁగలేరు ఘన్నతం
బొరయుచు వహ్నిలోఁ బడెను ♦ వైనము నందగనుబ్బె నయ్యెడన్. ౮

చ॥ ఎఱుకువ నిర్మలంబగుచు ♦ దెసపున నుండియు దప్పు తప్పు ను
త్తరమగు మాయ గప్పఁగ ని ♦ జస్థితి గానక భౌప్ర కీర్తిఁ బు
ష్కరిణిని గల్గు ముత్తెములు ♦ గట్టిగ పసిల్చి పరీక్ష సేయఁగా
మఱుఁగగుచుండు నందు జల ♦ మధ్యమునం గల నాచు మొక్కలన్. ౯

ఉ॥ మోదములేని రామ జన ♦ ముఖ్యుఁడు చూచినచో సతీత్వముల్
సాదుగుణంబు రూపమును ♦ జానకి కన్నుల చుట్టలంచుఁ జెం
పేదఁ దలంచి బాష్పజల ♦ మీఁదని కన్నుల నీరు గార్చి వి
చ్ఛేద మనస్కుఁడౌ ననుచుఁ ♦ జింతిలి లోన నడంగె వాలుగల్. ౧౦

చ॥ వెదురుల నుండి పంక మద ♦ విస్రుత వారణ మస్తకంబులన్
జెదరిన ముత్తెముల్ మఱియుఁ ♦ జెన్నగు పెక్కు వినూత్న రత్నముల్
మెదలుచు మీఁద రాజిలగ ♦ మించుచు వచ్చెడు వాఁగు వెల్లువల్
మదవతు లుల్లసిల్లి చను ♦ మార్కిఁ గనంబడుచుండు నయ్యెడన్. ౧౧

చ॥ మదకరు లుల్లసిల్లి జల ♦ మధ్యముచేరి కలంపఁ బుష్కరా
స్పదము భుజంగ పుంగవులు ♦ సల్పిన దర్పక సంగరంబుచే
నదవదమై శ్రమం బతిశ ♦ యంబుగ నొందిన వారకాంత యొ
ప్పిదమున నుండె; స్వార్థపర ♦ వీరుల కార్యము లిట్టివే కదా?. ౧౨

చ॥ కొదరుచు నింగి రాయు పెను ♦ గొండలనుండి స్రవించు తేనెయున్
మద గజ ధారలున్ గుసుమ ♦ మంజరులన్ భ్రమరంబు లూడ్చు పె
ల్లిదపు మధుద్రవంబు నట ♦ లీనముగా జలపాయు లెల్ల రు
న్మదితులై యాట నయ్యెదొక ♦ మానిని యోష్ఠసమం బనం దగన్. ౧౩

ఉ॥ బాసలయందు బంధురతి ♦ భాసిలు లక్షణ లక్ష్యజాలముల్
పీన మెఱుంగఖండు పెను ♦ వేతిఁడు లొక్కటఁ గూడి వేడ్కమైఁ

గానటబీనటం బలుకు ♦ కైవడి నన్వయ బంధ శూన్య ని
ష్కాసిత వాగ్వినోదములఁ ♦ గ్రాలు విహంగచయంబు లయ్యెడన్. ౧౪

ఉ॥ ప్రాణసమంబుగాఁ దలఁచి ♦ బాళిని కౌఁగిలి గాంచు హంసికన్
బ్రాణములన్ గళేబరము ♦ పాసిన కైవడిఁ బాయు హంస గీ
ర్వాణ పదంబునుండి యల ♦ రన్ మునుఁగం జను వేల్పుబోట్ల శిం
జాన మృదుస్వనంబు తన ♦ జాయ యెలుంగని సంభ్రమించెడున్. ౧౫

చ॥ పెను గిరులందు నుండి బహు ♦ వేగముగాఁ బ్రవహించుచుండు వా
హినులు సుగంధ వృక్షముల ♦ సెడిచి తేచుచుఁ దెచ్చి నింపఁ బ
త్తప జను లిమ్ము మై నొరసి ♦ దండిగఁ బాత్రను నించు గందమ
న్ననువున నొప్పు వర్షఋతు ♦ వందలి యయ్యమృతాలయాంబువుల్. ౧౬

ఉ॥ సాంకవగంధి మోవికిని ♦ సాటి వహించెడు హల్లకంబులం
బాంకముగా స్రవించు మధు ♦ వుం దగఁ గ్రోలి మదించు నక్రముల్;
సంకెలలం బలెన్ సారిది ♦ జన్మ మృతుల్ వహిఁయించు లీల ను
ల్లంఘ లోక ల్లోకల్లుగ మి ♦ లం గొన మున్గుచుఁ దేలుచుండెడున్. ౧౭

ఉ॥ ఇంచుగ రామభద్రునకు ♦ నిందిర జానకిఁ దెచ్చి యిచ్చు నే
ర్పంచిత శక్తి లేమిఁ దమ ♦ కైన తెఱంగున మేలు గూర్ప యో
చించి మరాళముల్ నడకఁ ♦ జెంగలువల్ కనులన్ బ్రవాళముల్
కాంచనదేహ యోష్ఠమును ♦ కానఁగఁ జేయుచు నుండె నత్తటిన్. ౧౮

చ॥ తొడవులకాంతి దిక్కులను ♦ దూఁటఁగ నిత్యముఁ దానమాడ నం
దడిఁ జనుదెంచు నిర్జర మ ♦ దావళ యానలు చేతి హంసలన్
గడఁగుచు నందియాయఁ జెలి ♦ కత్తెలు తత్తట మందు నిల్చు కై
వడిని సరస్తటస్థ సుమ ♦ వల్లులు హంసలతోడ నొప్పెడున్. ౧౯

ఉ॥ మేటి తటాక నీరముల ♦ మీఱు బక ప్రతిబింబ దృశ్యముల్
స్ఫాటిక కాంతులం గులుకు ♦ స్వచ్ఛ జలంబుల నుండు మత్స్యముల్
పాటిలఁ గాంచి భీతిలుచుఁ ♦ బాఱుచు దాఁగ బకోట ఝూటముల్
నీటుగఁ జెట్లకొమ్మలను ♦ నిల్చి విదుల్చుచునుండు ఱెక్కలన్. ౨౦

ఉ॥ తీరమునం దొకొక్కెడనఁ ♦ దీరిచి చెక్కిన యట్టులున్న జం
భారి వినీల రత్న రుచి ♦ యంతటఁ బర్వ నొకొక్క ప్రక్కఁ బెం
పారిన పద్మరాగముల ♦ యంచిత కాంతులు పర్వ, జక్కవల్
నేరక రేవగళ్లు తరు ♦ ణీ కుచ యుగ్మముఁ బోలు నిచ్చలున్. ౨౧

ఉ॥ వాలముఁ బోలు మీలు తర - వాలము ద్రిప్పిన రీతి నాడఁగా
వాలు తరంగ మధ్యముల - వారి శునీ తతి గజ్జెగట్టి యు
లీల నటించు గారడి వ - లె స్నటనంబు వెడంగు సేయ భే
కాలప మద్దిగాంచి యహ - హా! భళిరా! యను పొల్కిఁ గ్రాలెడిన్. ౨౨

శ్రీరాముఁడు జలపక్షుల తిరుగని సీతం దలంచికొని చింతిలుట.

ఉ॥ సుందరమై మనోజ్ఞగతి - శోభిలుచుండు సరోవరంబు రా
మేందుఁడు జూచి యందుఁగల - యింపగు హంసలఁ దమ్మిపూల నిం
దిందిర వారముం గని వి - దేహ తనూభవ యొద్దలేమి నా
నందము రోయు బుద్ధియును - నాశిల మిక్కిలి చింతనొందుచున్. ౨౩

సీ॥ కవ వీడకుండు జక్కవలార! యుందంపు, టంస మెత్తిన మేటి - హంసలార!
ఎడఁబాయ నొల్లని - యిల్లాలు చెఱవోవ, జిక్కి సోలుచునుంటిఁ - జింత మునిఁగి
ఇయ్యెడనైన మీ - రెదుట నిల్వరదేల? యెడయిక వంత స - న్నేఁచు చుండఁ
గరుణించి నిల్చినఁ - గొఱయౌనె మీకీర్తి?, మిముగాంచి యూఱట - మెలయరాదె?
తే॥ ఎన్నఁడు వియోగ బాధల - నెసయకుండు, నాకు మది సుంత నెమ్మది - సోఁకునట్లు
చెవుల కింపగు పల్కొండు - దవులఁ బలుకఁ, గీడు మూడునే? యాడిక - కిట్టునేమి?

చ॥ వికచ జలేజముల్ సురభి - వీచెడు కైరవముల్ చెలంగ జా
నకి నెడఁబాసి కుందెడు మ - నంబున కౌషధమా తటాకమా!
నకియ మొగంబుఁ గన్నులును - చక్కఁగఁ జూపెదు నీవు పూర్తిమై
సుకముగఁ జూపు; మే[illegible]సరఁ - జూడని లోభులు కీర్తిఁ గాంతురే? ౨౫

చ॥ కమలినిఁ బద్మకోకనద - కైరవ హల్లక వల్లులన్ దరం
గములను శైవలంబులను - గండు మిలం గని, మోసరంబ! నా
రమణిని పట్టి వ్యోమమున - రావణ హంతకుఁ డాహరించుచో
బ్రమయఁగ నంగముల్ చెదరి - పడ్డవె? యంచడుగున్ భ్రమంబునన్. ౨౬

చ॥ ఉదుటున నాడుచున్ ముదము - నొందుచు నిక్కెడు కేకి! నామన
స్సదనకు నాఁడె యోడితి వ - సంబున నిప్డు తృప్తిపొందితే?
సుదతిని గాంచలేక యిటు - స్రుక్కెడు నాపయి జాలి గల్గదో?
కొదుకక చెప్పవేమి చెయి - గొప్ప కనుల్గల నీవు కానవో? ౨౭

చ॥ అలుకక రండు మీ యెఱుఁగు - నర్థము దెల్పుఁడు హంసులార! నా
వలన దోసంగు లేదు మద - వారణ యానయె మిమ్ము గెల్చె నా
కలికి పయిం బగం గొలుపఁ - గాఁ దగుఁ గాని సమానదృష్టితో
నలువుసఁ గాంచి సంతసిలు - నాయెడ మీరలు కోపగింతురే? ౨౮

చ॥ దళములఁ జేరి గీతము ము - దంబునఁ బాడ ద్విరేఫపాళికిన్
జెలువుగఁ జోటునిచ్చు సర - సీజములార! తొలంగరాని తో
య్యాలి ననువీడి స్వీయ నిల ♦ యంబగు మీకడఁ జేరె; లేదనం
బోలుపగునేమి? కల్గియును ♦ బొంకెడు వారల మైత్రిఁ గాంతురే?. ౨౯

చ॥ ఒక పలుకైన నాడ కిటు ♦ లొత్తిలి సీతముఖంబుఁబోలు హా
ల్లకము కుఱంగటం గలవి ♦ లక్షణశైవలమా! కడంగి జా
నకి వదనంబు నీవయిన ♦ నర్మిలిఁ జూపుము తత్సుధా ద్రవ
ప్రకట చణంబులై పరఁగు ♦ పల్కులనే విన నిచ్చగింపవో?. ౩౦

ఉ॥ అంతర మేల బ్రాహ్మి! లలి ♦ తాంగి శ్రవంబవుకాని వేఱుగా
వింత పరాకులేల? కృశి ♦ యించుచు దిక్కులు దోఁపకిట్లు పె
న్వంతలఁ జిక్కు నన్నుగని ♦ వారిజనేత్రను గూర్చి తెల్పవో?
యింతగ వేఁడుచున్న దయ ♦ యింతయుఁ బూనక వైరమూనెదో?. ౩౧

చ॥ పగడము లెఱ్ఱదామరల ♦ పై ఖచియించిన లీల నొప్పు ప
ద్మగళ మలక్తకాంగుళులు ♦ తోయద మండలిఁ బోలు ముంగురుల్
నెగడఁగ నన్ను పాయు ధర ♦ ణీసుత కన్నుల మాడ్కి నొప్పు న
ల్లగలువలార! నన్ను వెత ♦ లం బడఁ జేయుచు నవ్వ న్యాయమే?. ౩౨

ఉ॥ క్రూర వియోగ తాపమునఁ ♦ గుందుచు నూర్పులు పుచ్చు రామ భూ
దారుఁడు పూఁ బొదల్లుగల ♦ తత్తటమందున నిల్చి చూచి కా
సారమ! నామనోహారిని ♦ జానకిఁ బాసి తపించుచుండ నో
దారుప కూరకుండు విది ♦ ధర్మమొకో తలపోయ నీకనుచా. ౩౩

మ॥ కరుణావారిధి రాఘవుండు మద పం ♦ కం బొప్పు సారంగముల్
కరిణీ వారముఁగాంచి తుండముల నా ♦ కర్షించి తోయంబు మో
దరసాబ్ధిా మునుఁగంగ నంది యిడుటల్ ♦ దర్శించి తన్వీమణిా
ధరణీజాత వియోగ మెంచు నెద నం ♦ తాపంబు వర్ధిల్లఁగా. ౩౪

శ్రీరాముఁడు సాయం సమయ కృత్యముల నిర్వర్తించుట.

శా॥ ప్రేమానర్ఘ విభూషణుండు సుగుణ ♦ శ్రేష్ఠుండు తమ్ముండు శ్రీ
రాముం గాంచి దివాకరుం డపర భూ ♦ ద్రం బొందె సంధ్యావిధుల్
నేమం బారఁగ నాచరించి భవ దు ♦ న్మేష ప్రకీర్తిం బరేశా
భూమ్ముల్నిండు త్రివిక్రమేశు పదముల్ ♦ పూజింపు మన్నా! యనగా, ౩౫

ఉ॥ రాముఁడు చింతతోఁ జని త ♦ రంగములన్ బొలుపారు నత్తటా
కామల తోయముల్ దొలుత ♦ నందు తపంబు ఫలింప, సిగ్గుచే
సామజముల్ దొలంగ రభ ♦ సంబున వారి శకుంత జాలముల్
భూమిజపాళిఁ జేర జల ♦ ముల్ దరిముట్ట మునింగె నచ్చటన్. ౩౬

తే॥ ఆతఁ డాసీట మజ్జన ♦ మాడునంత, నతని దహియించు విరహాగ్ని ♦ యా తటాక
వనము లెఱ్ఱగఁ గాఁచిన ♦ యినుము ముంచి, సట్టికరణిని సలసల ♦ మసఁచు నుడికె. ౩౭

ఉ॥ స్నానము చేసి యంతట స ♦ నాతన ధర్మ పథానువర్తియై
మానుగ సాంధ్య కృత్యములు ♦ మక్కువఁదీరిచి యర్ఘ్యముల్ రమే
శానున కప్పగించి విల ♦ సద్గుణులౌ ముని ముఖ్యులున్న యా
కానన మంద యొక్క యెడ ♦ కమ్మగు తావున నిల్చెఁ దమ్ముతోన్. ౩౮

ఉ॥ సంజను చందనాదికము ♦ చక్కఁగఁ దాల్చు విదేహ కన్యయున్
రంజిల రామికిన్ మనసు ♦ రాగ వియోగ మహార్తిఁ గుందుచున్
గంజదళాక్షుఁ డుండునెడఁ ♦ గంజ హితుం బలెఁ దీక్ష్ణదేహుఁడై
కంజ విరోధి పుట్టెఁదొలి ♦ గట్టుపయిం బలు దిట్టకై వడిన్. ౩౯

ఉ॥ తమ్ములు మోడ్పు సెందె ద్విర ♦ దమ్ములు నిమ్ములఁ జేరె నీడజా
తమ్ములు గూండ్ల కేగె మృగ ♦ తండము లెల్ల నడంగెఁ గీర సం
ఘమ్ములు పల్కులన్ వదలెఁ - గానల నాట్యము మానె నెమ్మి మొ
త్తమ్ములు గీతముల్ పరభృ - తమ్ములు నిల్పె ముడింగె నాకులున్. ౪౦

ఉ॥ నిద్రిలెఁ బ్రాణికోటి ధర - ణీధర సంస్థిత జీవరాసులున్
నిద్రిలె వ్యాళ సంఘములు - నిద్రిలెఁ దామరసాకరంబులున్
నిద్రిలెఁ బక్షి జాలములు - నిద్రిలె భూత పిశాచ సంతతుల్
నిద్రిలలేదు పాల్కడలి - నిద్రిలు సామజ యుగ్మ నేత్రముల్. ౪౧

ఉ॥ జ్ఞానము గల్గినంతఁ దన - జన్మరుజల్ విడిపోవు కైవడిన్
భానుఁడు పుట్టుడుందొలఁగె - బాధ తమంబును విచ్చెఁ గంజముల్
శ్రీనిధి రామ భూవరుఁడు - సెందెడు దుర్భర చింత తేలికై
జాను వహింపఁగా భువన - జాలము మేలుకొనంగ మేల్కొనెన్. ౪౨

చ॥ ఘనులగు రామలక్ష్మణులు - గ్రక్కున మేల్కని క్షీరవార్ధిక
న్యను హరిణాక్షి రాకొమిరె - నందములౌ వనులందు శైలకా
ననముల రోయుచుం జని మ - నంబున కంఠెను వేగ ఋశ్యమూ
క నగము చేరఁ బోయి రెస - కమ్మున లెక్కడకుండఁ గ్లేశమున్. ౪౩

## ౨. సాలభేదన పటలము. (౧౪౫)

### సుగ్రీవుఁడు రామలక్ష్మణులఁ గని భీతిల్లుట.

ఉ॥ వచ్చుచునున్న రాఘవుల - వారక యర్కసుతుండు కాంచి యీ
వచ్చెడు వార లింద్రజుని - పంపున వచ్చిన వారలంచుఁ దా
హెచ్చగు భీతి గుంది వెర - వేది రయంబునఁ బాఱెఁ బ్రాణముల్
మచ్చికఁ గావఁ బూని యభి - మానము వీడి బిలంబు చేరఁగన్. ౪౪

ఉ॥ పాఱుచు నాంజనేయుఁగని - పావని! కాంచితె యా సుధన్వులన్
వారలు వాలి పంపుగొని - వచ్చిన వారలు నన్ను చంపఁగాఁ
గారణ మింక వేఱొకటి - గల్గద యంచు భయంబు పెంపునన్
దూఱెను దొడ్డ కందరము - తోయజ మిత్ర సుతుండు గ్రక్కునన్. ౪౫

ఉ॥ తారుఁడు నీలుఁడున్ హనుమ - తక్క వనేచరరాజితోడ న
ట్లూరక పాఱు సూర్యసుతు - నొయ్యన వెన్కొని పోవుచుండ, భూ
దార కుమారకుల్ శబరి - తత్పరతన్ వచియించు త్రోవ నీ
తారమణీ మణిన్ వెదకు - దారి కనంబడు నంచు నెంచుచున్. ౪౬

చ॥ వెదకుచు వచ్చుచుండఁ గపి ♦ వీరులు కొండఱు పోయి వారు చిం
త దవిలి చంచలత్వమును ♦ దైన్యము తోఁపఁగ వచ్చువారు జం
భదనుజవైరి పుత్త్రకుని ♦ పంపున వచ్చిన వారు కారు భీ
తిదులును గారు చూడుఁ డనఁ ♦ దేఁకువ మారుతి తేటి చూచుచున్. ౪౭

శా॥ జ్వాలాభీల హాలాహాలంబు దెసలం ♦ బర్వంగ నాదిత్య దై
త్యాళుల్ పొందిన భీతి మాన్పిన పిరూ ♦ పాక్షుం బలెన్ జ్ఞానమున్
వేలంగాంచిన యాంజనేయుఁడు భయో ♦ ద్వేగమ్మునన్ మానసా
లోలత్వంబు భజించు వానరుల క ♦ ల్లోలంబులన్ మాన్చుచున్. ౪౮

### హనుమ రామలక్ష్మణుల తీరు లారయుట.

చ॥ భయపడ కిందె యుండుఁడని ♦ పల్కి యొకానొక బ్రహ్మచారియై
రయమున వచ్చి రాఘవుల ♦ రాజిత చాపుల మానివేషులన్
నయవిదులన్ మఱుంగున న ♦ ణంగి కనుంగొని శంక నొంది సం
శయము తొలంగ నిట్లని వి ♦ చారణ చేసెఁ గుశాగ్రబుద్ధియై. ౪౯

సీ॥ దేవతా పూజ్య మూ ♦ ర్తి త్రయంబొ యన్న - నిద్దఱే యిచ్చట ♦ నెసఁగువారు
పటు చాప హస్తులి ♦ ద్దారలఁ బోలిన, వార లే జగమున ♦ వఱలఁబోరు
వీరి కసాధ్య మీ ♦ పృథివిని గల్గునే?, వీరల నెఱిఁగెడి ♦ వెరవు లేదు
మ్రొక్కన మదినొచ్చి ♦ సోలు నట్లున్నారు, వీరు చింతిలఁ దగ్గ ♦ వారు కారు

తే॥ సురవరులుగారు సామాన్య • నరులుకారు, వీరి చింత యదెయ్యదో • పెద్దదగును
భ్రాంతిఁ గొల్పెడి యరుదైన • వస్తుచయము, ఖిన్నులగుచు నన్వేషించు • చున్నవారు

సీ॥ ధర్మశీలంబులే • ధనముగాఁ • గలవారు, శాంతి యుక్తులు కృపా • సాగరులును
లోకహితులు దేవ • లోకేశునమున నెఱ, గందు గభీరిమ • మొందినారు
ధర్మదేవతయుం డ • త్రయపడు శీలంబు, గలుగు వారలు జిత • కామ తనులు
కాలుండు సడలగాను • ఘన సరాగము గుణాల్, వీరి కార్యము నెంచ • వేఱుకాదు

తే॥ ధర నలభ్యమగా దేవాన్న • ధనంబుఁబోలు, సరిగి వస్తువు నెడ వీడి • యరయు వారు
సింహములక్రియ దెసల నీ • క్షించు వారు, వంచనములేని మోములు • వఱలు వారు

చ॥ అసదృశ బుద్ధిశాలి యగు • నంజని పుత్త్రుఁడు చాలసేపు మా
నసమున నిట్లు పక్కవయి • సంబులుగాఁ దలపోసి ప్రీతిచే
నెనఁగి యొకందయుం గరఁగ • నచ్చిరు భక్తియు హెచ్చరింప సం
తసమునఁ గాంచుచుండె మునుఁ • దప్పిన నెయ్యురఁగాంచు కైవడిన్. ౫౨

ఉ॥ క్రూరగుణంబు గల్గు మృగ • కోటి పిశాచములుం గనుంగొనన్
క్రూరత మాన్చి సాధుగుణ • కోటిగ మార్పఁగఁ దగ్గ శక్తి యే
పారు మహాత్ములం గని య • హా! పగవారని వైరిసేనలో
వారని యెంచి భీతిగొని - పాఱఁగ హేతు వొకండుఁ గల్గునే? ౫౩

చ॥ విహగము తెల్లసందమగు • వీరి శరీరము లెండ సోకఁగా
సహనము నొందలేక బలు • జాలిని ఱెక్కల విప్పి పైపయిన్
బ్రహితులఁ బోలెఁ బందిరిగఁ • బర్వుచు వచ్చెడి మేఘ సంఘముల్
తహతహ డింపఁ దుంపురులఁ • దన్పుగఁ జల్లుచు వెంబడించెడిన్. ౫౪

ఉ॥ ఆతప తప్త గండశిల • లన్నియు వీరి పదారవింద సం
పాతమునన్ మధుద్రవము • పైకొను పుష్పము లట్లు మేకొనన్
భ్రాంతిగ గుల్మముల్ లతలు • పాదపముల్ భువి వంగి ప్రాలుచున్
జోతలు సేయుటీలఁ దగఁ • జూడఁగ వీరలు ధర్మమూర్తులో? ౫౫

మ॥ ఘన తాపత్రయమున్ సడల్చి మఱి యా - గామ్యాది కర్మాళి వీఁ
కను పోకార్చి యమాలయంబునకుఁ బో - కల్మాన్చి కైవల్యమున్
గొనఁ గాన్పించెడు విష్ణుమూర్తులొ? కరం - గున్ శల్యముల్ పైపయిన్
దనరున్ భక్తి యపారమై కతము కా - నన్ రాదు నిక్కంబుగన్. ౫౬

మ॥ అని యాలోచన సేసి వారలును తా - యంగన్ వినీతాత్ముఁడై
యనుఁ దేజస్వుల రాక భవ్యమయి యు - ష్టావాప్తి చేకూరుతన్

బొనుఁగొఁ గాత మనిష్టముల్, కుశలమే? పుణ్యాత్ములారా? యనన్
దనుజధ్వంసియు నీవెవండ వన ను - ద్యత్ప్రీతిఁ దా నిట్లనున్. ౫౭

## హనుమ రామలక్ష్మణులకుఁ దన వృత్తాంతము తెలుపుట

మ॥ వనదశ్యామల! పంకజేక్షణ! జగ - త్ప్రాణ ప్రసాదంబునన్
వనితోత్తంసిక యంజనాఖ్య గనియెన్ - బ్రఖ్యాతిమైఁ బేరునన్
హనుమంతుండను సూర్యపుత్త్రునకు మం - త్రాలోచనల్ సెప్పువాఁ
డను భవ్యాత్మకులార! నే వనచరుం-డన్ దానుఁడన్ మీకడన్. ౫౮

తే॥ ఇచట సుగ్రీవుఁడను వాన - రేశ్వరుండు, మిమ్ముఁగని తన మది శంక - మీఱుకతన
నరసి రమ్మన నాతని యాజ్ఞనూని, వచ్చినాఁడ నిటకు వీర - వర్యులార!. ౫౯

తే॥ అనుడు శ్రీరామచంద్రుఁ డా -హనుమ పలుకు, లరసి విక్రమంబునను శా-స్త్రార్థవితతి
నెఱుకయందు సద్గుణముల-నితనిసదృశు, లెవరు లేరని తమ్ముతో-నిట్టులనియె. ౬౦

క॥ ఇతఁడు పఠింపక మానిన, శ్రుతులును శాస్త్రములు లేవు .. సూనృత వాక్యం
బతులిత మృదుల మధుర వా, గ్వితతి గలుగు నితఁ డజుండొ? - వృషభధ్వజుఁడో?

తే॥ జగతిసామాన్యుఁడగుబ్రహ్మ-చారిగాఁడు, విక్రమంబునుమహిమయు- నెలయువాఁడు
సుస్థిరుండు నిష్కపటి వి - శుద్ధగుణుఁడు, నిజము నీవు పిమ్మట గమ - నింపఁగలవు.

తే॥ ఋషులయందునాకులయందు-నిట్టివాక్య, చతురుఁడెవ్వఁడుగలఁడు?ని-శ్చయముగాగ
నితని నేలు నాతని కీల- నేది కొదువ?, యనుచు హనుమంతుఁగని వెండి-యనియెనిట్లు

తే॥ ఓయి ధీవీర! కీశ కు - లోత్తముండు, రవిసుతుం డెందు గలఁడు ని - ర్వక్రగతిని
అతనిఁ గను కోర్కితోడనే - యరుగుదెంచి, నారమున నుత్సహించి నా-నరవరుండు.

చ॥ ఘనభుజులార! మీకుఁ ద్రిజ ♦ గంబుల నెవ్వరు సాటి? మీరలి
ట్లనుపమమైన నెయ్యమున ♦ నా కపినాథుని చూడ రాకచే
ననితరసాధ్యమైన తప ♦ మాతఁడు పూర్వ భవంబునందు చే
సినది ఫలించె నిప్పు డని ♦ చిత్తమునం దలపోసి పొంగెదన్. ౬౫

మ॥ బలభిత్సూనుఁడు వాలి కోపమున దు ♦ ర్వారంబు వర్ధిల్లఁ గా
వలుఁడై చంపఁగ వెంబడింపఁ బురముల్ ♦ వర్జించి యీకొండపై
బలు దుఃఖంబులఁ బొందుచున్ దిగులుతో ♦ వర్తించు మాఱేని కీ
రలు విచ్చేయుట భాగ్యదేవత కృపన్ ♦ బ్రత్యక్ష మౌటే కదా!. ౬౬

మ॥ తమ వాంఛల్ నెఱవేర్చుకొంటకయి కా ♦ దా జీవ సందోహముల్
ప్రమదంబారఁ బ్రయత్నముల్ సలుపుటల్? భావింప యజ్ఞాది ధ

ర్మములం జేయుదు రీ జగచ్ఛుభముక్తై ♦ మాన్యుల్; భయంబందు ప్రా
ణము గాపాడుటకంటె ధర్మమొకఁ డ ♦ న్యంబున్నె ధాత్రీస్థలిన్? ౬౭

సీ॥ మము గావ మీరు స ♦ మర్థు లనుట చాలఁ, జులుకన మాటయై ♦ నిలుచుఁగాదె?
యనిమిషులాది చ ♦ రాచర నితతితో, నలరారు కృతకంబు ♦ నకృతకంబు
కృతకాకృతకమయి ♦ యొసఁగు నీ పదునాల్గు, జగములఁ గావంగఁ ♦ జాలువారు
శరజన్ముఁ బోలిన ♦ చక్కఁదనమ్ము మ, రాక్రమ గుణము లొ ♦ ప్పారు మిమ్ము

తే॥ శరణ మొందిన మాకింక♦జయముగాక, వేఱు గలుగునే? మాపరి♦వృఢుఁడు నన్ను
వార లెవరని ప్రశ్నింపఁ♦బలుకవలయు, వైనమును మీరె సెలవిండు♦భద్రగుణులు!

తే॥ సత్యమను చేని కంచెయగా ♦ శ్వసన తనయుఁ, డిట్టు లడుగంగ సౌమిత్రి♦యించుకంత
పొరపులేని తీరుసఁ దమ పూర్వచరిత, పలుకఁ దొడఁగెను మృదుల వి ♦ స్పష్టఫణితి.

సీ॥ జగతీతలంబు నా ♦ జ్ఞా చక్రమునఁజేసి, చతురత నడపిన ♦ చక్రవర్తి
శంబరాదులఁ జంపి ♦ జన్నంబు లొనరించి, యమరలోకం బేలు ♦ విమలకీర్తి
కరుణా కటాక్షవీ ♦ క్షణముల నరసురా, దుల మన్ననలఁ గొన్న ♦ యలఘుమూర్తి
సత్యసంధుండును ♦ సహజ సద్గుణుఁడును, నీతి విఖ్యాతుఁడౌ ♦ నియతవర్తి

తే॥ మనుకులాభరణంబు ప్రా ♦ మాణికుండు, ధరణిముఖ తిలకంబనఁ ♦ దగునయోధ్య
నేలు నాతండు జయశాలి ♦ హితకృపాలి, ప్రథిత గుణశీలి దశరథ ♦ రాజమౌళి. ౭౦

శా॥ ఆ రాజన్యుని ముద్దుపట్టి రఘురా ♦ మాఖ్యుం డితం డుర్వరా
భారం బెల్లను తండ్రి పల్కు నిలుపన్ ♦ వైమాత కోరంగ నా
మేరం దమ్మున కిచ్చి యుల్లమున సం ♦ ప్రీతిన్ మహారణ్యమున్
జేరన్ వచ్చె మహాత్ముఁ డీతనిని నే ♦ సేవించు సద్భృత్యుఁడన్. ౭౧

ఉ॥ రాముని పుట్టుఁదొట్టి వివ ♦ రంబుగ దండకఁ జేరు హేతువున్
బామెలు చేసి రావణుఁడు ♦ భూమిజఁ బందిగఁగొంచుఁ బోవుటల్
తాము నెరోయుచుండుటలు ♦ తక్కక దెల్ప సమీరుపట్టి చే
తో ముదమంది చాఁగిలెను ♦ తోరపు భక్తి మనంబు నిండఁగన్. ౭౨

చ॥ అటులు నమస్కరింపఁ గని ♦ యంబుజనేత్రుఁడు విప్రవర్ణి వ
క్కటు కయిమోడ్పుఁగాఁ దగునె ♦ క్షత్రియ వర్యున కంచు నవ్వఁగాఁ
బటుతర నీతివిక్రముఁడు ♦ పావని యిట్లనుఁ గింకరుండు మ
ర్కట కులజుండఁ డటంచుఁ బలు ♦ కండొకొ! మీర లెఱుంగకుంటిరే? ౭౩

చ॥ అని గురుధర్మ పద్ధతుల ♦ కాదరువైన మరుత్కుమారుఁ డ
య్యనకులు లక్ష్మణుఁ పదిహ వ ♦ హించె నిజంబగు తొంటిరూపు మే

దిని గల సర్వవస్తువులు ♦ తిన్నని పిన్నని నంచుఁ బల్కు వి
న్ననువునఁ, గాంచు వారల మ ♦ నంబులు మిక్కిలి పిచ్చలింపఁగన్. ౭౮

తే॥ జగముఁ గాలితోఁ గొలిచిన ♦ చక్రి కోక, రఘుసుఁడు రాఘవుండె ది♦గ్భ్రమము నొంద
మేరు నిభ శరీరుండును ♦ మిహిర శిష్యుఁ, డైన హావనిన్ వర్ణింప ♦ నరిది కాదె?

ఉ॥ తమ్ముఁడ! కాంచితే విమల ♦ తత్త్వనుసత్త్వము రూపుదాల్చిన
ట్లిమ్మగ మోక్షమే యొక కపీశ్వరు నాకృతి నొందు భాతిఁదే
జమ్ముల పుంజమై వెలసె ♦ సమ్మతి నిమ్మహనీయుఁ జేరి మః
ఖమ్ముల నీఁగునట్టి యొడి ♦ కమ్మ నెఱుఁగంగ నయ్యె నియ్యెడన్. ౭౯

చ॥ ఎడఁదల దుఃఖముల్ తొలఁగు ♦ నింక సుఖమ్ములు వచ్చు నిక్కమీ
కడిఁది పరాక్రమ స్థిరుని ♦ గల్గిన సూర్యసుతుం డదెట్టిఁడో
ఎడయక యెట్టి కార్యతతు ♦ లేని వలంతులు నీతిమంతులె
య్యెడఁగల రట్టి భూపునకు ♦ భృత్యులచే సమకూరు సన్నియున్. ౭౭

చ॥ అని రఘువంశ పుంగవుఁడు ♦ స్వాంతము పొంగ వచించి యానన
బును వికసింపఁ గాంచుడు స ♦ మున్న తి మారుతి వారిఁ గాంచి స
జ్జన నుతులార! మా ప్రభుని ♦ చయ్యనఁ దోడ్కొని వత్తు మీర లి
చ్చ్చను క్షణ మింద యుండుఁ డని ♦ సత్వరుఁడై మరలెన్ దదాజ్ఞమై.

చ॥ అతులిత నీతిమంతుఁ డగు ♦ నా హనుమంతుఁడు చిత్తమందు శ్రీ
పతి గుణభూతి మాటికిని ♦ భావన సేసి జగంబు నేను మా
పతియును కష్టముల్ తొలఁగ ♦ బంధుర సౌఖ్యము నొందువారమై
బ్రతికితిమంచుఁ గీశవిభు ♦ పాలికి నేగె వడిన్ ముదంబుతోన్. ౭౯

హనుమంతుఁడు సుగ్రీవునకు శ్రీరామ వృత్తాంతము తెలుపుట

శా॥ వాలిం గీలి వధించు కాలుఁ డిటకున్ ♦ వచ్చెన్ మనోవేదనల్
తూలెన్ ధైర్యమునొందుఁడింక మది నా ♦ త్సుక్యంబు సిద్ధించు స
త్కాలంబయ్యె నటంచు మారుతి మహా - కాలుండుపోలెన్ ముదా
లోలల్లీల నటించుచుం దెలిపె మే ♦ లుం గూర్చి సుగ్రీవుతోన్. ౮౦

చ॥ దివి భువి నాగలోకమున ♦ దిక్కులఁ దక్కు జగంబులెల్లెడన్
నెవడిన వారిచేఁతలను ♦ నేత్రములన్ నుడులన్ మనస్సులం
దవిలినవారు శత్రులకుఁ ♦ దల్లడమందెడు వారలెల్ల వా
చవి సుధఁ బోలి చూడఁగల ♦ చందము వారలు రాకుమారకుల్. ౮౧

సీ॥ కల భూమియెల్ల నే ♦ కచ్ఛత్రముగ నేలి, నాతఁడు విమల వి♦ఖ్యాతయశుఁడు
రాజ రత్న కిరీట ♦ రంజిత పాదుఁడౌ, దశరథేశ్వరుని పు ♦ త్త్రకులు ఘనులు

నీతిమంతులు కృపా న్వితులు యాచకులు, మహిమాన్వితులు ధర్మ♦మార్గరతులు
కీర్తికాములు నీకుఁ ♦ గిశోరాజ్య మొసంగి, యుపకార మొనరింప ♦ నోపువారు

తే॥ వారిలో జ్యేష్ఠుఁడగు రామ♦నల్ల భుండు, తాటకను సుబాహుని చంపి♦తపసి మఖము
గాచి విశ్వామిత్రుని చేఁ గొని ♦ గౌతముని సతి, శాపము బాపినాఁడు ని♦శాలగుణుఁడు

సీ॥ జనకుని పురికేగి ♦ శంభు చాపము ద్రుంచి, యవనిజాతను పెండ్లి ♦ యాడినాఁడు
త్రోవలో నెదిరించి ♦ దుడుకుతనము చూపు, పరశురాముని భంగ ♦ పఱచినాఁడు
తండ్రివాక్యము నిల్పఁ ♦ దల్లికోరిక దీర్చ, నిలవేల్పుఁ దమ్మున ♦ కిచ్చినాఁడు
వనమున దీక్షను ♦ జన విరోధు విరాధు, యముని పురంబున ♦ కంపినాఁడు

తే॥ దండకావనమెల్ల నిర ♦ ద్రవ్యముగను, సలుప ఖర దూషణాదులఁ♦ జంపినాఁడు
కాలగళుకంటు ఘన పరా ♦ క్రమముగా వాఁడు, రామచంద్రుండు సజ్జన ♦ రక్షకుండు.

తే॥ అతఁడు క్షీరసాగరశాయి ♦ యైన హరియె, త్రిదశు లర్థింపఁ బుట్టిన ♦ దేవదేవుఁ
డతనితో మైత్రి నెఱపుమా ♦ యనుపదాళి, యర్కుఁ గను మంచు కైవడి♦నడఁగిపోవు

క॥ మాయిని మారీచు నొకే, సాయకమునఁ ద్రుంచె జమునిని♦ సాటి కబంధున్
మాయించె శబరి ఫలము ల, మేయ ప్రేమమున నొసఁగ♦ మెసఁగెం గరుణన్. ౮౫

చ॥ కపివర! సంయమీశ్వరులు ♦ గాఢ తపంబు చిరంబు చేసి యా
నృపవరు దర్శనంబుకయి ♦ నింగిని గాచిన చాతకంబు చా
డుపు వహియించి బంధములు ♦ డుల్లఁగ గాంచిరి మోక్షసంపదన్
జపలుఁడఁ దన్మహాత్త్వము వి ♦ చక్షణచేసి వచింపనేర్తునే?. ౮౬

ఉ॥ క్రూరుఁడు రావణుఁడు కడు ♦ క్రొవ్వున వంచనచేసి రామ భూ
దారుని ధర్మపత్నిఁ గొని ♦ దండక మార్గముఁ బట్టిపోవ నా
వారిజ లోచనన్ వెదక ♦ వచ్చిన వారలు నీ సఖ్యమ్ము
గోరిన వారు నీసుగుణ ♦ కోటియు మున్నుగ విన్నవారలున్. ౮౭

మ॥ మనమీఁదం గృప నూనినారు మనకై - మర్దింతు రయ్యింద్రజున్
గనిరెన్ నీసుకృతంబులున్ శుభములం - గాంక్షించి కాకుత్థ్సులన్
గని మైత్రిం బొసరింపఁగా నడవుమా - కాలంబు మేలయ్యె లె
మ్మని రాణ్ణీతి విశారదుం డఖిల కా - ర్యజ్ఞుండు వాక్రువ్వఁగన్. ౮౮

మ॥ తనపై నెమ్మిని మారుతాత్మజుఁడు చం - దంబొప్ప వాక్రువ్వ నం
తనగా సూక్ష్మమతిన్ గ్రహించి విపులో - త్సాహుండు సుగ్రీవుఁ డ
త్యను మోదంబునఁ బావనిం గని గుణా - ఢ్యా! ధీయుతున్ మంత్రిగాఁ
గొను నా కెయ్యది దుర్ఘటం బనుచుఁ గా - కుత్థ్సుం గనన్ వెల్వడెన్. ౮౯

## రామసుగ్రీవులు మైత్రి సేయుట.

మ॥ కనులారం గనె భానుసూనుఁ డచటన్ ♦ గార్మేఘమముం బోలె వి
చ్చిన యంభోజముఁబోలె షోడశ కళల్ ♦ చెన్నారు చంద్రుంబలెన్
ఘనమౌ పచ్చలకొండవోలెఁ దగు శ్రీ ♦ కాకుత్థ్సు సత్కర్ణవే
ష్టన హీనంబగు నెమ్మొగంబును కడున్ - జల్లైన కందోయియున్ ౯౦

చ॥ కని చిర మచ్చ్లు నిల్చి యెద ♦ కంబున ధాత సృజించినట్టి భూ
త నివహమెల్లఁ బుట్టిన మొ ♦ దల్గొని నిన్నటి దాఁకఁ జేయుచుం
డిన సుకృతంబు లన్నియుఁ బ ♦ టిష్ఠతఁ గూడుచు రెండు దేహముల్
గొని యిటు పుట్టెఁ గావలయుఁ ♦ గోరిక నంచుఁదలంచె నెమ్మదిన్. ౯౧

ఉ॥ ఇమ్ముగ విష్టరశ్రవసుఁ ♦ డీ యవతారమునందు మానవ
త్వమ్ము భజింపఁ గోరి యిటు ♦ వంటి శరీరము దాల్చెఁ గాన లో
కమ్మున బ్రహ్మగా మారుఁడు ♦ గా వహియించిన లీలకంటె మ
ర్త్యమ్మున మానవుం డగుట ♦ నన్ని భవంబులకంటె మేలగున్. ౯౨

మ॥ అని సూర్యాత్మజుఁ డాత్మనెంచి పులకల్ ♦ హర్షంబుచేఁ గ్రమ్మఁగం
దన నేత్రద్వయి నాప దీఱఁ గని యా ♦ నందాబ్ధి నోలాడుచుం
జన శ్రీరాముఁడు ప్రేమ మీఱఁగఁ గరా ♦ బ్జాతంబు వే చాఁచి ర
మ్మని సమ్మోదకరంబులైన కుశల ♦ వ్యాహారముల్ సేయుచున్. ౯౩

శా॥ శ్రీరాముండును వానరేశ్వరుఁడు రం ♦ జిల్లంగ సంధించి దు
ర్వారుల్ క్రూరులు దానవాళి యను ని ♦ ర్లం ద్రోలి ధర్మంబు సి
ద్ధైవ్వర ప్రక్రియ నిల్పఁ బూనిన యుగ ♦ ద్వంద్వక్రియాసంధి నా
నారం బొల్చిరి దర్శఁ జేరు శశి కం ♦ జాప్త ద్వయంబో యనన్. ౯౪

మ॥ తొలి పుణ్యంబుఁ బ్రయత్న మొక్కటిగఁ దో ♦ డ్తోఁ జేరు మాడ్కిన్ గ్రుధా
కలిత క్రూర నిశాచరాఖ్య కలుషౌ ♦ ఘంబుల్ విమూలింప శా
స్త్ర లసద్ జ్ఞానము తత్త్వవిజ్ఞతయుఁ బ్రా ♦ ప్తంబైన చందంబునన్
దలఁపుల్ గూడఁగఁ జేరి రర్కసుత మా ♦ ర్తండాన్వయుల్ సమ్మతిన్. ౯౫

చ॥ రవిసుతుఁ డంత నిట్లనియె ♦ రాఘవుఁ గాంచి నయంబు మీఱ నో
రవికుల దీపకా! సకల ♦ రాజిత సద్గుణ రాశివై జగ
ద్భవుక వినోద కార్య సుఖ ♦ భావనుఁడౌ నినుచేరఁగంటి నా
భవము కృతార్థమయ్యె నను ♦ వంటి తపోధనుఁ డున్నె యీభువిన్? ౯౬

ఉ॥ పున్నెము పండు వాఱ దలఁ ♦ పుల్ నెఱవేఱుట యింకఁ జోద్యమే?
యన్న రఘూత్తముండు నగు ♦ ణాకర! మాకు నిషాధి తెల్పె నీ

యున్న తెఱంగు నీవలన ♦ నుత్కటశోకము నీఁగు నంచు మే
మెన్నిక వచ్చినార మది ♦ యేగినదే యగు నన్న నాతఁడున్

చ॥ నడవడి తప్పి తమ్ముఁడగు ♦ నన్ను మహా బలశాలి వాలి దుం
దుడుకున సర్వభూమియును ♦ తోయధులున్ ఘన చక్రవాళమున్
గడచని పోవఁగాఁ దఱిమి ♦ ఖండన సేయఁ దలంపఁ బ్రాణముల్
విడువఁగ లేక యీగిరిని ♦ వీడక యుంటి భయంబు పెంపునన్. ౯౮

చ॥ మిము శరణంటి నన్ను కృప ♦ మీఱఁగ నేలుట మీకుఁ బాడి చం
ద మనుడు రామచంద్రుఁ డను ♦ ధర్మ గుణాకర! యింతదాఁకఁ దో
రముగ భరించినట్టి కడు ♦ రాయిడి తీఱెను రేఁగ దింక సౌ
ఖ్యములును దుఃఖముల్ మనకుఁ ♦ గల్గు సమంబుగ నింత యేటికిన్ ౯౯

సీ॥ నిను పతిచెడువాఁడె ♦ ననుపతిచెడు వాఁడు, నీ విరోధియె చుమ్ము ♦ నా విరోధి
నీ చెలికాఁడెపో ♦ నా చెలికాఁడు నీ, బంధు వితతి నాకు ♦ బంధు వితతి
నీకు దుఃఖబేది ♦ నాకు దుఃఖమ్మది, నీ సుఖం బైనదే ♦ నా సుఖమ్ము
నీవు ప్రాణమువంటి ♦ నెయ్యుఁడవై తనఁ, గపురెల్ల ముదమను ♦ కడలి మునిఁగి

తే॥ రామచంద్ర విభుని వాక్య ♦ రాజి సకల, జగములకు వేదముల మించి ♦ నెగడుననిరి
హనుమ పులకితగాత్రుఁడై ♦ యాడె సురలు,విరులు గురిసిరి మొగులు తుం ♦ పురులు చల్లె

ఉ॥ అంతట రామభద్రునకు ♦ నంజలి చేయుచు నాంజనేయుఁడో
సంతత తేజులార! స్థిర ♦ సంపద మీ చెలికార మొందిక
ల్పాంతముదాఁక లోకులకు ♦ నర్మిలి నించెడు తారకాణమై
మంతు వహించుఁగాక యిఁక ♦ మా భవనంబున కేగుదెండనన్. ౧౦౧

చ॥ సరియని రామలక్ష్మణులు ♦ సారసమిత్రసుతుండు లేవ వా
నరులును చుట్టిరాఁ బనస ♦ నాగ తమాల రసాల సాలముల్
సరసులు గల్గి పుణ్యఫల ♦ సంపదవోలె వెలింగి పుష్ప వ
ల్లరులు రహించు తోఁటకు వి ♦ లాసముతోఁ జని రుల్లసిల్లుచున్. ౧౦౨

ఉ॥ చందన వృక్ష సంతతులు ♦ స్ఫాటిక సుందర కందరంబు లం
దందు రహించు నిర్మల జ ♦ లాశయముల్ వికచాంబుజాతముల్
పొందుగఁ దత్తటస్థ ఘన ♦ భూజ శిఖాంతర డోలలందు వే
ల్పుం దలిరాకుఁబోండ్లు తమి ♦ నొంగఁగ నూఁగుట నేత్రపర్వమా. ౧౦౩

ఆ॥ విబుధసభను మూర్ఖు ♦ వెలయని రీతి ను, ద్యానమందు మణి వి ♦ తానకాంతి
పుంజ మెదుట గార ♦ ముం బొందలేవయ్యె, సూర్య చంద్రముల వి ♦ శుద్ధ రుచులు

ఆ॥ అట్టి యందమైన ♦ యలరుల తోఁటలో, రాఘవులును ప్లవగ ♦ రాజు గిరుల
యానసంబులను సు ♦ ఖాసీనులై వేడ్క, ముచ్చటించుకొనుచు ♦ముదితులై రి. ౧౦౫

ఆ॥ కందమూలములును ♦ కాయలు పండ్లును, చవులు మీఱు మంచి ♦ శాకములును
కపులు గొంచుఁదేరఁ ♦ గాకుత్థ్సతిలకుండు, స్నానమాడి మెక్కి ♦ శ్రమము వీడె.

ఆ॥ అనఘుఁ డిట్టు లతని ♦ కతిథియై ముదమంది, సరితితోడఁ గని గృ♦హస్థ ధర్మ
మెడలకుండ నడప ♦ గృహిణిని నీవును, పాసితేమి యనుచుఁ ♦ బ్రశ్న సేసె. ౧౦౭

హనుమ శ్రీరామునకు వాలివృత్తాంతము తెలుపుట

క॥ శ్రీరాముని ప్రశ్నమునకు, మారుతి కేల్మోగిచి నిలిచి ♦ మహాశీయగుణా!
పూరితిగఁ జెప్ప దగునది, మీరలు నవధానమతిని ♦ మైకొని వినుఁడీ. ౧౦౮

క॥ శంకరు ననుగ్రహమున ని, శంకటగతి వరబలంబు ♦ సామర్థ్యంబుల్
జంకు గొలుపు విక్రమ మక, లంకంబుగఁ గొన్నవాఁడు ♦ లావు గలాఁడుల్. ౧౦౯

తే॥ దేవదానవుల్ క్షీరవా ♦ రిధిని మథించు, తఱిని తర్కిత్రాటి యొప్పుమే ♦ సరుగునట్టు
లొక్కఁడే యిరుగేలను ♦ చిక్కఁబట్టి, తరిచినట్టి బాహుబలంబు♦తనరువాఁడు. ౧౧౦

తే॥అవనిజలము తేజమువాయు♦వనెడునాల్గు,భూతములసత్త్వమొక్కటై♦పోలుచువాఁడు
చక్రవాళంబునుండి యీ ♦ శైలమునకుఁ, దేలికగ లీల దాఁటఁగఁ ♦ జాలువాఁడు

తే॥ బవర మొనరింప నెదిరించు ♦ వారి బలము, సగము లాగికొనెడు వర♦శక్తి గలఁడు
ప్రతిదినంబు దిక్కుల కొసఁ ♦ వఱకు నేగి, వార్ధి నీరాడి హరుఁ గొల్చి ♦ వచ్చువాఁడు.

ఉత్సా॥ గాలి వాని యాశుగతిని ♦ గడవఁజాల దెప్పుడున్
శూలి సుతుని బల్లె మతని ♦ నూటి ట్రొమ్ము సొడువదున్
వాలి వాలు చొరని తావు ♦ పంక్తిశిరుఁడుఁ బోవఁడున్
వాలి యనెడువాఁడు కలన ♦ వాలునాఁడు మిక్కిలిన్. ౧౧౩

తే॥ వాఁడు కుప్పించి యెగసిన ♦ వడికి గిరులు, పెకలి లేచును ఘనభుజ ♦ వేగమునకు
జలదములు గ్రహసంఘముల్ ♦కలఁకఁబాఱి, గతులుదప్పును వివరింపఁ♦గలమె బలిమి?

మ॥ ధరణిం గోఱలఁ గ్రుచ్చి యెత్తు కిటి మం ♦ థానాద్రి యంభోనిధిన్
దరువ న్నిల్చిన కూర్మముల్ హరిపద ♦ ధ్యానైక శీలుల్ గుణో
త్కరు రక్షింపఁగ నా హిరణ్యకశిపున్ ♦ దర్పించి చక్కాడు భీ
కరరూపుండు నృసింహుఁడున్ గపివరున్ ♦ గయ్యంబులో గెల్తురే?

తే॥ వేయి పడగలతో ఫణి ♦ విభుఁడు మోచు, పుడమి నగచరుఁడగు వాలి ♦ నడచుచుండి
మోయ భరింపఁగలఁడు వాని ♦ యేపు కొలిచి, తెలుప వేల్పుల కేవియు♦నలవికాదు.౧౧౬

తే॥ సతము జలధి ఘోషించుట ♦ శ్వసనుఁడెపుడు, సంచలించుచుండుటవివ ♦ స్వంతుఁడెల్ల
వేళఁ దిరుగుచుండుట వాలి ♦ బెట్టిదంపుఁ, గినుకకై బిట్టు బెదరియో ♦ యని తలంతు.

ఉ॥ వానరసేన కంతకును ♦ వాలి యధీశుఁడుగాఁగ నుండఁగాఁ
బ్రాణములం గొసంగ సమ ♦ వర్తియు జంకుచునుండు వాని యా
రాణువ లెక్కవెట్టఁగ ని ♦ రాజిలు డెబ్బది వెల్వలా సుప
ర్వాణ నగంబునేని కడ ♦ వం దలక్రిందొనరింప శక్తముల్

తే॥ మొగులు మొరయుచుమీఁదుగాఁ ♦ బోవవెఱచు, సింగములు కందరములగ ♦ ర్జింపవెఱచు
విరులు రాలంగ వాయువు ♦ వీవ వెఱచు, వాలి పౌరుష మేమని ♦ పలుకనేర్తు?

తే॥ వాలి వాలంబుచే బల ♦ వంతుఁడైన, రావణుని భుజములఁ బట్టి ♦ రాణ చెడఁగఁ
జుట్టి కొంపోవ నెత్తురు ♦ సోఁకకుండు, తలము నాతఁడు పోవని ♦ తలముఁగలదె? ౧౨౦

క॥ శతమఖునకు బ్రియ సుతుఁడగు, నతఁ డుడుపతి సాటియైన ♦ స్వచ్ఛ తనుండున్
బితృపతికి నాజ్ఞ యిడఁదగు, ధృతిమంతుఁ డితని యన్న ♦ తేజోయుతుఁడున్.

ఉ॥ ఈవిధి వాలి వాలి ప్లవ ♦ గేశ్వరుఁడై మము గాచుచుండ సు
గ్రీవుఁడు యౌవరాజ్యమునఁ ♦ గీర్తి వహించుచునుండ నీచు మా
యావి యనంగ నొప్పు దను ♦ జాధముఁ డొక్కఁడు వచ్చి మించి దు
ర్భావముతో రణంబునకు ♦ రమ్మని వాలిని పిల్చెఁ బెల్చనన్. ౧౨౨

చ॥ పిలువఁగ వాలియున్ దనుజ ♦ వీరుని దాఁకి కలంచి నొంపఁగా
నిలువఁగలేక రక్కసుఁడు ♦ నిల్వునఁ జంపెడి నంచుఁ బాఱుచున్
నిలువక వెంబడించు కపి ♦ నేతను గన్గొని ప్రాణ భీతిచే
వెలవెల వోయి యొక్క బిల ♦ వీథిని చేరఁగ వాలి యంతటన్. ౧౨౩

ఉ॥ వెంబడి వచ్చుచుండు కపి ♦ వీరుని తమ్ముని గాంచి సావధా
నంబున నీ గుహాముఖము ♦ న న్నిలుమేను సురారిఁ దెత్తు శౌ
ర్యంబునఁ దాఁకెనేని సమ ♦ రం బొనరించి వధించి వత్తు ధై
ర్యంబున నుండుమంచుఁ గుహా ♦ రాంతర సీమను చొచ్చి యవ్వలన్. ౧౨౪

క॥ పదునాలుగు ఋతువులు దు, ర్మదుని వెదకి యెట్టులయిన ♦ మడియించెదు ప
ట్టైదఁ దలపోయుచునుండఁగ, మది సుగ్రీవుండు దుఃఖ ♦ మగ్నుం డగుచున్. ౧౨౫

చ॥ మతకరి రక్కసీఁడు మటు ♦ మాయముగాఁ జనె నన్నకింత కే
వితము ఘటించెనో యెఱుఁగ ♦ వీలు గనంబడ దేనునేగి యా
హాతకు వధింతుఁ గానియెడ ♦ నంతను నొందెద వానిచేత నం
చితఁడును పోవఁగాఁ దొడర ♦ నేమును పౌరులు నడ్డువెట్టుచున్. ౧౨౬

చ॥ తగదని లోకనింద యని ♦ తా మది నొప్పకయున్న నెన్నియో
తగవులు పల్కి వేఁడుకొనఁ ♦ దక్కటి వారలు చింతనూని యో
ప్పుగఁ బురికేగు దేరుమని ♦ పొందికతో బతిమాలఁ ద్రోసి పు
చ్చుఁగ మదిరాక తుట్టతుద ♦ సమ్మతిచూపెఁ బురంబు చేరఁగన్. ౧౨౭

చ॥ తలకొని వాలిఁ జక్కడఁచి ♦ దైత్యుఁడు ద్వారము దాఁటి పట్టన
స్థలికిని వచ్చునేమొ? యని ♦ తద్బిలముం బెను జాత మూసి పె
క్కులు శిల లొక్క పేరుపుగఁ ♦ గూర్చితి మా శిల కూఁతగాఁగ న
వ్వల రవిపుత్త్రుఁ దోడుకొని ♦ వచ్చితి మయ్య పురంబు చేరఁగన్. ౧౨౮

మ॥ అట మాయావిని గూల్చి ప్రాణ మధు వు ♦ ద్యత్తృప్తిమైఁ గ్రోలి యు
త్కట మత్తుండయి వాలి ధీరత గుహా ♦ ద్వారంబు దాపించి య
చ్చటి మాఁతంగని సూర్యజుంబిలిచి యే ♦ చందాన మార్మాట యొ
క్కటియున్ లేమికి జిచ్చునొంది వడి ను ♦ గ్రక్రోధుఁడై యంతటన్. ౧౨౯

ఉ॥ వాలముతోడఁ బాదమును ♦ పైకెగయించి బలిష్ఠ చండ వా
తూలముఁ బోలెఁ దన్న వడిఁ ♦ దూలి శిలా నికరంబు లువ్వనన్
దూలము పోల్కిఁ గొన్ని చని ♦ తోయద మండల మంటెఁ గొన్ని ది
గ్జాలము దాఁకెఁ గొన్ని పడె ♦ సాగరమందున జివ్వ జివ్వనన్. ౧౩౦

చ॥ ఉరవడి వాలి వెల్వడి మ ♦ హోద్ధతిఁ గాంచిన వారలెల్లఁ బె
ల్కుఱి పఱవంగ నచ్చటికి ♦ ఘోరతరాకృతితోడ రా, గుణో
త్తరుఁ డకలంకుఁ డాశ్రవుఁడు ♦ తామరసాప్తసుతుండు చూచి త
చ్చరణములందు వ్రాలె భయ ♦ సంభ్రమ భక్తులు ముప్పిరింగొనన్. ౧౩౧

ఉ॥ వ్రాలి నమస్కరించి ప్రభు వర్య! ♦ భవత్పునరాగమంబు మా
కేలొకొ లేమిఁజేసి తపి ♦ యించి మహాపద మూఁడె నంచు మీ
పాలికి రాఁ బ్రయత్నపడ ♦ వానర సూరులు మంత్రివర్యు లీ
కోలును చూప కిచ్చటికిఁ ♦ గోరికఁ దెచ్చిరి తమ్ము గావఁగన్. ౧౩౨

ఉ॥ వారల యాజ్ఞకున్ వెఱచి ♦ వచ్చితి. నిచ్చటి కిట్టు లీ ధరా
భారము పూని మీకడకుఁ ♦ బట్టుగ రామికి సిగ్గునొందు నా
తోరపు దోషమున్ దయను ♦ ద్రోచి కృపామతి నాదరింపుమా
నేరమి పిన్నలం గలుగ ♦ నేర్చిన పెద్దలు సైఁచు టొప్పగున్. ౧౩౩

ఉ॥ తమ్ముఁ డిటుల్ వచింప భయ ♦ దమ్ముగ నింద్రసుతుండు కాంచి గ
ర్భమ్ములు ప్రేవులుం గలఁగ ♦ రక్కసమాటలు పల్కి తమ్ము దే

హుమ్మ్మ నలంగ మోఁదె జల ♦ జాప్త తనూజుఁడు డిల్లవోఁ బ్లవం
గమ్ములు దొడ్డభీతిని క ♦ కావికలై దిశలన్ భజింపఁగన్. ౧౩౪

మ॥ పరితాపంబున సూర్యసూనుఁడు భయ ♦ భ్రాంతిం బయోరాసులం
బరఁగం దాఁటి యజాండ భిత్తిక సమీ ♦ పం బొందఁగాఁ జేరినన్
గరుణా సంగములేక వాలి హరి సం ♦ కాశుం డనాయాస స
త్వర సత్త్వంబున దాఁటి పోయెనన నీ ♦ తానాథుఁ డగ్గించుచున్. ౧౩౫

మ॥ మన సుగ్రీవుఁడు వాలిచే నపుడె సా ♦ మర్థ్యంబునన్ దూఁకుచుం
జను చందంబులు నేర్చెఁ గావలయుఁ గ ♦ ష్టంబొంది యంచాంజనే
యుని వీక్షించి యనంతరంబు త్రిదివే ♦ శోత్తంస మార్తాండ నం
దనులే జాడలఁ బోయిరో యన జగ ♦ త్ప్రాణాత్మజుం డిట్లనున్. ౧౩౬

చ॥ జలధుల కవ్వలం జరగి ♦ సారసమిత్ర మయూఖ సంతతుల్
చెలఁగని చక్రవాళగిరిఁ ♦ జేరియు వెండి యతిక్రమించుచున్
జలజభవాండ భిత్తికను ♦ చయ్యన నింద్రసుతుండు డాసి య
చ్చలమునఁ బట్టె నాతని వి ♦ శంకట వృత్తిని పిచ్చలించుచున్

ఉ॥ సోదర హింసకుం డనెడు ♦ సుద్ది జగంబు వచించు నంచు నుం
తేఁ దన మానసంబున మ ♦ తింపక దొడ్డకరంబు లెత్తుడున్
ఖేదిలు సీతఁ డయ్యేదను ♦ కీడ్పడకుండఁగఁ జూచి వేగ ని
ర్మోదముతోడఁ బాఱెఁ దన ♦ ముందటి వెల్ల నలంగఁద్రొక్కుచున్

చ॥ పటపటమంచు వాలి తన ♦ పండ్లను గీఁటిన కాలుఁ డేనియున్
దటతటపొంది తా నభయ ♦ దానము చేసిన వానిఁ గావఁగా
నటమటనూనుఁ బూర్వము మ ♦ హాత్మ మతంగుని శాపభీతిచేఁ
గటకట! రాఁడు గాన మనఁ గల్గె ♦ నితం డిట నిన్నినాళ్లుగన్. ౧౩౭

తే॥ ఇతని ధర్మపత్నిని రుమ ♦ నతఁడు కోరి, చేరఁదీసె నీతండు సు ♦ శ్రీని స్త్రీని
వదలి రెంటికిం జెడ్డ రే♦వఁడుగ నున్న, వాఁడనుచుఁ బల్కెఁ దత్కథ♦పవనసుతుఁడు.

తే॥ నిత్యనిర్మలుఁడగు రామ ♦ నృపవరుండు, మిత్రుకథ విని కోపంబు ♦ మిగులనూనెఁ
గ్రుంగువేళ జగంబుల ♦ మ్రింగునట్టి, పెదవి కంపించెఁ గెంపొందె ♦ వీక్షణములు. ౧౩౮

చ॥ అరయఁ జతుర్ముఖుండు నిట ♦ లాక్షుఁడుఁ దక్కు సురాధిపాదులే
పరముని వాఙ్మనః క్రియల ♦ భావనసేసి గ్రహింపనేర రా
హరి తన పాదపంకజము ♦ లాదట ధాత్రి వహింపనుంచుటల్
ధరణి నధర్మముం జెఱిచి ♦ ధర్మము నిల్కఁగ నిల్పనే కదా?, ౧౪౦

చ॥ దయ యొకయింతలేని పిన ♦ తల్లి వచించిన దంచుఁ దమ్ముకై
రయమున సర్వసంపదలు ♦ రాజ్యభరంబు నొసంగు నా కృపా
మయుఁడు దయం దొలంగి యొక♦మందుఁడు తమ్ము సతిన్ హరించుటల్
స్వయముగ విన్నవించు తరు ♦ వాత సహించుచు నూరకుండునే? ౧౪౩

ఉ॥ వానర వీరులార! త్రిభు ♦ వంబులఁ గల్గిన వీరు లెల్లరుం
బూనిక వచ్చి వాలి యసు ♦ వుల్ పరిరక్షణసేయ నిల్చినన్
మానక యుక్కడంచి కపి ♦ మాన్యధరిత్రి రుమా యుతంబుగన్
మానుగ నీకు నిత్తు నను ♦ మానము మానుము వానిఁ జూపుమా. ౧౪౪

ఉ॥ నావుఁడు దుఃఖసాగరము ♦ నం బడి మున్గి తపించుచున్న సు
గ్రీవుఁడు తత్తటంబుఁ దిల ♦ కించి ముదంబను వార్ధిఁ జొచ్చి తా
నావల రాముఁగూర్చి ప్లవ ♦ గావళితోఁ దలపోయఁదగ్గ సం
భావన గల్గునంచు మతి ♦ మంతులఁ బావని ముఖ్యమంత్రులన్. ౧౪౫

ఉ॥ దూరముగాఁగ నింగితులఁ ♦ దోడ్కొని పోవఁ గపీంద్రుఁ గాంచి సా
మీరి వచించు నీతలఁపు ♦ మేపిన భావ మెఱింగినాఁడ జం
భారిసుతున్ వధింపఁ గల ♦ యట్టి పరాక్రమ సత్త్వ సంపదల్
వారికిఁ గల్గునే యని య ♦ వారణ సంశయ మందనేటికిన్? ౧౪౬

హనుమ సుగ్రీవుని సంశయము దీర్చుట.

ఉ॥ ఆతని హస్త పాదముల ♦ యందు సుదర్శన శంఖరేఖ లు
ద్ద్యోతక విశ్వ వంద్య లన ♦ దుత్తమ పూరుష లక్షణాళి వి
ఖ్యాతము గాఁగ నున్నవి జ ♦ గంబున నేరికిఁ గానఁ గాన ల
క్ష్మీ తరుణీ విభుండె యగు ♦ సిద్ధము నమ్ముము నా వచస్సులన్. ౧౪౭

చ॥ త్రిపురములన్ దహించి యతి ♦ తీవ్ర రుషా సహితుం గృతాంతు ము
న్వ్యపగత జీవుఁ జేసిన క ♦ పర్ది కరాంచిత భీష్మ చాపమున్
ద్రపగొని రాజసూనులు శి ♦ రంబులు వంపఁగ నెక్కువెట్టి చి
ద్రుప లొనరించు సత్త్వుఁడు చ ♦ తుర్భుజుఁ డొక్కఁడు దక్కఁ గల్గునే?.

ఉ॥ నా జనకుండు వాయు వొక ♦ నాఁడు 'కుమారక! ధాతఁగన్న పం
కేజదళాయతాక్షునకుఁ ♦ గింకర వృత్తి గడింతు వీవు త
త్పూజచే నీకు నాకు భవ ♦ దుఃఖము లెల్లఁ దొలంచు జన్మము
త్తేజితరీతిఁ బొల్చు' నని ♦ తెల్పఁగ నేనును సంశయించుచున్. ౧౪౯

ఉ॥ అప్పురుషోత్తముం దెలియు ♦ నంగముఁ దెల్పెఁడి యన్న నాతఁడున్
ముప్పు జగంబువాంఛు తటిఁ ♦ బుట్టి ప్రసన్నతఁ గానవచ్చుచోఁ

విప్పగు భక్తి చేకుఱు ద ♦ వించును ద్రేవు లకారణంబుగా
నప్పుడు తత్కృపాకరు ప ♦ దాంబుజ సేవ యొనర్పుమా యనెన్. ౧౫౦

ఉ॥ వానరవర్య!తద్విధమె ♦ వర్తిలె నిప్పుడు శంకలేల? శ్రీ
జాని మహత్త్వసత్త్వముల ♦ చంద మెఱుంగఁ దలంచితేని ల
క్ష్యానకు లొంగకుండు తరు ♦ సప్తక మొక్క శిలీముఖంబుచే
నూనము లేక తూఁటి చన ♦ నొయ్యన నేయుట చూతమా యనన్.౧౫౧

చ॥ భళియని తోడునీడయగు ♦ వాయుకుమారుని గట్టిగాఁ గవుం
గిలి గొని మోదమంది తుల ♦ కించుచు రాముని చెంతకేగి ప్రాం
జలి ఘటియించి రండని ని ♦ న్నమతఁ దోడ్కొని పోయి యొక్కచో
నిలిపి నభంబు రాయు నవ ♦ నీజములం గనిపించి యిట్లనెన్　౧౫౨

తే॥ ఈ మహోన్నత సాలంబు♦లేడు నొక్క, యిషువుచే రంధ్రములు పహిం♦యించునేని
ప్రబ్బి యున్నట్టి నామనో ♦ వ్యాకులతయుఁ, దాఱునని వచియింపంగ ♦ దాశరథియు

క॥ ఇనసుతు కోర్కె తెలిసి మో, మున నుందస్మితము చెలువు ♦ పొలు పారఁగనె
ట్టన ధనువున గుణమెక్కిడి, ఘన తరువుల చెంత కరిగె ♦ గజ గమనుండై　౧౫౪

సప్తసాలవర్ణనము

చ॥ యుగములు మాఱినన్ నిలుచు ♦ నున్కి నశింపదు లోక జాలముల్
తెగు లటులైన నీ తరులు ♦ తీఱవు సప్త కులాచలంబులే
యుగములుగాఁగ నిల్చినవి ♦ యంచు వచింపఁగ దగ్గ సంస్థితిన్
నెగడె మహోన్నతంబులయి ♦ నింగిని రాయుచునుండు నెప్పుడున్.౧౫౫

చ॥ ఇన శశు లీ మహీజ శిఖ ♦ రేంద్రముఁగాంచి తరింపలేక చిం
తను తపమూన బ్రహ్మయు ను ♦ దగ్ర మహోత్కట సాల సప్తకం
బును గని దచ్చిరోగ్ర దళ ♦ ముల్ గని తెల్పఁగలేకపోవఁగా
మనుజులు దాని యున్నతిని ♦ మానుగఁ గొల్చి వచింపనేర్తురే?　౧౫౬

చ॥ ప్రతిదినముం బ్రతిక్షణము ♦ భానుని వాజులు ప్రాలు మాల కి
ట్లతితర వేగముం గొని ప్ర ♦ యాణము నేయ మఱొక్క హేతువున్
వెతకినఁ గానరాదు తరు ♦ విస్తృతి దిక్కులఁ బర్వి పూర్ణసాం
ద్రత గొన దాని నీడ నలఁ ♦ తం భజియింపకయుండు నిత్యమున్.　౧౫౭

చ॥ చదలఁ జిరంబుగాఁ బొదలు ♦ చక్కని చుక్కలు గాము లుప్పరం
బు దవిలి యెల్ల దిక్కులను ♦ పొల్పు వహింౘెడి విందు పూచు నొ
ప్పిదమగు పూవులే; విటప ♦ వేధముచే వ్రణమైన మచ్చయే
యొద శశి కందటంచు వచి ♦ యింపఁగ నొప్పెఁ దదున్నత స్థితుల్. ౧౫౮

ఉ॥ భేదము సేయరాని పృథి ♦ వీజము లందలి కొమ్మ రెమ్మలా
చ్ఛాదనసేసి వ్యోమము ది ♦ శా వలయంబును గప్పియుంటచే
వేదములట్లు పొల్చుటను ♦ వేలుపుఁబెద్ద హంసమాయి హాంసితో
మోద విహారముల్ సలుపఁ ♦ బోలు నటంచు వచింపఁగాఁ దగున్. ౧౫౯

ఉ॥ గాలి చలింపఁగా విసరఁ ♦ గమ్మని వాసన వీచు పుష్ప ప
త్రాలియుఁ బండ్లు కాయలు స ♦ మస్తము చెట్టుల నుండి డుల్లి య
వ్వేలుపువాఁకయందు పడి ♦ వేళము భూమికిఁ జాటి తోయధిన్
బోలఁగఁ జేరఁగాఁ దగు స ♦ మున్నతి నొప్పెను సప్తసాలముల్. ౧౬౦

చ॥ కొనలు గనంగ రా వజుని ♦ గోళములం దగదాఁటి యవ్వలన్
మొనరఁగఁ బోలు నన్న విధ ♦ ముర్ వహించి త్రివిక్రముంబలెం
బూనరి ధరిత్రి మధ్యమునఁ ♦ బొల్చు హిరణ్య నగంబువోలె లా
వునఁ దనుపొంది చూపులకు ♦ భూరి భయంకరమై విరాజిలున్. ౧౬౧

తే॥ వాలి సుగ్రీవుల మనంబు ♦ పగిది చేవ, గలిగి, యాదిశేషుని పడ ♦ గలను గూడఁ
జీల్చుకొని క్రిందికిం బోవఁ ♦ జెనయు వేళ్లు, గలిగి మద్దులభేద్యమై ♦ వెలయుచుండు

తే॥ పెరిఁగి దట్టమై పరవిన ♦ విటప చయము, భాస్కర నిరోధ శంక యా ♦ వహిలఁజేసి
యుదయ చరమ గిరులకంటె ♦ నున్నతిగొని, యోజనంబువి స్తృతితోడ ♦ నొప్పుచుండె

మ॥ ఇటు లొప్పారెడు సప్తసాల నికరం ♦ బీక్షించి రాముండు త
త్పటు బాహాబల మంత వారలకుఁ జూ ♦ పంబూని జీవశ్రవః
పుటముల్ గింగురు వోవ నిర్జరవరుల్ ♦ మున్నెన్నఁడున్ లేని సం
కటముం బొందఁగ నుల్లసిల్లి గుణ టం ♦ కారంబు గావింపఁగన్. ౧౬౨

ఉ॥ దగ్గఱ నున్నవారలును ♦ దవ్వుల నుండెడివారు దిక్కరుల్
బెగ్గిలి సొమ్మవోవ నర ♦ వింద భవుండు దినంబు లెంచ మి
న్నొగ్గె ఫణీంద్రుఁడున్ వడఁకి ♦ యొరకువ్రాల్చె ఫణంబు లన్నిటిన్
ద్రొగ్గతిలంగఁ బడ్డవి స ♦ రోజ హితాశ్వము లచ్చలించుచున్. ౧౬౩

తే॥ శత్రుసంహారకుండు దా ♦ శరథి చాప, గుణ నినాదంబు విన్న ల ♦ క్ష్మణుఁడుదక్కఁ
దక్కువారలు పడు నవ ♦ స్థల వచింప, నవమతించిన చందమే ♦ యగునుగాదె.

తే॥ హనుమ దాదులు నిబ్బర ♦ మంది రాము, నస్త్ర విద్యా మహత్త్వమ్ము ♦ నరయఁగోరి
పూన్కి నిలువ నాకర్ణాంత - మగను లాగి, నీరజాక్షుండు పఱపెను - నిశిత శరము.

## సాలవేధనము.

ఉ॥ సాయక మంత సాల తరు - సప్తము దొలచేసి క్రింద స
ప్తాయత లోకముల్ ద్రొలిచ్చి - యవ్వల నేడగు వస్తుపాళి లే

దే యని క్రమ్మఱిల్లి వసు - ధేశు నిషంగము చేరె సప్త సం
ఖ్యాయుతముండుచో దొలిచి - యవ్వలికిం జన కేగుదెంచునే? ౧౬౮

చ॥ జలనిధు లూర్ధ్వలోకములు - శైలములుం బుషు లర్కవాజులుం
మలయు మరుత్తులుం భువన - మాతృకలుం గ్రహరాజియుల్కి చం
చలత భజించి యే డనెడు - సంఖ్యను గల్గుట రామబాణ మి
మ్ముల దొలచేసి చంపునని - పొల్పును వీడి వడంకె నయ్యెడన్. ౧౬౯

శా॥ లోక త్రాణ పరాయణుండయిన శ్రీ - లోలుండు దుష్టాత్ములన్
జోకన్ గూలిచి ధర్మము న్నిలుప సు - శ్లోక స్ఫుర జ్జన్మునన్
శ్రీకారుణ్యము తోడ నొందెనని సు - గ్రీవుండు నిర్భీతి న
స్తోక ప్రాభవ భవ్య పాదముల సం - స్తోత్రంబు గావించుచున్. ౧౭౦

సీ॥ సుర పూజితంబులౌ - చరణాంబుజములకు, శిరము సోకఁగ మ్రొక్కి - చేమొగిడ్చి
పంచ భూతములీవ - పంకజాసనుఁడీవ, క్షీర సాగరమందు - చెలఁగు దీవ
పాపమ్ములం ద్రెంచు - పరదేవతవు నీవ, వెలుపల లోపల - వెలుఁగుదీవ
మత్పూర్వ పుణ్యక - ర్మములె యీదాసుని, కడకుఁదోడ్తెచ్చెని-ష్కలుషహృదయ!

తే॥ ఏఁ గృతార్థుఁడనైతి నా - కేది కొదువ? పాపములు ద్రెవ్వె పుణ్యంబు - పండె నేఁడు
రాక్షసవిరామ! భవ్యతా - రక సునామ!, సద్గుణ స్తోమ! శ్రీరామ - సమర భీమ!

చ॥ అని వినుతింప వాలి యిడు - నంగదుచేఁ దపియించు వానరుల్
గని కపిరాజుపాలి కొక - కాలుఁడు నేఁటికి వచ్చెనంచు ము
ద్వననిధి మున్గి రుచ్యమగు - వారుణి నాని చెలంగి పాడి న
ర్తనములు సేసి గంతులిడి - దాఁటిరి దూఁకిరి తొంగలించుచున్. ౧౭౨

ఉ॥ అండచయంబు లొండయి యు - గాంతము వేళ మహాగ్ని కీల లు
ద్దండతఁ గాల్పఁగా మిగిలి - తప్పిన యెమ్ములకుప్ప కై వడిన్
మెండయి దొడ్డ కొండవలె - మిక్కిలి దుందుభి యెంపగూఁడు కో
దండధరుండు కాంచెఁ దన - దారిని నెమ్మది నబ్రమందుచున్. ౧౭౩

ఉ॥ ఇయ్యది కాలు వాహనము - నెమ్ముల కుప్పయొ? దిగ్గజం బొకం
డొయ్యనఁ గూలెనో? మకర - మొక్కటి చచ్చి కృశించి యెండెనో?
యియ్యెడ నిట్టులుండుటకు - హేతు వదెయ్యది? తెల్పఁగోరెదన్
నెయ్యరి! యన్న నిట్లను వ - నే చరనాథుఁడు సంతసంబునన్. ౧౭౪

౩ దుందుభి పటలము, (౧౫)

ఉ॥ శాత్రవ హింసనాయుత రు - షామతి దుందుభి దానవుండు న
క్షత్రపతిం బెకల్చు నని - శాత మహోన్నత శృంగధారియై

చిత్రతరాకృతిన్ మహిష ♦ శీర్షముతోఁ జని మందరాద్రి నా
త్యాత్రముతోఁ బయోధిఁ జెలు ♦ చం గలఁచెన్ హరి రోయు కోసమై. ౧౭౫

చ॥ హరియును మ్రోలనిల్చి యిటు ♦ లాలము చేయుట యేల యన్న సం
గర మొనరింప రమ్మనుచుఁ ♦ గర్వరుఁ డాడఁగ నన్నుఁ బోటి స
త్త్వరహితు నేల కోరెదవు? ♦ తార గిరీంద్రము చేరి పార్వతీ
వరుని దురంబు సేయఁ బిలు ♦ వం దగునం చసురారి పల్కఁగన్. ౧౭౬

చ॥ వడివడి వాఁడు రుద్రభగ ♦ వానుని శైలముఁ జేరి కొమ్ములం
బొడిచి పెకల్చి త్రోయఁ బని ♦ పూనుడు శూలియు మ్రోల నిల్చి నీ
వడుగు నదేమి తెల్పుమన ♦ నయ్యసురుండును సంగరానకుం
దొడఁగుమ యన్న శంకరుఁడు ♦ దుందుభిఁ గాంచి హసించి యిట్లనెన్.

ఉ॥ నీకు సమాన దోర్బలుఁడు ♦ నిర్జరనాథుఁడు భిక్షువైన నే
నీకొను కెట్లుపొమ్మన సు ♦ రేంద్రుని చెంతకు నేగి దైత్యుఁడున్
నాకు రణంబు నిమ్మనఁగ ♦ నాక విభుండును గాంచి నీకు న
స్తోక భుజాగ్ర కండువునఁ ♦ ద్రొక్కఁటయేని వచింతుఁ బ్రీతిమై. ౧౭౮

ఉ॥ ఆహవ దోహలుండు ప్లవ ♦ గాధిపుఁ డొక్కఁడు నా కుమారకుం
డోహరి సాహరిం బెనఁగ ♦ నోపును వాలి యతండు పొమ్మనన్
దాహకుపోల్కి నేగి రణ ♦ దర్పుని వాలిని పిల్చి యాగిరిన్
బాహులఁ గొమ్ములం గెలఁకి ♦ పాఠొసరింపఁగఁ దాఁకె వాలియున్. ౧౭౯

సీ॥ వడిఁదాఁకి యిరువురు ♦ వలపల దాపల, గిరిగిరఁ దిరుగుచు ♦ నొరయు నపుడు
వారి నేర్పెఱుపంగ ♦ వలను గాకుండఁగఁ, బడుదురు విడుదురు ♦ తొడరుచుండ్రు
నిలుతురు పిలుతురు ♦ నెగయుచుఁ దిగియుచుఁ, ద్రోతురు లేతు రు ♦ త్సుకత మెఱయఁ
బాద ఘట్టనలచే ♦ బలువిడి యగ్నిపై, కెగసెను ధూళియు ♦ నెగడె దిశల

తే॥ భూధరంబులు హుంకార ♦ ములకుమాఱు, మ్రోఁగె భూస్థలి వడఁకుచు ♦ మొగ్గఁ బ్రకృతి
నిలుకడం దప్పి చెలువంబు ♦ నీఁగె వార, లెచ్చు తగ్గులు గనకిట్లు ♦ పెచ్చు పెరుఁగ.

సీ॥ అంబుదంబులు నంబ ♦ రంబు నంబుధులు నం, బుధి వేష్టితాఖిల ♦ భూతలంబు
ధూసరావృతమయి ♦ తో తేరకుండె ని, య్యది యది యని నిర్ణ ♦ యింపరాక
పంద్రెండు నెలలిట్లు ♦ తీంద్రంబుగాఁ బోర, విజిగీషువౌ సగ ♦ భేదిసుతుఁడు
ప్రోన్నత శృంగముల్ ♦ పోఁడిమితోఁ బట్టి, యీడ్చి యీడ్చి శిరంబు ♦ నేయునంత

తే॥ నసురుఁ డంతఁ బర్జన్య గ ♦ ర్జానుకారి, యైన ఘన గర్జితంబు మి ♦ న్నదరఁజేసి
నిలువ వాలియుఁ గోపంబు ♦ నిలుపలేక, పిడుగుకై వడి నెత్తిపైఁ ♦ బొడుచ వాఁడు. ౧౮౦

ఉ॥ దిమ్మగొనంగ నెత్తిపయి ♦ దెబ్బపడన్ విఱుగన్ బదమ్ము లం
గమ్ములు నుగ్గుగాఁ జదియఁ ♦ గందరలీలను పొల్చు నోట ర
క్తమ్ములు గ్రమ్మి వెల్లువలు ♦ గాఁ బ్రవహింపఁగ జీవపాళి యొ
క్కమ్మడి లేవ వజ్రహతి ♦ నుర్వు గిరింబలె వాఁడు డుల్లఁగన్. ౧౮౨

చ॥ మఱియును వానిఁ బట్టి పలు ♦ మాఱులు చామర మట్లు త్రిప్పుచున్
దిఱుగుచునుండ శోణితము ♦ దిక్కుల జిఱ్ఱునఁ జిప్పిలంగ ది
క్కరుల యొడళ్లు ధాతువుల ♦ కాంతి వహించిన లీలఁ గ్రాలె నీ
గిరివరమెల్ల నొక్క ఘన ♦ కింశుక వృక్షముఁబోలె భాసిలెన్. ౧౮౩

మ॥ పటు బాహాబలశాలి వాలి యటుపై ♦ పైఁ ద్రిప్పి వైవంగ నొ
క్కట మేఘంబుల దాఁటి భాను శశి న ♦ క్షత్రప్రభా మండల
స్ఫుట భాగంబులు దాఁటి యూర్ధ్వ భువనం ♦ బు ల్దాఁటి ప్రాణంబు ల
చ్చటనే నిల్వ శరీర మిచ్చటఁ బడెన్ ♦ శక్రాదు లగ్గింపఁగన్. ౧౮౪

ఉ॥ దుందుభి పిస్తుకంపెసఁగు ♦ తోరపు దేహము ఋశ్యమూకముం
గ్రింది కడంగఁగాఁ బడుడుఁ ♦ గిన్క మహామహుఁడౌ మతంగ మౌ
నీంద్రుఁడు శాప మిచ్చె నది ♦ యే యుపకారిగఁ గాచుచుండె న
న్నిందని సూర్యసూతి వచి ♦ యించెను పూర్వ చరిత్ర మింపుగన్. ౧౮౫

ఉ॥ రామవిభుండు తత్కథ క ♦ రంబు రహింపఁగ వించుఁ జావ వి
ద్యా మహనీయు లక్ష్మణు ము ♦ దంబునఁ గాంచి యనుంగ! దీని ని
చ్ఛామతి నిందునుండి యొక ♦ చక్కటికిం దొలఁగింపు మన్న ని
త్యామల శీలచిత్తుఁడు ప ♦ దాంగుళితో నెగమీఁటె మీఁటఁగన్. ౧౮౬

చ॥ అదియును సత్యలోకమున ♦ కవ్వలి చోటికిఁ బోయి క్రమ్మఱన్
జదియఁగ నచ్చటం బడియెఁ ♦ జెచ్చెరఁ గోఁతుల మూఁకయార్చె నీ
రదము క్రియన్ రఘూత్తముఁడు ♦ రాజిత పుష్ప వనంబుచేరి న
మ్మదమున నుండ భాస్కరుని ♦ పుత్త్రుఁడు సన్నిధి నిల్చి ప్రేమమై. ౧౮౭

## ౯. ఆభరణ దర్శన పటలము. (౯-౨)

చ॥ మఱి యొక మాట దేవ! విను ♦ మా యొకనాఁ డిట మేము గుంపుగాఁ
దిరుగుచునుండ రావణుఁడు ♦ తెక్కలియై తమ కాంతనేమొ పే
రురవడిఁ గొంచుఁ బోవునెడ ♦ నుగ్మలి యుమ్మలికించు చీ వనో
త్కరములఁ గల్గు క్రోవలను ♦ గాంచుచు రోదనముం బొనర్చుచున్. ౧౮౮

మ॥ తన మార్గంబు తదీయ నాథునకు దూ ♦ తం బోలెఁ గాన్పించుఁగా
కని కాఁబోలును భూషణావళుల స ♦ వ్యాబ్జాక్షి చేలాంచలం

బున నొప్పఁగ ముడివైచి జాఱ విడిచెన్ ♦ బూర్ణాశ్రు వర్షంబుతోఁ
గని మేమయ్యది యంతరిక్షమునఁ జి ♦ క్కం బట్టి హస్తంబులన్. ౧౮౯

మ॥ ఒకచోఁ దాఁచితి మావిభూషలను మీ ♦ కొప్పారఁ జూపింతు నో
పిక వీక్షింపుఁడు మీ సతీతిలకమా ♦ పృథ్వీజవో? కావొ? యం
చకలంకుండు దినేశ పుత్త్రకుఁడు ప్రే ♦ మాలాపముల్ సేయుచున్
సుకలుండో రఘురామ భూవరునకుం ♦ జూపెన్ బ్రమోదంబునన్. ౧౯౦

శా॥ సీతాదేవి విభూషణంబులఁ బరీ ♦ క్షించెన్ నిమేషంబునన్
జేతం బగ్నిఁ గరంగు మైనముక్రియం ♦ జెందెన్ విభూషామృత
ప్రీతిం బొందెను సొమ్మసిల్లె నని వ ♦ ర్ణింపంగ నెట్లౌను? త
జ్జాతస్ఫీతహృదంతరస్థితి మహా ♦ చాంచల్యముం బొందఁగన్

శా॥ నారీరత్నము నంగకంబులను వి ♦ న్యాణంబుగా నొప్పు మం
జీరా ద్యాభరణావళుల్ జనకజా ♦ శ్లిష్టాంగముల్ జ్ఞప్తికిం
దేరం గానఁగనయ్యెఁ బాప మవి యా ♦ ర్తిం గూర్చునే కాక పే
రారాటంబును మాన్పనేర్చునొకో సుం ♦ దైనన్ ధరా జానికిన్? ౧౯౨

చ॥ ఎడయికచేఁ గృశించిన మ ♦ హీశుని తెల్విని దెచ్చె నందునా?
దుడుకున రాము జీవముల ♦ దోరిచె నందున?చందనంబుకై
వడి సుఖ శైత్య మిచ్చెనని ♦ పల్కుదునా?కడు నుగ్రతాపమే
యిడె నన నేర్తునా!మఱియు ♦ నేమని చెప్పుదు? నెట్లు దెల్పుదున్? ౧౯౩

చ॥ కొసరి వచించు సీత తోడు ♦ గుల్ రఘువర్యుఁడు ప్రేమ మూర్కొనం
గుసుమములయ్యెఁ దాల్చుటకుఁ ♦ గోరఁగ నొప్పిన వుత్తరీయమై
విస్ఫురమర కాంతి యుల్లసిలి ♦ పే రురమందున గందమట్టు లొ
ప్పెసఁగె శరీరమెల్ల రహి ♦ యించి విరాజిలె దుప్పటంబు నాన్. ౧౯౪

చ॥ కనుగవ నుండి యశ్రువులు ♦ కాఱి యటం గల వస్తుజాలముం
గొని వడిఁ బాఱె దేహము గ ♦ గుర్పొడిచెన్ భరియింపరాని మో
దనమున నుబ్బి నిక్కె భుజ ♦ దండము లద్యెడ రామభద్రుఁ డొం
దినయది సంతసంబొ? మఱి ♦ త్రెవ్వని తాపమొ? మేని సొమ్మయో?. ౧౯౫

మ॥ తనువెల్లన్ విషబాధ నొందు వహీ నం ♦ తాపించి శ్వాసంబుఁ బ్ర
జ్ఞను పోనాడి ధరిత్రి వ్రాలు సరసీ ♦ జాతాక్షు సుగ్రీవుఁ డొ
య్యన వక్షంబున రోమబృందము చుఱు ♦ క్కంచూనఁ గేల్సాఁచి యొ
మ్మున కానించికొనెన్ మనమ్మున దిగు ♦ ల్పుట్టింప దూపిల్లుచున్. ౧౯౬

## సుగ్రీవుఁడు రాముని స్థితికి సంతాపించుట.

మ॥ అటు సుగ్రీవుఁ డురమ్ముపైఁ గొదువలే ♦ కానించు కొంచున్ మహో
త్కటమౌ రాముని దుర్వ్యవస్థఁ గని చి ♦ త్తంబందు సంతాప లం
పటుఁడై కుందుచు నిట్లనున్ రఘువరా! ♦ పాపాత్ముఁడౌ నేను సం
కటపాటుం గలిగించినాఁడఁ దొడవుల్ ♦ గాన్పించి నీ కియ్యెడన్. ౧౯౭

శా॥ వేదోద్ధారక! యీ యజాండమున న ♦ న్వేషించి నాలావు దై
త్యాదుల్ రావణ దుర్విదగ్ధుఁ డెఱుఁగన్ ♦ వ్యక్తంబుగా నీ యశః
కేదారస్థల భూసుతన్ భువన ల ♦ క్ష్మిం దెత్తు సందేహమున్
లేదిల్లేల తపించి సొమ్మసిల? వే ♦ లెమ్మా జగన్నాయకా!. ౧౯౮

మ॥ అమృతోద్ధార! పతివ్రతానియమముల్ - వ్యక్తీకరింపంగ జ
న్మము తాఁ గాంచిన లోకమాత భయ కం ♦ పంబుల్ వెసం జెంద నొ
ప్పమి గావించిన నీచ రావణ శిరో ♦ బాహార్గళుల్ గాక లో
కములున్ నీయొక బాణ సంహతికి ల ♦ క్ష్యంబై నఁ గాఁజాలునే?. ౧౯౯

మ॥ భువనోద్ధారక! యింద యుండుము మహా ♦ వీర్య ప్రతాపంబునన్
దివిజుల్ మెచ్చఁగ లంక యేటికి జగ ♦ ద్బృందంబు శోధించి దా
నవ రాజన్యుల మస్తకంబులను చూ ♦ ర్ణం బాడి నీదేవి నీ
వపు మేల్మేలనఁ దెత్తు సేవకుని కా ♦ ర్యం బిద్ది వీక్షింపుమా. ౨౦౦

ఉ॥ దానవ మర్దనా! భవ దు ♦ దార గుణంబులఁ గొల్చి నిల్చి నీ
యానతిసేయ నెయ్యుర, మ ♦ హార్య పరాక్రమ శోభితుండు స
మ్మానితుఁడైన లక్ష్మణుఁడు, ♦ మస్తక మందు జగమ్ము తాల్చు నీ
యానను, నిన్ను నీవ యిటు ♦ లక్కట చూచెదె యల్ప దృష్టితో?. ౨౦౧

మ॥ తమ సామర్థ్యము తామె చెప్పుకొన రు ♦ ద్యత్ప్రీతిమై సజ్జనుల్
తమ కార్యంబులఁ బట్టి లోకమె గురు ♦ త్వంబున్ గసన్నేర్చు ధ
ర్మము నీవేకద నిన్ను గాకితర ధ ♦ ర్మంబుల్ భువిం గల్గునే?
భ్రమలం బొందుచు నుమ్మలింపఁదగునే ♦ భ్రాంతాత్మ చందంబునన్?.

చ॥ అకలుష వాగ్విశారద! పు ♦ రారియు బ్రహ్మయు విష్టరశ్రవుం
డొకటిగఁ జేరుచో సమత ♦ యొప్పగుచుండునుగాని వార లొ
క్కొకరుగ వేఱువేఱయిన ♦ నొప్పరు నీకు సమాన సత్త్వులై
వికచ జలేజనేత్ర! యిటు ♦ పీటఁడి పోల్కిఁ దపింపఁబోలునే?. ౨౦౩

ఉ॥ కాంచన చిత్ర పంకరుహ ♦ కార్ముక! నా కుఱుకోర్కి నిప్పుడే
క్లొంచక చేయుమా యనుచుఁ ♦ గోరుట లేదు విళంబనంబు లే

కంచిత లీల నేగి యసు ♦ రాధిపుచే నగచాట్ల నొంది శో
కించెడు దేవి బంది దోలఁ ♦ గింతము లెమ్మని పల్కునంతటన్. ౨౦౪

క॥ రాముఁ డొక విధమునన్ మూ, ర్ఛా మేఘము తొలఁగఁ దేఱి ♦ ప్రవ్చిన బాష్ప
స్తోమము వెలియం గఁడు గా, రాముని సుగ్రీవుఁ గాంచి ♦ క్రచ్చుఱ నసియెన్. ౨౦౫

## శ్రీరాముని నిర్వేదము.

ఉ॥ పాపుఁడనైన యేను నొక ♦ పర్వత సన్నిభ చాప మూని పె
ల్లోపిన శౌర్యశాలివలె ♦ నుర్వరఁ బ్రాణముతోడ నుండ దు
ష్ప్రాపిప దురంత దుఃఖముల ♦ వందురి జానకి భూషణంబులన్
దూపిలి దూసె నా బ్రతుకు ♦ దుర్భర భారము గాదె భూమికిన్?. ౨౦౬

చ॥ అలఘు పతివ్రతా గుణము ♦ లారసి గౌరవకీర్తులన్ మహిం
జెలఁగిన స్త్రీలపట్ల నిటు ♦ చేసిన వారలు పూర్వమెవ్వరేఁ
గలరొకో? దేవియట్లు కడ ♦ గండ్లను పొందుచు నుండ నే శిలా
తల గిరి కాననంబుల వృ ♦ థా తిరుగాడుచునుంటిఁ జెల్లరే! ౨౦౭

ఉ॥ దారిని పోవువారయిన ♦ దగ్గఱి చామల కెద్దియేని యొ
డ్డారము సేయువారల న ♦ డంపఁగఁ బ్రాణము లిచ్చియైన మేల్
కూరుచువారు సద్గుణులు; - కోరిక దిక్కుగ జీవగఱ్ఱగా
వారక నన్నె నమ్మిన సు - భాసినిఁ గావఁగలేక యుండితిన్. ౨౦౮

మ॥ గుణ సంపన్నులు మత్కులోద్భవులు కా ♦ కుత్థ్సుల్ పయోరాశినే
కణఁకం ద్రవ్విరి గంగఁ దెచ్చిరి యశః - కార్యంబులం జేసి ధర్మ సం
చణతం జింకలు దువ్వలొక్కదొన ని - చ్చస్నిరు ద్రావించి రేఁ
బణఁతిన్ సద్గుణ సంయుతన్ సతిని గా ♦ వన్లేకయుంటింగదా?. ౨౦౯

చ॥ స్థిరుఁడగు ధర్మరాజునకుఁ ♦ జేరఁగ శక్యముగాని పీఠ శం
బరుఁ దునుమాడి యింద్రు దుర ♦ వస్థలఁ బాపిన రాజుపట్టినై
గురుతర దుఃఖపాత్రమగు ♦ గోడు నొహారు భరించి దానితో
శరములు చాపముల్ బరువు ♦ చాలక మోయుచునుంటిఁ జెల్లరే!. ౨౧౦

చ॥ జనకుని సత్యవాక్కునకు ♦ జాఱుడు గల్గుట యొప్పదంచు నె
మ్మనమున నెంచి రాజ్యము శ ♦ మంబున వీడి యరణ్య సీమకుం
దనియఁగ వచ్చి యిందు సహ ♦ ధర్మిణిఁ గోల్పడి శాశ్వతంపు నిం
దను జను లీసడింపఁ దలఁ ♦ దాల్చితి నెట్లు తొలంచుకొందునో?. ౨౧౧

తే॥ ఇట్లు దుఃఖించి పవచెడి ♦ యెన్నరాని, శోక వేదనాహతుఁడయి ♦ సొమ్మసిల్లు
రామచంద్రుని వానర ♦ రాజు దుఃఖ, వారిరాశి తీరము చేర్చి ♦ యూఱడించె. ౨౧౨

ఉ॥ నీ యుపచారవాక్యముల ♦ నీఁగితి దుఃఖ మొకింత మిత్రమా!
పాయఁగ నెంచినాఁడఁ దను ♦ బంధము వేఱొక త్రోవ లేదు నా
కీ యెడ గష్టనింద సమ ♦ యింపఁగ, నీకొనరించు పంతముల్
హాయక తీర్చి యవ్వల స ♦ మాహిత చిత్తుఁడనై మరించెదన్. ౨౧౩

హనుమంతుఁడు కర్తవ్యముం దెలుపుట.

క॥ అని రఘురాముఁడు పలుకఁగ, విని మారుతి కేలు మొగిచి ♦ వినయ నమితుఁడై
జనపాలక!యొక మనవిని, వినవలతును జరుగవలయు ♦ విధ మోపికమై. ౨౧౪

తే॥ మొదటఁ గ్రూరకర్ముని వాలి ♦ సదమదంబు, సేసి భాస్కరపుత్త్రుఁ గి♦ష్కింధ నిలిపి
యసదృశంబగు ప్లవగసై ♦ న్యంబు గూర్చి, కున్న దైత్యుల తావు రో♦యుట కడింది.

క॥ దైత్యులకు నెలవు ధరనో? య, ధిత్యకలనో? నాగమునగో? ♦ దివినో? యెటనో?
సత్యముగ నెఱుఁగలేము య, గత్యముగా వలయు వెదకఁ ♦ గపిసైన్యంబుల్. ౨౧౬

మ॥ క్షణకాలంబునఁ జుట్ట నేరుతురు లో ♦ కంబెల్ల నిష్ఠార్థముల్
చణులై కూర్తురు పూర్వకర్మవలె హిం ♦ సల్ చేయ నేతెంత్రు దు
ర్గుణు లెట్లెట్లొ తొలంగుచుందురు మహా ♦ ఘోరాపదల్ వోవు ధో
రణి వారేగు పథంబు లా కుటిల చ ♦ ర్యల్ కాంచ దుస్సాధ్యముల్. ౨౧౭

ఉ॥ అంచిత రీతిమై జగము ♦ లన్ని యొకేపరి నివ్వటిల్ల గా
లించి మహీజఁ గానఁగ వ ♦ లెన్ బరి దప్పి యొకొక్కచోటె శో
ధించుచుఁ బోవుచో వితగఁ ♦ ద్రిప్పటగాక ఫలంబు లేదు యో
చించఁగ నేండ్లు పూండ్లు కడ ♦ చెల్లును మీరుఁ దలఁచి చూడుఁడీ

ఉ॥ వానరసేన కల్పమున ♦ వారిధి పొంగిన రీతి లోకముల్
బూనిక గప్పఁగాఁ గలదు ♦ పూర్తిగ డెబ్బది వెల్వ లుండు నం
భోనిధిఁ ద్రావఁగాఁ జగముఁ ♦ బోఁడిమితోఁ దలక్రిందు సేయఁగా
నైనను చాలియుండు భవ ♦ దాజ్ఞ శిరంబునఁ దాల్చు నిచ్చలున్.

ఉ॥ కావునఁ దొల్త వాలిఁ గడఁ ♦ కన్ వధియించి యనంతరంబ మీ
దేవిని రోయఁబూనఁగ వి ♦ ధించుట కార్యమటంచు నెంచెదన్
దేవ! యనంగ శాంతినిధి ♦ ధీరుఁడు రాముఁడు మంచిదంచు నం
భావన సేసి నేఁడె చని ♦ వాలిని గూల్తము రండు లెండనన్. ౨౨౦

సీ॥ భయద నేత్రంబుల ♦ వఱలు శరభ మొండు, కడిమి నొప్పారు వ్యా♦ఘ్రములు రెండు
గమన కౌశల మొప్పు ♦ గజములు రెండు ప, రాక్రమ స్థిర మృగ ♦ రాజ యుగళి

త్రోవఁ జన్నట్లు సు ♦ గ్రీవుండు నల నీల, తార మారుతులు ను ♦ దారగుణులు
రామలక్ష్మణులును ♦ రాజిల్లఁ గదళీ ర, సాల తమాల త ♦ క్కోల సాల

తే॥ వట పనస సుర పున్నాగ ♦ బదరికాది, తరువు లేలాది లతికా ప్ర ♦ తతులు క్రమ్మి
యున్న చరియల మార్గాన ♦ నుద్గతిమెయి, నేడుగురు కూడి వెడలినా ♦ రెసక మెసఁగ.

సీ॥ ఆమార్గ మందెల్ల ♦ హరిణాక్షు లైనట్టి, హరికాంత లూఁగు ను ♦ య్యాల లుండు
నుయ్యాల ల్లేని చో ♦ ట్లొప్పుగాఁ జందన, తరులచే నిబిడమౌ ♦ చరియ లుండుఁ
జరియలు లేనిదే ♦ శిఖుల మేఘావృత, మగు ఘనగిరి శిఖ ♦ రాళి యుండు
ఘనగిరి శిఖరముల్ ♦ గలుగని చోటులఁ, దావులు వెదజల్లు ♦ తీవ లుండు

తే॥ తీవ లల్లిబిల్లిక గల ♦ త్రోవలుఁడుఁ, ద్రోవలందు విశ్రాంతికై ♦ తోఁట లుండుఁ
దోఁటలం దొడ్డ డిగ్గియల్ ♦ దోఁచుచుండుఁ, డిగ్గియల హరిణంబులు ♦ డిగ్గుచుండు.

తే॥ అద్రు లెక్కనప్పు డుదిగు♦నపుడు సహజ,వరరుతముసేయు గండపెం♦డెరములులియ
రామలక్ష్మణుల్ వీరహా ♦ ర్యక్ష భంగి, నడిచినారలు తోడి వా♦నరులతోడ. ౨౨౩

సీ॥ కాకుత్థ్సవర్యుల ♦ కపికులోత్తంసుల, గమన వేగమునకుఁ ♦ గరులు బెదరె
జీమూతసంఘముల్ ♦ చెదరెఁ దుంపురులు చిం, దర వందరై వసుం ♦ ధరను రాలె
సురపొన్న వృక్షముల్ ♦ సొంపారఁ బెరిఁగిన, చటియల నురగముల్ ♦ పరుగులెత్తె
శరభ శార్దూల ♦ కేసరి కిరి భల్లుక, గవయాదులును భీతిఁ ♦ దవిలి పాఱె

తే॥ వాని వేగాన విఱిగిన ♦ పాదపములఁ, దేనె తెట్టెలు చితికి ధా ♦ త్రిని స్రవింపఁ
పోవు త్రోవ యెల్లెడఁ జాల♦బురదయగుచు,నడవ సులభంబుగాక జా♦ఱుడుగ నుండె.

తే॥ పద్మరాగ మణి ప్రభా ♦ పటలి పరవి, మండుచున్న కొండలఁబోలె ♦ మలసె గిరులు
వానిఁ జల్లార్ప జలదముల్ ♦ ప్రబ్బు కరణి, రాఘవుల దేహకాంతులు ♦ క్రాలుచుండె.

ఉ॥ పాఱు వియన్నదీ జలము ♦ పర్వత సానువులందు ద్రోణులన్
బాఱుఁ బొలంబులందు గల ♦ పైరుల కందలి మీలు చాలుగన్
బాఱు ఝురంబులన్ బొడువఁ ♦ బాఱు మదావళపాళి వెన్నులం
బాఱుఁ బతత్రి బృందములు ♦ పాదప శాఖలఁ బాఱుఁ గోఁతులున్. ౨౨౬

సీ॥ ఏలా లతాజాల ♦ డోలా సమాలోల, ఫల వాసనలు సుర ♦ పాళిఁ దివుచు
మకరంద నిష్యంద ♦ మలయజ సాను ని, ర్ఝరములు నక్షత్ర ♦ సమితిఁ దివుచు
బహురత్న జాత ప్ర ♦ భా మరీచీ జాల, మింద్రచాపంబుల ♦ నేచి తివుచుఁ
బటుతరవిస్ఫుట ♦ స్ఫటిక శిలాతల, సందోహములు బాల ♦ చంద్రుఁ దివుచు

తే॥విరులగుత్తులుగ్రహకాంతి♦విరియఁదివుచు,సాంద్రగుల్మముల్ మేఘసం♦చయముఁదివుచు
వృక్ష సంతానములు మిన్ను ♦ ప్రీలఁ దివుచు, రమ్యతమమైన యవ్వన ♦ రాజమందు,

మ॥ కమనీయంబుగ నిట్టు లుల్లసిలు త ♦ త్కాంతార మార్గంబునన్
శ్రమ లెక్కింపక పోయి స్వర్ణమయమౌ ♦ స్వర్గంబె యచ్చోటికిన్
సుమనోరాజసుతుండు తెచ్చె ననఁగా ♦ శోభిల్లు కిష్కింధ మో
దము పెంపారఁగ డాసి చేయఁదగు చం ♦ దంబుల్ విచారించుచున్.

## ౫. వా లి వ ధ ప ట ల ము. (౧౫౩)

చ॥ అరి బల మర్దనుండు సుగు ♦ ణాఢ్యుఁడు రాముఁడు కొంతసేపు క్ర
చ్చఱఁ దలపోసి యర్కసుతు ♦ నాదటఁ గాంచి బలీముఖేంద్ర! నీ
వరమర లేక వాలిని ర ♦ ణావని కామికతోడఁ బిల్చి సం
గర మొనరింపు మొక్క విశి ♦ ఖంబునఁ గూల్చెద దవ్వునుండియేన్.

ఉ॥ నావుడు మేలుమేలని ఘ ♦ నంబగు నూహ మటంచు నుబ్బి సు
గ్రీవుఁడు సింహనాద మొన ♦ రించె బయోధులు పుల్లగిల్ల మే
ఘావళి సిగ్గిలంగ నమ ♦ రాలి కలంగ జనంబు క్రుంగ ది
గ్భావలయంబు పిక్కటిల ♦ వ్యోమము మిక్కిలి బూరటిల్లఁగన్. ౨౩౦

సీ॥ రమ్మెదిరించి పో ♦ రఁగ సమరంబున, నంత కాంతికమున ♦ కనుపువాఁడ
నని యాడుగఱచి భు ♦ జాస్ఫాలనమ్మొగిఁ, జేయఁ దద్రవము కి ♦ ష్కింధయందు
దడిమంబునం బాల ♦ కడలికై వడి నిద్ర, సెందిన యవ్వాలి ♦ చెవులఁ జొరఁగఁ
గరిరాజు గీఁక కే ♦ సరి విని కోపాన, లేచు కైవడి వాలి ♦ లేచి నిలిచి

తే॥ తమ్ముఁ డాజి కాయితమయి ♦ దాసి సింహ, నాద మొనరించె నని పెద్ద ♦ నవ్వు నవ్వె
నా నగవుచేత నొకపరి ♦ యదరె నగరు, పరిజనంబులు వానర ♦ వరులు బెదర. ౨౩౧

మ॥ లయకాలంబున వారిరాశి తరఁగల్ ♦ ఉంపిల్లఁగా లేచు నొ
ప్పయి తల్పంబున వాలి లేచి చల మే ♦ పారన్ ధరన్ దాఁచెఁ ద
ద్భయదాఘాతముచే గిరీంద్రము దిగం ♦ బాటన్ మహీజాత సం
చయముల్ దొర్లె భుజంబులన్ విదురుపన్ ♦ జండాశుగ ప్రోద్ధతిన్. ౨౩౨

శా॥ క్రోధావేశముచేత రోమతతి గ ♦ గ్గుర్పొందె నందుండి నీ
రోధ ప్రక్రియఁ జిట్లి పెట్లి వెడలెన్ ♦ రూక్షంబుగా నిప్పుకల్
వేధోండంబు వడంక మిడ్గుఱులు ప ♦ ర్వెన్ నేత్రయుగ్మంబునన్
బాధించెం దవ ధూమమట్లు పొగ లు ♦ చ్ఛ్వాసంబుచే స్వర్గమున్. ౨౩౩

చ॥ కరతలము ల్వడిం జఱచు ♦ కర్కశ నాదము భూమి మోయు ది
క్కరులకు భీతిఁ గూర్చె గిరి ♦ కందరముల్ మఱుమ్రోఁతఁ బేర్చెఁ బ్ర
స్తరములు దొర్లు పేరులివ్వు ♦ దండడిచే జలదంపు గర్జనల్
కొఱవడెఁ బ్రాణికోటి కల ♦ గుండడు వహించె జగంబు కంపితెన్. ౨౩౪

తే॥ అధమ! వచ్చితి వచ్చితి ♦ ననెడి వీర, వాక్యములు దిక్కులకు విన ♦ వచ్చె నడరి
నిలువ శీర్షక శిఖరంబు ♦ నెగడి తగిలి, ఋక్షజాలంబు పలపల ♦ క్రిందరాలె. ౨౩౫

సీ॥ నడతెంచు వేగాన ♦ నడరిన పెనుగాలి, వీవఁ గిరిశ్రేణి ♦ పెల్లగిల్లి
దెసల కొనల దాఁక ♦ విసరుకొనుచుఁ బోయి, ధరణి దద్దఱిలంగ ♦ దొరలి పడియె
శ్వేత రోమంబుల ♦ చివరల వెడలిన, యదరు లజాండ క ♦ ద్యముల మూసె
మిత్తికన్నులు మిఱు ♦ మిట్లు గొల్పెను తెఱ, గంటులు పఱచిరి ♦ గతులు దప్పి

తే॥ పండ్లు పటపట గీఁటఁగా ♦ వఱలు నగ్ని, కణము లశనిపాతమువోలెఁ ♦ గడలఁ జెదరెఁ
బుజము లప్పళింపఁగ బాహు♦పురుల రాలు, రత్నములు మెఱుపులక్రియ♦రాలుచుండె

చ॥ నరులును వారిధుల్ సురలు ♦ నాగులు భూతగణంబు తత్త్వముల్
ధరణియు నాసిరిల్లు తఱిఁ ♦దార్కొను చండతరాగ్నివోలెఁ జా
పఱుకుఁ గనంబడెన్ భయము ♦ భ్రాంతియుఁ గొల్పుచుఁ బూర్వమందు తాఁ
దఱిచిన పాలవెల్లి బెడి ♦ దంబుగఁ బుట్టు విషంబు కైవడిన్. ౨౩౮

తార వాలికి హితోక్తులు పలుకుట

తే॥ తార తిలకినీ తిలకంబు ♦ తనదు భర్త, కనులనుండి నిప్పుకలు మొ ♦ గంబునుండి
పొగయు వెలువడి మేనిని ♦ ముంగురులను, కాల్చుచుండ నడ్డమువచ్చి ♦ కరమువట్టె.

తే॥ మగువ! విడువుమ యడ్డగిం ♦ పకుమ నన్ను, బలిమి ననికిఁ బిల్చిన ప్రొద్దు♦పట్టెఁ బట్టి
జలధివలెఁ ద్రచ్చి తజ్జీవ ♦ ములను గ్రోలి, వేగ మరలెద ననవుడు ♦ వెలఁది పలికె.

మ॥ జయశాలీ! భవదీయ దోర్బలము నో ♦ ర్చన్లేక యల్లాడి దు
ర్భయ చిత్తంబునఁ బాఱువాఁడు నవ స ♦ త్త్వంబొందఁగాలేదు వి
స్మయమా నూతన జన్మమొందఁడును భా ♦ స్వత్పుత్త్రుఁ డివ్వేళ ని
ర్భయుఁడై రా బలశాలి యొక్కరుని తో ♦ డ్పాటుండు నిక్కంబుగన్.

చ॥ అన వికటంబుగా నగి సు ♦ రాధిప పుత్త్రుఁడు పల్కెఁ దొయ్యలీ!
వినుము త్రిలోకజీవు లొక ♦ పెట్ట నెదిర్చినఁ గొప్పరించి యు
క్కునఁ బరిమార్తుఁ జారసిలి ♦ క్రుంగక నిల్చిన శూరుఁ డొక్కఁ డిం
దనుకను వింటివేమి? విత ♦ థంబుగ భీతిలనేల చెప్పుమా? ౨౪౧

సీ॥ మందరశైలంబు ♦ మంథానముగఁ బాఁప, ఱేఁడు దిట్టపుఁ దరి ♦ త్రాడుగాఁగ
చక్రి పీఠంబుగాఁ ♦ జంద్రుండు తరికంబ, ముగ నుంచుకొని దేవ ♦ పూర్వదేవ
బృందంబు క్షీరవా ♦ ర్ధిని చిల్కి యలసిన, తఱి నొక్కఁడన పట్టి ♦ తరిచి సుధను
వారి కొసంగు నా ♦ బీరంబు మఱవంగఁ, దగినదే? నీకుఁ జం ♦ దన సుగంధి!

తే॥ దేవ దానవు లెదిరించి ♦ దీలుపడిరి, ప్రాణిఁ బ్రాణంబులను వేఱు ♦ పఱచు యముఁడు
నా యభిధ విన్న గడగడ ♦ నడుఁకువాఁడు, పోర నాతోడ నెవ్వాఁడు ♦ పూనువాఁడు?

చ॥ అటు లోకవేళ మందమతి ♦ యై రొకరుం డెదిరించెనేని యు
త్కట తపమూని మేలిమిని ♦ గాంచు వరంబున శత్రుదేహ ని
ష్కుట పటు సత్త్వమం దరులు ♦ స్రుక్క సగంబు బలంబు చెందు న
న్నిట నెదురొడ్డువాఁడు ఫల ♦ మేమి గడించును? చింత యేటికిన్? ౨౪౩

తే॥ వాలి యిటు పల్క విని తార ♦ ప్రాణనాథ!, రామచంద్రుండు దశరథ ♦ రాజ సుతుఁడు
రవిజ మిత్త్రుఁడై నిను చంపఁ ♦ బ్రతినచేసె, ననుచు హితులచే వింటి నేఁ ♦ డనుడు నతఁడు

వాలి తారకు శ్రీరాము గుణము లభివర్ణించుట

ఉ॥ పాపిని! యేమి పల్కితివి? ♦ బంధములం దెగఁ గోయలేని బా
ధా పరితప్త దేహులకు ♦ ధర్మపథంబు గమించి చూపు ల
క్ష్మీపతి కిట్లనర్హమగు ♦ చెట్టలు గట్టుద వేమి? యిట్టి నీ
పాపము వోవ నింక నొక ♦ ప్రాచితమ్ముం గలదేమి? వెంగలీ. ౨౪౪

చ॥ ఇహపర సౌఖ్యముల్ దసర ♦ నిచ్చు ముకుందున కిట్లు సేఁత ము
ద్రహమె యొకో? గౌరవార్హమె యొకో? ♦ తత్కృతి లాభకరంబొ? ప్రేమయున్
సహనము రూపుగా సకల ♦ జంతువులన్ బరిరక్ష సేసి లో
క హితము గోరు ధర్మమె స్వ ♦ కర్మ మడంచుకొనంగఁ జూచునే? ౨౪౫

చ॥ జనకుని సత్యవాక్యనిగఁ ♦ జల్పు విమాతృ నిదేశ మూని వ
ర్ణన మొనరింపలేని కరు ♦ ణామతిఁ దత్ప్రియసూతికిన్ స్వమే
దిని విడిపించి కానలకుఁ ♦ దృప్తిగ వచ్చిన యుత్తమోత్తమున్
దనియ నుతింప కిట్లు నడి ♦ దార్చెదు ప్రల్లద మాడఁగూడునే? ౨౪౬

ఉ॥ అండములెల్ల నొక్కటయి ♦ యాజి నెదిర్చినఁ గేలఁ బూను కో
దండ సహాయుఁడై విజయ ♦ తామరసాసన చెట్టఁబట్టు ను
ద్దండుఁ డనన్య సామ్య గుణ ♦ ధాముఁడు రాముఁడు పేరు నూరు లే
కుండెడు నీచుతోఁ జెలిమి ♦ యొప్పుగఁ జేయునె మత్తకాశినీ!. ౨౪౭

చ॥ అనుజులకంటె వేఱయిన ♦ ప్రాణము లేదని యెంచి వారితో
నెనరునఁ గూడి వర్తిలు వి ♦ నీతుఁడు కారుణికుండు నాదు వే
ల్పునగు రఘుప్రభుండు తన ♦ పూజ్యత మాయఁగ నేనుఁ దమ్ముఁడున్
మొనసినవేళ మధ్య శర ♦ మున్ దెగ నెక్కిడునేమి? కోమలీ!. ౨౪౮

చ॥ క్షణ మిట నుండు మియ్యెదన - చయ్యన నేఁజని ఘోర సంగరాం
గణమున వాని క్రొవ్వడఁగఁ ♦ గాఁ జవయించి యసుప్రజా బవా
రణగతిఁ బారణల్ సలిపి ♦ క్రచ్చుట తోడుగ వచ్చినట్టి గ
ర్జలబలకు భంగపాటు నొడిఁ ♦ గూర్చెద వచ్చెదఁ జులే దక్కమా. ౨౫౦

చ॥ అనవుడు భర్తమాట కెదు ♦ రాడ కుదార కపీంద్రుదార తా
ర నిలిచె వాలి యుత్సుకతఁ ♦ గ్రన్నన బాహువు లుబ్బఁ బూర్వ ది
గ్ఘన గిరి మీఁద దోఁచు రవి ♦ కైవడిఁ గ్రాలి మహోగ్ర చండ కో
పనుఁడయి దుర్నిరీక్ష్యగతి ♦ వాలి కనంబడెఁ దన్మహాద్రిపై. ౨౫౧

చ॥ భుజబల దార్ఢ్యమందు పెను ♦ పోఁడిమినొందు గిరీంద్రుఁ బోలు నిం
ద్రజుఁడు, నిశాచరేంద్రుని మ ♦ దం బడఁగింపఁగఁ బూని గుంజ న
క్కజముగఁబుట్టు నా సరమ్ము ♦ గప్రభు నంచునఁ గాంచువారలున్
గజగజలాడ వచ్చెఁ దను ♦ కంబున నక్కుజుఁ డున్నచోటికిన్. ౨౫౨

## వాలిసుగ్రీవుల సమరము.

ఉ॥ గర్జిలు తమ్ముఁ గాంచి ఘన ♦ గర్జన చేసె సురేంద్రసూతి త
ద్గర్జ త్రివిక్రమేశుని ప ♦ దంబు పెరింగిన యట్లు లోకముల్
దుర్జయలీల నుగ్రముగ ♦ దూఁకెను మేఘ సమూహ మెల్ల వి
స్ఫూర్జిత రీతిగాఁ బిడుగు ♦ పుంజములన్ వడి రాల్చె నెల్లెడన్. ౨౫౩

ఉ॥ అప్పుడు రాఘవుండు తన ♦ యర్మిలి తమ్ముని గాంచి యిట్లనున్
దప్పక చూడు నాగ శిబు ♦ ధ ప్రకరంబులు రాక్షసాళి నీ
ర్కప్పయు మేఘరాజయు మ ♦ రుత్తు లయాగ్ని మహీవిధేని యీ
యొప్పగు మేనితో సమత ♦ యొప్పునె? భీకరదేహిఁ వీఁడనన్. ౨౫౪

చ॥ అవరజుఁ డిట్లనున్ వినతి ♦ నార్య! విభాకరసూతి జ్యేష్ఠు నా
యువుఁ గొనఁ గ్రూరకాలుని స ♦ ముద్ధతిఁ దోడ్కొని వచ్చె నేఁడు సం
స్తవగతి సంగరంబు బెడి ♦ దంబుగఁ బూనినవాఁడు కాఁడ యీ
ప్లవగుఁ డటంచు నా మనము ♦ పాయని వేదన నొందు నిత్తఱిన్.

ఉ॥ చిత్తజరూప! ధర్మము నశింపఁగ నమ్మిక మాయ చెయ్వులన్
జిత్తముచేర్చు బాలిశుని ♦ శిష్టులు నమ్మఁగరాదు నమ్మికో
లుత్తమ రీతికాదు తన ♦ యుల్లమునందు విరోధి వోలె ను
న్మత్తుఁడు జ్యేష్ఠుఁ జంప జత ♦ నం బొనరించె నీకెట్లు నమ్మికల్?. ౨౫౬

చ॥ అను తనతమ్ము మోముఁగని ♦ యార్యుఁడు పల్కెను లక్ష్మణా! వివే
చన మొక యింతలేని మృగ ♦ జాతుల శీలముఁ గూర్చి యిట్లు చిం
తన మొనరింపఁగూడ దొక ♦ తల్లి కుమారులలోన్ఁ దమ్ము లె
ల్లను తమ యన్నజాడల మె ♦ లంగినచో భరతుం డెలర్చునే? ౨౫౭

ఉ॥ చాప కిణాంక సుందర భు ♦ జా! భువి శిష్టులు కొందఱే సుమీ
పాపులె పల్వు రుండుదురు ♦ బాళి మెలర్చిన చోట సద్గుణా

పాపమె గాంచుచుంట గుణి ♦ పద్ధతి యొట్టుల గాకయున్న ని
ష్పాపులు లోకమందుగల ♦ వారొకొ సూక్ష్మమతిన్ గ్రహించినన్? ౨౫౮

తే॥ బలియురగు రామలక్ష్మణ ♦ ప్రభువు లిట్లు, మాటలాడుచు నుండఁగా♦ మంచుఁగొండ
లట్లు దిగ్గజంబులపోల్కి ♦ సర్క శక్ర, పుత్త్రు లిరువురు పోరాడఁ♦ బూనినారు. ౨౫౯

ఉ॥ కొండయుఁ గొండ డీకొనిన ♦ కోపున నొప్పి బలంబు హింసయున్
దండితనంబు గల్గిన యు ♦ దగ్ర మృగేంద్ర యుగంబు కై వడిన్
జండతరంబుగాఁ దిరిగి ♦ సారెకుఁ గుమ్మరి దోర్బలంబునన్
మొండుగఁ ద్రిప్పు సారె కర ♦ ణిన్ గుడిచుట్టుచుఁ బోరి రుద్ధతిన్. ౨౬౦

చ॥ తొడలు తొడల్ పెనంచి భుజ ♦ తుండములన్ మెలివైచి దంతు లు
గ్గడువుగఁ బోరురీతిఁ దడ ♦ కట్టుచుఁ బట్టుచుఁ బట్టు వీడుచున్
దొడఁకక చెంగుచున్ మరల ♦ దూఁకుచుఁ బట్టుచుఁ బట్టు వీడుచున్
బెడమఱఁ ద్రిప్పుచున్ మెఱసి ♦ బెట్టిదులై వడిఁ బోరి రిర్వురున్ ౨౬౧

చ॥ భుజ బల వీర్య సంపదలఁ ♦ బొల్చిన భీకరమూర్తు లేక గ
ర్భ జనితు లార్క్ష కాంతకయి ♦ పట్టుగఁ బోరుట చూడ మున్ను బే
రజమున వచ్చు నచ్చర క ♦ రంబు గ్రహింపఁ జలంబు మీఱి పె
చ్చు జతన పోరు సుందు నుప ♦ సుందుని పోలిరి వార లయ్యెడన్. ౨౬౨

చ॥ జలనిధు లొండొకళ్లఁ బెలు ♦ చన్ సరిపోరుట రెండు మేరువుల్
తలకొని మించి డీకొనుట ♦ దర్పము రోషము మాఱుకొంట యి
య్యెలఁ గనలేనివార మిఁక ♦ నేడ్తెఱ వాలియు సూర్యసూతియున్
మలయుచుఁ బోరుచుంట కుప ♦ మానము తెల్పఁగఁజాల మియ్యెడన్ ౨౬౩

ఉ॥ వానర నాథు నేత్రముల ♦ వారక వెల్వడు విస్ఫులింగ సం
తానముచేఁ బయోదములు ♦ తాఁకెను కొండలు మండె దిక్కరుల్
పూనె వడంకు నాకులును ♦ పూర్ణ భయంబున డాఁగఁబాఱె నా
రూనములై చతుర్విధము ♦ లొప్పిన భూస్థలి వీడెఁ దద్గతుల్.

ఉ॥ వారు మహేంద్రలోకమున - వారొ? ధరాధర సాను భూమిపై
వారొ? ధరిత్రిపై వఱలు - వారొ? దిగంతములందు నిల్చు వా
రొ? రవిః సమ్ముఖానఁ గల - రొ? యని చూపఱు భ్రాంతి నొంద వి
స్ఫార జిగీషులై దిగులు - వాఱక నమ్మికఁ బోరి రుద్ధతిన్. ౨౬౫

చ॥ కఱచుచు రక్కికొంచుఁ బెను - గాయములన్ రుధిరంబు కాల్వలై
వఱలఁగ వార్ధు లొండొకటి - పైకొని సేసెదు ద్రోఁత కైదు పా

ళ్ల నఱచుచు ముష్టిఘాతముల - యారవము ల్లయకాలమందు మ
బ్బులఱిమిన లీలఁ గ్రాలఁగ మ - హోన్నతులై యెసరేఁగి రయ్యెడన్.

ఉ॥ వా రిటురేల రాహతుల - వాఁడి నఖంబులఁ బంటి కాటులన్
బోఁ వపు క్షతంబులను - బోరన రక్తము చిమ్మి మిన్ను వి
స్తారము తోఁగఁ జేయ నుడు - జాలము భానునిపోలె, సాంద్ర సాం
ధ్యారుణ శోభితంబయిన - యంబరముంబలె నొప్పె మేఘముల్. ౨౯౭

సీ॥ కొలిమి నెట్టినఁగ్రాఁ - గుడు లోహమును దాకఁ, గొట్టి సమ్మెటతోడఁ - గొట్టునంతఁ
జిటపటమని దెసల్ - చెదరు మిడుంగుల, కిరణి నిప్పులు రెల్ల - కడల బెరయ
నిరువుర భుజముల ♦ నిరువురు పిడికిళ్లఁ, దాడింత్రు ఘనసినా ♦ దంబు లెగయ
నురములతోడఁ ద్రో♦యుదురు పాదములఁ తోఁ, దన్నుచుందురు హ♦స్తములతోడ

తే॥ బొడుతు రఱతురు తరుబృంద♦ములను పెఱికి, వైతు రద్రులఁ బెకలించి♦వైచుచుంద్రు
బెదర నార్భటింతురు కోప♦వీక్షణములఁ, గాంచుచుందురు లోకముల్ ♦ కలఁతఁజెంద

సీ॥ పైకెత్తుదురు పట్టి ♦ పాఱవైతురు బొమ్మ, గాన్పింతు రురమున ♦ గాఢ ముష్టి
లొక్కఁగాఁ బొడుతురు ♦ లోఁగొన సవ్యాప, సవ్యపదతులఁ గే♦ సరుల సరణి
నరికట్టుదురు నెక్క ♦ కరుగుదు రొండొరుల్, పెనవడి పడుదురు ♦ పృథివి యదర
బొమ్మలతోఁ కంజుట్టి ♦ యెముకలు పొడిగాఁగ, లాగుచుఁ గాళ్లతో ♦ లాగి త్రోతు

ఆ॥ రీఁటెతోడఁ బొడుచు ♦ వాటాన ఖరనఖ, రముల నెత్తు రొలుక ♦ ఱక్కుచుందు
రలసి సొలసి లేచి ♦యలవు బలంబును, చలము మీఱ రణము ♦ సలుపుచుంద్రు.

ఉ॥ భూమిని పాదుకొన్న తరు ♦ వుల్ శిలలుం బొడిగా ధరాధర
స్తోమము సర్వవస్తువులు ♦ త్రుక్కఁక వైవఁగ నొండొకండు పై
వ్యోమమునందె నుగ్గయి ప ♦ యోధిని దిక్కులఁ జేర వారు సం
స్థేమము దక్క కొక్కరును ♦చిక్కక పోరిరి భీకరంబుగన్. ౨౭౦

ఉ॥ పూచి రహించు మోదుగుల ♦ పోల్పున దేహములొప్ప నిర్వురున్
బూఁచి చలంబు పెంపఱక ♦ పోరఁగ నెండిన భూజ పుంజముల్
పూచిక లున్న కాన దవ ♦ ముంబలె రోమములందు వహ్నియుం
దోఁచె సురల్ వడంకి పలు ♦ త్రోవలఁ బాఱిరి తక్కలేటికిన్?. ౨౭౧

ఉ॥ వీరులు వానరాధిపులు ♦ విక్రమసంపద సొంపుపెంపఁగాఁ
బోరొనరించుచుండఁ బటు ♦ భూరి భుజా బల శీలి వాలి క్రో
ధారుణ లోచనుండయి గ ♦ జాధిపు సింగము నొంచుకై వడిన్
ఘోరముగా నలంచి వడిఁ ♦ గొట్టె మనస్థితి సంచలింపఁగన్. ౨౭౨

మ॥ ఘన దర్పంబున వాలి వాలి పెను ని - ర్ఘాతంబు నా వ్రేయ నొ
చ్చిన సుగ్రీవుఁడు పాఱి వచ్చి పడుచుం - జింతాకుల స్వాంతుఁడై .
యిన వంశోత్తముఁ గాంచి దీనుఁడయి న - న్నిట్లేల సేయంగ నీ
వన శ్రీరాముఁడు లోన నొచ్చుకొని యి- ట్లాడెన్ దయాసాంద్రుఁడై. ౨౭౩

సీ॥ ఖేద మొందకుము సు - గ్రీవ! మీలో వాలి, యెవ్వఁ డనుచు మది - నెఱుఁగనైతి
గజపుష్ప మాలను - కంఠమం దిడికొని, యీసారి పొమ్ము మే - లెనయు నీకు
నని పంప సుగ్రీవుఁ . డతి రభసంబునఁ, దారకల్ గూర్చిన - తీరు మీఱు
పేరు దాల్చిపోయి - పేరెత్తి వాలిని, చీరి పేరులిప్పుడఁ - జేరె నుతఁడు

తే॥ వెఱవఁ బొడిచి హింసింప న - ప్పీరుఁ డులికి, పాఱిపోయిన వాఁడేల - వచ్చెననుచు
నెగడి కోపించి రవిసుతు - నెఱఁకులంటఁ, బొడిచె దంచెను గ్రుద్దెను - మోఁదెఁదన్నె.

చ॥ రవిజుఁడు ప్రాణముల్వెడలఁ - గ్రక్కెను నెత్తురు వచ్చెఁ గన్నులం
జెవులను నొచ్చి యాతఁడును - శ్రీరఘురాముని దిక్కు చూచెఁ బైఁ
దవిలి సురేంద్రనందనుఁడు - దారుణ హింస యొనర్పఁ జూచె రా
ఘవుఁడు నమోఘసాయకము - కార్ముక మందునఁ గూర్చెఁ జెచ్చెరన్ ౨౭౪

చ॥ కటిపయిఁ గంఠమందు నొడి - కంబుగఁ గేలు గదించి యెత్తి యు
ద్భటగతి నేలపైఁ జనుమ - వాలి దినేశుని పట్టి నెత్తఁగాఁ
బటువుగ నారి లాగి రఘు - వర్యుఁడు లక్ష్యముచేసి యేసె ను
త్కటుఁడగు వాని బొమ్మ వడిఁ - గాఁడ నమోఘ శరంబు గ్రక్కునన్.

రామ బాణముచే వాలి నేలఁ గూలుట.

సీ॥ ఆ రామ శరరాజ - మయ్యెడ జలమును, జలముఁ బుట్టించు వై - శ్వానరుండు
వైశ్వానరునిగన్న - వాయువు వానికా, ధారమై వెలసిన - ధరణి యనెడు
భూత చతుష్కంబు-పోలుపు బలంబు నొం, దిన వాలి యురమునఁ-దివిరి తూఱె
నరఁటి పండున సూది - యవలీలఁ దూఱిన, పగిదిఁ దన్మహిమంబు - పలుకవశమె?

తే॥ నిర్దయుండయి తమ్ముని - నేలమోఁది, కడప యత్నించు వాలి ది - గ్భ్రాంతిఁ గూలెఁ
బ్రళయవేళఁ బ్రచండ - ప్రభంజనగతి, వేళ్లతోఁ బెల్లగిలు మేరు - విధముదోప.

తే॥ గిలయవేళను భాస్కర - బింబ మురలి, నేలఁ గూలిన లీలను - వాలి గూలి
తరణిపుత్త్రుని గొన్న హ - స్తముల వదలి, నిగుడు శర మురమ్మునఁ దూఱినీక పట్టె.

ఉ॥ పెంపున రామసాయకము - భీకరలీల నురంబు గాఁడ ను
త్కంపితగాత్రుఁడై యతఁడు - క్రన్నన లోఁ జొరనీక వాలుతోఁ

దెంపునఁ గాలఁ గేలను గ - దించుచు నాఁపుటఁ జూచి తా శిరః
కంపన మాచరించె నల - కాలుఁడు గూడఁ దదీయ శక్తికిన్. ౨౭౯

ఉ॥ చీల్చి ఖగోళ మీ త్రుటిని - చింపఁ లాడెద నంచు లేచు నేఁ
గాల్చెదనంచు దిక్కులను - గాంచు సమస్త జగంబు లిప్పుడే
కూల్చెదనంచుఁ ద్రుళ్లిపడుఁ - గ్రొచ్చెద భూస్థలి నంచు డొల్లు నన్
మాల్చిననాఁ డెవం డనుచు - మాటికి దిక్కులు సూచు హాయనున్. ౨౮౦

ఉ॥ నేలను మోఁదు నేత్రముల - నిప్పులు రాల్చు శరంబుఁ బట్టి వే
వాలునఁ గాలఁ గేల వెలి - వాఱఁగఁ జేయఁ గదించు రామికిన్
దీలుపడున్ దపించుఁ బడుఁ - దెప్పిఱు లేవఁగఁ జూచు వేధమై
సోలుఁ గృశించుఁ గ్రుంగు వెత - స్రుక్కుఁ జుఱుక్కనఁ దత్తళించుచున్.

ఉ॥ బాణము నేసి నారలు ది - వంబున నుండెడు వేల్పులేమొ? గీ
ర్వాణులు నిట్టు లేయఁగల - రా? యిటు లేయఁ బనేమివారికిన్
జాణ యెవండొ? యంచు నొక - సారి హసించు నతండు దైత్యజి
ద్ప్రాణు విరించి తుల్య బల - శౌర్యము లొందినవాఁడెపో యనున్. ౨౮౨

తే॥ చక్రమో శూలమో కాక ♦ శక్రుచేతి, వజ్ర మిట్టులు నా యురః ♦ పథముఁ దూఱు
శక్తి క్రొత్తగాఁ బడసెనో ♦ సంశయంబు, గలిగె నంచు నాక్రోశించుఁ♦గలఁగు నలఁగు.

చ॥ ఉరమునఁ జొచ్చియున్న శర ♦ యోగము గాంచుచు నొక్క వింటిచేఁ
బఱపిన తూపు గాదు శర ♦ పంక్తికి నింతటి శక్తి యే? మునీ
శ్వరు లొగి మంత్రశక్తి తగు - సాయముగా విడిపించినారొ? యే
కరణియొ? యంచు దంతముల - గట్టిగఁ గీటు నలంగు దీల్పడున్. ౨౮౪

చ॥ శరమిది ఘోరమంచెఱఁగి - సంశయమంద ఫలంబులేదు నా
యురమునఁ బ్రాణ ముండఁగనె - యుద్ధతిఁ దూఱిన యియ్యలుంగు నా
కరములఁ గాల వాలమునఁ - గ్రన్ననఁ దీసెద నేసినట్టి యా
పురుషుని పేరు గాంతునని - పోఁడిమి దానిఁ దివంగ నేఁగెన్. ౨౮౫

ఉ॥ చేవయు మేటి సాహసముఁ - జిత్త దృఢత్వము ధైర్యవిక్రమ
శ్రీ విలసిల్లు వాలి తన - జీవము నొవ్వఁగఁజేయు బాణ మ
చ్చో వెలికీడ్చి దేవ దను - జుల్ కయివారము నేసి రార్చుచున్
భూవలయంబునం దెవఁడు - పోల నుతింపఁడు ధీర మానసున్?. ౨౮౬

చ॥ అడవులఁ గొండలం గడచి - యంబుధిఁ జేరెనొ నాఁగ నెత్తురుల్
శవల ముంచి పోయు క్రియఁ ♦ గాయమ్ము గాయమునుండి చిమ్మునన్

వెడలెను ప్రేమతోఁ గనిన ♦ వీరుల యుల్లములెల్ల నీరమై
కడవఁగ ఘోరదృశ్యమయి - కన్నులు మూఁతపడం దటాలునన్. ౭౮

తే॥ వాలి యురమను దొడ్డ ప - ర్వతమునుండి, వెడలు నెత్తురు సెలయేటి విధము చూచి
సోదరప్రేమ పాశని ♦ యుక్తుఁ డైన, సూరసుతు నేత్రముల వారి♦ధార దొరఁగె.

ఉ॥ మేరువుఁగూడ భగ్నముగ ♦ మేకొని చేయఁగఁజాలు చేవయున్
గీరితి గల్గు వాలి తన ♦ కేల శరంబును పట్టి త్రుంప నూఁ
కారఁగ నంగళించియుఁ బ్ర ♦ యత్నము వ్యర్థమ యంచు దానిపైఁ
దీరుగనున్న వ్రాలు కను ♦ దేఱిచి చూడఁదొడంగెఁ గ్రక్కునన్ ౭౯

మ॥ త్రిజగత్సేవన మూలమంత్రము భవా - ర్తిం బాపు దివ్యౌషధం
బజ రుద్రామర నిత్యపూజితము శ్రే - యఃపాళి వార్ధ్యంబు భ
క్త జన శ్రేణికిఁ దారకంబు నిగమాం - త జ్ఞాన వేద్యంబు తా
భజియింపంగల రామ నామ మెద నొ - వ్వంగాంచె నేత్రద్వయిన్. ౮౦

మ॥ గృహిధర్మంబుల వీడి కానలకుఁ గో - ర్కిన్ వచ్చు ధీరుండు ని
ర్వహణీయంబయి క్షత్రవంశమునకున్ - రాణించు సద్ధర్మ సం
గ్రహ కార్యంబుల నాకునై విడినె యీ - రాముండు జన్మింపఁగా
గ్రహరాడ్వంశము దుష్టమయ్యెనని వీఁ - క న్నాన చెందె న్నగన్ ౮౧

సీ॥ పరఁగ నగాధ జం - బాల పటల మగ్న, మగు గజరాజంబు - పగిదినున్న
వాలి సిగ్గున మణి - జాల సంశోభిత, శీర్షక యుతమగు - శిరమువంచు
నవ్వ నాలోచించు - నరవరేణ్యుల కిది, ధర్మ మేమో యని - తలఁచి తలఁచి
ప్రాణికోటికిఁ బ్రభు - వగు రాముఁడే నీతి, దప్పిన జనులెట్లు - తలఁగకుంద్రు?

తే॥ మేటి నియతి నాకొఱకె న - ట్టేటఁ గలిపె, ననుచుఁ జింతాకులితుఁడగు - నతని యెదుట
నిలిచె ధర్మసంస్థాపన - నియతికొఱకు, జగతి నుద్భవించిన రామ - చంద్ర విభుఁడు.

సీ॥ నీలనీరద మొండు - నీరజ ద్వయముతో, విలసిల్లుచున్నట్టి - పోలుపుదోఁపఁ
జక్కటి తా శిల్ప - చాతుర్యమున నొందె, నవయవ స్ఫూర్తి నా - నతిశయిల్లఁ
జీఁకటి ప్రమాఁకునఁ - జెలఁగు తీవియవోలె, బలు విల్లెడమకేల - వెలయుచుండ
క్షత్రియధర్మంబు - సచ్ఛీలమార్గంబు, క్రమపడ నిల్వంగఁ - గాంతుసేసి

తే॥ ధారణికి దిగినట్టి సౌం - దర్యరాశి, సుగుణరాశి తేజోరాశి - సుకృతరాశి
రామభద్రుని గన్నులా - రంగఁ గాంచి, యేమిచేసితి వని వాలి - యిట్టు లనియె. ౮౨

## వాలి శ్రీరాముని నిందించుట.

ఉ॥ సత్యము నాభి జాత్యమును - చక్కటిఁ గావఁగఁగోరి ప్రాణ సాం
గత్యము వీడు పుణ్యకరు - ణానిధి పంక్తిరథేశు పట్టి వీ

వత్యమలాఢ్యుఁడౌ భరతు - నన్నవుగా జనియించితే! స్వఫుల్
సత్యము మీఱి ధర్మ మనఁ - జాలుదురే యధికార గర్వులై?
చ॥ కులము బలంబు విద్యయు న - కుంఠిత శౌర్యము లోకరక్షణా
కలిత మహాశయంబు నధి - కారము శీలము నీదు సొత్తులై
వెలయఁగ నన్నియుం దెలిసి - యేటిఁడికై వడి నీగుణాలి ని
ష్ఫల మగునట్లు పీడుపడి - పల్లటమై చనఁజేయ నొప్పునే?. ౨౯౫
చ॥ ఇలఁగల రాజధర్మము ది - నేశ కులాఢ్యుల సొత్తుకాదె? ని
ర్మలగుణ ప్రాణతుల్యయును - మైథిలు పెంచిన రాజహంసి వే
ల్పులమెరవోలె సభ్రమముగఁ - బొందిన జానకిఁ బాయు మీఁద నీ
వలసిన కార్యపాళి తడఁ - బడ్డది యేమొ యపేక్ష్య సుందరా!. ౨౯౬
చ॥ దనుజులు కీడుసేయఁ గృప - దప్పి కపీంద్రుని త్రుంపుమంచు నా
మనువు వచించెనేమి? మతి - మాలి దయాగుణ మేడవీడి తీ
యనువున నన్ను చంపుటకు - నారసి తెయ్యది యొగ్గు? నీవ యి
వ్వని యొనరింప సద్యశము - బ్రాఁతిగ నేరు భరించువారలో?. ౨౯౭
మ॥ కరుణావార్ధి! చతుస్సముద్ర పరిఖాం - కంబైన యీధాత్రిపైఁ
బరుగుల్ వాలు ప్లవంగరాజికై కలి - ప్రారంభ మిట్లయ్యెనే?
వరశీలాదులు దుర్బలావళికై యే - ర్పాటయ్యెఁ గాఁబోలు! భూ
వరు లెగ్గాసిన నిందగాక యశముల్ - బ్రాప్తించునే రాఘవా!. ౨౯౮
శా॥ నాటం జేసితి వొక్క చిత్రమొగి నా - నంనంబునం దంఘ్రి యా
పాటన్ రాజ్యమునీయఁ దమ్మునకు స - ర్వంబిచ్చి యామీఁద నీ
కాటన్ జేసితి వొక్క చిత్రమును వీఁ - కం బూని కిష్కింధకీ
చోటన్ దమ్మున కన్నఁ గూల్చి తిఁక నె - చ్చోఁ గల్గు నీ పద్ధతుల్?. ౨౯౯
ఉ॥ శాంతినిధీ! పరాక్రమ ని - శాలురు చేయు పనుల్ నుఁగంటిమిన్
సంతసగాఁగఁ దెల్పుఁగద! - సత్య సనాతన ధర్మపాళి కా
ద్యంతము నీవ కర్తవయి - యక్కట నామెడఁ జేయు కార్య మి
ట్లింతలుగాఁగ, రావణుని - యొగ్గులు వల్క నెడంబు గల్గునే?. 300
చ॥ ఇరువురు పోరుచుండ నమ - హ్యార్తిన్నతి దూరముచేసి యొక్కరుం
గరుణను గాంచి వేఱొకని - గైతవ మొప్పఁగ డాఁగి క్రూరమా
శరమున రొమ్ముఁ జీల్చి వడిఁ - జంపుట ధర్మమొ? వేఱొకండొ? దు
ర్భరతర నిందకు న్మొలవో? - ప్రాజ్ఞులు మెచ్చని పక్షపాతమో?. ౩౦౧

ఉ॥ కాదిది విక్రమంబు విధి ♦ కాదు ఋజుత్వము కాదు ద్వేషముం
గాదు భవత్ప్రపాలిత జ ♦ గంబున నా తను వొక్క భారమే?
నీ దయివాఱు సత్కరుణ ♦ నీతియు మాని దురాకృతంబు పెం
పేద నొనర్చితేల? భువి ♦ నిట్టిది కూడునె నిన్నుబోటికిన్?. 30౨

చ॥ ఇహపర సౌఖ్య పద్ధతుల ♦ నెంచి సమ ప్రతిపత్తి నిల్చి వి
గ్రహములఁ దోలి యెల్లరక ♦ ఖండిత లాభము గూర్చు కార్య సం
గ్రహ మది ధర్మము ♦ న్నిలుపు కార్యముగాకిటు పక్షపాత ము
త్సహనము తోడఁ బూని విప ♦ థంబున మర్కటుఁ జంపు టెట్టిదో?. 303

ఉ॥ చింతిలఁజేసి నీసతిని ♦ చేకొని చన్న సురారిఁ జంప ని
శ్చింతయు నీని సాయము గ్ర ♦ హించితి నందువ యేని దొడ్డదా
దంతి శిరోంతరస్థ పిశి ♦ త గ్రహ లాలస కేసరిం గొనం
జింతిల కేన్గు కాల మృతిఁ ♦ జెందు శశంబును గోరు టెట్టిదో?. 30౪

తే॥ జగము వెలిఁగించు చల్లని ♦ చంద్రునంను, పుట్టుతోడఁ గలంకంబు ♦ పుట్టె ననుచు
రవికులంబునకును నిల్వ ♦ రంబుగాఁగ, నిలుపఁ బోలుఁ గాలుష్యంబు ♦ నీవు పుట్టి. 30౫

తే॥ ఒకఁడు పోరున కహమహ మి♦కను పిలువ, వచ్చు నను డాఁగి కూల్చి త♦ర్వాత నిచటఁ
దక్కువారి యెదుట నాన ♦ దడవకుండ, నిక్కి మగసంగముంబలె ♦ నిలిచితేమి?. 30౬

తే॥ శాస్త్రధర్మముల్ కులవృద్ధ ♦ చరితములును, శీలమును పూని నీవు ర ♦ క్షింపలేక
వాలిఁగూల్చి తంతియ కాదు ♦ ప్రాభవంపు, ధర్మ మర్యాద చెఱిచితి ♦ దారుణముగ.

ఉ॥ నీదగు ధర్మపత్ని నొక ♦ నీచుఁడు దొంగిల మాఱుచేఁత నిం
పాదిగఁ జేయ కిట్టు లన ♦ యంబు నొనర్చితి నీశరంబు దు
ష్టాదముకాదొ? నీవిల శ ♦ రాసన విద్యల నారితేఱుటల్
మోదముతో నిరాయుధుల ♦ ముచ్చుగ నేయుటకా? వచింపుమా. 30౮

తే॥ పండ్లు పటపటఁ గొఱుకుచుఁ♦బ్రజ్వరిల్లు, కనుల మిడుఁగుఱు లురలఁగాఁ♦గఠినవాక్కు
లిట్టులాడు వాలిని గని ♦ యెదుట నిలుచు, వీరుఁడగు రాముఁ డనియె నీ♦విధముగాఁగ

## శ్రీరాముఁడు వాలి కుత్తర మిచ్చుట.

సీ॥ మాయావి వెన్నాడి ♦ మడియింప బిలమున, కొంటిమై యేగి రా ♦ కునికిఁ జేసి
యీవు పోయిన త్రోవ ♦ నేగ సంసిద్ధుఁడౌ, సుగ్రీవుఁ గని బుధుల్ ♦ చుట్టములును
రాజవు గమ్మని ♦ ప్రార్థింప వినక జ్యే, ష్ఠుని చంపు దుష్టుని ♦ తునిమి పిదప
నేనును చచ్చెద ♦ నింతియ యన్నకుఁ, దరువాత రాజ్యంబుఁ ♦ దాల్చ నవిన

తే॥ వారు ప్రార్థేయపడుచు ని ♦ ర్బంధపఱచి, నిష్కలంకుని సుగ్రీవు ♦ నియత చరితుఁ
బిలుచుకొని పోవఁగా మాఱు ♦ పలుకలేక, తుదకు నేలిక కాలంబు ♦ ద్రోచుచుండ.

సీ॥ మాయావి మాయించి ♦ మరలి వచ్చిన నిన్ను, గని సంతసమున వం ♦ దనమొనర్చి
బలిముఖుల్ ప్రార్థించి ♦ బలవంతమునఁ గట్టు, నీరాజ్య మిదియని ♦ నీకు నొసఁగి
నిర్మమత్వంబున ♦ నిన్ను వేఁడినవాని, యెడఁ దప్పులేదని ♦ యెఱుఁగు పిదప
శరణు బాధింపకు ♦ కరుణఁ జూడుమ యను, తమ్మునిపై నీవు ♦ దయను వీడి

తే॥ మన్ననలు గోర మానక ♦ మండిపడుచుఁ, ద్రుంపఁ బూనితి వంత జి ♦ తోస్మి యనుచుఁ
నిటల తట ఘటితాంజలి ♦ పుటుఁడు నగుచుఁ, గాళ్లఁ బడి బతిమాలినఁ ♦ గావవైతి.

సీ॥ భయమొంది పరుగిడు ♦ వాఁడని యెఱిఁగియుఁ, గొంచెమేనియు దయ ♦ యుంచవైతి
అవరజుం డగుఁగదా ♦ యనుచు నక్కటికంబు, పూనక తఱుముట ♦ మానవైతి
మునిశాపమున నీవు ♦ మొనయని గిరినెక్కు, దనుక వెన్నంటుట ♦ తప్పవైతి
పాఱువారల వెంటఁ ♦ బడుట శూరులకు గ, ర్హితమని సుంతయు ♦ నెంచవైతి

తే॥ ప్రేమకృత్యంబు లుత్తమ ♦ కృత్యములును, శౌర్యఫలితంబు ప్రాజ్ఞులు ♦ చదువుఫలము
నొకఁడు వలచిన సతిఁ గాచి ♦ యొసఁగు ఫలము, గాక వేఱొంటఁ గలుగునే ♦ గౌరవంబు?

చ॥ మదమున వీరధర్మమును ♦ మాలిచి దుర్బలుఁ గోపగించుటల్
సదయులు ధర్మదూరమని ♦ చాటుదు రొక్కపడంతి భర్తతో
ముదమున నుండ మానమును ♦ మూర్ఖత ద్రొల్చుట పాడి వీడుటే
గద! యిది గాన కీవు పలు ♦ కం గమకించెదె ధర్మి పోలికన్? ౩౧౩

తే॥ పొలుచు ధర్మంబు నైహికా ♦ ముష్మికంబు, లిట్టివని పరిశీలించి ♦ యెఱుఁగవైతి
వనుజు జీవితేశ్వరిని మ ♦ ర్యాదవీడి, పొందినాఁడ విదియు నీకు ♦ బుద్ధి యగునె? ౩౧౪

తే॥ ప్రాణ మిత్రుండు భానుపు ♦ త్రకుఁడు కాన, నిన్ను చంపితి సంబంధ ♦ మెన్న లేని
వారలైన దుర్బలులగు ♦ వారి సిలుఁగు, నీఁగఁజేయుటే నామనో ♦ నిశ్చయంబు.

క॥ అని సుందరుఁడగు సన్నుని, వినుతుండనఁ దగవుకాని ♦ వెడ పనులం జే
సిన వాలి యిట్టులను మా, కొసరవు నీ వాడు నీతు ♦ లొక్కటి యేనిన్. ౩౧౫

సీ॥ మా కులధర్మముల్ ♦ మేటి పతివ్రతా, ధర్మముల్ వానిని ♦ దవిలియుండు
వ్రీడాది గుణములు ♦ వెలయ నారులకగు, మాంగల్యధారణల్ ♦ మాకులేవు
స్వేచ్ఛావిధిగఁ గ్రీడ ♦ సేయుచుఁ దిరుగ వి, రించియే మాకు వి ♦ ధించినాఁడు
స్వేచ్ఛాప్రవర్తన ♦ మే గాని వేదోక్త, మార్గ సంచరణంబు ♦ మాకులేదు

తే॥ వంశ సంగతి వచ్చిన ♦ వర గుణములు, మాకు లేవు నేఁజేయు ప్ర ♦ మాద మెదియు
లేమ కనుమని గౌరవ ♦ శ్లిష్ట భణితిఁ, బలుకు వాలికి శ్రీరామ ♦ భద్రుఁ డనియె.

ఉ॥ మీరలు నిర్జరాంశముల ♦ మేదినిఁ బుట్టిన వార లింద్రియ
క్రూరవిశేష దోషములఁ ♦ గోరిక మీఱ నెఱింగి ప్రాక్తనా
చార నిగూఢ పద్ధతులఁ ♦ జక్కఁగ నేర్చిన వారలౌట నీ
ధారణిఁ బోల్పఁ దగ్గ మృగ ♦ ధర్మము నెందిన వార లౌదురే?. ౩౧౮

ఉ॥ హారముసేయువారు జయ ♦ హారము దాల్చినవారు మీర లి
ట్లారయ నింద్రియాళి గల ♦ యంగికిఁ జేరు నె ధర్మ మార్గముల్
తీరు పరీక్షచేసి కడ ♦ తేఱిన తెల్వికిఁ జెందుఁగాక యీ
గౌరవ పద్ధతుల్ దెలిసి ♦ కాని పనుల్ నొనరింపఁ బోలునే?. ౩౧౯

చ॥ మకరము వట్టి లాగ విడు ♦ మార్గము గానక చక్రహస్త! నా
వికలత మాన్పవే యనుచు ♦ వేఁడిన జ్ఞానఫలంబుచేతనే
యకలుష ముక్తి యుగ్మకము ♦ నందిన యా గజరాజుకూడ మీ
మెకముల జాతి యాతఁడె స ♦ మీక్షణ సేయుము శక్రనందనా!. ౩౨౦

ఉ॥ సంతత ధర్మవృత్తిఁ జన ♦ సమ్మతుఁడౌటనుగాదె జానకీ
చింతను తీర్పఁ బూని విల ♦ సిల్లెడు సాహస ధైర్య శౌర్య వి
క్రాంతులఁ జూపి యాపనికిఁ ♦ బ్రాణము లిచ్చిన పెద్దతండ్రి నా
వంత యెఱుంగకుందువె జ ♦ టాయువు నాతఁడు గృధ్రరాజెకా! ౩౨౧

చ॥ పరువున మంచిచెడ్డల స్వ ♦ భావ మెఱుంగు విమర్శన స్థితిం
బొరయక సంచరించుటయె ♦ మూర్ఖ మృగాదిక లక్షణంబు నీ
వరయుని ధర్మపద్ధతు లి ♦ హంబున లేవని నీ వచస్సులే
విరివిగఁ జాటుచుండ నిఁక ♦ వేఱేఁడి చందము లేల యాడఁగన్?. ౩౨౨

తే॥ ఇదియ తగు నిది తగదని ♦ యెఱిఁగి నీతి, పద్ధతిని నడవని వారిఁ ♦ బశువు లండ్రు
పశువులే యైన సద్ధర్మ ♦ పద్ధతిఁ జన, వేల్పు సమము లౌనని ధర్మ ♦ విజ్ఞు లండ్రు. ౩౨౩

క॥ కాలునకుఁ గాలుఁడగు శ్రీ, కాలగళుం గొలిచి ఫలము ♦ గంటివి విజయ
శ్రీలం జెలఁగితి కొంటివి, నాలుగు భూతముల బలము ♦ నయ మెఱుఁగవొకో? ౩౨౪

తే॥ దోషులందును నిమ్నులం ♦ దును గలారు, ధర్మమార్గంబుఁ దప్పక ♦ తరలు వారు
మునులయందును దేవతా ♦ జనులయందుఁ, జెడుగు నొనరించిచింతించు ♦ జడులుగలరు

చ॥ అరయ యథార్థ మిక్కరణి ♦ యాటఁ గులీనుల కేని యేరికే
సరవడి మేలు కీడులు స్వ ♦ యంకృత కర్మలఁ బట్టి వచ్చు టీ
వరసియు గర్వబుద్ధిని ప ♦ రాంగన శీలము పాడుచేసి తి
ట్లరసిన మూఢచిత్తు లెవ ♦ రైనను నీవలెఁ గానవత్తురే?. ౩౨౬

చ॥ అని తగు తెల్వి యబ్బు నటు ♦ లాడిన మాటల నాలకించి రా
మునిగని వాలి యిట్లను స ♦ ముద్ధతి యుద్ధము సేయువేళ నేఁ
గన సముఖమ్ము నన్నిలిచి ♦ కాండము నేయక డాఁగి యేయు టే
లన విని లక్ష్మణుండు సము ♦ దంచిత రీతి వచించె వాలితో. 3०८

ఉ॥ నీయనుజుండు తొల్త గుణ ♦ నీరనిధిన్ శరణంబు వేఁడ న
బ్జాయతనేత్రుఁ డంత నెఱి ♦ యాఁచిన నిన్ను కృతాంతు ప్రోలికిన్
బాయక పంపువాఁడ నని ♦ బాస యొనర్చెను గాన నీ పోరిలో
నాయన గాంతు నేని శర ♦ ణందువొ యంచు మఱింగె నివ్విధిన్. 3౦౯

ఉ॥ బాల్యమునుండి సజ్జనుల ♦ పజ్జ శ్రుతి స్మృతి మార్గరీతి సా
కల్యము విన్నవాఁడగుటఁ ♦ గంజహితాన్వయుఁ డాడు వాక్యముల్
కల్యము లౌట సమ్మతిని ♦ గైకొని రామ విభుండు ధర్మ వై
కల్యము సేయఁ డంచుఁ గపి ♦ కాంతుఁడు మూర్ధము వంచి యిట్లనున్. 3౧౯

వాలి శ్రీరాముని క్షమింప వేఁడుట.

ఉ॥ తల్లిని పోలి జీవక వి ♦ తానము పట్లను వత్సలత్వముం
గొల్లగఁ బూని ధర్మము న ♦ కుంఠిత వీర్యము సద్గుణావళుల్
చెల్లిన నీవు ధర్మపరి ♦ శీలన దృష్టిని చూడ దోషముల్
పెల్లుగ నుండవే? నెనరు ♦ పేర్మి క్షమింపుము రాక్షసాంతకా! 33०

చ॥ తెలియని కోఁతియంచు మదిఁ ♦ దేల్చి వెలార్చిన నావచస్సులం
దలఁపకుమయ్య! చింతలిడు ♦ దారుణ జన్మ రుగౌషధంబు నీ
సలలిత నామమే కద! వి ♦ శంకటవృత్తి శరంబు నేసి నా
కలఁకను పాపి జ్ఞానమను ♦ కంటి నొసంగితి మోక్షదాయకా! 33౧

సీ॥ ముమ్మూర్తులీవె త ♦ న్మూలంబు నీవె పా, పంబును నీవె పు ♦ ణ్యంబు నీవె
శత్రుత్వమును నీవె ♦ మిత్రత్వ మీవె యౌ, దాసీన్య మీవె కృ ♦ త్స్నంబు నీవె
త్రిపురారి మున్నగు ♦ దేవత లిచ్చిన,వరములు విఫలమౌ ♦ కరణి జూసి
యకలంక దార్ఢ్యవ ♦ రాక్రమోపేత వ, క్షముఁ దొలచేసి ప్రా ♦ ణములఁ గ్రోలి

తే॥ నట్టి నీతూపు ధర్మంబ ♦ యరమరేల?, హరుఁడు కొల్చిన వారికి ♦ వరములీగి
నీ లసన్నామ సంస్తుతి ♦ నియతి గాదె?, యట్టి నిను గంటి మోక్షంబు ♦ నందుకొంటి.

సీ॥ చరములు నీవ య ♦ చరములు నీవ స్థి, రములు నీవ య ♦ స్థిరము లీవ
ఋతువులు నీవ యా ♦ ఋతుఫలంబులు నీవ, విరులందు వాసన ♦ వెలయు లీల
సర్వవస్తువులందు ♦ సమరీతి నుందువం, తర్భూతమగుచు స ♦ త్యప్రకాశ!
నీవిట్టి వాఁడని ♦ నీగుణాలివియని, నాజ్ఞానమే యిప్డు ♦ నాకుఁ దెలిపె

తే॥ కాన నక్షయలోక సు ♦ ఖంబు లరుదె?, నన్ను వెన్నంటు కర్మముల్ ♦ నిన్ను గాంచు
వఱకె కద! నీదు దండంబు ♦ వలనఁ బాసె, నాయఘంబులు నుతిపాత్ర! నలిననేత్ర!333

చ॥ అనుజుఁడు నన్ను చంపుటకు ♦ నై నిను దోడ్కొని వచ్చి యల్ప చిం
తనము గలట్టి వాసర మ ♦ తంబున నిష్ఫల రాజ్య భారముల్
బొనుపుగఁ బొంది నాకుఁ బరి ♦ పూర్తిగ శాశ్వత మోక్షరాజ్యముల్
దనియఁగ నిచ్చె నింతకును ♦ తమ్ముని మేలు మఱొండు గల్గునే?. 334

ఉ॥ సేవకుఁడైన యేనొకటి ♦ చిత్తమునం దలపోసి వేఁడెదన్
నావలె నాదుతమ్ముఁ డొక ♦ నాఁడు మధుద్రవ మాని మందుఁడై
కావర మందునేని నను ♦ గ్రచ్చఱ నేసిన నారసంబు సు
గ్రీవునిపై వడిం గినిసి ♦ కీడ్పడ నేయకుమయ్య! రాఘవా! 335

చ॥ మఱియొకమాట రామ విను ♦ మా! రవినందనుఁ గాంచి నీదు సో
దరు లొకవేళ నేలికయి ♦ తక్కక భ్రాతృవధంబు సేయు ము
ష్కరుఁడని యాడిరేని తగు ♦ చందము కాదని మందలింపు నీ
వరములు పూర్తిచేసి తిఁక ♦ వాఁడును తప్పి చరింపనేర్చునే? 336

ఉ॥ వేఱొకమేలు నీకు నొద ♦ వింపఁగ లేను దశాస్యుఁబట్టి వా
లూరక గట్టిగాఁ దిగిచి ♦ లూమముతోఁ గొనితెచ్చి నీకు డై
వాఱఁగఁ గాన్కగా నిడెదు ♦ భాగ్యము నోచకయుంటి నన్నిటన్
దేఱిన వాయుపుత్త్రుఁడు సు ♦ ధీమణి చాలిన బంటు నీకగున్. 337

ఉ॥ శూరుఁడు సద్గుణాకరుఁడు ♦ సూనృతవాది మహాశయుండు సా
మీరి భవత్కరం బధిగ ♦ మించిన బాణముగాఁ దలంపుమా
సూర కుమారు నీయవర ♦ జుంబలెఁ గాంచుము వీరిఁబోలె నీ
కేరును దోడ్పడం దగు మ ♦ హిష్ఠ బలాఢ్యులు లేరు భూస్థలిన్. 338

శా॥ వీరింగొంచు సమస్తదేశముల న ♦ న్వేషించి నీ జానకిం
దేరం గాంచుమ యుంచుఁ బల్కి యనుజున్ ♦ దీర్ఘంబులౌ బాహులం
జేరం దీసి కుమార! నీకు నుపదే ♦ శింపంగఁ దగ్గట్టి మే
లారం దెల్పెద నాకునై వగవ రా ♦ దయ్యా! సుధీంద్రోత్తమా!. 339

మ॥ వరవేదంబులు ధర్మశాస్త్రములు స ♦ ర్వంబున్ దపోధన్యులున్
పరమేష్ఠ్యాదులు తక్కువారలును సం ♦ భావించి వ్రాకుచ్చు నా
పరమేశుండె కడంక ధర్మమును ని ♦ ల్పంగోరియే శత్రు సం
హారణ క్రీడన లాలనంబయిన యి♦ష్వాసంబు చేఁ బాల్చుచున్. 340

దు॥ విజయంచేసెను రాముఁడై నిజము నా ♦ విజ్ఞప్తి లోనమ్ముమా
సుజనుల్ ముక్తికి రామనామమును సం ♦ శుద్ధాత్ములై నిత్యమున్
భజియింపం గలవారు నీవితని స ♦ త్త్వం బారయం గోర స
త్కృపమా లీలను నన్ను గూల్చుటయె సా ♦ ధ్యం బింక వేయేటికిన్. ౩౮౧

మ॥ అనివార్యంబగు దుష్టకార్యము లనం ♦ ఖ్యాకంబు మోసంబుతో
దినమున్ జేసెడివారలే యయిన ని ♦ ర్వేషంబుతో నైన రా
ముని యస్త్రాహతిఁ గూలువారు విలస ♦ న్ముక్తిన్ భజింత్రెప్పు డా
తని పాదాంబుజ సేవకావలికి ♦ ముక్తత్వంబు సందేహమే? ౩౮౨

మ॥ తన సత్కర్మలె తోడు రా జనికసా ♦ ధ్యంబెద్ది? చూడాడి తిం
దున నందుం గల సౌఖ్యజాలముల నెం ♦ దు న్నాన్యనత ల్లఘవీ
ఘన లక్ష్మీయుత వత్సు నాజ్ఞయె సదా ♦ కర్తవ్యమం చన్య చిం
తనము ల్మాని తలం ధరించి విలస ♦ ద్భాగ్యంబులం బొందుమీ. ౩౮౩

సీ॥ మౌర్ఖ్యంబు పెనుపారు ♦ మర్కటచేష్టలు, న్మత్తగుణంబు పూ ♦ ర్ణముగ విడిచి
శ్రీరామవిభుఁ డొన ♦ ర్చిన మహోపకృతి మ, నంబున నిడి సమ ♦ యంబు రాఁగఁ
బ్రాణంబులైన న ♦ ర్పణసేయ జాణఁగను, మంచిత గతి ప్రసా ♦ దించు నితని
యాజ్ఞానుసారంబ ♦ యఖిలకార్యంబులు, జరపి దుర్లభ పున ♦ ర్జన్మ రహిత
తే॥ పదవి నొందుము తుచ్ఛమా ♦ ప్రాభవంబు, గలిగె ననుచు నుపేక్షింపఁ ♦ గడఁగకయ్య
నెరసు లొనరినఁ గృపను మ ♦ న్నింపరయ్య, నృపులు ప్రజ్వలితాగ్ని స ♦ న్నిభులు తండ్రి!

చ॥ అని హితవాక్యముల్ పలికి ♦ యవ్వల రాఘవుఁగాంచి సత్ప్రభూ!
యినజుఁడు రక్షితవ్యుఁడు ప ♦ ఱుంబయిఁ దెల్పఁగనేల? యంచు కే
ల్మోనసి నమస్కరించి రవి ♦ పుత్త్రుని గన్గొని తోడితెమ్ము నీ
తనయుని నంగదాఖ్యు ననఁ ♦ దత్త్రుటిఁ దోడ్కొని వచ్చె నాతఁడున్. ౩౮౪

తే॥ అంగద మటన్నఁ డెఱుఁగని ♦ యంగదుండు, నిండు నెలవోలె వచ్చి క ♦ న్పించి యచట
మృదుల సుమశయ్యగా శస్త్ర ♦ నదమునందు, గాసి పొందిన తండ్రిని ♦ కనులఁగాంచె

## అంగదవిలాపము.

సీ॥ రవినిభ కుండల ♦ రాజద్వరాంగద, సంగత భుజుఁడగు ♦ నంగదుండు
ప్రాణపదంబయి ♦ క్రాలు తండ్రినిగాంచి, కన్నుల బాష్పర ♦ క్తమ్ము దొరుఁగ
ననువు దప్పి పడిన ♦ యబ్జ బింబంబుపైఁ, బడునొక నక్షత్ర ♦ భాతిఁ బడుచు
హాతండ్రి! నిను గని ♦ యడలక మృత్యువు, డాసెనే? దాని న ♦ డంపఁ దరమె?
తే॥ వాఙ్మనః కర్మపాళి నే ♦ ప్రాణికేని, యెట్టి కీడొనర్పని నీకు ♦ నిట్టిపాటు
లైనసె నేమని పల్కుదు? నెందుచొత్తు?, నపజయ విదూర! వీర భ ♦ ద్రావతార!,

సీ॥ మేకులిడినయట్లు ♦ మేకొని దిక్కుల, మోయు గజంబుల ♦ మొనసి గెలుచు
రావణు హృదయంబు ♦ లావైన యూఁదొక, వాటమై యందమా ♦ వాలుఁ దలఁచు
నపుడెల్లఁ దటతట ♦ సదరు నీ మీఁదట, వాని భయంబును ♦ వదలిపోయెఁ
జక్ర వాళముఁ గుల ♦ శైలనుల్ నీపాద, హతిఁగల్గు దద్దరు ♦ లందవింక

తే॥ సురలు ప్రార్థించిరేని నీ ♦ కరణి జలధిఁ, జిలికి యమృతంబు నిచ్చువా♦రలును గలరె?
యమరులైరి వారలు నీవో♦హతుఁడవైతి, హరపదాబ్జాత శీర్షాంక! యగచరేంద్ర!.

తే॥ పలువిధముల నంగదుఁడిట్లు ♦ పనవుచుండ, వత్స!దుఃఖమొందకుమని ♦ వాలియలమి
నాయనా!చూడు మీ జగ ♦ న్నాయకుండు, చేయు పుణ్యఫలంబిది ♦ చిన్నితనయ!.

చ॥ జగతిని దేహధారులకుఁ ♦ జావును పుట్టువు నీడకుండు నా
యగణిత పూర్వ పుణ్య ఫల ♦ మయ్యది యిట్లు రణాంగణంబునం
దెగడని మంచి చావును వి ♦ ధించె జగంబుల సాక్షిభూతుఁడై
నెగడిన రామమూర్తి కరు ♦ ణించెఁ దనంతన వచ్చి మోక్షముల్. ౩౫౦

చ॥ జనకుఁడనైన నా ♦ పలుకు ♦ జార్చ కనుత్తమ మద్వితీయముల్
ఘనమగు తత్త్వమిట్లు పద ♦ కంజము ధారణి సోకఁగా శరా
సనమును కేలఁబూని మను ♦ జత్వముఁ దాలిచి కన్నుదోయికిం
గనఁబడుచున్న దిందు పుల ♦ కంబులు గ్రమ్మ నమస్కరింపుమా. ౩౫౧

మ॥ భవరోగంబులఁ బాపు నౌ ♦ షధము నా ♦ ప్రాణంబులందీసె నం
చవహేళం గమనింపకన్న! రఘురా ♦ మాజ్ఞను సారంబుగా
బవరం బబ్బిన నీవుఁ దోడ్పడుము స ♦ ద్భక్తిం దదీయాంఘ్రియు
గ్మవనేజంబుల శీర్షమం దిడుము స ♦ త్కల్యాణముల్ నీకగుఁ. ౩౫౨

మ॥ అని యీరీతి హితంబు పల్కి తన య ♦ వ్యామోహ మేపారఁ బు
త్రుని గాఢంబుగఁ గౌఁగిలించి రఘు వ ♦ ర్యుం గాంచి యీ నా సుతుం
దనుజౌఘంబును తూల భారములకుం ♦ దావాగ్ని నా నొప్పు వా
నిని రక్షింపుము నీదు భారమిది స ♦ న్నిశ్చింతుఁ గావింపుమా. ౩౫౩

మ॥ అనుచుం బుత్త్రుని రాముకేల ముద మే ♦ పారంగ నర్పింప వాఁ
డును శ్రీరామ పదాంబుజంబులకుఁ దో ♦ డ్తో మ్రొక్క లోకేశుఁడుం
దన ఖడ్గంబు ననుగ్రహించి శుభహ ♦ స్తం బుత్తమాంగంబుపై
నునిచెం వాలియు నెమ్మదింగొనియె దే ♦ హౌఘంబు లగ్గింపఁగం.

ఉ॥ అంతట వాలి యూర్ధ్వగతి ♦ నందఁ గరంబుల పట్టువీడ శ్రీ
కాంతుని సాయకం బురము ♦ గాఁడి పతిం బుపిఁజొచ్చి యాయుధ

స్వాంతములోనఁ దోఁగి గగ ♦ నంబున దివ్యుల కల్పహారముల్
సంతనఁదాల్చి రాఘవు ని ♦ షంగముఁ జేరఁగ వచ్చెఁ గ్రమ్మఱన్. ౩౫౫

ఉపట్టాభిషేకపటలము. (౫౪)

ఉ॥ వాలి మృతిం భజింప రఘు ♦ వర్యుఁ డపార కృపా రసాంబుధిన్
దేలుచు మోక్షు మిచ్చి తన ♦ దివ్యకరంబుల భాను పుత్త్రికిన్
వాలి కుమారుఁ గొంచు నొక ♦ వంకకు నేగఁ గపీంద్రు దార య
వ్వాలి మరించు వార్త విని ♦ వచ్చి యెఱుంగెను వాని మేనిపై ౩౫౬

మ॥ కొప్పురుల్ తీరిన కొండ కొమ్ము౹ుకురం ♦ గుల్ గూర్చు పాలిండ్లపై
నపుడే వెల్వడు నేత్రు కుంకుమ రస ♦ వ్యాప్తిం బ్రసాదింపఁగాఁ
దిపురు ల్గట్టిన ముంగురుల్ రుధిర దీ ♦ ప్తిం బొంద శాఖాచరా
ధిపు వక్షంబున వ్రాలెఁ దార పెను సం ♦ దేహ మించు చందంబునన్. ౩౫౭

సీ॥ అవ్యక్తమధుర వీ ♦ ణాదిక రవముల, రహిఁ దీల్చు కంఠస్వ ♦ రంబుతోడ
నేక మనస్కయై ♦ యింకఁ దపించు గ, ద్గదికతో నిట్టూర్పు ♦ గాడ్పుతోడ
రక్త పంకిల శరీ ♦ రంబుతో నేత్రముల్, వర దెడు కన్నీటి ♦ వఱదతోడఁ
గనువారి గుండియల్ ♦ కరఁచి నీరుగఁ జేయు, కరుణంబు నించు వా♦క్యములతోడ

తే॥ నధిపు మస్తక ముత్సంగ ♦ మందు చేర్చి, దీర్ఘకుంతల జాలంబు♦తివిరి కప్పు
మొగులులోని విభాకరు♦ మొగినిదోఁచు, మోము గని తార యిట్లు బి♦మ్మఁచును వగచె

శా॥ నాజీవంబ! మనోధనంబ! గుణమా! నాపాలి సర్వస్వమా!
తేజస్స్ఫూర్జిత బాహు పంజరమునన్ ♦ దీపించి యేనాఁడు నే
యోజన్ దుఃఖము లెట్టివో యెఱుఁగకే ♦ యున్నట్టి యేనిప్పు డీ
నీ శోకం గనఁ జాలకుంటిఁ గద మ ♦ న్నీఁడా! భయం బయ్యెడిన్. ౩౫౮

మ॥ అనుకూలప్రియ జీవితేశ్వర! భవ ♦ ద్వ్యత్యస్త ఘోరస్థితిన్
దనుకం గాంచియుఁ బ్రాణముల్ విడని దై ♦ త్యన్ ప్రేమతోఁ బిల్వవా?
నను దుఃఖంబుల పాలు చేసిన నిధీ ♦ నాజీవముల్ పోవఁగాఁ
దనుపీ మేదిని నిల్చునే? యొకటి చే ♦ తన్ రెండు గావించితే?

శా॥ ప్రాణంబుల్ గొనిపోవుకాలునకు ముక్ ♦ వారాన్నిధిం బ్రచ్చి గీ
ర్వాణ స్తోమముతోడ నీయవె సుధా ♦ ద్రవ్యంబు? నీవేళ నీ
ప్రాణంబుల్ హరియించి కొంటకును నం ♦ భావించెనే తాను? మ
త్ప్రాణేశా! జముఁ డింతలో మఱచెఁ గ్రూ ♦ రస్వాంతుఁడై శ్రేయముల్

మ॥ కకుబంతంబుల కేగి దివ్యసుమముల్ ♦ గైకొంచు సామేన నం
బికఁ బ్రేమంబునఁ దాల్చినట్టి హారము ♦ ♦ వ్వేళన్ వినిశ్చించలం

బకలంకంబగు భక్తిఁగొల్తు వది నే ♦ డాలస్యముం జేసి యూ
రక యిట్లుండుట పాడియే? దనుజ స ♦ మ్రాడ్గర్వ విధ్వంసనా!. ౩౬౨

చ॥ వర సుమతల్పమందు మృదు ♦ వస్త్రముపైఁ బవళించు నీవు నేఁ
డిరవుగ వట్టి నేలపయి ♦ నెడ్డియవోలెఁ బరుంటఁ గాంచి దు
ర్భరమగు దుఃఖ తాపముల ♦ వ్రాలుచు నేడ్చెదు నన్నుగాంచి యొ
ప్పరికము సేయునంత యుప ♦ పాడి యొనర్చితినేమి నాయకా! ౩౬౩

ఉ॥ ఇచ్చట నిన్నుపాసి తపి ♦ యించుచు నుండఁగ నన్ను వీడి నీ
వచ్చట స్వర్గలోకసుఖ ♦ మందుచు సంతసిలంగ న్యాయమే?
నచ్చిక మీఱఁ బల్కితివి ♦ నా వర జీవము నీవయంచు నా
పొచ్చెములేని పల్కుపుడు ♦ పొల్లుగ నేల చరింతు వల్లభా!. ౩౬౪

ఉ॥ నీమది నే వసించుటలు ♦ నిక్కమయేని రిపుప్రకాండ మీ
భూమిని నన్నుగూడఁ బొరి ♦ పుచ్చిరొ యుండును గాదె? నీవిటుల్
నామనమందునుండినను ♦ నావలె జీవముతోడ నుందు వి
ప్లేమొకొ రెండు పద్ధతులు ♦ నేర్పడఁ గల్లయ యయ్యె వల్లభా! ౩౬౫

ఉ॥ నీదయచేత నెల్లరము ♦ నిశ్చల జీవిత మొందినార మ
య్యా! దరిఁ జేర్చితంచు విబు ♦ ధాళి కృతజ్ఞత చూపి నిన్ను నా
మోదముతో నెదుర్కొని ప్ర ♦ ఫుల్ల నిలింప మహీజపుష్పముల్
సాదరవృత్తిఁ జల్లుచును ♦ స్వాగతమిచ్చిరె నీకు వల్లభా!. ౩౬౬

చ॥ కలశపయోధిఁ ద్రచ్చి తెఱ ♦ గంటులకున్ సుధయిచ్చు నీకు ని
మ్ముల వడి డాఁగి నీపయి న ♦ మోఘ శరం బొగి నేసినట్టి మై
థిలి హృదయేశ్వరుండె పని ♦ దెల్పి యొసంగఁగ నాజ్ఞయిచ్చుచోఁ
బలువకు నీదు తమ్మునకు ♦ భాగ్యము లన్నియు నీయకుందువే?. ౩౬౭

ఉ॥ తమ్మునితోడఁ బోరుటకుఁ ♦ దార్కొని యేగెడు వేళఁ గూడదం
చొమ్మిక దెల్పితిన్ రఘుకు ♦ లోత్తముఁ డన్నెము లాచరింపఁడం
చిమ్ముగఁ బల్కి నమ్మి యటు ♦ లేగి యుగాంతము చూడఁదగ్గ నీ
విమ్మెయిఁ గూలినాఁడ విక ♦ నెన్నఁడు నిన్ను గనంగ నయ్యెడిన్?. ౩౬౮

ఉ॥ నీవెదిరించి డీకొనిన ♦ నిగ్గగు కాంచన శైలమైన ను
గ్గైవడి రాలునన్న నొక ♦ యమ్మెదురై భవదీయ వక్షమున్
వావిరిఁ జీల్చివైచె నను ♦ పల్కుల నమ్మఁగఁజాల కుంటి ని
ట్లీవగఁ జచ్చియుండు ప్లవ ♦ గేశుఁడు వేఱొక వాలియేమొకో!. ౩౬౯

మ॥ తనయా! అంగద! నీపితృవ్యుఁడు తొలిన్ ♦ దా వాలి తమ్ముండనన్
ఘనసంపూజ్యత నొంది యిప్పుడు పగన్ ♦ గార్పణ్యముం బెంచి వా
లిని శ్రీరాము నమోఘ బాణమునఁ గూ ♦ ల్పించెం బ్రభుత్వంబుకై
మన సౌభాగ్య పవిత్ర జీవితము లి ♦ మ్మాడ్కి నశించెం గదా?. ౩౨౦

మ॥ పర కష్టంబుల నౌషధంబువలెఁ బా ♦ పం జాలు విల్కాఁడు తా
మరసాక్షుం డొక వీరుఁడేని యొనరిం ♦ పన్ రాని దుష్కార్యమున్
జరపెం; బెద్దలు వారివారి పనులే ♦ సద్రీతిఁ దద్యోగ్యతల్
ధరఁజూఁప న్నికషోపలంబు లను న ♦ ర్థం బెన్న వ్యర్థంబొకో!. ౨౨౧

తే॥ అనుచుఁ బరిపరివిధములఁ ♦ బనవి పనవి, సోలినట్టి సంభవమును ♦ చూచినీతి
మంతుఁడగు హనుమంతుఁడు ♦ మానవతిని, చెలులతోఁ గొనిపొమ్మని ♦ చెప్పిపంపి

తే॥ అవల వాలి మేనునకుఁ జే ♦ యంగఁదగిన, చరమ కర్మంబు లంగదు ♦ కరముమీఁద
గడకఁ జేయించి జరపిన ♦ కార్యమెల్ల, విన్నవించెను శ్రీరామ ♦ విభునియొద్ద. ౨౨౩

తే॥ దోషసమితి సమూలంబు♦ త్రుంగిపోవఁ, జెలఁగు నర్కుండు చరమాద్రిఁ♦జేరుచుండ
నతని బింబ మంతిమదశ ♦ నందినట్టి, యింద్రనందను మొగమట్టు ♦ లెఱ్ఱనయ్యె. ౩౨౪

తే॥ రవియుఁ గ్రుంకెను ధీరుఁడౌ ♦రామవిభుఁడు, సీతఁగూర్చి చింతించుచుఁ♦జెంతనొక్క
నెలఁప్రస న్వసియించి యా♦నిడుదరేయి, యనెడు కడలి నెట్లో యీఁది♦యొనసె దరిని

చ॥ తనయుఁడు నాఁడు రత్నసము ♦ దార కిరీటము దాల్చునంచుఁ ద
జ్జనకుఁడు చూడవచ్చె నను ♦ చక్కటి భానుఁడు వేగలేచి యా
పనికి రహించి తోడుపడు ♦ పంకజవాసిని వచ్చిచేర నె
ఱ్ఱని కరపాళితోఁ దెఱచె ♦ రాజిత పద్మ దళాంతరంబులన్. ౩౨౬

ఉ॥ అంతఁ గృపాసముద్రుఁడగు ♦ నర్కకులాగ్రణి యర్కసూతి క
త్యంత ముదంబుతోడఁ బ్లవ ♦ గాధిప పట్టము శాస్త్రపద్ధతుల్
సాంతముగా రహింప నెల ♦ సంబునఁ గట్టుమ యంచుఁ దెల్ప ధీ
మంతుఁడు లక్ష్మణుండు హను ♦ మంతుని గాంచి వచించెఁ గ్రచ్ఛలన్.

మ॥ అభిషేకం బొనరింపఁగా వలయు దీ ♦ వ్యద్భవ్య సామగ్రులన్
రభసం బారఁగ సేకరింపు మన న ♦ ర్వంబయ్యె సిద్ధంబుగా
నభిజి ద్వేళయు డాసె రండనిన మో ♦ దాత్ముండు సౌమిత్రి తా
నభిషేకం బొనరించె భానుజునకున్ ♦ బ్రాంచన్మణీ పీఠిపైన్. ౩౨౮

శా॥ కార్యంబుల్ క్రమరీతిఁ దాపసవరుల్ గా ♦ వింపఁగా దేవతా
వర్యుల్ కల్పకసూనముల్ ముదముతో ♦ వర్షింపఁగా వృద్ధులా

శౌర్యోక్తంబుగ నక్షతంబు లిడఁగా ♦ శీర్షంబునన్ శీర్షకం
బార్యశ్రేష్ఠుఁడు వెట్టె వానరుల క ♦ త్యానంద మాపాదిలన్. ౩౬౯

చ॥ అవలఁ గిరీటధారియగు ♦ నర్కసుతుండు కుతూహలుండు రా
ఘవ చరణారవిందముల ♦ గాఢసుభక్తి భజింప నాతఁడు
త్సవ మలరారఁగా నలమి ♦ సాదర మేదురమైన దీవనల్
తవిలి వచించి వెండియు ను ♦ దార వచస్సుధ లూర నిట్లనున్. ౩౭౦

### శ్రీరాముఁడు సుగ్రీవునకు రాజధర్మములు దెలుపుట.

సీ॥ కీశకులాధ్యక్ష! ♦ కిష్కింధకేగి నీ, కర్తవ్యములను చ ♦ క్కఁగ నెఱింగి
విధ్యుక్త విధులఁ గా ♦ వించుచు రాచకా, ర్యము లాచరింపు కొ ♦ అంతలేక
యంగదుతోఁ గూడి ♦ యానంద జీవిత, మనుభవింపుము పుట్టు ♦ సార్థకముగ
జ్ఞానధనాఢ్యులౌ ♦ సచివులతో వీర, వరులగు సైన్యాధి ♦ పతులతోడఁ
తే॥ పావనంబగు నెయ్యంబు ♦ పాటిలంగ, నలరి కలుషవిదూర కృ ♦ త్యములఁ బ్రేమ
నిలిపి ప్రజలకు నాశ్రయ ♦ ణీయుఁడవయి, శ్రీకరుఁడవై గభీరిమన్ ♦ వెలయుమయ్య.

సీ॥ ధూమంబుగలచోట ♦ ధూమధ్వజుండుండు, ననువాక్కులో సత్య ♦ మరయుమయ్య
శత్రుమిత్రులయెడ ♦ సమరీతి మధుర వా, క్యములఁ బ్రసన్నత ♦ నాడుమయ్య
అమరు లతిశయించి ♦ బ్రమియింపఁదగిన సం, పద్గౌరవంబుఁ గా ♦ పాడుమయ్య
ముల్లోకములయందు ♦ మూఁడు తెగలవారు, మునులకుం గలరని ♦ మనఁగదయ్య
తే॥ ఎవరి విషయంబునను క్రౌర్య ♦ మెంచకయ్య, దూషణము లాడినను చెవి ♦ దూర్పకయ్య
యుంచి వర్ణాశ్రమములఁ బా ♦ లించుమయ్య, దేవుఁడని ప్రజల్ దలఁప వ ♦ ర్తింపుమయ్య
తే॥ పరుల కుపకృతి సత్యవా ♦ క్పాలనంబు, పరులధనమునకై యాస ♦ పడమి యనెడు
పద్ధతులె జగమున గౌర ♦ వంబుగూర్చి, సద్గతిం జేర్చునవి యని ♦ జరగుమయ్య. ౩౭౩

ఉ॥ తక్కువవారటంచు ఘన ♦ దర్పముతో నెటువంటివారికిన్
జిక్కులు గూర్పఁగాఁదగదు ♦ చేటొనఁగూర్చును బాల్యచేష్టచే
నొక్క యవజ్ఞచేసికద ♦ యొందితి మంథరచేత నింతయున్
నిక్కము దీని నాత్మ గమ ♦ నించి చరింపుము మిత్రరత్నమా! ౩౭౪

ఉ॥ స్త్రీల నిమిత్తమే జనులు ♦ చేటుల నొందుదురన్న యర్థమున్
బోల నెఱుంగు మివ్విధము ♦ పూర్తిగ నియ్యెడ వాలిచేతలన్
దేలెను వారి మూలమున ♦ దీఱని దుఃఖజనాపవాదముల్
తేలికయున్ ఘటించు నని ♦ తేర్చితి మీయెడ నేల వేఱొకన్? ౩౭౫

చ॥ ఇతఁడొక నాయకుండె? మన ♦ కేడ్గడ తల్లియుఁ దండ్రి చుట్టమున్
హితుఁడును గాఁడె యంచు గణి ♦ యింపఁ బ్రజాహిత తత్పరుండవై

ధృతిగొని క్రూరకర్మలను ♦ తెక్కలి వారలఁబట్టి ధర్మ ప
ద్ధతి చెడకుండఁ గాచుటకు ♦ దండన చేసెదు గాక మిత్రమా!. ౩౮౬

చ॥ ఋజుమతిఁ జర్చచేయు నెడ ♦ నెక్కువ తక్కువ చావు పుట్టుకల్
ప్రజలకుఁ బూర్వకర్మములఁ ♦ బట్టియె వచ్చు నధర్మవృత్తు ల
య్యుజునకు నేని జీవిత మ ♦ హావధిఁ గ్రుంచును ధర్మవృత్త మ
క్కజముగఁ బెంచుచుండు నను ♦ గణ్యుల పల్కులు నమ్మ మిత్రమా!.

చ॥ కలిమియు లేమియుం గలుగఁ - గారణమానవి పుణ్యపాపముల్
బలితములంచుఁ బల్కుదురు ♦ ప్రాజ్ఞులు పెద్దగ నిశ్చయించి యా
కలిమికి హేతువైన శుభ ♦ కర్మ సమూహము నుజ్జగించి లే
ములఁ గలిగించు పాపములఁ ♦ బూని యొనర్చుట మెచ్చుచేతయే?. ౩౮౮

మ॥ నృపధర్మావళి యిట్టిదంచు మది ని ♦ర్ణీతిగా విచారించి స
త్కృపఁ బాలింపుము కీశరాజ్యమును; ప్రా ♦వృట్కాలమంతంబుగాఁ
గపిసంఘంబులతోడ నాయెడకు వీఁ ♦ కన్ రమ్ము పొమ్మన్న నం
తపడన్ భాస్కరసూతి యిట్టులను నీ ♦ తాహ్యాత్సరోజార్కుతోన్. ౩౮౯

శా॥ చెట్టుల్ చేమలు ద్రోణులున్ వెలయు కి - ష్కింధాద్రి కీశాలి కిం
బట్టా నంచొక పేరె గాని యరయన్ - స్వర్గంబుతో సామ్యముం
దొట్టున్ వైభవ సంపదావళులతో - దుఃఖమ్ములం దోలి మా
పుట్టుల్ ధన్యముగాఁగ సేవ గొనుమా - పుణ్యాత్మకా! వేఁడెదన్. ౩౯౦

చ॥ నిను శరణంబు గోరి మఱి - నీయనుకంపకు భాజనంబులై
నిను పెడఁబాసి భోగముల - నిచ్చలు గోరునె మా హృదబ్జముల్?
జనకజ రోయఁగా నదను - సంధిలు దాఁకఁ బ్లవంగ పట్టనం
బున వసియింపఁగా వలచి - ప్రొమొక్కెదు వార మనుగ్రహింపవే. ౩౯౧

చ॥ అనవుడు మందహాస రుచి ♦ రాననుఁడై రఘురాముఁ డిట్లనున్
వనములఁ జరించు సువ్రతులు ♦ పార్థివ భోగము లందఁజెల్లునే?
పనిగొని నీవు మమ్ము కడు ♦ భక్తి సపర్యలు సేయుచుండఁ బా
లనమున లోటు లేర్పడ వి ♦ లాతి నధర్మము రేకెత్తదే? ౩౯౨

ఉ॥ కానల సంచరింతునని ♦ కైక సమక్షమునందు పల్కితిం
గాన వసింప నొల్ల మహి ♦ కాంతుల కిమ్మగు రాజధానిలో
మానవతీలలామ యగు - మైథిలిలేమి నలంగు నాకు న
మ్మానిత సౌఖ్యముల్ గలవె ♦ తెమ్మెరలమందు తలంచిచూడుమా!. ౩౯౩

మ॥ తనదారన్ దనుజుల్ హరింప మదిఁ జిం ♦ తాలేశమున్ లేక య
బ్బిన రాజ్యోపభోగములంది స్నేహితులతో ♦ వేంచేసి యాతిథ్యముల్
గొనుచున్నాఁడని లోకు లాడుకొను వా ♦ క్కుల్ లోకమున్నంతదాఁ
కను దైవాఱక యంతరంబున నడం ♦ గం జాలునే మిత్రమా! ౩౯౪

మ॥ గృహిధర్మంబులు వీరధర్మములు మా ♦ రింబోవ నల్లాడు నే
మహి నెయ్యుండ్రను గూడి సౌఖ్యముల స ♦ మ్మానించుటల్ రోఁత; మ
ద్గృహిణిం గోల్పడ నేనుచేసిన సుదు ♦ ష్కృత్యంబు లింకంగ ని
స్స్పృహతోఁ దాపసధర్మవృత్తి వనులం ♦ జింతామతిం బూనెదన్ ౩౯౫

మ॥ పరిపాలింపఁగఁ దగ్గ కార్యముల సం ♦ భావించి రాజ్యంబుఁ ద
త్సరణిం జేయుచు నాల్గుమాసములు వే ♦ దాఁటన్ మహాసేనతో
వెరవారన్ నను గాంచ రమ్మదియు నా ♦ వేడ్కోలు సుమ్మంచు భా
స్కర వంశాంబుధి సోముఁడాడ మఱి ప ♦ ల్కన్ లేక సుగ్రీవుఁడున్. ౩౯౬

మ॥ కనులన్ బాష్పకణంబు లుబ్బి యురలం ♦ గా సత్త్వ నాజ్ఞానువ
ర్తనమే శ్రేయముగాఁ దలంచి తదభి ♦ ప్రాయంబు గుర్తించి యా
తని పాదంబు శిరంబుతోఁ దడవి చిం ♦ తావారిధి న్మగ్నలి
బ్బని గోల్పోయిన వానిలీల నడచెన్ ♦ వెన్కాడు పాదాలతోన్. ౩౯౭

ఉ॥ వాలికుమారుఁడుం గదిసి ♦ వారని భక్తి సమస్కరింప శ్రీ
లోలుఁడు ప్రేమతోఁ దిగిచి ♦ లోభి పసిండిని పోలెఁ జూచి స
చ్ఛీలుఁడ నాటకున్ జనకు ♦ చెన్నున నీపినతండ్రి నెంచి త
త్పాలనలో సహాయుఁడయి ♦ భాసిలుమా యని పల్కె యంతటన్. ౩౯౮

ఉ॥ పావనిఁ గాంచి నీవును వి ♦ భాకరసూతికిఁ దోడుగా వనా
టావని పాలనంబు నర ♦ యందగు నన్న నతండు దేవ! మీ
సేవకుఁ డిందయుండఁ గృప ♦ సేయుఁడు దాస్యము సేయుచుండు మీ
కేవిధమైన తక్కువల ♦ నేర్పడనీయక చూచువాఁడనన్. ౩౯౯

ఉ॥ రాముఁడుపల్కె గౌరవము ♦ ప్రాజ్ఞత పౌరుష మొందినట్టి రా
ట్సోముఁడు తాల్చియుండిన వ ♦ సుంధర వేఱొకరాజు పూన నోఁ
గాములు గల్గవచ్చు నటు ♦ గాన భవాదృశ బుద్ధిమంతులా
భూమిపు చెంతనున్నఁగద ♦ పోలఁగఁజెల్లును రాచకార్యముల్. ౪౦౦

శా॥ మాన్యుండైన దినేశసూనునకు స్వా ♦ మ్యంబైన ప్రాగ్భార రా
జన్యత్వంబు స్థిరంబుగా నిలిపి యా ♦ చందంబునన్ వచ్చి సౌ

జన్యస్ఫూర్తి వహించి నాదగు పనుల్ ♦ సాధింప నీకంటె నా
కన్యుల్లేరిపు డేను గోరిన విధం ♦ బారంగఁ గావింపుమా!. ౪౦౧

మ॥ అను శ్రీరాముని గాంచి మారుతియు మీ ♦ యాజ్ఞప్తి యిట్లైనచో
నన నేమున్నది కింకరుం డటులె నే ♦ యంగల్గు వాఁడంచుఁ ద
ద్ఘన పాదాబ్జములన్ భజించి కపులం ♦ గన్నొక కిష్కింధకుం
జనియెం బిమ్మట వేఱుకొండ కరిగెన్ ♦ సౌమిత్రితో రాముఁడున్. ౪౦౨

మ॥ ఇనవంశోద్భవునాజ్ఞఁ బూని కపిలో ♦ కేశుండు కిష్కింధకుం
జని భూభారముఁదాల్చి బాంధవ సుహృ ♦ త్సామంత సేనాపతుల్
తను గొల్వం జని మాతృభావమున నా ♦ తారం బ్రశంసించి వా
లిని డెందంబునఁ దండ్రిగాఁ దలఁచి పా ♦ లించెం గపివ్రాతమున్. ౪౦౩

శా॥ దిగ్రాజన్యమహోపభోగములతో ♦ దీపించు శాఖాచరుల్
వ్యగ్ర ప్రక్రియ బాంధవావళి లలిన్ ♦ భాసిల్ల నాజ్ఞావిధుల్
సుగ్రీవాజ్ఞ యటంచు నానుడిగ వి ♦ జ్ఞుల్ పేర్కొనం జేసె నా
సుగ్రీవప్రభుఁ డంగదుండును యువ ♦ క్షోణీశుఁడై యొప్పఁగన్. ౪౦౪

మ॥ వినుతుల్ సేయఁగ వీలుకాని గుణగం ♦ భీరుండు శ్రీరాముఁ డ
వ్వనముం దాఁటి మతంగమౌని నిలయ ♦ ప్రాంత ప్రదేశంబునన్
దన తమ్ముం డొనరించు పర్ణకుటిలోఁ ♦ దాత్పర్య సంయుక్తుఁడై
తన జాయం దలపోయుచుం జరపెఁ ద ♦ త్కాలంబు సౌమిత్రితోన్. ౪౦౫

౭. వర్షర్తు పటలము. (౧-౨౧)

ఉ॥ పుత్తడిబొమ్మ చందమునఁ ♦ బొల్పు బెడంగును మించు జానకిన్
దత్తఱపాటుతో వెదక ♦ దక్షిణ దిక్కునకున్ రఘూత్తముం
డత్తఱిఁ బంపినట్టి యొక ♦ యర్మిలి కాలరివోలె భాస్కరుం
డుత్తరదిక్కునుండి తగు ♦ నోజను వెల్వడె దక్షిణాశకున్. ౪౦౬

తే॥ నల్లమబ్బులు ధరయను ♦ మల్లకమున, వారిరాశియన్ నెయివోసి ♦ మేరువనెడు
వత్తిలోన భాస్వరుని దీ ♦ పము రగిల్చి, కాటుకం గొని పెట్టిన ♦ కరణిఁ దోఁచె. ౪౦౭

క॥ జీమూతంబుల వలనన్, వ్యోమము గరకంఠు కుతికఁ ♦ బోలి యధికమై
తామసి గప్పెను భాస్కర, ధామంబుల తైక్ష్ణ్యముడిగి ♦ ధర చల్లారెన్. ౪౦౮

శా॥ నీలాకాశము నంజు చందమున ము ♦ న్నిటింబలెన్ గాటుకం
బోలం దిద్దిన స్త్రీల కన్నులవలెన్ ♦ బొల్పారు కేశంబులం

బోలెన్ నంజుడు దిండ్ల దేహముల చా ♦ ద్పున్ బొంది తచ్చిత్రముం
బోలెం జేష్టలఁ బోలెఁ గారు మొగుళుల్ ♦ మూఁగెన్ జగంబంతటన్. ౪౯

మ॥ చిరకాలంబుగ వార్ధి తోయముల వా ♦ సిం గ్రోలు మేఘంబులన్
మెఱుపుల్ పుట్టెను సంగరస్థలి విజృం ♦ భింపన్ మదేభంబులన్
ఖర ఖడ్గంబుల వీర బృందములు ద్రవ ♦ క్కుల్ సేయఁగాఁ దోఁచు నె
త్తురుతోఁ గూడిన దుర్వ్రణంబులఁ గటుల్ ♦ తోఁపంగఁ జూపించె నాన్.

తే॥ కారుమొగుళులు భద్రేభ ♦ కాండమట్లు, గానిపించెఁ గరళ్లతోఁ ♦ గడలిపొంగి
గగనమెల్లను వ్యాపించి ♦ గర్జనంబు, లొనరఁజేయు విధంబున ♦ నుఱుమసాగె. ౫౧

తే॥ హరిహయాదుల భూషణో ♦ త్కరములట్లు, కరువలం దగ్ని తరువులఁ♦గాల్చినట్లు
నవ్యఘక్కి దిగ్దేవతల్ - నవ్వినట్లు, నింగి శంపా పరంపరల్ ♦ నెగడి మెఱసె. ౫౨

తే॥ గగనమను బొగ్గులను వడ ♦ గాలి యనెడి, తిత్తిచే నూఁది వడివడి ♦ దిక్కులనెడు
కమ్మరీంద్రుడు రగుల్ప నిం♦గలములుమియు, కొలిమియనఁనొప్పె మెఱుపుతో - జలదచయము

తే॥ పన్నగములు వియోగినుల్ - పరితపింప, నిన మయూఖముల్ గోసి పె - ట్టిన విధాన
నశని జిహ్వలో యన మిట్టి - యతిశయిల్లె, నిఖలదిక్కుల సౌదామినీ ప్రజంబు. ౫౪

తే॥ ఒనర విద్యాధరులు సమ - రోర్వియందు, రక్తసిక్త కరాసుల - రమణఁ ద్రిప్ప
రహిఁ బదచ్యుతులైన ది - గ్గాజదంతి, ఫాలపట్టికలట్లు శం - పాలి మెఱసె. ౫౫

చ॥ అవనిని మోయుచున్న భుజ - గాష్టక మష్టదిశాంతసీమలన్
దివిరి నభంబు నాకఁ బలు - తేపలు జిహ్వలు చాఁచెనో యనన్
నెవడెను చంచలాలతలు - నీరదముల్ వనజాక్షు మేను నా
మివులుచు నిశ్వసించె నన - మిక్కిలి వీచెను శీత వాయువుల్. ౫౬

ఉ॥ పల్లము మిట్ట నాక మఱి ♦ పైయవి క్రిందివి నాక వాన గా
డ్పల్లెడ వీవసాగెను మ ♦ హీధ్రములందును పట్టణంబులన్
బల్లెలఁ గానలన్; గుణము ♦ వంశము యోగ్యత లెక్క పెట్టకే
పల్లవు లిచ్చు రోయికయి ♦ పద్పుదు చాఁచు మనంబుకై వడిన్. ౫౭

తే॥ మగలనెడఁబాసి వెతఁజెందు♦చిగురుఁబోండ్ల, పొగులుకుచములమాంసపు♦ముద్దలనుచు
మ్రింగవచ్చు భూతంబు ల ♦నంగ నొప్పి, దారుణంబుగ నడరె నీఁ♦దరలు ధరణి. ౫౮

తే॥ ధూళిక్రమ్మి యాకసమునఁ ♦ దోఁచుకతన, మెఱుము లడిదంబులంబలె♦మెఱయుకతన
మొగులు మురజంబుకై వడి ♦ మొరయుకతన, గగన మయ్యెడ రణరంగ♦గతినిదోఁచె.

తే॥ జనకజం బాసికుందు దా ♦ శరథిమీఁద, మారుఁ డరవిరి శర పరం ♦ పరల నేసి
నట్లు సౌదామినులతోడి ♦ యంబుదములు, వర్షధారలఁ గురిసెను వసుధమీఁద. ౬౦

చ॥ అడవులఁ గొండలందు పడు ♦ నంబుదధారలు శక్రు వింటితో
విడిచిన బాణరాజివలె ♦ వేగముతోఁ బడె నందునుండి రా
ల్పిడుగులు రేలఁ గొండల వె ♦ లింగెడు మూలికలట్లు కాంతు లు
గ్గడువుగ వీచు రత్నముల ♦ కై వడి రోచులు వీచె నయ్యెడన్. ౪౨౧

ఉ॥ తోరపు వర్షధారలట - దొడ్డగు గుండ్లపయిం బడన్ సమి
ద్వీరులు శత్రుమత్తగజ ♦ బృందముపై నిగిడించు సీఁటెలన్
తీరున నుండె నాదరువు - తీఱఁ గరంగఁగ దొర్లు రాళ్లు త
ద్వారణముల్ రణస్థలి మ - దంబుఱఁ బొర్లిన పోల్కిఁ గన్పడెన్. ౪౨౨

ఉ॥ అంబుదముల్ రమాసుతుని - యందమునొందఁగ నింద్రచాప మా
శంబరవైరి చాపమను - చందము నందఁగ వర్షధార పు
ష్పాంబకలీల నొంద గిరు - లందలి సానువు లొప్పె మన్మథా
స్త్రంబుల నొచ్చి విచ్చుచుఁ గ - రంగు వియోగుల మేనులో యనన్.

చ॥ జలజహితాన్వయుల్ ప్రబల - శౌర్యులు కీశులు నొక్కటౌటచేఁ
బొలిసిరి రావణాదు లని - పూర్ణ ముదంబున వేల్పు లార్భటుల్
సలిపిన యట్లు మేఘములు - సందడి గర్జిలెఁ గల్ప సూనముల్
జలజల రాల్చు కైవడిని - జాఱెను దందడి వర్షబిందువుల్. ౪౨౩

తే॥ రావణుఁడు జానకిం గొని - రయము మీఱ, గగనవీథిని పోవుచోఁ - గలికి మిన్న
కనుల నశ్రువుల్ మిక్కిలి - కార్చినట్టు, లంబుదము లంబుధారల - నవనిఁ గాల్చె.

ఉ॥ రాజధరుండు మున్ను త్రిపు - రంబులఁ గాల్చిన చిచ్చుటమ్ము నా
రాజిలు చంచలాలతలు - రాచిన కుంతము వోలెఁ జిత్తపం
కేజములందు గాఁడి యుడి - కించె వియోగమునొంది కుందు ని
ర్వ్యాజ రుషా పరీతమగు - యౌవతపున్ యువక వ్రజంబులన్. ౪౨౪

మ॥ ధన మార్జింపఁగ దూరదేశముల కు - త్సాహంబుతో నేగి గ
ద్దన రాకుండెడు నాథులం గలఁచి వం - తం గ్రమ్మఱం జేయుటన్
ఘన చింతాకులితాత్మలౌ సతులకుం - గల్యాణదంబైన కా
రును పోల్పంగ వియోగ దుఃఖ ఫణి తా - ర్క్ష్యుండన్న సంచై తగెన్. ౪౨౫

తే॥ జలధరములు గర్జిల్లుచు జలముఁ గురియు, నొకటినొకటి తాఁకుచునుంట - యొప్పెఁ గొప్ప
కరులు గర్జించుచు మదము - గార్చు చీర్ష్యఁ, దవిలి పోరు సాగించు చం - దంబునంది.

తే॥ పయర తెమ్మెర సుడిగాలి - వానగాలి, యీఁదనెడి పేళ్లతో వాయు - వేచి వీవ
శిలికణంబులు బాణవ ♦ ర్షంబుమాడ్కిఁ, బడియె దిక్కులు దిక్కులు ♦ పొడిచెనఁగ. ౪౨౬

చ॥ సకల జనాలి కూఁతయగు ♦ సంపద పెంపఁగ దూరదేశ వ
ర్తకముల కేగు నాయకులు ♦ క్రమ్మఱఁ గ్రమ్మఱఁ బ్రాణమొందు పొం
దిక నలరారు నాయికల ♦ తీరున వాడిన వృక్షజాల మా
నికను తలిర్చి పూచి సని ♦ నిండి యెలర్చెను వానకారునన్. ౪౩౦

సీ॥ పాటలీ తరువులు ♦ ప్రసవ దూరంబులై, దుఃఖంబు నొందిన ♦ తోయమొప్పఁ
బేంకణంబులు ప్రస ♦ వించి విరాజిల్లఁ, గువలయంబులు కంది ♦ కుందుచుండ
దినకరుండును స్వీయ ♦ తేజో విహీనుఁడై, కరములు కుంగఁ జే ♦ దఱిమి నొంద
సంపద లలరార ♦ సంతృప్తి గొనుపోల్కి, నమ్ములు నెమ్మిమై ♦ న ర్తిలంగ

తే॥ తమ్ము విడనాడిచన్న బాం♦ధవుల వెదక, వలసియుత్సాహరహితులై ♦ యలయుజనుల
మొగిని పికము లడవి మాన ♦ ముద్రఁ బూన, నెనకమెసఁగె సీరామని♦ దెసలఁ గ్రమ్మి.

మ॥ పలురంగుల్గల బంభరంబులు వెసన్ ♦ బంగారు రంగారు వ
న్నెలచేఁ గ్రాలు ప్రియాంఘ సూనములపై ♦ నిండారుటల్ పొల్చె నీ
తొలికారామని నూడ్చి గెల్చెఁ గద యెం ♦ తో మేలు మేలంచు భూ
లలనారత్నము గ్రీష్మ మాఁపఁగను పె ♦ ల్చెం జాఁచు కెంగేలనన్. ౪౩౨

మ॥ తమ శీర్షంబుల కై వడిం దనరి - నిద్దంబై వళకుంబునై
భ్రమలం గొల్పెడు నాగలింగ కుసుమ - వ్రాతంబు నీక్షించి సస
ర్పములే యంచు భుజంగ బృందము పరి - ష్వంగంబు గావించెఁ బు
ష్పము లామోదము చెందినట్టులె వికా - సం బందె నాకూటమిన్. ౪౩౩

ఉ॥ సీమలు గాని సీమలకుఁ - జేరిన నాథులు గీము సేరఁగాఁ
బ్రేముడి మీఱు తత్సతులు - తృప్తి వహింపఁగఁ బెక్కురీతులన్
గామునికేళిఁ దేలి తమ - కమ్మిన నుమ్మిన తమ్మలో యనన్
భూమిని నూపుగింజ పడఁ - బోలక నిండిన యింద్రగోపముల్. ౪౩౪

ఉ॥ నేరెడుపండు డుల్లిపడి - నింగిని తాఁకెడు నెత్తు వోల్చు న
మ్మేరువునుండి బంగరువు - మిక్కిలి తెచ్చెడి నేరె టేటనన్.
జాజీన వెల్లువల్ నెగడి - సర్జక పుష్పము లారె జేల పూ
ల్గూరిచి తెచ్చుచుం గలియఁ - గూడుచుఁ బాజె భయంకరస్థితిన్. ౪౩౫

ఉ॥ అందము చందముం బొడవు - నందిన కాఁడలతోడి మోరటుల్
పొందిక నుల్లసిల్ల దళ - మూలములం బడి యింద్ర గోపముల్
చిందిన జేల పూవులును - చెన్నలరారె ధరిత్రిదేవి సొం
పొందఁగఁ బాదు తేటులకు ♦ నొప్పున సేయు కరంబులో యనన్. ౪౩౬

సీ॥ ఝంఝుమ్మనుచుఁ జుట్టి - సుడియాడు మధు లిడ్వి, రావంబు కిన్నర - రవముఁ బోల
ఘుమఘుమ ధ్వనులతో - ఘూర్ణిల్లు మేఘగ, ర్జనము మృదంగ ని - స్వనముఁ బోలఁ
బురివిచ్చి యాడు సొం - పారయు మయూర నృ, త్యంబులు చెలుల న - ర్తనముఁ బోలఁ
దాలిపూవులు కంచు - తాళంబులను బోలఁ, బ్రేంకణంబులు దీప - వితతిఁ బోల

తే॥ కాకి కలువలు సభ్యుల - కనులఁ బోల, దేవసభ నాఁగ నా భూమి - తేజరిల్లెఁ
బ్రావృడంబుదజాత వ - ర్ష ప్రకీర్ణ, శాంత నిర్మల విశ్రాంతి - సదనమగుచు. ౪౩౮

మ॥ సుర పున్నాగ విశిష్ట పర్వతములన్ - స్రోతస్వినుల్ జాలు చొ
ప్పరయన్ జీవులఁ గావ ధాత్రి కరుణా - వ్యాసంగయై మేదినీ
ధర వక్షోజములందు చేపిన పయో - ధారా ప్రవాహం బనం
బరఁగెన్; జీవనదాత్రి భూమియె కదా - బ్రహ్మాండ భాండంబునన్

సీ॥ కోరిన వారల - కోరిక లొసఁగంగఁ, బత్ర పత్రమునకుఁ - బసిఁడిసరులు
వ్రేలనొప్పెడు కల్ప ♦ వృక్షంబువై ఖరి, జేలతరువు లొప్పెఁ ♦ బూలతోడ
నేవంకఁ గనఁగన్న ♦ నేపారు తుమ్మెద, కొదలతో వెలయు పూఁ ♦ బొదలు పొదలె
కామ మగ్గలముగాఁ ♦ గ్రాలు మృగంబులు, పరిమళ తరువుల - కొరసికొనుచుఁ

తే॥ గ్రొత్తతావి కస్తురి కంపు ♦ గుబులుకొనఁగ, హరిణు లారసి తమువీడి ♦ యన్యజాతి
మృగులతోఁ గూడె ననుశంక ♦ నొగిలి యలుక, చెంది చెంతకు రానీక ♦ కుందుచుండె.

మ॥ పతిదూరంబున కేగ వానతఱి నె ♦ వ్వంబొంది దూపిల్లు ప్రో
షిత నాథాత్మక కన్నులట్లు ముకుళిం ♦ చెన్ వాడి యిందీవర
ప్రతతుల్; నాథుఁడు క్రమ్మఱిల్లఁగ నని ♦ ర్వాచ్యప్రమోదోత్తరం
గిత సుస్వాంత వినూత్న హాస రుచులన్ ♦ గెల్పొందె జాతీ లతల్. ౪౪౦

మ॥ దరి సర్తించు కుశీలవ ప్రభృతి ను ♦ ద్యత్ప్రీతి మన్నించు భూ
వరుమాడ్కిం దరి నాడు నెమ్మలకు నొ ♦ ప్పన్ హేమమృత్పిండముల్
దరులం ద్రోచెను వెల్వ; లింట నతిథిన్ ♦ దన్పించు సాధ్వీమ ఖాం
బురుహ ప్రక్రియ లేచెఁ బంకజము లం ♦ భోదంబు నీక్షింపఁగన్. ౪౪౧

మ॥ కందర్పాగమకోవిదుల్ బహుళ సం - ఖ్యాకామినీ సంగమా
నందం బొందు విధానఁ జేరి యళిబృం - దం బన్ని పుష్పంబులం
గ్రందై చిందు రసంబు నొక్క యెడఁ గూ - ర్పంజొచ్చె స్ఫూర్జద్రసా
నంద శ్రీకర రూపకంబు కవి తి - న్నన్ గూర్చు చందంబునన్. ౪౪౨

మ॥ మన రమ్యోక్షుల గెల్చి మించు ధరజన్ - మాయావి మారీచుఁ డీ
మన రూపంబె ధరించి యాపదలు ప్రా - పంజేసె సంతోషమున్

మన మీా రాముని ప్రోలఁ జూపుట యనం - భావ్యంబయా నంచు న
న్మని భావంబు వహించెనో యనఁగ నొ - ప్పారెఁ జింక లయ్యద్రిపై. ౪౪౩

చ॥ చిర మెడఁబాయఁ బ్రేమమునఁ - జెల్వల చిత్తము వాడియుండ ని
ర్భర కృప వచ్చి మోహము భ - రంబుగఁ జేసిన భర్తలం బలెన్
వరటి జలంబు లేనివగు - వాహినులందు రసంబు పొంగ సం
ఒరమున వచ్చి చేరినవి - వారిక తండములై మరాళముల్. ౪౪౪

శా॥ పారావార జలంబు గ్రోలి విను త్రో - వం బోవు మేఘాలితోఁ
దారామార్గము చేరనేగు బకముల్ - దామోదరోర స్థలిన్
దోరంబై చను తారహారమన ను - త్తుంగోత్తరీయంబనన్
గారామార వెలింగెఁ దక్కినవి చు - క్కల్ ప్రోలెఁ గప్పట్టఁగన్. ౪౪౫

శా॥ కోపాత్ముండు నిరంకుశుండు తపన - క్షోణీశుఁ డేగంగ ని
ర్లేపుండౌన్ సుగుణాభిరాముఁడగు ప్రా - వృడ్భూపుఁ డేతేర హృ
త్తాపం బాఱి ధరిత్రి మేనఁ బులకల్ - స్తంభించె నా శాడ్వలం
బేపారెన్ గనుపండువయ్యె ధరణీ - వృత్తంబు లెందేగినన్. ౪౪౬

మ॥ నలువందొట్టి మహాత్ములెల్లరును వి ♦ జ్ఞానేశ్వరుండైన కో
సలరాజాత్మజు దుఃఖముం గని కృపా ♦ సంగాత్ములై జానకిన్
గలయన్ రోయఁగఁ గన్నులన్ బఱపి యా ♦ కారించిరో నాఁగ మం
దల బర్హంబుల విప్పి యాడినవి కా ♦ నన్ నీలకంఠావళుల్. ౪౪౭

మ॥ అరిరక్తార్ద్ర కృపాణ కుంతధర వీ ♦ రాగ్రేసరోత్కర్ష శీ
ర్ష రుహ ప్రాక్తన వర్ణముం జెఱుచు రా ♦ జద్రాజ బింబాననా ॥
చరణాలక్తక భంగి నెఱ్ఱనగు న ♦ బ్జంబుల్ విరాజిల్లెఁ ద
ద్వర మధ్యంబులఁబోలి పూలతికలు ♦ తక్కంపించె లీలాగతిన్. ౪౪౮

మ॥ పికరాడ్బృందములార! మిమ్ముబలె తే - విం బల్కు నాసీత నో
పిక మైఁ గాననసీమలందు దగ న - న్వేషించి తోడ్తెండనన్
బికముల్ సమ్మతి నెల్లదిక్కులను వే - పేర్కొంచుఁ బేర్కొంచుఁ దోఁ
పిక వేసారి యలంగి కూయిడుట లా - పెంబోలు శ్రీరామునిన్. ౪౪౯

చ॥ కడిమిడి మేసి లేఁగ గమి - గంతులు వేయఁగఁ బుట్టక్రోవు లె
ల్లెడఁబడి బజ్జియై చెదరి - యేపటి మార్గికవోలెఁ గప్పడెన్
గడిమినుమంబు లుల్లసిలి - కానఁగనయ్యెను ప్రేంత లీడి పెన్
గడవలఁ బోయఁ బై కుబికి - కన్పడు పాల నురుంగులై వడిన్ ౪౫౦

సీ॥ కొండచేరువనేలఁ ♦ గొండగోఁగులు పూఁచి, కొఱవత కురులఘుం ♦ ఘుమలొనర్చె
సురపొన్న పూవులు ♦ విరిసి బెస్తలయువి, దలకచములతాని ♦ యలరఁజేసె
బల్లంపునేలల ♦ భాసిల్లు కలువలు, భిల్లులతలలు వా ♦ సిల్లఁగూర్చె
సద్యో వికస్వర ♦ జాతీసుమంబులు, వ్రేతలవెంద్రుకల్ ♦ వెలయనొప్పె

తే॥ ఎచ్చటెచట విచ్చినవిరు ♦ లచ్చటచటి, మానినీమస్తకములస ♦ మ్మానమొంది
జననసాఫల్య మొనరించు ♦ కొనుచునుండె, వాసికెక్కువారలకిదే ♦ వర్తనంబు.

మ॥ విరివిల్కాని కవారిగా శరతతుల్ ♦ వేకూర్చు నీరామనిక్
సరసీజాక్షి ప్రసన్నసుందరతరా ♦ స్యస్ఫూర్తి గాంచంగలే
కురుతాపంబునఁ గ్రుంగి కుందు రఘువ ♦ ర్యుండెట్టులోర్చుం గటా!
ధర నెందే సతిఁ గోలుపోవు జనికిన్ ♦ దార్కొన్నె సమ్మోదముల్? ౪౫౨

మ॥ అతిదీర్ఘంబగు వానకారడర ద్రై ♦ ర్యంబెల్ల మానీంద్ర సం
తతికేనిం జెడుచుంట తథ్యము సుధా ♦ ధారానిషిక్తస్ఫుటీ
కృతవాక్యన్ జనకాత్మజన్ విడిచి తా ♦ నేకాకియై కుందు నా
శ్రిత రత్నామణి యేగతిం గడపుఁ బ్రా ♦ వృట్కాల మా కానలోన్. ౪౫౩

శ్రీరాముని విరహ సంతాపము.

మ॥ స్ఫురదిందీవరగాత్రుఁ డయ్యెడ మదిన్ ♦ స్రుక్కన్ విచారించు దు
ర్భర తాపమ్మునఁ గ్రుంగుఁ గుందు బలస ♦ త్త్వంబుల్ దిగంబాఱ ని
స్వరపొందున్ జలియించు నూర్చు వెత ని ♦ ర్వేదించు నిశ్చేష్టుఁడౌ
ధరణీజాత ముఖాంబుజాతము నిరన్ ♦ దర్శింతు నొక్కొ యనున్. ౪౫౪

మ॥ వనదంబా! వనజాక్షి నాఁచికొని క్ర ♦ వ్యాదుండు బంధించి దాఁ
చిన తావుం దెలిపింపవో? తెలుప నీ ♦ చిత్తంబు మైకోదొ? జీ
వనసంఘాతవు నీకు నాపయిని స ♦ ద్భావంబు పాటిల్లదో?
నను క్రుంగించి హృదబ్జపుం ♦ గలఁతువే? న్యాయంబె యిక్కార్యముల్?

చ॥ మెఱుపను కోఱపండ్లు గల ♦ మేఘమ! నల్లని చాయ గల్గి భీ
కరముగ బొబ్బ వెట్టు చెటఁ ♦ గాంచిన నచ్చటఁ దోఁచుచుంటి దు
ర్భరమగు క్రూరచేష్టలును ♦ వంచనయుం గల దైత్యరాజి వై
ఖరి గల నీవు ప్రాణములఁ ♦ గైకొనికాని నివృత్తిసెందవో?. ౪౫౬

కవిరాజ॥ తరళమృగాక్షి సుధామయవాణి మ ♦ దావళయాన హిమాంశు ముఖిన్
ధరణికుమారిని తోడ్కొని వచ్చి వి ♦ తాకును దైన్యము నొందిన నా
కురవుగఁ గూర్పు మనేక సునేత్ర మ ♦ యూరమ! నేను వియోగముచేఁ
గరఁగి కృశించుట గాంచియుఁ గారుణి ♦ కత్వము పూనమి న్యాయమొకో?

ఉ॥ తెమ్మెరతోడఁ జేరుకొని ♦ తేఁకువ నయ్యాది యార్చు భంగి నే
మమ్మున నాడుచుండెడు సు ♦ మ వ్రతతీ! చెడునంటు బల్కి నా
యమ్ముల గ్రుచ్చి నొంచెదు ధ ♦ రాత్మజ మధ్యము వోలె నాడుచున్
నెమ్మది నున్ననాకు మును ♦ నెమ్మిని గూర్చుట విస్మరింతువే?. ౪౫౮

చ తరలను దుష్కృతంబులకు ♦ దంచిత సత్కృతు లందు నుండియున్
మరలను మంచిచెడ్డలను ♦ మానుగఁ గాంచెదు తెల్వి నుండియున్
దొరలను సోలితిం జెడితిఁ ♦ దూలితి నన్నియుఁ బోయె బుద్ధియుం
దెరలెను సీతఁగూర్చి నను ♦ దేర్చు కురంగమ! పుణ్యమబ్బెడిన్. ౪౫౯

కవిరాజ. మృదుపద జానకి నిష్కలుపాత్మక ♦ మేదిని పుత్త్రిక యున్నెడ నన్
వదలఁగ నీవు వలంతివె యైన సు ♦ భాసిని వెంటనె యేగవొకో?
సుదతియ నీకును నాయికయౌరా పరు ♦ సున్ వెడజీవమ! యెంచవొకో?
మదిమది నుండక మాలుమ యంచు సు ♦ మధ్య త్యజింప సుఖింతువొకో?.

తే॥ ప్రసవ సరములు వ్రేలు నా ♦ రగ్వధంబ!, కలికి కురులతోఁ బగఁబూను ♦ కతన నన్ను
గలఁచుచుంటి వీయ్యాది గుణ ♦ క్రమమె చూడ?, నెయ్యమెప్పుడునీకుంచు ♦ నియతులందు?

మత్త॥ సాంద్ర కోరక దంత సంగతి ♦ నర్పముంబలె జాజియున్
జంద్రుతో మరణార్తిఁ గూర్చుచుఁ ♦ జంపనే తలపెట్టె ని
స్తంద్రుఁడౌ సురవైరి కోపమె ♦ చాలియుండఁగఁ జంపెఁగా
యింద్రుకోపమొ యింద్రగోపమొ ♦ యింతియోష్ఠముఁ జూపుచున్. ౪౬౨

శా॥ మారీచుండు ధరాత్మజాతను హరిం ♦ పం దగ్గ యాలోచనన్
సారంగాకృతిఁ దాల్చెఁ దొల్లి యిపుడో ♦ చంపం గృతాంతుండు దు
ర్వార క్రూర గుణాత్మకంబయిన యీ ♦ వాత్యాకృతిం దాల్చె మా
కారాటం బొనఁగూర్చు వారలకుఁ గా ♦ మ్యాకారముల్ గల్గెగా!. ౪౬౩

ఉ॥ క్రూర నిశాచరావళుల ♦ కోపున గర్జిలు కాల మేఘుఁడా!
నీరసమొందె రాముఁడని ♦ నెమ్మినిసీతను తెచ్చి యీయకే
తీరున మాటిమాటికి వి ♦ దేహ తనూభవ మేని కాంతులన్
బేరిమిఁ జూపి డాఁచెదవు ♦ వేటిమి చేతలు నీకు నచ్చెనో?. ౪౬౪

మానిని॥ ప్రాణము నిల్వఁగ తావు నొసంగక ♦ యంతట నిండిన తాపము నా
ప్రాణములన్ వెలి ద్రోచిన పిమ్మటఁ ♦ బ్రాణము లేని శరీరమునన్
బాణము లేయుట రోఁత గదా నుమ ♦ బాణ! తొలంగుము తమ్ముఁడు నీ
ప్రాణము దీయుఁ దదీయ రుషా పరి ♦ పాక మడంపఁగ లేరెవరున్. ౪౬౫

చ॥ అసమశరా! భవచ్ఛరము ♦ లార్తులపైఁ దెగ నేయఁగా సమం
జసములు కావు చేవయును ♦ స్థైర్యము గల్గిన వారిపట్లనే
యసమున వైవఁగాఁ దగుఁ; గృ ♦ తాంతుని యట్లనుకంప లేక నీ
కసి మతి నాపయిన్ విడువఁ ♦ గా ఫలమబ్బునె? కీర్తి దక్కునే?. ౪౬౬

చ॥ అసదృశ దుఃఖ వారినిధి ♦ యందు మునింగిన రాముఁ డివ్విధిన్
బసచెడి పల్వరింప గుణ ♦ బద్ధుఁడు తమ్ముఁడు కాంచియోర్చు సా
హసము చలింపఁ గేల్మోగిచి ♦ యార్య! యెఱుంగవు నిన్ను నీవు, దు
ర్వ్యసనము కార్యభంజన క ♦ రంబని పల్కుచు వెండి యిట్లనున్. ౪౬౭

ఉ॥ రామ! శిమాభిరామ! గుణ ♦ రాజిత ధామ! యిలంగు శేల? నీ
రామని దీర్ఘమెనదని ♦ యా? దనుజేంద్రుని శౌర్య మెంచియా?
కామిని యున్న తావు వెద ♦ కం గపి సేనలు రావటంచునా?
నీమదిఁ గుంద నేమిటికి? ♦ నెవ్వగపాలయి వాడ నేటికిన్?. ౪౬౮

చ॥ శ్రుతులు నశించినన్ బ్రిదిలి ♦ సూర్యుఁడు చంద్రుఁడు త్రోవ దప్పినన్
వితత నభంబు భూమియును ♦ వీఁగి విపర్యయ మందినన్ భవ
న్మతి చలియింపరాదు కల ♦ నన్ బలు దైత్యుల విక్రమ క్రమ
స్థితులు భవ చ్ఛల ద్భ్రుకుటి ♦ సింగిణి వంగెడు దాఁకనే కదా?. ౪౬౯

ఉ॥ మారుతి శౌర్య ధైర్యములు ♦ మానుగ వింటిమి, తక్కువారలున్
వీరులు కీశు లేడు పది ♦ వెల్వలు, పాపములంబలెన్ సదా
తీఱని పీడ వానతతి ♦ దీఱెను, జానకి వచ్చిచేరు నీ
వారట పొందఁగా వలవ ♦ దాఱడి లేదిఁక నూఱడిల్లుమా. ౪౭౦

ఉ॥ దండకయందు మానులకు ♦ దానవ వారము పేరు మాయ ను
ద్దండతఁ గూల్చి సౌఖ్యములఁ ♦ దార్చెద నంటివి తగ్గయుల్లె యా
దుండగులున్ ఘటించిరి సు ♦ దుఃఖము; వారలఁ జంపి దేవతా
తండము నాశవాసము ము ♦ దంబునఁ బొందఁగఁ గీర్తి నిల్పుమా. ౪౭౧

చ॥ పగతురఁ గూల్పఁగా విజయ ♦ భాగ్యము నిన్ను వరించు; రిత్త యీ
పగిదిఁ దపించుటల్ మగల ♦ పద్ధతి గాదు; సుఖంబు దుఃఖమున్
జగతిని సర్వజీవులకు ♦ సాజము; నీవు ప్రయత్న పడ్డచో
నెగడని దేదియుం గలదె? ♦ నీమది చింత యదేల? రాఘవా!. ౪౭౨

ఉ॥ ఈకరణిన్ హితంబు వచి ♦ యించిన తమ్ముని యూఱడింపులన్
శోకము మాని రాఘువుఁడు ♦ శోక వహించెను కొన్ని నాళ్లు ల

శ్లేకడచన్న మీఁద నొక ♦ యింద్రమము సేసెను గోరుచుట్టుపై
రోఁకటిపోటు రీతిని దు ♦ రుద్ధురమై జడివట్టె క్రమ్మఱన్. ౪౭౩

సీ॥ కాసారము లెలర్చె ♦ భూసారము తలిర్చెఁ, దటపట లాడుచుఁ ♦ దరగ లురలె
ధరణి వేఁడిమి తగ్గెఁ ♦ దరణి వాఁడిమి గ్రగ్గె, దిక్కులు నల్లనై ♦ తెలియవయ్యెఁ
నెడఁబాటు బరువయ్యెఁ ♦ దడఁబాటు గురువయ్యెఁ, పక్షివితతి జత ♦ పాయకుండె
లోకంబు శాంతించె ♦ భేకంబులు రుతించె, నీటియెద్దడి యెల్ల ♦ నీఁగిపోయె

తే। చాలినంతకు మీఱి వ♦ర్షంబు గురిసె, జనులు ఘటికార యంత్రంబు♦ సాయమునను
గడియ లెఱిఁగిరి రేయిం బ ♦ గల్లు మునరి, పెక్కు దినములు జడిపట్టె♦విడని కతన

సీ॥ కీరవాణుల వాక్య ♦ కీర్తికి సిగ్గిలి, చిలుకలు ధాన్యరా ♦ సులను డాఁగె
సుదతుల సుందర ♦ రదనంబులకు నోడి, ముత్తెంబులు తరంగ ♦ ములను డాఁగెఁ
గలకంఠకంఠుల ♦ కలరవంబుల కోడి, కలకంఠములు కుడుం ♦ గముల డాఁగె
అంచయానల నడ ♦ యందంబులకు నోడి, యంచలు మానస ♦ మంద డాఁగె

తే॥ పూల పొన్నలు బంగరు ♦ పోకముడిని, విప్పినట్టి పగిదినుండ ♦ వెలఁదు లూఁగు
నుయ్యేలల గాలివలె నేగి♦యువకహృదయ, ములనుగ్రాఁగించెఁజలిగాలి♦మునరివిసరి.

తే॥ సర్వసంగముల్ విడిచిన ♦ సాదులట్లు, కదలకుండు గ్రావంబుల ♦ కరణి సామ
జము లహోరాత్రములును వ ♦ ర్షమునఁ దడిసి, నిద్రలేక చలింపక ♦ నిలిచియుండె.

మ॥ చలిచేఁ గంపిలు హంసలెల్ల నుటజ ♦ స్థానంబులన్ హోమ వే
దులపై వ్రాలెఁ బ్లవంగికల్ గుహాలలోఁ ♦దూఁగెన్ బ్లవంగాళి ముం
దల నిల్చెన్ ఋషిసత్తముల్ దరులఁబ్ర ♦ త్యాహార యోగస్థితిన్
నిలుకం జెందిన మాడ్కి నెల్ల సుఖముల్ ♦ నీఁగంగ సర్వేళలన్

లయగ్రా॥వీఁకజడి పట్టియెడ♦మీఁక కురియంగఁ బెనువాఁకలు కొలంకులుత♦టాకములు నిం
డన్ జోకగొని కామినుల♦శోకమతి నాడమి వి♦తాకువడి తావులును ♦సోకువడకుండన్
ఆకసము నంటుకొను ♦ పోకతరులందు బలు ♦ తేఁకువను కట్టఁబడి ♦ టేకు గొనియుండన్
శ్రీకర విలాసినులు♦చేకొనమి నుయ్యేలలు♦వాకవుగు మంచెలును ♦మూఁకవడియుండన్

చ॥ మొగలి పొదళ్లమీఁదఁ గల ♦ మోహన దీపక పుష్పరాజి బం
దుగుల విధంబునం బలసి ♦ తోరముగా వెలయన్ బకోటముల్
తిగిచిన జాక్కులన్ ముడిచి ♦ దేహము చాపలమంద నూరికిన్
మగలను పంపి దూపటిలు ♦ మానినులంబలె నొప్పె నయ్యెడన్. ౪౭౪

సీ॥ పలుపలు వన్నెల ♦ జల విహంగంబుల, స్వనము మృదంగ ని ♦ స్వనముగాఁగ
బహువిధ భృంగ రా ♦ వంబులు శాస్త్రప, ద్ధతి నొప్పు సరస గీ ♦ తములుగాఁగ

కేకుల నృత్య మ♦ నేక విధంబులై, డంబించు భరత నా ♦ ట్యంబుగాఁగ
నళులముల కలికి బె♦ దరు చూపులం జూచు, సారంగ తతులు ప్రే ♦ క్షకులుగాఁగ

తే॥ వెలయు సుమ లతా వేష్టిత ♦ వేణితోడ, చిగురు టాకుల చేలంబు ♦ చిందులాడ
నలరు వనదేవతా సభా ♦ నిలయమందు, ముదము దీపించు వేడుకల్ ♦ పొదలుచుండె

చ॥ సకినెల మంచమందు సుమ ♦ శయ్యల ధూపపుఁ దావి క్రమ్మఁగా
సుకముగఁ దీఁగ కౌనుగల ♦ సుందరులెల్లరు చొక్కుచుండఁగా
వికచ జలేజ రాజిఁ జలి ♦ వెక్కసమంచుఁ దొలంగి తుమ్మెదల్
రకముగఁ జొచ్చె గంధ తరు ♦ రంధ్రములన్ సుఖనిద్ర సేయఁగన్. ౪౮౧

ఉ॥ అంచలు కాణయాచియగు ♦ నంబుజ పుష్పములం ద్యజించి వృ
త్తాంచిత వాటిఁ జేరి కొమ ♦ లందు వసింపఁగఁ దావికట్టులన్
జెంచులు సంచు నించి విర ♦ చించిన మంచెలఁ గప్పుక్రిందుగన్
జెంచెత లంటసిల్ల నొగిఁ ♦ జేరి వెచ్చని హాయి నిద్రకున్. ౪౮౨

ఉ॥ తీవలు ప్రక్కలం బలియ ♦ దీర్ఘములౌ పెను చెట్లక్రింద న
ట్టావుల మేషబృందముల ♦ నారసి నిల్చిరి గొల్ల లొక్కెడన్
త్రోవలుగాని త్రోవలను ♦ దొంగలకై వడి నేగు నా పిశా
చావలి పండ్లు గిట్టుకొని ♦ యాఁకలిచేఁ గృశియించె నెల్లెడన్. ౪౮౩

ఉ॥ నింగిని మ్రింగున ట్లడరి ♦ నీరద పంక్తులు బాణవృష్టి ఛా
తిం గొని యేఁపఁ దేనియల ♦ తెట్టెల పట్టులు వ్రేలు కొనలన్
సంగడిగా వసించు పసి ♦ చాలక డాఁగఁగ నొంటి యొంటి మా
తంగము లేగెఁ బర్వతని ♦ తంబములం గల కందరాలికిన్. ౪౮౪

ఉ॥ దీటొకయింతలేని గుణ ♦ ధీరుఁడు రాముఁడు వర్ష వేళలోఁ
గాటుకకంటి తామరస ♦ గంధి సుహాసిని ధాత్రిజాతపై
మాటిన చింతతో సయిఁచు ♦ మార్గము గానక తన్ను చూచుచున్
మాటికి మాటి కూర్చుచుఁ గు ♦ మారిలి తమ్ముని గాంచి యిట్లనున్.

ఉ॥ పంకజగంధి జానకిని ♦ పాప విచారుఁడు రావణుం డొగిన్
లంకకుఁ గొంచుఁబోవుతఱి ♦ లావఱి సోలి పయోధిఁ గూలెనో?
సంకటమందుచున్ దనుజు ♦ సన్నిధి జీవములం ద్యజించెనో?
జంకి కృశించుచుం బ్రదుకఁ ♦ జాలెనో? యేగతి నోర్తుఁ దమ్ముఁడా!. ౪౮౫

చ॥ అరి జన భీకరంబులగు ♦ నస్త్రము లిట్లు నిషంగమంద ని
ద్దురఁ గొన దీర్ఘ పుష్ట దృఢ ♦ దోర్యుగళంబు కృశించి పోవ దు

ర్భరమగు దుఃఖ తాపమున ♦ గ్రమ్మాలుచు నుండుట నాకు నై జన్మై
పరఁగిన దీఁటె పోటునకు ♦ బ్రయ్యక యున్నది అమ్మ తమ్ముఁడా!. ౪౮౭

ఉ॥ జీనువ లించు నీడపులఁ ♦ జేరి మిడుంగుఱుఁబుర్వు వెల్గునన్
జానుగ ధర్మచారిణుల ♦ సంగతి హాయిగ నిద్రసేయఁగా
నేనిటఁ దుంట విల్తుఁడు ర ♦ తీశుఁడు పొంచుచు బాధముష్టిచే
సూనశరంబు లేయ మది ♦ స్రుక్కుచు మ్రక్కుచు నుంటి లక్ష్మణా! ౪౮౮

క॥ ఉఱుముల మెఱుపులఁ గని పెలు, కుఱు సర్పముభంగిఁ గ్రుంగి ♦ కుందుచునుంటిన్
నెఱపిన కార్యము లేమిని, వెఱపరులు న్నవ్వనుంటి ♦ విజ్ఞాననిధీ!. ౪౮౯

చ॥ ఉడుగక యిల్లె వాన పడు ♦ చుండినచోఁ దపియించి జీవమున్
విడిచి దివంబు చేరుటయె ♦ నిక్కము; దైత్యుఁడు దొంగిలింపఁగాఁ
బడఁతిని గోలు పోవు నప ♦ వాదము రెండవ జన్మమెత్తినన్
విడివడునో? తపోధనుల ♦ వృత్తినె వీడునో యేమొ? లక్ష్మణా!. ౪౯౦

తే॥ ఇచ్చటనె యుండి దైత్యుల ♦ యిక్క దెలిసి, కొనఁగఁ జిరకాలమేగు నా ♦ పనియొవలదు
విరహావహ్నిచేఁ గ్రాఁగి దా ♦ శరధి యీాల్గె, ననుటయే నాకు గౌరవ ♦ మనుచుఁదోఁచె

మ॥ అలినీలాలక విద్రుమోష్ఠి గురు క ♦ ప్రమాలాప వై దేహి ని
ర్మల భవ్యాత్మక సాహచర్య గుణ ధ ♦ ర్మశ్రీల మోదించు నే
నిలఁ దామ్రద్రవ వైఖరిం గురియు ప్రా ♦ వృట్కాల దుశ్శీకరం
బుల గాత్రం బెరియంగఁ దల్లడిలి ము ♦ ప్పుం బొందనయ్యెం గటా!. ౪౯౧

మ॥ పురుషార్థంబుల పొంటె నీ గృహిణిగాఁ ♦ బూఁబోణి వై దేహి భా
స్వరు సాన్నిధ్యము నం దొసంగితిఁ గృపం ♦ బాలించు కొమ్మన్న భూ
వరు సీరధ్వజు ధర్మ నిర్ణయము వి ♦ ధ్వంసంబు గావించు నీ
దురదృష్టాత్మున కున్నె సౌఖ్యముల పొం ♦ దుం దమ్ముఁడా! చెప్పుమా!

ఉ॥ ఊఱట పల్కఁగా ననుజుఁ ♦ డుండ వియోగభరంబు నోర్చి పై
నూఱడ నేను సమ్మతిలి ♦ యుండఁగ జానకి యిందు వచ్చి నా
కూఱటగాఁ గనంబడునె? ♦ యుత్కట దుఃఖము నాసిరిల్ల నా
కూఱట గొల్పలేరు మఱి ♦ యొక్కరు దీనికి నంతమేదియో?. ౪౯౪

మ॥ శితభల్లంబుల బ్రహ్మలోకము మొదల్ ♦ చీకాకు గావించి సం
గత రోషంబున సర్వలోకముల వీఁ ♦ కం గూల్చి దిక్పాలక
ప్రతతిం దొట్టి సుపర్వ రాక్షస నర ♦ వ్రాతంబులన్ మాడ్చి ని
ర్గతి గావించినఁ గాక కాంచఁగలనే ♦ కల్యాణి నా జానకిన్?. ౪౯౫

మ॥ ఘనగర్జా సమ శింజినీకృతరవా ♦ క్రాంతాష్టదిఙ్మండలా!
ఘన రోషంబున నీ ప్రపంచ లయముల్ ♦ గావింప కిట్లుంట ధ
ర్మ నిబద్ధ స్థితిగాదె? దానవ సుర ♦ వ్రాతంబు లొక్కండవై
యనిలో నన్నెదిరించి నిల్వఁగలవే ♦ ప్రాణాలతో? లక్ష్మణా!. ౪౯౮

మ॥ అన సౌమిత్రి వచించు నార్య! కడవ్రో ♦ యం బూని యున్నట్టి నా
ల్గు నెలల్ పోయె శరత్తు వచ్చినది ర ♦ క్షోనాథుఁ డెచ్చోట నీ
వనితారత్నముఁ దాఁచెనో? బలిముఖ ♦ వ్రాతంబు వేరోయఁగా
ననువౌ కాలము డాసె మానుమిఁక నీ ♦ యారాటముల్ రాఘవా!ఁ ౪౯౯

లయగ్రా॥ క్షీరజలరాశిఁగని ♦ యారకఁసు తెమ్మనిన, మాఱుపలు కాడుటకు ♦ నేరకయ తానే తేర రహినుండ వెర ♦ వార నటు లానయిడ, కోరిమిని మందరము ♦ నార భరియించెన్ పీరులగు వేల్పుల సు ♦ రారులను చేర్చికొని, ♦ వారకమథించియె చొ ♦ కారమగు వెన్నన్ శ్రీరమణిఁ జెందె హరి ♦ ధారణిని కార్యములు, తేరకు ఫలింపవు వె ♦ తారపడకున్నన్

మ॥ తన సంకల్ప వికల్ప మాత్రమున భూ ♦ తశ్రేణితో లోకముల్
తనియంజేసి హరించు శక్తిగల ని ♦ త్య శ్రీవిభుం డెప్పుడున్
ఘనచక్రాదులఁ బూనియే దనుజులం ♦ గారించి లోకత్రయం
బును రక్షించుచునున్న వాఁ డిదిగదా ♦ ముఖ్యంబు మాన్యాలికిన్ ౫౯౯

చ॥ త్రిపురములన్ దహింప మదిఁ ♦ దేకువఁ జేసిన శూలి యోచనల్
తపము నుదాత్త యత్నము ను ♦ దంచిత యానముఁ దక్క దివ్యమౌ
నుపకరణంబులున్ వినఁగ ♦ నూహా మొనర్ప మతింప శక్యమే?
తపనకులాగ్రగణ్యా! ఘన ♦ ధర్మ శరణ్యా! తలంచి చూడుమా. ౫౦౦

తే॥ పలు తెఱంగులఁ బలుమఱు ♦ ప్రాణహితులఁ, తోడ నాలోచనముచేసి ♦ తోడుగొనుచుఁ బోవఁదగు నదనునఁ బోయి ♦ పోరొనర్ప, జయము చేకుఱు ననుటకు ♦ శంక లేల?

చ॥ నిలువర మొందఁగా ధరణి ♦ నిర్మల ధర్మము నిల్పఁబూని రా
కలిమిఁ ద్యజించి కానఁ గడ ♦ గండ్లు గడించిన నీకుఁగాక యా
పలువలు రేయిద్రిమ్మరులు ♦ పాపహితాత్ములు క్రూరచేష్టలే
చెలువని యెంచినట్టి దృఢ ♦ చిత్తులు వారికిఁ గీర్తి యబ్బునే? ౫౦౨

ఉ॥ పావని ధాత్రిపుత్రి పశు ♦ భాములు భాములనొంద సౌఖ్యమో
దావలి నొందు; నీకుఁ గల ♦ యాఱడి యాఱడివోవు; నిచ్చలున్
దేవ మునీంద్ర సంతతి ప ♦ దింబది సారులు వేడ వారి ర
క్షావిధి నిర్వహించు ఘన ♦ కా యుపవాదులు? రాఘవల్లభా! ౫౦౩

ఉ॥ తమ్ముఁ డిటుల్ వచింప నవి ♦ తథ్యముగా మది నిశ్చయించి శాం
తమ్ము వహించె వర్షఋతు ♦ దర్పము తగ్గ శరన్మహంబు మొ
త్తమ్ముగ లేచె నోజగొని ♦ ధారణి వంశ పరంపరాత్త వి
త్తమ్ముగఁ గాదె? స్త్రీలకు స్వ ♦ తంత్ర దశల్ గలవే జగంబునన్? ౫౦౪

శరత్కాల వర్ణనము

ఉ॥ కొంకొక యించుకంత మదిఁ ♦ గూర్పక యర్థుల కిచ్చియిచ్చి కూ
లంకష లట్లు రిక్తత న ♦ లంగెడుచో నొక యర్థి రాఁగ ల
జ్జా కురితాననంబు తెల ♦ నైన శెలంగునఁ గాలమేఘముల్
బింకము దక్కి ఘోషములు ♦ వీఁగఁగ వెల్లన యయ్యె సయ్యెడన్ ౫౦౫

ఉ॥ మేదిని మేలుకీ ళ్లధిగ ♦ మింపఁగఁ దెల్పు శ్రుతుల్ పఠించి క
ర్మాపుల పద్ధతుల్ తగు ఫ ♦ లావళి శీలన చేసిచేసి జ్ఞా
నోదయ మొందునంత నడి ♦ యొందు నవిద్యవిధిన్ శరత్సమా
సాదనవేళ నంధతమ ♦ సంబు పలాయన మొందె మబ్బుతోన్. ౫౦౬

శా॥ వీరశ్రేష్ఠు లొసర్చుచుండిన సమి ♦ ద్వృత్తంబు శాంతించుచో
భేరీ ధ్వానములంబలెన్ జలద గం ♦ భీర ధ్వనుల్ శాంతిలెన్
నారాచంబులఁబోలె దుంపురుల వి ♦ న్యాణంబులున్ శాంతిలెన్
నారాజీ ల అయుంచు దాఁగినక్రియన్ ♦ జాటొందె శంపా లతల్. ౫౦౭

తే॥ గిరుల చఱియల దరులఁ గొ ♦ ప్పరములందు, వఱ్ఱులొడ్డిన సెలయేళ్లు ♦ వట్టిపోయె
న త్తఱిం గొండ లుత్తరీ ♦ యంబు సంత, రీయముం గట్టిపెడిన ♦ రీతిఁ గ్రాలె. ౫౦౮

తే॥ జలదములు సర్వతోపరి ♦ తలములందు, వ్రాలి కురియు నాకస ఘుని ♦ ర్మలినమగుచు
న్యాయపథమునఁ గూర్చి న ♦ న్మార్గవృత్తి, వ్యయముచేయు ఘనుని కల్మి ♦ వలె వెలింగె

మ॥ మద మాతంగ సమాజముల్ బెరయు సా ♦ మ్యంబంది జీమూతముల్
చదలం దెల్లెడఁ గ్రమ్మియుండి తెర వ ♦ స్త్రం బూడ్చు విన్యాణమై
యొదుఁగంబాఱఁగ న రక్తీ వదన బిం ♦ బోన్మేషముంబోలె నొ
ప్పిదమై వెల్వడి వెల్గెఁ జంద్రుఁడు నభో ♦ వీథిన్ మహోల్లాసుఁడై. ౫౦౯

చ॥ పసిమి కడాని రంగుగల ♦ వాలుగకంటుల గబ్బిగుబ్బలన్
పసిగ నలంది తెమ్మగొను ♦ చందన పంకము లాఱిపోవఁగా
శ్వసనుఁడు పుష్పితా తతుల ♦ పైఁబడి నీరములాడి నొడియున్
మిసికినఁ దాఁకుడొందునని ♦ మెల్లన మెల్లన వీచె హాయిగన్ ౫౧౦

తే॥ దాశరథి చింత దోలఁగింపఁ ♦ దగినయదను, దొరకె మేమును జనకజ ♦ నరయనేగు
దారతుని భోవ్రక్రియ దివి ♦ బారుగట్టి, నలువ తేజీలు నలు వలం ♦ కులకుఁ బాఱె

కవిరాజ॥ చెలువుల నీరము సాధుతపస్వుల ♦ చిత్తములంబలె నిర్మలమై
పరఁగెను తూలముపై నిడుమా యని ♦ పల్కిన మాత్రనె బొక్కలు ని
బ్బరముగ లేచెడు లే యడుగుల్ గల ♦ పాయపుఁ జెల్వల కాటుకరం
గారసెడు కన్నుల కై వడి నందలి - యుల్చలు మిక్కిలి మిట్టిపడెన్. ౫౧౩

చ॥ ముదిరిన పంకజంబు లొక ♦ మూలకు వ్రాలి చిరాకు నొంది యొ
ప్పిదము తొలంగు కామినుల ♦ పేద మొగంబులఁ బోలియుండె న
ల్లఁదనము నొందు పూవులఁ జె ♦ లంగి వెలింగెడి నీరుపిప్పలుల్
చిదియఁగఁ బిల్చఁగా వెలయు - చెల్వల యోష్ఠము వోలె రాజిలెన్. ౫౧౪

సీ॥ పిన్నబాలకు లొజ్జ - సన్నిధి నాతని, బెత్తంబునకు లొంగి - భీతితోడఁ
బలువిధంబులు గల - పాఠముల్ గొంతెత్తి, యఱచుచు నుండెడి- తెఱఁగుదోఁప
వర్షర్తువునయందు ♦ పరిపరి తెరువుల, బెకబెక లాడెడు ♦ భేకనికర
మా శరత్సమయాన ♦ నంతటఁ దమతమ, కలకలంబులు మాని ♦ పలుకకుండె

తే॥ తమ వచోనై పుణికి ♦ గౌర ♦ వమును ఫలము, గొఱలకుండు నదస్సుల ♦ గ్రుక్కుమిక్కు
మనక మౌనమే భూషణ ♦ మనుచునుండు, చతురులగు బుద్ధిమంతుల ♦ చందమమర

తే॥ వాన వెలిసిన యంతట ♦ బర్హములను, ముడుచుకొని విసుగున దుఃఖ ♦ మును భజించి
నెమలి గుంపు లెల్లడ ధర ♦ నీకుమారి, చందమునఁ జింతతోఁగూడి ♦ కుందుచుండె.

చ॥ జలనిధి వీచికా కరము ♦ చాఁచి జలంబను వల్వ నీడ్చి ప
త్నులఁ గవఁ గూడ లాగికొను ♦ తోయమునం గనుపట్టె; వాహినుల్
పొలుపుగ భర్తతోఁ గలిసి ♦ పూర్ణసుఖంబులఁ దేలి మోదముం
దెలువఁగ నవ్వెనో యనఁగఁ ♦ దేలెను ముత్తెము లంతటంతటన్. ౫౧౭

చ॥ ఎడయికచేఁ బడంతుక ల ♦ హీన మనోహర వర్ణమొందు న
ప్పడువున నద్వీధుల్ వినెడు ♦ భక్తులపోలికఁ బోఁకమ్రాఁకులం
దడరి రహించునట్టి గెల ♦ లద్భుత రీతిగఁ బైఁడి వన్నెయం
బడసెఁ గ్రమంబుగా జనుల ♦ భావన హెచ్చగు కై వడిన్ వడిన్. ౫౧౮

తే॥ చాలకాలంబు నీటనే ♦ గ్రాలుచుంటఁ, జలికి నోర్వక లేయెండ ♦ చిలుకునట్లు
తటములం జేరి సుఖముగాఁ ♦ దనిసి కూర్కె, నక్ర సంఘంబు లాదండు ♦ వక్రగతుల.

తే॥ కొసరి మాటాడు చిలుకల ♦ కొమరు గలిగి, సొలయు తేంట్లను నలకల ♦ సొంపుగలిగి
తలిరు టాకుల చేల యం ♦ దంబు గలిగి, తను లతాంగుల కై వడిఁ ♦ దనరె లతలు. ౫౨౦

తే॥ తమవలన నుద్భవించు ము ♦ త్యములు స్త్రీల, పలువరుసతోడ సామ్యంబు ♦ పడయకునికి
వారివెలానుల్లఁ గన నాన ♦ వాఱి యడుసు, లోన మునిఁగె నాళు క్తులు ♦ కానరావు,

తే॥ పద్మలతలు వర్ధిల్ల నా♦పత్త్రిములను, మఱుఁగుగొని లోభులంబోలె♦మఱుఁగువడఁగ ద్వారముల మూసికొని లోనఁ♦జేరుకొనియెఁ, గర్కటకములు కర్కటములతోఁ♦గలసిమెలసి

౮. కిష్కింధా పటలము. (౧౩౬)

ఉ॥ వెన్నెలకాలముం జనఁగ ♦ వీరుఁడు రాముఁడు తమ్ము లక్ష్మణుం
గ్రన్ననఁ జూచుచుం గడువు ♦ కాలము మీఱెయు నింత నిద్రమై
నన్ను దలంపఁ డెయ్యెడకు - నర్మిలిరాఁడు కపీంద్రుఁ డేమి యీ
మన్ననె? యేమిగాఁ దలఁచె ♦ మానసమందు మదించి? తమ్ముఁడా!

ఉ॥ పొందఁ గడిందియైన కపి ♦ భూస్థలి నీ పగిదిం సుఖంబుగాఁ
బొందియు గౌరవంబు దల ♦ పోయఁడు శీలము జార్చి ధర్మముం
డెందమునం గణింపఁడు ప ♦ టిష్ఠతఁ జేసిన మేలు నెంచ కి
ట్లొందిన నొందుఁగాక కని ♦ యుం మన విక్రమ మింత యెంచఁడో?. ౫౨౪

ఉ॥ రాజ్యసుఖంబులం మఱఁగి ♦ రాఁడు కృతఘ్నుఁడు సౌహృదంబు న
గ్రాహ్యముగాఁ దలంచె జన ♦ పాళికి ధర్మము సత్యమెల్లెడం
భాజ్యముగాఁగనుండ నది ♦ పాసిన పాపిని ధాత్రిఁ గూల్చుటల్
ద్యాజ్యముగాదు వానిహృద ♦ య స్థిర నిశ్చయముం గ్రహింపుమా. ౫౨౫

శా॥ ఉగ్రక్రూరుల సంహరించి ధర ధ ♦ ర్మోద్ధారణం జల్పఁ ద్ర
త్యగ్రస్ఫీత నిశాత సాయక నికా ♦ యం బుండె; దుర్వారుఁడై
వ్యగ్రుండై మనచెంతనే కలఁడు ద్రే ♦ తాధీశ్వరుం డింకనో
సుగ్రీవా! మిముచంపుశక్తి కలదం ♦ చుం బల్కుమా ధీరతం. ౫౨౬

తే॥ విసముఁబోలు క్రూరులఁ జంప ♦ వొసఁగుగాదు, పుట్టుకం వచ్చిపుడుకలఁ♦బోవుననుట
యైమలో లేని దేఁబది ♦ యందురాద, యనఁగ నున్న సుగ్రీవున ♦ కానఁ బలుకు ౫౨౭

శా॥ మీ కిష్కింధయు మీప్రజా సుఖములుం ♦ మీపాలనా పద్ధతుల్
మీ కల్యాణులు మీరు బంధువులతోఁ♦ మేలొందఁగా నెంచుచో
నే కైలాటము లేక రండు కృత మూ ♦ హింపుండు రారేని నా
యీ కోదండ విముక్త ఘోర శర వ ♦ హ్నిద్ధమ్మంబులై చావుఁడీ. ౫౨౮

మ॥ మనకంటెం బలవంతులైన విభులం ♦ మాటాడుగాఁ గాంచ నె
న్నిన ముల్లోకములం జలాధ్యు లెచటం ♦ నీకన్న లేరన్న వ
క్కణయుం వారికి నాటునట్లు దెలుపం ♦ గాఁ గోరెదం వైళమే
చని యాపీరుల యూహ మెట్టిదియొ లె ♦ స్సంగాంచి చర్చింపుమా. ౫౨౯

చ॥ మఱియొకమాట తొట్టతొలి - మన్నన సీతులు సెప్పి యవ్విధుల్
తెలిపిని గూర్పకున్న వడిఁ ♦ ద్రెక్కొనఁ జూడకు వారి భావముల్,

నెఱవుగ నాకుఁ దెల్పుమని ♦ నీరజనేత్రుఁడు కీర్తి భూషణుం
డుఱవుగ నాడి తమ్మునిని ♦ మున్నటి పద్ధతి వీడుకొల్పెఁగన్. ౫౩౦

ఉ॥ వొదలఁబూని యన్నపలు ♦ కాదట మ్రొక్కి యతండు వేదనా
సాదిత వేగుఁడై తన వి ♦ శాల భుజంబున విల్లు నక్షయ
శ్రీద నిషంగముం జెలఁగఁ ♦ జిత్తమునం దన యన్న పాదముల్
మోదిల నుంచి తాఁ బయన ♦ ముం బొనరించె మహోగ్ర శీఘ్రుఁడై

శా॥ రామాజ్ఞంగొని లక్ష్మణుండు సుకుమా ♦ ర శ్రేష్ఠుఁడే యయ్యు దు
ర్భీమ ప్రోత్థిత వేగుఁడై మనుపు సు ♦ గ్రీవుండు కొంపోవు నీ
మామార్గంబును వీడి యెట్టయెదురౌ - గ్రామాఁకుల్ ధరిత్రీధర
స్తోమంబుల్ పొడిగాఁగ ద్రొక్కి యొక క్రొం ♦ ద్రోవన్ విస్మష్టించుచున్.

తే॥ అంఘ్రిఘట్టనచే మేరు ♦ వంత లోఁతు, పర్వతంబులు భూమియుఁ ♦ బల్లు వడియె
నిలను భరియించు దర్వీక ♦ రేంద్రుఁ డపుడు, కన్నులకుఁ బరీక్షింపంగఁ ♦ గానఁబడఁగ.

తే॥ అమితవిక్రముఁడగువాలి ♦ యనుజుఁగూర్చి, యరుగు మనుకులతిలకుని ♦ యనుఁగుఁ
వేగ మరయ నొప్పెను సాల ♦ భేదనంబు, సేయఁబోయిన శ్రీరామ ♦ సాయకమన [దమ్ము

మ॥ ఒకదిఙ్నాగము శాబకమ్ము చనఁగా ♦ నూర్పుచ్చుటం గాంచి వే
ఱొక దిఙ్నాగము తోడితే నరయ వే ♦ గోద్యుక్తమై యేగు తోఁ
పికతో లక్ష్మణుఁ డేగుచుండెఁ గృతముల్ ♦ వే జార్చు సుగ్రీవు చి
ట్టకముల్ రాముని మీఁది భక్తియును నె ♦ ట్టం దన్ను బిట్టార్పఁగన్. ౫౩౧

తే॥ పూర్వగిరినుండి పశ్చిమ ♦ భూధ్రమునకుఁ, బరచు నాజ్ఞచేఁ జను భాను ♦ భంగి నార్యు
నాజ్ఞ సౌమిత్రి ఋశ్యమూ ♦ కాద్రి నుండి, కీశవరుఁ డుండు కిష్కింధ ♦ గిరికి నేగె

తే॥ రామునుండి వెల్వడు బాణ ♦ రాజ మనఁగ, వడిగ ఋశ్యమూకమునుండి ♦ ప్లవగ గిరికి
నేగు లక్ష్మణుఁడొప్పె మృ ♦ గేంద్ర మొండు, కొండ కొండకు లంఘించు ♦ కొమరు దోఁప

తే॥ ఇట్లు కోపంబుతో వచ్చు ♦ నినకులేశుఁ, గాంచి ప్లవగులు కాలుని ♦ గన్న పగిది
గడగడ వడంకి యంగదుఁ ♦ గాంచి రాము, తమ్ముఁ డరుదెంచె నుగ్ర ♦ విధాననముడు

ఉ॥ పౌరుషవంతుఁడైన రఘు ♦ వర్యుని తమ్ముని రాకనుం గతం
బారయ డాసి డాయక ము ♦ ఖాబ్జ విలక్షణ మూహసేసి ప్రా
గ్భార లఘుప్రకారుఁడయి ♦ పాటి పితృవ్య గృహంబు చొచ్చి యం
దార వినూత్న భోగముల ♦ నందు కపీశ్వరుఁ గాంచె గ్రక్కునన్. ౫౩౯

మ॥ నవ నిర్మాణ వినూత్న భాస్వదురు ర ♦ త్నస్ఫీత విద్యుత్ప్రభా
స్ఖలన భ్రాంత సురాత్మతార్థమగు నా ♦ సౌధాగ్ర భాగంబునన్

గలిత ప్రస్తరమందు తోయ్యలులు రా ♦ కాచంద్రబింబాననల్
లలిఁ బాదంబుల నొత్త నిద్రగొను హే♦ లాలోల సోన్మత్తునిన్. ౫౪౦

శా॥ సుజ్ఞానాఢ్యులు రామలక్ష్మణులు సం ♦ శుద్ధాత్ము లీయంగఁ దా
నాజ్ఞాచక్రముతోడ నాసవము నిం ♦ పారంగ సేవించుటన్
బ్రాజ్ఞత్వంబు దొలంగువాని విలస ♦ ద్భవ్య ప్రభారాశి స
ర్వజ్ఞ గ్రావము మేరు భూధర గుహన్ ♦ బన్నుండెనా నొప్పుచున్. ౫౪౧

మ॥ లలితామోదక పాటలీ వకుళ క ♦ ల్హారాబ్జ సంఘంబులన్
విలసచ్చందన చర్చలన్ గచభగా ♦ విర్భూత గంధంబులన్
లలనాచ్ఛాంగ నిశేష వాసనలఁ దా ♦ లంకించి యామోదియై
నలువొందం దిరుగాడు గంధవహు నా ♦ నందించు నిద్రాలసున్. ౫౪౨

మ॥ మధురాలాపలు విద్రుమాధరలు భా ♦ మారత్నముల్ సేయు న
మ్మధురాలాపములన్ ఫలోష్ఠ సుధలన్ ♦ మందస్మిత జ్యోత్స్నలన్
మధువుం ద్రావి వికారచేష్టలను కా ♦ మంబున్ మదంబున్ మనో
మథనంబున్ గురునిద్ర విస్మృతి యన - న్మాంద్యంబు గొన్నాతనిన్. ౫౪౩

ఉ॥ కుండల హార సన్ముకుట ♦ కూట మరీచులు తెల్లమేనిపై
నిండుటచే దినేశ్వర వి ♦ నిర్మల దీధితి పుంజముల్ మహో
ద్దండతఁ బర్వ రాజిలు ను ♦ దార మహీధర చక్రవర్తి నా
నుండెడువాని నిద్రగొని ♦ యుండెడు వానిఁ బ్లవంగ వల్లభున్. ౫౪౪

తే॥ కాంచి తారాసుతుఁడు సమీ♦పించి కేలు,దోయి శిరమునఁ గీలించి♦ తొడరి మేలు
కొలుప యోచించి హితవాక్య♦ములు శ్రవములఁ, బడఁగ గంభీరరవమునఁ- బలికె నిట్లు

మ॥ ఉరుకోపంబు మొగంబునం దెలియ న- త్యుగ్రాత్ముఁడై లక్ష్మణుం
డరుదెంచెన్ రభసాతిరేకమున బ - హ్మాండంబె యూటాడఁగాఁ
జరుపందగ్గది యేది? నీదగు నభీ - ష్టంబిప్డు తెల్లంబుగా
నరయం గోరుచునున్నవారు కపు ల - త్యంతంబు విభ్రాంతులై ౫౪౫

మ॥ కటి లేకొప్పెడు రాజ్యసంపద బలా - త్కారంబుగా లోఁపఁగాఁ
గొఱలేకుండ సురాసవంబులు మతిం - గుంచింపఁగా దేహమున్
మఱచెన్ మాటయు స్నేహమున్ మఱచె నే - మంబొప్పఁ దారాసుతుం
డుఱిదిం దెల్పిన వాక్యముల్ వినఁగలే - కుండెన్ గపీంద్రుం డటన్. ౫౪౬

మ॥ కలభంబున్ హరిపోతముధ జెనయు నా ♦ కపస్వామి షొత్రుండు గాఁ
గల కార్యంబిట నెంత యొత్తు రుయోనర ♦ గాదంచుమఁ దత్త్వజ్ఞుడున్

లలితాచ్ఛ ప్రతిభాధుర్యోదుం గపికులా ♦ లంకాసుభటా మారుతిం
గలియంగా నగుసంచు గ్రమ్మటిలె వే ♦ గస్ఫూర్తి శోభిల్లఁగన్. ౫౪౮

ఆ॥ హనుమతోడఁ గలిసి ♦ యతనిఁబోలిన కపి, వరులఁ గలిసి మరలి ♦ బయలుదేఱి
తల్లి తార యున్న ♦ తత భర్మగేహంబు, చొచ్చె నామెవలనఁ ♦ జొప్పుపరయ. ౫౪౯

తే॥ చేరి జరిగిన వృత్తాంత ♦ మారఁ దెలిపి, భావి కర్తవ్య మేమని ♦ ప్రశ్న సేయఁ
జెడుగుసేసి తప్పికొనంగఁ ♦ గడఁగినారు, తప్పి బ్రతుకుట గలదె కృ♦తఘ్నులకును. ౫౫౦

ఉ॥ సేనలఁ గూర్చుకొంచుఁ దను ♦ చేరఁగ రండని మీకు జానకీ
జాని వచించు నాగడువు ♦ జార్చిన నాయువు జాఱు నంచు ము
న్నే నయమారఁ జల్పితి బ ♦ యిం దగినట్టులె విస్మరించుచున్
గాని పథంబుఁ ద్రొక్కితిరి ♦ కాఁగల దేమికఁ గీడు తక్కఁగన్. ౫౫౧

ఉ॥ వాలి కడింది యాయువు న ♦ వారణరీతి జముండు కైకొనన్
గోల నొకండు దాఁబఱపి ♦ కోరిన రాజ్య విభూతి నిచ్చు నా
భీలగుణుండు రాఘవుఁ డు ♦ పేక్ష యొనర్పఁగఁ దగ్గవాఁడటే!
మేలును విస్మరించుటలు ♦ మీకె తగుం బలు మాట లేటికిన్? ౫౫౨

చ॥ తన సహధర్మచారిణి ను ♦ దారుఁడు రాముఁడు వాసి కానలన్
ఘనతర చింతఁగుంది తన ♦ కాయముపై విసుగొందుచుండ మీ
రనువుగ భార్యలం గలిసి ♦ యాదట వోవని భోగసంపదల్
గొని పరిమత్తతన్ విస్మృత ♦ ఘూర్ణ మనస్కులరై తిరేమనన్. ౫౫౩

ఉ॥ తప్పితి రాడి మిక్కిలి కృ ♦ తఘ్నులరై తిరి పాప పుంజముల్
గుప్పనఁ జుట్టె బుద్ధులును ♦ కూడని త్రోవలఁ బట్టెఁ జేయఁగా
నిప్పు డొకండు గల్గునె? మ ♦ హీంద్రులతో నని సేయ నెంచుచోఁ
దప్పక చచ్చువారలని ♦ తార కటూక్తుల మందలింపఁగన్. ౫౫౪

ఉ॥ కోఁతులు పాఱి గుంపుగొని ♦ కోట కవాటము మూసి ప్రస్తర
వ్రాతము వృక్షజాలముఁ గ ♦ వాట బలంబుగఁ బేర్చి మించి తా
సీతలి కేగుదెంచిన న ♦ హింపక మర్దనసేయ వృక్ష సం
జాతము గుండ్లు గుట్టలు న ♦ సంబునఁ దాలిచి పొంచి నిల్వఁగన్. ౫౫౫

ఉ॥ వానరులా కవాటమును ♦ బంధనసేయుటగాంచి లక్ష్మణుం
డనియతుల్ స్వరక్షణ వ ♦ హించుటకా? యని కోప సంచల
న్మానసుఁడై యల్కంతిగను ♦ నవ్వి యలక్ష్యము చేసి లక్ష్మికిం
దానమైన పూత పద ♦ తామరసంబునఁ ద్రోవఁ దాఁపఁగన్. ౫౫౬

ఉ॥ అంతటఁ గోట వాకిలియు ♦ నానికఁ బేర్చిన తాలు అప్పలున్
సంతసమైన గోడలును ♦ చయ్యన గూలెఁ బ్లవంగరాజి దా
వంతపడంగ లక్ష్మణుని ♦ పావన పాదము సోఁకి ఘోర దు
ర్దాంత పురాఘ పుంజములు ♦ తాఁకి సమూలము గూలుకై వడిన్. ౫౫౭

చ॥ బలమగు కోట వాకిలియుఁ ♦ బ్రస్తర కుడ్యము లయ్యలంగముల్
సులభముగా రుటంబు చెడి ♦ క్షోభముఁ గూర్చుచు దిక్కుదిక్కులన్
మలయఁగఁ గాంచి వానర స ♦ మాజము భీతిని తల్లడిల్లుచున్
దొలఁగి చనెన్ సరాలు మని ♦ దూరముగాఁ దమ జీవరక్షకై. ౫౫౮

చ॥ మెఱపును మబ్బు లేక తల ♦ మీఱిన ప్రోదినివోలె లక్ష్మణ
స్ఫురదురు పాదతాడనము ♦ సోఁక నలంగిన కోటగోడ లా
త్తొరవుగఁ గూలఁ గ్రిందఁగల ♦ యోధుల బొమ్మలు మస్తకంబులున్
బరిపరియై యడంగఁ గని ♦ పాఱిరి లెక్కనవారు భీతియై ౫౫౯

చ॥ తెలుపఁ గడింది యైన పెను ♦ దెప్పరమందిన వానరావళుల్
కలఁగి కకావికం బఱచి ♦ కాఱియఁ గేకలు వెట్టఁ బట్టమున్
జెలువుగ మందరాచలము ♦ చిల్కిన యత్తఱి నార్భటించుచున్
జలచరరాశితోఁ గలఁగు ♦ సాగరముంబలె బిట్టు ఘూర్ణిలెన్. ౫౬౦

ఉ॥ ఈగతి వానరుల్ కలఁగి ♦ యిచ్చ తెఱంగునఁ బాఱి తత్పురిన్
నీఁగి సమీప పర్వత వ ♦ నీ కుహరాంతర భూములన్ వడిన్
డాఁగఁ బురంబు దట్టముగ ♦ డంబుగఁ బంబిన భంబు బృందమున్
నీఁగు నభంబు నా సొగసు ♦ నీఁగి బిసోరన నుండె నత్తఱిన్. ౫౬౧

ఉ॥ అంతట రాము నానతియొ ♦ యాకృతి గొన్న విధాన నూర్మిళా
కాంతుఁడు రాజవీథిని ది ♦ గాలునఁ జొచ్చుట చూచి తారతో
మంతన మాడుచున్న కపి ♦ మంత్రులదే యదె వచ్చె వచ్చె వీ
థ్యంతరముం భజించె నిఁక ♦ నయ్యెడి దేమని కేక వెట్టఁగన్. ౫౬౨

ఉ॥ అయ్యెడ నంజనీతనయుఁ ♦ డంగద మాతను గాంచి తల్లి! యా
యయ్య మనంబు సూనమున ♦ కన్నను కోమలమౌను గాన వెన్
దియ్యక నీవ యేగి యరు ♦ దెంచెడు వాకిట నడ్డగింపుమా
యియ్యెడె చేయఁదగ్గ పని ♦ యివ్వలికిం గనిపిచ్చి చూడఁడున్. ౫౬౩

చ॥ అనప్పుడుఁ దార యిట్టులను ♦ నంతటి భీతి యిఁక దేల? యేనె యా
తనిఁ గని మాటలాడి బెడి ♦ దంబగు కోప మడంగఁ జేసెదన్

జనుఁడన వారు దప్ప్వలకు ♦ జట్టున నేగిరి పుష్పవేణులో
వనితలు చుట్టిరా నరిగె ♦ వారక తార యుదార ధీరతన్. ౫౬౪

చ|| మదగజ సన్నిభుండయిన ♦ మాన్యుఁడు లక్ష్మణుఁడంతఁ గిశ రా
ట్పదవిని చొచ్చి యంతిపురి ♦ బంగరు వాకిలిఁ జేరఁ బోవ ష
ట్పదముల లాగు నైజమగు ♦ బంధుర వాసన గల్గుపెన్నెఱుల్
పొదలు వరాంగనా మణి ప్ర ♦ ఫుల్ల జలేజ దళాక్షి తారయున్. ౫౬౫

ఉ|| కాంచిన వారి దిట్టముగఁ ♦ గట్టఁగఁ జాలిన దేహకాంతియుం
బ్రాంచిత చంద్రికా నిభ ద ♦ రస్మితమున్ మఱి కల్గు లేడనం
గాంచిన కౌను లేఁగొమరు ♦ గన్న చనుల్ గరువంపు నెన్నడల్
మించిన కన్యకల్ బలసి ♦ మేవడి రాఁ జనె వాలి దారయున్. ౫౬౬

సీ|| మేనఁదాల్చిన మేటి ♦ మిసిమిపాటడు నగల్, విల్లు నమ్ముల వలె ♦ వెలుఁగుచుండ
కాలి యందియలును ♦ కౌను మేఖలలును, జేజే నినాదముల్ ♦ సేయుచుండ
పలుపలు తెఱఁగుల ♦ వంగిన ముంగురు, లరిది టెక్కెంబుల♦ ట్లందగింప
గజ్జెల రవములు ♦ ఘన భేరి స్రోఁతగఁ, బిఱుఁదులు మెఱవడి ♦ యరదములుగ
తే|| బొమలువిండ్లుగఁగన్నుల♦నమ్ములుగసమరి,యావతంబనుసైన్యము♦ య్యానఘునలమఁ,
గినుక వదలి మోమును వంచు ♦కొను టెకాక, వారిఁ దేఱిచూడఁగసర♦వాయిగొనియె.

చ|| మొగమును వాంచి కార్ముకము ♦ భూస్థలి నూని సుమిత్రసూతి యా
తగవున సత్త్వగార్ల పైను ♦ దండున నిల్చిన క్రొత్త యల్లుఁడన్
పగిదిని కొంకునొంది నిలు ♦ వం బరిశుద్ధ మహాత్మ తార కో
డిగములు లేని సిగ్గును గ ♦ డించుచు లక్ష్మణుఁ గాంచి యిట్లనున్. ౫౬౮

ఉ|| వీరకుమార! నిష్ఠమెయి ♦ వేయి సమల్ తప మాచరించినన్
మీరలు మమ్ముఁబోఁటి గృహ ♦ మేధుల యిండ్లకు వత్తురేమి? మీ
శ్రీరమణీయ పాద సర ♦ సీరుహముల్ వహియించి మాగృహం
బారఁ బవిత్రమయ్యెఁ బురు ♦ షార్థము లెల్ల లభించె మాకిటన్. ౫౬౯

ఉ|| సీమహితోగ్రమూర్తిఁ గని ♦ నిల్వక కోఁతులు భీతిచేత ది
క్కా మొగమయ్యె నీకడఁక ♦ కారణ మారయలేము తెల్పవే
రామపదాంబుజంబు లను ♦ రక్తి సతంబు భజించు నీవ యా
స్వామిని యొంటిమై విడిచి ♦ వచ్చితివేల? కుమారసత్తమా! ౫౭౦

శా|| సంగీతంబునకంటె నింపయిన వా ♦ చాస్ఫూర్తిచేఁ దార స
ర్వాంగీణ ప్రశ్నంబు గూర్చు పగిదిన్ ♦ వాచింప సౌమిత్రి సా

రంగాంకుండు దినంబునన్ వికలుఁడై ♦ రాణన్ వెలుంగారు తా
రంగాంచంగ వెసన్ సుమిత్ర మదికిన్ ♦ రా నొందెఁ బెందుఃఖమున్. ౫౭౧

ఉ॥ మంగళసూత్రమూడ్చి కుసు ♦ మంబులఁ దాల్పక రత్నభూషిత
స్వాంగము వెల్తినొందఁ గల ♦ పంబు లలందుట మాని యున్న తా
రాంగన వాలకంబు గని ♦ యత్తఱిఁ దల్లుల యిట్టి దుస్థితుల్
చంగునఁ జిత్తముం దగుల ♦ జాలిని కన్నుల నించె నశ్రువుల్. ౫౭౨

చ॥ ఇటువలెఁ దల్లు లిద్దఱును ♦ హీనదశన్ భజియించియుందు ర
క్కట! యని జాలిఁమాలి కలఁ ♦ కం గొని యేమియుఁ దోఁచకుండి సం
కటపడి ప్రశ్నసేయ నోడి ♦ కంబున నుత్తర మీయఁకుంట యొ
క్కటఁ దగుధర్మ సంగతము ♦ గాదని తారను గాంచి యిట్లనున్. ౫౭౩

చ॥ రవిజుఁడు మన్న తాను దన ♦ రాణువతో ధరణీతనూజ నీ
భువి సకలంబు రోసి సతి ♦ పోబడి తెల్పెద నంచుఁజెప్పి తా
నవలను రాని కారణము ♦ నారసి రమ్మని పంపు జానకీ
ధవుని యనుజ్ఞ వచ్చితిని ♦ దాని నిజస్థితి దెల్పుమా యనన్. ౫౭౪

తార లక్ష్మణుని సమాధానపఱచుట.

ఉ॥ పిన్నలు తప్పొనర్చు తఱిఁ ♦ బెద్దలు సైరణ సేయుటొప్పు మీ
కన్నను మిన్నలేరు కని ♦ కావ? దినేంద్రసుతుండు దూతలం
బన్నుగ వేఱువేఱుగను ♦ పంపె భువింగల యెల్ల సేనలన్
గ్రన్ననఁ దేర వారలకుఁ ♦ గాచెను గాక కడంక మానెనే? ౫౭౫

ఉ॥ క్రోఁతుల గుంపుఁ దెచ్చుటకుఁ ♦ గోట్లకొలందిగ దూతలేగి రా
దూతలు రాఁగలట్టి తఱి ♦ దూరములేదు భవత్పదాంబుజ
ధ్యాతలఁ గాచు కార్యమునఁ ♦ దల్లిని పోలిన మీరు పూర్ణ వి
ఖ్యాత యశుల్ సహింపఁదగు ♦ నట్లు సహించుటె గొప్ప ధర్మమౌ. ౫౭౬

ఉ॥ తప్పులు సేయకుండు నెడ ♦ దండన కర్తలు గల్గ రీభువిన్
దప్పులు లేనివారి యెదఁ ♦ దన్పుటకంటెను తప్పుసైఁచుటల్
గొప్ప యటంద్రు మిత్రులకుఁ ♦ గోరినవెల్ల నొసంగి వానిచేఁ
దప్పొక యించుకైనఁ దమ ♦ తప్పెగదా యని సైఁపఁగాఁదగున్. ౫౭౭

ఉ॥ సత్యమనస్కులై యరిని - చంపి సుఖాస్పదమైన రాజ్యమున్
నిత్యముగా నొసంగితిరి - నీరజనేత్రకు మీరుపోరుచోఁ
బ్రత్యయమొప్ప మీకునయి - ప్రాణము లీయర యేని యట్టి సాం
గత్యము నేతిబీఱయగుఁ - గాక నిజంబగు సౌహృదంబొకో? ౫౭౮

ఉ॥ ఇమ్మగుమేలు మీవలన - నిచ్చ గడించినవాఁడె యిమ్మల
ఱ్ఱ్యెమ్మొనరించు నేని యధ - మాధముఁడై చెడు నంతెకాక లో
కమ్మున నెద్దడిం గుడిచి - కష్టము లొంది పరమ్మునందు ని
త్యమ్మగు సౌఖ్యసంపదలఁ ♦ దన్నికొనుం దసకాలఁ దానుగన్. ౫౭౯

ఉ॥ మేటి కవీంద్రుఁ గూల్చినది ♦ మీశర మొక్కఁడె కాదె? నేఁడు దై
త్యాటవులం దహింపఁగ స ♦ హాయుఁడొకం డదియేల మీకు? మీ
బోటిని దాఁచియున్న నెల ♦ వుం దెలుపంగలరే యావశ్య మీ
పాటిరెయొనర్ప నర్హులుభ ♦ వత్పరిచారకు లివ్వానాటకుల్. ౫౮౦

మ॥ అని యింద్రాత్మజుదార తార యను వా ♦ క్యశ్రేణి నాలించుచో
ననుకంపామతి లక్ష్మణుం డపుడు ప్రీ ♦ తాయత్తచిత్తుండుగాఁ
గనలున్ మానెనకాఁ దలంచి ప్రతిభా ♦ గణ్యుండు సామీరి క్ర
న్నన నేతెంచి సుమిత్రసూతి పద కం ♦ జాతంబులన్ వ్రాలఁగన్ ౫౮౧

ఉ॥ కోపముగల్గినం గృపను ♦ గూర్చెడు లక్ష్మణుఁ డాంజనేయు సం
తాపముగాంచి యూఱడిలి ♦ తత్త్వగుణాంచిత నీవు సైతమున్
బ్రాపు నొసంగు మమ్ము మఱి ♦ వందగునే?యన వాక్యకోవిదుం
డా పవనాత్మజుండు విను ♦ మా యని తెల్పఁదొడంగె నిర్విధిన్. ౫౮౨

ఉ॥ ఓపినపెద్దలన్ జనకు ♦ నొజ్జను తల్లిని స్త్రీల గోవ్రజన్
బాపలఁ జంపువారి ఘన ♦ పాపచయంబును పాచితంబుచేఁ
బాపఁగవచ్చుఁ గాని యొక ♦ పట్టున మేలును విస్మరించు నా
పాపుల పాపముల్ తొలఁగఁ ♦ బాచిత మొండు ధరిత్రిఁ గల్గునే? ౫౮౩

ఉ॥ మీకుఁ బ్లవంగరాజునకు ♦ మేలగు మైత్రి సతంబుగాఁగ నే
నేకద నాఁడు కూరిచితి ♦ నిప్పుడు నెయ్యము శీర్ణమైనచో
నేకడఁ దప్పి యేగఁగల ♦ మేనును వానరనాథుఁ డంతియే
కాక భవత్సహృత్త్వమునఁ♦గల్మష మందుట కాదె మా మతుల్? ౫౮౪

మ॥ తొలి జన్మంబున నీభవంబునను సం ♦ తోషంబునం జేయు ప్రా
జ్ఞులసేవల్ వ్రత దాన ధర్మములు సం ♦ శోభిల్ల మీరూపమై
చెలఁగెం గాకని నమ్మియుండుఁ ద్రిజగ ♦ త్సేవ్యుల్ కృపంజూడుఁడీ
తలి దండించిన బిడ్డ తల్లి పద ప ♦ ద్మంబుల్ వడిం జుట్టదే? ౫౮౫

మ॥ కపిరాజేంద్రుఁడు మిమ్ముగూర్చి మఱవం ♦ గాలేను జంఘాలురన్
గపి సంఘంబులఁ దేరఁగాఁ బనిచి రా ♦ కం జూచుచున్నాఁడు త

త్కృపలేకేరఁగఁ దామసంబు గలిగెం ♦ గాకన్యము ల్గలునే?
కపియైనం దగవుం ద్యజింప నరకా ♦ క్రాంతుండు గాకుండునే? ౫౮౬

చ॥ తనకడ మేలువొందని యు ♦ దారుఁడు మేలొనరింప వానికై
తన కొదవంగనొతఁటిని ♦ తప్పక యాతని శత్రువర్గముల్
జెనసి యెదిర్చి గెల్చుటయు ♦ చేడ్పడి కయ్యమునందు చచ్చుటో
తన గడియింపఁగాఁ దగిన ♦ ధర్మము వేఱొక చేత యుక్తమే? ౫౮౭

ఉ॥ నీవిఁక నిందు నిల్చుటయు ♦ నీతిపథంబును గాదు శత్రులీ
త్రోవ యెఱింగిరేని మన ♦ తోయము ద్రెంపఁగఁ బూనకుందురే?
నీవ యనుగ్రహించిన వ ♦ నేచర రాజ్యరమల్ సహోదరుల్
లోవరి కేగుదెంచి యవ ♦ లోక మొనర్తువు గాక రమ్మనల్. ౫౮౮

చ॥ హనుమని మాటలల్ వినిన ♦ యార్యుఁడు కోపము వీడి రాముచేఁ
దనియ లభించు భోగములఁ ♦ దత్పరతల్ భజియించి మత్తుఁడై
మనమున మిత్రకార్యమును ♦ మాసిన యాతఁడు కాఁడు కావునల్
వనచర రాజు చూడఁదగు ♦ వాఁడని చింతనసేసి యిట్లనుల్. ౫౮౯

క॥ పలుకంగలదే? పవనజ!, పలుకఁగ సగునేమి? యన్న ♦ పరితాపంబుల్
దిలకింపఁ గలిగెనేనియు, శిలయైనం గరఁగుఁ గడుపు ♦ చెఱువగుఁగాదే? ౫౯౦

శా॥ క్రూరాత్ముండు ధరాత్మజం జెఱగొనం ♦ గోపంబు మానాగ్నియుల్
శ్రీరాముల్ దహియించుటల్ గనిన నా ♦ చిత్తంబు సోద్రేకమై
ఘోర క్రూరతఁ గొందికొంది నఱకం ♦ గోరుం జఘన్యావలిల్
గ్రూరత్వంబు నపాఖ్యయుం దలఁపఁజూ! కోపాతిరేకంబునన్

శా॥ నాకోపంబును నేనె యార్చుకొని ప్రా ♦ ణంబుల్ బిగంబట్టి సీ
తాకాంతున్ దగ నూఱడించుటకె నీ ♦ తంబయ్యె నాకాలమా
మాకోపంబు లడంగకున్న జగముల్ ♦ మాఁడున్ సురల్ చిత్తరం
తేకాకుండఁగ ధర్మమాఱు;విధిచె ♦ ద్దయిం దాఁట శక్యంబొకో? ౫౯౧

ఉ॥ పోలఁగ నిన్ను చూచి రఘు ♦ ముఖ్యుఁడు దెప్పరమందు వేళ నీ
మూలముగా శుభంబులను ♦ పొందఁగఁజేయుఁన యంచుఁ గీశభూ
పాలుని నన్ను వోలెఁ గొని ♦ భ్రాంతిని చూచుచు నిన్నినాళ్లు ప్రా
ణాలను నిల్పెఁగాక తన ♦ నాతిని రోయఁగ లేఁడె యమ్ములన్?

శా॥ ఆకాశంబన నేల? భూ జలధి శై ♦ లాంతర్గుహాసీమలన్
లోకాలోకములం ధజాండమున నా ♦ లోకించి భూపుత్త్రి వ్రా

దైవ్యకల్యంబు దొలంచి తెచ్చుటకు భా ♦ స్వద్వంశ్య కోదండమే
వీఁకం జాలదె? యైన మీపలుకు ని ♦ ర్వీర్యంబు గానొప్పునే? ౫౯౪

శా॥ ఈపాలారుపు కాలయాపనమె కా - దెన్నంగ దైత్యాలికిం
ద్రోపుం గూర్చితి రాదితేయుల హిత - మ్ముం దూల్చి పారాశరి
వ్యాపారంబులఁ గూల్చి పాపముల నొ - ప్పంగూర్చి లో నెన్నఁడుం
గోపంబూనని రామచంద్రు మదికిం - గ్రోధంబు గల్గింతురే? ౫౯౫

మ॥ అని సౌమిత్రి వచింప వాయుసుతుఁ డా - ర్యా! మించు కార్యమ్ములన్
మనమందుంపకుమయ్య మేము చలుపన్ - మైకొన్న కార్యంబు వీ
డినచోఁ బ్రాణమె వీడువార మిది పా - టింపంగ ధర్మంబె యొ
మ్మిన సాక్ష్యంబగు భానుసూనుఁ గన ర - మ్మా! ప్రేమ పై వాఱఁగన్ ౫౯౬

ఉ॥ నావుడు లక్ష్మణుం డనిల ♦ నందనుఁ గాంచి వచించు మారుతీ!
నీవనినట్లు పూర్వమును ♦ నెక్కొనఁజేసితి మా ప్రయత్నముల్
దావకబోధనం బెపుడుఁ ♦ దప్పము పోదము కీశరాణ్మనో
భావము గాంతమంచు ♦ వడిఁ బావని వెంబడి నేగె లోనికిన్. ౫౯౭

సీ॥ శరములవంటి వీ ♦ క్షణములు చెంగలు, వలవంటి సౌరైన ♦ వదనములును
వింటికోపులఁబోలి ♦ వెలుగొందు బొమలు మ, యూరంబువంటి యొ ♦ య్యారములును
అంచకై వడి మంద ♦ యానంబు ముత్తియ, ములవంటి యొప్పైన ♦ పలు వరుసయుఁ
గోమల భుజములు ♦ కోయిల కంఠముల్, బంగరు గిండ్లనఁ ♦ బరఁగు చనులు

తే॥ చంచలా లత యనఁదగు ♦ సన్న కౌను, లలరు సంపెగవంటి నా ♦ సలును కారు
మొగులు నాఁదగు కచభార ♦ ములును వెలయు, చెలులతోఁ దార శుద్ధాంత ♦ సీమకరిగె.

ఉ॥ అత్తఱి వాలిసూనుఁడు న ♦ యంబున మంత్రులతోడ వచ్చి యా
నత్తము పాదపద్మములఁ ♦ జాఁగిలి మ్రొక్కఁగ లక్ష్మణుండు వీ
రోత్తమ! నీవు మున్నరిగి ♦ యోజను దెల్పుమ యన్న నాతఁడున్
జిత్తము భాగ్యమంచు వడిఁ ♦ జేరఁగఁ బోయెను పిన్నతండ్రిన్. ౫౯౯

ఉ॥ అంగదుఁ డేగి యంతిపురి ♦ నర్కజు పాదములొత్తి నిద్దురన్
దొంగలపాలు నేసి వడి ♦ దోర్బల యుక్తుఁడు లక్ష్మణుండు లో
నంగద ఘుమ్మరింపఁ జల ♦ మంబుధికంటెను దొడ్డగాఁగ నీ
ముంగలి వాకిట న్నిలిచె ♦ మ్రొక్కెద వైళమ లేచి రమ్మనన్ ౬౦౦

ఉ॥ మత్తునఁ దెప్పిఱిల్లని సు ♦ మాళము నొందిన భానుజుండు పై
మత్తనుకాశినీమణుల ♦ ఘూర్ణముగా నొనరించు కేళులన్

జిత్తము దేటి రాఘవుల ♦ సేగి దలంపమ యట్టులుండ శే
కొత్తిన కిన్కతోడ నతఁ ♦ డేమి కతంబున వచ్చెఁ దెల్పుమా. ౬౧

చ॥ అనవుడు నంగదుం డనున ♦ యమ్మన నిట్లనుఁ ద్రొల్లి బాసచే
సిన గడువుం గతించె రఘు ♦ శేఖరు సన్నిధి కేగలేదు మే
లును తలఁపంగలేదు సుఖ ♦ లోలత సత్యము నెంచలేదు ల
క్ష్మణునకుఁ గిన్కపుట్టె హాను ♦ మంతుని సాంత్వము ప్రోచె నెల్లరన్. ౬౨

తే॥ లక్ష్మణుఁడు వచ్చు వేగబ ♦ లంబు గాంచి, కోట వాకిలి బిగియించి ♦ కోఁతిమూఁక
తాలు అప్పలు పేర్చికరములఁ బూని, నిలిచి యతని కోపాగ్నిని ♦ నిగుడఁజేయ. ౬౩

తే॥ వారిచేష్టలఁ గని యల్గి ♦ పాదమునఁ గ, వాటమిుందన్న నదియును ♦ ప్రహరితోడఁ
జేర్చు తాలుఅప్పలతోడఁ ♦ బిండిపిండి,యగుచుఁగూలి చెదరిపోయె♦నన్ని దెసల ౬౪

తే॥ దానిఁ గాంచిన వానర ♦ సేనలగతి, యేమియగ్యు నెచ్చటికేగి ♦ యిుఱుముకొనియెఁ
దెలుపనేటికి?మాతల్లి ♦ తెలిసి చెలుల, తోడ సౌమిత్రి వచ్చెడు♦త్రోవ నిలిచె. ౬౫

ఉ॥ దారికి నడ్డమైన వని ♦ తాఁజనతా పరివీక్ష సేయఁగా
నేరక లోనఁద్రోచికొని ♦ నెట్టు చిరాకున మానమూనఁగాఁ
దార మృదూక్తి మావలనఁ ♦ దప్పిది వర్తిలె?రాముపీడి యీ
తీరున రాఁగతంబు గల ♦ దే? యన నాతఁడు విన్చె సర్వమున్ ౬౬

ఉ॥ వచ్చినకార్యముం దెలుప ♦ వారక తారయు సూర్యసూతి తా
నిచ్చట నూరకుండఁడు మ ♦ హింగల వానరసేనఁ దేరఁగా
నచ్చుగ దూతలన్ దెసల ♦ కంపెను వారల రాకవేచినాఁ
డొచ్చెము లేదటంచుఁ దన ♦ యోపిన యంతకు మాన్చెఁ గోపమున్. ౬౭

చ॥ తగ విని సూర్యసూనుఁ డను♦ దాశరథుల్ కనలూనిరేని యీ
జగముల నేరెదుర్కొనఁగఁ ♦ జాలినవారలు?లక్ష్మణుండు కో
పగతిని తీవ్ర వేగమున ♦ వచ్చుచునుండఁగ నాకుఁదెల్పకీ
పగిది యొనర్చుటేల?యన ♦ వాలితనూజుఁడు తండ్రి కిట్లనున్ ౬౮

ఉ॥ ఆతఁడు వచ్చుతీరరసి ♦ యప్పుడె తెల్పితిఁగాని నీవు నీ
చేతములోన లేవు మఱి ♦ చేసెడి దేమని వాయుసూతియే
యాతతిఁ ద్రోవ దెల్పునని ♦ యేగితి నిప్పుడు మీరు లక్ష్మణున్
బ్రాఁతిగఁ జూడనేగుటయె ♦ భావ్యము చెచ్చెర రెండు నావుడున్. ౬౯

సుగ్రీవుఁడు సురాపానమును దూషించుట

ఉ॥ శ్రీవరుతోడ బాధమగు ♦ చెల్మి వహించు కపీంద్రుఁ డిట్లనున్
బావనమూర్తిచే మహిత ♦ భాగ్యము నావలెఁ బొంద రెవ్వరున్

నావలనన్ నవంతల న ♦ ణించుకొనం దలపోయుచో సురం
ద్రావి నమస్తమున్ మఱచి ♦ తప్పితి నాతనిఁజూడ సిగ్గగున్. ౬౧౦

ఉ॥ కల్లును ద్రావు కైపొకఁడు ♦ గాక మఱొక్కటిలేదు; దీనిచే
దల్లిఁ గళత్రముం దెలియు ♦ తద్జ్ఞతయే నశియించు నన్నచోఁ
గొల్లగఁ గోటిధర్మములు ♦ గూరిన నేనుగు? మాయ పైకొనన్
దల్లడమంది దానివయిఁ ♦ దార్చితి హాలను వెజ్జిపోలికన్

శా॥ మాయాబద్ధులుగాక కర్మముల న ♦ మ్మార్జించు నిష్ఠాత్ములే
మాయందాఁటి విముక్తి నొందుదురు; పై ♦ మల్లాడు కీటంబులం
బాయంద్రోచి సురన్ భజించు జనముల్ ♦ జ్వాలాకరాశాగ్నిలో
నేయిం బోయుచు నార్పఁగాఁ గడఁగు చి ♦ న్నెం బొల్చువారే చుమీ?

మ॥ తను దాఁ గాంచిన జన్మదుఃఖములు ని ♦ ర్ధామంబులై తూలెడిన్
దను దాఁ గానక రోగదుఃఖముల న ♦ ద్మంబైన దేహంబు నీ
మనుజుం డొందెడు నొందియొందిపిదపన్ ♦ మైరేయ పానంబుచే
జనుఁ డంధుండయి నూతిఁ గూలఁబడెడిఁ ద ♦ త్సాంగత్యముల్ కూడునే? ౬౧౩

సీ॥ శరణాగతార్తిర ♦ క్షణధురీణులు తత్త్వ, నిష్ణాతు లింద్రియ ♦ నిగ్రహులును
సుఖదుఃఖసమచిత్త ♦ శుద్ధిగలారు గా, కోరులను వంచించి ♦ సురను ద్రావి
మత్తునఁ బడరాని ♦ మల్లాటపడి దూఱు, గనువార లొందున ♦ ద్గతియుఁగలదె?
వంచన చౌర్య మ ♦ బద్ధోక్తి యున్మాద, మజ్ఞాన మవలేప ♦ మవినయంబు

తే॥ ప్రాక్తనాన్వయాచారగ ♦ ర్హణము శరణు, చొచ్చువారిఁ జేసిడుట ♦ చుట్టిచెఱచు;
విసము ద్రాగువారిని చంపి ♦ విడుచుఁగాని, కల్లువలె నవ్వలను నర ♦ కంబునీదు. ౬౧౪

ఉ॥ మిత్రమహోపకారము న ♦ మిత్రులుకూర్చు మహోపకారమున్
నేత్రముతోడఁ జూచినది ♦ నేర్చిన విద్యయు వృద్ధవాక్యమున్
బాత్రతనిచ్చుమార్గమును ♦ బన్నము వచ్చువిధంబు చక్క నీ
మాత్రమెఱింగెనేని జన ♦ మాస్యత నొందుట యబ్బురంబొకో? ౬౧౫

మ॥ మదిరాపాయికిఁ గీడెవచ్చునని న ♦ మ్మంబల్కు సద్వాక్య మ
య్యాది నాచే ననుభుక్తమయ్యె నిక వా ♦ దాడన్ ఫలంబుండునే?
తుదకీయాపద మారుతాత్మజునిచేఁ ♦ ద్రోవంబడం దప్పి యీ
బ్రతుకుం గంటిని గాక లక్ష్మణుని కో ♦ ప జ్వాలలన్ మాఁడనే? ౬౧౬

మ॥ సుర సేవింపఁగఁ గల్లు దోషములు నన్ ♦ స్రుక్కించె నిక్కంబుగా
సుర సేవింతు దటుండఁ జంపనమె తే ♦ చ్చుం బ్రాణగోష్ఠంబికన్

సురఁజిత్తంబున నెంతునేనియు ♦ రఘు క్షోణీశు పాదాబ్జముల్
తోఁ బఁగం ద్రోచి నలంచుఁగాక పయి నెం ♦ చంగాని చందంబునన్. ౬౧౭

మ॥ అని సుగ్రీవుఁడు తెల్విదెచ్చుకొని తా ♦ నత్యంత మోదంబుతో
నినవంశీయుని స్వాగతంబుకయి యా ♦ యిత్తంబుచేయించుచున్
దనయా! మున్నుగ నేగుమంచుఁ బాలుపాం ♦ దం బంపి చుట్టాలతో
వనితాజాతముతోడ వచ్చి భవన ♦ ద్వారంబున న్నిల్వఁగన్. ౬౧౮

సీ॥ అయ్యెడ శ్రీచంద ♦ నాగురు మృగనాభి, కాదులు వికచ ల ♦ తాంతదామ
ములును మంగళకుంభ ♦ ములును దీపశ్రేణు,లును ముత్తె ముల సరు ♦ లును ధ్వజములు
పీలికుచ్చులు శంఖ ♦ భేరీరవంబులు, వీథులయందెల్ల ♦ వెలసినిండె
శుద్ధ స్ఫటిక శిలా ♦ సుందర కుడ్య భా, గములను నవరత్న ♦ ఖచితములగు

తే॥ స్తంభములయందు లక్ష్మణ ♦ స్వామి ప్రతిఫ, లింపఁజూచువారలకు భా ♦ వింప శత స
హస్ర కార్ముక ధరులట ♦ కలవి మీఱి, వచ్చి రను సందియము దోఁపఁ ♦ బ్రజ్వలించె.

ఉ॥ వాలిసుతుండు రాఁ గనిస ♦ పార్థివపుత్రుఁడు వానరేంద్రుఁ డెం
దేలలి నున్నవాఁడనిన ♦ నిద్ధపరాక్రమ! తొల్లి బామునన్
జాలఁగఁ బున్నెముల్ సలుపు ♦ సౌరి భవచ్ఛుభదాగమంబుకై
పోలఁగ వేచుచున్ మొగిలు ♦ ముద్దిడు నా మొగసాల నుండెనాన్. ౬౨౦

ఉ॥ మేలి కడానిసొమ్ములను ♦ మించుగఁ దాల్చి రహించు వానర
స్త్రీలు కలాపముల్ విరులు ♦ తీరుగఁ జల్లుచు వెల్లచాచురాల్
లీలగ వైవఁగా విధుని ♦ లీల వెలింగెడి మొల్లిసీడఁ గీ
శాలి భజింప భానుసుతుఁ ♦ డాదట లక్ష్మణుఁ గాంచె నమ్రతన్. ౬౨౧

సీ॥ బింబాధరలు రఘు ♦ వీరుని సేవింప, నర్ఘ్యాదులను గొని ♦ యరుగుదేర
భేరీ పటహ ఝల్ల ♦ రీ రావములు మేఘ, నిస్వనంబులలీల ♦ నెరవుకొనఁగ
సంగీతవాద్యముల్ ♦ సకలదిక్కులనిండ, వేలుపుల్గని చాల ♦ విభ్రమింప
యాఁవతంబు నడుమ ♦ నవరారు కపిరాజు, రిక్కలలోఁ జంద్రు ♦ రీతి వెలుఁగు

తే॥ శ్రీయుతుఁడు సుందరుండు సు ♦ గ్రీవుఁ డుదిత,భాను పగిది రాజిల్లుచు ♦ భక్తి వినయ
సంభ్రమంబులు మునుకొని ♦ సందడింప,నియతి రామావరజుని స ♦ న్నిధిని నిలిచె

ఉ॥ వానరనాయకుం డెదుట ♦ వైభవ లీలల నట్లు గన్పడన్
మానితమూర్తి లక్ష్మణుఁడు ♦ మానసమం దుదయించు కోపమున్
మానుగ ధర్మసూక్ష్మమును ♦ మన్ననసేయు మహాత్ముఁడౌటఁ దా
మానిచె నుత్తరక్షణమె; ♦ మాన్యుల కిన్క నిమేషమేకదా? ౬౨౨

క॥ ఇరువురు తమ భుజముల నొ, క్కొరు నొక్కరు కౌఁగిలించి ♦ కొని గాటముగాఁ
దరుణులు కపులును తమతో, నరుదేరఁగ బసిఁడిమేడ ♦ కరిగిరి ప్రీతిన్. ౬౨౪

చ॥ ప్లవగకులాధిపుం డచట ♦ వైచిన సింగపు గద్దెఁ జూపి మా
నవవర! కూరుచుండు మన ♦ నవ్వుచు నాతఁడు నాదువేల్పు రా
ఘవుఁడు వనంబునందు కడు ♦ కర్కశ భూమి వసించుచుండ నే
నవిదిఁ బసిండి గద్దెపయి ♦ భాసిలువాఁడను నీవ తెల్పుమా! ౬౨౫

ఉ॥ కైకవరంబునన్ మణివి ♦ కాసి కిరీటము వీడి కానలన్
నాకనుదోయి మాఁడఁగ దృ ♦ ణప్రసరంబగు సెజ్జ రాఘవుం
డాకరణిన్ దపింప నక ♦ టా! విరులొల్కిన పైఁడి గద్దెపై
నేకరణిన్ వసింతు నది ♦ యించునె నామదికిన్ సుహృత్తమా! ౬౨౬

తే॥ అనుచు సౌమిత్రి వచియింప ♦ నర్కసుతుఁడు, కనుల జలజలమనియశ్రు ♦ కణములురల
నేమియును పల్కలేఁడయ్యె ♦ రామవిభుని, తమ్ముఁడును కదలక యట్లె ♦ ధరణినిలిచె.

తే॥ బాలురును వృద్ధులును స్త్రీలు ♦ బావురుమని, కొంద ఱేడ్చిరి కొందఱు ♦ కుందినారు
కొందఱేమియుఁ బలుకక ♦ క్రుంగిలోన, నొగిలి పోలి మహర్షుల ♦ పగిదినుండ్రి. ౬౨౭

ఉ॥ అంతట వానరేంద్రుఁడు మ ♦ హాత్ముని లక్ష్మణుఁ గాంచి తండ్రి! యీ
చింత నడంచి స్నానవిధి ♦ చేసి రసోచిత మైన యోగిరె ము
క్కింత భుజింప మేము కృత ♦ కృత్యుల మౌదుము మా గృహంబు నీ
మాంత పవిత్రతం జెనయు ♦ నన్న నరేంద్రుని తమ్ముఁ డిట్లనున్. ౬౨౮

ఉ॥ నిందయు దుఃఖమున్ గడుపు ♦ నిండుగ నుండఁ గృశించి జీవముల్
కందఁగనున్న మాకు నెది ♦ గారము నింపును గూర్చు? నాఁకటన్
గుందినయేని దుఃఖములు ♦ గూరినవేళ సుధారసంబయే
నొందఁగ నింపితంబగునె? ♦ యోచన సేయుము వానరేశ్వరా! ౬౨౯

ఉ॥ తామరసాయతాక్షు సహ ♦ ధర్మిణి యెచ్చటనుండెఁ జూపినన్
బ్రామిన యారటంబనెడి ♦ పావకు నార్పి మముఁ స్వర్ణదిన్
బ్రేమను ముంచినాఁడవును ♦ వీడక దుగ్ధపయోధిఁ బుట్టు దే
వామృత మిచ్చినాఁడవును ♦ ప్రాణము లిచ్చిన వాఁడవుం జుమీ! ౬౩౦

ఉ॥ ఆకులు దుంపలున్ ఫలము ♦ లాయస మెక్కి మిగుల్చువానినే
కైకొనువాఁడ వేఱొకటి ♦ గ్రాహ్యము కాదటుమీఱి కోరుచో
శ్రీకరమూర్తి కర్పణము ♦ సేయుమి శ్వానము ముట్టు నెంగిలే
నాకగు నిశ్చయంబుగను ♦ నమ్ముము ముట్టను వానరేశ్వరా! ౬౩౧

చ॥ మఱియొకమాట యేను క్షణ ♦ మాత్రములోఁ జని కాయలాకులన్
ద్వరపడి తెచ్చి యిచ్చిన భ ♦ వత్సహృదుండు భుజించుఁ గావునన్
నెఱవడి నేగఁగావలయు ♦ నీకును నిల్పుట పాడిగాదు నె
య్యారి గొదఁదీర్ప నీకును స ♦ మర్థ్వమె కాదొకో? వాసరేశ్వరా! ౬౩౩

చ॥ అన విని భానుసూతి జన ♦ కాత్మజనాథుఁ దలంచి లక్ష్మణుం
గని మనువంశవర్ధనుఁడు ♦ కష్టము లొందఁగ సంతసంబుతో
మనుట యనం బ్లవంగులకు ♦ మాత్రమె చెల్లునెయంచు నిశ్వసిం
చెను వడిలేచె భోగములఁ ♦ జీఁదఱ నొందెను రాల్చె నశ్రువుల్. ౬౩४

తే॥ అలఁతనొందిన మదితోడ నర్కసుతుఁడు, నీరజాక్షునికడకుఁ బో ♦ నిశ్చయించి
నిత్యసుఖములనెల్లఁ బ♦రిత్యజించి, నెనరు వహియించి మఱి యాంజ♦నేయుఁగాంచి.

తే॥ నిఖిల శాస్త్రార్థ కోవిద! నీవు దూత, లేగుదెంచెదు నందాఁక ♦ నిఁదెయుండి
రాణువలఁ గూర్చుకొని రమ్ము ♦ రాముకడకు, ననుచు లక్ష్మణుతో నడి ♦ నరుగుదేర

ఉ॥ నిండుమనంబుతో నట వ ♦ నేచరనాథుఁడు నిష్కలంకు కై
దండ ఘటించి యంగదుఁడు ♦ దాపునరాఁ దనమూఁక ముందు చ
న్చుండఁగఁ గామినీజనుల ♦ యుల్లములెల్లను వెంబడింపఁ గో
దండము కేలఁదాల్చిన యు ♦ దారుని సన్నిధిఁ జేరఁగాఁ జనెన్. ౬౩౭

ఉ॥ తొమ్మిదివేలకోట్ల కపి ♦ తోయము వెన్కయు ముందు క్రేవ లం
దమ్ముగఁ జుట్టిరా హితులు ♦ దగ్గఱి బంధులు డాసిరాఁగ ర
త్నమ్ముల సొమ్ము లెండలను ♦ తన్పగు వెన్నెలలన్ దటిత్తులన్
జిమ్ముచునుండ భానుఁజుఁడు ♦ చేరఁగఁబోవుచునుండె రాఘవున్. ౬౩౮

ఆ॥ ధ్వజము లతిశయించె ♦ వాద్యధ్వనులు చెల, రేఁగెఁ జిందములును ♦ మ్రోఁగె నగల
జిగులు మెఱుఁగు గముల ♦ పగిదిని నెగడారె, ధూళి మొగసి మిన్ను ♦ తొడరికప్పె.

తే॥ బంగరును వెండిము త్తెముల్ ♦ స్ఫటికములును, మణులు వలువలు కూర్చియ ♦ మర్పఁబడిన
పల్లకులు దట్టమై కాన ♦ వచ్చె వెల్ల, గొడుగులు మనోహరంబుగఁ ♦ గూడివచ్చె.

తే॥ లక్ష్మణుని మృదుపదములి ♦ లాతలమున, నానుచుండుటచే నర్క ♦ సూనుఁడంద
మైన వీరఘంటలు మ్రోఁగ ♦ నతనివెంట, భూరథమున శిబిక వెంటఁ ♦ బోవుచుండె.

ఉ॥ వీరగుణోత్తరుండు రణ ♦ భీకరుఁ డార్యుఁడు లక్ష్మణుండు పం
కేరుహమిత్ర సూనుఁడును ♦ క్రేవల వచ్చెడు మూఁక వెన్కకుం
దూఱఁగ రామదర్శన కు ♦ తూహల మయ్యెది ముందువోవఁగా
శ్రీరఘువీరసింహుఁడు వ ♦ సించు గిరీంద్రముఁ జేరి రయ్యెడన్. ౬४०

ఉ॥ అందఱచేతఁ గోరఁబడు ♦ నట్టి మహోత్కట భోగభాగ్య రా
జ్యేందిర మీఁది భ్రాంతిఁ ద్యజి ♦ యించి రమేశు పదద్వయంబు ని
ష్పంద మనంబుతోఁ గొలువ ♦ వచ్చిన భక్తుఁడు భానుసూతి ము
న్నొందఁ భజింపవచ్చు నన ♦ యుర్వి భరతుం దలపించె నత్తఱిన్. ౬౪౩

ఉ॥ ఎప్పుడుఁ దోడునీడవలె ♦ నిమ్ముగనుండెడు లక్ష్మణుండు త
న్నెప్పుడు పాసిపోవ విల ♦ యాంతమునన్ భువనంబు లాఱఁగాఁ
దప్పక యొంటినిల్చు పర ♦ తత్త్వముకై వడి నున్న రాఘవున్
జప్పునఁ గాంచి నేలఁబడి ♦ సాఁగిలి మ్రొక్కెను భక్తి పెంపునన్. ౬౪౪

శా॥ సుగ్రీవుండు నమస్కరింపఁ గని ర ♦ క్షోవైరి ప్రేమంబుచే
వ్యగ్రుండై యురమందు లక్ష్మియును నో ♦ వన్ దీర్ఘ బాహార్గళిన్
బ్రగ్రీవంబున కర్యమాత్మజుని శ్రీ ♦ ర్షంబాన గాఢానురా
గ గ్రైవేయకమో యనంగ నలమెన్ ♦ గారుణ్య భావంబునన్ ౬౪౫

శా॥ కూర్చుండన్ సెలవిచ్చి ప్రేమమునఁ గా ♦ కుత్థ్సుండు బ్రహ్మాండమం
దర్చారూపుఁడు కాంచి నీప్రభుత సాం ♦ పారంగ నిర్విఘ్నమై
పేర్చంగాదే? జనంబులెల్లరును ని ♦ ర్భీతిన్ సుఖంబుండిరే?
చర్చింపన్ జలదంబుఁబోలెఁ గపిరా ♦ జ్యం బెల్ల రక్షించెదే? ౬౪౬

మ॥ అని సంప్రశ్నము సేయు రామునకుఁ గీ ♦ శాధ్యక్షుఁ డోదేవ! నీ
యనుకంపార్ద్రి కటాక్ష దృష్టిగల మా ♦ కబ్రంబె సౌఖ్యాలికిన్?
ఘన తామిస్ర చయంబు లెన్నియయినన్ ♦ గంజాప్తు సాన్నిధ్యమం
దున నిల్వంగలవే? భవాబ్ధి తరణ ♦ ద్రోణీ! దయాంభోనిధీ! ౬౪౭

తే॥ నీయకారణ సత్కృపా ♦ నియత సంప, దంధతను మీఱితిని భవ ♦ దాజ్ఞ నేను
నైజమైన కాపేయంబు ♦ నన్ మహాత్మ!, బుద్ధివచ్చె మన్నింపవే ♦ పూతచరిత! ౬౪౮

మ॥ కకుబంతంబుల దాఁక నీజగములన్ ♦ గాలించి యెందున్న జా
నకి నేపారగఁ దెచ్చియిచ్చు బలన ♦ న్నాహంబు. నేఁ గల్గియున్
వికలాత్మన్ మఱి నీవు దుఃఖపడఁగా ♦ విస్తారభోగమ్ములం
దకటా! మగ్నుఁడనై, పరాకునను కా ♦ లాతీతముం జేసితిన్. ౬౪౯

తే॥ నా స్వభావంబు నానీతి ♦ నాతలంపు, లిట్టివయ్యె సిగ్గయ్యెడి ♦ నెదుటనిలువ
నింక నను గూర్చి పలుమాట ♦ లేల రామ, భద్ర! రణవీర! విలసత్కృ ♦ పా సముద్ర!

మ॥ కమలావత్సుఁడు రాఘవుండనుఁ బ్లవం ♦ గ గ్రామణీ! వర్షకా
ళము వేచన్నను వత్సలత్వమున నా ♦ లాపించు నీవాక్యముల్

ప్రమదారత్నము రోయుకార్యమును సం ♦ భావించుటంజేసి య
ల్పము లై తోఁపవు న్యూనతం దెలుప నే ♦ లా ప్రేమ నిండారఁగన్. ౬౫౧

మ॥ భరతుం బోలిన భక్తియుక్తుఁడవు ప్రత ♦ వ్యాంబోకు మీ చన్నయ
న్నైరసుల్ మూఁడవకన్ను డాఁచిన మృడా ♦ నీభర్త సర్వజ్ఞుఁడ
ప్పర మోదారుఁడు మారుతాత్మజుఁడు నీ ♦ పజ్జం బ్రకాశింపఁ డ
చ్చెరువయ్యెం గతమేమి యున్నఁ బ్లవగ ♦ శ్రేష్ఠుండు తా నిట్లనున్. ౬౫౨

ఉ॥ దూతలు కోఁతి మూఁకలను ♦ తోడ్కొని రాఁజనియున్నవారు వా
రీతఱిదాఁక రారు గదు ♦ వింకను జేపటిదాఁక నుండె ని
ర్ణీతిని వచ్చిచేరిన వ ♦ నేచరవర్గముఁ దోడితే మరు
త్సూతిని నిల్పివచ్చితిని ♦ తొందరవచ్చును నేఁటరేపటన్. ౬౫౩

తే॥ వెంటవచ్చెను తొమ్మిది ♦ వేల కోట్లు, రావలయు సైన్యములును ని ♦ ర్ణయము చెడక
రాఁగలవు రేపెవచ్చుత ♦ ర్వాత మిగత, కార్యమును నిశ్చయింత మ ♦ క్కఱగననుడు.

చ॥ తలఁచినకార్యమున్ బలయు ♦ తంబుగఁ జక్క యొనర్చు టన్నచోఁ
జులుకన గాక దొడ్డగునె ♦ సూర్యకుమారక నీకు? శ్లాఘ్యమీ
యలఘు వినీత భావమది ♦ యందఱ కబ్బునె? నేఁడుపోయి రే
పెలమిని రమ్మటంచు సెల ♦ విచ్చి ప్రియంబునఁబంపె భానుజున్. ౬౫౪

ఉ॥ వాలితనూజుఁ గాంచిప్రియ ♦ వాక్యములాడి కుమార నేఁడు నీ
ప్రోలికి నేగి తండిరికిఁ ♦ బూర్తిగఁ దోడ్పడుమంచుఁ బంపి శ్రీ
లోలుఁడు తమ్ముతోడఁ దన ♦ లోపలి జానకి తోడఁ దన్నిశా
కాలము ద్రోచివైచెఁ గడఁ ♦ కన్; భువి నిల్చినఁ గాల మాఁగునే? ౬౫౫

ఉ॥ రాతిరి కీర్తికాముఁడగు ♦ రాముఁడు తమ్మునిగాంచి నాయనా!
కోఁతులఱేని నెట్లుగనుఁ ♦ గొంటివి! తత్థ్సలి నేమికూరె? నా
కాతతరీతిఁ దెల్పుమన ♦ నాతఁడు దెల్పుచునుండె నన్నయున్
బ్రీతిని విన్చునుండెఁ జనె ♦ రేయియుఁ బ్రొద్దును వచ్చెఁ గ్రమ్మఱన్. ౬౫౬

౫ కపిసేనా సందర్శన పటలము. (౪౦)

ఉ॥ సూర్యుఁడు పూర్వదిక్తటిని ♦ శోభిలు మున్నుగ లేచి సూర్యవం
శార్యుడు నిత్యకృత్యముల ♦ నాదరమొప్పఁగఁ దీర్చె; ధాత్రి యీ
ధుర్యత నోర్వదన్ దిగులు ♦ దోఁపఁగ వానరసేన నైజమా
చర్యలు సేయుచున్ జనక ♦ జాపతిఁ జేరఁగవచ్చె నత్తఱిన్, ౬౫౭

తే॥ శతసహస్ర నాగబలులు ♦ సైన్యపతులు, వేవురొగి వెంటరాఁబడి ♦ వేలకోట్లు
ఛంధమును బోలుం నచ్చుంపు ♦ ఛందమొప్ప, సేనతో శతబలి వచ్చి ♦ చేరెనటకు.

తే॥ మధువు నెక్కువ గ్రోలియు ♦ మత్తుగొనక, మేరువును గూడఁ బెకలింప ♦ మీఱుమేటి
శిక్షణులు వానరులు పది ♦ లక్షకోట్లు, వెంబడింప సుషేణుండు ♦ వేగవచ్చె. ౬౬౦

తే॥ సరసవాక్య రుమాదేవి ♦ జనకుఁడైన, తారుఁడు పయోధి క్షణములో ♦ దమ్మునేయఁ
జాలు నలువది యెనిమిది ♦ వేలకోట్ల, కపిచయంబుతో రవిసూతి ♦ కడకువచ్చె. ౬౬౧

తే॥ దివిని భువిని శాశ్వతకీర్తి ♦ నివ్వఁజేయు, హనుమతండ్రి కేసరియను ♦ నగచరుండు
కోఁతు లేఁబది లక్షల ♦ కోట్లు గొలువ, వెలసి దినరాజసూనుని ♦ గొలువవచ్చె. ౫౬౨

తే॥ అలుక గొలుప భాస్కరునేని ♦ నలఁచి వైచు, క్రోధమునవసుంధరనేని ♦ గ్రొచ్చిత్రోచు
కొండ్రముచ్చులు నలువేల ♦ కోట్లు బలయు, నక్షయబలుండు వచ్చెగ ♦ వాక్షుఁడటకు

ఉ॥ ఆది వరాహమూర్తి బల ♦ మందిన వారలు రోమరాజి శై
లాదులఁగట్టి యీడ్వఁగల ♦ యట్టి యెలుంగులు రెండువేల కో
ట్లాదటఁ గొల్వ వానర వ ♦ రాధిపుఁ జేరఁగ వచ్చె జాంబవ
త్సోదరుఁ డాజిభీకరుఁడు ♦ ధూమ్రుఁడు మిక్కిలి కౌతుకంబునన్. ౬౬౪

తే॥ పిడుగు హాలాహలముఁ బోలు ♦ భీకరుండు, పనసుఁడనువాఁడునడగొండ ♦ యనఁగవచ్చె
వినుత బలయుతుల్ పండ్రెండు ♦ వేలకోట్లు, కీశవరు లోలిఁ గొల్వసు ♦ గ్రీవుకడకు. ౬౬౫

తే॥ అగ్నికొడుకు నీలుండను ♦ నగచరుండు, కంధి కంధర సన్నిభ ♦ కంఠ రవుఁడు
యమసమాను లేఁబదికోట్ల ♦ యగచరాళిఁ, దోడుకొనివచ్చె రవిసుతు ♦ తోయమలర

తే॥ గురుభుజుండు విశాల వ ♦ క్షుండునైన, దధిముఖుఁడు స్థిరకార్యులు ♦ దగ్రమూర్తు
లుగ్రులైన ముప్పదికోట్ల ♦ యువక వనచ, రావళులతోడ వచ్చి సు ♦ గ్రీవుఁ గలిసె.

తే॥ తాము వసియింప వేఱొక ♦ ధాత్రియున్నఁ, జాలదననొప్పు ముప్పది ♦ వేలకోట్లు
సింహభీకరులగు కపి ♦ సేనతోడ, వచ్చి దిగియెను విఖ్యాత ♦ బలుఁడు గజుఁడు. ౬౬౮

తే॥ అంబుధి తరంగములఁబోలె ♦ నంటియంటి, వచ్చు, వేయు నేఁబదికోట్ల ♦ భల్లుకేంద్ర
వితతితో బ్రహ్మపుత్త్రుఁడు ♦ వీరవృద్ధు, జాంబవంతుఁ డేతెంచె ను ♦ త్సాహమడర.

తే॥ అజుని యాజ్ఞచే దనుజుల ♦ యాయువడఁప, వచ్చెననఁ బదిలక్షల ♦ పంక్తులిరువ
దైన సేనలతో సాటి ♦ లేని కడిమి, నొప్పు దుర్ముఖ ప్లవఁగ వ ♦ ర్యుండువచ్చె

తే॥ అశ్వినీదేవతల యంశ ♦ మందు పుట్టు, విక్రమోన్నతుల్ మైందుండు ♦ ద్వివిదుఁడనెడి
ప్లవగు లొక లక్ష కోటి బ ♦ లంబు తోడ, ధూళి మిన్ను గప్పఁగ వచ్చి ♦ దూఁకినారు

తే॥ మల్లయుద్ధకోవిదుఁడు స ♦ న్మహితగుణుఁడుఁ, విజయశీలి కోటికిఁ గోటి ♦ వెలయుదళము
వెంటరా గోముఖుండను ♦ వీరవరుఁడు, భుజయుగము పొంగ రవిపుత్త్రు ♦ పొంతఁ జేరె

తే॥ గాలియన గాలిపట మనఁ ♦ గ్రాలి యలల, తోడి కడలినా ♦ నుప్పొంగి ♦ తొమ్మిదియగు
కోట్ల రాణువతో వచ్చెఁ ♦ గుముదుఁ డటకు, విజయమే రూపమందిన ♦ విధముఁదోఁప

తే॥ ప్రళయకాలమందేని న ♦ శ్వరములేని, ప్రోడ పద్మముఖుం డేను ♦ నేడు వేల
కోట్లసంఖ్య యొప్పారెడు ♦ కోఁతిమూఁక, తోడవచ్చె భూతలమెల్ల ♦ ధూళిగ్రమ్మ.

తే॥ విలయమున జగములు చెడ ♦ పీఁకచెడని, కులమహీధ్రములన లావు ♦ కొమరుమెరవు
గలుగు తొంబదికోట్ల సం - ఖ్యకుమతించు, దళముతో ఋషభుఁడు రవి♦తనయుఁజేరె

తే॥ కడలికంటెను విస్తరమైన ♦ కట్టికోఁతి, మూఁకలను లెక్కకందని ♦ మొత్తములను
పిలిచికొని దీర్ఘపాదుండు ♦ వినత శరభు, లొక్కరొక్కరుగా వచ్చి ♦ రుల్లసిల్లి. ౭౭౬

తే॥ రవికిఁగూడ భీతిల్లని ♦ పవనసుతుఁడు, దెసలుచిన్నవియగ నొప్పి ♦ మసురు కవిసి
యున్న యైదైదు వేల కో♦ట్లొలయు బలము, గొప్ప నడతెంచె ధాత్రియు♦నొడ్డగిలఁగ.

తే॥ వేలుపులకును లెక్కింప ♦ వీలుకామి, యముఁడు కాంచి దిగ్భ్రమమొంద♦నరిదియైన
లక్షకోట్ల యెన్నికగల ♦ పక్షబలము, లొలయ విశ్వకర్మసుతుఁడు ♦ నలుఁడు వచ్చె

తే॥ రాము నమ్ములపొదలోని ♦ ప్రదర సంఖ్య, తోడఁ బోల్పంగఁదగినది♦ తోడరి తెచ్చె
శంఖ కుంభుల విస్తార ♦ సైన్యచయము, లోకులకు లెక్కవెట్టంగ ♦ లోనుగాదు

సీ॥ ఇట్లుకూడిన వాన ♦ రేశ్వర సైన్యంబు, మునుఁగంగ జాలదు ♦ వనధిజలము
త్రొక్కిన దిక్కమే ♦ రువును ధరాస్థలి, యొడ్డగెడవుగాఁగ ♦ నొరగిల్లుఁ
జరియింపఁ దొడఁగిన ♦ జగమందు నువుగింజ, నిడుటకేని యెడమ్ము ♦ నెనయకుండుఁ
గినిసిన రవియును ♦ కీలియుఁ గాలి బొ, గ్గగుదురు భుజియింప ♦ నండచయము

తే॥ పిడికెఁడేసియేనియు నాఁటి ♦ యిడఁగరాదు, వెరసి లెక్కింప డెబ్బది ♦ వేల బ్రహ్మ
లంగవించియు వ్యర్థప్ర ♦ యత్నమగును, కెరలిచూచి చిచ్చుటకంటి ♦ గెలువఁజాలు.

తే॥ విఱువఁదలఁచిన మేరువు ♦ విఱువఁగలదు, పొడువఁదలచిన మింటిని♦పొడువఁగలదు
పట్టఁదలఁచిన యముసైనఁ♦బట్టఁగలదు, త్రావఁదలఁచిన జలధులఁ ♦ ద్రావఁగలదు.

తే॥ కడలదాఁటి యవ్వల దూఁకఁ ♦గడఁగువారు, విభునిపనికిఁ బ్రాణములేని♦విడుచువార
లఱువదేడుకోటుల పది కాధిపతులు, గొప్పసేనతో సుగ్రీవుఁ ♦ గూడినారు. ౭౭౭

తే॥ వసుధకంటెను విస్తృతిని మిం ♦ చిన దళమ్ము, లెలమి నలమఁగ దళపతు♦లెల్లవచ్చి
సప్తహరిదశ్వ సుతుపాద ♦ జలజములకు, సరగ నెఱఁగి క్రొవ్విరులను ♦ చల్లినారు.

తే॥ ఇట్లు వచ్చిసేనలు నిండ ♦ నినసుతుండు, దాశరథికడ కరుదెంచి ♦ త్వరితగతిని
అఘవిదార! తలంచుచు ♦ న్నంతలోన, దడము లేతెంచెఁ జిత్తగిం ♦ పుఁడి యటన్న.

ఉ॥ మోహనమూర్తి కాంచి పరి ♦ మోద భరంబున మోమెలర్పవై
దేహిని యప్పుడే కనిన - తీరున నంగద వీడి సైన్య సం
దోహమునెల్లఁ గాంచెదు కు ♦ తూహలమంది నగేంద్ర శీర్ష మా
రోహణసేసె; భానుజుఁడు ♦ కోఁతులమూఁకను చేరి యవ్వలన్. ౭౭౮

తే॥ పదియునై దుఱయోజనముల ♦ పరపుగలిగి, యిచటినుండి దక్షిణమున♦ కేగుఁడనుచు
నాజ్ఞయిడి సైన్యములకుఁ సై♦న్యాధిపతులఁ,బిలుచుకొని వచ్చె శ్రీరామ♦విభునికడకు

తే॥ వచ్చి సేనలఁ జూపుచుఁ ♦ బార్థివేంద్రు, కడన యుండఁ బాలకడలి ♦ కడలతోడఁ
దెరలి ప్రవహించుచందానఁ దివిరి సేన, బహుళ కోలాహలంబుతో ♦ బయలు వెడలె.

ఆ॥ అష్టదిశలు భూమి ♦ యనిమిషలోకంబు, వనధిచయము మఱుఁగు ♦ పడఁగ సైన్య
ఘట్టనలను దుమ్ము ♦కడురేఁగ బ్రహ్మాండ,ఘటము నెలసె మట్టి♦కడవయనఁగ. ౭౯

చ॥ మొనలకు గొప్ప వారినిధిఁ ♦ బోల్తుమ యన్న సముద్ర విస్తృతిం
గనిన జనంబులుం గలరు ♦ గావునఁ బోలిక కేదియుండు? నా
యినకులు లట్టులే దినము ♦ లిర్వది చూచియుఁ జక్రమధ్యముల్
గనరనఁ బూర్తిగాఁ దెలియఁ ♦ గాంచుసమర్థులు గల్గనేర్తురే?

చ॥ జయమునఁ బ్రౌఢిమంబునఁ బ్ర ♦ శస్తబలంబున సాటిలేని శ్రీ
దయితుఁడు కన్నులన్ మదిని ♦ తర్కవిధంబున నింగితజ్ఞతన్
బయిపయిఁ గాంచి కాంచి మఱి ♦ పట్టుగ నూహ మొనర్చి సైన్యసం
చయములఁ గూర్చి ప్రేమ నను ♦ జన్మునిగాంచి వచించె నివ్విధిన్. ౮౦

మ॥ మనబుద్ధింగొని చూచినారము చమూ ♦ మధ్యంబు నీక్షై వడిం
జన సంపూర్తిగఁ గాంచు నోపికయు నెం ♦ చన్ లేద యంభోనిధిన్
గనినట్లందు రెకాని యెవ్వరు తదా ♦ కారంబు పూర్ణంబుగా
గనినారో యని సంశయంబు గలుగున్ ♦ గాకుత్స్థ చూడామణీ! ౮౧

మ॥ ప్రమితిన్ సర్వజగన్నియామకుని స ♦ ర్వవ్యాప్త దేహంబుఁ, బం
చ మహాభూతములన్ దిశాంతముల, సూ ♦ క్ష్మజ్ఞానముల్ బల్కులన్,
భ్రమలంగొల్పు మతప్రవక్తల యభి ♦ ప్రాయంబులన్, గీశసై
న్యములన్, సాంతముగాఁ గనుంగొనిన పు ♦ ణ్యాత్ముల్ కలన్ వత్తురే?

శా॥ ఈసైన్యంబుల నిందయుండి రహిమై ♦ నీక్షింప యత్నించు-చో
గాసింబొందుట కాలముం జనుటయుం ♦ గాకొండు గానేర్చునే?
మా సుగ్రీవునితోడఁ గ్రచ్చఱఁగఁ గా ♦ ర్యాలోచనల్ చేసి సీ
తా సౌగంధికగంధి నారసెడు చేఁ ♦ ♦ తల్ చూడ మేలౌఁగదా! ౮౩

చ॥ అన విని లక్ష్మణుండను మ ♦ హాశయ యీాకసిసేన యెందు నే
ఘనమగు కార్యమైన క్షణ ♦ కాలములో నవలీల నేర్పమై
నొనరుపఁజాలు; జానకి న ♦ యోనిజ రోయుట దొడ్డకార్యమే?
పనిగొని ధర్మమే గ్లెలిచెఁ ♦ బాపముల్లె నశించె రాఘవా! ౮౪

చ॥ నలినభవుండు గొప్పజత ♦ నంబునఁ జేసిన సృష్టియందు జీ
వుల గములన్నియుఁ జలధి ♦ భూధర సన్నిభమై చెలంగు నీ
బలిముఖ సైన్యసంతతులఁ ♦ బట్టుగ లెక్కిడఁ బూని యుంచు నా
పలుగలు గాఁగఁ దోఁచె ముని ♦ సన్నుత నిర్మల సద్గుణాకరా! ౧౯౫

శా॥ ఆలస్యం బిఁకనేల మైథిలిని యో ♦ గ్యప్రాప్తి రోయంగఁ గీ
శాలిన్ దిక్తతి కంపుటే తగిన కా ♦ ర్యంబంచు వాక్రువ్వఁగా
శ్రీలక్ష్మీ హృదయేశుఁ డాప్తవరు సు ♦ గ్రీవుం బ్రబోధించుచున్
గాలాతీతములేని పద్ధతిని ప ♦ ల్కెంబూనె మోదాత్ముఁడై. ౧౯౬

## ౧౦ అన్వేషణ ప్రేషణ పటలము. (౭౪)

మ॥ జనతానైజ మహాభిమానము మన ♦ స్తాపంబు నన్యోన్య భ
ర్జన విద్వేషము లేమిలేక విపులో ♦ త్సాహంబుతో నొప్పు నీ
మన సైన్యంబుల లెక్కవెట్టఁ దలఁపన్ ♦ మానం బొకండున్నె ధా
త్రిని? మోదంబునఁ దెల్పుమా యనుడు సు♦గ్రీవ ప్రభుం డిట్లనున్. ౧౯౭

సీ॥ ఎనిమి దక్షౌహిణు ♦ లేకంబు నాఁబడు, నెనిమి దేకములైన ♦ నేకకోటి
కోటు లొకెన్మిది ♦ గూడి శంఖంబగు, నవి యెనిమిది కుము ♦ దాఖ్య నొప్పుఁ
గుముదంబు లెనిమిది ♦ యమరఁ బద్మంబగుఁ, బద్మంబు లెనిమిది ♦ పరఁగు నాడి
నాడు లెన్మిది చేరి ♦ సన్ సముద్రంబగు, సంద్రంబు లెనిమిదై ♦ చనును వెల్వ

తే॥ అట్టి * వెల్వలు డెబ్బది ♦ యమరు సేన, యిందు సేనాను లఋవది ♦ యేడుకోట్లు
వీరలకు నెల్ల మొనగాఁడు ♦ క్రూర కాలు, నైన నలఁపఁజాలిన నీలుఁ ♦ డనెడివాఁడు.

తే॥ అనిన రవిసుతుఁ బ్రేమమైఁ ♦ గని నృపాలుఁ, డింక వ్యర్థ ప్రసంగంబు ♦ లేల మనకు
సక్రమముగాఁగఁ గర్తవ్య ♦ సరణి చూడ, నగుఁగదా యన్న సుగ్రీవుఁ♦ డనుమఁగాంచి

క॥ జనకునివలె జనము బలం, బును గలిగిన నీవు కార్య ♦ మున మునుకొనకీ
యనువున నితరుల బలమును, గను వేడుక నుంట తగునె ♦ కరువలిపట్టీ! ౨౦౦

ఆ॥ ఈవ బయలుదేఱి ♦ యిలయెల్ల గాలించి, భోగ భూమి వెదకి ♦ భోగిలోక
మరసి తరణి కులజు ♦ తరుణి యునికిఁ గాంచి, తెలివితోడ బలముఁ దెలుపఁ దగవె?

చ॥ దనుజుని పట్టనం బిటకు ♦ దక్షిణ దిక్కున నుండుఁ గావునన్
ఘన జవ మొప్పఁగా నరిగి ♦ కర్బురవర్యుల గెల్చి శ్రేయమున్
జనక కుమారికిన్ ధరణి ♦ జాపతికిన్ మఱి మాకుఁ గూర్చి కీ
ర్తిని వహియింపఁగాఁ దగిన ♦ తేఁకువ నీక యొసంగు మారుతీ! ౨౦౧

* 3600177183200 ఒక వెల్లువ; 256842 389744000 డెబ్బదివెల్లువలసంఖ్య.

అ॥ వాలిసుతుఁడు జాంబ ♦ వంతుఁడు తక్కిన, బలము రెండు వెల్లు ♦ వలును మీఁకుఁ
దోడుగాఁగ వచ్చుఁ ♦ దోయజాక్షిని రోసి, త్వరగ రండు క్షేమ ♦ వార్తతోడ.

తే॥ వరుణ దిశకు ఋషభుఁ డేగి♦యరయువాఁడు,వినతుఁ డింద్రుని దిక్కున♦వెదకువాఁడు
ధనదు దెస శతబలి రోయ ♦ మొనయువాఁడు, రెండు రెండేసి వెల్వాల ♦దండుతోడ.

తే॥ శ్రమమునకు నోర్చి పలు ప్రదే♦శములఁ జొచ్చి, రామదేవి నన్వేషించి♦ రావలయును
గడువు నెల గల్గు నంతలోఁ ♦ గడఁకతోడ, వచ్చి తెలుపుఁడు మీర ల ♦వార్తలెల్ల.

తే॥ * దక్షిణంబున కేగ య ♦ త్నంబుసేయు, వారిఁగని వెండి మీరలు ♦ భవ్యమైన
విష్ణు విశ్వరూపంబున ♦ వెలయుచున్న, వింజమును దొల్తఁ గాంచుఁడీ ♦ వేడ్కతోడ

తే॥ వింధ్యగిరియందు దేవిని ♦ వెదకిచూచి, యవల వేల్పు డిగ్గియ యన ♦ నలరి షట్ప
దముల ఝుంకృతిచే శ్రవ ♦ ణముల కింపు, గూర్చు నర్మదఁ జేరుఁడు ♦ కూర్మిమీరు.

తే॥ అమరకాంతలు డోలిక ♦ లందు తూఁగి, సేయు గానామృతము గ్రోలి ♦ చేష్ట లుడిగి
యలరి తూలి నిద్రించెడి ♦ యశునపక్షి, కూటముల కిరవగు హేమ ♦ కూటము గని.

తే॥ అచటఁ గలుగు పూఁబొదరిండ్ల ♦ నరసి కడచి, యుత్తర పినాకినీ నది ♦ నుత్తరించి
సుందరంబులై యలరారు ♦ చోటులెల్ల, నెమకి యవ్వలఁ జనుఁడు ని ♦ ర్నిద్రులగుచు.

తే॥ తావి యగురు వృక్షములు చం ♦ దన వనంబు, లేపు మీఱి భాసిలు విద♦ర్భాపురంబు
నరసి నానా పురంబుల ♦ నధిగమించి, దండకాటవిఁ జేరుఁడు ♦ త్వరితగతిని. ౨౦౦

తే॥ పిదపఁ గమలాకరములచే ♦ వృక్ష సాంద్ర, మగు తలంబులచే రమ్య♦మై యగస్త్య
మౌని వసియించు పుణ్యాశ్ర ♦ మంబు గనుఁడు, పావనస్థలుల్ దర్శింపఁ♦బాప మీఁగు

తే॥ ప్రసవజాలసంభృతమైన ♦ వన ముదారు, సంపదంబోలె స్థిర వికా ♦ సంబు నొందుఁ
బూవుఁబోండ్ల తీయని మోవిఁ♦బోలు ఫలము,లెల్ల ఋతువులలో ఫలి♦యించుచుండ

తే॥ అచటివారలు కనుఱెప్ప ♦ లార్పకుండ్రు, గాఢనిద్ర సేయరు మోద ♦ కర సుఖంబు
లచట సుస్థిరమై యుండు ♦ నర్కుఁడేని, చొరఁగలేఁడు తగ్గనివగు ♦ ఝరములుండు.

తే॥ దాని దాఁట నిశాకరు ♦ డాఁకి యొరయు, నదియు భానుండు విశ్రాంతి ♦ననుభవించు
పట్టునాఁ దోఁచునదియు నొ♦పాండుశైల, మొండు కన్పట్టు నచటికేఁ♦బొండుమీరు.

సీ॥ సతతంబు జీవన ♦ సంద్రార్థియై ప్రవ, హించుచుండుటచే ర♦హించునదియుఁ
గనక రేణువుల ము ♦ క్తాఫలంబుల రత్న, సంచయముల దొర ♦ లించుకొనుచు
గొల్లల కవ్వముల్ ♦ కొల్లలాడుచు ఘన, ద్రుమ నికరంబులఁ ♦ ద్రోచికొనుచు
జీవజాలముల నీ ♦ డ్చికొనుచు మునిఁగిన, వారి పాపము నోట ♦ వైచికొనుచు

* ఇట నుండి గల పద్యములలోని వింధ్య నర్మద దండక అగస్త్యాశ్రమమః గోదావరి యనునవి కిష్కింధకు త్తరముననుండునని. వింధ్యమును మధ్యప్రదేశముగా నుంచుకొని నాలుగుదిక్కులకు కపులను పంపెనని వ్యాఖ్యకారులు వ్రాసియున్నారు. అట్లు చూచినను తక్కినవియు స్థలక్రమ విరుద్ధములైయున్నవి.

తే॥ వచ్చు పావన నది యొండు ♦ వఱలుచుండు, ధర్మమార్గంబుకరణి నౌ ♦ దార్యమట్లు
పరఁగు గోదావరిం దాఁట ♦ శరవణాఖ్య, నమరు నదియుండు షణ్ముఖుఁ ♦ డందు నిలుచు

సీ॥ ఆవలఁ బోవ భి ♦ ల్లాంగనల్ మంచెల, పై నుండి పక్షులఁ ♦ బాఱఁదోల
సుడియంగ నొడిసెల ♦ సూర్యకాంతంబులఁ, జుట్టి వైవఁగ నెండ ♦ ఁబుట్టికాచు
కొట్ట్రుచేల్గల కొండ ♦ కోనలఁ గాంతురు, కడచి చనఁగఁ జంద్ర ♦ కాంతగిరియుఁ
గనవచ్చు నదియును ♦ కడచనఁ బెక్కువి, శాల ప్రదేశముల్ ♦ సౌరుమీఱు

తే॥ నవల నాదిశేషుండు ఖ ♦ గాధిపతికి, నలికి డాఁగిన కొంకణ ♦ మను పిలాతిఁ
బొందవచ్చు నవ్వలను కు ♦ ళిందపురము, చేరఁగలరు మీరలు దాని ♦ మీఱి చనుఁడు.

సీ॥ హరుఁడు ఘనుండని ♦ హరియె ఘనుండని, వాదించు మూఢులు ♦ పడయలేని
సద్గతి కై వడిఁ ♦ జనరానిదియు సుర, నది పరిసరమునఁ ♦ బొదలునదియు
నభ్రంకషంబయి ♦ శుభ్రాంశుఁ దుగ్రాంశు, డను దీపకళికలఁ ♦ ఒనరు నదియుఁ
బ్రణతుల కభిమతా ♦ ర్థము లొసంగునదియు, నగు నరుంధతి గిరి ♦ మొగిని గనుఁడు

తే॥ కాంచి మ్రొక్కుఁడు దానిని ♦ గాంచి నదులు, గిరులు కొన్ని దాటిన ఖగ ♦ వరుఁడు సుధను
సర్పముల కిచ్చి తల్లిదా ♦ స్యంబు దీర్చు, తలము మరకతగిరి దానిఁ ♦ గలయఁగనుఁడు

సీ॥ ఉత్తర భాషయౌ ♦ నురు సంస్కృతమునకు, దక్షిణ భాషయౌ ♦ ద్రావిడమున
కెల్లగాఁ గలదియు ♦ నెల్ల వేదాంతముల్, వివరించు తత్త్వంబు ♦ వెలయునదియు
మేటి ధర్మములకు ♦ మేరయౌ నదియు న, సామాన్యమగుట య ♦ శశ్వరీర
మట్లు ప్రకాశించు ♦ నది మహర్షులకు మ, హాత్త్వములకు స్థాన ♦ మైన నగము

తే॥ వేంకటాచల మనుపేర ♦ వెలయుచుండు, దొందములఁ ద్రోచి సమ సుఖ ♦ దుఃఖులైన
తత్త్వవేత్తలు జ్ఞానాగ్ని - దగ్ధకర్ము, లైన తపసులా శైలంబు - నందుగలరు. ౭౧౮

సీ॥ సర్వపాపఘ్నముల్ ♦ స్నాన తీర్థంబులు, మాని ప్రశాంతాశ్ర - మ స్థలములు
రత్న పుంజములతో - రాజిల్లు చఱియలు, వేల్పుబోటుల గాన ♦ విధము వినుచు
సారంగ పోతముల్ - శార్దూల శాబముల్, ద్వేషంబు మాని ని - ద్రించు చోట్లు
కాంచువారలకు నాఁ ♦ కలియుఁ గన్పింపదు, విసుగు పుట్టదు మోద ♦ మెసఁగుచుండు

తే॥ గిరిని దర్శింపఁ గల్మష ♦ గిరు లడంగు, డాసినఁ ముక్తి తప్పక ♦ డక్కుచుంట
మనకుఁ గార్యభంగంబగుఁ ♦ గనుక నచట, దూరముననుండి ప్రణుతించి ♦ తొలఁగుఁడీరు

సీ॥ విపుల ప్రభావ ని ♦ వేశ మయ్యాదిగాన, రావణుం డచటికి ♦ రాము దేవిఁ
గొనిపోవఁ డవలికిఁ ♦ జని తొండమండల, మునఁగాంచి విఖ్యాతి ♦ నెనసి స్వచ్ఛ
శీతలవారిచేఁ ♦ జెన్నారి సజ్జన, చిత్తంబువోలె ను ♦ దాత్త మగుచుఁ
బ్రవహించు కావేరి ♦ వఱలు చోళుల దేశ, మును దాఁటి యవ్వల ♦ మునుల వసతు

తే॥ లగు ప్రదేశబులం గాంచుఁ ♦ డలఁత లేక, యలను లెన్నండు సఫలత ♦ నందలేరు
కడచి ద్రవిడభాషను పేరు ♦ గాంచినట్టి, పాండ్యదేశంబునకుఁ బొండు ♦ ప్లవగులార!

మ॥ మలయాద్రిం గల యా యగస్త్యముని ని ♦ ర్మాణించు భాషాస్ఫుర
త్కలనా ద్రావిడ సంఘముం గనినఁ ద ♦ ద్భాషా సుధా మాధురీ
కల నాదం బది క్రమ్మఁజిల్లుటకు నాఁ ♦ కం గూర్చుం గాఁబట్టి మీ
రల శైలంబున కర్థి క్రొమ్కి చనుఁడీ ♦ యంభోనిధిం దాఁటఁగన్. ౭౨౧

సీ॥ దారిలోఁ బ్రకృతి సౌం ♦ దర్య పూర్ణంబగు, దరులతో విలసిల్లు ♦ తామ్రపర్ణి
ద్విరద పోతంబులు ♦ విచ్చలవిడిఁ జరి, యించు సానువుల మ ♦ హేంద్రనగము
కలవు వానిని గాంచి ♦ కడచి యవ్వలఁ జూచి, నెలలోన మరలి రా ♦ వలయు ననుచు
సుగ్రీవుఁ డాజ్ఞ యి ♦ చ్చుట గాంచి రాఘవ, ప్రవరుండు కపివీరుఁ ♦ బవనసూను
తే॥ నక్షయ కటాక్ష వీక్షణ ♦ మాన్చి యరసి, యతనిచేఁ గార్యసిద్ధి యా ♦ సని గ్రహించి
యేకతమునకుఁ గొనిపోయి ♦ యెలమితోడఁ, గొన్ని యంగమచ్చముల వా ♦ క్రువ్వఁదొడఁగె

## సీతా సౌందర్య వర్ణనము.

శా॥ క్షీరాంభోనిధిఁ బుట్టు విద్రుమ లతా ♦ చ్ఛేదంబులం దెచ్చి సొం
పారన్ లత్తుక పూసి చంద్ర దళకం ♦ బాపైనఁ బొందింప నే
తీరౌ నవ్విధిఁ గాలి వ్రేళ్ల మరు ధా ♦ త్రీపుత్రికిం గావునన్
నీరేజాక్షులు సాటిగావు వినుమా ♦ నిక్కంబుగా మారుతీ! ౭౨౩

మ॥ మెఱుఁగుంబోఁడుల నింపు సొంపెనఁగు న ♦ మ్మోఁగాళ్లకున్ సత్కవుల్
తెఱఁ గొప్పం గమఠంబులన్ సదృశరీ ♦ తిం బోల్చి వర్ణింత్రు చ
క్కరకంటెన్ మధురంబులౌ పలుకులం ♦ గీలించు చంద్రాస్య కా
యుఱవౌ సామ్యము దెల్పు టజ్ఞత యగున్ ♦ న్యూనోపమం బౌటచేన్.

మ॥ విలిఖింపంగ నశక్యమై తనరు పూ ♦ విల్కాని చేయమ్ము లీ
లల నొప్పారెడి సీత జంఘలకుఁ బో ♦ లం జూచి విద్వాంసు లా
కలనం దెల్పెడి శాలిగర్భము నిమం ♦ గంబున్ మహాగ్రాహమున్
దెలుపం గల్గెడు మోదమేది? త్రిజగ ♦ ద్విఖ్యాత వీరోత్తమా! ౭౨౪

తే॥ కలికి సొబగు నీరోమోరు ♦ వులకుఁ గవులు, సహజముగఁ దెల్పు కదళికా ♦ స్తంభములను
తొలుత నె జయించె నన వేఱు ♦ తొడరి తెలుప, నుపమ లేదయ్యె జగమున ♦ నూహ సేయ
తే॥ కంచుకము దాల్చు చక్రవా ♦ కములు సౌరు, పసిఁడిగిండ్ల మెఱుంగును- పరఁగఁగల్గు
కుచభరంబున నసియాడి ♦ కునియు కౌను, కలదు లేదను తత్త్వంబు ♦ కరణి నొప్పు.

ఉ॥ సౌష్ఠవజాలమున్ జగతి ♦ సాదనచేసి గడించి బ్రహ్మయున్
నిష్ఠను మెచ్చులాఁడులను ♦ నేర్పున సృష్టి యొనర్చుచుండె బిం

బోష్ఠి తను ప్రకాశమున ♦ నొప్పుగఁ గానఁగరాదు కౌను నే
సుష్ఠుగ నంటియే కలుగు ♦ చొప్పు గ్రహింతు నిజంబు పావనీ! ౭౨౭

మ॥ వటపత్త్రింబును వెండిపళ్లియరముల్ ♦ వర్ణాటుఁ డంకించి ప్రా
యుటకుం గూర్చు పటంబు నర్థము కవి ♦ ప్రోక్తంబులై యుండు ని
చ్చోట నవ్వానిని పోల్చి పల్కు నుపమా ♦ స్తోత్రంబులౌ మైథిలీ
పటు భవ్యోదర పద్ధతిం గనినచోఁ ♦ బజ్ఞాధనీ! పావనీ! ౭౨౮

శా॥ నంద్యావర్తపు మధ్యరంధ్ర మది గాం ♦ చన్ సౌరుగా నుండినన్
నింద్యంబౌ నుపమానమా గుణవతీ ♦ నిమ్న స్ఫుర న్నాభికిన్
సంద్యోతంబగు ద్యో నదీ విమల వా ♦ స్సంఘాత జావర్తమా
నంద్య ప్రక్రియఁ గాంచినాఁడ నది యె ♦ న్నన్ వచ్చుఁ దత్సామ్యముల్.

తే॥ తరుణి నూఁగారు నాప్రాణ♦ధార యనియె, తలఁపు మది కౌనులత యగు-దలకుఁ బ్రాఁకి
యలమ నొఱగనీకుంచు మా♦ణాకుఁబోలు, ననుచుఁ దెలుపంగఁదగునాళు♦గాత్మజాత!

చ॥ దళముల రాపిడిం దనువు ♦ దద్దురు వోవున యన్న శంకతో
జలజము నుండి వెల్వడిన ♦ సాగరకన్యకకున్ వళిత్రయం
బిలఁ గల ముద్దరాండ్ర నసి ♦ నింపును సొంపు వహించు కీరితిన్
సులలిత రీతి వ్రాయు జయ ♦ సూచక రేఖలొ నాఁగఁ బొల్చెడిన్. ౨౩౨

చ॥ కనకపుగిండ్లు పోల్పడవు ♦ కందుకముల్ సరిరావు చక్రవా
కిని జత పొందియుండడు చి ♦ గిర్చిన పూవుల కుచ్చు లారహిం
గొన వెడనీరు కాయలును ♦ కూడవు పో చదరంగకాయలుం
బొనరవు కల్కిచన్నులకుఁ ♦ బోలిక కన్పడదయ్యె నింతకున్. ౨౩౩

ఉ॥ లేవెదు రిక్షుదండములు ♦ లేమ భుజంబుల సాటి యెంచి నే
నావిలచి త్తరన్ గనుల ♦ నశ్రులు రాల్చుచు నుండుఁ గాని యా
దేవి భుజంబు సాటియగు ♦ తీరు గనుంగొన నేరనైతి వా
పోవక యుక్కు గుండియను ♦ పొందినఁ గాదె వచింప నిమ్మగున్. ౨౩౪

తే॥ అతివ ముంజేతికిని సామ్య ♦ మరయ లేదు, దిరిసెనయును కాఠిన్యమై ♦ పరఁగు మకర
పీణియయు సరికాదిఁక ♦ బృథివియందు, సౌష్ఠవము మించి యొకఁడున్నె ♦ సౌష్ఠవంబు

తే॥ ఎఱ్ఱకంకేలి చివుళుల ♦ నెన్న నేల?, కల్ప కిసలయములు నవ్య-కమలజములు
నందెలు ధ్వనింప నందమా ♦ నడుగు జతకె, సాటిరావనఁ గేలకుఁ ♦ జాటఁదగునె?.

చ॥ చిలుకల ముక్కులున్ జెలువ ♦ సీత నఖద్యుతిఁ బోలలేవ యం
ఛలికులవేణు లాలిగొన - నమ్ముఖవైరము నూని కిన్కమైఁ

జిలుకలు నేటికిన్ విడక - స్త్రీల ముఖంబులె యంచు దొండలం
దొలుచుచుఁ దృప్తినొందుననఁ - దూకొని సామ్యమి కెందు దెత్తునో? ౨౩౭

చ॥ కర చరణంబులం దనియఁ - గాంచెదుచో మదిఁ దట్టుచుండుఁ దా
మరసము లట్టులే చెలువ - మంగళ కంఠము గాంచువేళ నె
చ్చరముగఁ బోఁక వృక్షమును - శంఖము జ్ఞప్తికి వచ్చుచుండు నా
సరసిజనేత్ర యందమును - సాటి గనుంగొని నిశ్చయింపుమా. ౨౩౮

తే॥ వెలఁది నోటికిఁ బగడంబు - బింబ ఫలము, నెట్టిగలువ బూరుగుపువ్వు - నింద్రగోప
మును పలాశసుమంబుఁ దెల్లని వెయగుట, నుపమకాలేవు తననోరె-యుపమయగును

తే॥ ఎట్టి యమృత మెట్టిని తేనె-యిలను లేవు, తలఁచు మాత్రాన నవ్వి మో-దంబు నిడవు
తెలివ యధరంబునకు సాటి - ధరణి లేద, యేది చెప్పిన గౌరవ- హీనము చుమి. ౨౪౦

ఉ॥ జానకి దంతపాళికిని - జాజులు ముత్తెనరుల్ స్ఫుటంబులై
జానగు నెమ్మి యిాఁకల పి - సాళి బుడంబులు సాటి యున్నచోఁ
దేనియతోడ వారిధి మ - థించి గ్రహించిన వెన్మతోడ నా
మానిని వాక్యజాలము స - మానము చేసి వచించు టేయగున్. ౨౪౧

ఉ॥ ఊసర వెల్లియున్ దిల సు - మోన్నతియున్ మఱి నీరు గుబ్బియున్
నాసికతో సమాన మన - నాణెముగా జిగి లేదు వానికిన్
వాసవు చిత్రకారుఁడును - వ్రాయఁగ లేఁడటు గాన జానకీ
నాసను గాంచియే ననుపు - నోరు నెఱుంగ నగున్ మరుత్సుతా! ౨౪౨

ఉ॥ వంగిన వంగ చిక్కుడును - వ్రాలను శ్రీయును ముంతమామిడిన్
పొంగుచుఁ జాటి బాలకులు - పోలికగాఁ గొనువారు పండితో
త్తుంగులు పల్క వెట్టులని - త్రోవఁగవచ్చును కుండలంబులే
రంగన వీనులై జనన - మందెఁ బురాత్త తపః ఫలంబుచే. ౨౪౩

ఉ॥ శ్రీపతివోలె నల్లనయి - క్షీరపయోనిధిఁ బోలెఁ దెల్లనై
యేపగు వాలు వాఁడిమి జ - యించిన కన్నుల మేల్మిమిన్
దేపకుఁ దేప గాఁగ నెయి - తేపలు చూచినఁ దృప్తి లేదు నీ
చోపమవకా సముద్రమితి - యూహకు నందదు పోల్చి తెల్పఁగన్. ౨౪౪

ఉ॥ సామ్య మొకింత యుండినను - చాటి వచింపఁగవచ్చు సాజమై
రమ్యములైన పోలికల - రాణ రహింపదు పూవు టమ్ములన్
గామ్యముగా రహిందొడుగు - కాముని చాపము రెండుకొమ్ములున్
సమ్య గుదారతం గొనవు - జానకి బొమ్మల పోల్కిఁ దెల్పఁగన్. ౨౪౫

చ॥ చెలువము గల్గు తామరల - సిగ్గిలఁజేయు పదంబులొప్పు నా
చెలువ లలాట లావణిక - సీమ ద్వితీయవిధుండు కాంచి సి
గ్గిలి నెల పున్నమందునను - గీడ్వడి యెల్లదినంబు లెచ్చు త
గ్గులు గొనఁడేని వానినొక - కోపునఁ బోల్పఁగవచ్చు మారుతీ!　౨౪౭

ఉ॥ వారక కానఁజేరు పిద - పన్ వనజాక్షికి దువ్వి పేరలం
కారము సేయుచుండు చెలి - కత్తెలు లేరుగదా? యటుండ నా
వారిజనేత్ర నైజమగు - వక్రత నొందిన ముంగురుల్ మనో
హారిత నొప్పు; నీలమణి - యందము నొల్లవు సాటిగాఁ గొనన్.　౨౪౮

ఆ॥ వానమబ్బుచిగురు - వంగిన విండ్లు ము, నైన వస్తువుల ని - శాధిపతిని.
గూర్చి బ్రహ్మచేసెఁ - గొమ్మ నెమ్మోము నీ, వచటఁ గాంచు నప్పు - డరయఁగలవు

ఉ॥ సన్నని వస్తుజాలమును - సాంద్రముగా నొనరించినట్లు మ
బ్బు న్నెఱిఁగట్టి తావియును - పొందఁగ ధూపము వెట్టి క్రమ్మఱన్
జెన్నుగఁ గప్పునీట జిగి - చేసి రుటంబుగ మోపు గట్టి సం
పన్నత వ్రేల వైచిన క్ర - మంబున నొప్పుఁ గురుల్ వెలందికిన్.　౨౪౯

చ॥ కమలము ముండ్లు గల్గినది - కంజవిరోధికి మచ్చయుండు నీ
క్రమమునఁ జూడఁ జూడఁగ జ - గమ్మున మేలగు వస్తుకోటి యం
కము నొకఁటేని పొందినవి - కాని విదేహతనూజ యెట్టిలో
పము వహియింపకుండునది - పావని! కాంచియె నిశ్చయింపుమా.　౨౫౦

ఉ॥ అద్రిజలోనుగాఁ గలుగు ♦ నంగన జాతికి నుండఁదగ్గ సా
ముద్రిక లక్షణంబు లవి ♦ పూర్తిగ లక్ష్మికి నుండఁబోవు త
ద్భద్ర గుణంబులెల్లఁ బరి ♦ పక్వ దశన్ గడియించి చెందె నా
భద్ర గజేంద్రయాన నవి ♦ పావని! నీకట నానవాళ్లగున్.　౨౫౧

ఉ॥ పిల్లనగ్రోవి కోకిలము ♦ వీణియ కీరము గోరువంక నా
నెల్లెడఁ గ్రమవాక్కులకు ♦ నేర్పడఁ బోలిక గూర్చు వస్తువుల్
కొల్లగఁజేసి యానలువ ♦ కోమలి వాక్కులఁ గూర్చెఁ; బోలికన్
జెల్లరె! యింతదాఁక మఱి♦చేయఁడు చేయునొ యేమొ మీఁదటన్?౨౫౨

మ॥ పరఁగన్ జానకి క్రమవాక్కులకు నౌ ♦ పమ్యంబు లార్జించుచో
దొరకుం దేనియ పాలు మున్నగునవా ♦ త్రోవన్ విచారింప దే
వరలాహారము గల్గుఁగాని యవి జి ♦ హ్వాందృష్టి గావించు నా
హారువౌ వాక్కులఁబోలె నించునొకో న♦ర్వాంగిణ సాహిత్యమున్.౨౫౩

సీ॥ సారసాళరముల ♦ సంచరించుటయందె, యలవాటుపడిన రా ♦ యంచగములు
నార్తైన లేఁజివ్వ ♦ నంబున నిలసిల్లి, వనములఁ దిరుగు హ ♦ స్తినిచయమ్ము
తీర్తైన నడకలఁ ♦ దీరినవని సీత, నెమ్మి నడకఁ బోల్ప ♦ సమ్మతింప
ధారావిశుద్ధిచే, ♦ సొరుగాఁ జదువంగ, విన నింపుగూర్చు క ♦ వితమల్లు
తే॥ పండితవరేణ్యులు రచించు♦పద్యగతులఁ,బోలియొయ్యారమును సొంపు♦పొంపుగలిగి
యుల్లసిల్లును జానకీ ♦ యువతి నడలు, పరమ పావన చారిత్ర! ♦ పవనపుత్త్ర! ౭౫౪
సీ॥ మావి చిగుళ్లు ని ♦ మ్మళముగ నెల్లప్పు, డొక్కటే తీరున ♦ నుండలేవు
బంగారు వెతఁజెంది ♦ వన్నియ చెడిపోవు, రత్నకాంతులు మగ్గి ♦ రాపునొందు
సౌదామినియు విని ♦ శ్చలత నుండఁగ జంకి, మొగుళ్ళుల దాఁగురు ♦ మాఁతలాడు
వనజముల్ వెనుకంజ ♦ వెచి నీటను దాఁగు, సీత మైచాయకు ♦ స్థిరముగాఁగ
తే॥ నొక్కటేనియు నుపమాన♦మొత్తిపలుకఁ, దగినయది లేదు తెలుపంగఁ♦దలఁపుగొన్నఁ
దను శరీర వర్ణమె చుమీ ♦తనకు సాటి, యనఁగవచ్చు జగద్ధ్యేయ!యాంజనేయ! ౭౫౫
శా॥ ఈ లోకంబున జానకిం దొరయు స్త్రీ ♦ లే లేరు లేరంచు నీ
వాలోచించి దృఢాత్మకుండవయి స ♦ మ్యగ్గీతి నన్వేషణా
లోలత్వంబున నేగి ధాత్రిసుత నా ♦ లోకించి యా చాయగా
నీలో నమ్మిక దోఁచుచోఁ గదిసి మ ♦ న్నింపంగ మాటాడుమీ. ౭౫౬
చ॥ జనకుని యాగముం గనెడి ♦ చక్కటిఁ గౌశికుతోడ వచ్చు నాఁ
డనువుగ మేడమీఁద నడ ♦ యాడుచు నుండిన యామెఁ గాంచి నే
మనమున నారటంపడితి ♦ మానిని మిన్నయు నన్నుఁగాంచి కం
తుని పరి కోర్వలేక నిసి ♦ దూపిలు చుండెను దానిఁ దెల్పుమా. ౭౫౭
మ॥ భవ కోదండ విఖండన క్రియను ని ♦ ర్వర్తించు టాలించి యా
నవ కందర్పుఁడె యానొ కాఁడొ యనుమా ♦ సంబయ్యెఁ గాకున్న నాఁ
కువ జీవంబుల వీడనుంటి నని నా ♦ కుం దెల్పెఁ ♦ దర్వాతఁ దేఁ
కువ నీవార్తను నమ్మకంబొదవ వా ♦ క్రువ్వందగుః మారుతీ! ౭౫౮
మ॥ ఘన మత్త ద్విప కుంభయుగ్మము క్రియః ♦ గర్వంబుతో నొప్పు స్వ
స్తన దుర్గంబుల మోవలేక యసనై ♦ జవ్వాడు మధ్యంబుతో
జనకాస్థానముఁ జేరవచ్చు తరుణిః ♦ సౌదామినీ వల్లికః
గను విన్నాణము గూడ నాయమకు వే ♦ డ్కం దెల్పుమా మారుతీ! ౭౫౯
ఉ॥ కానకు నేగుదెంచు తఱిఁ ♦ గాంతయు వెల్వడ నింతదాఁక స
న్మానముతోడ సాకుఁ బరి ♦ ణామ సుఖంబులఁ గూర్చుచుంటి వీ

పై నధికార్తి గూర్పఁ జల ♦ పట్టితివా? యన నాభుజంబులన్
మానుగఁ గూర్చుకొంచు వ్యస ♦ నమ్మును పూనుట జ్ఞప్తిసేయుమా. ౭౬౦

ఉ॥ రాజ్యరమం ద్యజించుచు స ♦ రణ్యము చేరఁగనున్న నాథ! నీ
ప్రాజ్య సుఖంబు లన్నిటికి ♦ భంగము నేఁ గలిగింతునేమొ? నన్
ద్యాజ్యముసేయ సర్వము సు ♦ ఖాస్పదమై చనునేమొ? యంచు సా
యుజ్యముకై తలంకి నెగు ♦ లొందిన చందము దెల్పు మారుతీ! ౭౬౧

చ॥ పురమును వీడి కానలకుఁ ♦ బోయెడివేళ సుధాంశు మండలం
బొరసెడు కోట వాకిలికి ♦ నొప్పుగ వచ్చెదు మున్నె పాదముల్
విరనిరవోవ నిల్చి 'యట ♦ వీస్థలి యెంతగ దవ్వొ' యన్న భూ
వర తనుజాతకిద్ది విను ♦ వాసము పుట్టఁగఁ బల్కు మారుతీ! ౭౬౨

మ॥ అని యీరీతిగ నానవాళ్లు గల వా ♦ క్యంబుల్ నిరూపించి పా
వనికిన్ ముద్రిక నిచ్చి కార్య మెదియుం ♦ బ్రత్యూహము ల్లేక గ్ర
మ్మఱ గావించి ప్రమోదదాయివయి ర ♦ మ్మా యంచుఁ బల్కన్ మరు
త్తనయుం డాదట మ్రొక్కి రామ కరుణా ♦ దర్పోద్ధతిన్ వెల్వడెన్. ౭౬౩

మ॥ పర దేహ క్షితి వాహినీ హాలమునన్ ♦ భంగించి భాస్వద్యశ
స్కర సస్యంబులఁ బంటవెట్టుటకు ను ♦ త్సాహంబుతో నంగదా
ద్యరి దుర్వారులు కీశరాడ్వరుని స ♦ ప్తాశ్వాన్వయాబ్ధిక్షపా
కరులన్ వీడ్కొని మ్రొక్కి వెల్వడిరి వ్య ♦ గ్రస్ఫూర్తిఁ గుప్పించుచున్.

## ౧౧ బిలనిర్గమన పటలము. (౭౪)

తే॥ తరణిసుతుని యాదేశ మూఁ దలను దాల్చి, యంగదాదులు వెడలు న♦నంతరంబు
తక్కు దిశలకు వినతాది ♦ తెరుచరులును, పరవు నుత్సాహగరిమతోఁ ♦ బయనమైరి.

తే॥ తక్కుదిశల కేగినవారిఁ ♦ దడవనేల?, పట్టుదలతోడ దక్షిణా ♦ పథముఁ జేరు
నంగదాదులు చనిచని ♦ యవనిజాత, వెదకు తమితోడఁ జేరిరి ♦ వింధ్యగిరిని. ౭౬౬

ఉ॥ * చెందిరవన్నెతో మణుల ♦ చెన్నగు కాంతులతోడ సాంద్రమై
నందియ వన్నియుం జిలుకు ♦ చక్కని యంబరమట్లు వెల్గుచున్
జెందురు నిర్ఝరంబులను ♦ సర్పచయంబులఁ బొందియుంటచే
నిందు ధరాగ్రచూడమను ♦ నేత్రైల నొప్పిన వింధ్యఁ జేరుచున్. ౭౬౭

చ॥ గిరి కుహరంబులున్ మణివి ♦ కీర్ణ విభాసిత సానుదేశముల్
గురు శిఖరంబులున్ వెదకెఁ ♦ గోఁతుల మూఁకలు పెక్కు నాళ్లకే

* పూర్వపటలములోని స్థలవిద్ధచక్ర నముశే యుటమండి కలవు.

నరయఁగరాని యా కుధర ♦ మంతయు నొక్క దినంబులోననే
పరవుచు నెందు చూచినను ♦ వానర సేనయె తోఁచునట్లుగాన్. ౭౬౮

చ॥ పుడమికిఁ జేలయా నుదధి ♦ పొంకము నొందిన కేశరాజి యా
పుడమికుమారి మించులను ♦ భూషలఁ దాల్చిన కారుమబ్బు నా
నడరు కురుల్ ప్రకాశిలు వ ♦ రాంగిని రాముని రాణి రోయుచున్
విడువక వేసటం గొనక ♦ వింధ్య గిరీంద్రముఁ జుట్టి రత్తఱిన్. ౭౬౯

ఉ॥ కొందఱు వ్యోమమందెగసి ♦ కొందఱు డిగ్గుచుఁ గొండ తెక్కుచున్
గొందఱు కుంజముల్ గుహాలు ♦ కొందఱు శుద్ధ జలాశయంబులన్
గొందఱు నిర్ఝరీ దరులఁ ♦ గోరిక రోసిరి చూడకుండు తా
వందునఁ గల్గునేని యది ♦ యంబుజ సంభవు సృష్టి కానిదే. ౭౭౦

చ॥ పృథివికి మేల్మిఁగూర్చి ఫల ♦ విస్తృతిచేఁ బొగడొందు దక్షిణా
పథమున మైథిలిన్ వెదకు ♦ వానర వీరులు, కారు మబ్బులున్
బ్రథితముగా లులాయములు ♦ భాసిల గుర్తెఱుఁగంగరాని య
వ్విధమున నొప్పు నర్మదను ♦ వేగమ డాసిరి ప్రీత చిత్తులై. ౭౭౧

క॥ అంచలు క్రీడించెడి ప, ట్లంచితముగ దేవకాంత ♦ లాడెడు చోట్లున్
గాంచిరి మధువానిన యళి, సంచయములు రొదలు సేయు ♦ నముచిత తలముల్.

సీ॥ ధరణిజాన్వేషణ ♦ తత్పరులగు కపుల్, నల్ల సైకతమును ♦ నొరు కురులు
నీలాలకములను ♦ రోలంబ సంతతుల్, ముసరిన ముఖ తామ ♦ రసచయములఁ
దరఁగలు త్రోవఁగా ♦ దరుల సరులుగాఁగఁ, గొదరు ముత్తెములను ♦ రదనములను
హంసయానంబుల ♦ హరిణ నేత్రంబులఁ, గనిన వారలె కాని ♦ కలికిమిన్న

తే॥ గాత్రమును పూర్ణముగ నెందుఁ గానరైరి, తవిలి మదకరులును కరే ♦ ణువులు గలిసి
మదము తోడఁ గ్రీడించు న♦ర్మదను దాఁటి, యవలికిం బోయి రెల్లెడ ♦ నరయు నాస.

ఉ॥ రత్న మయూఖరాజి జిగి ♦ రాజిలు శృంగములరిమ పుట్టుచున్
బ్రత్న పథంబులన్ వఱలు ♦ పావనులంబలెఁ బొఱు నిర్ఝరుల్
నూత్న రుచుల్ తొలంకు సుమ ♦ నో వర ఖేటము హేమకూటమున్
యత్నముతోడఁ గీశులు ధ ♦ రాత్మజ రోయఁగఁ జేరి రాదటన్. ౭౭౪

తే॥ పరిసరంబుల యందున్న ♦ తరులు గిరులు, తక్క వస్తు జాలంబులు ♦ తమ నిసర్గ
వర్ణముల వీడి యపరంజి♦పగిది వెలుఁగు, చుండుఁ గాన స్వర్గంబుతో♦ నొప్పమీఱు

తే॥ అచటఁ వసియించుమృగపక్షి♦నిచయములకు, నందుగల హేమరజముపై ♦నంటికొనఁగ
మావరదలి వస్తువుల్ ♦ మెఱయు లీలఁ, గాంచనమయంబులై ప్రభా♦కరములమ్యొ.

క॥ బంగారు రేణువులతో, రంగారు జలంబు పద్మ ♦ రాగ మణులతో
డం గూడి పాఱ నగ్నిఁ గ, రంగిన బంగరువువోలె ♦ రాజిలు గిరియున్ ౨౨౨

తే॥ క్రమ విద్యాధరాంగనా ♦ గానరవము, నిర్ఝరీ నటచ్ఛరణ స♦న్నియతరవము
ఘీంకృతులు గర్జనములు ప్ర ♦ కీర్ణమగుచు, హేమకూటంబు గౌరవ ♦హృద్యమయ్యె

తే॥ దనుజు వాసస్థలం బిందు ♦ తనరు ననుచు, ధరజ గన్పడునంచు మో ♦ దమున నుబ్బి
కొంద ఱాడిరి నెగసిరి ♦ కొంద ఱసుర పైని కోపానఁ గనులెఱ్ఱ ♦ పఱచినారు. ౨౨౪

తే॥ ఈమహీధరమున గోల ♦ నేణనేత్రఁ, దెలియఁగలము రాముని చింత ♦ దీర్పఁగలము
పొదఁ డనుచు నుల్లముప్పొంగ ♦ వెదకఁగోరి, గిరివరం బధిరోహించి♦కీశవరులు. ౨౨౫

తే॥ జరగుచుండఁగఁ గని కరి ♦ శరభ సింహ, భల్ల శార్దూల నికరముల్ ♦భయము సెంది
పొదలఁ దూఱుచు నుండఁగఁ ♦ బూవుఁబోఁడి, వెదకి కానఁగ నేరక ♦ విసువు పుట్ట.

ఉ॥ అంబర చుంబితం బయిన ♦ యగ్గిరి యంతట రోసి క్రూర స
త్త్వంబుల కాకరంబయిన ♦ పర్వత మియ్యది దైత్యనాథు వా
సం బిట లేదటంచుఁ గపి ♦ సత్తము లయ్యెడనుండి క్రిందికిం
బంబిన చండ వేగమున ♦ వచ్చిరి క్రమ్మఱి దేవిఁగానమిన్. ౨౨౭

తే॥ అంత నంగదాదులు సైన్య ♦సంతతిఁగని, మీరు పడమటి తీరంపు ♦ మేదినీ ధ
రముల వెదకి మహేంద్ర పర్వతమునందు, మమ్ము గలిసి కొనుం డని ♦ నెమ్మి నంపి.

ఉ॥ పావని జాంబవంతుఁడును ♦ వాలిసుత ప్రభృతుల్ జిగీషువుల్
ధీవరు లొక్కటాచుఁ దొలి ♦ దిక్కుగఁ ద్రోయ వహించి పోవుచున్
ద్రోవను వారి శూన్యమయి ♦ దుస్తరమై హరిదశ్వుఁడేనియుం
బోవఁగ జంకు కొంకు నొను ♦ పోట యెడారిని గాంచి రొక్కెడన్ ౨౨౯

చ॥ మృగములు లేవు పక్షులును ♦ వృక్ష లతాదులు లేవు రాలు నీ
ఱుగఁ బయి కేగుచుండు నట ♦ రోసిన వెల్పలినుండి వచ్చునో
తెగ యగు వస్తువైనఁ బడి ♦ త్రెళ్ళి పదంపడి బూది యౌచు నా
శుగమునఁ జేరి పై కెగయు ♦ సూక్ష్మ రజంబగు; వేఱు లేదటన్ ౨౩౦

చ॥ తెలియక యేగినట్టి కపి ♦ ధీరుల యింద్రియ రాజి బెగ్గిలన్
దెలివియు నామమాత్ర మగు ♦ దేహఁగ గాత్రము లుక్కు దూపిలన్
బొలుపఱి తప్తకుంభమున ♦ బ్రుంగి తపించెడు పాపులంబలెన్
వెలవెల పోయి తాపమున ♦ వెక్కసపాటు వహించి రయ్యెడన్. ౨౩౧

ఉ॥ నాల్కలు వెళ్ళఁబెట్టి చర ♦ ణంబులు బొబ్బలు వోవ స్రుక్కుచున్
భల్కఁగ లేక కాలిడఁగ ♦ బాధల నొందుచు దూఱి సోలుచున్

నిల్కడ దప్పి బాణలిని ♦ నివ్వెరి పేలల మాడ్కి మాడుచున్
బెల్కటి జీవితాశలను ♦ వీడిరి తప్పెడు త్రోవ లేమిచేన్. ౭౮౭

ఉ॥ ఆశ్రయమంద నీడ యిసు ♦ మంతయు లే దసువుల్ తొలంగు నే
ప్రశ్రయమందఁగాఁ దగిన ♦ పద్ధతి యంచుఁ దపించి తీపిచే
నేశ్రమ మందియైన వెలి ♦ కేగఁ దలంచి కడంక సేయఁగా
నాశ్రమరీతిఁ గన్పడె గు ♦ హాముఖ మొక్కటి యంత వారికిన్. ౭౮౮

చ॥ ఎడరునఁ గల్గు నీమొడరు ♦ నేక్రియ దాఁటఁగ జాలు వారమో
పుడమికుమారి నేపగిదిఁ ♦ బోయి కనుంగొను వారమో కటా
యెడవు నెటెట్టులో కడచి ♦ యేగి గుహాముఖమందు వొచ్చినన్
బడలిక వోవు భూసుతను ♦ బాలిశుఁ డచ్చట దాఁచెనేమొకో? ౭౮౯

చ॥ అని పలువంతలం బడుచు ♦ నా కపిముఖ్యులు తమ్ము భాస్కరుం
డనువుగఁ బట్టి దప్పికయు ♦ నాఁకలి దీఱఁగ ప్రింగు నన్న భీ
తిని గొని సేమమందు పగి ♦ దిం గని చీఁకటి గుంపు లిచ్చటన్
దనుకఁగ డాఁగె నన్న క్రియఁ ♦ దారు గుహాంగని చొచ్చి రత్తటిన్. ౭౯౦

ఉ॥ పోయిరి కొంతదవ్వు మఱి ♦ పోవఁగలే కడుగైనఁ బెట్టఁగాఁ
బోయిన మార్గమున్ మఱియుఁ ♦ బోవఁగ మార్గము తోఁపలేదు ప్రేఁ
గై యిరవొంది పేరి విల ♦ యంబు గడింపని చిమ్మచీఁకటిన్
దాయము నొంది యొండొరుల ♦ దాయఁగఁ జూడఁగ లేక యూర్చుచున్.

శా॥ కర్తవ్యంబును విస్మరించి తత ది ♦ గ్భ్రాంతాత్ములై భీతిమై
నార్తత్రాణపరాయణాత్మక! జగ ♦ త్ప్రాణప్రియా! కావవే
మూర్తంబై తగు కాళరాత్రి పగిదిన్ ♦ ప్రమొగ్గించి బాధించు నీ
యార్తిన్ మాన్పఁగ నీవ దిక్కని కపుల్ ♦ ప్రార్థింపఁగా నాతఁడున్. ౭౯౨

శా॥ మీరున్ జీవము లిచ్చెదన్ దిటవుమై ♦ మీరెల్లరుం గూడి నా
తోఁకం గట్టిగఁ బట్టికొంచు వెనుకన్ ♦ దోయంబుగా రండు శో
కాకులంబులు మానుఁడం చతఁడు హ ♦ స్తాంభోజముల్ చాఁచి ఘో
రాకారాంధక మార్గముం దడవె నం ♦ ప్రార్థించి సీతాపతిన్. ౭౯౩

తే॥ అనుగ మతండు దొడ్డ దే ♦ హంబుతోడ, మెఱుపుఁబోలిన పోగుల ♦ మిసిమి తనకుఁ
ద్రోవఁ జూపుచుఁ జీఁకటిఁ ♦ దోలఁగఁ జేయ, వేగ నడచెను ప్లవగులు ♦ వెంబడింప. ౭౯౪

కపులు స్వయంప్రభ మేడను గాంచుట.

ఉ॥ కపులు బిలంబులో నడచి ♦ కాంతి జగత్త్రయి కిచ్చుచుండు నా
[illegible] నిల్చి పాలన వి ♦ ధమ్ము నొనర్చు పురంబొ? స్వర్గముం

ద్రపగొను చందమొంది జిగి ♦ రాజిలు లచ్చి మొగంబొ? నా ననం
తపనము గూర్చు పట్టణము ♦ దాపునఁ గాంచిరి మోదితాత్ములై. ౭౯౫

ఉ॥ కల్ప కుజంబులం జెనయు ♦ కాంచన వృక్షములుఁ మనోహరా
నల్ప జలాశయంబులు మ ♦ హా రజత స్ఫుట గోపురంబులుఁ
వేల్పులు విస్మయంబుగొను ♦ వేశ్మములుఁ దనరారఁ గ్రవ్య భు
క్శిల్పి మయుండు స్వేచ్ఛగొని ♦ చేసిన యప్పుర మెన్న శక్యమే? ౭౯౬

తే॥ ఇంద్రు నమరావతియు దాని♦కీడు గాదు, సూర్య చంద్రుల కాంతులు♦చొరకయున్న
సౌధ శిఖర ఖచిత మణి ♦ జాలకాంతి, చీఁకటులఁ దోలుచుండు ని ♦ శ్శేషముగను.

చ॥ తగ భువి సంస్తుతించు బహు ♦ దాన విహర్తల భూమి భర్తలం
బొగడిన సత్కవీంద్రుల స ♦ మున్నత గేహములందు పచ్చపా
న్నగలును కీలు మంచములు ♦ నాణెపు వస్త్రములుఁ సుగంధముల్
జిగిబిగి నుండు పోల్కి విల ♦ సిల్లెను తత్పుర వైభవ క్రియల్. ౭౯౮

చ॥ పసగొన గల్లుగల్లను ర ♦ వంబుల నించెడు గజ్జె లందియల్
మిసిమిగలట్టి పాదముల ♦ మించి చరించు వరాంగనామణుల్
రసికత గల్గు పూరుషులు ♦ రాజిలకుండుటచేత నప్పురం
బసువులు లేక ముద్దయిన ♦ హాటకపుత్రిక నాఁగ భాసిలెఁ. ౭౯౯

చ॥ అమృతముకంటె నింపయిన ♦ యన్నము ద్రావిడ భాషఁబోలు రు
చ్యములగు తేనెలుఁ సురయు ♦ స్వాదుఫలంబులు తావి నించుచుఁ
దుమదుమ లాడు జిహ్వలకుఁ ♦ ద్రుప్పును దుల్చు విధాన నొప్పుచుఁ
శ్రమగొని వచ్చు వారలకు ♦ స్వాగత మిచ్చుచు నుండె నయ్యెడఁ. ౮౦౦

మ॥ హనుమజ్జాంబవ దంగదాదులు ముదా ♦ యత్తాత్ములై యాపురిఁ
మన శత్రుండగు రావణాసురుని స ♦ ద్మంబుండఁగా నొప్పు నీ
తను కాంచంగలమంచుఁ గౌతుకముతోఁ ♦ దద్ద్వార సీమఁ సుఖం
బునఁ జొత్తెంచిరి వీథులం దిరిగి రా ♦ మోదంబు క్రుంగంబడఁ. ౮౦౧

తే॥ నరులు నుతలును లేరు దా♦నవులు లేరు, ప్రాణులును లేవు రూప చి♦త్రములు లేవు
మఱియు యాథార్థ్య వస్తువు♦ తెలియఁగు లేదు, వట్టిపురమునఁ దిరుగాడె ♦ వానరాలి.

సీ॥ నడబావు లుండెను ♦ నలినాకరములుండెఁ, దావులు వెదజల్లు ♦ తావు లుండె
నుత్పలాక్షుల మంజు ♦ లోక్తులఁ దెలిపెడి, శుక పిక శారికా ♦ నికరముండెఁ
గలహంసలుండెఁ ద ♦ త్కలిత సుఖంబుల, ననుభవింపంగఁ దొ ♦ య్యలులు లేరు
వానరు లాప్పుర ♦ వైఖరి యంతయు, నరసి మాయాదృశ్యమనుచుఁ దలఁచి

ఆ॥ భోగి భూమి యనుచు ♦ బుద్ధి నూహించుచు, నగును కాదటంచు ♦ నరగలి గొని
తుదకు నిద్ధి శుద్ధ ♦ పదము స్వర్గంబని, నిశ్చయించి మఱియు ♦ నిలకలేక ౧౦౩

సీ॥ స్వర్గలోకమె యైనఁ ♦ జావు గలుగలేదు, జన్నముల్ సద్విధి ♦ జరుపలేదు
రణరంగమున నన్మ ♦ రణమొందఁగాలేదు, జరిగిన విషయముల్ ♦ మఱవలేదు
సందేహమును నిమి ♦ షత్వంబు నున్నది, స్వేదంబు నున్నది ♦ చిత్రమయ్యె
నని ఱిచ్చ వడఁగ ఋ ♦ తూధ్యుఁ డిట్లను రాము, దేవిఁ దెచ్చిన దొంగ ♦ పాపి కపటి

తే॥ మనలఁ దగిలింప నుంచిన ♦ మాయ గుహయొ, గాక వేఱేది? మన పాప ♦ కర్మ వశతఁ
జిక్కితిమి తప్పికొని పోవు♦చెన్ను లేదు, చావు దప్ప దనుచు నోరు♦చప్పరించె. ౧౦౪

సీ॥ పావని యది విని ♦ భల్లుకేంద్రుని గని, మరలి వెల్వడుట దు ♦ స్తరముగాఁగఁ
దోఁచిన నగర పు ♦ త్త్రిలఁబోలె ధాత్రిని, త్రవ్వి బిలముచేసి ♦ తలఁగి పోద
మటు గాదయేని యీ♦పటుమాయ లొనరించు, దనుజుల ద్రుందించి ♦ తలఁగి పోద
మంతరిక్షంబున ♦ నన నదిమేలని, యంగదాదులు పొంగి ♦ యంగవింపఁ

తే॥ బట్టణంబు లోపలి యెల్ల ♦ భాగములును, వనచరులు పరీక్షించుచుఁ ♦ జనుచునుండ
వినుత తపమె స్త్రీరూపంబు ♦ గొనియెననఁగ,నొప్పుజటిలస్వయంప్రభ ♦ నొకటఁగనిరి.

సీ॥ తరుణి వల్కలములఁ ♦ దాల్చి చక్రంబుల, పగిది బంగరు గిండ్ల ♦ భాతి నమరు
పాలిండ్లపైఁ బైఁట ♦ వన్నె తొఱఁగి ధూళి, పటలి గప్పఁగ నొప్ప ♦ వాసియుండ
రక్తాంచలంబులై ♦ రాజిల్లు నేత్ర దృ, ష్టులు నాసికాగ్రంబుఁ ♦ జూచుచుండఁ
బద్మాసనంబున ♦ భాసిల్లి శ్వాసంబు, నణఁచి మధ్యం బెగ ♦ యంగ నిలిపి

తే॥ కేలుదమ్ములఁ దొడలపైఁ ♦ గీలుకొలిపి, శత్రు షట్కంబుఁ గూల్చియ♦క్షముల గెల్చి
సాంద్ర దీర్ఘ కోమల శిరో♦జములు జడలు, కట్టి వ్రేల నిశ్చల రీతిఁ♦గ్రాలుచుండె. ౧౦౬

మ॥ కపు లామెం గని భక్తి భావన నమ ♦ స్కారంబు గావించి మేల్
తపముం బూనిన యీమెయే నిజము సీ ♦ తాదేవి యంచుబ్బి మో
ద పరీతాత్మకులై సమీరసుతు చెం ♦ తన్నిల్చి వీక్షించి యీ
యపయే జానకి యానొకో తెలుపవే ♦ యన్నరత నాతం డనుచున్. ౧౦౭

ఉ॥ జానకి యంగ చిహ్నముల ♦ జానుగ రాముఁడు తెల్ప వాన నొం
డేనియు నీమెయందు రహి ♦ యింపవు పెక్కు లిఁకేల? యెమ్ములం
బూనుచు దండ ముత్తెములు ♦ పోహణ చేసిన దండతో సమం
బేని విదేహరాట్సుతకు ♦ నీయమ సాటి యనంగఁ బోల్పదున్. ౧౦౮

చ॥ అని వచియించుచుండఁగ స్వ ♦ యంప్రభ యోగ సమాధినుండి మే
ల్కని యెదుర్గం గలట్టి కపి ♦ కాంతులఁ గిన్క వహించి చూచి కాం

చన మయు పట్టనంబునకుఁ ♦ జక్కఁగ వచ్చిన మీర లెవ్వరె
ప్పనికయి యిందు వచ్చితిరి ♦ పల్కుఁడి యన్న వచించి రివ్విధిన్. ౮౯

ఉ॥ రావణుఁడన్ దురాత్మకుఁడు ♦ రామసతిన్ హరియించె మాయచే
దేవిని రోయఁబంపె జగ ♦ తీధవుఁ డాతని దూత లేము ధ
ర్మావన దక్షు నాజ్ఞగొని ♦ యద్రులు కానలు పట్టనంబులున్
భూ వివరంబులు న్నెమకఁ ♦ బోయెదు వారము సత్తపస్వినీ! ౯౦

తే॥ అనుడు నామెయులేచిప్రి♦యంబుమీఱఁ,గాంచి మీరాకశుభమగుఁ♦గాక యనుచుఁ
గనులనుండి ముదశ్రువుల్ ♦గాఱుచుండ, నొక్క యుత్కంఠ జనియింప♦నుత్సహించి

క॥ పలుకుఁడి రాఘవుఁ డెచ్చటఁ, గలఁడని ప్రశ్నించునంత ♦ గాడుపుకొడుకా
జలజాక్షికి రాముని కత, దెలిపె సమస్తంబు మిగులఁ ♦ దేటపడంగన్. ౯౧

తే॥ విని స్వయంప్రభ నాతప ♦ మినకులేశు, చరిత వినుటచే ఫలియించె ♦ శాప మీఁగె
ననుచు స్నాన పానముల మృ♦ష్టాన్నములను,తనియ నిడె మృదువాక్కుల♦వనచరులకు.

తే॥ అంత మారుతి యామెకు ♦ నర్థిమ్రొక్కి, నీదు పేరేది? యీ పురి ♦ నేత యెవఁడు?
తపము సేయఁ గారణమేమి? తల్లి! తెలుపు, మనుడు నయ్యామ యిట్లను♦హనుమఁగాంచి

ఉ॥ ఏణ ముఖుండు దొడ్డ దను ♦ జేంద్రుల శిల్పి మయుండు గేహ ని
ర్మాణ విశారదుండు జల ♦ మారుత భోజనుఁడై తపించి సం
త్రాణ పరాయణుం డయిన ♦ బ్రహ్మ వరంబున నీ పురంబు గీ
ర్వాణులు మెచ్చఁగాఁ గొని ప్ర ♦ వాసము మాని వసించె నియ్యెడన్. ౯౨

ఉ॥ దానవుఁ డంత హేమ యను ♦ దాని సురాంగనఁ బొందఁ గోరి నే
దానికిఁ బ్రాణమిత్ర నగు ♦ దానను కావున నన్ను మిక్కిలిన్
దీనత వేఁడ నాయమను ♦ దేవజగంబుననుండి తెచ్చి యీ
మానిత కందరాన గుణ ♦ మానితుఁ జేర్చితిఁబేర్మిఁ గూర్చితిన్. ౯౩

ఉ॥ కూరిచినంత హేమఁ గవ ♦ గూడి సురారుల శిల్పి ప్రేమ దై
వాఱ జలాశయంబులను ♦ పర్వత కందర సీమలన్ మనో
హారి హిరణ్మయంబులగు ♦ హర్మ్య తలంబులఁ జాలకాల మి
చ్ఛారతిఁ దేలుచుండఁ జెలి ♦ సంగడి పాయక యింద నిల్చితిన్. ౯౪

చ॥ నిలిచిన యంత దేవగణ ♦ నేత యొకానొకనాఁడు నాదు నె
చ్చెలి వసియించు చోటెఱిఁగి ♦ చిందఱతో నరుదెంచి యంతటన్
బలియుని దైత్యకారువును ♦ వజ్రముతోఁ దెగటార్చి హేమపైఁ
దలకొని నివ్వెఱ్ఱ్వనది ♦ తప్పని కోపము చేసె మారుతీ! ౯౫

ఉ॥ కోపముచేసి హేమఁగని ♦ కూడని యీపని యెట్లు కూరెనో
దాఁపక తెల్పుమన్నఁ గను ♦ దమ్ముల సంజ్ఞను విద్రుమోష్ఠి నన్
జూపుచు దీనిచే నయిన ♦ చొప్పని చెప్పిన నన్ను గాంచి యా
గోపతి యింద రెంటిమెయి ♦ గొందలమందఁగఁ జేసె నానతిన్. ౧౧౯

ఉ॥ ఆనతిసేయ నాతని ప ♦ దాంబుజ యుగ్మము మీఁద వ్రాలి నా
పై ననుకంప యుంచి చెఱ ♦ బంధ విముక్తి యనుగ్రహింపవే
నా నతఁ డక్కసున్ విడిచి ♦ నాతిరో! రాముని యాజ్ఞ వానరుల్
జానకి రోయు రాఁ దొడరు ♦ సద్గతియంచు వచించె నాయనా! ౧౨౦

చ॥ ఇచట భుజింపఁగా ఫలము ♦ లిచ్చు కొలందిని గల్గుఁ బూయఁగాఁ
బ్రచుర పరీమళంబులగు ♦ బంధుర గంధ కలాప మబ్బుఁ బు
ష్పచయము భూషణంబులును ♦ వన్నియ వల్వ లవెన్నియున్న రో
యుచు భవ దాగమంబు పొలు♦పొందఁగఁ గోరి తపించుచుండితిన్. ౧౨౧

చ॥ అధిక విశాలమైనది గు ♦ హాంతర మంబర వీధి కేగుటే
విధమొ యెఱుంగలేను దయ ♦ వేఁడెద మీర లనుగ్రహించినన్
బథము లభించు నేఁ డనఁబ్ర ♦ భంజన సూనుఁడు లేమఁ గాంచి నేఁ
బ్రథిత హితంబు చేసెద న ♦ పార గుణాలయ! చూచుచుండుమా! ౧౨౨

చ॥ అనవుడు నంధతామసము ♦ నందు మునింగి మనుంగ నున్న మ
మ్మనువున నీబిలంబున ద ♦ యామతిఁ గాచితి వట్లు యిప్పుడున్
వనితను మమ్ముఁ గావ నొక ♦ పద్ధతి చూడుమ యంచు వానరుల్
పనివడి వేఁడ మారుతి య ♦ పార కృపారసమూర్తి యంతటన్. ౧౨౩

చ॥ భయపడనేల యంచు మృగ ♦ వల్లభుఁబోలెఁ బరాక్రమించి య
మ్మయ ఘనమండలంబు నడు ♦ మానము బిట్టువియంగ వర్ధిలన్
మయిమయి కందరంబు పయి ♦ మాడుగు ఘట్టని ప్రీలి దిక్కటుల్
పయికొని నిండ గ్రావముల ♦ బ్రద్దలు వోయెను టివ్వ టివ్వనన్. ౧౨౪

చ॥ వడిగొనఁ జాఁచు కేలు నిజ ♦ వక్త్రి గుహా నిశితోగ్ర దంష్ట్రిలన్
వడువునఁ గ్రాలఁ బైకి వెలు ♦ వడ్డ మరుత్సుతుఁ డప్పు డొప్పె మున్
పుడమి సముద్ధరించు తఱిఁ ♦ బొల్చిన యాది వరాహమూర్తి కై
వడిఁ గనుఁగొన్న చిత్తములు ♦ భ్రాంతియు సంభ్రమ మిచ్చ యొందఁగన్.

మ॥ అరవిందాసనసృష్టియం దమరు ర ♦ వ్యాది గ్రహాధిష్ఠిత
స్ఫుర దాశ్చర్య శిరోగ్రముం బొడిచి సం ♦ క్షోభిల్లు సాభిరా, ధ్యు

ర్వర పాదత్రయి వేఁడి యంత జగదా ♦ క్రాంతంబుగాఁ బెంచు శ్రీ
హరి పాదాంబుజముం బలెన్ వెలిఁగె న ♦ త్యాశ్చర్య సంధాయియై.

తే॥ ఇట్లు బిలము భంజించి పై ♦ కెగసి దానిఁ, బడమటి సముద్రమునఁ బాఱ ♦ వైచి ప్రళయ
జలద నినదంబు పగిది గ ♦ ర్జనము చేసె, నమర నిచయంబు భయ విస్మ ♦ యంబు లొంద

చ॥ బిల నగరంబు పశ్చిమ కృ - పీటనిధిం బడి యుండు నేఁటికిన్
బిలమను పేరి దీవియయి; వేడ్క స్వయంప్రభ కీశవర్యులన్
బిలముననుండి భూస్థలికి - వెల్వడఁ గల్గిరి; హేమ యున్న వే
ల్పుల నగరంబు చేరఁ దల - పోసి వరాంగన కాంచి మారుతిన్. ౨౨౮

తే॥ గురు గుణంబులఁ బెక్కుభం ♦ గులను మధుర, వాక్కుల నుతించి మేరుసా ♦ వర్ణి పుత్రి
యగు స్వయంప్రభ మేలు మీ ♦ కగుతమనుచుఁ, బలికి దేవలోకమునకుఁ ♦ బయనమయ్యె

తే॥ వీరులగు కపుల్ హనుమంతు ♦ వివిధగతులఁ, బొగడుచుం బాదచారులై ♦ పోయిపోయి
యమల జలపూర్ణమైన ప ♦ ద్మాకరంబు, నరసి చేరంగ భానుఁ డ ♦ స్తాద్రిఁ జేరె. ౨౩౦

## ౧౨ మార్గాన్వేషణ పటలము. (౫౫)

తే॥ చేరి వానర పుంగవుల్ ♦ చేర లొడిసి, జలములం ద్రావి తటములఁ ♦ గలుగు తేనె
పండ్లు మెసవి విశ్రాంతికై ♦ పండి నిదుర, సేయు నచటికి వచ్చె దై ♦ తేయుఁ డొకఁడు.

తే॥ పొడవునం బర్వతంబు రూ ♦ పునఁ బయోధి, హింసలను సమవర్తియు ♦ నీడుకారు
క్రౌర్యములకుఁ గాణాచి రా ♦ క్షసుఁడు చండ, కోపుఁడై కాలకూటంబు ♦ కోపుగలిగి

తే॥ వారివాహములను వాని ♦ బాహుయుగ్మ, మొరయుకతమునజాఱుతుం ♦ పురులుమేన
ధారగాఁ గాఱ నుదక పా ♦ తంబుతోడఁ, జెలఁగు నడగొండయన వచ్చెఁ ♦ బొలసుదిండి

ఆ॥ వేల్పులకును మొదటి ♦ వేల్పులకును గెల్వ, రానివాఁడు దురభి ♦ మాని యెదురు
వారు లేని మత్త ♦ వారణ లీలను, తిరుగుచుండు వాఁడు ♦ దిమ్మరీఁడు. ౨౩౪

తే॥ ఘుష్కల సుతుండు ధూమ్రుండు ♦ పూర్ణగర్వి, ధర్మచింతనపరులు ప ♦ థశ్రమంబు
వలన నిద్రించు వారలౌ ♦ వానరాలిఁ, గాంచి విధివశమున వారి ♦ కడకు వచ్చె. ౨౩౫

తే॥ ఈ తటాకంబు నాదని ♦ యెఱిఁగియుండి, వచ్చి నిర్భీతి నిట్లున్న ♦ వారలెవరు?
చావఁదలఁచిరేయని యుగ్ర ♦ చంచలుఁడయి, గాఢముష్టినంగదుని వ ♦ క్షంబుఁ బొడిచె.

తే॥ అంగదుఁడు నిద్రమేల్కని ♦ యసురఁ గాంచి, పంక్తిముఖుఁడని శంకించి ♦ పట్టి యీడ్చి
మోఱ దెబ్బ రొకండీయ ♦ మడిసె వాఁడు, విలవిలం దన్నికొని నాల్క ♦ వెడలఁ బెట్టి

తే॥ వజ్రహతిఁ గూలు పెనుగొండ ♦ పగిది నసుర, చావు కేకతో మేదిని ♦ సంచలింపఁ
బడఁగ నిద్రలో నుండిన ♦ ప్లవగులెల్ల, లేచి పొలసుదిండి శవంబుఁ ♦ జూచినారు. ౨౩౮

క॥ మారుతి తారాసుతుఁ గని, యీరక్కసుఁ డెవ్వఁ డిచటి ♦ కేలా వచ్చెన్
బోరం గారణ మేమన, నారఁగ నేనెఱుఁగ ననుచు ♦ నంగదుఁ డనియెన్. ౮౩౯

చ॥ అది విని జాంబవంతుఁడు మ ♦ హాబల నందనుఁ గాంచి యిట్లనున్
మదయుతుఁడైన వీఁడు బలు ♦ మానిసిదిండి దురాత్ముఁ డీ జలా
స్పదమునఁ గాచియుండి యిట ♦ వచ్చిన ప్రాణులఁబట్టి మ్రింగుచున్
గొఁద వదలించుకోఁ దొడఁగు ♦ క్రూరుఁడు ధూమ్రుఁడు నాఁగ నందఱున్.

చ॥ ఇతనిని పోలు రక్కసు లి ♦ కెందఱు గల్గుదురో? దురాత్మకుల్
మతకరులాట నేమఱిన ♦ మాఁద్తురు మేల్కనియుంట భావ్యమా
వితమని ముచ్చటాడుచును ♦ వేడుక నుండఁగఁ దోడ్తెసం ద్విషాం
పతి యుదయించె రాఘవుని ♦ పత్నిని రోయఁగఁ బోయి రాకపుల్. ౮౪౧

ఉ॥ ఉన్నత సైకతస్థల ప ♦ యోధరముల్ వికచాంబుజాస్యముల్
తిన్ననియుత్పలాక్షములు ♦ తేటగు మౌక్తిక దంతపాళి యా
పెన్నది కుంటఁ బెన్నదని ♦ బిత్తరి నాఁ గనుపట్ట రాము నా
పెన్నది తీరమందు కపి ♦ వీరులు రోయుచుఁ జేరి రిమ్ముగన్. ౮౪౨

ఉ॥ రేవులలో మయూరములు ♦ రెచ్చి నటించుచునుండు చోటులన్
దీవులలోఁ బరిమళము ♦ తేనెయుఁ జిందు వనంబులుండు నా
తావులలో వినిర్మల త ♦ టాకములన్ స్ఫటిక స్థలంబులన్
దేవులలో వినూత్నమణి ♦ దీపిక రోసిరి వానరోత్తముల్. ౮౪౩

చ॥ లలిత సమీర పోతకము ♦ లం జనియింపఁగఁ జేయు నంచ డో
లలఁ బోలుపారు నిర్మల జ ♦ లంబుల మజ్జన మాచరింపఁగాఁ
దొలఁగని జన్మ దుఃఖములఁ ♦ దోర్చి సుఖంబులఁ గూర్చు పెన్నన
బ్బలిముఖు లొయ్యనం గడచి ♦ వచ్చిరి దక్షిణ తీర భూమికిన్. ౮౪౪

ఆ॥ నదులు గిరులు ఝరులు ♦ పొదలును దరులును, దెరువులును మఱువులు ♦ నరసికడచి
మగితి కేగునట్టి ♦ పురుషులకరణి ద, ♦ శార్ణ దేశమునకు ♦ జరిగినారు. ౮౪౫

తే॥ చంపక ద్రుమములచేఁ బ్ర ♦ శస్తి గాంచి, వివిధ ఫలవృక్షములచేత ♦ వినుతిగన్న,
యా దశార్ణ దేశంబెల్ల ♦ నరసి శుక్రుఁ, డుదితుఁడైన విదర్భకుఁ ♦ గదలినారు. ౮౪౬

తే॥ పల్లెపల్లె యూరూరును ♦ ప్లవగవరులు, వక్షమున జన్నిదంబులు ♦ వఱలుచుండ
గేల దర్భలఁ గొని ముని ♦ వాలకమ్ము, లూని వెదకిరి రాఘవ ♦ ధ్యానమొప్ప. ౮౪౭

తే॥ శాలి పండు విదర్భ దే ♦ శమును దాటి, యాత్మరూప జిజ్ఞాసా మ ♦ హాత్ములైన
తపసి వరులు మిక్కిలి యున్న ♦ దండకాఖ్య, వనమునం బ్రవేశించెను ♦ వనచరాలి. ౮౪౮

తే॥ బయలి యింద్రియ జ్ఞానంబు ♦ పరవుచున్న, నంతరింద్రియ శక్తుల ♦ నణఁచుకొన్న
బుషులు గల దండకాటవి - మెల్ల వెదకి, ముండకాటవి చేరిరి - ముదిత వెదక. ౭౪౯

ఉ॥ అందలి సారసాకరము - లందమరాంగన లెల్ల నిత్యముౕ
జందన లేపముల్ తొలఁగ - స్నానముచేయుటచే జలంబులుౕ
గందము నొంద మీలు తమ - కంపును వీడుటఁబట్టి పక్షులుౕ
జెందవు వానిఁ గైకొని భు - జించెడు కోరిక మానసంబులౕ. ౭౫౦

చ॥ హితముగఁ గోడెకాంద్రురకు - నింపును గూర్పఁగ నెంచి కిన్నరీ
వితతులు వీణమీటుచును - వేడుకఁబాడ వియోగినీ సతుల్
పతులఁ దలంచి కుంది మది - వాడఁగ నశ్రులు రాల్పఁ దజ్జలం
బతితరమై మతంగజము - లాడు మడుంగులు గల్గు తావులుౕ. ౭౫౧

చ॥ కలువలఁబోలు మోములు పి - కంబుల గేరు మనోజ్ఞ కంఠముల్
చిలుక వజీరు తూపులనఁ - జెల్లిన చూపులు మారు చాపముౕ
గెలిచిన భ్రూలతల్ మధుర - గీతములుం గల సుందరాంగనల్
చెలువుగఁ బోఁక భ్రమాఁకులకుఁ - జేర్చిన డోలల నూఁగు తావులుౕ. ౭౫౨

తే॥ అరసి *పంచ సంస్కారణార్ద్రమైన దీర్ఘ, కుంతలంబు లొప్పారు కా - కుత్థున్న దేవిఁ
గనఁగలేక యమ్ముండక - వనము గడచి, పాండుగిరికి వేగమ చేరెఁ - బ్లవగచయము.

తే॥ అల త్రివిక్రమపాదాబ్జ ♦ మందునుండి, గంగ యందేదుముకుచున్న ♦ కరణిఁ దోఁప
వెలయు నగ్గిరిగగనచుం ♦ బిత మహోన్న, తంపు శిఖరంబుఁ జేరెను♦తరుచరాళి. ౭౫౪

తే॥ చంద్రచంద్రికలను గెలి సలుపునట్టి, ప్రబల కాంతులతో నొప్పు ♦ పాండుశిఖరి
పం క్తికంఠుని త్రొక్కిన ♦ పరమశివుని, పర్వతముపోలెఁ దెల్లనై ♦ పరిఢవిల్లె. ౭౫౫

తే॥ అమృతవాణి సరోజాక్షి♦యనఘు దేవి, నెచ్చటెచటఁ జూడఁగ సంశ♦యించువారొ
యచ్చటచ్చట గాలించి♦యరసి కానఁ, జాల కగ్గిరీంద్రము వీడి♦చనిరి కపులు. ౭౫౬

తే॥ భువనకంటకుఁడైన దా ♦ నవవిభుండు, జానకిం గొనిపోవుచో ♦ జాఱిపడిన
పుష్పహారమో యననొప్పి♦పాలుపు మీఱు,గౌతమీనదిఁ గిపులు♦కాంచినారు. ౭౫౭

చ॥ పాలుపగు వీచికాచయము - ముత్తెమువంటి విశుద్ధ నీరముం
గలిగిన గౌతమీనది ర - కంబుగ జన్నపుసాల దున్ను నాఁ
గలి మొనఁ జిక్కి వెల్వడిన - కన్యను రక్కసిభ్రముచ్ఛిలింపఁగా
నలఁగిన భూమిదేవి నయ - నాశ్రుల ధారయొ నాఁగ రాజిలెౕ ౭౫౮

* కొండెవేయుట, చొళ్లము పెట్టుట, కీలుగంటు వేయుట, కొప్పువెట్టుట, ప్రేలుజడ అనునవి స్త్రీల పంచ సంస్కారణములు.

ఉ॥ కాంచన రత్న జాలములు - కన్నులు పండువుగాఁగ వీచికా
సంచయ మూడ్చితేరఁ బెలు - చన్ గమకంబుల వచ్చు గౌతమిన్
గొంచక చూడనొప్పె ధరఁ - గొల్చెడు దారమొ గృధ్రరాజు రా
త్రించర రాజుతోఁ బెనఁగి - త్రెంచిన మౌక్తికహారమో యనన్. ౧౫౯

శా॥ న్యాయాన్యాయవిచక్షణుల్ ప్లవగు లా ♦ నందించి గోదావరీ
తోయంబుల్ దగఁ ద్రావి తత్పరిసరో ♦ త్తుంగ ప్రదేశంబులన్
దోయం బొప్పఁగ జానకిన్ వెదకి యెం ♦ దుంగానఁగాలేక మా
ర్గాయాసంబును లేక స్వర్ణనది డా ♦ యంబోయి రుగ్ర త్వరన్. ౧౬౦

చ॥ పసుపును నల్పు వన్నెగల ♦ బంభరముల్ బకముల్ మరాళముల్
నసి నడయాడు క్షేత్రములు ♦ చల్లని తావులు నీటిపట్టులున్
విసవిస నేగి చూచి మఱి ♦ వేడ్కఁ దరించుచు నారికేల వృ
క్ష సమితి నిండు ధాత్రి తిల ♦ కంబు కుళిందము దాఁటి యంతటన్. ౧౬౧

ఉ॥ కొంకణ దేశమున్ గడచి ♦ కోరికఁ బశ్చిమవార్ధి చేరువన్
వంకలు డొంకలున్ వెదకి ♦ వారక యంబరమంటి యేగి యే
ణాంకుని త్రోవ నడ్డు శిఖ ♦ రాగ్రము లొప్పఁగ దేవపూజ్యమై
క్రుంకుడుగట్టు నాఁ జను న ♦ రుంధతి శైలము జేరి రవ్వలన్. ౧౬౨

ఉ॥ అచ్చటఁ గాంచి యందమున ♦ కందము గూర్చెడు సీత లేమికిన్
నొచ్చి తరించి భిల్ల తరు ♦ ణుల్ తమ తేనియ నిచ్చి గొల్లతల్
తెచ్చిన చల్ల మార్చికొను ♦ తేటగు పచ్చల కొండ సానువుల్
చొచ్చి ధరాత్మజన్ వెదకి ♦ చూచిరి మల్లిరి వేంకటాద్రికిన్. ౧౬౩

శా॥ జ్ఞానుల్ మౌనులు వానవాలులు మరు ♦ న్నారీమణుల్ సాధు ల
జ్ఞానుల్ పాపులు సర్వమానవులు త ♦ చ్ఛైత్యలేశు నారాయణున్
జ్ఞానాతీతుని గొల్చువారు విలస ♦ చ్చారిత్రులై వేడ్క న
జ్ఞానం బూడ్చెడు పుణ్యతీర్థములలో ♦ స్నానంబు గావించుచున్. ౧౬౪

శా॥ కామాదుల్ తెగఁగోసి యింద్రియకృతుల్ ♦ ఖండించి నిందాస్తుతుల్
సామాన్యంబుగఁ జేసి కాంతల కటా ♦ క్షప్రక్రియల్ రోసి యు
ద్దామంబైన తపంబుసేసి మునిసం ♦ తానంబు గోవింద రా
మ్నామధ్యాన పరాయణుల్ సతత మా ♦ నందించు నాకొండపై. ౧౬౫

శా॥ కేలన్ లీల సుదర్శనాదికములన్ ♦ గీలించి భక్తాళికై
నీలాంభోద శరీరుఁడై వెలయు త ♦ న్నిత్యాంఘ్రి కంజాతముల్

పోలం దాల్చిన యగ్గిరిం గల మృగం ♦ బుల్ చెందు మోక్షంబనన్
శ్రీలక్ష్మీశు పదంబు చేరు టరుదే ♦ సేవించు పుణ్యాత్మకుల్? ౮౬౬

ఉ॥ ఆగిరిరాజమును దటిసి ♦ యంగదముఖ్యులు చుట్టి వచ్చుచున్
యోగసమాధినుండి విని ♦ యోజిత మాధవ పాదచిత్తులై
ప్రాగఘభారముల్ తొలఁగఁ ♦ బావనులైన తపోధనాఢ్యులన్
బాగుగఁ గాంచి తచ్చరణ ♦ వారిజముల్ తలసోఁక మ్రొక్కుచున్. ౮౬౭

తే॥ కుటిల కుంతల యైన కా ♦ కుత్థ్స దేవి, నెందుఁ గనక ద్రావిడమున ♦ కెల్లయైన
వేంకటాద్రి వదలి విప్ర ♦ వేషములను, వెలలినారలు తొండ మం ♦ డలము చేర.

తే॥ దేశమంతయు నటవీ ప్ర ♦ దేశమగుట, వ్రేల యిండ్ల ముంగిటఁ బంట ♦ చేలు పొసఁగు
నీర పూర్ణ తటాక కే ♦ దార వనము, లచ్చటచ్చట మిక్కిలి ♦ యలరుచుండు ౮౬౮

మ॥ పొలముల్ దున్నెడి కర్షకుల్ వృషములన్ ♦ బోఁ గోలతోఁ గొట్టఁగాఁ
గలఁగం బాఱిన హంసముల్ పవన వృ ♦ క్షంబుల్ తెగంబండి భే
దిలి యందుండి స్రవించు ద్రవ్యములు ప్రో ♦ దింగూర్పఁ బెంపారు పై
రుల దోమ్మాడుగఁ ద్రొక్కుచుండు నవి యా ♦ రూఢంబుగా నచ్చటన్.

తే॥ తరుణుల విశాల సుషమ నే ♦ త్రములఁ బోలు,నుత్పలము లటశోభిల్లు ♦ చుండుఁ; జెలుల
యూరువులవంటి కదళీ త ♦ రూత్కరముల, నిద్ర సేయును పరభృత ♦ నీడజములు.

ఉ॥ వీథుల మ్రోఁగుచుండు బహు ♦ విశ్రుత వాద్య విరావ మేదురో
ద్బోధము నిత్యమున్ వినుటఁ ♦ దోయద గర్జనమంచుఁ గేకులు
త్సేధము నొంద వంచలును ♦ ధింధిమి నాదము విన్నఁ బాఱువున్
బాధ భ్రమంబు గల్గునొకొ ♦ వాడుక యానెడఁ బ్రాణికోటికిన్? ౮౭౦

శా॥ శృంగారించిన తేరులం జెనయు తేఁ ♦ జెట్లందు పూఁబాళలన్
రంగారంగని గండు చేఁపలు బక ♦ వ్రాతంబుగా నెంచి భీ
తిం గాంచుం దోవ మొగ్గలం గని మహా ♦ ర్తిన్ భేక సంఘాతముల్
మ్రింగన్ వచ్చిన జెట్టిపోతులని ని ♦ర్వేదించుఁ బెల్లార్చుచున్. ౮౭౧

క॥ పీతలను పట్టుకొను కడ, జాతి చెలులు ముత్తెముల ప ♦ నం గని బక సం
జాతాండములని పగులఁగ, వైతురు తాఁ బేటి చిప్ప ♦ పై నజ్ఞతచే. ౮౭౨

క॥ లేఁత వయసు గల కోఁతుల, చేతులఁ గల పనస తొనలఁ ♦ జిట్టిఁగలు పైఁ
దోఁతెంచి మునరుఁ బువ్వు, వ్రాతమునకు మునరు బంభ ♦ ర వ్రజముక్రియన్. ౮౭౩

చ॥ ధనికులతో గృహస్థులగు ♦ ద్రావిడపండితపాళితోడ ని
ర్ధనులకుఁ గామితార్థముల ♦ దండిగ నిచ్చు వదాన్యరాజితోఁ

గొనకొని దుష్టనిగ్రహము ♦ గోరిక సేయు నృపాలితోడ డీ
కొని పులుమేయఁగాఁ దొడఁగెఁ ♦ గోరిన దిచ్చెడి యావు వెల్లనై. ౮౭౬

ఉ॥ మీఱిన వైభవంబు లుప ♦ మింపఁగరాని విలాతి యందు పం
కేరుహవాసినిన్ వెదకి ♦ కీశులు దాఁటి గమించి గొప్ప కా
వేరి పరంగు చోళ పృథి ♦ వీస్థలిఁ జొచ్చి వనంబు లొత్తుగాఁ
బైరులు గల్గి తూఱ నెడ ♦ పాఱని భూములఁ జేరి గడ్డుగన్. ౮౭౭

ఉ॥ వంకర టింకరై పెరిఁగి ♦ వ్రాలిన మ్రాఁకులనుండి రాలు తేఁ
డెంకలు కాళ్లకుం దగుల ♦ డెందము తల్లడమంద దుల్లుచున్
వంకలు పాఱు తేనియల ♦ పల్లములంబడి లేచి తుఢ్ఢు కొం
చంకిలి సంకటం పడుచు ♦ నాఁగక యేగిరి యూఁకి జోకచేన్. ౮౭౮

మ॥ శ్రుతిగూర్పన్ బొనరించు నాదుక్రియ పై ♦ చ్చుందగ్గుగా మ్రోఁగ ని
ష్రుతతుల్ నించిన గానుఁగుల్ విడుచు నిం ♦ చుంబాలు నిండారి సం
గతమై యుండఁగఁ గాంచి యాపెనములం ♦ గాంక్షించి యుల్లంకుల
ద్భుతరీతిం జొరఁబాఱి చేపలట నెం ♦ దున్ లేమి వే క్రమ్మఱున్. ౮౭౯

చ॥ వికసిత పుష్ప గుచ్ఛములఁ ♦ బెల్లుగ వ్రాలిన షట్పదాళిచేఁ
బ్రకటిత గాన మాధురి వి ♦ రాజిలు తోఁటలయందు తేనియల్
చికిచికి కాఱి వెల్లువయి ♦ శీఘ్రగతిం జనుచుండఁ గీశ శా
ఖకములు గాంచి యేఱయను ♦ భ్రాంతి డిగంబడకుండు శాఖలన్ ౮౮౦

ఉ॥ కేతకి పూల దుమ్ముచటి ♦ కేళివనంబులఁ బండి వ్రేలు నా
చూత ఫలంబులం దవులఁ ♦ జొప్పడుఁ బూవుల తావి పండ్లకున్
రీతిగఁ గేదరంబులను ♦ రేగటి పంకములందు కల్వ పూ
లాతతమాటఁ బంకిలము ♦ నందలి ప్రీహులుఁ బొందు గందమున్. ౮౮౧

ఉ॥ స్రుక్కక వానరుల్ వెదకి ♦ చోళుల దేశము దేవిఁ గానమిన్
మిక్కిలి కుంది ధర్మపథి ♦ మేటి గృహస్థులు కల్గు చేరలోఁ
దక్కక చూచి యింపయిన ♦ ద్రావిడభాషకుఁ డెంకి యంచుఁ బే
రెక్కిన పాండ్యదేశమున ♦ కేగిరి వేగ దిటంపుఁ బూన్కిమై ౮౮౨

చ॥ సకలజగంబులన్ విమల ♦ సన్నుతిగాంచిన గద్య పద్య నా
టకముల ఖ్యాతి నొందు ద్రవి ♦ డ ప్రకటామృతమున్ జనాలి కి
చ్చుకముగ నిచ్చి గౌరవ వి ♦ శాలత నొందిన పాండ్య దేశమున్
బుకలకళోజ్ఞులు నవ్విబుధ ♦ లోకము పోలు ననఁగఁ జెల్లునే? ౮౮౩

మ॥ ఋజు మార్గ ప్రవణుల్ కవీంద్రులు మహో ♦ త్కృష్ట ప్రభా పుణ్య పాం
డ్యజగంబందు మెలంకువం దిరిగి సీ ♦ తాన్వేషణ న్మూర్తిచే
భుజముల్ పాదములుం జలించుచును నొ ♦ ప్పులొప్పంద నిర్విణ్ణులై
నిజ జీవంబులు వీడువారివలె గ్లా ♦ నిం బొంది రప్పట్టునన్. ౮౮౪

ఉ॥ దక్షిణ వార్ధి తోయ కణ ♦ తర్పిత శీతల వాత పోతముల్
శిక్షణమొందినట్టి వహిం ♦ జెంది సతంబును వీచుచుండు పాం
డ్య క్షితి దాంటి కీశులు క ♦ డంకను చేరి మహేంద్ర శైలమున్
లక్షణ లక్షితాంగి మహి ♦ కామణి రోసిరి యెల్లచోటులన్. ౮౮౫

౧౩ సంపాతి పటలము. (౬౬)

ఉ॥ కాంచిరి వానరుల్ కడంక ♦ గర్జన సేయుచు నింగిదాంక ని
క్కించిన దీర్ఘ వీచులను ♦ కేలను చాంచి కురంగనేత్ర పూ
తాంచితగాత్ర జానకి ధ ♦ రాత్మజ యున్నది లంకయందు వీ
క్షించంగ రండు రండనుచుం ♦ జీరెడి కైవడి నొప్పు నంబుధిన్. ౮౮౬

తే॥ కలిసికొనం బల్కి పంపిన ♦ కపిచయంబు, లన్ని దెసలను వెదకుచు ♦ నవనిజాతం
గాంచనేరక వచ్చియా ♦ గ్రావమందు, కడకు సంగదాదులతోడం ♦ గలిసికొనియె.

తే॥ కలిసికొని యందఱుంగూడి ♦ కమలనేత్రం, గుటిలకుంతల నెందుం గ ♦ న్గొనంగలేమిం
గర్జమియ్యది యని మదిం ♦ గాంచలేమి, దూపటిల్లుచు నాల్కలు ♦ తొట్రుపడంగ.

తే॥ త్రేండొసంగిన గడువు మీ ♦ ఱినది కాని, కార్యమో వట్టిదయ్యె రా ♦ ఘవుండు విన్న
నసువులను వీడు; మనచేత ♦ నగునదేది?, చెడితి మెల్లవిధంబులం ♦ జిట్టచివర. ౮౮౯

తే॥ పొసంగ నిండె తపింతమా? విసముమ్రింగి, చత్తమా? యేదియుచితంబు?చావెమేలు;
పోయి చచ్చుటకంటె నీ ♦ భూధరమున, నిలుగుటేయుఱవని వారు ♦ తలంచుచుండ.

తే॥ అపుడు యువక పంచాస్యమా ♦ నంగదుండు, గిరులు వరుసలై యమరిన♦కరణినున్న
వనచరులంగని తనకుం దో ♦ చిన విధంబు, నిట్లు వాక్రుచ్చెం జింతాకు♦ లేక్షణుండయి

మ॥ దివియున్ భూమియు నెల్లెడన్ వెదకి నీ ♦ దేవిన్ సమీక్షించి వా
చవు లూరంగ వచింతుమ య్యవనిజా ♦ సందేశము న్నీకు రా
ఘవ! యంచుం గడు జాణలంబలె నన ♦ ర్ఘ ప్రజ్ఞలం బల్కి యా
పవిదిం జేయంగలేక మాటపడంగం ♦ బాలైతి మిప్పట్టునన్. ౮౯౨

ఉ॥ చేసెద మన్న కార్యమును ♦ చేసి ముగింపము మేరమీఱుము
న్నే, సతి గానరాదనుచు ♦ నేగి వచింపము పూనియే నసం

తానుతఁ గానవచ్చు నను ♦ ధైర్యము లేదు మరించుటే యిఁకన్
మోసములేనిత్రోవ యగుఁ ♦ బోవుట సిగ్గులు పెన్న యుక్తమే? ౮౯౩

మ॥ గడువున్ మీఱఁగఁ గార్యమున్ సమకుఱం ♦ గైకోక కిష్కింధ కూ
డఁగా నేగినఁ దండ్రికోపపడు శ్రీ ♦ రాముఁడు చింతాంబుధిం
బడు నాఘోరము గాంచఁజాల నగుటన్ ♦ బ్రాణంబులన్ వీడెదన్
గడు ధర్మజ్ఞులు మీరు నిశ్చయముతోఁ ♦ గర్తవ్యముం దెల్పుఁడీ. ౮౯౪

చ॥ అన విని జాంబవంతుఁ డిటు ♦ లాడుఁ బ్రభుండవు నీవు సన్న త్రో
వన చనువార మీవు కడ ♦ వం గని యిచ్చట నేడ్చుచుందుమే?
మనమున దార్ఢ్యమూని యను ♦ మానము మాని వినాశవార్త నీ
జనకునకున్ వచింపఁ జనఁ ♦ జాలుదుమే? పలుమాట లేటికిన్? ౮౯౫

తే॥ వినుత విక్రమ! యువరాజ! వెనుక కేగి, తెలుపఁగా నేమిగలదు చిం ♦ తింపు మయ్య
యేము చావంగఁ దగుఁ గాని ♦ యింగితజ్ఞ!, నీవు చావంగఁ దగవు మ♦న్నింపఁదగుదు

చ॥ అదివిని జాంబవంతుని త ♦ దన్యులఁ గాంచి వచించు నిట్టు లం
గదుఁడు మహాత్ములార! దరి ♦ గానక మీరు విపన్మహాంబుధిన్
బ్రిదిలి మునుంగుచుండ నొక ♦ వీరునికై వడి నేను మాత్రమే
మదిమది నేగినన్ జనము ♦ మన్ననసేయునె? యద్ది యుక్తమే? ౮౯౬

తే॥ పెద్ద లేమందురో యను ♦ భీతిలేక, వెంట వచ్చిన మిత్రులు ♦ మంటఁ గలియ
వీఁడు చావక యిటు వచ్చి ♦ నాఁడొ! యనెడి, లోకనిందకై యరిగెద ♦నాకమునకు

సీ॥ మనమిందఱము నిందు ♦ మరణింతుమేని నా, తలిదండ్రు లెటేఁగినఁ ♦ బొలియువారు
అదివిని రాఘవుఁ ♦ డతని తమ్ముండు ద్రెి, య్యాదురు తద్వార్త య♦యోధ్యఁబ్రాఁక
భరతాదులును తమ ♦ ప్రాణముల్ విడుతురు, వారి తల్లులు వెండి ♦ పౌరవరులు
చచ్చెదువా రిది ♦ సత్యంబు సత్యంబు, చెడితిఁ జెడితిఁ జెడఁ ♦ బొడమినాఁడ

ఆ॥ పుట్టి నిల్లు తాను ♦ మెట్టిన యిల్లును, వెలుఁగఁ జేసినట్టి ♦ విమల చరిత
లోకమాత సీత ♦ కాకుత్థ్సు కులపత్ని, కానరాకయున్న ♦ కారణమున. ౮౯౯

తే॥ అంగదుం డోర్వలే కిట్టు ♦ లాడునంత, నిప్పు కడుపునఁ బుట్టిన ♦ చొప్పుగాఁగ
నెల్లవారల యుల్లముల్ ♦ తల్లడిల్లె, ఋక్షనాథుఁ డంగదుఁ గని ♦ యిట్టులనియె

ఉ॥ ఏవగ నెంచిచూడ మఱి ♦ యీవును నీజనకుండు రాజు సు
గ్రీవుఁడు దక్కఁ గేశకుల ♦ కీర్తిని నిల్పెడు వాఁడు లేఁడటుల్
గావున నీవు నిలుగుట ♦ గాఁదగదంచు వచించినాఁడ నా
శ్రీవరు చావుఁ గూర్చి యిటఁ ♦ జింతన సేయుటయేని యుక్తమే? ౯౦౧

ఉ॥ ప్రాణముతోడఁ బోవఁదగు ♦ వాఁడవు నీవొకరుండవే చుమీ
యేణవిలోచనన్ వెదకి ♦ యేడ్తెఱ వానరవర్యులెల్ల ని
స్త్రాణ భజించి క్రమ్మఱిలఁ ♦ జాలక చచ్చిర యంచు నాజగ
త్త్రాణునకుం గపీంద్రునకు ♦ రాణ వచింపుము మాకు మాఱుగన్. ౯౦౨

చ॥ అపుడు నాంజనేయుఁడను ♦ నర్యమ శీఘ్రగులార! లోకమం
దున నొక భాగమేని వగ ♦ తోఁ బరికింపఁగ లేదు రాముదే
విని; మఱియింతలో గమన ♦ వేగము మాలినవారిమాడ్కి శ్ర
ద్ధను విడువారి పోల్కిని వి ♦ తాకును వేసట నొందఁ జెల్లునే? ౯౦౩

శా॥ పాతాళంబున నూర్ధ్వలోకములలో ♦ స్వర్ణాద్రిపైఁ బద్మసం
జాతాండ వ్రజమందు నిబ్బరపు దీ ♦ క్షంబూని వీక్షించుచున్
సీతాదేవిని కాంతుమేని మఱి యా ♦ క్షేపింతురే? తప్పుగాఁ
జేతంబందు దలంతురే? యొడయఁడున్ ♦ శ్రీరామ సౌమిత్రులున్. ౯౦౪

ఉ॥ కాపున జానకిన్ వెదకు ♦ కర్జమె న్యాయము లోకమెల్లెడన్
దీనరమంది రోయుదము ♦ తేఁకువ నంతటఁ గానమేని యా
ధీవరుఁడా జటాయువు గ ♦ తించిన దారిని పోద మిప్పుడీ
త్రోవఁ జరింతుమేని యప ♦ దూఱు గడింతుము మూర్ఖపద్ధతిన్. ౯౦౫

ఉ॥ సీతుల నిట్లు మారుతి గ ♦ ణించి వచింపఁగ గృధ్రరాజు సం
పాతి, యనుంగుఁదమ్ముఁడు స ♦ పార కృపాళుఁడు నిత్య విక్రమో
పేతుఁడు నీతిమంతుఁడు వి ♦ వేకి జటాయువుచావు వింటచేఁ
జేతము తల్లడిల్ల నడిఁ ♦ జేరెఁ గపీశ్వరు లున్న చోటికిన్. ౯౦౬

సీ॥ ఆయతకీర్తి జ ♦ టాయు వెటులఁ గూలె, నని కొట్టుకొను గుండె ♦ యొనరువాఁడు
గడగడ వడఁకు మే ♦ నలవాఁడు పవి భిన్న, పక్షమా శైలంబు ♦ పగిదివాఁడు
తమ్ముని చంపిన ♦ తెత బలుఁ డెవఁడని, కన్నుల బాష్పముల్ ♦ గార్చువాఁడు
భూమిపై గర్జించు ♦ భూరి మేఘుముమాడ్కి, వేదనచేఁ బల ♦ వించువాఁడు

తే॥ గుల్మతరు లతాదులు మిట్ట♦గుట్టలెల్ల, సమము లగునట్లు త్రొక్కుచు♦జరగువాఁడు
వాయుదేవుంఁడు బలముతో ♦ వైవ దొరలు, వెండికొండ విధంబున ♦ వెలయువాఁడు

తే॥ వచ్చి చేరఁగ బ్లవగులు ♦ భయమునొంది, పరుగులిడిరి కకావికఁ ♦ బవనసూనుఁ
డుగ్రుఁడై నిల్చి పక్షి రూ♦పొంది వచ్చు, మాయలాఁడవు నిలుమని♦మాఱుకొనియె.

ఉ॥ మార్కొని నిష్కళంకుఁడును ♦ మాన్యుఁడు దుఃఖితుఁ డార్తిఁ దమ్మునే
పేర్కొనువాఁడు కన్నులను ♦ వృష్టిగ నశ్రులు రాల్చునాతఁడే

కోర్కెయు లేనివాఁడగుటఁ ♦ గొంచక యింగితవేది తత్త్వమ
త్యర్కుఁడు వాయుసూతి ముఖ ♦ మందలి చిన్నె లెఱింగె బాగుగన్. ౯౦౯

తే॥ ఎఱిఁగి యాతఁడు డాయంగ ♦ నెదుర నిలిచి, వాయి తెఱవక మున్నె సం♦పాతి నాయ
నుంగుఁదమ్ము జటాయువు♦నొంచి కూల్చు, శూరుఁ డెవఁడనియడిగె సా♦మీరిఁగాంచి

తే॥ అంత మారుతి నీదు వృ ♦ త్తాంత మిపుడు, నిజము దాఁపక తెల్పుదే-నియును పిదప
జరిగిన యుదంతమెల్ల ని - శ్చయముగాఁగఁ, దెలుపఁగలనన సంపాతి - పలికె నిట్లు

ఆ॥ నాకు వెనుకఁ బుట్టి - నాకన్న ముందుగా, మరణమొంది యశము - ధరణి నిలుపు
నాజటాయువునకు - నన్నను భ్రాతృ వి, రహితవృత్తి నిట్లు - బ్రదికినాఁడ. ౯౧౨

తే॥ అనిన సంపాతి పల్కుల - నాలకించి, యడలి యో పక్షిరాజ! ద - శాస్యుతోడ
నాల మొనరించి యతని చం - ద్రాయుధమునఁ, గాలగతి నొందెనని పల్కె - గాలిపట్టి

తే॥ విన్న సంపాతి వజ్ర ని - ర్భిన్న కుధర, భాతి భువిఁబడి వేఁడి ని - శ్వాసములను
వదలి ప్రాణముల్ తత్తఱ-పాటు నెంద, హానుమ పల్కు లట్లే పల్కె - యడలిబడలె

మ॥ అనుఁగా! భానుఁడు కాల్పఁ బక్షములు పా - డై పోవ నిచ్ఛానువృ
త్తినిఁ కెందుం జనలేక దుర్భర మహా - ర్తిం బొంది చాకుండఁగా
నినుచే నుంతయు నొప్పి చెందవును నీ - వేముందుగాఁ బోవు టెం
దనువౌ ధర్మము? చిత్రమయ్యె నిది మా - యాలోకమంచెంచెదన్. ౯౧౫

మ॥ సరసీజాసనుఁ డట్లెయుండ భువియున్ - స్వర్గంబు నిల్పొందఁగా
వర ధర్మంబును నిల్చియుండ దివిఁ గ - ల్పంబట్టులే యుండ నం
బర వాయు జ్వలనాంబు మేదినులు స - ర్వంబట్లె యుండంగ సో
దర! నీవొక్కఁడ వెట్లు కూలితివొ? చి - త్రంబయ్యె నాకియ్యెడన్. ౯౧౬

ఉ॥ రంభ కనూరుచేఁ బొడమి - రాగము మీఱఁగ నిన్నినాళ్లు సం
రంభముతోఁ జరించితిమి - క్రందగు లోకములెల్ల వెండిఁ బ్రా
రంభము దోఁచె నిర్వ్యరకుఁ ♦ బ్రాయిడివైన వియోగ మిప్పుడా
రంభయె తల్లిప్రేమగొని ♦ రమ్మన నేగితె నన్ను వీడుచున్. ౯౧౭

ఉ॥ వీరవరాగ్రణీ! గరుడ ♦ వేగ! దశాస్యుఁడు మూఁడులోకముల్
వారక గెల్చుఁగా కడలి ♦ పాఱక నిల్చెనె? నిల్చి ధీరుఁడై
పోరెనె? పోరుఁగాక! పోరి ♦ పుచ్చుఁగఁ జాలెనె? చిత్రమయ్యె నా
గారిని పాము మార్కొని జ ♦ యంబు గడించెను ధాత్రి నేఁటికిన్. ౯౧౮

తే॥ అనుచు సంపాతి పలవించి ♦ యవశుఁడైనఁ, దలరి మారుతి సమయోచి ♦ తంబులైన
పలుకులాడి యోదార్ప నా♦పక్షివిభుఁడు, మరల నిట్లనియె మరుత్కు♦మారుఁగాంచి.

ఆ॥ క్రౌర్యశీలి బహుళ ♦ కపటి దశాస్యుతోఁ, బోరఁగా జటాయు ♦ వునకు నేమి
హేతు వొనరెఁ దెల్ప ♦ వే మహాత్మక! యన, వాయుపుత్త్రుఁ డిట్లు పలుకఁదొడఁగె.

శా॥ మా రామప్రభు ధర్మపత్ని మిథిలా ♦ తీశ్మనాథు సత్పవిత్రి సీ
తా రామామణి దుష్టరక్షసుఁడు దై ♦ త్యస్వామి కావించు మా
యారంభంబునఁ జిక్కి నాథు నెడఁబా ♦ యం గల్గె నవ్వేళ లం
కారాజన్యుఁడు ముచ్చిలించికొని యే ♦ గంబూనె భూమీసుతన్. ౯-౨౧

శా॥ ధర్మాత్ముండగు నీదు తమ్ముఁడట దై ♦ త్య క్రౌర్యముం గాంచి దు
ష్కర్మ స్నీతులఁ దేర్పఁ జూచి యెటులుం ♦ గాకున్కిఁ గోపంబునన్
మర్మం బంట నఖాలి దూఁటి దనుజున్ ♦ మార్కొంచు ధాత్రీసుతా
నిర్ముక్తిం దలపోసి సంగరము పూ ♦ నెం బల్మి లంకేశుతోన్. ౯-౨౨

ఉత్సాహ॥ పూని వాని యరదముఁ బొడి ♦ పొడిగఁ జేసి చేతులన్
మేను వాఁడిగోళ్లఁ జీల్చి ♦ మిగిలి దిటవు గ్రుంచఁగా
దానవుండు శంభుఁ డీయఁ ♦ దాల్చిన కరవాలుచే
నూని నీదు తమ్మునుసులు ♦ లూడ్చి పోయె నావుడున్. ౯-౨౩

ఉ॥ తమ్ముని చావుకై మిగులఁ ♦ దాపము నొందితిఁగాని రామ కా
ర్యమ్మున నశ్వరంబయిన ♦ ప్రాణములం ద్యజియించి నిత్యమో
క్షమ్ము గడించె నంచు మది ♦ సంతసమందెద నట్టిజన్మమే
యిమ్మగ సార్థకం బయిన ♦ దెన్న మహీస్థలి భక్తసత్తమా! ౯-౨౪

ఉ॥ రాముని దేవిఁ గావ సమ ♦ రం బొనరించి రణంబునందు యా
స్వామినికై ప్రియంబుమెయిఁ ♦ బ్రాణము లర్పణ చేసినట్టి గా
రా మనుజుండు నిక్కము స్థి ♦ రంబగు నిర్మల కీర్తి దేహుడై
భూమిని గల్గువాఁ డనఁగఁ ♦ బోలు మఱొక్కటి చెప్ప నొప్పునే? ౯-౨౫

ఉ॥ శ్రీరఘువీరు నెయ్య మొన ♦ రించిన తమ్ముఁడు రామసేవకై
జాఱిచి జీవముల్ విమల ♦ శాశ్వతకీర్తి గడించె దానిచేఁ
గూరిన నష్టమేది? మఱి ♦ కోరికఁ బొందఁగదగ్గ యర్థముల్
గౌరవ మున్నె? సంతసము ♦ గాంచఁగ నింతకు మించి కల్గునే? ౯-౨౬

చ॥ అని వినుతించి నిర్మల జ ♦ లాశయ మందున మజ్జనాదికం
బొనరిచి వెండివచ్చి ప్లవ ♦ గోత్తములార! వడిన్ ధరాత్మజా
తను వెదకంగ వచ్చితిరి ♦ తమ్ముని వార్తను దెల్పి నన్నుపా
వనునిగఁ జేసినార లొక ♦ వంతను గూర్చిన వారె మీరలున్? ౯-౨౭

చ॥ మృదు మధురోక్తుల న్నిజము ♦ మేకొని పల్కెడు వీరులార! యె
ప్పిదముగ నేకకంఠులయి ♦ ప్రేమను తారక మంత్రరాజమున్
బదరక యుచ్చరింపుఁ డటు ♦ పావన నామము విన్న నాకు మే
లొదవును రాము సత్కరుణ ♦ నొప్పును కాలిన పక్ష యుగ్మమున్. ౯-౨౮

మ॥ అని సంపాతి రహించి వేఁడుకొనఁ బ్ర ♦ త్యక్షంబుగాఁ జూచు వే
డ్కను శ్రీరాముని దివ్యనామము తదే ♦ కస్వాంతులై భక్తిభా
వనతోఁ గీతులు పాడుచుండఁగనె త ♦ త్పక్షంబు లందంబుగా
దనరెన్ విస్మయమంది రెల్లరును త ♦ ద్ధాన ప్రభావంబుకై. ౯-౨౯

చ॥ సురుచిర దేహకాంతి గల ♦ సూనృత భాషుఁడు గృధ్రరాజు, శ్రీ
వరుని కృపా కటాక్షము న ♦ పారముగాఁ గొని ఱెక్కలొప్పఁ దీ
వరమగు వహ్నిఁ గ్రక్కు కర ♦ వాల మొఱంగొనుపోల్కిఁ బక్షకాం
తర గత దీర్ఘ దేహుఁడయి ♦ తద్ద వెలింగెఁ బ్లవంగు లుబ్బఁగన్ ౯-౩౦

ఉ॥ ఱెక్కలు లేని యండజము ♦ ఱెక్కలు గొన్న విధంబు గాంచఁగా
నక్కజమంది సందియము ♦ నంది భయంబును పొంది రాఘవున్
నిక్కపు భక్తిచేఁ గొలువ ♦ నేర్చిన వారికిఁ గల్గు లాభమున్
జక్కని కన్నులారఁగని ♦ సల్పిరి పాడుచు మోద నృత్యమున్. ౯-౩౧

క॥ శ్రీరామ నామ మహిమము, నారూఢిగఁ దెలిపినట్టి ♦ యండజ రాజున్
గారవమున మ్రొక్కి యతని, చారిత్రము దెలుప వేఁడ ♦ సంతుష్టుండై ౮-౩౨

క॥ పలుకు నిటు మిత్రులారా!, యిలఁ జీకటిగొంగ రథము ♦ నేడ్తెఱ నడపం
గల యరుణుని సుతులము గ, ద్దల కులమున కేలికలము ♦ తరుణ వయసునన్. ౯-౩౩

క॥ సురపురిని చూచు వేడుక, నిరుపురమును నెగసి యెగసి - యేగుచునుండన్
ఖరకరుని చేరువకుఁ జను, తరుణంబున నతఁడు కాంచి - తద్దయుఁ గినిసెన్ ౯-౩౪

శా॥ నాకన్నం గడు నూర్ధ్వమం దరుగుటన్ - నాతమ్ముఁ డల్లాడి య
న్నా! కాపాడుము యన్న నేను తనక - న్నం బైకి వే పోయి యా
కాకం దాఁకఁగనీక కాచితిని ఱె - క్కల్విప్పి, నా మేనికిన్
సోఁకెన్ వేఁడిమి ఱెక్కలుం గమరెనీ - క్షోణీస్థలిం గూలితిన్. ౯-౩౫

మ॥ పుడమిం గూలిన నన్నుగాంచి రవియుం - బూర్ణానుకంపామతిన్
బెడఁబాయం గల రాముధర్మసతి న - న్వేషింపఁగా వానరుల్
కడఁకన్ వచ్చుచు నిన్నుగాంచి యెలమిం - గాకుత్స్థ సంకీర్తనల్
నొడువన్ ఱెక్కలు వచ్చుఁగాకని విప - న్మోక్షంబు వాక్రువ్వఁగన్. ౯-౩౬

శా॥ నా పక్షంబులు భస్మమౌ కతన సం ♦ తాపించి నిట్టూర్పుతో
నీ పృథ్వీధరమందు గూలి మరణం ♦ బే మేలుగా నెంచుచో
శాపానుగ్రహశక్తుఁడా ర్తజన ర ♦ క్షన్ లోక సారంగుఁడా
నాపూన్కిన్ వదలించి యూఱడిల వి ♦ న్నాణంబుగాఁ బల్కుచున్. ౯౩౭

చ॥ చదువని మూఢులంబలెనె ♦ స్వాంతమునందున నుత్సహించి స్వః
పదమున కేగనెంచి యిటు ♦ భంగము నొందుట నీదు తప్పుకా
కిది మఱియొక్కటే? యనకు ♦ లేశుని దూతలు వచ్చునంతకుం
బదరక యుండు మాత్మవధ ♦ పాతక హేతువు శీలధర్మమే? ౯౩౮

ఉ॥ గర్వ మదెట్టివారికిని ♦ కాని గుణంబది కల్గియేచుమీ
సర్వముఁగోలుపోయితివి ♦ సత్యము వానరరాజి పూన్కి మై
నుర్వర కన్యకై ప్రభు ని ♦ యుక్తిని వచ్చును మేలుగల్గు నీ
కోర్వని యిట్టితీరు తగు ♦ నో? యని యమ్మని మందలింపఁగన్. ౯౩౯

చ॥ తుదకిటు జీవముల్ నిలిపి ♦ దుఃఖము లోర్చుచునుంటి నామహా
పదగని దిక్కుదోఁపక య ♦ పార మనోవ్యథ నొందు తమ్ముఁడ
య్యదనున నాయనుజ్ఞ విన ♦ యంబున మీఱఁగలేక గృధ్రరా
ట్పదమును పొందె మాచరిత ♦ పావనులార! గ్రహించినారలే? ౯౪౦

ఉ॥ మీరలు వచ్చినారలును ♦ మేలిమి ఱెక్కలు వచ్చె నాకు మీ
చే రహి నొందితిం బుడమి ♦ శ్రీరఘురాముని సేవసేత మీ
కారయ నెట్లు ధర్మమగు ♦ నట్టులె నాకును ధర్మమౌట నే
నారసినంతవట్టు తెలి ♦ యం దెలుపంగలవాఁడ నమ్ముఁడీ. ౯౪౧

ఉ॥ దేవిని దొంగిలించికొని ♦ దిట్టరి నీచుఁడు పాపి క్రూరుఁడీ
త్రోవనె యేగఁ గాంచితిని ♦ దుష్టుఁడు లంకను చేరినాఁడు తాఁ
గావలినుంచినాఁడు జన ♦ కప్రభు నందిని యందయున్న దీ
రే వగనైన నబ్ధిఁ దరి ♦ యింపుఁడు కాంచుఁడు రామగేహినిన్ ౯౪౨

చ॥ ఏగుట కెట్లు శక్యమగు - నిచ్చటి కున్నది నూఱు యోజనాల్
సాగరవేష్టితం బయిన - లంక యముండును చూడ్కి నిల్పఁగా
నీగును బెగ్గడిల్లి దను - జేంద్రుని కోప దవాగ్ని పావకున్
జాఁగఱలాడఁజేయు ననఁ - జాలుదురే యెవరేని చేరఁగన్? ౯౪౩

చ॥ నలువయు శంకరుండును చ - నంగ నశక్య మనంగనేల? క
ర్వలియును కాలుఁడున్ జొరఁగ - రాదు చరాచరకోటి లోపలన్

వెలుపలనున్న వెన్నుఁడు ప్ర - వేశ మొనర్పఁగలేఁడు మీరలీ
పొలుపు నెఱింగి పెల్లు దల - పోసి చనుండు మెలంకువం దగన్. ౯౪౪

ఉ॥ ఇందఱుఁ జేరి పోదమని - యెంచుట గూడని కార్యమౌను మీ
యందు సమర్థుఁడై మెలపు - నందిన యొక్కరుఁ డేగి డాఁగి యం
దందు చరించి రాముసతి - నారసి తెల్పుఁడు తన్నిదేశ మ
ట్లొందిక గానిచో మరలి - యోపికఁ దెల్పుఁడు నా వచస్సులన్. ౯౪౫

మ॥ పరిపాలించెడు వారు లేమిని ప్రభు - భ్రంశంబుచేఁ బాడి వీ
సరపోవం జెడు గృధ్ర సంఘములు ర - క్షోనూత్నాగ్ని కేఁ బోవుకే
యురవౌ మీరలు రెంట నొక్కటి తగన్ - యోచించి చేయుండు సు
స్థిరకీర్తిన్ వహియింపుఁ డంచుఁ జనియెన్ - దీవించి సంపాతి తాన్. ౯౪౬

## ౧౪. మహేంద్ర శైల పటలము (౨౯)

ఉ॥ తప్పులు పల్కునే యతఁడు ♦ తద్జ్ఞుఁడు గ్రద్దలఱేఁడు తెల్పు నా
చొప్పునఁ బోవ జానకిని ♦ చూఁడగవచ్చును రెంట నొక్కటిన్
దప్పక చేయఁగా వలయు ♦ దాఁటుటయా జలరాశి? రాముతో
నిప్పని దెల్పుటా? యుచిత ♦ మెయ్యది యేర్పడ సిశ్చయింపుఁడీ. ౯౪౭

మ॥ త్రిజగన్మోహనుఁడైన రాఘవుని సు ♦ గ్రీవున్ వెసంజేరి భూ
మిజ వృత్తాంత మెఱింగినంత తెలుపన్ ♦ మేలొందుఁ గర్తవ్య మ
క్కజమౌ శేవఁ బయోధి దాఁటి యచటన్ ♦ క్ష్మాపుత్రి నీక్షించి నీ
రజ పత్త్రేక్షణ తెల్పు వాక్యముల నా ♦ రం దెల్పు టుత్కృష్టమౌ. ౯౪౮

సీ॥ గడువు కడవఁజావఁ ♦ గడఁగినారము సిగ్గు, చెడఁ గ్రమ్మఱిల సాహ ♦ సించి నార
మివి రెండు తొలఁగు వ♦డువు విన్నవారము, సంపాతివలన ని♦శ్శంకముగను
కడలిని దాఁటి లం♦కకునేగి జానకిఁ, బొడగాంచి రాఁగల ♦ పుణ్యుఁ డెవఁడు?
మా ప్రాణ మాన సం♦రక్షణ భారంబు, నతనిపై నుంచితి ♦ మనిరి కొంద

తే॥ ఱ నమశూరులు నీలాదు ♦ లంబురాశి, దాఁటు శక్తి లేదనిరి ♦ సంద్రంబు దాఁటఁ
గలను వెదకుదు మరలి రాఁ♦గలనొ లేనొ?, యనుచు శంకింతు ననియెఁ దా♦రాత్మజుండు

చ॥ నలువ కుమారుఁ డిట్టులను - నాయనలార! త్రివిక్రముండు భూ
స్థలి నొక కాలితోఁ గొలువఁ - దక్కొనుచో జయభేరి వేసి ది
క్కులను ప్రదక్షిణించు తఱిఁ - గ్రుచ్చుకొనెం గనకాద్రి కొమ్ము నా
బలము చెడెన్ బదం బిలుకు - పట్టెను నొచ్చుచునుండు నిప్పుడున్ ౯౫౦

ఉ॥ కావున నబ్ధి జంగఁగొని - కావలికోటను దాఁటి లంకలోఁ
జేవను జొచ్చి రాక్షసులు - చేడ్పడు చేఁతలు చేసి జానకీ

దేవిని గాంచి వచ్చుట కు - దీర్ఘ బలంబు జవంబు లేదు నే.
నేనిధిఁ బోవనేర్తు నని - యిమ్ముగ సంగదుఁ గాంచి యిట్లనుఁ. ౯౫౧

ఉ॥ రాజవు నీవు కానఁ జన - రాదిఁక నెవ్వరి వేఁడువారమీ
యోజఁ దలంచుచుండుటయు - నొప్పదు తొల్త దినేశసూతికిఁ
రాజిత కీర్తిశాలి యగు - రాముని చెల్మి ఘటించి యున్న యు
త్తేజిత మూర్తి యుండఁ దెక - తేరకుఁ జింత వహింపనేటికిఁ? ౯౫౨

ఉ॥ నెయ్యము గూర్చినాఁడు రఘు - నేతృ పదంబులఁ గొల్చినాఁడు తాఁ
దియ్యము మీఱ సంగరముఁ - దెచ్చినవాఁడు యశంబు గూర్చు వాఁ
డెయ్యెడనేని హెచ్చరిక - నేడ్తెఱఁ గార్యమొనర్చువాఁడు జో
డియ్యల లేనివాఁడు కలఁ - డెయ్యెడ మారుతి చింతయేటికిఁ? ౯౫౩

సీ॥ పవననందన! నీవు- పరమేష్ఠిఁ బొందని, చిర జీవితమ్మును - చెందియుంటి
సకల శాస్త్రంబులు - శ్రద్ధమైఁ బఠియించి, యంచితార్థమ్ము గ్ర - హించియుంటి
వివరింప వలసిన - విషయమ్ము లనువొందఁ, దెలుపు వక్తృత్వాన - దేఱియుంటి
కర్తవ్యములఁ బూర్తి - గావించు సుస్థిర, సంకల్పుఁ డంచుఁ బ్ర - శస్తిగంటి

తే॥ జముఁడు శంకించునంతటి - శక్తిగంటి, బుద్ధి నపర విధాత యన్ - పోలుపుగంటి
రణమునందు రుద్రుఁడె యను - గణుతిగంటి, మేమెఱుంగమె నిన్ను స-మీరతనయ!

చ॥ అనిలమునందుగాని మఱి - యంబువులందునఁగాని యుగ్రమా
ననలమునందుగాని మృతి - నందవు దివ్యశరాళు లేవియున్
జెనకి వధింపఁజాలవు వి - శిష్ట గుణుండవు నీకు నీవ కా
కెన మఱి లేరు దాఁట రహిఁ - యించిన నందము దాఁటఁజాలెదున్. ౯౫౫

చ॥ సులువుగ మంచి చెడ్డలను - శోధన చేసి వచింపనేర్తు వి
య్యల సనహాయ శూరుఁడవు - నేడ్తెఱ శత్రుల గెల్వనేర్తు వ
గ్గలికను లంకకేగి మఱి - క్రమ్మఱనేర్తు దురంబునందు దో
ర్బలము నశింపకుండెడు స్వ - భావము గల్గినవాఁడ వయ్యరే!. ౯౫౬

ఉ॥ మేరువుకంటె దొడ్డదగు - మేను ధరింతువు కార్య మేర్పడన్
వారిధరంబునుండి పడు - వర్ష కణంబులలోనఁ బిన్న యా
కారము నూని తూఱుదువు - గ్రక్కున లీలగ నెత్తనేర్తు నీ
ధారుణి సర్వముం గదిసి - తాఁకఁగ నోపుదు చిన్ని చేతులన్. ౯౫౭

మ॥ మఱియుం బెక్కు- వరంబులందియును సం - భావింతు శీలంబ యే
డెఱ బాగోగు లెఱింగి యేర్పఱుతు పృ - థ్వీపాల ధర్మంబులన్

హరిచే నేర్చి దినేంద్రవంశజునిచే - నవ్వాలిఁ జంపింపవే
పురుహూతాశని బాల్య రోమమొకఁడేఁ - బోఁగొట్ట మున్నోపెనే? ౯౫౮

మ॥ రణరంగమ్మునఁ దాఁకునేనియు జగ - ద్ర్వాతమ్ము లొక్కుమ్మడిన్
దృణకల్పమ్ముగఁ జూచువాఁడ వొరులూ - హింపంగరానట్టి భీ
షణ నిస్తుల్య బలుండ వర్కుని రథ - స్ఫారోగ్ర వేగంబుతోఁ
గణఁకం బోవుచు నేర్చినాఁడవుకదా - గాంక్షించి సద్విద్యలన్ ౯౫౯.

ఉ॥ నీతిపథంబునన్ దిటగ - నిల్చినవాఁడవు సత్యశీలివిన్
నాతిసుఖంబు చిత్తమున - నాటని ధీర జితేంద్రియుండవున్
ఖ్యాతిగ వేదముల్ చదివి - యందలి మర్మ మెఱింగినాఁడవున్
ధాతవు కాఁగలాఁడవని - ధారణిఁ బేరు వహించినాఁడవున్. ౯౬౦

శా॥ సీతాన్వేషణ కీవ యర్హుఁడని రా ♦ జీవాక్షు సుగ్రీవులే
ప్రీతిం బ్రేరణసేయ మేలనుచు నూ - రీకారముం దెల్పుటల్
చేతంబందున నుంచినాఁడ వది నీ - చేఁ దీరు నిక్కంబు నీ
చేతల్ ధాత్రిని సుస్థిరంబు లయి భా - సిల్లున్ మరున్నందనా! ౯౬౧

ఉ॥ కాలముకానిచో సణఁగి ♦ కాలము వృచ్చఁగ నేర్తువయ్య! సే
రాలము కూరెనేని కడు - నాగ్రహ మందిన సింగముంబలెన్
వాలుదు వెల్ల కార్యములఁ - బట్టి సమగ్రముగా నొనర్తు వి
ఘ్నాలి నెదిర్చి త్రోచుచు మ - హా ఫలసిద్ధిని గాంచు టబ్రమే? ౯౬౨

మ॥ అమరేంద్రాదులకైన నాదరణమై - యాదర్శమై యొప్పు శీ
లముచే సుక్షమచేతఁ గామిత విధుల్ - సాధించు ధీశక్తిచే
విమలాత్మీయక! నీకుఁ గానిపనులీ - పృథ్వీస్థలిం గల్గునే?
యమరం దెల్పఁగఁదగ్గ దొండుగలదే - యర్థంబు? వాతాత్మజా! ౯౬౩

శా॥ నీవే వారిధి దాఁటి మైథిలిని స - న్నీతిం బరీక్షించి దే
వీ వృత్తాంతము దెల్పఁగాఁగల మహా - వీరుండవై యుంటి మా
జీవంబుల్ భవదీయ హస్తగతమై - చెల్వారు మాకింక నే
త్రోవం జూపెదొ యంచు విశ్వసృజు పు - త్త్రుం డర్థి వాక్రువ్వఁగన్. ౯౬౪

తే॥ అవనత ముఖాబ్జమం దొక్క - యంబుజంబు, మొలచు పోలికనవ్వి కే - ల్మోగిచి హనుమ
వానరావలి యుల్లముల్ - పల్లవింప, దెలిపె నీరీతిఁ దనమది - తేటపడఁగ. ౯౬౫

మ॥ త్రుటిలో సప్త సముద్రముల్ కడచి యు - ద్యోగించి లోకంబులన్
జటుల స్ఫీతినడంచి గెల్చు చతురుల్ - చర్చింప మీరిట్లు వి

స్ఫుట భావంబున నాజ్ఞ యిచ్చుటలు మ - త్పూర్వార్జితంబైన యద్భు
పటు భాగ్యంబుగ నెంచెదన్ దృఢమతిన్ - భావింప నల్పజ్ఞుఁడన్. ౯౬౬

శా॥ లంకాపట్టణ మద్దుతోఁ బెకిలి తీ - లందెత్తునా? దైత్యులన్
బింకంబుల్ చెడఁగూల్చి రాఘవుని దే - విం దెత్తునా? వాలుతో
లంకాధీశుని గట్టి యీడ్చికొని పో - లన్ వత్తునా? యేది మీ
పొంకంబైన మనోరథంబు వడిఁ దె - ల్పుం డిప్డె కావించెదన్. ౯౬౭

శా॥ వెన్నుం డేపున నొక్క పాదమునఁ బృ - థ్విం గొల్చు చందంబునన్
గ్రన్నం గొల్చెద నీసముద్రమును ర - క్షశ్శ్రేణికిం దోడుగా
నెన్నన్ వేల్పులు వచ్చినన్ సలఁచి మీ - యిష్టంబు గావింతు ని
ష్ఖిన్నత్వంబున నుండుఁడీ సమద సం - శ్లిష్టాత్ములై వానరుల్! ౯౬౮

శా॥ భూభాగంబును ముంచఁగాఁ దొడరి యం - భోధుల్ విజృంభించినన్
భూభాగంబె పటాలునం బగిలి పై - వ్యోమంబుతోఁ గూడినన్
శ్రీ భూ నాయకు నాజ్ఞ పక్షములుగాఁ - జెన్నార సేవాబల
శ్రీ భాసిల్లఁ దరింతుఁ దార్క్ష్యనిక్రియన్ - గ్రీడావిధిన్ వారిధిన్. ౯౬౯

మ॥ త్వరగా నుత్తరు విందు క్రమ్మఱిలు నం - దాఁకన్ సుఖంబుండుఁడీ
ధరణీపుత్త్రికఁ గాంచి వచ్చెదను వ్య - ర్థప్రక్రియన్ రానటం
చుఱిదిన్ మారుతి యెక్కెఁ దచ్ఛిఖర ము - ద్యోగంబునన్ లేచి వా
నరు లాశీస్సులు సేయ వేల్పులు ప్రసూ - న వ్రాతముల్ సల్లఁగన్. ౯౭౦

మ॥ జలధిం దాఁటఁ గుతూహలుం డయిన యా - సామీరి దైవాఱ స్వ
స్థలముం గొల్వఁగ నెత్తినట్టి హరి పా - దంబట్లు తద్గాత్రమున్
గలయం బెంచెను శ్రీపదుండను సమా - ఖ్యా స్ఫూర్తి సార్థంబుగా
నల శ్రీపాదమె సాటియౌ ననుచు బ్ర - హ్మాదుల్ ప్రశంసింపఁగన్

మ॥ రణ తేజోధిక విక్రమంబు దిశలం ♦ భ్రాజిల్లుచున్న ట్లవా
రణ తేజోధిక విక్రమంబు దిశలన్ ♦ రాజిల్ల నాకాశ చా
రణ తేజోధికుఁ డస్తమించు మునుపే ♦ రక్షోగణాధీశ రా
వణ తేజోధిక పట్టణంబు వడిఁ బో ♦ వంగన్ సముద్యుక్తుఁడై. ౯౭౧

శా॥ పంచాస్యంబు లనేకపంబులును కం ♦ పం బొందఁ బంచాస్యు నం
శాంచత్పుణ్యుని భారమోర్వక గిరిం ♦ ద్రాగ్గంబు క్రుంగార ని
ష్కంచద్వాలము మేనఁ జుట్టికొని య ♦ చ్చో నాది కూర్మంబుపై
సంచై నిల్చిన మందరంబుకరణిన్ ♦ సామీరి విభ్రాజిలెన్. ౧౨౩

శా॥ శంపా యుక్త పయోదముల్ చరణ శిం ♦ జా నాదముల్ సేయ వ
ర్ణింపన్ లేక నిలింపు లాతనువు ని ♦ ర్ణిద్రాత్ములై కాంచ గో
ళంపుం గంబము క్రింది తాయి యన శై ♦ లం బొప్పఁగా నందుపైఁ
జాంపేయాద్రి విధమ్మున న్నిలిచె నా ♦ సామీరి గంభీరుఁడై. ౧౨౪

కిష్కింధా కాండము సంపూర్ణము.

శ్రీ రామచంద్రార్పణ మస్తు.



శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, చిత్తూరు. 14-7-50. కా. 1000.